# మహాకవి ధూర్జటి

## కవిత్వము : వ్యక్తిత్వము

పరిశోధన నిబంధము

(ఆంధ్ర విశ్వవిద్యాలయమునుండి పి.హెచ్.డి. అందినది.)

డాక్టర్ పొన్నెకంటి హనుమంతరావు
(విశ్రాంత ప్రాచార్యుడు)

సర్వస్వామ్య సంకలితము

ప్రథమ ముద్రణ : ప్రమోదూత - 1990

వేయి ప్రతులు

వెల : రు. 100/-

ప్రతులకు :
పొన్నెకంటి లక్ష్మి
శారదా మందిరము
9-7-2, రైలుపేట,
గుంటూరు - 522 001 (A.P)
*Phone : 25752*

ముద్రణ :

సాయిరాం ప్రింటర్స్, 2/10 బ్రాడీపేట, గుంటూరు-2
విజేత ప్రింటర్స్, 3/1 బ్రాడీపేట, గుంటూరు-2



ఈ సిద్ధాంత గ్రంథము
శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి
'ధార్మిక గ్రంథ ప్రచురణమున కిచ్చు ఆర్థిక సాహాయ్యమున'
ముద్రితమైనది.

ఈ గ్రంథ ముద్రణమునకు
ఆర్థిక సాహాయ్యమందించి ప్రోత్సహించినవారు
తెలుగు విశ్వ విద్యాలయము, ఆంధ్రప్రదేశ్.

ఈ గ్రంథ ముద్రణకు
తమ ఆర్థిక సాహాయ్యమందించి ప్రోత్సహించిన వారు
"స్వధర్మ స్వారాజ్య సంఘము" (సారథులు-సహృదయ
సార్వభౌములు శ్రీ బి.వి.యస్.యస్. మణిగారు) మద్రాసు.





ఫణారాజన్మహాలింగమూర్తి

వాయులింగ

శ్రీకాళహస్తీశ్వర స్వామి

'మహాకవి ధూర్జటి : కవిత్వము - వ్యక్తిత్వము'

పర్యవేక్షకులు

పరిశోధకుడు



ఆచార్య యస్వీ. జోగారావు

డా॥ పొన్నెకంటి హనుమంతరావు

# అనుక్రమణిక

**Prof. S V JOGA RAO**
M.A., Ph.D., Hon.D.Litt. (A.U. and U.S.A.)
National Professor of Telugu
U.G.C. Emeritus Fellow
**ANDHRA UNIVERSITY**

Visakhapatnam-17
06.03.1990

# ఆశీస్సు

ధూర్జటి పరమభావుక పట్టభద్రుడైన మహాకవి. మాధురీ మహితమై సద్యో హృద్యము సహృదయ నైవేద్యము అయిన కవిత చెప్పినవాడు. పరమేశ్వరునకు తన గుండెలో గుడి కట్టి ఆ ధూర్జటిని తనదైన అనుభూతితో తట్టిలేపినవాడు. ఆయన సన్నిధానమున తన మనస్సును చాపవలె పరిచి తన లోటుపాట్లను గూడ నిశ్శంకంగా నిర్భీకముగా నివేదించుకొన్నవాడు. "రవి గాననిచో కవి గాంచునే కదా" అని అనగలిగినవాడు. అతడెంతవాడు కాకపోతే— "కృష్ణరాజు కిరీట కీలిత మణి గణార్చిత పదాబ్జద్వయశ్రీ వహించె" ననిపించుకొనగలిగినాడు ? ఆ కృష్ణరాయలు పరమ వైష్ణవుడు. ఇతడో పరమమాహేశ్వరుడు. మూర్ధాభిషిక్తుడైన ప్రభువు రాజగురువునకు తప్ప ఇంకెవ్వరికీ తలవంచడు, పాదాభివందనము చేయడు. ఆ చేయునప్పుడు గూడ మకుటము లేని మూర్ధముతోనే. అట్టిది సమకుటముగా ధూర్జటికి పాదాభివందనము చేశాడంటే అది రాయల కవితా రసికతా ప్రతిష్ఠకెత్తిన పతాక. అగుటయే కాక ధూర్జటి మహత్వమున కొక గొప్ప స్వర్ణశాణశలాక.

"ఆమని నామ్రపల్లవ రసాంధస కోకిల కామినీ రసో
ద్దామ రతిప్రకృష్ట మణితధ్వనులో ; రవి యంధుడౌ రహ
స్సీమలలో ప్రవాసములు సేయు రసజ్ఞతలో ! అనర్ఘకాం
తా మధురాధరామృత కణమ్ములొ ! ధూర్జటి పద్యబంధముల్ !"

అవి ఏనాడో (1950లో) ఆ మహాకవి గురించి సంభావన చేసి వున్నాను.

ఇంత చెప్పవచ్చిన దెందుకంటే నేను విశ్వవిద్యాలయంలో పరిశోధన పర్యవేక్షక పదవి చేపట్టిన తరువాత ఆ మహాకవి కవిత్వము—వ్యక్తిత్వము గురించి ఒక భావుక పట్టభద్రుని డాక్టరు పట్టభద్రుని చేయాలనే తీవ్ర సంకల్పంతో వుండేవాడిని. తగిన వ్యక్తి కోసం గాలిస్తూ వున్నాను. తటస్థ పడ్డాడు మా హనుమంతరావు కవితారసికతకు తావు.

వాల్మీకికి రాముడు దొరికినట్లు హనుమంతరావుకి ధూర్జటి దొరికి పోయాడు. ధూర్జటి కవిత్వం గురించి వ్యక్తిత్వం గురించి పరిశీలన, క్షేత్ర కృషిసహకృతమైన పరిశోధన పకడ్బందుగా అంటే సుష్టు ప్రణాళికంగా, సమగ్ర సుందరంగా రౌచిక రచనాభిశోభితంగా సాగింది.

ఈ డాక్టరు పట్ట పరిశోధన నిబంధమే కాక హనుమంతురావుకి పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన గ్రంథాలింకా చాలా వున్నాయి. పొన్నెకంటి నోట్సు, సాత్రాటిరీయం అనే నాటకము, కుందమాల అనువాదం, ఆంధ్రవాఙ్మయను: చమత్కార వైభవము మొ॥. అందులోనూ చివరి గ్రంథం పరిశోధన పటుపైనది, ఆంధ్రసరస్వతికి అపూర్వాలంకార మైనది, డి.లిట్. డిగ్రీ పురస్కార సమర్హమైనది "కవిత్వం బన్నచో నా జిహ్వకు నైసర్గిక గుణంబు'అని ధూర్జటి అన్నట్లు చమత్కార మన్నది హనుమంతరావు జిహ్వకు నైసర్గిక గుణం. అందుకే ఆ గ్రంథ మంత అందగించింది.

ఇక హనుమంతరావు వ్యక్తిత్వం గురించి రెండు మాటలు. అతనిని తలచు కొన్నప్పుడల్లా నాకు కన్యాశుల్కంలోని సౌజన్యారావు పంతులుగారు గుర్తుకొస్తారు. దొడ్డవ్యక్తి. మంచి వక్త. కమ్మని కంఠం స్ఫురద్రూపం. పలు సభలలో సమర్థంగా పాల్గొని చక్కని సరస్వతీ పరివస్య చేశాడు

నా ప్రియ శిష్యుడు ప్రాచార్య డాక్టర్ శ్రీ హనుమంతరావుకు నా మనఃపూర్వక మంగళాశాసనములు.

(సం) యస్వీ. జోగారావు

— ० —

Dr P.S.R. APPA RAO M.A., Ph.D.,
(A P E S Retd)
Profresor in Performing Arts
UNIVERSITY OF HYDERABAD

'Golden Threshold'
Hyderabad
06. 05. 1990

# ఆవిష్కరణము

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారి కోరికను పురస్కరించుకొని, మహాకవి ధూర్జటి రచించిన 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యం' ముద్రణకు 1967లో సంపాదకత్వం వహించి, 56 పుటల 'పీఠిక'ను సంతరించాను. ఇది 1963 జూలై నెలలో ముద్రితమైనది. అప్పుడు శ్రీ కాళహస్తి మాహాత్మ్యమును, శ్రీ కాళహస్తీశ్వర శతకమును సావధానంగా పరిశీలించే అవకాశం లభించింది. తరువాత, యువభారతి వారి కోసం రచించిన 'ధూర్జటి కవితా వైభవం' అనే చిరు రచనలో ధూర్జటి కవితా మాధుర్యాన్ని సహృదయులకు పంచిపెట్టడానికి ప్రయత్నించాను. ఇది 1976 జనవరిలో ముద్రింపబడింది. ఈ విధంగా ధూర్జటి రచనలతో నాకు ఆత్మీయత ఏర్పడింది.

ఇంక డా॥ పొన్నెకంటి హనుమంతరావు నాకు శిష్య సోదరుడు. నాకు అత్యంత ప్రీతిపాత్రుడైన ధూర్జటి మహాకవి గూర్చి పరిశోధన చేసి, సిద్ధాంత వ్యాసం వ్రాసి పిహెచ్.డి. పట్టం సంపాదించటం నాకు ఎంతో ఆనందం కలిగించింది. డిగ్రీ వచ్చి చాలా కాలమైనది (1974). ముద్రణ మాత్రం చాలా ఆలస్యమైనది(1990). ముద్రింపబడిన తన సిద్ధాంత వ్యాసానికి 'పరిచయం' వ్రాయుమని డా. హనుమంతరావు కోరినప్పుడు వెంటనే అంగీకరించాను సంతోషంగా.

సిద్ధాంత వ్యాస ప్రమేయం "మహాకవి ధూర్జటి కవిత్వం, వ్యక్తిత్వం". అందుచేత రచనలో మూడింట రెండు వంతులు కవిత్వ వివేచనకు స్థానం లభించింది. ఇంక 'జీవితం, వ్యక్తిత్వం' అనే విషయాలు మూడో వంతు ఆక్రమించాయి.

మహాకవి ధూర్జటి జీవితానికి, వ్యక్తిత్వానికి సంబంధించిన అంశాలు కొన్ని వివాదాస్పదంగా ఉన్నాయి. ఈ అంశాలను నిర్ధరించటంలో డా. హనుమంతరావు అభిప్రాయాలు చాలా వరకు నా అభిప్రాయాలతో సంవదించటం నాకు ఆనందదాయకమైనది. ఆ అంశాలు క్రింది విధంగా ఉన్నవి.

1. 'ధూర్జటి' అనేది ఇంటిపేరా ? కవి పేరా ? నివాస స్థలమేది ? గురువు ఎవరు?

2. ధూర్జటి శ్రీ కృష్ణదేవరాయల ఆస్థాన కవి అవునా ? కాదా ?

3. ధూర్జటి తొలి రచన మాహాత్మ్యమా ? శతకమా ?

4. అసాంతం శృంగారాభాస వర్ణనలతో కూడిన మాహాత్మ్యం ఉత్తమప్రబంధమా?

5. చాటువులో పేర్కొన్నట్లుగా ధూర్జటి వారవనితా సాంగత్యసారీణుడా ?

6 ధూర్జటి వ్యక్తిత్వమెటువంటిది ?

7. ఆంధ్ర కవి ప్రపంచములో ధూర్జటి స్థానం ఏమిటి ?

పై అంశాలను డా. హనుమంతరావు నిర్ధరించిన విధానం పరిశీలింతాము :

1. i) శ్రీ కాళహస్తిపురమును వర్ణించిన విధానం 'ధూర్జటి కవీంద్రుని నెలవు శ్రీ కాళహస్తిపురమే' అని స్పష్టం చేస్తున్నది.

ii) 'ధూర్జటి' అనేది వ్యవహారనామం ; అదే తరువాత వారికి 'ఇంటిపేరు' అయినది.

iii) 'ధూర్జటి' అసలుపేరు తెలియదు.

iv) ధూర్జటి గురు ప్రశంస చేసి, ఆయన పేరు చెప్పలేదు. కానీ, శ్రీ కాళహస్తీశ్వరుడే ధూర్జటి గురువు.

2. ధూర్జటి తనను 'శ్రీకాళహస్తీశునాస్థానకవి'గా పేర్కొన్నప్పటికీ (శతకం-ప.4) "మీ పెదతాత చాల సన్నుతి(గనెఁ గృష్ణరాయల మనోజ్ఞ సభన్" అని కుమార ధూర్జటి గ్రంథస్థం చేసిన దానిని బట్టి, "కృష్ణరాయ కిరీట కీలితఘణి గణార్చిత పదాబ్జద్వయ శ్రీవహించి" అని కుమార ధూర్జటి తనయుడగు ధూర్జటి లింగ రాజు కవి చెప్పిన దానిని బట్టి, "పాదవినమ్ర కృష్ణవరరాడ్గంభీరకోటీరవిస్ఫుట తత్ప్ర ద్యుతి పాటలీకృత పదాంభోజాతు" అని లింగరాజు కవి కుమారుడగు

ధూర్జటి వేంకటరాయకవి పేర్కొన్న దానిని బట్టి, ధూర్జటి కృష్ణరాయల ఆస్థానంలో, అష్టదిగ్గజాలలో ఒకడుగా ఉన్నాడని స్పష్టమవుతున్నది. ఈ సత్యాన్ని నిర్ధరిస్తూ, అనుషంగికంగా రామకృష్ణుడు కూడా రాయలవారి ఆస్థానంలోని వాడే అని నిర్ణయించినారు డా॥ హనుమంతరావు; అంతేకాదు ధూర్జటి వంశవృక్షాన్ని కూడా స్వీకరించారు.

3. మాహాత్మ్యమే తొలిరచన, ఆరచన తరువాత, చాలాకాలానికి, బహుశః శ్రీకృష్ణదేవరాయల మరణానంతరము, జీవితంమీది విరక్తితో చేసినరచన అయి ఉంటుంది శతకం.

4. మాహాత్మ్యమందలి ప్రధాన (=అంగి) రసం 'శాంతం' అనీ, తక్కినవి అంగరసములుగా' యథావకాశముగా అంగిరసమునకు పుష్టినొసగునట్లు పోషింపబడినవని డా. హనుమంతరావు నిరూపించినారు. అయితే "శాంతమునకు సమముగా పోటీపడినట్లు శృంగార మీ కావ్యమందు సింగారించినది. కావ్యమున ముగిసిన తావుల నీశృంగారము రసస్థితినందలేదు. దాసి—మిండజంగములయు, వాణీ హిరణ్యగర్భుల ప్రణయ ఘట్టములను, శబరకాంతా కాంతుల వృత్తమును మాత్రము శృంగారము రస స్వరూపమునందినవి" (పుట 234) అని డా. హనుమంతరావు పేర్కొన్నారు. ఈ అభిప్రాయంతో నేను ఏకీభవించలేను; ఈ ఘట్టములు శృంగారాభాస ఘట్టములు మాత్రమే—శాస్త్రం దృష్టిలో, లోకం దృష్టిలో కూడా.

5. "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో యతులిత మాధురీ మహిమ.........."

అని రాయలవారు సభలో ప్రశ్నించినారట. అంతట తెనాలి రామలింగము (తరువాత రామకృష్ణుడు) లేచి,............హా! తెలిసెన్ భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా జనతా, ఘనతాపహారి సంతత మధురాధరోదిత సుధారస ధారలు గ్రోలుటం జుమీ!" అని సమస్యను పూరించినాడట. ఇది చాటూక్తి. ఈ చాటూక్తిని ఒక్కొటి పురాణమని త్రోసిపుచ్చుటకు వీలులేకుండా, ఇందులోని సమస్యా భాగాన్ని కుమార ధూర్జటి గ్రంథస్థంచేసినాడు. సమస్యా పూరణమును విశ్వసింపవలసి వస్తే, వారవనితాధర సుధారస ధారలు గ్రోలిన మహానుభావులందరూ మహాకవులే అయిఉండాలి. ఇది విశ్వసనీయం కాజాలదు. కొంతె

తనానికి పేరొందిన రామలింగము చమత్కారంగా అసనుస్యను అట్లు పూరించి ఉంటాడు. రాయలవారు, ధూర్జటికూడా దానిని అట్లాగే గ్రహించి నవ్వుకొని ఉంటారు. అట్లాగే కథావశానచెప్పిన అనేక విషయములనుకూడా కవికి అంట గట్టి కవిశీలాదులను శంకించటం న్యాయం కాజాలదు.

6. శ్రీవిద్యోపాసకుడు, దక్షిణామూర్త్యారాధకుడు అయిన ధూర్జటి 'శివాద్వైతి'అని డా. హనుమంతరావు సోదాహరణముగా నిరూపించినారు.

7. ప్రబంధ స్వరూపము, కథాసంవిధానము, రసపోషణము, పాత్రనిర్మాణము, వర్ణనా వైయాత్యము, ఔచిత్యము, కవిత్వము–భాష–శైలి, ఛందస్సు-అలంకారములు మున్నగు అంశములను గూర్చి విపులమగు చర్చచేసి, ఆంధ్ర కవి ప్రపంచములో ధూర్జటికి, ఆంధ్ర సాహిత్యంలో మాహాత్మ్య–శతకములకు ఉన్నత స్థానములు నవసిసోదాహరణంగా నిరూపించినారు డా. హనుమంతరావు. "సాహిత్యములో, గావ్యముల వలనఁగొందరు కవులు కవుల మూలముననఁగొన్ని కావ్యములు ప్రఖ్యాతి వహించుట గలదు........ కావ్య ప్రయోజనములందు తలమానికమగు 'సద్యఃపర నిర్వృతి'ని కలిగించిన పోతరాజు, త్యాగరాజులవలె హృదయవాదియయిన ధూర్జటికి పైనఁ జెప్పినరెండు విధములయిన స్థితికలుగు చున్నది. కృతివలన ప్రబంధమునకు, శతకము వలన వ్యక్తికి స్థితి గలిగిన భాగ్యశాలి మన ధూర్జటి మహాకవి" అని డా. హనుమంతరావు తీర్పు.

ధూర్జటి తన శుభ కావ్య రత్నమున కీశునధీశునిజేయగా మహాదేశిక సార్వభౌముడు మదింబ్రమదంబు వహించి "ధూర్జటీ! నీశివభక్తి, కావ్య సరళిం గడుధన్యత దొంద నవ్య భాషా శతథానిగుంభనరసస్థితి నొప్పుదలిర్పఁజెప్పుమీ"అని అనుగ్రహము చేసినాడు (ప్ర.ఆ. 86.). ఇందలి 'శతథానిగుంభన రసస్థితి' అనే దాని అర్థమును నిర్ధరింపవలసి ఉన్నది.

కావ్యమున కాత్మ 'రస'మని ప్రాచీనాలంకారికుల నిర్ణయం. అట్టి రసము ప్రతీయ మానమగు నప్పుడే అదిలోకోత్తరాహ్లాద జనక సమర్థమవుతుంది. కావుననే 'రసధ్వని' కావ్యాత్మయని అర్వాచీనాలంకారికులు నిర్ధరించివారు. ఈ 'రసధ్వని'నే 'నిగుంభనరసస్థితి' అన్నాడు ధూర్జటి. ఇంక ధ్వనిభేదాలు వందల కొలది (శతథా) ఉన్నాయి. కాగా రసము శతథా ప్రతీయమాన మవుతుంది. అట్టి రసధ్వనిని నవ్యభాషలో వెలయింపుమని గురుని ఆదేశం.

ధూర్జటి కావ్యారంభములో శ్రీకాళహస్తిపుర వర్ణనము చేసినాడు. పుర వర్ణన చేసిన పది పద్యాలలోను ధూర్జటి గతానుగతికంగా—పురస్వరూపం, అందలి సౌధములు, ప్రాకారములు, ఎలదోటలు, అగడ్త, చతుర్వర్ణములు, కామినీజనులు, చతురంగ బలము మున్నవానినినే వర్ణించినప్పటికీ, అన్నింటను శివభక్తిని, శివసారమ్యమును, ఐహిక వాంఛా విరక్తిని, యోగసాధనమ శాంతత్వమును, శివైక్యమును ధ్వనింప చేసినాడు. అంతేకాదు కావ్యమందంతటా తటాకము, సముద్రుడు, చంద్రుడు— ఒకటి అననేల సర్వమును శివమయంచేసి వర్ణించినాడు. ఇదిమే ధూర్జటి చెప్పుకొన్న 'నవ్యభాషా' రచన.

ఈ నా వివరణమునకు సహృదయులే ప్రమాణం!

ఇంతకూ 'మాధురీ మహిమ'ను తన కవితాగుణంగా ధూర్జటియే పేర్కొన్నాడు. ధూరటి తన కవిత్వాన్ని దివ్యార్చనగా కూర్చి, అందులోని 'మాధురీ మహిమ' ను శ్రీకాళహస్తిపతికి నైవేద్యం పెట్టుచున్నట్లు చెప్పుకొన్నాడు. నిజంగా, కవిత్వంలోని 'మాధురీ మహిమ' వల్లనే ధూర్జటి రాయలవారికి 'స్తుతమతి' అయినాడు.

"కవితాభిమానముతో పరమేశ్వరుని కూడ లెక్కచేయనివాడు నత్కీరుడు; అట్టి వానిని, చివరకు పరమేశ్వరుడే 'సాహిత్య శ్రీవర' అనే అపూర్వమగు ఎరుమతో సన్మానించినాడు (శ్రీ.ఆ.ప.218). ఇంక తన సర్వస్వమును పరమేశ్వరార్పణము కావించిన ధూరటిని సహృదయు లందరు 'ఆ సాహిత్య శ్రీవర' బిరుదముతోనే సన్మానించటం సమంజసం.

డా. హనుమంతరావు పేర్కొన్నట్లుగా "సాహిత్య స్ఫురన్మాధురీ వారుప్రాపేమమై కవితచెప్పి, తనదు జిహ్వకు నైసర్గికమగు కవితఁబల్కి, 'నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచుమీఁదు'కట్టి, తన కవితా మధురిమను పరమేశ్వరునికే నైవేద్యముగా సమర్పించి, తన శివభక్తికి కావ్యత్వ మొసంగి, ధన్యుడైన 'సాహిత్య శ్రీవరుఁడు', ఆంధ్రావళికి మోదము గలిగించి, తెలుఁగు సాహిత్యమున నొక ధ్రువతారయై వెలుఁగొందిన నాఁడు మన మహాకవి ధూర్జటి".

ఒక చక్కని సిద్ధాంత వ్యాసమును వెలయించిన డా. హనుమంతరావును, పర్యవేక్షకులైన సహృదయ మిత్రులు ఆచార్య యస్వీ. జోగారావుగారిని అభినందిస్తున్నాము.

(సం) పి. ఎస్. ఆర్. అప్పారావు

## Excerpts from the Adjuctors' Reports

"I Congratulate Sri P. Hanumantha Rao and his guide for attempting for the first time, a critical and comprehensive study of Dhoorjati and his works ..

The Candidate has evolved a fine scheme in the study the author. Chapters 2 and 3 are devoted to the reconstruction of the biography of the author and chronology of his works respectively. The evaluation of various sources on the life of Dhurjati and his geneology has been done very objectively and leaves no room for any criticism In chapter 3 he has convincingly and conclusively proved that the Sataka is a later work. In Chapter 4 he has given a general estimate of the unique features of Dhurjati's Poetry which are well exemplified under different heads with suitable illustrations. The personality of the poet is delineated in chapter 5 which is primarily based on the internal evidence from the poetical works.

That the candidate has taken care and effort in his study be well seen in what he had appended to the thesis. I should say that by and large, the candidate has not left anything inadiquate .... It is my considered opinion that the has done extremely well and his thesis contain many original points which form a good contribution to the study of Telugu classical literature in general and Dhoorjati in particular ...."

Prof. G.N. Reddy
(Sri Venkateswara University)

" . His investgation into the subject of his choice did yield good results and he was mostly successful in resolving many a problem which were not solved hitherto. Apart from resolving the problems he may be credited for having thrown

new light in the appreciation of Dhurjati's poetry_Dhurjati's geneelogy is resloved and substantiated with sound arguments. It is proved beyond doubt that — Dhurjati was Sivadwaitin. The skill and the poetic heights with which the poet narrated the various stories in the poem were explained with skill and imagination in the sub_chapter 'Katha Samvidhanam' This part of the thesis form the nucleus and it is ably and effeciently handled ........In describing the various aspects of his poetry, and in drawing inferences, as he made about his personality and finally in substantiating his place in Telugu literature, the candiate has done execllently well ... ...

Prof. Timmavajhala Kodandaramaiah
Madurai University

'Sri Hanumantha Rao is the first scholar to attemt a thorough and critical study and appreciation of life and works of Durjati . ....

A large mass of material has been collected, carefully sorted out, critically examined, intelectally interpreted and judiciously evaluated........The language is chaste and style is racy and readable. The presentation of the material is neat and systamatic and the conclusions drawn are logical and valid ... ........ The interpretation of the first verse of SRI KALAHASTI MAHAATMYAM is original and interesting. ...The chapter dealing with the personality of Dhurjati is also the author's original contribution to a large extent...."

Prof. Palla Durgaiah
Osmania University

# అంజలి

సాహితీ సమరాంగణ సార్వభౌముఁడు, కవితా ప్రాపీణ్య ఫణీశుఁడయిన శ్రీకృష్ణరాయ మహీశుని ఆస్థానము నలంకరించిన అష్టదిగ్గజములలో నొకఁడై తెలుగు కవులందు హృదయవాదులలో నగ్రగణ్యుడై సువిశాల యశోవిరాజమానుఁడై, 'స్తుత మతియైన అంధ్రకవి ధూర్జటి'ని గూర్చిన సమగ్ర పరిశీలనము నా యెఱిగినంతలో నింత వరకు వెలువడలేదన్న యంశము, ఈ సిద్ధాంత గ్రంథ పరీక్షా సంఘ నిశ్చితాభిప్రాయ ముచే సమర్థింపబడినది. ఏవంవిధ మహాకవుల కవితా మార్గాను శీలనము సాహిత్య స్రష్టలకు మార్గదర్శకమై సాహిత్యమునకొక పుష్టి, సాహితీ వ్రతులకొక దృష్టి నీయ గలదను సముద్దేశముతో నే నీ వ్యాసంగమునకు పూనుకొన్నాను.

నాటి ఆంధ్ర విశ్వవిద్యాలయ పరమ పట్టభద్ర కేంద్రము (గుంటూరు) ఆంధ్ర శాఖాధ్యక్షులు, నేటి భారతీయాచార్యులు పండిత పరమేష్ఠులు, మహాకవి, సహృదయ సార్వభౌములు ఆచార్య యస్వీ. జోగారాయ మహోదయులు నాయీపరిశోధన వ్యాసంగ మున రేబవళ్ళు అధిక సమయమును నా కొఱకు వెచ్చించి సర్వదా, సర్వథా పర్యవేక్షణ సల్పుచు దర్శకత్వము నెఱపుట నాభాగ్య విశేషము ఆ 'చిత్తనిత్యస్థిత శివు'నకు శత సహస్రాధిక నమశ్శతములందించినను కొదువయేయగునని నాగుండెలోతులలో నిత్యము స్పందించే సత్యము.

నాయీ పరిశోధనమున, పరిశీలనమున కొన్ని క్రొత్త విశేషములు, మంచి ఫలిత తములు లభించినవను తృప్తి నాకు గలిగినదను అంశమునకు నాయీ సిద్ధాంత గ్రంథ పరీక్షా సంఘ సభ్యుల సమీక్షలే సాక్ష్యమని సహృదయ పాఠకులకు సవినయముగా మనవి.

మహాకవి ధూర్జటి కృతులకుగల వివిధ ముద్రిత ప్రతులను, తాళపత్రప్రతులను తులనాత్మక పరిశీలనము చేయుటయందు సహృదయముతో సహకరించిన శ్రీవేంకటే శ్వర ప్రాచ్య పరిశోధనసంస్థ తిరుపతి, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము, మద్రాసు; శ్రీ సారస్వత నికేతన గ్రంథాలయము. వేటపాలెం (ప్రకాశము జిల్లా) హిందూ కళాశాల గ్రంథాలయము, గుంటూరు; ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయము, గుంటూరు; అధికారులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. సమక్షములోను, లేఖల మూలమునను నా సందేహములను తీర్చిన మహోదయులు కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, కొత్ర వెంకట నృసింహశాస్త్రి (కాళ హస్తి) శ్రీమతి ధూర్జటి కామమ్మ (కాళహస్తి), పరశురామ్ గురుకుల్ (కాళహస్తి)

గారలకు కృతజ్ఞతాంజలులు. పరిశోధన వ్యాసంగములకు అనుమతించిన మా హిందూ కళాశాల (నాటి) పాలకవర్గము, ప్రాచార్యులకు, నాటి పరిశోధనకు, నేటి ప్రచురణకు అనుమతించిన ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులకు కృతజ్ఞతలు.

నా సర్వసాహిత్య వ్యాసంగమునకు, మూడుశ్నర దశాబ్దాలఉద్యోగ నిర్వణకు సదాసహకరించిన నా సహధర్మచారిణి సౌభాగ్యవతి లక్ష్మి, నాపుత్రపుత్రికా సంతతికినా శుభాశీస్సులు.

నా విద్యా వ్యాసంగమున ఆరాధ్యమూర్తులయిన అమృత మూర్తులు శ్రీపశ్చి పూర్వ ప్రజ్ఞాచార్య, ఆచార్య భూపతి లక్ష్మీనారాయణరావు, నన్నాశీర్వదించిన కులపతులు ఆచార్య పింగళి లక్ష్మీకాంత గురూత్తములకు నా శ్రద్ధాంజలి. నాకు విద్య, ఉద్యోగము లను అనుగ్రహించిన వాత్సల్యమూర్తి 'జంగమ విజ్ఞాన సర్వస్వము', మహామనీషి, నా గురుదేవులు శ్రీ వల్లభ జోస్యుల సుబ్బరాయ మహోదయులకు నా హృదయమునే నైవేద్యము పెట్టితిని.

ఈ సిద్ధాంత పరీక్షా సంఘాధ్యక్షులు మద్గురు మూర్తులు అచార్య జీ.యస్. రెడ్డి సంఘసభ్యులు ఆచార్య తిమ్మావఝ్ఝుల కోదండరామయ్య, ఆచార్య పల్లా దుర్గయ్య గారలకు కృతజ్ఞతలతోడి భక్తి పూర్వక శ్రద్ధాంజలి.

నాయీ గ్రంథమునకు అమోదము గూర్చిన నా గురుదేవులు ఆచార్య పోణంగి శ్రీరామ అప్పారాయ బుధవరేణ్యులకు నిండుమనంబుతోడి కృతజ్ఞాభివందనములు.

ఈవిధమగు అక్షర రూపమందుటకు ఆర్థిక సహాయమందించిన శ్రీమత్తిరుమల దేవస్థానము, తదధిష్ఠాన దైవమగు అలమేలు మంగాపతికి శ్రియఃపతికి ఏటికోళ్ళు. స్వధర్మ స్వారాజ్య సంఘము (మద్రాసు) వారికి, తెలుగు విశ్వవిద్యాలయము వారికి కృతజ్ఞతలు.

నా రచన ప్రకరణ సౌలభ్యము శ్రవణ సుభగత్వము అపేక్షించి కొన్ని చోటుల విసంధితోడి సరళ గ్రాంథికమున సాగినదని మనవి.

తమ్ముల వ్రత్తులు వైచికొన్నను తనుమొఱంగి కొన్ని నెఱసులెటులో పోటుచేసు కొన్నవి. ముద్రణ భారమున భాగస్వాములయిన శ్రీ సాయిరాం ప్రింటర్స్, విజేత ప్రింటర్స్ వారికి నా శుభాకాంక్షలు.

తనకు నాయకుఁడుగా, కృతిపతిగా వరించిన ఆంధ్రకవి ధూర్జటిచే తన లీలలను తానై పలికించిన 'ధూర్జటి' నాచే'మహాకవి ధూర్జటి'హృదయావిష్కరణము సేయించిన 'ఆర్యావామాంగము, దివ్యలింగము' ఫణారాజన్మహో లింగమూర్తి శ్రీకాళహస్తిపతియే నాయీ కృతిఁగొని నన్ను సుకృతినిఁ గావించుటయు ఆ పరమ శివుని లీలా విలాసము. షోడశాబ్దప్రాయముగల (1974-1990) నయీ సిద్ధాంత గ్రంథము ఈవిధముగ షోడశ కళాపూర్ణ శశాంకధరుని అనుగ్రహము పొందుట. అదియు నా షష్ట్యబ్దిలో సంభవించు టయు శివలీలయేగదా।

అతులిత భక్తిభావ సముదంచిత సత్కవితా ప్రబంధమున్
శతకమునున్ విశిష్టపద సారసుధారసబంధురంబుగా
పతిగను కాళహస్తిపతి బల్కియుఁ గొల్చితివీవు ధూర్జటిన్,
స్తుతిమతివైన ఆంధ్రకవి ధూర్జటి। ధూర్జటి! నీకు మ్రొక్కెదన్"

ప్రమోదూత, శ్రావణం
1990

బుధజన విధేయుడు
పొన్నెకంటి హనుమంతరావు

ఇతి శమ్

# ఆత్రేయం

అభిజనము : గుంటూరు-ప్రమోదూత సంవత్సర మాఘ శుక్ల ద్వాదశి. 31.03.1931.

జననీ జనకులు : మాణిక్యాంబా వేంకటప్పయామాత్యులు

దత్తస్థానము : లలితాంబా చంద్రశేఖరామాత్యులు

విద్య ; హిందూ కళాశాలోన్నత పాఠశాల — 1941-1948

ఇంటర్.బి.ఏ ; హిందూకళాశాల, గుంటూరు — 1948-1953

ఎం.ఏ : ప్రెసిడెన్సీ కాలేజి, మద్రాసు 1953-1955

పి.హెచ్.డి. ; ఆంధ్రవిశ్వవిద్యాలయము 1974

ఉద్యోగం : గుంటూరు హిందూకళాశాల ఆంధ్రోపన్యాసకుడు 1959-1955

సంస్కృత ఆంధ్రశాఖాధ్యక్షుడు 1972-1981

కళాశాల ప్రాచార్యుడు — 1981-1989

పురస్కారము : 'ఉత్తమ ఉపాధ్యాయుడు' (ఆం.ప్ర. — 1984)

విశిష్టసభ్యత్వము: నాగార్జున విశ్వవిద్యాలయ సిండికేట్ సభ్యత్వము-1983-86

,, సెనెట్ అకెడమిక్ సభ్యత్వము-1981-88

,, అకెడమిక్ సెనేట్ సభ్యత్వము-1988-89

కృతులు ; తెలుగు-ముద్రితము

(1) మహాకవి ధూర్జటి : కవిత్వము—వ్యక్తిత్వము పి.హెచ్.డి. సిద్ధాంత గ్రంథము. (1990)

(2) ఆంధ్ర సాహిత్యము : చమత్కారవైభవము-పరిశోధనాత్మక గ్రంథము

(3) కుందమాల — అనువాదనాటకము

(4) సాత్రాజితీయం — స్వతంత్ర నాటకము

(5) విజయనగరసామ్రాజ్య గత వైభవము-యాత్రాదర్శిని(కన్నడమునుండి)

అముద్రితములు : వ్యంగ్య చిత్రణలు,కథలు, గేయాలు పీఠికలు, విమర్శవ్యాసాలు

**English : (I) 'Biographical writings in Telugu'—Comperative Indian Literature'—Vol I-Kerala Sahitya Academy.**

**(II) Some Telugu Poets and works—Kendra Sahitya Academy.**

**(III) Some Telugu Poets and works—'Encyclopaedia India'—M.P. Birla Foundation- Calcutta.**

# ఉదాహృత గ్రంథ సంకేతపద వివరణము

| క్ర.సం. | సంకేతపదం | గ్రంథనామ వివరణము | గ్రంథకర్త లేక ప్రచురణ |
|---|---|---|---|
| 1. | అ.క | అప్పకవీయము | కాకునూరి అప్పకవి |
| 2. | ఆం.క.చ. | ఆంధ్రకవుల చరిత్ర | కందుకూరి వీరేశలింగము పంతులు |
| 3. | ఆం.క.త | ఆంధ్ర కవి తరంగిణి | చాగంటి శేషయ్య |
| 4. | ఆం.ధ్వ. | ఆంధ్ర ధ్వన్యాలోకము | వేదాల తిరువెంగళాచార్యులు |
| 5. | ఆం.ప్ర.సా.అ. | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. | ప్రచురణ సంస్థ |
| 6. | ఉపనిషచ్చంద్రిక | ఉపనిషచ్చంద్రిక | రాయప్రోలు లింగనసోమయాజి |
| 7. | ఔ.వి.చ. | ఔచిత్య విచార చర్చ | క్షేమేంద్రుడు |
| 8. | క.పూ. | కళాపూర్ణోదయము | పింగళి సూరన |
| 9. | కా.ఖం. | కాశీ ఖండము | శ్రీనాథుడు |
| 10. | కా.సం. | కావ్యాలంకారసంగ్రహము | బట్టుమూర్తి—సన్నిధానం వ్యాఖ్య |
| 11. | కావ్యస్వరూపమ్ | కావ్యస్వరూపమ్ | ఆం.ప్ర.సా.అ. ప్రచురణ |
| 12. | కు.సం. | కుమార సంభవము | నన్నెచోడ కవి |
| 13. | కృ.వి. | కృష్ణరాయ విజయము | కుమార ధూర్జటి |
| 14. | క్రీ.రా. | క్రీడాభిరామము | శ్రీనాథుడు |
| 15. | ఘ.మా. | ఘటికాచలమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణ కవి |
| 16. | చొ.నా. | చొక్కనాథ చరిత్ర | పచ్చకప్పురపు తిరువెంగళనాథుడు |
| 17. | ద.కు.చ. | దశకుమార చరిత్ర | కేతన |
| 18. | ద.చ. | దశావతార చరిత్ర | ధరణిదేవుల నాగయ్య |
| 19. | దా.శ. | దాశరథీ శతకము | కంచర్ల గోపన్న (రామదాసు) |
| 20. | న.భ. | నవవిధ భక్తులు | కుందుర్తి వెంకటనర్సయ సోమయాజి |
| 21. | నృ.పు. | నృసింహ పురాణము | చెదలువాడ ఎఱ్ఱాప్రగడ |
| 22. | నా.పు. | నారసింహ పురాణము | హరిభట్టు |

| | | | |
|---|---|---|---|
| 23. | నా.శా. | నాట్యశాస్త్రము | డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు |
| 24. | పం.తం. | పంచతంత్రము | దూబగుంట నారాయణకవి |
| 25. | పాం.మా. | పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి |
| 26. | పారి. | పారిజాతాపహరణము | నంది తిమ్మన |
| 27. | ప్రా.ఆం.భూ. | ప్రాచీనాంధ్ర భూగోళము | కె. ఈశ్వరదత్తు |
| 28. | బ.పు.సం. | బసవపురాణము (సంక్షిప్తము) | పాల్కురికి సోమన |
| 29. | భ.వి.యో. | భగవద్గీత-విషాదయోగము (సంస్కృత) | వ్యాసమహర్షి |
| 30. | భ. శ. | భర్తృహరి (సం)శతకము (త్రిశతి) | భర్తృహరి |
| 31. | భా.గ,శ్రీమభాగ | భాగవతము | బమ్మెర పోతన |
| 32. | భార. | భారతము | కవిత్రయము |
| 33. | భా.రా. | భాస్కర రామాయణము | భాస్కరాది కవులు |
| 34. | భా.వ్యా. | భారతీ వ్యాసములు | బులుసు వెంకటేశ్వర్లు |
| 35. | భీ.పు. | భీమేశ్వర పురాణము | శ్రీనాథుఁడు |
| | భీ.ఖం. | భీమఖండం | |
| 36. | భో.రా. | భోజరాజీయము | అనంతామాత్యుఁడు |
| 37. | మను,మ.చ. | మనుచరిత్రము | అల్లసాని పెద్దన |
| 38. | మొ.రా. | మొల్లరామాయణము | మొల్ల |
| 39. | ర.ప. | రత్నావళీ పరిణయము | ధూర్జటి వేంకటార్యుడు |
| 40. | ర.జ.మ. | రసికజనమనోభిరామము | కూచిమంచి తిమ్మకవి |
| 41. | రామా. | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుఁడు |
| 42. | రాజ.చ. | రాజశేఖర చరిత్రము | మాదయగారి మల్లన |
| 43. | వసు. | వసుచరిత్రము | భట్టుమూర్తి |
| 44. | వా.వ్యా. | వాఙ్మయ వ్యాసమంజరి | డా॥ నేలటూరి వేఙ్కటరమణయ్య |
| 45. | వి.చ. | విక్రమార్క చరిత్రము | జక్కన |
| 46. | వి.వి. | విజయ విలాసము | చేమకూరి వేంకటకవి |
| 47. | వేం.ప్ర. | వేంకట్రామ అండ్ కో ప్రచురణ | ప్రచురణ కర్తలు |

| | | | |
|---|---|---|---|
| 48. | శ.ప. | శకుంతలా పరిణయము | కృష్ణకవి |
| 49. | శ.వా.స. | శతకవాఙ్మయ సర్వస్వము | వేదం వేంకట కృష్ణశర్మ |
| 50. | శి.ల. | శివానందలహరి (సంస్కృత) | జగద్గురు శంకర భగవత్పాదులు |
| 51. | శృం.నై. | శృంగార నైషధము | శ్రీనాథుఁడు |
| 52. | శృం.శా. | శృంగార శాకుంతలము | పిల్లలమఱ్ఱి పినవీరన |
| 53. | శ్రీ.కా.దం. | శ్రీకాళహస్తి దండకము | సుధీమాధవపౌత్ర ధూర్జటి |
| 54. | శ్రీ.కా.మా. | శ్రీకాళహస్తి మాహాత్మ్యము | మహాకవి ధూర్జటి |
| 55. | శ్రీ.కా.శ. | శ్రీకాళహస్తీశ్వర శతకము | మహాకవి ధూర్జటి |
| 56. | శ్రీ.కా.స్తో. | శ్రీకాళేశ్వరాదిస్తోత్రమంజరి | బాలేమర్తి లక్ష్మీనృసింహం |
| 57. | శ్రీ.కా.స్థ.మా. | శ్రీకాళహస్తి స్థలమాహాత్మ్యము | ధూర్జటి లింగరాజు |
| 58. | శ్రీ.చ.వి. | శ్రీచక్ర విలసనము | తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు |
| 59. | శ్రీ.వేం.ప్రా. ప.సం. | శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ | పరిశోధనసంస్థ తిరుపతి |
| 60. | స్కాం.పు. | స్కాంద పురాణము(సంస్కృత) | |
| 61. | సీతారా. సీ.రా.సం. | సీతారామాంజనేయ సంవాదము | పరశురామపంతుల లింగమూర్తి |
| 62. | హం.విం. | హంస వింశతి | అయ్యలరాజు నారాయణ |
| 63. | హ.వి. | హరవిలాసము | శ్రీనాథుఁడు |
| 64. | హ.వం. | హరివంశము | ఎఱ్ఱన |
| 65. | హరి.పా. | హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి |
| 66. | హరి.న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము | భట్టుమూర్తి (రామరాజభూషణుఁడు) |

— ౦ —

# అర్చన

మృడుఁడు సతియు తమ నడుమ నొడినిడికొని
ఒక్కసారిగ ఇరువురు చెక్కుచేర్ప
ముందు కొరిగి వారలకుఁధా ముద్దుఁగూర్చు
కొంటె వెనకయ్య చెయిదము కూర్చుమేలు

ఆటగా చాటుకేగిన అలిఁగనక
వాకొదవని మగని జూచు వాణి కనుల
గర్వరేఖను ఎనిమిది కనులఁద్రావు
కమలజుఁడధికాయువు నిచ్చి కాంచు మనల

కోపము వహించు తనయెడఁ గూర్మిమీఱ
నవ్వులో లీనమైపోవు నల్లనయ్యఁ
గాంచలేక కుందుసతినిఁ గాంచువెన్నుఁ
డిమ్ముగ మనకు సౌఖ్యమ్ము లిచ్చుగాక

వంచిన తలమీదం జ్రా
లుంచుచు గంగఁదన నీడ నువిదగ మదిలో
నెంచు నగజాతనుగని హా
సించు శివు శశికళ సుధలు చిలుకుత ఘనపై

మొదలులేక నడుమలేక తుదియులేక
అన్నిటను తానయై నిండియున్న తల్లి
వెలుగులకు వెలుగిచ్చి తా వెలుగు వెలుగు
అమ్మ, అనసూయ చల్లగా అదుకొనుత

# అంకితము

ఓంకారేశ్వర! అభవా!
శంకాతంకము విదల్చి శంకర! నను నీ
తెంకఁగఁ జేకొని చేకొను
మంకిత మీ కృతిని కాళహస్తీశ! శివా!

లోకేశ్వర! పరమేశా!
నాకాధిప సన్నుతాంఘ్రి! నాగాభరణా!
నీ కొసఁగెద కృతి చిద్వి
ద్యాకార! స్మరహర! కాళహస్తీశ! శివా!

సువిశాలయశుండు "మహా
కవి ధూర్జటి" కృతి సమీక్షఁ గైకొమ్ము శివా!
భవహర! గిరిజేశ! భవా!
అవినాశ! అఘహర! కాళహస్తీశ! శివా!

క్లేశముల కిక్క ఈ భవ
పాశముగదా! దానిఁ ద్రుంచి పార్వతీ రమణా!
ఈశా! కృతిఁగొనుమో శమ
నాశాగిరివాస! కాళహస్తీశ! శివా!

పంచముఖేశ్వర! పురహర!
పంచక్లేశాది దుఃఖ బంధ విమోచా!
పంచశరభంగ! సదయ దృ
గంచల! కృతిఁగొనుము కాళహస్తీశ! శివా!

చరణాబ్జము లంటియు నీ, శరణంటిన్ 'పొన్నెకంటి' శర్వా! మహేశా
వరద! హనునుంతరాయుని, కరుణన్ కాపాడుమయ్య! కామారి! శివా!

ఓమ్

# ధూర్జటి

## ( జీవితోదంతము )

స్తుతమతియైన యాంధ్రకవి, ధూర్జటి, 'సాహిత్య శ్రీవరుఁ' డనదగిన యీ మహాకవి తెలుఁగు సాహిత్యమున నొక ప్రబంధమును, శతకము నొకదానిని విరచించిన నాఁడు శ్రీకాళహస్తీశ్వరునకుఁ దప్ప నొరులకుఁ గవిత్వము సెప్పనను[1] నియమముతో ధూర్జటి కవీంద్రుఁడు శ్రీకాళహస్తి మాహాత్మ్యము ప్రబంధమును, 'శ్రీకాళహస్తీశ్వర' మకుటముతో నొక శతకమును గూర్చెను నాద బిందు కళాతీతేశుఁడైన శ్రీకాళహస్తిపతి లీలావిలాసమును దనివిసనునట్లు 'సప్యభాషా శతథా నిగుంభన రసస్థితి నొప్పఁదలిర్పఁ' గావ్యసరణిని జెప్పిన ధన్యజీవి ధూర్జటి.

### ఊరు - పేరు

ఊరు : శ్రీకాళహస్తీశు నాస్థానకవిగాఁ[2] దననుఁ బేర్కొనుట తప్ప, ధూర్జటి కవీంద్రుఁడు తన నెలవునుగూర్చి స్పష్టముగా నెచ్చటనుఁ బలికి యుండలేదు. ధూర్జటి వంశీయులగు తరువాతి కవులు తమ తమ వెలసిన తావులు, తమ తమ కబ్బములందుఁ బేర్కొనియుండుట వలనఁ గొంతవఱ కూహింపనగును. తమ వంశ మూలపురుషుని 'ధూర్జటి'నిఁ బేర్కొనిన వారిలో మొట్టమొదటి కవి 'కుమార ధూర్జటి' బిరుదాంకితుఁడు, 'కృష్ణరాయ విజయ' 'ఇందుమతీపరిణ' యేత్యాది గ్రంథకర్త యయిన ధూర్జటి వేంకటార్యుఁడు, తాను 'పాకనాఁటార్వేల వంశప్రసిద్ధుఁడననియు, ధూర్జటి పౌత్రుఁడ'[3] ననియు స్పష్టముగఁ బేర్కొని యున్నాఁడు. ఆ ప్రస్తావము వలన ధూర్జటి కవీంద్రుఁడు పాకనాఁటి వాస్తవ్యుఁడని భావింపఁదగియున్నది. పాకనాఁడు

---

1. శ్రీ కా. శ. ప. 114    2. శ్రీ కా. శ. ప. 4

3. కృ. వి. 1 అ - ప 23

నెల్లూరు ప్రాంతమని నిర్ధరింపఁబడినది.[1] ధూర్జటి వంశీయులైన 'మహాకవి ధూర్జటి', యాతని పుత్రుఁడయిన లింగరాజు, నాతని తనయుఁడగు వేంకటరాయలు విలసిల్లినట్టియు, వారి కావ్యముల సంకితముఁ గొన్న ప్రభువులు విరాజిల్లినట్టియు ప్రాంతములన్నియు నీ నెల్లూరు మండలాంతర్గతములయిన నెలవులే. నేఁటికిని 'ధూర్జటి' యింటిపేరుగల వంశమందలి యయిదు కుదుళ్ళ వారయిదు తావుల నెల్లూరు మండలముననే కుదుర్కొనియున్నారు.[2] (గొట్టిపూడి, కారూరు, కాళహస్తి, కళత్తూరు, పునుగుంటపాలెము.)

అదియుఁగాక ప్రబంధము, శతకములందుఁ గవీంద్రుఁడు గావించిన కొన్ని కొన్ని వర్ణనలు, ప్రస్తావనలను బట్టియు, నా మహాకవి కాళహస్తిపుర నివాసియేయని యెంచవలసియున్నది. శ్రీకాళహస్తిపుర వర్ణనమున 'ఎలదోటల్వనము ల్వధూనవము లద్రీంద్రంబు,[3] లనిన వాక్యము కాళహస్తిపుర పరిచయమునుఁ దెలుపును. అటులే పార్వతీ పరమేశ్వరుల విహారవర్ణన సందర్భమునను 'విపినాశ్రమపల్లవచ్ఛాయల' ప్రస్తావము[4], శతకమందలి 'దినముం జిత్తములో సువర్ణముఖరీ తీర ప్రదేశాశ్రమ తానన మధ్యోపల వేదికాగ్రమున'[5] నను ప్రస్తావముల వలన నీవిషయము బలపడుచున్నది. ఈయంశమును సమర్థించు ప్రసక్తి ప్రబంధమున నింకనుఁబలుతావులఁ గననగును.[6] ఆయా ప్రాంతముల పరిచయ మినుమిక్కిలిగా లేనున్న నది సాధ్యము కాదు. కాన ధూర్జటి కవీంద్రుని నెలవు శ్రీకాళహస్తిపురమే.

**శ్రీకృష్ణరాయాస్థాన ప్రవేశము :**

తెనుఁగు వాఙ్మయమున 'ధూర్జటి' నామమును స్మరియించుటతోడనే రెండు విషయములు వివాదాస్పదమయినవిగాఁ గనుపట్టును. దానికిఁ గతమైనదొక చాటూక్తి.

---

1. సాళ్వ. ఆం. ధూ. పుట 207। 2. 'ధూర్జటి కామమ్మ' గా వ్యవహృత మగుచున్న గం॥ భ॥ స॥ ములుమూరు కామమ్మగారు శ్రీకాళహస్తి పుర నివాసులు చెప్పిన వాక్యములివి. ఆమె ఎనుబదేండ్ల ముదుక. 'ధూర్జటి' వారి యాడపడుచు; 3. ప్రబంధము-1-ఆ-21 ప; 4. ప్రబంధము-1ఆ-98 సీ. ప. మొదటి పాదము; 5. శతకము-35 వ పద్యము, 6. ప్రబంధము: 1ఆ-31, 96, 116, 2 ఆ-90, 4 ఆ-143, 203.

"స్తుతమతియయిన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేలగల్గెనో
యతులిత మాధురీమహిమ' - 'హా ! తెలిసెన్
భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతా పహారి సం
తత మధురాధరోదిత సుధారస ధారలు గ్రోలుటం జుమీ!"

యనినట్టిది.

ఈ పద్దెము రాయలసభలో జరిగిన యొకానొక చమత్కారఘట్ట సూచనముగ లోకమున వ్రాకియున్నది. అదియును వికటకవిగాఁ బేరందిన తెన్నాలి రామకృష్ణయ్య రాయలవారి ప్రశ్నకు సమాధానముగాఁ బలికినట్లుగ వాడుకలో నున్నది. 'రామకృష్ణ కవిచంద్రుడు శ్రీకృష్ణరాయల యాస్థానమున వెలసియుండెనా ?' యను ప్రశ్న యొకటి సాహిత్యార్చకులయు, విమర్శక చక్రవర్తులయు చర్చకుఁ దావిచ్చినది. రాయల యాస్థానమునఁగల 'యష్టదిగ్గజముల'లో రామకృష్ణునకుఁదావు లభించుట కాతనికిఁ దగిన వయస్సు లేదనియుఁ జాటూక్తిగాఁ బ్రబలిన పై పద్యము తప్ప మరి యితరము లయిన ప్రబల సాక్ష్యములు లేవనియుఁ గొందఱు విమర్శక లభిప్రాయపడిరి. కాని రామకృష్ణుని 'ఉద్భటారాధ్యచరిత్రము' రామకృష్ణుఁడు రాయల సమకాలీకుఁడను నంశ మును ధ్రువపఱచుచుండుటచే, నక్కవీశుఁడు రాయల యాస్థాన మలంకరించియుండు నని యూహింప నవకాశమిచ్చుచున్నది. 'ఉద్భటారాధ్య చరిత్ర' కృతిపతియగు 'ఊరె దేచమంత్రి' నాదెండ్ల గోపమంత్రికడఁ గార్యనిర్వాహకోద్యోగి. గోపమంత్రి రాయల ప్రతినిధిగాఁ గొండవీడు నేలిన పాలకుఁడు. గోపమంత్రి 'అప్పాజీ' తిమ్మరుసయ్య మేనల్లుఁడు. గోపమంత్రిచే, దేచమంత్రి క్రీ॥ శ॥ 1517 సం॥ లో నగ్రహార దాన మందినట్లు శాసనాధారములున్నవి. గోపమంత్రి పాలనకాలము క్రీ॥ శ॥ 1515-1538. కనుక రామకృష్ణకవి తనకృతియైన 'ఉద్భటారాధ్య చరిత్రము' ను క్రీ॥ శ॥ 1525-30 నడుమకాలమున రచించి యుండవచ్చునని శ్రీ చాగంటి శేషయ్యగారు[1] విశ్వసింపఁగా, డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు[2] క్రీ॥ శ॥ 1520 ప్రాంతములం దాకావ్య రచ

1. ఆం. క. త. సం. 8 పుటలు, 8-10-25

2. వావ్యా. మం. పుట - 115

నము సాగియుండునని విశ్వసించిరి. వివిధ పండిత విమర్శకుల వాదప్రతివాదములను బరిశీలించి, సిద్ధాంతముగాఁ బలికిన శ్రీ వేంకటరమణయ్యగారు భావించినట్లు[1], రామకృష్ణుఁడు రాయలవారి యాస్థానమున క్రీ॥ శ॥ 1520-30 నడుమ వెలసియుండినట్లు తలంపఁ దగియున్నది. అష్టదిగ్గజములలో నొకఁడుగా, బిన్నవయస్కుఁడుగా నుండి యుండును. తన కాశ్రయుఁడగు దేచమంత్రి పాయమున, గోపమంత్రి సహకారమునఁ, దిమ్మరుసయ్య యనుగ్రహముచే రామకృష్ణకవి రాయలవారి యాస్థానమునఁ బ్రవేశించి యుండునని తలంచుట సమంజసము. నాదెండ్ల గోపమంత్రి యన్నయగు 'అప్పమంత్రి' నాశ్రయించి కృతిసెప్పిన 'రాజశేఖర చరిత్ర' కృతికర్త మాదయగారి మల్లనయు,[2] 'అప్పమంత్రి'కి మేనమామయుఁ బిల్లనిచ్చిన మామయునగు తిమ్మరుసయ్య యనుగ్రహముననే రాయల యాస్థానమలంకరించి యుండెనుగదా ।

రామకృష్ణుఁడు తరువాత 'పాండురంగ మహాత్మ్యము'ను రాయల రాజ్యకాలము తుదనో, తరువాత నచిరకాలముననో రచించి యుండునని డా॥ నేలటూరువారి యభిప్రాయము.[3] రాయల రాజ్యకాలము తుదనయిన యెడలఁ దప్పక యది రాయల కంకితమయి యుండును. కాన చాగంటివా రూహించినట్లు, రామకృష్ణుఁ డాకావ్యమును రాయల యనంతరము క్రీ॥ శ॥ 1550 ప్రాంతములని స్పష్టముగాఁ బలుకలేకున్నను, నేలటూరువారి రెండవ యూహ ప్రకారము రాయల యనంతర నుచిర కాలముననే రచించి యుండఁదగునని యూహించుటయే లెస్సయనిపించును. సదాశివరాయల పాలనకాలమున మహామండలేశ్వరుఁడగు మంగయ గురువరాజు కుమారుఁడగు పెదసంగ భూపాలునొద్ద కార్యనిర్వాహకోద్యోగిగానున్న విరూరి వేదాద్రి మంత్రికున కంకితమీయఁబడిన దీ 'పాండురంగ మాహాత్మ్యము'.[4] సదాశివరాయల పాలనాకాలము క్రీ॥ శ॥ 1554-64[5] అనఁగా రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్య ప్రబంధమును క్రీ॥ శ॥ 1542 తరువాత రచియించి యుండునని భావింపవచ్చును.

---

1. వా. వ్యాసం. పుట - 94-156
2. ఆం. కత. సం. 7 పుట 242
3. వావ్యా. సం. పుట 149
4. పాం. మా. ప్ర. 80, 81 పద్యములు.
5. రామాభ్యుదయము - ఉపో. పు. xxxi-(ఆం. ప్ర. సా. అ)

రాయలకుఁ గృతులంకితమీయని రామకృష్ణ[1], రామభద్ర[2] సల్లన[3] కవులష్ట దిగ్గజములలో నున్నట్లు తదితరాధారములవలనఁ దెలియఁ గలుగుచున్నాము. రాయల యాస్థానమునఁ బ్రవేశించునప్పటికి రామకృష్ణకవి పిన్నవయస్కుఁడగుటచే, సహజ పరిహాస కుశలతవలనను, రాయల మెప్పుఁ బొందఁగోరియుఁ దోడి కవుల వ్యక్తిగత జీవిత రహస్యములు వెల్లడిచేయు స్పర్ధవలనను, రామకృష్ణుఁడిట్టి పద్యముఁ[4] పూరించి యుండునని యూహింపనగును.

ఇచ్చట మరియొక ప్రశ్న కలుగుచున్నది. రాయలచే నంతగాఁ గొనియాడఁబడిన ధూర్జటి "మాధురీమహిమ' యా కవీంద్రుని ప్రబంధమందలిదైనచో నాకృతి రాయలకు వినిపించెనా ? యను నదా ప్రశ్న. ధూర్జటి కవీంద్రుఁడు తన ప్రబంధము నా శ్రీకాళహస్తీశ్వరునకే కద అంకితమిచ్చినది ! కొన్ని ఘట్టములను రాయలకు వినిపించి యుండవచ్చును.

వైష్ణవుఁడయినను రాయలు పరమత సహిష్ణుడన్న యంశము చరిత్ర ఋజువు చేయుచున్నది. కవుల స్వాతంత్ర్యమును నున్నించి, గౌరవింపఁగల సహృదయుఁడు రాయలనుటకు పెద్దన పలికిన "నిరుపహతి స్థలము ...ఊరక కృతుల్ రచింపుమనుటన్న శక్యమే" యన్న చాటుపద్యమందలి వాక్యము సాక్ష్యమిచ్చుచున్నది. రాయల యాస్థానమున జరుగు పండిత, కవి గోష్ఠులందుఁ బాల్గొనునప్పుడు ధూర్జటి పూరించిన సమస్యలు, వాద ప్రతివాదములందు వెలిబుచ్చిన వాక్యసరళియు, మాధురీమహిమోపేతమయి యుండవచ్చును. తన హృదయమును మరులుగొన్న యా మధురిమనుఁ గొనియాడుచు రాయలద్దాని నొకసమస్యగా నిచ్చియుండఁగా నద్దానిని 'మాధుర్య, ఔదార్యము'ల నెఱిఁగిన ప్రోఢయయిన రామకృష్ణయ్య తన వికటత్వ గుణముచే (వికటత్వ ముదారతా....) పూరణఁగావించి యుండనోపును. రాయలా సమస్య యిచ్చియుండు ననుటకు, ధూర్జటి వేంకటార్యుఁడు "కుమారధూర్జటి" తనను గూర్చి కృతిపతి పలికినట్లు గ్రంథస్థముఁ జేసిన పద్యమందలి మొదటి సగమే సాక్ష్యమిచ్చుచున్నది.

---

1. వా. వ్యా సం. పుటలు - 94-156.
2. రామా. ఉపో. పు. xxxiii (ఆం. ప్ర. సా. అ.)
3. రాజ. శే. ఉపో. పు. 4 మరియు 5.
4. కృ. రా. వి. 1అ - 29 ప.

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో
యతులిత మాధురీ మహిమ'నా మను మీ పెదతాత చాల స
న్నుతిఁగనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభ న్వీను మీవు నట్ల మ
త్కృత బహుమాన వైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రి
లోపలన్"[1]

రామకృష్ణ కవి రాయల యాస్థానము నలంకరించియుండునన్న యంశము సుస్థాపితమగుచుండగా, నా పద్యపూరణమును తరువాతి వారికెవరికో యంటగట్టుట సమంజసము కాదు.

కాన కుమార ధూర్జటి పల్కినట్లు మన 'పెద ధూర్జటి,[2] కవీంద్రుఁడు కృష్ణరాయ మనోజ్ఞసభ నలంకరించి, యాతని సన్నుతి, నున్ననల నందియున్నట్లు స్పష్టమగు చున్నది. ఆ పద్యమున నున్న ధూర్జటిని గూర్చిన, వ్యక్తిత్వము ముందు రాబోవు 'ధూర్జటి వ్యక్తిత్వ' మను ప్రకరణమున విపులముగాఁ జర్చింపఁబడును.

ఆంధ్రభోజుఁడు, సాహితీ సమరాంగణ సార్వభౌముఁడునగు శ్రీకృష్ణరాయలచే పాదసమన్కృతులందఁగల్గిన మహాకవి ధూర్జటియని, ధూర్జటి వంశీయులగు మఱి యిరువురు కవీశుల వలన మనమెఱుఁగ గలుగుచున్నాము. కుమార ధూర్జటి తనయుఁ డగు లింగరాజకవి యొకరు, లింగరాజకవి పుత్రుఁడు వేంకటరాయకవి రెండవవారు. ధూర్జటి లింగరాజకవి తన 'శ్రీకాళహస్తి స్థలమాహాత్మ్యా[3]' మను ప్రబంధమున,

---

1. కృ. రా. వి. 1 ఆ-29 ప.

2. "పెద ధూర్జటి" అని ప్రయోగము ధూర్జటి లింగరాజు తన శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యమను ప్రబంధమునఁ జేసెను. శ్రీ. కా. స్థ. మా. 1 ఆ-23 ప.

3. ధూర్జటి లింగరాజకృత "శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యము"నకుఁ దాళ పత్ర ప్రతులు రెండుగలవు. ఒకటి ప్రథమాశ్వాసము మాత్రమే కలిగి, క్రిమిజుష్ట మయి శిథిలమైనది. రెండవది దాదాపు తొమ్మిది యాశ్వాసములు గలిగి చక్కని వ్రాఁతతో భద్రముగా నున్నది. ఇది నెం. 7330 న శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థయందుఁ గలదు. మొదటి ప్రతియు నిందే గలదు.

శ్రీకాళహ_స్తి గౌరీనాథ పదపద్మ
సద్భ_క్తియు_క్తి నిశ్చలత గాంచి
సాంసుధాసార సరసో_క్తి గుంభన
కాళహ_స్తి మహాత్వ్య కథ యొనర్చి
"కృష్ణరాయకిరీట కీలితమణిగణా
ర్చిత పదాబ్జద్వయశ్రీ వహించి"
యాసేతు కాశీ తటావనీ విఖ్యాత
సత్కీ_ర్తి విస్ఫూ_ర్తిచాల వెలసి....
................................................ అ. 17 ప.

అని పేర్కొనియున్నాఁడు. లింగరాజపుత్త్రుఁడు వేంకటరాయ కవీంద్రుఁడు తన 'రత్నావళీ పరిణయము'ను ప్రబంధమున[1]

పటుగంగా లహరీ తరంగసమ శుంభ త్కీర్తిక తాంచత్కళా
ఘుటనున్, 'బాదవిన్రమ కృష్ణవరరాడ్గంభీర కోటీర వి
స్ఫుటరత్నద్యుతి పాటలీకృత పదాంభోజాతు', సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయ కులక_ర్తన్ భ_క్తి రంజిల్లగన్.
1ఆ - 15 ప.

ఇచ్చట నొక యాక్షేపముగలదు. 'కుమార ధూర్జటి' రెండుచోట్ల పేర్కొనిన కవి ధూర్జటితోఁ గల సంబంధము, బాంధవ్యము కొంత చర్చకుఁ దావిచ్చుచున్నది. మొదటి పద్యమునయిన 'నను భరద్వాజగోత్రు....ధూర్జటి పౌత్రు....[2]. అను పద్యమునఁ గల 'పౌత్ర' శబ్దముచే 'కుమార ధూర్జటి' కవిధూర్జటికిఁ గుమారుని కుమారుఁడను నర్థము వచ్చుచున్నది. కాగా రెండవ పద్యమునయిన 'పెదతాత' యను శబ్దముచే[3]

1. ఈ 'రత్నావళీ పరిణయ' ప్రబంధమునకు వ్రాఁత కాగితప్రఁ ప్రతియొకటి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థలో నెం. 1494 రుగా నున్నది.
2. కృ. రా. వి - 1ఆ - 23 ప.
3. కృ. రా. వి. - 1ఆ - 29 ప.

'తాతగారి యన్నగార' ను భావము స్ఫురించును. అనఁగా మన కవీంద్రుఁడయిన ధూర్జటి కి 'కుమార ధూర్జటి' యొక విధముగా మనుమఁడు, వేఱొక విధముగా 'తమ్ముని మనుమఁడు' — ఈ రెండు విధములయిన యర్థములు కలుగుచున్నవి.

కుమార ధూర్జటికిఁ గవిధూర్జటి తాతయైనను, తాత కగ్రజుఁడైనను 'పెద ధూర్జటి'[1] రాయల యాస్థానమున నుండి యుండెనన్న ధూర్జటి వంశీయులు పల్కిన వాక్యములకే వ్యాఘాతము కల్గుచున్నది.[2]

'కుమార ధూర్జటి' 'అరవీటి చిన వేంకటరాజు' సభలోని కవి. ఆ ప్రభువు క్రీ॥ శ॥ 1630 ప్రాంతములవాఁడు. కృష్ణరాయలు క్రీ॥ శ॥ 1509–30 నడుమ కాల మునవాఁడు.[3] అట్టి తఱి 'కుమార ధూర్జటి'కి కవి ధూర్జటి తాతయేయయిన, నాతఁడు రాయల యాస్థానము నలంకరించి యుండెననుటకు వలను కాదు. తరమునకు 25సం॥ లుగా లెక్కగట్టిన క్రీ॥ శ॥ 1630 నుండి 50 సం॥లు తీసివేసిన క్రీ॥ శ॥ 1580 ప్రాంతములగును గదా ! కనుక నిచ్చట 'పౌత్ర', 'పెద తాత' పదములను చర్చించి చూచిన విషయము తెల్లము గాఁగలదు.

'పెద తాత' యనఁగాఁ 'దాతకుఁ దాత' యను నర్థము స్వీకరించిన యెడల నీ చిక్కు విడిపోవును. అనఁగా చిక్కు విడుటకుగా నీ పదమున కీయర్థముఁ బొసఁగించుట యనికాదు. ప్రయోగములందుఁ జిత్ర విచిత్రములయినవి పూర్వకవులనుండియుఁ గనఁబడుచునే యున్నవి. ధూర్జటి లింగరాజుకవి తన కృత్యవతరణిక యందుఁ బేర్కొనిన 'పెద ధూర్జటి' యను పదమునందలి యర్థము తన తండ్రియగు 'కుమార ధూర్జటి' కాక యాతనికి మూల పురుషుఁడనియు, మొదటి ధూర్జటి నామ్నుఁడనియు.

'కుమార ధూర్జటి' కాశ్రయుఁడయిన 'అరవీటి చినవేంకటరాజు' కృష్ణరాయలు యల్లుడగు నళియరామరాజునకు మునిమనుమని కుమారుఁడట: అరవీటి చిన వేంకట రాజు కృష్ణరాయలకు మనుమని మునిమనుమఁడగుచున్నాడు. అతనికి కవి ధూర్జటి మనుమని మనుమఁడు కృతినొసఁగుట పొసఁగునట్టి యంశము.

1. శ్రీ. కా. స్థ. మా – 1అ – 28 ప.

2. ఆం.క త.సం. 7.272–273 పుటలు మరియు సం. 1264–66, 253–254 పుటలు.

3. శ్రీ. కా. మా. పీఠిక – పుట 6 – అధో సూచిక.

ఈ యంశముఁ బరిశీలించి చూచిన తరువాత కుమార ధూర్జటికి, పెద ధూర్జటి తండ్రికిఁ దండ్రియైన తాతకాఁజాలఁడనియు, నా తాతకుఁ దాతయును నర్థమే ననుంజన మైనదనియు సిద్ధాంత పఱుపఁదగి యున్నది.

ఇప్పుడు మఱియొక సందేహము పొడసూపుచున్నది. కుమార ధూర్జటి మొదటి పద్యమునఁ బేర్కొనినట్లు 'పౌత్ర' శబ్దమెట్లు సరిపడునను సంశయ మేర్పడుచున్నది. దానికి సమాధానమిట్లు భావింపఁదగును. వేంకటపతి (కుమార ధూర్జటి) తన మొదటి పద్యమున (1 అ-23 ప.) దన తండ్రి 'కాళయామాత్యుఁడ'ని పేర్కొని యున్నాఁడు. ఆ కాళయామాత్యుని తండ్రి 'ధూర్జటి' (కవి ధూర్జటి కాఁడు). కాగా నా ధూర్జటికిఁ దాత మన కవి ధూర్జటి యై యుండఁదగి యున్నది. తాత పేరు మనుమనికిఁ బెట్టుట మన తెలుఁగు సంప్రదాయము. మన కవిధూర్జటికి సోదరుని మనుమఁడగు మఱియొక 'ధూర్జటి' నామ్నుఁడైన కవి కలఁడు. అతఁడు 'కాళహస్తీశ్వర దండకము'ను రచించినవాఁడు.[1] అతఁడు తన తాత 'సుధీమాధవు'ఁడని పేర్కొని యున్నాఁడు. ఆ దండకమున నున్న వాక్యములను బట్టి, కవి ధూర్జటికి 'సుధీమాధవు'డను సోదరుఁడుండియుండునని యూహింపనగుచున్నది. మన కవి ధూర్జటికి సోదరులు కలరని యూహించుట కాతని శ్రీకాళహస్తీశ్వర శతకమందలి

"ఆధివ్యాధులు దీపనాపులు కళత్రాపత్యముల్ చాలున్
బాధంబెట్టఁగ సన్నదమ్ములును పాపస్వాంతులందోడుగా...."[2]

అను పద్యము తెలియఁజేయుచున్నది.

దండక కర్తయగు ధూర్జటి తుదను వ్రాసినట్టి వాక్యమిది :

---

1. శ్రీ వేం. ప్రా. ప. సం. - తాళపత్ర ప్రతి నెం. 1977 రు.
2. ,, ,, ,, ,, నెం. 1523 న 93వదిగను, 1527న 96వదిగ నున్నది.

"మాధురీ సాధురీతిన్ .... జక్కయామాత్య నారాయణ
శ్రీ సుధీమాధవాఖ్యావనీ
దేవతా విశ్వనాథ ప్రధానేందు ప్రోలాంబికా పుత్రుఁడున్
ధూర్జటి ప్రాఖ్యుడున్" 1.

ఈ వాక్యమును బట్టియుఁ గవి ధూర్జటి యాశ్వాసాంతగద్య లందు "సింగమరమా నారాయణ జక్కయనారాయణ తనూభవ...." యని తెలిపికొని యుండుటంబట్టియు, జక్కయ తనయుఁడగు నారాయణునకిర్వురు పుత్రులనియు, వారు మన కవి ధూర్జటియు, సుధీమాధవుఁడు ననియు భావింపసగు చున్నది.

ధూర్జటి కవీంద్రుని వంశవృక్షమును లిఖించుచు విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు తమ 'భారతీవ్యాసముల'ను వ్యాససంపుటి[2] యందుఁ జూపిన దానిలోఁ బ్రధానముగ నొక పొరబాటు దొరలినట్లున్నది. 'ధూర్జటి మాత్రము సింగమ రమాజక్కయ తనూభవుఁడనని తన కాళహస్తి మాహాత్మ్యమునఁజెప్పికొని యున్నాఁ డ'ని యుట్టంకించి, ధూర్జటిని సింగమజక్కయల పుత్రునిగనే చూపించిరి. కవి ధూర్జటి స్పష్టముగాఁదన ప్రబంధాశ్వాసాంత గద్యలందు "సింగమ రమానారాయణ జక్కయ నారాయణతమాభవ...." యని పలికి యుండఁగా జక్కయ తమాభవునిగాఁదలంచుట పొరబాటు. అంతియగాక శ్రీ వేంకటేశ్వర్లుగారు కుమారధూర్జటి తండ్రియైన కాళయామాత్యునకే మన కవి ధూర్జటి తండ్రిగా నందుఁ జూపినారు. పరిశీలింపఁగా నిదియుఁ బొసఁగని యంశమే.

పై రీతి పలు విషయముల పరిశీలనానంతరము ధూర్జటి కవీంద్రుని వంశవృక్షము నీ విధముగా స్థిరీకరింపఁదగును.[3]

---

1. శ్రీ వేం. ప్రా. ప. సం. - తాళపత్ర ప్రతి నెం. 1977 రు.
2. భారతీ వ్యాసములు (1955 ప్రచురణ - పుట 152)
3. ఆం. క. త. సం. 7 - 253 పుట




ఇప్పటికి ధూర్జటికవీంద్రుఁడు శ్రీకాళహస్తిపురవాసియనియు, కృష్ణరాయలచేఁ జాల నన్నుతిగొని పాదనసుస్కృతులందియు శ్రీకాళహస్తీశునకే తన ప్రబంధ, శతకముల నంకితమొసఁగెననియు, నాతనికిఁ గుమారధూర్జటి, పౌత్రునకుఁ బౌత్రుఁడనియుఁ దేలినది.

ఇక ధూర్జటి పేరు :

లోకమున వ్యక్తులు వ్యవహారనామమున వ్యవహరింపఁబడుట యెక్కువ. తలిదండ్రులు నామకరణము నాఁడు బిడ్డలకు నక్షత్రనామము, మాసనామము, వ్యవహార నామములని మూఁడు రీతులఁ బేరుపెట్టుట సంప్రదాయము. 'వ్యవహారనామ' మనుట యందే లోకమున నేపేరఁ బిలువఁబడ నుద్దేశించిరో యా నామమని యర్థము. కాబట్టి వ్యవహారనామముననెక్కురు వ్యవహరింపఁబడుచుండఁ, గొందఱు గృహనామమున వ్యవహరింపఁబడుటయుఁగలదు. మన కవి 'ధూర్జటి'లోని 'ధూర్జటి' పదము వ్యవహార నామమా ? లేక యింటిపేరా ? యని పరిశీలించినపుడు కవిపేరు తరువాత నింటి పేరుగా నిలిచి పోయెనేకాని, కవీంద్రుని యింటిపేరు మాత్రమయ్యది కాదనియుఁదలంచుటకే యవకాశ మెక్కువ.

"వేంకటగిరి సంస్థానములో కారూరు, ధూర్జటి అమ్మపాళెము" అన్న గ్రామము లున్నవి. కారూరులో ధూర్జటివారని యింటిపేరుగల వారిప్పటికినున్నారు.... అన్న 1895 నాటి జ్ఞానప్రసూనమాలికా ప్రథమ ముద్రణమందలి పీఠికమదాహరించుచు, ధూర్జటి పూర్వులు 'ధూర్జటి అమ్మపాళెము' గ్రామ వాస్తవ్యులై యుందురనియు, ఈ గ్రామనామమే వారి యింటి పేరై యుండునినియు, ధూర్జటి తన యింటి పేరనే కృష్ణరాయల సభలో ప్రసిద్ధుఁడై యుండుననియు, నందుచేత అసలుపేరు విస్మృతమైయుండుననియు వేంకటార్యుఁడు కుమారధూర్జటిగా ప్రసిద్ధుడైనప్పుడు, ధూర్జటి, 'పెదధూర్జటి' అయ్యెననియు తలంపవచ్చును *" ఇది యాంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి ప్రచురణమైన శ్రీకాళహస్తిమాహాత్మ్య ప్రబంధ పీఠికాకర్తల యభిప్రాయము.

ఆయాకాలములందు వ్యక్తులు - ముఖ్యముగాఁ గవులు, సాహితీవేత్తలు— ఇంటిపేరున మాత్రమే వ్యవహృతనుగుటఁ గాదనలేము, శ్రీకృష్ణరాయల సభలోఁ బ్రసిద్ధినందిన తెలుఁగు కవులలోఁ గేవలవ్యవహారనామముల తోడనో, యింటిపేరుతోఁ గూడిన వ్యవహారనామముననో, ప్రసిద్ధినందుట కలదు గాని, కేవల మింటిపేరుననే ప్రఖ్యాతి నంచుటఁగాంచము.

* శ్రీ కా. మా. పీఠిక పుట - 9 మొదటి పేరా.

ఆల్లసాని పెద్దన — ఇంటిపేరుతోఁగూడిన వ్యవహార నామము.

నంది తిమ్మన — ఇంటి పేరుతోఁగూడిన వ్యవహార నామము.

మాదయగారి మల్లన — తండ్రిపేరుతోఁగూడిన వ్యవహార నామము.

'ధూర్జటి' యన్నది కూడ 'పెద్దన'వలెనే వ్యవహారనామమే యయి యుండవలెను గాని యింటిపేరు కాఁజాలదు. 'ధూర్జటి' యింటిపేరుగాఁ దరువాతఁ బ్రసిద్ధమయినది. మఱి 'ధూర్జటి' యింటిపేరేమి ? 'ధూర్జటి అమ్మపాళెపు' వాస్తవ్యుడు కాన నతఁడు గృహనామముననే ప్రసిద్ధుఁడయినాఁడనిన మాటనుఁ బరిశీలించుదము.

'ధూర్జటి అమ్మపాళెమ'ను గ్రామనామమునందే, 'అమ్మపాళెము * లనేకము లుండఁగా ధూర్జటి కవీంద్రుఁడు నివసించియున్నకారణముగా నయ్యది ధూర్జటి పేరనఁ బ్రసిద్ధమై యుండెనని భావింప ననువుపడుచున్నది. నెల్లూరు, చిత్తూరు మండలము లంచు 'కంద్రిక, అమ్మపాళెము'లనునవి పెక్కులున్నవి. వానిలో నొక్కొక్కదాని కొక్కొక ప్రత్యేకత, యచ్చట పేర్వడసిన వ్యక్తుల పేరుమీఁదగాని, యది యున్న మండలము, లేక క్షేత్రములవలన గాని. పొందుట కలదు.

అదియునుఁగాక యొకగ్రామనామ మింటి పేరుగా మాఱుపలో, మొత్తము పేరుండునేకాని, యేక దేశముగా వ్యవహారమున నుండుట కనము. దీనికి బలముగా నిచ్చట నొక విశేషముఁ బలుకఁదగును.

నేటి వ్యవహారమున నా గ్రామము కేవలము 'అంపాళెము'గా నిలిచెనే కాని మఱి యొక విధముగా గాదు. అనఁగా 'అమ్మ పాళెము' లందలి యాగ్రామమున తా నాఁడు 'ధూర్జటి' వసించినయని గాని, 'ధూర్జటివారు వసించిన' యనిగాని యర్థముతో వ్యవహారమై యుండెడి దనియు, నేఁడు పూర్తిగా నాయూర 'ధూర్జటి'వారు లేక పోయి కేవలము 'అంపాళము'గా మాత్రమే వ్యవహారము నిలిచెనని నేను స్వయముగా

---

* నెల్లూరు మండలమున రెండు అంపాళెములున్నవి:

అ - కాళహస్తినుండి వాయుడుపేట మార్గమున చిత్తమూరి దగ్గర నొకటి,

ఆ - కావలి సమీపమున గోపన్నపాలెము చెంతగా నొకటి.

ఈ యంశములను కాళహస్తియందుగల ధూర్జటి కామమ్మగారు తెలిపినవి

దెలిసికొనిన యంశము. కనుక నా గ్రామము ధూర్జటి కవీంద్రుని జన్మ స్థలమై యుండును. కవీంద్రుఁడుగాఁ బరమ భక్తుఁడుగా ప్రసిద్ధినందిన యా మహనీయుని చూచుకొని యా గ్రామము గర్వించి, యుప్పొంగి యుండును. పరిసర ప్రాంతముల వారి వ్యవహారమున నా గ్రామమునకు 'ధూర్జటి' కవీంద్రుని వలనఁబ్రసిద్ధి కలిగి యుండును. అనాఁటి నుండి యా గ్రామము 'ధూర్జటి' అమ్మపాళెముఁగా బేరొంది, చెన్నొందు దుండి యుండును. ధూర్జటి తన వ్యవహార నామమునసే రాయలయాస్థానము నలంకరించి యుండునని భావించుటయ లెస్స.

'ధూర్జటి' యింటిపేరుగా నాతని తరువాత వ్యవహారము కలుగగా, నా కవీంద్రుని యింటిపేరు విషయమున మాహాపోవుటకు వీలు లేసున్నది. మన తెలుఁగు దేశమున నేఁడు కవుల నామముల నింటిపేళ్ళగా వ్యవహారమున నున్నట్లు తెలియఁగలము. ప్రసిద్ధ కవులయిన వారిపేరున "శ్రీనాథుని, ఎఱ్ఱాప్రగడ, పోతరాజు" అను నింటిపేర్ల వారు కలరు. అందులో శ్రీనాథుని యింటిపేరేమొ తెలియరాదుగదా। అతఁడు పాకనాఁటింటివాఁడని భీమఖండమున (1 ఆ-23) పేర్కొనఁబడుటలో పాకనాఁటింటిపేరు గాదనియు, నది శాఖానామమే యనియు స్థాపింపఁబడినది* అనఁగా శ్రీనాథునింటి పేరు తెలియదుగదా।

ఎనుఁగు లక్ష్మణకవి తన యింటిపేరు 'ఏనుఁగు'గా మారినదనియు, నంతకుఁ బూర్వము 'పైడిపాటి' వారనియు స్వీయవంశవర్ణమునఁ బేర్కొనినట్లు 'ధూర్జటి' వంశీయులయిన తరువాత కవులెవ్వరు, నెచ్చటను, ధూర్జటికిఁ బూర్వమొక యింటిపేరున్నట్లు ట్టంకించి యుండలేదు. అన్నింటికిమించి, ధూర్జటి వేంకటరాయని 'కొల్చెద నస్మదీయ కులకర్తన్' (రత్నా. 1 ఆ-15 ప) యనిన వాక్యము వ్యక్తిపేరున తమ యింటిపేరు గలిగినట్లు సూచించుచున్నది గదా।

వ్యక్తినామములే నింటిపేరు గలుగుట తెలుఁగు దేశమున మిక్కిలి వాడుకలో నున్నది.

ఉదా॥ "రాచిరాజు, రామరాజు, తిప్పరాజు, అక్కినప్రగడ, రెబ్బాప్రగడ, పెద్దిభొట్ల, రాంభట్ల, భూపతిరాజు, రంగరాజు, భీమిరెడ్డి, గోపిరెడ్డి, గోపాళం, అనుమాలసెట్టి, పప్పుసెట్టి, రామినేని, నాగినేని, కామినేని" ఇత్యాది.

---

* శృ. నై. ప్రశంస - (వావిళ్ళ) పుట 24.

అనఁగా నాయా విశిష్టతలు, ప్రత్యేకతలు గడించిన వ్యక్తులను బట్టి యింటి పేరుగాఁ గల్గిన, యా మహావ్యక్తులకుఁ బూర్వపుటింటిపేర్లు వేఱయి యుండును. అవి విస్మృతములయి యుండును.

## ఫలితాంశము

ధూర్జటి కవికిఁగల వ్యవహారనామమే ప్రసిద్ధమయి, యింటిపేరు ప్రసిద్ధము గాక, యీ కవీంద్రుని తరువాత నా మహనీయుని తమవంశ కర్తగా భావించి యుండుటచే నాతని పేరునే తమ యింటిపేరుగా వ్యవహరించి యుందురనియు, 'కృష్ణరాయ కిరీటకీలిత మణిగణార్చిత పదాబ్జద్వయశ్రీ వహించి'న ధూర్జటి కవీంద్రుఁడే, 'కుమార ధూర్జటి' తాతకుఁదాతయై విలసిల్లిన వాఁడనియుఁ భావింపఁదగును.

## "ధూర్జటి" : కులము, గోత్రము

ధూర్జటికవీంద్రుఁడు కృత్యాదియందు స్వవిషయమును గూర్చి యేమియుఁ బలికి యుండ లేదు. ఆశ్వాసాంతములందలి గద్యములందైనఁ కులము, గోత్రము, సూత్రము లను గురించి యెట్టి ప్రశంసయుఁ జేసియుండలేదు. ఆ గద్యములందు 'ఇష్టదైవము' తలిదండ్రుల ప్రస్తావము మాత్రమే కలదు. శైవ కవి సంప్రదాయము ననుసరించి ధూర్జటి తన వంశవర్ణన కావింపలేదని యూహింపబడుచున్నది. కులగోత్రములను స్మరింపకుండుట, భక్తి గోత్రులమని తెల్పుకొనుట[1] శైవకవుల సంప్రదాయమై నట్లున్నది. ధూర్జటి వంశీయులగు తరువాతి కవులు తమ కులగోత్ర సూత్రములను స్పష్టముగాఁ దమ కృత్యాదులందుఁ బేర్కొని యున్నారు. అనఁగా వారు రచియించినవి శైవ పరములయినను, గాకున్నను బేర్కొనినారు.

ఇచ్చట నొక విచిత్రము గలదు. ధూర్జటి నామధేయుఁడైన కవియుఁ[2] దన 'శ్రీకాళహస్తీశ్వర దండకము'నందుఁ బితామహునకుఁ బితామహుని మందియుఁ

---

1 బసవపురాణము సంక్షిప్తము అవతారిక - పుట 6. 146-150 పంక్తులు

2. శ్రీకాళహస్తీశ్వర దండకకర్త - ధూర్జటికి సోదరుడైన సుధీమాధవుని మనుమఁడు.

దనవఱపఁగల పేళ్ళను దలఁచినాఁడేకాని కులగోత్రములను, సూత్రమునుఁదలఁపలేదు. అయిన నందలి "జక్కయామాత్య నారాయణ శ్రీ సుధీమాధవాఖ్యావనిదేవతా విశ్వనాథ ప్రధానీందు పోఁతిలాంబికా పుత్రుఁడన్" అను వాక్యమందలి 'అవనిదేవతా' శబ్దము బ్రాహ్మణుల సూచకముగను, "అమాత్య, ప్రధాని" శబ్దము లాసలమునందలి 'ఆఱువేల నియోగి' శాఖాసూచకముగనుఁ గనుపట్టుచున్నవి.

ధూర్జటి కవీంద్రుని మనుమని మనుమఁడైన[1] 'కుమార ధూర్జటి' తొలుదొల్తగా ధూర్జటిని కృష్ణరాయేంద్రాస్థానిగాఁ బేర్కొనుటయుఁ, దనకు ధూర్జటి కవీశునకుఁగల బాంధవ్యము నుగ్గడించుటయు, నందుఁ దన కులగోత్రాదికములను స్పష్టముగాఁ బేర్కొనుటయుఁ[2] బైనుడివిన దండకకర్త ధూర్జటి వాక్యములను బలపఱచునవిగా నున్నవి.

కుమార ధూర్జటి వేంకటపతి[3] కుమారుఁడును, 'కాళహస్తి స్థలమాహాత్మ్య' ప్రబంధ కర్తయునైన లింగరాజకవియు నాశ్వాసాంత గద్యమందుఁ దన తండ్రి పేరుమాఁ దలంచెనేగాని, తన కులగోత్రాదికములనుఁ బేర్కొని యుండలేదు. "....వినయగుణ బంధుర కుమార ధూర్జటి బిరుదు నామాంక వేంకటామాత్య తనయ నయవిరాజ ధూర్జటి లింగ రాజ కవి ప్రణీతంబైన కాళహస్తిస్థలమాహాత్మ్యం బను మహాప్రబంధంబునందు...."[4] అవతారికయందుఁ దన గోత్ర సూత్రములను, వంశము, తండ్రినామములనుఁ బేర్కొనియున్నాఁడు.[5]

---

1. ధూర్జటి కవీంద్రునకు, కుమార ధూర్జటికిఁగల బాంధవ్యము 'ఊరు, పేరు' అను నంశమున విపులముగాఁ జర్చింపఁబడినది.

2. కృ. రా. వి. - ప్ర. ఆ. ప. 28

3 & 5. లింగరాజు కవి - కా. స్థ. మా. 1ఆ - ప. 26

4. ,, ,, గద్య ,, - అంత

శ్రీ కాళహస్తీశ్వర సేవాన్విత చిత్త
చిత్తజాకార లక్ష్మీవిహార
రమణీయ శీల భారద్వాజ గోత్ర ప
విత్ర ఆపస్తంబసూత్ర మహిత
ధూర్జటివంశ పాథోధి చంద్ర కుమార
ధూర్జటినామ విస్ఫూర్జితాంక
స్తుతమతి వేంకటపతి తనూభవ లింగ
రాజకులేంద్ర ధైర్యాచలేంద్ర

పృథుల మందారమకరంద బృందనం
దమృత కల్లోల మాలికాయత విలాస
మధురతావాస్య రసధుర్య మాననీయ
నిత్య సాహిత్య ధౌరేయ నృపవిధేయ"" కా. స్థ. మా. 1 ఆ-ప. 26

లింగరాజకవి పుత్రుఁడును 'రత్నావళీ పరిణయ' ప్రబంధకర్తయునైన ధూర్జటి వేంకటరాయ కవీంద్రుఁడును దన ప్రబంధాశ్వాసాంతమునఁ దన కుల గోత్రాదికములనుఁ దెలిపి యున్నాఁడు. "ఇది శ్రీమత్కాళహస్తి పురాధ్యక్ష నిక్షేపితాక్షయ కటాక్ష వీక్ష సమాలబ్ధ సంస్కృతాంధ్రోభయభాషా చతుర్విధ కవితా విధాన వేంకటపతి ప్రధాని పౌత్ర శ్రీమదాపస్తంబ సూత్ర భారద్వాజ గోత్ర పవిత్ర ధూర్జటి వంశ పయఃపారావార సంపూర్ణ పూర్ణిమాచంద్ర లింగరాజకవీంద్ర తనయ విద్వజ్జన విధేయ వేంకటరాయ నామధేయ ప్రణీతంబయిన రత్నావళీ పరిణయంబను శృంగార ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము".

ధూర్జటి యింటిపేరుగల తరువాతి కవులు పేర్కొని యుండుటంబట్టి, మన కవి ధూర్జటి కులగోత్రములనుఁ దెలియఁగలుచు న్నాము.

ధూర్జటి పాకనాఁటూర్వేలనియోగి శాఖకును, ఆపస్తంబ సూత్రమునకును, భారద్వాజ గోత్రమునకుఁ జెందినవాఁడు.

---

x. వేంకటరాయకవి - ర. ప - 1 ఆ - అంతపద్యము.

## తలిదండ్రులు

ధూర్జటికవీంద్రుఁడు తన తలిదండ్రులనుగూర్చి, ప్రబంధమందలి యాశ్వాసాంత గద్యములందే[1] పలికియున్నాఁడు. తల్లి సింగమ, తండ్రి నారాయణుఁడు. తండ్రినామమునకు మున్నుగాగల 'జక్కయ', ధూర్జటి తాతపేరు. వ్యక్తులనామమును వ్యవహరించుటలోఁ దండ్రి పేరు జతచేయుట వాడుక యందున్నట్టిదియే. 'జక్కయనారాయణ'యనఁగా జక్కయ కుమారుఁడగు నారాయణుఁడని యర్థము. సర్వ సాధారణముగా నిట్లు తండ్రి పేరును జత చేయుటలో రెండు కారణములుండుచున్నవి. ఒకటి. కేవలము పితామహనామ స్మరణము సేయుట, రెండవది తండ్రి యట్లు వ్యవహరింపఁబడియుండుట. ఒకే పేరుగల వ్యక్తులొ వంశమున నున్నయప్పుడు స్పష్టతకొఱకు, పేరునకు ముందు 'పెద, చిన, కుమార' ఇత్యాది శబ్దములను చేర్చి పలుకుట కలదు. తండ్రుల పేర్లనుఁ జేర్చి పలుకుటయు నట్టిదే. నారాయణ శబ్దవాచ్యులు పలువురుండియుండి, ప్రత్యేకముగా నొకరి పుత్రుఁడవి స్పష్టముచేయుటకై 'జక్కయనారాయణ' యనునది వ్యవహార సిద్ధమై యుండి యుండనొప్పును. ఈ యంశమును దండక కర్తయగు ధూర్జటి కవియుఁ బేర్కొని యున్నాఁడు. "జక్కయామాత్య నారాయణ శ్రీసుధీమాధవాఖ్యావవిదేవతా విశ్వనాథ ప్రధానసీందు ప్రోలాంబికా పుత్రుఁడున్ ధూర్జటి ప్రాఖ్యుఁడున్‌జేసె"[2].

ఇచ్చట మనకొక సందేహము కలుగవచ్చును. అట్టితఁడి నా ధూర్జటి దండక కర్త తన వంశములో మిక్కిలి ప్రసిద్ధిఁగనిన మన కవి ధూర్జటి నేల ప్రశంసించి యుండ లేదనునది యది. ఈ దండకమునఁ 'గేవలమాతఁడు' తన తండ్రి, తాత, వాని తాతలనుఁ బేర్కొనుట కుదురునుగాని, పితామహుని సోదరుడైన వానినిఁ దలంచుట కవకాశము లేదు. అదియుఁ గాక తన దండకమునఁ బూర్వ కవిస్తుతి గాని, యన్యుల ప్రశంసకాని చేయవీలు లేకుండుట వలనను నట్లొనర్చి యుండఁ దగును. పూర్వ కవిస్తుతి చేయుచు నందుఁబ్రస్తావింపకున్న యెడల నది జ్ఞాతి వైర మని భావింపవలసి వచ్చెడిది. దండకము కావ్యమువంటిదికాక కృత్యాది లేకుండుటచే, దండకము తుదను మాత్రము తన తండ్రి తాతలనుఁ బేర్కొనుట సంభవించినది.

---

1. శ్రీ.కా.మ. నందలి యాశ్వాసాంత గద్యలు.
2. శ్రీ.కా.దం - శ్రీ వేం.ప్రా.ప.నం. నెం. 1977 రు గల తాళపత్ర ప్రతి

అనగాఁ దనవంశమున జక్కయ నుండియే పేరొక్కనఁదగినవ్యక్తి యుండియుండె నని యాతని భావముగా మనము గ్రహింపనగును.

కాన ధూర్జటికవీంద్రుని పితామహుఁడు 'జక్కయ' యని నిర్ధారింపఁబడినది. ఈ జక్కయ శబ్దముఁగాంచినప్పుడు 'విక్రమార్క చరిత్ర' ప్రబంధ కర్తయగు 'జక్కన' స్ఫురణకుఁ దగును. ఆ జక్కన తాత (తండ్రికిఁదండ్రి) పెద్దయామాత్యుఁడు. తిరుకాళచోదునిచే సన్మానితుఁడని యుండుటయు,[1] జక్కన తండ్రి యగు 'అన్నయ' తండ్రి పేరుతోఁగూడి 'పెద్దయ యన్నయామాత్యు'నిగా[2] వ్యవహరింపఁబడుటయు, ధూర్జటి తండ్రి నారాయణుఁడును 'జక్కయ నారాయణుడు'గా వ్యవహరింపఁబడుటను పపర్థించుచున్నది.

ఈ విధముగా తండ్రి పేరును జతచేసికొని యొకవ్యక్తి నామము వ్యవహృతమగుట కవిలోకమున మిక్కిలిగనే కలదు. ఉ॥ నాచన సోమన, మాదయగారి మల్లన ఇత్యాది. ఇట్టి వ్యవహారము నేఁటికిని తమిళ ప్రాంతమున సర్వసాధారణముగా నున్నది. ఉ॥ రామనాథన్ కృష్ణన్ మొ॥.

## వంశీయులు

తెలుఁగు సాహిత్యమునఁ గవిరాజులుగాఁ బ్రసిద్ధి బొందిన వారి వంశమునఁ బెక్కురు కవులు వెలయుట కలదు. 'తాతయొ, తండ్రియొ, కొమరుఁడొ, మనుమఁడొ' యను రీతిని, అన్నదమ్ముల బిడ్డల రీతిని, ప్రసిద్ధకవులకు వెనుక, తరువాతఁ గొందఱు కవులు వర్ధిల్లి యుండుట కద్దు. ఉదా॥ తాళ్ళపాక, వెన్నెలకంటి, పిడుపర్తి, తెనాలి, నుదురుపాటి కుటుంబము లిట్టి వంశములుగాఁ బేరెక్కినట్టివి.

అటులనే మన యాంధ్రకవి ధూర్జటి వంశమునఁ జక్కని చిక్కని ప్రబంధములు రచించిన కవీంద్రులింకను నలుగురు వఱకుఁ గన్పట్టుచున్నారు.

---

1. వి. చ. - జక్కన - I ఆ. ప. 20
1. వి చ. - జక్కన - 1 ఆ. ప. 21

ధూర్జటి కవీంద్రుని పుత్ర, పౌత్రులను గూర్చి తెలియ వచ్చుట లేదు. పౌత్రుఁడని తెలిపికొనిన కుమారధూర్జటి, కుమారుని కుమారుఁడు కాఁడనియు, మనుమని మనుమఁడనియు నిర్ధరించితిమి. పౌత్ర శబ్దమునకుఁ గేవలము పుత్రుని పుత్రుఁడనియే కాక, పుత్ర సంతతి యనియుఁగలదని నిఘంటువు[1]లు నంగీకరించిన విషయము. లోక వ్యవహారమున తాత తండ్రుల నుండి సంక్రమించిన యాస్తిని 'పిత్రార్జిత' మనుట కలదు. అనఁగాఁ దండ్రి సంపాదించినదియని మాత్రమే కాక, యాతని తండ్రిగాని, యాపూర్వమున నేతరము వారినైన నాసమానము తెలుపుచున్నది. అట్లే 'పౌత్ర'శబ్దమునకుఁ బుత్రుని తరువాత వంశములోని వారనియు నర్థము గ్రహింపఁదగును. ఇఁట పౌత్ర శబ్దమౌపచారికమే.

ఈ సందర్భమున నొక విచిత్రమగు వాదము కనుపట్టు చున్నది. ధూర్జటి కవీంద్రునకుఁ బుత్ర సంతతిలేదు. దౌహిత్రుఁడు మాత్రము కలఁడనుట యావాదము[2]. వారు తమ వాదమున కుపబలకముగా మూఁడు కారణములనుఁ బలికి యున్నారు.

1. కృష్ణరాయ విజయకర్త వేంకటార్యుఁడు ధూర్జటి కవీంద్రుని తనకు ''పెదతాత'గా బేర్కొనెను.
2. కుమార ధూర్జటి మనుమఁడగు వేంకటారాయ కవి ధూర్జటి కవీంద్రుని తన ప్రపితామహునిగ జెప్పలేదు.
3. పుత్రసంతతి లేని కారణముననే ధూర్జటి జ్ఞాతిద్రోహులను పేర్కొని వారి వలన బాధపడినట్లు శతకమునఁ బలికి యుండెను.

ఈ వాదమున కిట్లు సమాధానమీయఁదగును.

1. కుమార ధూర్జటి ప్రయోగించిన ''పెదతాత' యనుటలోఁ 'దండ్రి తండ్రికి 'యన్న' యని భావించుట వలన నీ ప్రమాదము సంఘటిల్లినది. పెదతాత యనఁగా 'తాతకుఁదాత' యను నర్థము సంగ్రాహ్యమని భావించితిమి కాన నా ప్రమాదము నివారితమగు చున్నది.

---

1. సర్ మోనియర్ విలియమ్స్ సంస్కృత-ఆంగ్ల కోశము-పుట 651.
2. శ. నా. న. వే. వెం. కృ శ. పుట - 117



2. 'వేంకటరాయఁడు ధూర్జటిని ప్రపితామహుఁడని చెప్పఁడనలేదు' అన్న వాక్యమున వేంకటార్యుని ప్రపితామహ శబ్దమే యర్థమున నుపయుక్తమయ్యెనో యూహించిన నదియు నిట్టే తేలిపోవును. ప్రపితామహుఁడనఁగా తండ్రి తాతయని భావించి నప్పుడు వారట్లు ప్రయోగించి యుండరు. ఏలన వేంకటరాయని ప్రపితామహుఁడు కాళయామాత్యుఁడని స్పష్టముగాఁ దెలిపిన విషయము.[1] ప్రపితామహ క్రమములోఁ బూర్వతరములలోఁ గడు పూర్వుఁడని కదా తెలియనది. ఆ యర్థమిచ్చునదియే 'పెదతాత'.

3. జ్ఞాతినింద యొనర్చుటకుఁగల కారణమునిట్లు భావింపఁదగును. పుత్ర సంతతి కల్గుటకు మున్న 'కొడుకుల్ పుట్టరటంచు'[2] నేడ్వఁబనిలేదని యూరడిల్లి, యప్పట్ల జ్ఞాతులవలనఁ బొందిన కష్టములఁ దలంచుకొని యట్లు పలికి యుండును. ఆమీఁదట బుత్ర సంతతి పొందియే యుండును. లేకున్నఁ గుమార ధూర్జటి 'పౌత్ర' శబ్ద ప్రయోగమున కాస్కారమెట్లుండును? కాన ధూర్జటికిఁ బుత్రుఁడు, పౌత్రుఁడును గల్గియే యుండినను, వారు ప్రసిద్ధులయి యుండరని భావింపనగును.

ధూర్జటి కవీంద్రుని తరువాతఁ బ్రసిద్ధులై, కబ్బములఁజెప్పిన వారు నలుగురును, నాతని దౌహిత్రుఁడగు నతఁడొకఁడును గనుపట్టుచున్నారు.

వారు :-

ధూర్జటి (వేంకటపతి) వేంకటార్యుడు :

ఇతడు 'కృష్ణరాయ విజయము, ఇందుమతీపరిణయము'లను రెండు పద్య గ్రంథములను రచించిన వాఁడు. ఆరవీటి చిన వేంకటరాజు వాస్థానమున నెగడిన వాఁడీ 'కుమార ధూర్జటి'[2]. ఇది యాతని బిరుదాంకము. తొలుదొల్తగాఁ గృష్ణ రాయల యాస్థానమున ధూర్జటి కవీంద్రుఁడు సన్నుతుఁడయ్యెనన్న విషయమును గ్రంథస్థముఁ జేసినవాడు[4]. శ్రీ కృష్ణరాయల విజయముల నేడు చారిత్రకాంశము లకుఁ దొలుదొల్తగాఁ గావ్యరూపమిచ్చిన వాఁడు. చిత్ప్రసూనాంబకా శ్రీకరాను గ్రహాసాదిత కవితారసజ్ఞ హృదయుఁడై తన కావ్యమును 'సారరచనాధురీణుఁడై నిర్మించెను.

---

1 కృ. వి-1ఆ-ప. 23వ 2. శ్రీ. కా. శ. - ప. 28

3. కృ.వి.-1ఆ - ప. 23 మఱియు లింగరాజకవి-కా. స్థ. వరా. 1ఆ-ప.26

4. కృ.వి.-1ఆ -ప.229

కవికుల గురువు, 'కవీనాం కవిః' యయిన కాళిదాసుని రఘువంశము నందలి ఐదారు సర్గలందలి కథామసరణముగాఁ గొంత పెంపుదలతో నిర్మింపబడినట్టి దీతని 'ఇందుమతీ పరిణయ' ప్రబంధము. ప్రతి పద్య చమత్కృతితో నలరారు నీ ప్రబంధము 'కింకవీంద్ర ఘటా పంచాననులు, శతావధానులు' నయిన శ్రీ తిరుపతి వేంకట కవుల పరిష్కరణముతో ముద్రితమైనది.1

ధూర్జటి లింగరాజ కవి :

'ధూర్జటి వంశ పయః సారావార సంపూర్ణ పూర్ణిమాచంద్రుఁ' డితఁడు[2]. శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా కాళహస్తీశ్వర కరుణాకటాక్షవీక్షణా సాధిత సార సాహితీ ధౌరేయుఁడ'తఁడు[3]. ఇతడు 'కాళహస్తి స్థలమాహాత్మ్యమును'గూర్చెను. 'లింగరాజు తాను శివరహస్యమాధారముగా బందెర్మిండాశ్వాసముల పెదకాళహస్తీశ్వర మాహాత్మ్యమును రచించితిననియు జెప్పియుండెను.[4]" ఈ వాక్యములందలి యర్థమునసే పెక్కురు పెదకాళహస్తి మాహాత్మ్యనియు, నది పందెర్మిండాశ్వాసముల ప్రబంధమనియుఁ బేర్కొనుట జరుగుచున్నది. ఆ ప్రబంధము పేరు తాళపత్ర ప్రతిలో[5] లింగరాజకవి కృత్యాది పద్యంతముల తరువాత "నా యొనర్పంబూనిన కాళహస్తి స్థలమాహాత్మ్యంబను మహాప్రబంధంబునకు కథా సంవిధానంబెట్టిదనిన[6]" ననియు, నాశ్వాసాంత గద్యయందు "....నయరాజ ధూర్జటిలింగరాజకవి ప్రణీతంబైన కాళహస్తిస్థలమాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు .. .ప్రథమాశ్వాసము" ఇత్యాదిగాఁ బలికియున్నాఁడు. కనుక లింగరాజకవి రచించిన ప్రబంధము 'పెదకాళహస్తీశ్వరమాహాత్మ్యము[7] కాని, 'పెదకాళహస్తి మాహాత్మ్యము[8]' కాని కాదనియు 'కాళహస్తిస్థలమాహాత్మ్యమ' నియుఁ దెలియుచున్నది.

---

1. భారతి – మే-.969 'ఇందుమతీ పరిణయము–కొన్ని సందేహములు' (కలగూరగంప–69-71 పుటలు శ్రీ చింతలపాటి నరసింహదీక్షితశర్మ).
2. ర.వ.1ఆ.అంత గద్య, 3. కాస్థమా – 1ఆ–అంతగద్య
4. వేం. వ్రి. పీఠిక– అధస్సూచిక – శ్రీచిలుకూరి – పుట–9.
5. వేం. వ్రి. ప్రా.వ.సం–యందు నెం.7330 దు గలప్రతి 6.కా.స్థమా–1ఆ
7. వేంవ్రి. పీఠిక–6వుట, 8. శ్రీ.కా.మా. అం.ప్ర.సా.అ.పీఠిక19,20పుటలు.

తన కథా వస్తువున కాకరముగ లింగరాజు, తన ప్రబంధముననే శివరహస్య సంగ్రహమను నితిహాసమని పేర్కొని యున్నాడు.[1] సంస్కృతమున నూట యిరువది యధ్యాయముల గ్రంథము కలదనియుఁ దత్కథనుఁ దెనుఁగున గృతి చేయుమనియుఁ గృతిపతి యగు దామర అక్కభూపతి కుమారుఁడు వేంకటపతి కోరినట్లున్నదే కాని, లింగరాజు తనకుఁ దామగాఁదన ప్రబంధమును పంద్రెండాశ్వాసములుగల దానిగా వ్రాయుదునని తెలిపినట్లు కానరాదు[2].

(నేఁడు లభించుచున్న గ్రంథమున నెనిమిదవ యాశ్వాసమునఁ గొంతవఱకు మాత్రమే కలదు. ఉదాహరించిన తాళపత్ర ప్రతియందు మొత్తము 244 ఆకులు గలవు. అందెనిమిదవ యాశ్వాసము 131 ఆకున ప్రారంభమైయున్నది. ఇంకను 63 ఆకులున్నవి. అనగా నెనిమిదవ యాశ్వాసము ముగియనున్నట్లున్నది. ఒక్కొక్క యాశ్వాసము దాదాపుగా 25-35 ఆకుల నడుమనేయున్నది. ఎనిమిదవ యాశ్వాసమే మిక్కిలి పెద్దదిగా గనఁబడుచున్నది.)

లింగరాజు 'మందార మూరంద బృందనిదానామృత నిర్ఝరీరుచిర వాగ్ధారాళ శబ్దైక గుంభన గంభీర కవిత్వ వైభవ ఘనుఁడు[3]'. కృతిపతి కోరినట్లు 'ద్రాక్షారసోర్మికా పరిపాక విస్ఫూర్తి పరిఢవిల్లు' నట్లుగను, 'శబ్దచమత్కృతి బుధకోటి మదిం గణించు' నట్లు[4]గను 'కాళహస్తి స్థలమాహాత్మ్యము'ను ప్రబంధమును రచించెను.

ఈ ప్రబంధము కాక లింగరాజకవి మఱికొన్ని కృతులు రచించినట్లు తెలియుచున్నది.[5] రమావ్రత చరిత్ర, కవేరజామహత్వము, మణిమంటప ప్రభావములను నవియు, 'శతకముల్' కూడ నున్నవనియు, కృతిపతి పలికినట్లున్న కవివాక్యమే తెలియఁజేయుచున్నది. లింగరాజకవి తన ప్రబంధమున ధూర్జటి కవీంద్రుఁడు షడధ్యాయి కథనాధారముగ దెనుఁగుఁన గావ్యము రచించెననియు నాతనిని 'పెదధూర్జటి'గాఁ గృతిపతిచేఁబలికించినాఁడు.[6]

---

1. కా. స్థ. మా. 1ఆ. ప 29
2. కా. స్థ. మా. ఆ°-ప 30
3. కా. స్థ. మా. అ1. ప 25
4. కా. స్థ. మా. 1అ-ప. 30
5. కా. స్థ. మా. 1అ-ప. 27
6. కా. స్థ. మా. 1ఆ-ప. 28

ధూర్జటి వేంకటరాయకవి :

లింగరాజ కవి కుమారుఁడు, 'కుమారధూర్జటి' మనుమఁడైన వేంకటరాయ కవి 'రత్నావళీ పరిణయము'ను శృంగార ప్రబంధముగాఁ గూర్చెను. చేకూరి రామ స్వామి మంత్రిమణి కంకితముగా దీనిని రచించెను[1]. ఇతఁడు 'శ్రీకాళహస్తి పురాధ్యక్ష నిక్షేపితాక్షయ కటాక్ష వీక్షా సమాలబ్ధ సంస్కృతాంధ్రోదయ భాషా చతుర్విధ కవితా విధానుఁ[2]డై' 'మృదువాక్యనిరూఢితోఁ[3]' రత్నావళీ కన్యకాపరిణయ ప్రబంధమును రచించెను. బాల్యముననే శతకములను, దండకములను[4] రమణీయముగఁ జేసి యమరమునంతయు భవ్యమైన యాంధ్ర భాషలోఁ బద్యకావ్యముగాఁ[5] గూర్చి మన్ననలందినాఁడు.

ధూర్జటి ; (దండకకర్త)

కవి ధూర్జటి సోదరుఁడయిన సుధీమాధవుని మనుమఁడీతఁడు[6]. ఇతఁడు శ్రీకాళహస్తీశ్వర దండకమును రచించెను. తన వంశమందలి పూర్వులను తాతకుఁ దాత వఱకును బేర్కొనినాఁడు. ఇందలి కథాంశము మన కవి ధూర్జటి 'శ్రీకాళహస్తిమాహాత్మ్య' ప్రబంధమందలి వేశ్యాతనయల గాథలోని కథాంశములకుఁ గొంత చాయవలెనుండును. వేశ్యమాతకూఁతులకుఁ జేసిన బోధవంటిదే యుండును. వేశ్యమాత; ఈశ్వరుని తప్ప నొరులను ప్రేమింపనని కూఁతునకు బోధ చేయును. శబ్దాలంకారములతోఁ గూడి చమత్కారావహముగ నుండును.

"మాధురీ సాధురీతిన్ రచించెన్ ప్రియావల్లకీభాతిఁ జేతోభవారాతిపై మాత్మ శృంగార మోదండకం బాంధ్ర భాషా కవిగ్రామణీన్ జక్కయామాత్యనారాయణ సుధీమాధవాఖ్యావనిదేవతా విశ్వనాథ ప్రభాసేందు స్రోలాంబికా పుత్రుఁడున్ ధూర్జటి ప్రాఖ్యుడున్ ।"

1. ర.ప. 1 ఆ - గద్య
2. ,, ,, ,,
3. ,, ,, ప. 26
4. ర.ప. - 1 ఆ - ప. 21 25
5. ,, ,, ప. 24
6. శ్రీ.కా.దం.తుదను గల వాక్యము శ్రీ.వేం.ప్రా.ప.సం.నెం. 1977రు.

చెఱుకుమూడి కృష్ణకవి :

ధూర్జటి కవీంద్రుని కితఁడు దౌహిత్రుఁడు. 'శృంగారరాఘవము, వామదేవ చరిత్రము'లను గ్రంథములను రచించెను.[1]

## గురువు - దైవము

### శ్రీకాళహస్తి పతియే గురువు, దైవము :

శ్రీకాళహస్తిమాహాత్మ్య ప్రబంధమునఁ గవి ధూర్జటి 'ఇష్ట దేవ సమారాధన' మాచరించి, తన కృతి కన్యారత్నమునకు విద్యాపారంగతుఁడైన వరునిఁ బరికించినాఁడు[2]. చేతోగమ్యుండగు శ్రీకాళహస్తిపతిని నాథునిఁగా సమర్థించఁ[3]గా మహా దేశిక సార్వభౌముఁడు[4] మదింబ్రమదంబు వహించి, ధూర్జటిని మెచ్చుకొనినాఁడు. అనుపమ కరుణాపవననిధియయిన గురుఁ[5] డ'ను గ్రహించినాఁడు.

ప్రబంధమున మఱి యెచ్చటను గురు ప్రశంస లేదు. దేశిక శబ్దము మఱి యొక్క తావున భంగ్యంతరముగా సూచ్యమయినది. 'దివ్య దేశిక హంసోపదిష్ట' మార్గా...'[6] పైరెండు తావులందును 'మహా దేశిక సార్వభౌముఁడు', 'గురుఁడు' అను శబ్దముల వలన ధూర్జటి గురు ప్రశంస గావించినట్లూహింపఁబడుచున్నది[7]. ఈ రెండును గురుదేవుని స్మరించుచు, నా మహనీయుని పేరు పేర్కొనకుండుట విచిత్రమే గదా ! మన కవుల సంప్రదాయమున నిష్టదేవతా స్తుతి, గురుస్తుతి, సుకవి పురస్కృతి, కుకవి తిరస్కృతి యను క్రమమున కృత్యాది నిర్వహించుట కలదు. అన్నియెడ లను గురు నామమును పేర్కొనుట కలదు.

---

1. భా.వ్యా.బు.వెం. పుట 152 అండ్ శ.వా.న. పుట 117
2. శ్రీ.కా.మా. 1 ఆ - 6 ప.
3. ,, ,, ,, 7 ప.
4. ,, ,, ,, 8 ప.
5. శ్రీ.కా.మా. ఆ 1 - 9 ప.
6. ,, ,, ,, -17 ప.
7. ,, ,, ,, పీఠిక - 8 పుట

వప కవులలోఁ బ్రధానుఁడుగా బరిగణింపబడునట్టియు, కులగోత్రములను బలుక నిచ్చగింపనట్టి వాఁడునైన సాంబున కతని సోమన తన బసవపురాణమున గురుస్తుతి యందిరువురు గురువులను సంపూర్ణ నామములతోఁ బేర్కొని యున్నాఁడు.

'ఖ్యాత సద్భక్తిమైఁ దల కట్టుకురి
ఘోతి దేవర పదాంబుజ షట్పదుండ
సత్కృపాత్ముఁడగు కరస్థలి విశ్వనాథు
ప్రకట వర ప్రసాద కవిత్వ యుతుఁడ' *

మఱి ధూర్జటి కవీంద్రుఁడు గురుని స్మరించి, యా మహనీయుని నామమును స్మరింపక విడుచునా ? అట్లు భావింప వలను పడదు. అట్టితఱి నీ 'మహాదేశిక సార్వ భౌమ', 'దివ్య దేశిక హంస' శబ్ద వాచ్యులెవ్వరని పరిశీలింప వలసియున్నది. ధూర్జటి జీవితముఁ బరిశీలించి నప్పుడు ధూర్జటికి సర్వము శ్రీకాళహస్తిపతియే కాని తదితరము కాదని తెలియఁగలము. ప్రబంధము, శతకముల నీదృష్టితోఁ బరికించి నచో, ధూర్జటికవీంద్రునకు గురుఁడు, మహాదేశిక సార్వభౌముఁడు సాక్షాచ్ఛ్రీకాళ హస్తి పతియే.

జగద్గురు ఆది శంకర భగవత్పాదాచార్యులు పలికిన

'వటువిటపి సమీపే భూమి భాగే నిషణ్ణం
సకల మునిజనానాం జ్ఞానదాతార మారాత్
త్రిభువన గురు మీశం దక్షిణామూర్తి దేవం
జనన మరణాది దుఃఖచ్ఛేద దక్షం నమామి'.
'చిత్రం వట తరోర్మూలే వృద్ధా శ్శిష్యా గురుర్యువా
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్న సంశయాః
'మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వయువానమ్
వర్షిష్ఠాన్తే వసదృషిగణైరావృతం బ్రహ్మ నిష్ఠైః
ఆచార్యేన్ద్రం కరకలిత చిన్ముద్రమానన్ద మూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే'.

* బ. పు. సంక్షిప్త - పుట 6 - 155 - 158 పంక్తులు

అన్న దక్షిణామూర్తి స్తోత్ర శ్లోకములను దెనుఁగుఁజేసి 'ఆచార్యేష్టు'[1]ని స్మరించుకొనెఁ యనిపించును. ఈశ్వరుని మహోపదేశకునిగా, గురుపాదులుగా గ్రంథాంతరముగఁ దేర్కొనిన తావు లనేకములు ప్రబంధమునఁగలవు. వశిష్ఠుఁడు తపమాచరింపఁగా మెచ్చి ప్రత్యక్షమైన పరమేశ్వరుని వశిష్ఠుఁడు కోరిన రెండువరములలో మొదటిది 'చిన్మయాకృతిఁ జూపి'[1] 'బ్రహ్మవిద్యాదన భిక్ష నాదు హృదయంబను పాత్రమునందుఁ బెట్టవే'[2] యనునది. దానిని తీర్చుటకుఁ బరమేశ్వరుఁడు,

'యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మాన మే వాద్వయం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే'

యన్నట్లు దక్షిణామూర్తి రూపమునఁ బ్రత్యక్షమై[3], యా వశిష్ఠునకు సంహృతాద్యంతంబైన రహస్యమును దెలిపినాఁడు[4]

అటులే బ్రహ్మ తపమాచరింపఁగాఁ బ్రత్యక్షమై, సుపుత్ర జననమున కాచరింప వలసిన వ్రతముపదేశించి, బ్రహ్మకుఁగలిగిన బిడ్డనికి బ్రహ్మ ప్రార్థనపై మరలఁబ్రత్యక్షమై 'ఋభు' వను నామకరణము చేయననుగ్రహించి, బ్రహ్మకు 'అపగ్రహరహితంబను గలుషాహితంబునునైన బ్రహ్మోపదేశంబు సేసి యంతర్హితుఁడయ్యెను.[5] ప్రబంధమున మఱియొక తావున నిట్లే పరమేశ్వరుని గురునిఁగాఁ జిత్రించిన విధముఁ జూడఁగలము.

వేశ్యాకన్యలను దొంగల బారినుండి రక్షించుటకు జంగమాకారమున వచ్చి పూజఁగొని, వారికి 'ఆత్మవిద్య యుపదేశంబిచ్చు వ్యాజమున[6] వారిని రాగమూకలి నొసచ్చి పోయెడి వాఁడఁట. అర్జునునకుఁ బరమేశ్వరుఁడు పాశుపతాస్త్రోపదేశము చేయనే చేసినాఁడు గదా ![7]

1. శ్రీ. కా.మా. 1 ఆ. 83, 84 ప.
2. ,, ,, ,, 82, 83 ప.
3. ,, ,, ,, 86 ప.
4. శ్రీ కా.మా - 1 ఆ 88 ప.
5. ,, ,, 2 ఆ-88 వచనము.
6. ,, ,, 4 ఆ - 68 ప.
7. శ్రీ కా.మా. 4 ఆ - 197 ప.

ధూర్జటి యాశ్వాసాంత పద్యములందు పరమేశ్వరుని సంబోధించుటయందు 'తారకాక్షర మహోపదేశప్రదా[1]' 'వటక్షమాజవాస[2]' యనియు నా వరదేశికోత్తంసుని, దక్షిణామూర్తి స్వరూపుని స్మరించి వందన మిడినాఁడు. ధూర్జటి వ్యక్తిత్వమునకు దర్పణమనఁదగిన 'శ్రీకాళహస్తీశ్వర' శతకమున తనకు 'వాహోఁగ్రై భవదీయ దివ్య చరితల్ వ్రాయన్నియోగించి'[3] నది శ్రీకాళహస్తీశ్వరుఁడేయని పేర్కొని యున్నాఁడు.

ధూర్జటి వంశీయులకెల్లప్పుడును సద్విద్యామహిమ యొసఁగినవాఁడు శ్రీకాళహస్తిపతియే యని కుమార ధూర్జటి వాక్యముగూడ నీయంశమును బలపఱచుచున్నది.[4]

తన కృతికన్యకుఁ దగిన వరుని విచారించి, మనమునఁ బరిశీలించి, యీశ్వరునకు మించి మఱియెవ్వరును లేరని నిర్ధరించి యా 'శుభకావ్యరత్నమున కీశు నధీశుఁ జేసినన్' 'మహాదేశిక సార్వభౌముఁడు మదిం బ్రమదంబు' నందినాఁడు. ఈవాక్యముఁ బరిశీలించిన, తాను ముందుగా మనసులో నెంచుకొన్న కృతిపతిని గురుదేవునకు - ఈశ్వరుఁడు కాక యన్యుఁడైనచో' - తెలిపి యాతని యనుమతిఁబొంది, తరువాత నీశ్వరునిఁ గృతినాయకునిగాఁ జేసి యుండును. అటుల కాక యీశుని తన కృతికన్యకధీశునిఁ జేసిన విషయముఁ దెలిసి, యా తరువాత నా గురుదేవుడు ప్రమదము వహించుట యొక్కవిధముగా నపక్రమమే యగును. కృతిపతిఁగాఁదనను సమర్థించుకొనిన ధూర్జటిని, పరమేశ్వరుఁడే మెచ్చుకొని యనుగ్రహించినాఁడను భావమే పరిగ్రాహ్యము వలెఁ దోఁచుచున్నది.

---

1. శ్రీ. కా. మా. 1 ఆ - 162 ప.
2. శ్రీ. కా. మా. 4 ఆ - 206 ప.
3. శ్రీ. కా. శత 86 ప. తాళపత్ర ప్రతి నెం. 1523
4. కృ. రా. వి - 1 ఆ - 5 ప.

ఈ సందర్భమున నన్నెచోడకవి గురుస్తుతి, ప్రశంస, అంకితములను బరికింపఁ దగును.

గురువున కిష్టదైవమునకుం బతికిన్ గృతి జెప్ప పుణ్యమున్
వరమును దేజమున్ బడయవచ్చు జగంబుల నిశ్చయంబు మ
ద్గురువును నిష్టదైవమును గూర్చు నిజేశుఁడుఁ దాన నాకుఁ గా
కొరునకు నిట్లు సేకుఱునె యొక్కట లాభము లెన్ని యన్నియున్

కుమార సంభవము – 1 ఆ. – 50 ప.

అట్టి యదృష్టమే మన యాంధ్రకవి ధూర్జటికినిఁ గలిగినది.

ఈ యన్ని యంశములను బాగుగాఁ బరిశీలించినపుడు, ధూర్జటి కవీంద్రుఁడు స్మరియించిన మహాదేశిక పార్వభౌముఁడు, గురుఁడు సాక్షాచ్ఛ్రీకాళహస్తి పతియే యని భావింప ననువు పడుచున్నది.

ఇక ధూర్జటి కవీంద్రుని యిష్టదైవము విషయమునఁ బ్రత్యేకించి పరిశోధించి, పరిశీలించి, పలుకవలసిన యవసరము మనకు లేదు. కవీంద్రుఁడే స్వయముగాఁ బ్రబంధాదిని 'శ్రీవిద్యానిధియై...........' అను పద్యమునను[1], గృతిపతిగా సమర్పించుట వలనను[2], షష్ఠ్యంతములవలనను[3], కథానాయకుఁడు, కథకుడు శ్రీకాళహస్తి పతియే యగుట వలనను, ధూర్జటి కవీంద్రుని యిష్టదైవము, ప్రబంధాశ్వాసాంత గద్యమునఁ బలికి యుండినట్లు శ్రీకాళహస్తీశ్వరుడుఁడేయని నిరూపితమగుచున్నది.

—)o(—

1. శ్రీ.కా.మా. – 1 ఆ. – 1 ప.
2. శ్రీ.కా.మా. – 1 ఆ. – 10 ప.
3. శ్రీ.కా.మా. – 1 ఆ. – 11 – 15 ప.

మతము :

# ధూర్జటి శివాద్వైతి

ధూర్జటి కవీంద్రుని వ్యక్తిగత మతవిశ్వాస మెఱుంగుట కాతని ప్రబంధము, శతకములు రెండును ప్రబల సాక్ష్యములు. ఇవి గ్రంథస్థాధారములు. ఇఁక నితరు లయిన కవులు పలికిన పలుకులు, చాటువు లిత్యాది గ్రంథేతరాధారములు.

గ్రంథస్థాధారములు—ప్రబంధము :-

ఇష్టదేవ సమారాధమున ధూర్జటి, ఈశ్వరుని, జ్ఞానప్రసూనకలికను, భైరవుని, దుర్గను, గణపతి[1]ని స్తుతించియున్నాడు. ఇతర దైవ ప్రస్తావమే చేయలేదు. తన కృతి, కన్యకా రత్నమును కథినాథునిగా దేవోత్తముఁడైన యీశ్వరుని 'అనుభవ గోచరుని సమర్పించి యున్నాడు[2]. షష్ఠ్యంతములం దు, నాశ్వాసాదులందు, నాశ్వాసాంత పద్యము లందు ధూర్జటి యీశ్వరుని సంబోధించుచు వర్ణించి యున్నాఁడు. శ్రీకాళహస్తి పుర వర్ణనముఁ గావించుచు 'దివ్యదేశిక హంసోపదిష్టమార్గ నిర్గుణ ధ్యాన సంధాన నిరుప మాన సౌఖ్య సంపత్తి సాధక జన నివాసము'గా దానినిఁ బేర్కొనుట యందుఁ దా వా మార్గమున పరమేశ్వరు నారాధించినట్లు స్ఫురింపఁజేసి యున్నాఁడు. పుర వర్ణన మునఁ బురము, తోటలు, పురభోగజనుల లీలారతి, దాసివిలాపము, చంద్రోదయ వర్ణనము, తిన్నని తల్లి తండ్రి గుర్వింణ్యవస్థాచిత్రణము, తిన్నని జననము, పురిటి చర్యలు, వేశ్యాకన్యల పయోఽగుణ్య లావణ్యోదయ వర్ణనము, సూర్యాస్తమయము చంద్రోదయము, కాముఁడు కాములను వర్ణింపుటలు, ధూర్జటికిఁగల శివ పారమ్యతనుఁ జాటునవి.

శ త క ము

శతకమున నెల్లెడ ధూర్జటి కవీంద్రుని శివ పారమ్యతనుఁ జూడఁగలము. పై సుటంకించిన తాపులన్నియు ధూర్జటి శివభక్తుఁడని తెలియజేఁజేయునట్టివి. శివ భక్తులలో పలురీకుల వారున్నారు. వీరశైవులు, ఆరాధ్యులు, శివాద్వైతులు మున్నగు

1. శ్రీ.కా.మా. 1 ఆ—1-5 ప.
2. శ్రీ.కా.మా. 1 ఆ—10 ప.

రీతులు కలవు. ధూర్జటి యీ రీతులలో నేదానికిఁ జెందిన వాఁడని యూహించుటకు నాకవీంద్రుఁడు నిర్మించిన ప్రబంధమెక్కుఁడుగఁ దోడ్పడుచున్నది. ప్రబంధమందలి పాత్రనిర్మాణము, సన్నివేశ కల్పనలంతఁ బ్రతిపాదింపఁబడు విషయము తథా సందర్భమునకు, తత్తత్పాత్రలకు సంబంధించినవి యగుటచే వానిని కవి వ్యక్తిగత విశ్వాసములనియె సిద్ధాంతమనియె నిర్ధరింపఁజాలము. ఆయాపాత్రల చిత్రణము నందుఁగొన్నియెడల వ్యాఖ్యా ప్రాయముగా గనుపట్టు పట్టులను, కొన్ని కొన్ని యవస్థా చిత్రణములందును, పరమేశ్వరుని స్వరూప స్వభావములను వ్యాఖ్యానించు నపుడును, అశ్వాసాద్యంతములందును, కవి వ్యక్తిగతాభిప్రాయములు వ్యక్తమగు చుండును. శివార్చనమునఁ బ్రాణము లర్పించుటకైన సిద్ధపడిన యైదుగురు భక్తులకును- శ్రీ, కాళ, హస్తి, తిన్నఁడు, హరద్విజుఁడు — తన నర్చించి తపమాచరించిన యితర భక్తులకును, నిజదారపుత్ర భక్త భృత్య గణములతోడనే పరమేశ్వరుఁడు సాక్షాత్కరించినాఁడు- ఈశ్వరుఁడు పార్వతితోఁగూడి విహరించుట, బ్రహ్మాదులు కొలువున్న సోముని జూడనేగుట, శ్రీకాళహస్తుల పూర్వజన్మలయందు పరమేశ్వరుఁడు సోముఁడై కొలువు చేయుట, శాంబరీ కిరాత దంపతులుగా నర్జునునకుఁ గన్పట్టుట లిట్టివే. శివుఁడు వ్యక్త-స్థూల-రూపమున వర్ణింపబడుట వీరశైవము కాదు. ఈశ్వరుని లింగరూపముననే కాక సాకారముగ వర్ణించుట, శివద్విజ, హరద్విజులను చిత్రించుట వలనను ధూర్జటి వీరశైవుఁడు కాఁడని తెలియఁగలము.

లింగధారణము, విభూతి రుద్రాక్షధారణము, గురుదీక్ష, భవపరాఙ్ముఖత్వము, శివార్చనము అనునవి శైవమున సర్వసాధారణ లక్షణములు. ప్రబంధమున స్వీకరించిన శివభక్తుల గాథలు కొన్ని వీరశైవమునకుఁ, గొన్ని సామాన్య శైవమునకుఁ జెందినవి. శివార్చనమునఁ బ్రాణము లిచ్చుటకును, తమదృష్టియందు శివాపరాధము గావించిన శత్రు ప్రాణహరణము చేయుటకు సిద్ధపడిన భక్తుల కథలే యెక్కువ. శ్రీ. కాళ, హస్తు లిట్టివారు. తిన్నఁడు, హరద్విజులును తను ప్రాణార్పణ చేయుటకు మాత్రమే సిద్ధపడి నారు. సోమన తపసివలె నిచ్చట హరద్విజుఁడు తిన్ననిఁ జంపదలంపనే లేదు. నత్కీరుని కథలోని మూలస్థాన హరద్విజుడు మఱింత ప్రత్యేకతఁగలవాఁడు. నత్కీరుఁడు పశ్చాత్తప్తుఁడై పరమేశ్వరానుగ్రహమున కార్తిఁ జెందినవాఁడు. వేశ్యాతనయ

లను జంగమార్చన పరులాంధ్రయి శివదర్శనాపేక్షలయినవారె. వర్షైరపు దాసియు జంగమార్చనకు సర్వస్వమర్పించినది. వివిధ మార్గముల, మతముల నారాధించిన భక్తుల గాథల సంపుటీకరణమైన యీ ప్రబంధము ధూర్జటి వ్యక్తిగతమైన మత విశ్వాసమును స్పష్టముగా నందీకున్నను, నాయా తావులందుఁ గవీంద్రుఁడు జేసిన కొన్ని కొన్ని వ్యాఖ్యలవలనను, ఆశ్వాసాద్యంతములవలనను వీరశైవుఁడు కాఁడనియు పరద్వైవ, మతదూషణములు చేయకుండుటయే కాక విష్ణు ప్రశంస[1], రామ ప్రశస్తి[2], హస్తి అను ప్రమథుని హస్తిగ శపించుచు భవాని చెలదియు హస్తియు శివ పదలక్ష్మి వరు లగుదురని యనుగ్రహముతో బల్కుట[3] తలిదండ్రులను రమానారాయణులతోఁ బోల్చుట[4], శివుని రమావిభునితో బోల్చుట[5], హరిహరాద్వైత[6] నిరూపణము లాతనిని శివాద్వైతి యని నిరూపింపఁజాలి యున్నవి. కొన్నియెడల శివాధిక్యముఁబలికిన తావులును లేకపోలేదు. 'ఫణిగ్రామణీ శయ్యాస్తుఁడు[7], శ్రీధరనయనాబ్జసమారాధిత దివ్యాంఘ్రి కోణరాజీవ[8]'. అయినను మొదట పలికిన విధమైన వీరశైవ లక్షణములల వత్యిరిక్తములయిన విషయములనే ప్రతిపాదింపుటఁజేసి ప్రబంధమున ధూర్జటి శ్రీవిద్యోపాసకుఁడై, రాజయోగియై, శివపారమ్యతనుఁ బ్రకటించిన శివాద్వైతిగా గనుపట్టుచున్నాడు.

## శి వా ద్వై త ము

ధూర్జటి కవీంద్రుఁడు శివాద్వైతియని భావించితిమి. శివాద్వైతమన నేమియొ యాలోచింపక బరామర్శించుట నిష్పల్ల సముచితము కాకపోదు. కాశ్మీర దేశమున ప్రసిద్ధి నందిన శైవము, శివాద్వైతమని, ప్రత్యభిజ్ఞా సంప్రదాయమని, స్పందవాదమని, త్రిక దర్శనమని వ్యవహారము పొందినది. శివుఁడు తన పంచముఖములనుండి శివాగమము లను ద్వైతపరముగా భావమురాగా, అద్వైత తత్త్వము ప్రచారము సేయుటకై యీ తత్త్వమును ప్రకటింపఁజేసెనని, దూర్వాసఋషి దీని ప్రచారమునకై యాదేశమంచెనని యీ సంప్రదాయ కథయంఁగలదు. ఈ ప్రత్యభిజ్ఞావాదమున కేవలము జ్ఞానముకాని, కేవల భక్తికాని ముఖ్యముగా లేదు. జ్ఞానము, భక్తి రెండును దీనిలో సామంజస్య

---

1. శ్రీ.కా.మా. 3 ఆ-188 వచనము
2. " " 4 ఆ-87 ప.
3. " " 4 ఆ-172 ప.
4. " " ఆశ్వాసాంతగద్యలు
5. శ్రీ.కా.మా. 4 ఆ-70 ప.
6. " " 2 ఆ-132 ప.
7. " " 1 ఆ-58 ప.
8. శ్రీ.కా.మా. 3 ఆ-1 ప.

మునుఁబొంది యున్నవి. అద్వైతజ్ఞాన మొదయింపఁగా కలుగు సాధ్యశక్తి యీ స్పంద వాదములోఁ గలదు. తెలిసిన వస్తువునే తెలిసికొనుట ప్రత్యభిజ్ఞ. ప్రతిభా సమున్మేషమైన జ్ఞానమునకు 'ప్రత్యభిజ్ఞ' అని పేరు. ప్రత్యభిజ్ఞాసంప్రదాయమును సర్వ సమర్థముగా సిద్ధాంతముఁ జేసినవాఁడు శ్రీమదభినవగుప్తుఁడు. అందువలననే ప్రత్యభిజ్ఞా సంప్రదాయమున కభినవగుప్తుఁడే ప్రవర్తకాచార్యుఁడని యాతనికిఁ బ్రసిద్ధి కలిగినది. ఈ సంప్రదాయమునకుఁ జెందిన తంత్రములు, వార్త్తికములగు గ్రంథము లనేకములు గలవు. 'మాలినీ విజయము, స్వచ్ఛంద తంత్రము, విజ్ఞాన భైరవము, నేత్ర తంత్రము, స్పందసిద్ధాంతము, శివదృష్టి గ్రంథము, ఈశ్వర ప్రత్యభిజ్ఞాకారిక, ఈశ్వర ప్రత్యభిజ్ఞావిమర్శిని, వివృత విమర్శిని, తంత్రాలోకము, తంత్రసారము, మాలినీ విజయవార్త్తికము, పరమార్థ సారము, ప్రత్యభిజ్ఞాహృదయము, స్పందసందోహము ఇత్యాదు లాసంప్రదాయము నెఱిఁగించు గ్రంథరాజములు.* శ్రీ విద్యకుఁ బ్రధాన కేంద్రమైన కాశ్మీరమందలి దీసంప్రదాయము.

ధూర్జటి ప్రబంధమునఁ బ్రతిపాదింపబడిన శ్రీవిద్యారాధనము, ఆత్మతత్త్వ బోధము, (బ్రహ్మకు, వశిష్ఠునకు, వేశ్యాతనయలకు పరమేశ్వరుఁడు గావించినది.) లందలి జ్ఞానము, శ్రీకాళహస్తిలయు తిన్ననివిషయమగు భక్తులు ఈ శైవాద్వైతమునుఁ బ్రతిపాదించుచున్నవి. శక్తిశివాద్వయము బ్రహ్మమే ప్రపంచము. అద్దానిని బోధించునదియే శ్రీవిద్యయని యెఱింగితిమి. ఇదియే శివాద్వైతము. కాన శ్రీవిద్యోపాసకుఁడై, దక్షిణామూర్త్యారాధకుఁడై బ్రహ్మవిద్యావన భిక్షఁబొందిన ధూర్జటి శివాద్వైతి.

శతకమందు ధూర్జటి కవీంద్రుఁడు భవనిరాసమును గావించుచు, శివభక్తి స్మరణముఁ జేయుచు, నీశ్వరుని సర్వేశ్వరత్వమును, సర్వాతిశాయిత్వమును నిరూపణము గావించుట వలనను, శివుఁడు తక్కఁడక్కొఁరులఁగొల్వననుట వలనను శివపారమ్యమును బ్రతిపాదించినవాఁడయ్యెను, రాజగర్హణము, జ్ఞాతి దూషణము, గావించెనే కాని యన్య దైవ దూషణము చేయలేదు.

---

* విజ్ఞాన సర్వస్వము—7వ సం.—353 పుటనుండి కల విషయమాధారము.

గ్రంథేతరాధారములు :-

ధూర్జటిని గూర్చి యితర కవులు, ముఖ్యముగా నాతని వంశీయులు శివభక్తునిగాఁ బలికిరే కాని వీరశైవుఁడని కాని, యారాధ్యుఁడని కాని, శివాద్వైతియని గాని పలికి యుండలేదు. ధూర్జటి శివభక్తి పారమ్యతను గూర్చిన యొక శతక కర్త-శివ శతకము – పలికిన యొక వాక్యమునిట ననుసంధానింపఁదగును.

"చెలి చంటి మీఁదఁ జేయిడి
చెలువొప్ప శివా! యటన్నఁ జేడియ నవ్వన్
జలపట్టి శివునిఁ జూపిన
చెలువుని ధూర్జటిని దలఁతుఁ జెన్నొంద శివా!"*

ఇం ధూర్జటి శివభక్తికి శృంగార రసపుఁబూతయునున్నది. ధూర్జటి కవినిఁ కొనియాడుచు సాక్షాత్ ధూర్జటిగనే రూపించిన చాటుపద్యరత్నావళి యందలి పద్య మొండు గనఁనగును.

---

* కోట శివరామకవి

—(o)—

# జీవితము

కవి నిర్మిత కావ్యము కవి వ్యక్తిగత జీవితానుభవములను బరిపూర్ణముగా గాకున్నను, గొంత వఱకైనఁ బ్రతిబింబించును. కావ్యమందు కావ్యగత పాత్రల ముఖమున అప్పటప్పటి పరోక్షముగాఁ గవి తన అభిరుచులను, అనుభూతులను, ఆశయములను, ఆదర్శములను నందించుటకుఁ బ్రయత్నము సలుపుచుండును. కేవల ప్రబంధమును బట్టి కవి ఆత్మీయతను లేక కవి జీవితమును పరిపూర్ణముగా గ్రహించుట కవకాశము కలుగదు. ఆ కవి పేరున చెలామణిలోనుండు చాటువులు, కవి రచించిన కథా వస్తువులేని రచనలు—శతకముల వంటివి—ఆ కవి జీవితమునకుఁ బ్రతిబింబములనదగి యుండును.

ధూర్జటి కవీంద్రుని జీవితము నవగాహనము చేసికొనుటకుఁ బ్రయత్నించుటలో నున కాతని ప్రబంధము, శతకము—రెండును—తోడ్పడును. మొదట భావించినట్లు ప్రబంధము కంటె కవీంద్రుని జీవిత దృక్పథము కవీంద్రుని శతకమునందే గ్రహించుట కెక్కువ అవకాశమున్నది. ధూర్జటి కవీంద్రుఁడు ప్రబంధ శతకములలో నే దానిని మొదటఁ గూర్చెనను అంశము ముందు "కృతుల పౌర్వాపర్యము" అను శీర్షికయందు చర్చింపఁబడనున్నది. తొలుత ప్రబంధము, తరువాత శతకములను రచించెనననది సిద్ధాంతితమగు నంశము.

ప్రబంధము :— ప్రబంధము నందంతటను ధూర్జటి మహా శివభక్తుఁడై, చేతోగమ్యుఁడు[1], అనుభవగోచరుఁడును[2], చిన్మయ స్వరూపుఁడును, దక్షిణామూర్తియును నగు పరమేశ్వరుని దర్శన మపేక్షించిన వానిగను[3], శ్రీవిద్యోపాసకునిగను[4], భవ బంధములనుండి విముక్తిఁ[5] గోరువానిఁగను గనుపట్టును. రాజయోగమునఁ బరిచయము అనుభవము గలవానిగా[6] నగుపించును.

---

1. శ్రీ.కా.మా. 1 ఆ-7 ప. 2. శ్రీ.కా.మా. 1ఆ-9 ప.
3. " " 1 ఆ-82, 85 ప. 4. " " 1 ఆ-1 ప.
5. " " ఆశ్వాసాంత పద్యములు, 1-162 గద్యము, 1-13, 15, 17, 87, 104, 109
2-ఆశ్వాసాంత పద్య గద్యములు, 2 ఆ-160 గద్య, 105, 154, 3-ఆ-1, 124, 125.
3- 222, 224, అంత్య గద్య, 4 ఆ-204, 205 మఱియు ఆశ్వాసాంతగద్య

ఈ యన్నియంశములును పరిణత మనస్కుఁడైన ధూర్జటి వ్యక్తిత్వమునే ప్రదర్శించుచున్నవి గాని, జీవితమున నతఁడు పొందిన కష్టనష్టములు, ఆదరనిరాదరణలు, విషాదానందములు, భోగభాగ్యములు, రాగవిరాగములు, భయభక్తులు, ప్రబంధము మూలమునఁ దెలియ వచ్చుటలేదు. ఈ సర్వవిషయములు కవిసంప్రని శతకమున స్పష్టముగాఁ దెలియఁగలవు. ధూర్జటి జీవితమున రెండవప్రక్క యనఁదగిన 'శృంగార రాసిక్యము' శతకమున అనుభవానంతర పరితాపనముగా నుండఁగా, ప్రబంధమున కవి యనుభూతిని, నభిరుచిని అందించుచున్నది. ప్రబంధమునఁ బోషింపఁబడినది ప్రధానముగా శాంతముకాగా, శాంతమునకు సమముగా శృంగారము కూడఁ బోషించు చున్నట్లు ధూర్జటి స్ఫురింపఁజేసినాడు. అంతియేకాదు, కొంతొకచో శృంగారమే శాంతమును మించిన దనిపించు తావులును లేకపోలేదు. 'రసపోషణ'మను శీర్షిక యందు పై విషయము సమగ్రముగా చర్చింపఁబడును.

భవపరాఙ్ముఖుఁడనని తెల్పుకొనిన ధూర్జటి, బంధత్రయనాశముఁగోరు ధూర్జటి శృంగార రాసిక్యత వింతగా వెలార్చుట యేమి యని ప్రశ్నించుకొనినప్పుడు కథా సందర్భములట్టి యవకాశముఁ గల్పించినవని సమాధానించుకొనవలసి యున్నది. కేవలము సందర్భములు, పాత్రలట్టి యవకాశము కల్పించినవనుకొనుట చాలదు. ఆయా ఘట్టములందలి సందర్భములు, పాత్రలకు వలసినంతకు మించిన శృంగారము కనుపట్టు చుండుటవలన నది ధూర్జటి యభిరుచినే తెలియఁ జేయునని యూహించుట యందు దొసఁగు లేదనవచ్చును. దాసి-మిండ జంగములకథ, పార్వతీ పరమేశ్వర విహార వర్ణనము, వాణీహిరణ్యగర్భుల కథ, చెంచులు చెంచితల విహారములు, వేశ్యా తనయలకథలో వేశ్యమాత కూఁతులకు చేసిన వారధర్మ బోధ-ఇత్యాది ఘట్టములందలి శృంగార ప్రసక్తి సందర్భౌచిత్యమును మించియున్నది.

ఇతర రసములకంగముగా శృంగారము పోషింపఁబడిన తావులు నీ కవి శృంగార రసాభిరుచినే వెలయించుచున్నవి. రౌద్రము[1], భయానకము[2], వీరము[3], శాంతము[4]ల కంగముగా భాసించిన తావులుండగా, భక్తిభావములకు భంజకముగాఁ గూడ శృంగారము వర్ణితమైనది. అయిన నంగిగాఁ బోషింపఁబడిన తావులందు ఒకటి రెండు చోట్లతప్ప[5] శృంగారము మితిమించలేదు.

---

1. శ్రీ కా.మా. 2 ఆ-18 ప. 2. శ్రీ.కా.మా. 1 ఆ-45 ప.
3. " " 1 ఆ-25 ప, 4. " " 1 ఆ-24 ప.
5. " " 2 ఆ-119, 125 మరియు 3 ఆ-180, 181 ప.

శ త క ము :— రాజాదరణలు, సన్మానములు పొంది భోగభాగ్యములఁతో[1] గొంతకాలము జీవితము గడపి రాయల యనంతరము కలిగిన రాజాపమానములు, నిరాదరణలు పొంది[2], రాజసేవను గర్హించి[3], రాజాశ్రయము కంటె ఊరూర భైక్ష్య మాచరించి[4] బ్రతుకుట మేలుగాదాయని తిరిగి తిరిగి శ్రీకాళహస్తి పురముఁజేరి, నిత్యము మొగలేట తానమాడి, బూదియలఁది, రుద్రాక్ష పేరులుఁదాల్చి, 'సువర్ణ ముఖరీ తీర ప్రదేశాశ్రమకానన మధ్యోపలవేదికాగ్రమునఁ బంకజాసన నిష్ఠ'తో పంచా క్షరీ జపధానమున భవబంధలతల్ ద్రెంచుకొని, పరమేశ్వరుని చిన్మయరూప సాక్షా త్కారముఁబొంది, ఆత్మవిద్యోపదేశము నంది, అపునరావృతము శివైక్యమునందిన ధన్యజీవి ధూర్జటి కవీంద్రుఁడు.

నిత్యజీవితమున సాంసారికమగు జీవితము నన్నిరీతుల సమగ్రముగా ననుభ వించుట చేతనే 'సంసార పారదోద్బా టవానలకీల కలుష సంచయతామ్ర గంధకంబు[5], అన్నట్లు సర్వేశ్వరుని సర్వదా 'భవఫణిఖగరాట్చంచూ కోటి[6]గా ధ్యానించిన వాఁడు ధూర్జటి. తాను చిత్రించిన ఆయా పాత్రలు గావించిన పరమేశ్వర స్తుతులమాటున ధూర్జటి హృదయమున్నదనవలె. అతని యావేదన, నివేదనల కవి యాలంబనము లయినవి.

లౌకిక బంధములకుఁ బ్రతీకలయిన దారపుత్రులయు[7], నన్నదమ్ములయు, జ్ఞాతులయు[8] వలనఁ దొందినఁ సౌఖ్యములు, దుఃఖములు, పరిపూర్ణముగా ననుభవించి మానసికముగా డస్సిన ధూర్జటి మనకు శతకమునఁ గన్పట్టును.

---

1. కృ.వి 1 ఆ-29 ప.
2. శ్రీ.కా.శ. 2, 113 ప,
3. " " 18
4. " " 92
5. శ్రీ.కా.మా. 1 ఆ-17 ప.
6. " " 1 ఆ-13 ప.
7. శ్రీ.కా.శ. 9, 14, 31, 55, 96
8. " " 69, 96-1523 నెం.

అల్పజ్ఞులు, నసూయాపరులునయిన కవులు సాహిత్యమునకుఁ జేయు ద్రోహమును[1], తనకుఁగల్గిన యవమానములుఁ[2] దలంచుకొని మిక్కిలిగా నిర్వేదమందినాఁడు. తాను పొందిన యనుభూతులఁ దెలుపుచు[3] పరమేశ్వరుని నేఁ దేమియుఁ గోరనని[4], యీశ్వరునిఁ గొల్చుటయే తన నైజమని[7], మంత్రశాస్త్రములెన్ని పరిశీలించినను[8], నొక్క బిల్వ పత్రమున పరమేశ్వరు నర్చించిన[9] పొందఁగల పుణ్యమును, మానవుఁడు పొందనేరఁడని ఘంటాపథముగాఁ జెప్పినాఁడు ధూర్జటి కవీంద్రుఁడు. లోకమునందున మనస్సును బాధపెట్టిన వారిని మిక్కిలిగా గర్హించి. యజ్ఞానులయిన లోకుల యెడల జాలి వ్యక్తపఱచినాఁడు. తన దృష్టియందు లోకము, లోకులు, లోకేశుల స్వరూప స్వభావములు కన్నులఁ గట్టిన యీ శతకము ధూర్జటి వ్యక్తిగత జీవితానుభవసారమే యన నొప్పుచున్నది.

—)o(—

1. శ్రీ.కా.శ 113 ప.
2. " " 43 ప.
3 " " 62 ప.
4. " " 30, 65 ప.
5. " " 65 ప.
6. శ్రీ కా.శ. 77
7. " " 70 ప.
8. " " 81 ప.
9 " " 84, 106 ప.

# ధూర్జటి కృతులు
## (పౌర్వాపర్యము)

ఆంధ్రకవి ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యమను ప్రబంధమును, శ్రీకాళహస్తీశ్వర శతకమును రచించెను. ఆ రెండు గ్రంథములందు మొదట దేనిని రచించెను, తరువాత దేనిని గూర్చినను ముందువెనుకలను బరిశీలించుటకు ముమ్ము, "శతకము ధూర్జటి కృతము కాద"ను నాక్షేపమొకదానిని నిరాకరించి, "శతకము ధూర్జటి కృతమే" యని నిర్ధారింపవలసిన యవసరము గలదు. ఈ యాక్షేపమును మొదటగాఁ బలికినవారు శ్రీ కందుకూరి వీరేశలింగముగారు[1]. తమ యాంధ్రకవుల చరిత్రమున "శ్రీకాళహస్తి శతకమున కితఁడే కర్తయని నిర్ణయింపదగు నాధారము లేవియు నింతదనుక లభింపలేద"ని వ్రాసియుండిరి. తరువాత కొందఱు పండితులును ప్రబంధ శతకములకు శైలియందును, లక్షణానుసరణములోను భేదమున్నదనియుఁ గాన శతకమునకుఁ గర్త ధూర్జటి కవీంద్రుఁడు కాఁడని పలికియుండిరి.

### శతకము ధూర్జటికృతమే

ఏదేనొక యంశమునుఁ బరిశీలించి నిర్ధారించుటకు బాహిరములైనవి, యాంతరములు అయినవియునైన యాధారము లుండును.

### బాహిరమైన యాధారములు :

ప్రకృత శతకకర్తృత్వ విషయమున బాహిరమైన యాధార మొక్కటి మాత్రము గన్పట్టుచున్నది. కస్తూరి రంగకవి[2] తన 'ఆనందరంగరాట్ఛందము'న నభేదయతి కుదాహరణగా ధూర్జటివాని కాళహస్తీశ్వర శతకమున నున్నట్టి "నీకుం గాని కవిత్వమెవ్వరికి............ శ్రీకాళహస్తీశ్వరా[3]" యను పద్యమునుఁ జూపెను. ఇఁక దీనికి జనశ్రుతి యొకటి బలపఱుచుచున్నట్టిది కలదు గావా !

---

1. ఆం.క.చ. 1 సం.
2. ఆ.ర.ఛం. 3 ఆ-275 ప.
3. ఆం.ప్ర.సా.ప్ర. పద్యము 144.

ధూర్జటి తరువాత నాతని వంశమునందలి కవులెవరును ధూర్జటికవి శతకమును రచించినట్లెచ్చటను బలికియుండలేదనునదియు శతకము ధూర్జటికృతము కాదను వారికిఁ బనికివచ్చిన యంశము. దానినీవిధముగా నిరాకరింపవచ్చును. ధూర్జటినిఁ దొలుతగాఁ బ్రశంసించి గ్రంథస్థము గావించిన కుమారధూర్జటి, కవిధూర్జటి కృష్ణ రాయలచే ఘనముగా సమ్మానితుడయ్యెనని పేర్కొనెనే కాని యాతని కృతుల ప్రశస్తియే గావింపలేదు. తరువాతి లింగరాజకవి తన "శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యము"న నితివృత్త స్వీకరణ ప్రసంగమున, కవిధూర్జటి ప్రబంధప్రస్తావము నకే యవసరమగుటచే శతక కర్తృత్వ ప్రశంస చేయఁబూనలేదు. తాతవలెనె కుమార ధూర్జటి పౌత్రుఁడు, లింగరాజపుత్రుఁడు నైన వెంకటరాయకవియు, కవి ధూర్జటి రాయల యాస్థానమునఁ బొందిన మహాగౌరవమునుఁ బలికినేకాని, కృతుల ప్రశంసయే గావింపలేదు.

## అంతరములయిన యాధారములు :

ధూర్జటి కవీంద్రుని కృతములుగా మనమెంచుచున్న యీ రెండు గ్రంథము లందలి యంతస్సాక్ష్యములను జాగరూకతమైఁ బరిశీలించితిమేని రెండు నేకకర్తృక ములని స్పష్టముగా, నసందిగ్ధముగా సిద్ధాంతీకరింపనువపడఁగలదు. ఈ సాదృశ్య నిరూపణము 'కవిత్వము : వ్యక్తిత్వము' అన్న విభాగములక్రిందఁ జేయనగును.

### కవిత్వము :

భావావేశము, శబ్దప్రయోగము, సమాసకల్పనము, ధారాశుద్ధియను నంశము లుగా కవితారీతిఁ బరిశీలింపదగును.

### వ్యక్తిత్వము :

భవనిరాసము, ఉపాసనావిధి, శివభక్తిప్రాశస్త్యము, శృంగారరాసిక్యము అను నంశములుగా విభాగించి చూడవచ్చును.

## కవితారీతి

భావావేశమునందు, సముచిత శబ్దప్రయోగముఁ జేయుచు, స్వతంత్ర సమాస ప్రకల్పన మాచరించుచు, ధారాశుద్ధినిఁ దళుకున్కొల గావించుచు, శయ్యాసౌభాగ్యమునే సలరించుట కవితారీతి. ప్రబంధము, శతకముల యందలి సాదృశ్యముఁ బరిశీలించుతఱి నీ యంశములఁ బోల్చుచు అత్యంత సాన్నిహిత్యము,సారూప్యములు గల తావులనుఁ జూడనగును.

## 1. భావముల పోలిక

| | ప్రబంధము | శతకము | |
|---|---|---|---|
| 1. ఆ. ప. 7 | వాగర్థంబులు .... | సిరులంగాని కవిత్వము—ప. | 114 |
| 10 | తన యిల్లా లఖిలైక<br>మాత.... | దివిజక్ష్మారుహధేను రత్న — | 7 |
| 11 | వాదవింప కళా<br>త్రిలోచనకు | | |
| 24 | పరిచితవింప నైపుణి | అకలంకస్థితి.... | 64 |
| 142 | యోగీశ్వర .. | అహాపంబుదయించె .. | 94 |
| 12 | బహుముఖ సువర్ణ<br>ముఖరీ లహరీశీతల శిలా<br>తలస్థిత .... | | |
| 98 | విహరించు .. వినిసాంద్ర<br>పల్లవచ్ఛాయల | దినముం బిత్తములో<br>సువర్ణముఖరీతీర ప్రదేశాంత్రము<br>కావున మఖ్యోన్నతవేదికాగ్రమున— | 35 |
| 149 | అశైలోపాంత సాను<br>ముఖరీ ద్వీపవతీ తటశిలా<br>ప్రదేశము | | |
| 21 | ఎలనాగ ల్వానముల్వ్యాప<br>కుచము లద్రీంద్రముల్ | సులభమాయిష్ట మనోజభావము— | 49 |
| 146 | కుండలీ శక్తి ... షట్చ<br>క్రికావీధి | | |
| 51 | ఓయను రోదనం బోంకార<br>మనువుగా.... | జలకంబుల్రసముల్— | 50 |
| 155 | అనవిని....యయ్యనిమిష<br>శైలమైన తృణమౌ | శ్రీశైలేశ భజింతునో....<br>నాశీలంబెట్టిపైన మేరుపసుచు | 72 |

| | ప్రబంధము | శతకము | |
|---|---|---|---|
| 2.ఆ— 104 | దేవా! నిన్ను నుతింపలే నధమ బుద్ధిన్ వేదశాస్త్రం బులన్ రావేపాటియు .... | ఏ వేదంబు పఠించె లూత | 13 |
| | శ్రుతులు శాస్త్రంబు ల్కిము జెప్పగా లేవు ... | వేదంబుల్గ నలేని.... | 6 |
| 122 | ఉనికి శిలోచ్చయంబు.... | వన్నే యేనుఁగు తోలు | 90 |
| 133 | ఉదయద్గ్రావము పానపట్టము ... | జలకంబుల్ రసముల్.... | 50 |
| 153 | నిను సేవించిన కృతకృత్యుఁడు ... | నీ కారుణ్యము గల్గినట్టి | 68 |
| 153 | నీ పనిమేడు నిధి ... | అడుగంబోనిక.... | 30 |
| 3 ఆ— 82 | నాకుం జుట్టము.... | అమ్మా!యయ్య యటంచు | 27 |
| 4 ఆ— 68 | ఊరారన్ విడిదిండ్లు .. | ఊరూరం జనులెల్ల | 92 |
| | | ఊరూరం బవినీని కొండ్లు | 117 |
| 116 | రుద్రాక్ష స్రగాలంకృతుల్.... | భసితోద్ధూళన | 102 |
| 122 | భయనును తొల్లి కన్.... | వి త్తజ్ఞానము | 8 |

## 2. శబ్దప్రయోగము

శబ్దప్రయోగమునఁ గవిధూర్జటి కడుస్వాతంత్ర్యముఁ బ్రదర్శించెను.

1. 'కాను' శబ్దమునకు 'క' నుపయోగించుట :

| | ప్రబంధము | శతకము |
|---|---|---|
| 2 ఆ— 4 ప. | కప్పక | |
| — 26 ప. | చింపక | |
| 3 ఆ— 30 ప. | విసల్చక | |
| — 33 ప | ఒడ్డించక | |
| — 38 ప. / — 62 ప. | పట్టక | |

| ప్రబంధము | | శతకము | |
|---|---|---|---|
| 3 ఆ— 51 ప.<br>4 ఆ— 91 ప. | పెట్టుక | | |
| 3 ఆ— 62 ప. | ఎలయించుక | | |
| 3 ఆ— 119 ప.<br>4 ఆ— 191 ప. | పట్టుక | | |
| 3 ఆ— 122 ప. | పిల్చుక | త్రిప్పుక | — 14 |
| 3 ఆ— 205 ప.<br>4 ఆ— 137 ప. | నూఁకుక | | |
| 4 ఆ— 60 ప. | కూడుక | | |
| 4 ఆ— 73 ప. | మోకరించుక | | |

1. 'ఇమ్ము'నకు 'ఈ' :

| ప్రబంధము | | శతకము | |
|---|---|---|---|
| 2 ఆ— 123 ప. | పోనీ | పోదమనీ<br>అట్టునీ<br>అననీ<br>పైకొననీ<br>కల్గనీ<br>ఖండించనీ<br>రానీ | 12 ప. |
| 2 ఆ— 13 ప.<br>142 ప.<br>3 ఆ— 101 ప.<br>4 ఆ— 113 ప. | రానీ | | |
| | | పడనీ | 112 ప. |

3. ఇకారాంత అసమాపక క్రియలపై సంధి :

| ప్రబంధము | | శతకము | |
|---|---|---|---|
| 2 ఆ— 154 ప. | ఈఁగీఁడి | చేకొంచెంగిలి | 30 ప. |

| ప్రబంధము | శతకము | |
|---|---|---|
| 3— 93 ప. అందియ్యి | | |
| 105 ప. అందిచ్చినన్ | | |
| 4 ఆ— 52 ప. తొంగుండెడి | | |

4) ఇకారాంతములపై సంధి :

| ప్రబంధము | శతకము | |
|---|---|---|
| 4 ఆ— 102 ప. మాపటి సందునన్ | కానక్కటా — | 103 |
| 188 ప. క్రీడించుక | కొనప్పుడే | |
| 191 ప. చెయ్యిచ్చి | పడనప్పుడే | |
| | రోయనప్పుడే | |
| | కాబాధిక్కడ — | 62 |
| | లేడుండగా | 20 |
| | తోల్తుండగా | |
| | రోసిందేటిది | |
| | చేసిందేటిది | |
| | పూసిందేటిది | 71 |
| | మూసిందేటిది | |
| | భీతచొయ్యెదున్ — | 76 |
| | పిండెంలో — | 93 |
| | తంద్రాన — | 60 |

5) అకారాంతములపై సంధి :- కొల్లలుగానున్న వానియందుఁ గేవలసాదృశ్య ప్రయోగములనే చూడనగును.

| | ప్రబంధము | శతకము |
|---|---|---|
| 1. | అటన్న-1అ-16, 22; 3అ—168.171, 4అ-101 | అటండురు—113 |
| 2. | అటంచు-1-130,132; 3-157; 4-116 | అటంచు—5,27,28, 53, 66 |
| 3. | ఉన్నైదకున్—4—132 | ఉన్నైదకున్ — 30<br>ఉన్నప్పుడే — 116<br>విన్నప్పుడున్—11 |
| 4. | ఏలపటున్—3—206 | ఏలర్పించె 9<br>ఏలుడుపవో 79 |
| 5. | కాకేమి-3-111 | |
| 6. | కాకున్న-2-115 | కాకున్న 39 |
| 7. | కాకింతటన్-2-149 | |
| 8. | పొందకుండిన -1-32 | పొందకుండ 48 |
| 9. | లేకున్న 3-101 | లేకున్న 32, 52 |
| 10. | లేకుండుట 2-153 | |
| 11. | లేకుండియు-4-121 | లేకుండిన 109 |
| 12. | ఊరకుండియు 1-103 | |
| 13. | ఊరకుండుటయు 2-77 | ఊరకుండ 109 |
| 64. | ఊరకుండినన్ 3-87 | |
| ¹5. | ఊరకుండ 4-166 | |

6) విశిష్టపదములు, వ్యవహార సిద్ధములయిన పదముల ప్రయోగము:

| ప్రబంధము | శతకము |
|---|---|
| రెణ్ణెల్లు -2-80 | |
| వేన్నేళ్ళ -4-11 | ఎన్నాళ్లుండితి -33 ప. |
| కొంతసేపునకున్-2-113 | |
| | రోసీరోయదు, పాసీపాయదు, కోసీకోయదు, చేసీచేయదు 30 ప. |
| | రోసింది, మూసింది, పూసింది, చేసింది 71 ప. |
| | కిర్తము 113 |
| | తెలుసో 9 |
| | చేసునె 5 |
| | చింతాకంత, అంతా మిధ్య 3 |
| | పోత్తే 69 |

7) కన్నడ ప్రయోగము :

| | |
|---|---|
| కాణాచి -4-25 | కాణాచి |
| కాణయాచి 4-37 | కాణాచా 36(1527) |

8) తద్ధర్మార్థక ధాతుజవిశేషణ ప్రయోగము :

| | |
|---|---|
| చెయ్యంగాగల యాడిగంబు-1-58 | చేయఁగల కార్యంబున్న-37 |
| చేయంగల కార్యమెద్ధి -1-59 | కోరఁగల 44 (1523) |

9. 'ఏమి' లోని 'మి' వర్ణ లోపము :

| | | | |
|---|---|---|---|
| ఘాతము జంపుచే యరుసు? | 3-208 | తురంగసామజముచే / చిత్రమ్ము లాందోళికా / తుతులే లెక్క | 105 |

3. సమాన కల్పనము :

సమాసములను దీర్ఘములుగను, సంస్కృతపద జటిలముగను సూర్చుటయందు గాక కలియు పదములందు, భావములందుఁ గల సాదృశ్యములఁ జూడఁ దగును.

| ప్రబంధము | | శతకము | |
|---|---|---|---|
| ఖండితాజవంజ వాంధకార | -2-160 | శ్రీ విస్మృతకలితాజవంజవ మహో జీమూత పాపాంబుధారావేగంబున | -1 |
| దంపతిపుంజాజవంజవ భంజనాఖండ యశము | 3-18 | కపటాజపంజవ మహాకూపార పేపారఁగన్ | 118 [1523] |
| చేతోగమ్యుండు | 1-7 | | |
| చేతఃప్రీతి | 1-133 | | |
| చేతోజనితాదరమున | 3-102 | చేతఃక్రోధము | 69 |
| చేతో వైకల్యము | 4-129 | చేతోవీథి | 99 |
| చేతస్తనువృత్తి | 1-168 | | |
| నిపినామ్రపల్లవచ్ఛాయల | 1-98 | | |
| శైలోపాంతహేమముఖరీ ద్వీపపతీతట శిలా ప్రదేశము | 1-149 | సువర్ణముఖరీ తీరప్రదేశామ్రవన మధ్యోపలవేదికాగ్రమున | 35 |

| ప్రబంధము | శతకము |
|---|---|
| బహుముఖ సువర్ణముఖరీ లహరీ | |
| శీతల శిలాతల స్థిత .... 1-12 | |
| దీపనాదివ్యథ .... 2-83 | దీపదుఃఖాదుల .... 43 |

4. ధారాశుద్ధిః పద్యములయెత్తుగడ, నిర్వహణములందలి సాదృశ్యము:

| | |
|---|---|
| వాగర్థంబులు శ్రోత్రవక్త్రలు 1-7 | నీకుంగాని కవిత్వమెవ్వరికి 114 |
| తనయుల్లాలఖిలైకమాత 1-10 | దివిజక్ష్మారుహధేనురత్న 7 |
| క్రూరుద్వృత్తులు దోషకారులు 2-23 | రాజుల్మత్తులు వారిసేవ 18 |
| దేవా నిన్ను నుతింపలే నధమబుద్ధిన్ | ఏ వేదంబు పఠించె లూత 6 |
| వేదశాస్త్రంబులన్ 2-104 | శ్రుతులభ్యాసము చేసి 58 |
| త్రేతాంతంబున .... దినముం | |
| బాలేందు చూడార్చనల్ 2-100 | దినముంజిత్తములౌ 35 |
| ఉనికి శిలోచ్చయంబు 2-122 | పన్నే యేనుఁగు తోలు 90 |
| ఉదయగ్రావము- 2-133 | జలకంబుల్ రసముల్ 50 |
| నిను సేవించిన కృతకృత్యుఁడు 2-153 | నీ కారుణ్యము గల్గినట్టి 68 |
| నీ పనిమొదు నిధిగాంచిన ధన్యుఁడు | నిన్ను భజింపగా గనియు |
| నేరండు తక్కిన యర్థము గోరగ 2-153 | కోరెదిడింకేమిఁగలదు 30 |
| నాకుంజుట్టముఁ దల్లిదండ్రులు 3-82 | నిన్ను నమ్మిన రీతి 24 |
| | అమ్మా అయ్య యటంచు 27 |
| ఒవిరియంగమ్మునపిమ్మిరెత్తకమున్న 3-177 | దంతంబుల్పడనప్పుడే 116 |
| రుద్రాక్ష స్రగలంకృతుల్ 4-116 | భసితోద్ధూళన ధూసరాంగులు 100 |

## వ్యక్తిత్వము వెలార్చుతావులందలి సాదృశ్యము

ప్రబంధమునఁ గథాసందర్భము లందచ్చటఁ గవి యాత్మీయత పరోక్షముగఁ గన్పట్టుచుండును. కథా సందర్భములందలివి యా యా పాత్రలకు, సన్నివేశములకు సంబంధించినవైనను, గొన్ని తావులందుఁ గవి వ్యక్తిత్వము తొంగిచూచుచునే యుండును. ప్రహ్లాదుఁడు, గజేంద్రుడు, భక్తిపరవశులై, యార్తిజెంది కావించిన నివేదనము లాసందర్భముల కుచితములగుచునే, పోతన భక్తిపారవశ్యము, నార్తుల నెల్లందించుచున్నవో, శ్రీకాళహస్తి మాహాత్మ్యమునను గథితములయిన భక్తచరితము లందుఁ, జిత్రితములయిన చిత్రణములందుఁ, గల్పితములైన సన్నివేశములందు, ధూర్జటి వ్యక్తిత్వము తప్పక గోచరించుచునే యున్నది. ఇఁక శతకము కేవలము కవీంద్రుని యాత్మానుభవము, నార్తినివేదనములకుఁ బ్రతిబింబమే. రెండు కృతులందును సన్నిహిత సదృశములయిన తావులనే యిచటఁ గాంచగలము.

భవపరాఙ్ముఖుఁడుగాఁ దెలిసికొనిన వ్యక్తిత్వమున 'భవనిరాసము'ను లక్షణమునుఁ దొలుతఁ బరిశీలింతము.

### 1. భవనిరాసము

#### ప్రబంధమున

కృత్యవతరణికయందలి షష్ఠ్యంతములందు

పంచేంద్రియమత్తద్విప పంచాస్య కిశోరమునకు
భవఫణిఖగరాట్పంచూకోటికి 1–13

హతభవపాశునకు 1–14

కాళహస్తిపుర వర్ణనమున

సంసారపారదోచ్చాటనానలకీల 1–17

వశిష్ఠుని తపమున

సంసారమోహజంబుకముఁబట్టి 1–71



ఏనుఁగు పాముల నివేదన

ఈ సంసారపయోధిలోనఁబడి నే మీఁదీఁది.... మిథ్యా
సౌఖ్యంబులు నాలు.... 2–154

ఆశ్వాసాంతము

కామక్రోధ మదాంధకార పటలాఖండ ప్రచండార్క 2–158

ఖండితాజవంజవాంధకార 2–160

ఆశ్వాసాది

మనోబాధాసహ సంసార వ్యాధిప్రజవైద్య 3–1

తిక్కని తప్పటడుగులు

భవపరాఙ్ముఖుఁడైన పగిది 3–30

మోహబంధంబుఁ దెగఁదన్నుగతి 3–30

తిక్కఁడు, హరద్విజుల నివేదనము

అచ్చోఁబాసె దేహంబుపైఁదీపుంజీఁకటి 3–123

క్రమ్మఁబుట్టెడు బాధమాన్పవే 3–124

భవప్రయాస మెడలింపఁగదే 3–125

నక్కిరుఁడు

ఈ సంసారము దుఃఖావాసానందంబు దీనిఁదప్పింపంగా 3–221

జీవనభేదాంబర కర్తరీముఖము 3–222

ఆశ్వాసాంతము :

భవపశుశ్రోత్ర పక్షీశ్వరా 3–224

వారవనితలు తల్లితో :

హరుని భవహరుని 4–39

భవాసజ్జలరాశికుంభజుని 4–86

ఆశ్వాసాంతము :



శ త క ము న

కృతుల పౌర్వాపర్యము 53



## 2. ఉపాసన

యోగవిద్యానిరూఢుఁడైన ధూర్జటి కవీంద్రుఁడు శ్రీవిద్యోపాసకుఁడని ప్రబంధ, శతకములు రెండును సాక్ష్యమిచ్చుచున్నవి.

### ప్రబంధమున

శ్రీగురు పాదరాజీవ 1-71

ఆనగజేశ 1-102

యోగీశ్వర భావస్వభావంబునుం బోలె నమందబిందు సముదయంబును
నిరంతరనాద ప్రసాదమేదుర హృదయంబును సంసారవారాకర తరణ
కారణ కళాప్రకాశంబును లంఘితాలంఘ్య విషయప్రదేశంబును 1-142

యధేచ్ఛావ్యాపారజీవనంబును సిద్ధనికేత కూర్మాసనాభ్యాసనాడీ
సదాశోధవాయూసముదొంది యాధారజాలంధరౌడ్యాణబంధం
బులంబట్టుచుం, గుండలీశక్తివక్త్రం బవక్రంబుగాఁ జేసి... 1-145

తారక ఘంటారావ హృతమనోమృగ వ్యాధేశా 2-159

తన్నాశాశలంద్రిప్పి పాశవిముక్తుండగు యోగిభావన 3-60

హంససంసదభీష్టవిహారహేతు 3-195

దళములో రథాంగ 3-195

తమ్ములదళోవికారము 3-196

శ త క ము న

మలభూయిష్ఠమనోబధామును సుషుమ్నాద్వారము, యాడు
కుండలియో 49

అకలంకస్థితి నిల్పి నాదమును ఘంటారావమున్ 64

ఆరావంబుదయించె తారకముగా 93

# 3. శివభక్తిపారమ్యము

ప్రతిపాదిత వస్తువే శివభక్తి. ప్రబంధమందలి యా యా పాత్ర చిత్రణములు, అవస్థాచిత్రణమునందు, వర్ణనములందు శివభక్తి మెండుగాఁ గావింపబడినది. శతకమున శివభక్తి యతివేలముగాఁ గావింపఁబడినది. తనకుఁ గల శివభక్తి ప్రకటనము, శివభక్తుల స్మరణము, శివమహత్త్వ, సేవాఫలములను భాగములందు గనఁగలము.

# ప్రబంధము

శ త క ము



## 4. శృంగార రాసిక్యము

శివభక్తి ప్రధానమైన ప్రబంధమున శృంగారరసము, శాంతమునకంగముగఁ బోషింపఁబడుటయేకాక కొన్నియెడల శృంగారమే యంగిరసమా యనుపించునంతగా సాగినది. వాసి-మిండజంగముల కథయందు వేశ్యాతనయల కథలందు సందర్భము కొంతకలదని భావించినను, పార్వతీ పరమేశ్వరుల విహారవర్ణనమున, వాణీ హిరణ్యగర్భుల కథా కథనమున శృంగారరస పోషణము జరిగినది. స్త్రీల యవయవ వర్ణనము బహుళముగాఁ గనుపట్టుచున్నది. కొన్నితావుల కొంచెమెక్కువ యనిపించుట కూడఁ గలదన్న ధూర్జటి కవికిగల శృంగార రాసిక్యము వెల్లడి యగుచున్నది. శాంతము—శృంగారము, వీరము—శృంగారము, భక్తి—శృంగారము అనువిధముగా శృంగారమిందు చిత్రితమైనది. శతకమునఁగూడ భక్తి శృంగారములు, శాంత శృంగారములు కలిసినవి.

## ప్ర బం ధ ము న



## శ త క ము న

పై పరిశీలనము వలన ప్రబంధకర్తయగు ధూర్జటి కవీంద్రుఁడే శతకమును గూడ రచించెనని నిరూపణముఁ జేయ వీలగుచున్నది.

## కృతుల ముందు వెనుకలు

ఒక కవి ప్రబంధము, శతకములను రచించెననుటతోడనే వానిలో నేయది ముందు రచించియుండు నన్నదొక ప్రశ్న. మన ధూర్జటి కవీంద్రుఁడు నవ్వానిలో నేదానిని ముందు రచించెనన్న యంశము చర్చనీయమైనది. సర్వసాధారణముగా శతకము తొలిరచన, ప్రబంధము మలిరచన యగుట కలదు. శతకమునఁ గవి కవిత్వము, జీవితమంతను బాల్యావస్థలోనవె యుండును. పరిణత మనస్కుఁడు వయస్కుఁడైన తరువాత ప్రబంధరచనము సేయును. శతకమున నితివృత్తము, కథానిర్మాణములనునవి నిబద్ధములు కావుగాన, నందు భావము, భాష, శైలి యనునవి స్వేచ్ఛగా నుండుట కవకాశముండును. నిబద్ధముగాఁ బ్రబంధముగా రచించు కావ్యమున నట్టి స్వేచ్ఛా విహారమున కవకాశములేదు. ఈయభిప్రాయము తోడనే పలువురు పండితులు ధూర్జటియు శతకమునే తొలుత రచించి, ప్రబంధము నాపల రచించి యుండుననుటకు, వయస్సునందును, మనఃప్రవృత్తియందుమఁ గనుపట్టు భేదమే కారణమని పలుకుదురు. కాని రెండు కృతులను జాగరూకతమైఁ బరిశీలించినప్పుడు ధూర్జటి మొదట ప్రబంధమును రచించి, తరువాత శతకమును రచించియుండునని చెప్పవచ్చును. ఈ విషయము స్థాపించుటకు బాహిరములైన యాధారము లెవ్వియుఁ గానరావు. కృతులందలి భావము, మనఃప్రవృత్తులనే యాధారముగఁ గొనవలసి యున్నది.

1. యవ్వనారంభమున శతకము రచించి, తరువాత ప్రబంధరచనము చేసి యుండుననిన యభిప్రాయమునకు పెద్ద యవరోధమే కలదు. శతకమున రాజగర్హణము మిక్కిలిగా గలదు. రాజలోకాధమశ్రేణి, రాజకీటకములు, దుర్బీజశ్రేష్ఠులు, నృపాలాధముల్, దుర్మార్గులు, లోకకంటకులు, అధముల్, భూభృచ్చండాలురు—వరుసగా 2, 27, 39, 63, 83, 98, 113, 115 పద్యములు—అను రీతిని రాజ శబ్దమున్నంతనే తీవ్రాతి తీవ్రముగా దూషించినాడు కవి. అట్టి కవి మఱి "కృష్ణరాయ కిరీటకీలితమణి గణార్చిత పదాబ్జ శ్రీ వహించుట"[1] గాని "పాదవినమ్ర కృష్ణవర రాడ్గంభీర కోటీర నిస్ఫుటరత్నద్యుతి పాటలీకృత పదాంభోజుఁ"[2]డగుటగాని సంభవించునది కాదు.

2. ప్రబంధమునఁ దనకృతి కన్యారత్నమునకు పతి నన్వేషించిన కవి, శతకమున "నీకుంగాక కవిత్వమెవ్వరికి నేనీనంచు"[3] శపథము చేసినాడు. ఈ వాక్యము ధూర్జటి మనః పరిణతిని సూచించుచున్నది గదా!

3. శృంగార రసపోషణమునను కవి ప్రబంధములో సందర్భౌచిత్యమున్నను, లేకున్నను గొన్నిచోట్ల నతివేలముగా గూడ కావించియున్నాఁడు.[4] శతకమున వైరాగ్య, భక్తిభావములకు పోషకములుగా శృంగార ప్రస్తావము చేసియున్నాడు.

4. లోకమును బాగుగాఁ జూచి, జ్ఞాతివైరమనుభవించి, సాంసారిక జీవితము ననుభవించి, రోసి, యార్తిఁజెంది, పరమేశ్వరుని కృప కన్నులు చాచువానిగా ధూర్జటి, శతకమునఁ బ్రత్యక్షమగును.

5. శ్రీకృష్ణదేవరాయలచే బహూకృతుఁడయిన కవి కేవల శతక రచనముచేఁ గాఁ బోఁడు. ప్రబంధరచనా కౌశలము చేతనే ప్రబంధయుగకర్త, ప్రబంధ

---

1. శ్రీ.కా.స్థ.మా. 1-17 2. ర.ప. 1-15 3. శ్రీ.కా.శ. 114

4. శ్రీ.కా.మ.—శృంగారరాసికృము ప్రబంధ, శతకముల సాదృశ్య నిరూపణ మందలి అంశము.

కవుల నష్టదిగ్గజములుగా గలవాఁడు, స్వయముగా ప్రబంధ నిర్మాత యయిన శ్రీకృష్ణ రాయలమెప్పు వొందును.

కృష్ణరాయల మెప్పువొందిన కవి కృతినేల యంకితమీయలేదను ప్రశ్నకు మనమీవరకే సమాధానము చెప్పికొనియుంటిమి.[1] కవిస్వాతంత్ర్యమును సహృదయముతో గౌరవించువాఁడు రాయలు. రాయలకు కృతుల నంకితమీయని మల్లన్న, రామభద్రు లాయాస్థానములోని వారలే. పరమత సహిష్ణువగు రాయలు, ధూర్జటి ప్రబంధ నిర్మాణ కౌశలమునకు ముగ్ధుఁడై, యాతని యతులిత మాధురీ మహిమను వేనోళ్ళ గొనియాడినాఁడు.

రాయల గౌరవాదరాభిమానములనుభవించుచు, స్వతంత్రుఁడై మనిన మన కవీంద్రుఁడు రాయల యనంతరము, పెద్దన బాధపడినట్లే, ధూర్జటియు "ఊరూరం" దిరిగి వివిధ రాజాస్థానములందుఁ దనకుఁ దిరిగి యట్టి స్థానము దొరకకుంటచే, రాజ దూషణ మంతగాఁ జేసినాఁడు.

6. "దినముం జిత్తములో సువర్ణముఖరీతీర ప్రదేశాశ్రమా
సన మధ్యోపల వేదికాగ్రమున నానందంబునఁ బంకజా
సన నిష్ఠ"[2]తో భగవద్ధ్యానమాదరించుట కవికి జీవితమున రెండవ మలుపునకు సంబంధించినదే కాని మొదటిది కాజాలదు.

7. ఛందస్సు : ప్రబంధమున గనవచ్చు ద-ధ లప్రాస, రేఫద్వయ ప్రాస, ద-డ ల ప్రాస, ల-ళ ల ప్రాసలు శతకమున లేవు.

---

1. రాయల యాస్థానప్రశంస "ఊరు—పేరు" అను ప్రకరణములోని అంతర్భాగమునఁ బరిశీలించియుంటిమి.
2. శ్రీ.కా.శ.—35 ప.

పైనఁ జెప్పినిన కారణములచే ధూర్జటి కవీంద్రుఁడు తొలుత ప్రబంధ నిర్మాణముఁ గావించి, రాయల యనంతరము "ఉరూరు" తిరిగి, వేసటఁజెంది, లోకముపై, జీవితముపై రోసి, జీవితానుభవముల నెల్ల స్మరించుకొనుచు, భగవంతునకు నివేదించు కొనుటగా శతక రచనము చేసియుండునని భావించుటయే లెస్స.

—(०)—

# కావ్యము : ప్రబంధము

ప్రబంధయుగముగాఁ పేరందిన రాయల యుగమునుండి ప్రబంధ శబ్దవాచ్యము లైన కృతులనేకములు నిర్మింపఁబడుచువచ్చినవి. 'కావ్యము, ప్రబంధము'ను రెండు పదము లొకటియా ? వేర్వేఱు పదములా ? అన్న చర్చ యీవరకు సాగి యున్నది. కావ్య భేదములుగాఁ బేర్కొనఁబడిన వానిలో నీ 'ప్రబంధము' లేదు. కాని 'కావ్య' భేదములఁ బేర్కొనుచు ధ్వన్యాలోకకారుఁడు ప్రబంధశబ్దము నుపయోగించియున్నాఁడు.

"పర్యాయ బన్ధః ఖణ్డకావ్య స్వరూపః
సమాప్తాయా మప్యవాన్తర క్రియా
యాం వసన్తాద్యేకతమ సర్గనీయ
వస్తు వర్ణనాత్మకః ప్రబంధః"

"ఆఖ్యాయికా క్వాచిత్క వక్త్రాపరవక్త్రా
దిచ్ఛన్దస్క ఉచ్ఛ్వాసాశ్వాఖి
దవిభాగే గద్యప్రచురః ప్రబన్ధః"

"కథా సజ్జన దుర్జన వృత్తాన్త వర్ణనపరః
క్వాచిత్కార్యా వక్త్రా పరవక్త్రా యుక్త ఆశ్వా
సాది శూన్యో గద్యమయః ప్రబన్ధః"

ఆఖ్యాయిక, కథలను గూడ ప్రబంధము పేరుతోడనే వ్యవహరించుట జరిగి నది. సాహిత్య దర్పణ కారుఁడైన విశ్వనాథుఁడు కావ్య ప్రబంధ శబ్దములను సమానార్థకముగనే పలికియున్నాఁడు.

"ననుతర్హి ప్రబన్ధాన్తర్వర్తినాం కేషాంచి నీరసానా పద్యానాం
కావ్యత్వం
నస్యాదితి చేన్నరసవత్పర్యా స్తరత నీరసపదానమివ
పద్యర సేన
ప్రబన్ధ రసేనైవ తేహాం రసవత్తాఙ్గీకారాత్"

(సా.ద.ప్ర–ప–పుట 20)

విశ్వనాథుఁడు భారతేతిహాసమును, రామాయణకావ్యమును గూఁడ ప్రబంధ ములుగనే వ్యవహరించియున్నాఁడు. దృశ్యములైన మాలతీమాధవ, రత్నావళ్యాదు లను గూడఁ బ్రబంధములుగనే పలికియున్నాఁడు.

"కరుణరసస్య దుఃఖహేతుత్వే కరుణరస ప్రధాన రామాయణాది ప్రబన్ధానామపి దుఃఖహేతుతా ప్రసజ్గస్యాత్"

"వర్ణ రచనయో రుదాహరిష్యతే — ప్రబన్ధేయథా — మహాభారతేశాన్తః రామాయణే కరుణః, మాలతీమాధవ రత్నావళ్యాదౌ శృఙ్గారః ఏవమన్యత్ర"

తెనుఁగు లాక్షణికశిరోమణియయిన అప్పకవి కావ్యమును ప్రబంధము, చాటు ప్రబంధములని విభజించి, ప్రబంధమనునది సంస్కృతమున సర్గ విభాగమున నుండఁగాఁ దెనుఁగున నాశ్వాసవిభజనమున నున్నదని తెలిపినాడు[1]. నిబద్ధమైన కావ్యము ప్రబంధమనఁబడినది. మన తెలుఁగు కవులందఱును కావ్య ప్రబంధశబ్దము లను సమానార్థకములైన పర్యాయ పదములుగనే వ్యవహరించి యుండిరి. రాయల యుగమునకుఁ బూర్వము నుండియు నీ ప్రబంధశబ్ద మువయుక్తమగుచున్నది.

తిక్కన కవీంద్రుఁడు విరాట పర్వాదిగా నిర్మించిన భారతమును ప్రబంధ మండలిగనే పేర్కొనినాఁడు.

అతని కంకితమిచ్చిన కేతన తన దశకుమారచరిత్రయందు "తత్ప్రబంధముఖ మండనంబుగా నమ్మహాత్ము వంశావతారంబు వర్ణించెద"[2]ననినాఁడు. శంభుదాసుఁడైన ఎఱ్ఱాప్రెగడ 'కృతినాయకత్వంబున కభిముఖంబుగా నొనర్చు జగదర్చితంబగు ప్రబంధంబు నిర్మింప నుపక్రమించితి'[3] ననినాఁడు. శ్రీనాథుఁడు "నవరస భావాను బంధ బంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపఁదలఁచి"నాఁడు.[4]

1. అప్పకవీయము — ప్ర.ఆ. 137 ప. 1901 ప్రచురణ — యుద్దనపూడి సంజీవయ్యగారి పరిష్కరణ.
2. ద.కు.చ. 1 ఆ — 26 ప.
3. హరి.వం. 1-15
4. శృం.నై. 1 ఆ — 8 ప.

అతఁడే "నైషధకావ్యంబు చెప్పంబొడంగితి"[1] ననియుఁబలికెను. హరవిలాసమును కావ్యమును బ్రబంధముగా పేర్కొనినాఁడు శ్రీనాథుఁడు.[2] జక్కన "ప్రబంధ కావ్యమునందు"[3] అని ప్రబంధమును కావ్యభేదముగా బలికియుండుట విశేషము. పింగళి సూరన 'మహాకావ్యంబునందు ప్రబంధపరిపూర్తిశోభనంబైన'[4] కావ్యములను, నాటకములను ప్రబంధములుగాఁబేర్కొనుట యుండగా, స్థలపురాణ గ్రంథములయిన నృసింహపురాణము[5] భీమేశ్వరపురాణము[6] పాండురంగమాహాత్మ్యము[7] ఘటికాచల మాహాత్మ్యము[8]లును ప్రబంధశబ్దమును కావ్య, కృతులపరముగా వాడియున్నవి.

పై విషయములు పరిశీలించగా 'కావ్య, ప్రబంధ' శబ్దములు పర్యాయ పదములుగా సమానార్థకములుగనే యుపయోగింపఁబడినవని చూడఁగలము. ప్రబంధయుగముగా వెలుఁగొందిన రాయల యుగమున నావిర్భవించిన ప్రబంధములందలి సామాన్య లక్షణములను పరిశీలించి, ఆధునికవిమర్శకులు ప్రబంధలక్షణములను వానిఁ గొన్నిటిని తెలిపి యుండిరి. ఈ లక్షణములు, తత్పూర్వయుగ ప్రబంధమందలి లక్షణములకు గొన్ని సందర్భములం దన్వయింపవు.

1. స్వతంత్రేతివృత్తము 2. వస్త్వైక్యము 3. ఏకనాయకాశ్రయము 4 వర్ణనప్రాచుర్యము 5. శృంగారరసప్రాధాన్యము 6. అలంకారికమైన రచన.

---

1. శృం.నై.–1 ఆ–18 ప.
2. హర.విలా.–1 ఆ–12 ప.
3. వి.చ. 1 ఆ-27 ప.
4. కళా.పూ. 8 ఆ. గద్య
5. నృ పు –1 ఆ-14, 20, 23, 25, 27, 28
6. భీ.పు. 1 ఆ-17, 23, 24, 30, 87
7. పాం.మా. 1 ఆ–19 ప.
8. ఘ.మా. పీఠిక–9 ప. 60 ప.

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము

## ప్ర బం ధ ము

ప్రకృష్టముగా నిబంధింపబడినది ప్రబంధము ప్రబంధ శబ్దము కావ్యపరముగాఁ బ్రయోగింపఁబడుటయు, ప్రబంధ, కావ్య శబ్దములు పర్యాయ పదములుగా వ్యవహరింపఁబడుటయుఁగలదు. ప్రబంధయుగముగాఁ బరిఢవిల్లి, బహుళముగాఁ బ్రబంధ శబ్దవాచ్య గ్రంథరాజములు వెలసిన శ్రీకృష్ణదేవరాయల కాలమునుండి 'ప్రబంధ' మనుదానికి సామాన్య లక్షణములుగా నాధునిక కావ్య విమర్శకులు గుర్తించిన వానిని మన ధూర్జటి కృత ప్రబంధమున సమన్వయముఁ బొందిన రీతినిఁ జూడఁదగును. కవీంద్రుఁడే కంఠోక్తిగాఁ గృత్యవతరణిక యందు "నాయొనర్పంబూనిన శ్రీమత్కాళహస్తి మాహాత్మ్యంబను మహాప్రబంధం బనంబ"[1] అని పలికి యున్నాఁడు.

ప్రబంధ లక్షణములు :- 1. స్వతంత్రేతి వృత్తము 2. వస్త్వైక్యము 3. ఏకనాయకాశ్రయము 4. వర్ణన ప్రాచుర్యము 5. శృంగారరస ప్రాధాన్యము 6. ఆలంకారిక రచన.

### 1. స్వతంత్రేతి వృత్తము – (కావ్యవస్తువు)

'ఇతివృత్తంతు కావ్యస్యశరీరం పరికీర్తిత'మ్మని[2] భరతముని నాట్య శాస్త్రమునఁ బేర్కొని యున్నాఁడు. ప్రబంధమునందలి యితివృత్త స్వీకరణముఁ బరిశీలించిన నది స్వతంత్రేతి వృత్తమని ధృవపడఁగలదు. మన ప్రకృత ప్రబంధేతి వృత్తమునకేమయిన యాకరము గలదేమొ యని పరికించిన యెడల నిది యనువాదము కాదనియు. పురాణాదికములనుండి గ్రహించిన కథాంశముల నొక సూత్రమునఁ గూర్చి ప్రపంచించె నని తెలియును. గ్రంథము విషయమున పలుసినంత చర్చ యీపటికే జరిగియున్నది. ప్రబంధమునఁ గృత్యవతరణిక యందుఁ గవీంద్రుఁడు

... ... ... ... ...
... ... ... తత్చారిత్ర మాలింప నిశ
పగునేని న్విను, మమ్మహత్త్వము పురాణాబ్ధి న్మథింపంగఁ బూ
ర్ణగతిం బుట్టిన మోక్షలక్ష్మికి విహార స్థానమై యొప్పగున్"[3]

---

1. శ్రీ.కా.మా. 1 ఆ-16ప. 2. నా.శా. 19 అధ్యా. శ్లో. 1
3. శ్రీ.కా.మా. 1 ఆ-62 ప.

అని ప్రపంచశర్మగారే బలికించి యున్నాఁడు. తన ప్రబంధేతివృత్తమున కాకరమనేక పురాణాంతర్గత కథాంశములని యతని వాక్యము. స్పష్టముగ నొక గ్రంథమును మూలముగాఁ జేర్కొని యుంటలేదు.

**మూల గ్రంథ ప్రశంస - అనుమాన నివారణము :**

ధూర్జటి వంశీయుఁడును, 'శ్రీకాళహస్తి స్థలమాహాత్మ్యమునకుఁ గర్తయునగు' లింగరాజు తన ప్రబంధకృత్యవతరణిక యందు

"విను కాళహస్తిమహిమం
బనుపమమై వెలయు మును షడధ్యాయికథన్
దెనుఁగున గావ్యముగ నొన
ర్చెను బెదధూర్జటి కవీంద్రశేఖరుఁడనఘా"[1]

అని పేర్కొని యుండుటచే, ధూర్జటి కవీంద్రుని ప్రబంధమునకు 'షడధ్యాయి' యనునది మూలమగునేమొ యని విమర్శకులూహించి పరిశీలించి యున్నారు. స్కాందపురాణాంతర్గతమగు వైష్ణవ ఖండమందలి వేంకటాచలమాహాత్మ్యమున ముప్పయవ యధ్యాయము మొదలు ముప్పదియైదవ యధ్యాయము వఱకును గల కథాభాగమే యీ షడధ్యాయి కథయని శ్రీ తిమ్మావఝ్ఝలవారూహించిరి.[2] కాని యందు స్వర్ణముఖరి నదీమాహాత్మ్యము, శ్రీకాళహస్తీశ్వర నామ ప్రసక్తి మాత్రమే కలదని శ్రీ చిలుకూరివారు పలికి యుండుటచే[3] షడధ్యాయి యొక్కటియె మూలము కాజాలదని తెలియుచున్నది. ఇఁక లింగరాజుకృతమైన "శ్రీకాళహస్తి స్థలమాహాత్మ్య" ప్రబంధమునకు మూలమనఁబడిన "శివరహస్య సంగ్రహము" దీనికి మూలము కాదని యాలింగరాజు వాక్యములే తెలుపుచున్నవి.

"బహుపురాణమథిత భవ్యార్థ శివతత్వ, సారమెల్ల నైక్య సరణిం బొదలి
జగతి శివరహస్య సంగ్రహమను నితి, హాసమొనరు విబుధు లభినుతింప"[4]

1. శ్రీ.కా.స్థ.మా.ప్ర.ఆ. 28 ప.  1. భారతి-నవంబరు-1960
3. శ్రీ.కా.మా. పీఠిక – పుట 20-2వ పేరా, 12, 13, 14 పంక్తులు.
4. శ్రీ.కా.స్థ.మా. – 1 ఆ-29, 30 ప.

"ఆ యితిహాసంబునందలి యుత్తర భాగంబునందు భాస్వన్నిరూఢి గాళహస్తి మహత్త్వ కథ నూట యిర్వది యధ్యాయములఁ జెలువమరు చుండు" పై వాక్యముల వలన 'షడధ్యాయి కథ', 'శివరహస్య సంగ్రహము'లు వేర్వేఱని తేలుచున్నది. లింగరాజు ప్రబంధమునందలి కథలు, ధూర్జటి ప్రబంధములందలి వానితోఁ బోల్చి చూచినపుడు భేదము లెక్కువగా గనుపట్టుచున్నవి. లింగరాజ కవి ప్రబంధమునకు మూలమనఁదగిన సంస్కృతమున 'శ్రీకాళహస్తిమాహాత్మ్య'మొకటిగలదు. నత్కీరుని కథ యాప్రబంధమున లేదు. పశిష్ఠుఁడు మొదలగువారి చరితములు భిన్నములుగా నున్నవి. శ్రీ, కాళ, హస్తులయు, తిన్ననివియునైన పూర్వజన్మ గాథలు పోలికలేక యున్నవి. కనుక నా సంస్కృత కాళహస్తిమాహాత్మ్యముగూడ ధూర్జటి ప్రబంధమునకు మూలమనరాకున్నది. మూలగ్రంథములుగా శంకింపఁబడిన "షడధ్యాయి కథ", సంస్కృత 'కాళహస్తిమాహాత్మ్యము'ల నుండియు, ననేక పురాణములనుండి, శైవాగమములనుండి మోక్షార్థులయిన శివభక్తులచరితములందుఁ గొన్నిటిని తీర్థ, క్షేత్ర, దైవత సంబంధములయిన వానిని–స్వీకరించి యొక ప్రణాళిక[1] ననుసరించి రచింపఁబడిన దీ ధూర్జటి కవీంద్రుని శ్రీకాళహస్తిమాహాత్మ్యము. కవీంద్రుఁడు కృత్యవతరణిక యందుఁ గంఠోక్తిగాఁ బలికియున్నట్లు "అమ్మహత్త్వము పురాణార్థిన్మథింపంగఁ బూర్ణంగతి బుట్టిన మోక్షలక్ష్మి"యే శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రబంధేతివృత్తము. కావున నిది స్వతంత్రేతివృత్తము.

**2.** వస్త్వైక్యము :– క్షేత్ర మాహాత్మ్య ప్రబంధములందు వస్త్వైక్యము లోపించుననుట కలదు. కాని యాకథలయందు భగవద్భక్తి, భగవన్మహిమము లనునవి పూసలలోని దారము పోలె ననుస్యూతముగ సర్వత్ర వ్యాపించియుండును. ధూర్జటి ప్రబంధమున "శివభక్తి" యను దేకసూత్రత ఘటిల్లఁజేసి కథాశరీరమునకు జీవమై నెగడినది.[2]

---

1. వస్తు స్వీకరణ–నిర్వహణ అను ప్రకరణము ముందుకు రానున్నది.
2. శ్రీ.కా.మా. 1అ-8 ప.

ప్రబంధప్రారంభమున

"శ్రీవిద్యానిధియై మహామహిమచేఁ జెన్నైన పక్షోజ లూ
తావాతాశన సామజాటవిక గోత్రాదేవ నత్కార రా
జీవాక్షీయుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యా
ర్యావామాంగము దివ్యలింగము మదీయాభీష్టముల్ప్రోవెడున్"[1]

ఈ పద్యమునందు నిర్వహింపనున్న తథాప్రణాళికాక్రమము, పస్త్వైక్యములు సూచితములయినవి. "ఆర్యావామాంగము, దివ్యలింగము"నైన ఈశ్వరుని మహిమాను వర్ణనమిందు వస్తువనియు, నది క్రమముగ నిర్వహింప నున్నాననియు కవి పలుకు చున్నాఁడు. ఈ కథా మణిహారమున నొక మణి ప్రమాదవశమున జారిపోయిన దనిపించును. అది అగస్త్యుని కథ. అది కథనమునకాదు, సూచనమయిన యీపద్యమున సువర్ణముఖరీనదీ యవతరణమునకుఁ గారకుఁడయిన యామహర్షి వృత్తమునేల సూచింపలేదను నది పరిశీలనార్హము. తదితర భక్తులనుఁ బేర్కొని, యగస్త్య మహర్షిని ప్రారంభమున స్మరింపకుండుటలోని విశేషమేమని చూచిన, కవీంద్రుఁడెంత జాగరూకత వహించెనో తెల్లము కాగలదు. ఎల్లరును మోక్షార్థులై, తపించి, సేవించి, పూజించి పరమేశ్వరుని మహాలింగముగనో, జంగమ మూర్తిగనో ఈశ్వరుని సాక్షాత్కార ముఁబొందిననారే. అగస్త్యుఁడు మోక్షార్థికాక, పుణ్యస్థలమున నొక్కనదిఁ బ్రవహింపఁ జేయఁ దలంచి యందుకలకై యీశ్వరునిఁగూర్చి తపంబొనరించినాఁడు. గగన వాణియు బ్రోత్సహించినది.[2] మోక్షార్థికాని యామహర్షికి తానుఁగా గన్పింప నక్కరలేదని యీశ్వరుఁడు బ్రహ్మనుద్దేశించి పలికి,[3] యామహర్షి కోరిక తీర్పుమని యతని నియో గించెను. బ్రహ్మ ప్రత్యక్షమై, యగస్త్యుఁ డర్థించినట్లు సువర్ణముఖరీనదీ ప్రవాహము నావిర్భవింపఁజేసెను. కనుక యగస్త్య చరితము సూచితము కాలేదు.

1. శ్రీ.కా.మా.ప్ర.అ. 1 ప.
2. " " " 120 ప.
3. " " " 136 ప.

మోక్షార్థులై, యీశ్వరు నుద్దేశించి, తపమాచరించి, సేవించి, భజించి, పూజించి, దర్శించి, తరించిన భక్త చరితములనే తన ప్రారంభపద్యమున సూచించి యున్నాఁడు కవీంద్రుఁడు.[1]

కృత్యవతరణిక యందలి ప్రారంభ పద్యమందిట్లు సూచించిన కథా క్రమమును, తరువాతి యాశ్వాసములందు, నాశ్వాసాద్యంతములందు భవిష్యత్కథాసూచనము, భూత కథాస్మరణములవలనను, పరమేశ్వరుఁడు కారుణ్యరసపూరితేక్షణముల యాదవాధిపున కొనతిచ్చిన క్రమమువలనను, వస్తునిర్వహణము సమర్థముగా గావించి వస్త్వైక్యము సాధించినాఁడు ధూర్జటి కవీంద్రుఁడు.

3. ఏకనాయ కాశ్రయము :

ప్రబంధమున నేకనాయకాశ్రయమను నదియునొక ముఖ్యలక్షణము. ఎనలేని తన భక్తుఁడగు యాదవాధిపునిఁ బరీక్షింపఁదలఁచి జంగమరూపియై యేతెంచిన పరమేశ్వరుఁడు దాసి ననుగ్రహించుట, పతిస్తునకు దక్షిణామూర్తిగ బ్రహ్మవిద్యాపదన భిక్షమిడుట, యాత్మ విద్యాధురంధరుఁడై కుమారు ననుగ్రహించుట, లూతా వాతాశన సామజాటవిక గోత్రాదేవ నత్కీర రాజీవాక్షీయుగమునకు భవబంధములు గోసి సాయుజ్య మొసఁగుట, యాదవాధిపుననుగ్రహించుట యను ప్రబంధమందలి కథా సందర్భములన్నింటి యందును తన సర్వవ్యాపకత్వము, సర్వజ్ఞత్వము, సర్వ సామర్థ్యములను, స్పష్టముగా వ్యక్తీకరించి యుండుట చేతను, విద్యానిధిగా, దేశిక సార్వభౌముఁడుగా, భవవతీశోత్కృతపక్షీశ్వరుఁడుగా, నమభవగోచరుఁడుగఁ బరమేశ్వరుఁడందుఁ బ్రత్యక్షీకరింపఁబడి, తద్గుణమాహాత్మ్యముల వర్ణనము గావించియుండుటచే నీప్రబంధమునకు జగన్నాయకుఁడైన కాళహస్తి పతియే నాయకుఁడు.

ప్రబంధమున నాయక నిర్ణయమున కావ్యరసములుకూడఁ దోడ్పడును. ఈ ప్రబంధమున శాంతమున కంగభూతమై ప్రధానాంగరసముగా 'భక్తి' పోషింపఁబడుట చేతను, భక్తి, శాంతములకు రెండింటికి[2] నీ ప్రబంధమున ఈశ్వరుఁడే గమ్యమగుట చేతను శ్రీకాళహస్తిపతియే యిందలి నాయకుఁడు. కాన నీ ప్రబంధమున నేకనాయ కాశ్రయతకలదు.

---

1. వస్తుస్వీకరణ నిర్వహణము — అను ప్రకరణమున నిరూపింపఁబడును.
2. రసచర్చ మీఁద సాగగలదు.

### 4. వర్ణన ప్రాచుర్యము :-

ప్రబంధలక్షణములో మిక్కిలి ప్రాచుర్యము వహించినవి వర్ణనలు. వర్ణనాధిక్యత ప్రబంధగౌరవమును నినుమడింపఁజేయునని తలంచుటవలననే పలు ప్రబంధములాక్రోవనె నడచినవి. కథాసందర్భమునకు గల యౌచిత్యమును వీడి, కథాగమనమున ఘాటంకములగునట్లు, వర్ణనలు గల ప్రబంధములు పెలగలవు. ప్రబంధములందష్టాదశ వర్ణనలుండునని కొందఱు భావింపగా, నివి యిఱువది రెండు విధములని అప్పకవి చెప్పియున్నాడు.[1] సమకాలిక ప్రబంధోచిత వర్ణనములన్నియు ధూర్జటి కవీంద్రుఁడు కావించియే యున్నాఁడు. కాని కథాసందర్భౌచిత్యము నెఱిగి రసపోషణమున కుద్దీపకముగానె కవీంద్రుఁడు వర్ణనలఁ గావించెను. పాఠకుని కథోన్ముఖుని గావించుట కుపకరించునవియే ధూర్జటి వర్ణనలు.[2]

### 5. శృంగార రస ప్రాధాన్యము :-

శృంగారము నంగి రసముగాఁ బోషించుట ప్రబంధ సామాన్యలక్షణములలో నొక్కటిగాఁ బరిగణింపఁబడుచున్నది. మన ప్రకృత ప్రబంధమున శాంతము ప్రధాన రసము[3]కాగా దానికంగభూతముగా నీ శృంగారము పోషింపబడినది. దైవ విషయిక మగు రతిచే గలుగు భక్తిరసము శృంగారాంతర్భాగముగనే రసగంగాధరకర్త పరిగణించెను. అట్టి దైవ విషయికమగు శృంగారమే కాక, యిందు లౌకికమగు శృంగార పోషణమును జరిగినది. ధూర్జటి రస హృదయ సౌరభమిందు గుబాళించుచునే యున్నది.

### 6. ఆలంకారిక రచనము :

రసోచితమైన రచనమే యాలంకారిక రచనము. అనగా అర్థాతిశాయి యైన శబ్దాడంబరము, శయ్యావైగనిగ్యమని పరమార్థము. "ప్రబంధశయ్యా" అనునదొక రచనా విశేషముగా వినుతి కెక్కినది యొకటి కలదు. ప్రబంధశైలీ ప్రాగల్భ్యమున్నచాలును, నదీ పట్టణముల వర్ణనలు కొఱవడినను నది ప్రబంధముగనే పరిగణింపఁబడుట పరిపాటి. రచనయందు ధూర్జటి యాయలంకారమును గమపరచెను.[4]

---

1. అప్పకవీయము – 1 ఆ-139 మఱియు 140 ప.
2. 'వర్ణనలు' అను ప్రకరణము ముందు గలదు.
3. 'రస నిర్వహణము' ప్రకరణము ముందు రాగలదు.
4. అలంకార రచనము – శైలీ అను ప్రకరణము రానున్నది.

ఈ విధముగా ప్రబంధలక్షణములన్నియు సమన్వయము పొందుటచే ధూర్జటి మహాకవి కృత 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' ప్రబంధమై విరాజిల్లుచున్నది. క్షేత్రమాహాత్మ్యముల వర్ణించు గ్రంథరాజములు ధూర్జటి పూర్వమున్నను, నవి ప్రబంధములుగా పేర్కొనఁదగినవి లేవు. ఈ కావ్యము స్థలపురాణమహిమ కథనము 'ఏ క్షేత్ర మాహాత్మ్యమై,* ప్రబంధము లందు ప్రముఖ స్థానమలంకరించు చున్నది.

)—o—(

* క్షేత్ర మాహాత్మ్యములు — శ్రీ కాళహస్తి మాహాత్మ్యము అను ప్రకరణము ముందు రాగలదు.

# కావ్యవస్తు స్వీకరణము : నిర్వహణము

"శ్రీ కాళహస్తి మాహాత్మ్యము"నఁ గథావస్తువు శ్రీకాళహస్తిక్షేత్ర మహిమము, శ్రీకాళహస్తీశ్వరుని భక్త వాత్సల్యము, వీని ప్రకటనమునకు దీపకములుగ శివభక్తుల చరిత్రములు స్వీకరింపఁబడినవి. పలువురు శివభక్తుల గాథలు వర్ణితము లయినను సర్వత్ర 'శివభక్తి' యను సూత్రముచే* గ్రథితమగుట వలన నిందు వస్త్వైక్యము కలదని పూర్వప్రకరణమున నిరూపింపఁబడినది. ఆయా కథలను స్వీకరించిన యుద్దేశ్యము, వానిని నిర్వహించిన తీరును పరిశీలించుట యీ వ్యాసమందలి ప్రయోజనము.

ప్రతిపాదిత వస్తువు క్రమ పరిణామమునందుట కథానిర్వహణము. పూర్వాపరములయిన కథా ఘట్టము లుత్తరోత్తరములకు దోహదకరములుగా నుండుట పూర్వోత్తరకథా సందర్భము లవిరోధముగా నుండుట కథా నిర్వహణమునకుఁ బ్రధానములు.

ప్ర ణా ళి క :

ప్రారంభ పద్యమున కథాసూచనము జరిగినట్లు, తరువాత కథాకథనము సంగ్రహమును, నాశ్వాసాద్యంతములందును భవిష్యత్కథా సూచనమును, పూర్వ కథా స్మరణములును గావింపఁబడుటఁ గాంచఁగలము.

ధూర్జటి కవీంద్రుఁడు ఈశ్వరునిచేఁ బలికించిన కథలు చూడ నొక విచిత్రమయిన భావన తోఁచఁగలదు. శ్రీ విద్యోపాసకుఁడైన కవీంద్రుఁడు, మోక్షార్థులై, పరమేశ్వరుని సాక్షాత్కారముఁ బొంది పశుపతి యనుగ్రహ పాత్రులై సాయుజ్యమందిన శివభక్తుల గాథలను స్వీకరించిన సంఖ్య, యాతని యుపాసకదైవత సంబంధులుగాఁ గనుపట్టును. "వశిష్ఠ, అజ, లూత, వాతాశన, సామజ, ఆటవిక, గోత్రాదేవ, నత్కీర, రాజీవాక్షీయుగము"ల కథలు శ్రీచక్రమునకు గల నవావరణములను స్ఫురణమునకుఁ దెచ్చుచున్నవి. కథాసూచకమైన ప్రారంభ పద్యమున నగస్త్యుఁడేల విడువబడెనో వెనుకటి ప్రకరణమునఁ గాంచితిమి.

* శ్రీ.కా.మా. 1 అ-8 ప.

అందు బ్రహ్మ యేల గ్రహింపఁబడెననుట నిప్పట్లు విచారింతము. బ్రహ్మ కథను స్వీకరించుట యందలి యుద్దేశము, నిర్వహణము, ప్రయోజనములు ముందు విపులముగాఁ జర్చింపఁబడును. స్వీకరణమందలి యౌచిత్య మొక్కవాక్యమున గ్రహించిన నింతకుఁ జాలును. అఖిల భూతాత్మమూర్తి[1], ఆత్మ విద్యాధురంధరుఁడు[2] నైన కొడుకుఁ బడయంగోరి సర్వేశ్వరునిఁగూర్చి ఘోరతపమాచరించిన బ్రహ్మ పరమేశ్వరు చిదాకృతిని దర్శించి, యా మహేశ్వరు నానతి నొక వ్రతంబునడిపి, కృతార్థుఁడయ్యెను.

పూర్వము భావించిన రీతి, మోక్షార్థులయి యాత్మ విద్యారతులునై శివా నుగ్రహముఁ దొందిన శివార్చకుల గాథలిందు స్వీకరింపఁబడుటచే, బ్రహ్మ కథ కథాసూచనమున గైకొనఁబడుటయు, నగస్త్యుని కథ సూచింపఁబడకుంటయు సంభవించెను.

చెలఁది, పాము, నేమఁగుల కథలు క్షేత్రప్రశస్తికి, శ్రీ కాళహస్తీశతా ప్రాచుర్యమునకుఁగారణములయినవి. అట్టి దైవతావిర్భావమునకు మూలపురుషుఁడైన వశిష్ఠుని కథ, తీర్థము నవతరింపఁజేసి, తీర్థమహిమమునకు గారకుఁడైన యగస్త్యుని కథయు నీ "శ్రీకాళహస్తుల" కథయు ముందుగాఁ బూర్వరంగముగాఁ గథితము లయినవి. వశిష్ఠుని వలన ఫణారాజన్మహా లింగరూపిగా భూలోకమున నవతరించిన ఈశ్వరుని యొక్కయు, నగస్త్యుని తపఃఫలముగా నావిర్భవించిన సువర్ణముఖరీ నది యొక్కయు మహిమల ప్రకటనమునకుఁ దొలుతగా బ్రహ్మతపము, బుభువు జననములుఁ జేర్కొనఁ బడినవి. మిగిలిన శివభక్తులెల్లరు నా తీర్థ తీరమున, నాక్షేత్ర దైవతమునర్చించి, దర్శన భాగ్యమంది, తరించిన వారె.

పరమేశ్వరుని యష్టమూర్తులలో నొక్కఁడైనం గారము పుట్టఁజూచ రాదనియు నీశ్వరుని చిదాకృతి మవలోకింపఁగా నేరమనియు బలికిన బ్రహ్మ వాక్యములచేత స్తుతింపఁబడిన యా చేతోగమ్యుని నితర ప్రాణులు సేవించి యెట్లు ధన్యతఁజెందినవను దానికి సమాధానమీశ్వరుఁడే పలికియున్నాఁడు.

---

1. శ్రీ. కా. మా. 2ఆ 70 ప.

2. ,, ,, ,, 73 ప.

"దేహమోహంబు విడిచి సందేహముగి
భక్తి భజియించి ..."[1] న వారు కామిత పదముగాంచిరని నట్లు
'లూతావాతాశన సామజాటవిక గోత్రాదేవ నక్ర్కర రాజీ వాక్షి
యుగ' మభవునర్చించి తరించినారు.

"దేవ ! నీవంటి దేవుండు, దివ్య తీర్థ
రాజములలోన దక్షిణ రజతగిరి
వంటి క్షేత్రంబు, నావంటి వాంఛితార్థ
సిద్ధుఁడు, నరుడు ధర విమర్శించి చూడ"[2]

నని బ్రహ్మ పలికినట్లు తీర్థ క్షేత్ర దైవతముల మహిమానువర్ణనమే యీ ప్రబంధమునఁ గథావస్తువు. ప్రబంధమున బలుకబడిన కథలన్నియు నీ మూర్తిత్రయాత్మకను పరమేశ్వరారాధన తత్పరములే. భగవానుఁడు క్షేత్రాత్మ, తీర్థాత్మ, మూర్త్యాత్మ యను మూర్తిత్రయ రూపమున దీపించుచు నారాధింపఁబడునని పాండురంగ మాహాత్మ్యకర్తయుఁ జెర్కొని యున్నాడు.[3] కాళహస్తి క్షేత్రమహిమలువిని, వచ్చి చోద్యములు కనుంగొనఁగా నచట మహాలింగమున కాలయము లేకుండుటఁగాంచి యాదవాధిపుని నియమించు నుద్దేశముతో జంగమ స్వరూపమునఁ బరమేశ్వరుఁడు, వాని యెడల మాహాత్మ్యముఁ బ్రకటించి, ప్రభువు నాకర్షించి "కలధౌత శైల శిఖరాలయ గేహము' గట్టఁ బం" పుమని[4] నియమించుటతో క్షేత్ర, తీర్థ, దైవత మాహాత్మ్యముల కథన మారంభమైనది. "కాళహస్తి శశిశేఖరు దివ్య నివాస పంక్తి మోహనముగఁ గట్టఁబంచెద" నని, ప్రభువు 'తదాది పురాణ కథా ప్రసంగములఁ' గృపాంబుధివై తెలియఁబలుకు' మని వేడికొనెను. మూర్తి త్రయాత్మకుఁడైన యీశ్వరుని మహిమములను బలికి యా జంగమ రూప భర్గుడు తుదకు మఖల 'నమ్మహాదేవుని నివాసంబుఁగట్టింపు'[5] మని కృతార్థుఁడయ్యెదవని యనుగ్రహించి యంతర్హితుఁడగుటతో కథ ముగిసినది. ఈ నాలుగాశ్వాసముల కథ యాదవ ప్రభు

1. శ్రీ. కా. మా. 4ఆ 197 ప.
2. ,, ,, 2ఆ 76 ప.
3. పాం. మా. 2ఆ 104 ప.
4. శ్రీ. కా. మా. 1ఆ 60 ప.
5. శ్రీ. కా. మా. 4ఆ 198 ప.

ప్రశ్నములకు సమాధానముగా జగత్ప్రభుఁడు గావించిన కథనము. "తుషార శైల తనయా జాంపత్య సంపన్న పావన గార్హస్థ్యము, కైవల్యాకర దానామృతాశన రత్నంబు" నైన కాళహస్తిపుర దైవము, తన భక్తుల సేవాసక్తి, శ్రద్ధాభక్తులఁ బరీక్షించి, సాయుజ్యమిచ్చి యనుగ్రహించిన రీతియు నొక తీరుగాఁ దీర్పఁ బడి నట్లున్నది.

వశిష్ఠ మహర్షి వేడినట్లు 'యుగములనెల్లన్,' ఘోర సంసార గదాపన్నౌషధ ఘటికా మహామోన్నతిఁ బూజఁ" గొను బయంబీశ్వరుఁడు నాల్గుయుగములందలి భక్తుల ననుగ్రహించుట చూచిన, కథా నిర్మాణమునఁ గవీంద్రుఁడెంతటి మెళకువతో వ్యవహరించెనో తెల్లము కాఁగలదు.

ఇఁక స్వీకరించిన కథలయందలి పరిణామముఁగాంచినపుడును ధూర్జటి కవీంద్రుని జంతు స్వభావ క్రమపరిణామ శీల పరిశీలన సామర్థ్యము వెల్లడియగు చున్నది.

కృత యుగమున కీటకము గూడ మోక్షార్థియయ్యెననుటలో తదితర ప్రాణి కోటి జీవన విధానము, ఆధ్యాత్మికౌన్నత్యములు స్ఫురింపజేయు చున్నాఁడు కవి. అట్లే త్రేత ద్వాపరములందు కొంత పగ, అహంభావములు గల జంతువులు కూడ మోక్షార్థులయినట్లు వర్ణింపఁబడినది. జంతు శ్రేణి యందు కీటకము, పాము, నేనుఁగు లొకదానికంటె నొకటి యించించుక వివేకవంతములయినవిగా గోచరింపఁ గలదు. ఇఁక కలియుగమున మానవులందు వనచరుఁడు, జీవహంతయైన కిరాతుని ముగ్ధభక్తి వర్ణింపఁబడినది. అతనితోబాటు శివబ్రాహ్మణుని యహంభావము, నత్కీ రుని మౌర్ఖ్యమునుఁ బాఱద్రోలి వారి ననుగ్రహించెను. ఈ మువ్వురియందును మానవ మేధా పరిణామ క్రమము సూచితమయ్యెనుగద! తుదకు వారగృహమున జన్మించియు రూపెత్తిన శివమూర్తులుగాఁ బెరిగిన వారాంగనాద్వయమును కొక్కుసారిగ, జ్ఞాన ప్రసూనాంబికా భర్త యర్ధనారీశ్వరుఁడుగా తనకు తానుఁగా ముందడుగు వైచి మెచ్చి కచ్చుటఁ దోడ్పడుచు వానిననుగ్రహించి సాయుజ్య మొసంగెను.

నాలుగు యుగములు వర్చిన యీ యితివృత్తము నాలుగాశ్వాసముల నిబం ధించుటయుఁ గవీంద్రుని ప్రతిభకుఁదార్కాణము. ఈ ప్రబంధము నాలుగాశ్వాసము లుగ విభజింపఁబడుటయందు విశేషము గూడ కడు విచిత్రమై, విశిష్టమై వెలయు చున్నది.

మొదటి యాశ్వాసము క్షేత్రమహిమ శ్రవణ కుతూహలము, పరమేశ్వరుడు పంచముఖుఁడై ఫణిరాజన్మహాలింగరూపమున నావిర్భవించుట, పార్వతియుఁజేరి, ప్రమథగణములును సేవించుటచే దక్షిణ కైలాసముగాఁ బ్రసిద్ధి బొందుట, సువర్ణ ముఖరీ నది జననములు కలిగి యున్నది. అనగా దైవత, క్షేత్ర, తీర్థముల యావిర్భా వకారకములగు కథాంశములు గథితములయినవి.

ఏవంవిధమయిన క్షేత్ర, తీర్థ దైవతముల మాహాత్మ్య ప్రకటనము సృష్టి కర్తవలనఁ గలుగుట లూతావాతాళిన సామజముల వలన క్షేత్రము, దైవతములకు నామసార్థక్యము గల్గుట, రెండవ యాశ్వాసమున నిబంధింపఁబడినవి.

కిరాతుని కథ, నత్కీర కవీంద్రుని కథలు తృతీయాశ్వాసమున బ్రపంచించి బడినవి.

వేశ్యాతనయల కథ, లూతావాతాళన సామజాటవికుల పూర్వజన్మ కథనములు యాదవాధిపుఁడు శశిశేఖరు నినాస నిర్మాణములతో నాలుగవ యాశ్వాసము ముగిసినది.

కథానిర్మాణమునకుఁ బ్రథమాశ్వాసము తొలిదశ, రెండవ యాశ్వాసము మలి దశ, మూడవ యాశ్వాసమున శ్రీకాళహస్తుల గాథ వఱకు ఉచ్ఛదశ మూడవ దశ, కన్నప్ప, నత్కీరుల గాథలుగల భాగము నాలుగవ దశ, నాలుగవ యాశ్వాసమందలి వేశ్యా తనయల గాథ నిర్వహణ దశలుగా బరిఢవిల్లి ధూర్జటి కవీంద్రుఁడు 'పద్మ ప్రసూత్యాదికీటాంతన్యాసకమై * యని నల్లె కథా కథనమునఁ, గాళహస్తి క్షేత్ర దైవత మాహాత్మ్య ప్రకటనమునకు తొలుత బ్రహ్మ తపఃఫలముగా బుధుపు జననము బలికి వెంటనే కీటవృత్తముఁ దెలుపుటయందు సృష్టియందత్యున్నత శక్తి నుండి యత్యల్ప ప్రాణి వఱకు నీశ్వరానుగ్రహము బొందవలసినదేయను సత్యమును చాటుట జరిగినది.

అశ్వాసక్రమమున కవీంద్రుని కథా స్వీకరణ, సన్నివేశకల్పన, నిర్వహణముల నరయఁదగును. కథా నిర్వహణమున వ్యక్తమగు కవిత్వము, వ్యక్తిత్వములు ముందుగ కృత్యవతరణికయందె గుఱుతించును.

---

* శ్రీ. కా. మా. 1అ 88 ప.

కృత్యవతరణిక :—

కావ్యారంభము నిష్టదైవతస్తుతితో నారంభించుట, శ్రీకారముతోఁ బ్రారంభించుటలు సాధారణముగ జరుగలేదిచట. ఈ ప్రారంభ పద్యముననే ధూర్జటి కవీంద్రుని వ్యక్తిత్వము, కవితారీతి వ్యక్తములగుచున్నవి. స్థాపింపమన్న యీశ్వరుని శ్రీవిద్యానిధిత్వము, మహిమము, భక్తవత్సలత, లోకశ్రేయస్కరంబైన యుమాదివ దాంపత్య సావిత్ర్యములను, ధూర్జటి 'శ్రీవిద్యానిధియై' మహామహిమచే, శ్రేయస్కరంబైన వామాంగము' అను పదప్రయోగముచే సూచించి యున్నాఁడు. ఈశ్వరుని సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము సర్వవ్యాపకత్వములందు ధూర్జటికి గల ప్రత్యయము, ప్రపత్తులింపు సూచింపఁబడినవి. కవీంద్రుని శ్రీవిద్యోపాసనము ఆధ్యాత్మిక దృష్టియు స్పష్టపడుచున్నవి.

ఈ పద్యమున ధూర్జటి కవితారీతియు వ్యక్తమగుచున్నది. అలఁతియలఁతి పదములు, బహుళపదఘటిత దీర్ఘసమాసములు, సందర్భౌచిత్యములతో నలరుచు తనలో తాముగా నెట్లు కలసిమెలసి కొనసాగునో యీ పద్యరచనము సూచించుచున్నది.

| పదములు | సమాసము |
|---|---|
| శ్రీవిద్యానిధియై | పశిష్ఠాజలూతావాతాళన |
| మహామహిమచేఁ జెన్నై | సామజాటవిక గోత్రాచేప |
| శ్రేయస్కరంబైన | సత్కిర రాజీవాక్షీయుగ |
| అద్యావామాంగము | యూదవాధిపులకున్. |
| దివ్యలింగము | |
| మగేయాభీష్టముల్సల్పెడున్ | |

ఈ పద్యమున మొత్తముపై శివుఁడు రెండు విశేషణములతో నారాధింపఁబడినాఁడు. 'శ్రీవిద్యానిధి, అద్యా వామాంగము' అను నీ రెండు విశేషణములపై ధూర్జటికి మక్కువ సుక్కిలి. శ్రీవిద్యచేఁ దెలియఁబడువాఁడు, శ్రీవిద్యారూపుఁడు నయిన పరమేశ్వరుని 'శ్రీవిద్యానిధియై' యని ప్రారంభించుట కవి ధూర్జటి జ్ఞాన సంపత్తిని వెలార్చుచున్నది. శివశక్త్యాత్మక రూపమే శ్రీవిద్య. శ్రీదేవి మహత్త్వమును శబ్దరూపమున వెల్లడిచేయునవి శ్రీ విద్యామంత్రములు. ఆమహత్తును రేఖారూపమున వెల్లడిచేయునది శ్రీచక్రము".

* శ్రీచక్ర విలసనము – పుట 20

శివశక్త్యాత్మకమైన శ్రీచక్రముననే ప్రపంచ సృష్టి స్థితి లయములు జరుగు చుండునని వామకేశ్వర తంత్రమునందు గలదు. కావుననే ధూర్జటి తన ప్రబంధ మెల్లెడల ఆర్యామహాదేవితో గూడిన యీశ్వరుని ప్రత్యక్షీకరింపఁ జేయుటకా యన్నట్లు తొలి పద్యమున "ఆర్యావామాంగము"గా దివ్యలింగమును భావించి సంభా వించినాఁడు.

తరువాతి పద్యములందును ధూర్జటి జ్ఞానప్రసూనకలికను, భైరవ, దుర్గాంబ లను గొలిచిన తీరు, కవీంద్రుని శ్రీచక్రార్చనాపరునిగా నిరూపింపఁ జాలినవై యున్నవి.

"సమస్త భక్త భృంగంబులఁ జిన్మరందరస గాఢమఖాత్ములఁజేసి

జ్ఞాన ప్రసూనాంబ యనంగఁగీర్తిఁ[1]" గనిన శివ నారాధించుటయందు ధూర్జటి కవీంద్రుఁడు, సర్వసృష్టియు నా మహాశక్తినుండి యావిర్భవించినట్లు వర్ణించెను. జ్ఞానప్రసూనాంబను 'చంద్రార్ధజూటకోటిజోటి'[2]గా బేర్కొనుట యందునుఁ గవీం ద్రుని బ్రహ్మవిద్యాపై దృష్టి మెఱింగించును. శ్రీవిద్యయే బ్రహ్మవిద్య.

పరమేశ్వరుని తరువాత నీశ్వరస్తుతి జరిగినది. 'సమస్త భక్తభృంగంబులఁ జిన్మరందరస గాఢ మఖాత్ములఁ[3]' జేయు మాత కాన నామె జ్ఞానప్రసూనాంబ యనఁ బరగినది. శక్తి జగత్సృష్టికి, సృష్టికర్తకు మూలముగా నీ పద్యమును నతులం గొన్నది. 'సంతత శివశక్తి సామరస్య జ్ఞానసార మరంద నిష్యందధార'[4] యామె. కామేశ్వరీ కామేశ్వరుల, సముఁమానమయుల సామరస్యమే చిత్తు. ఇది శ్రీ విద్యా రహస్యము. అందువలననే యా తల్లి 'నిఖిలవిద్యారహస్యవాటి' యనియు, "చంద్రార్ధజూటకోటిజోటి" యను పదముచే ఈశ్వరుని యర్ధనారీశ్వరత్వము తెల్పు టయే కాక, 'చంద్రకళా నామాంతరము[5]' గల 'శ్రీవిద్య'ను స్ఫురింపఁజేయు టయు ధూర్జటి కవీంద్రుని ప్రతిభ.

---

1. శ్రీ. కా. మా. 1ఆ 91 ప.
2. ,, ,, ,, 2 ప
3. శ్రీ. కా. మా. 1ఆ 91 ప
4. ,, ,, 1ఆ. 2 ప, 3ప పాదము
5. శ్రీ చక్రవిలససము — పుట — 35 పేరా-పంక్తి 1

శివ 'ప్రసూనకలిక'గా వ్యవహరింపఁబడుటయందు నతిలోక విషయమొకటి నిక్షిప్తమై యున్నట్లుఁ జూడఁగలము. బ్రహ్మాండభాండము నావరించియుండి సంతత జ్ఞానసార మరందమును జాలువార్చునదిగా బోల్పబడుట కవకాశము గల్గినది. 'కలిక' యన గా మొగ్గ. అనఁగా పూవుగా వికసించుటకుఁ బ్రకృతి యయినది. జ్ఞానమను పూవునకు నిత్యము మొగ్గగానే యుండునను భావమున నాపేరు గలిగినదని చెంపఁ దగును. పూవగుటతోడనే దాని లక్షణములు గాన్పి యుండును గదా ! తీవకుఁ బుట్టును, వాసనలీనును, మరందముఁ గురియును, ఆనందమొదగూర్చును, పుప్పొడి కల్గియుండును.

ఆ యన్ని లక్షణములు నిందు రూపింపఁబడినవి. తల్లి మేనాదేవి. లతాంగి యగు నామెకుఁ దొడిగిన లతాంత మీ యమ. ఏమఁగుతోలు కంపుఁ దోగొట్టు జాలినట్టి సుగంధమిచ్చినది, అనుటలో శివశక్తుల యైక్యత, అర్ధనారీశ్వరత్వము స్థాపింపబడినవి. గజము అజ్ఞానమునకు, అహంభావమునకుఁ బ్రతీక గాన అవిద్య యను ఘోర గంధముఁ దొలఁగించు పరావిద్యాగంధమని తలఁపఁదగియున్నది. శివశక్తులకు గల సామరస్యము నెఱుఁగఁజేయు జ్ఞానమను మరందముఁ గురియుచు, పరమహంస భావమందఁగలిగిన వారికి బ్రహ్మానందమొసంగఁ గలిగిన చల్లని తల్లి గాన నీ పద్యమున "పరమహంసోత్తంసభావభృంగవ్రాత తన్మయావస్థాప్రదాన కేళి" యనినాఁడు కవీంద్రుఁడు. తుమ్మెదలకుఁ దలదిమ్ముఁగలిగించు నంతటి మరంద మహాత్తు గలది పుష్పమకరందము. సర్వ విద్యారహస్యమయిన వాక్కులచే బ్రహ్మాండమంతయు నిండియున్నది గాన నా వాక్కులు పుప్పొడికిఁ బోల్పబడినవి.

నిత్యత్వము, సర్వవ్యాపకత్వము, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము లీ పద్యమునఁ బ్రతిపాదితమైనవి వోలెఁ దోఁచును.

మూఁడవ పద్యమున, నాలుగవపద్యమున భైరవ, దుర్గామాతలు ప్రస్తుతింపఁ బడిరి. వానివలనఁ గవీంద్రుఁడు మంత్రతంత్రవేత్తయనియు, నుపాసకుఁడనియు బోధపడగలదు. భైరవచక్రము, 'నకులీవారాహి' యను ప్రత్యంగ దేవతల భయంకరత్వము, దుర్గాదేవి వీరశృంగార మూర్తులుఁ బ్రత్యక్షీకరింపఁబడినవి.

అడవి నుంగి, అడవి పందులనే భయపెట్టు భైరవవారాహమునది. సర్వశక్తులను గలిగిన వేదములు జాగిలములుగా గదా శాంబరీభిల్లుఁడర్జునుని యాశ్రమ మేగుదెంచినది. వీలాద్రిపైమన్న భైరవమూర్తి నర్చింప పద్దె మీ మూఁడవది.

దుర్గాదేవి స్తోత్రమున, దేవీ పురాణ ప్రసిద్ధములగు, దుష్టరాక్షస సంహారకము లయిన శ్రీదేవి లీలలు వీరస్ఫోరకములయిన వానిగా రూపించుటయందు ధూర్జటి రసపోషణమునఁ గావించిన చిత్రప్రక్రియా వైదగ్ధ్యము గోచరించును. ఇట్టి రస విషయికమైన మిశ్రవర్ణన లింక నటనట గలవు. ఇందు వీరశృంగారములకుఁ జక్కని చిక్కని సమ్మేళనము కలిగినది. రక్తపంకము కాలిలత్తుక యగుట, స్వేదబిందు సందోహము కంఠమౌక్తిక హారము, మోమెఱ్ఱపడుట, లొద్దుగు పువ్వొడి ధూళి మేలిముసుఁగులుగా రూపకల్పన చేయఁబడినది. దుర్గ వీరశృంగారమూర్తియని వాచ్యము గూడఁ జేయఁబడినది. ఇప్పట్ల పోతన తీర్చిన శృంగారవీరమూర్తి సత్యాదేవి మూర్తి గన్నుల నిలుచును.* పాదములు, కంఠము, మోము, శిరములును క్రమముగా శృంగార రసాకరములై వెలుఁగొందినవి. అమె "కనకముఖరీసమాఖ్య గంగా ప్రతీర హాటకాచల తుంగ శృంగాగ్రగేహ" యనుటచే నా క్షేత్రము దక్షిణ కైలాసమని ప్రతిపాదింపఁబడినది.

త్రిమూర్తులచే నారాధింపబడు వానిగా, వారి "సర్గస్థిత్యపహారకర్మ నవదీక్షా" దక్షతలు విఘ్నము లేక సాగునట్లొనరించు సమర్థునిగా ప్రస్తుతింపఁబడినాఁడు హేరంబుఁడు.

ఈరీతిఁ గావించిన ఇష్టదేవతా సమారాధనము, శ్రీకాళహస్తి నిలయులగు జ్ఞానప్రసూనాంబికా సహిత శ్రీకాళహస్తి పతులు, భైరవ, దుర్గా గణపతులకుఁ జెందినది, యందినది.

సర్వసాధారణముగాఁ బ్రబంధములందు కృత్యవతరణికలో నుండు సుకవి పురస్కారము కుకవి తిరస్కారములు, గురుపూజనాదికములిందు లేకుండుట గమనింపఁదగిన యంశము. శివకవులవలె భవికవుల నిరాసము గాని, మఱి యితర కవుల ప్రశంసగాని లేకుండుట, కవికి ప్రబంధ రచనావేళ లౌకిక దృష్టి యించుకేని లేదనియు, గురుఁడు సాక్షాచ్ఛ్రీకాళహస్తిపతియే గాన గురు ప్రశంస లేదనియుఁ దెలియఁగలము.

---

* పోతన భాగ - ద.స్కం - ఉ.భాగ.ప. 183.

అద్వైత విద్యా ప్రతిపాదితమైనట్లు, వాగర్థంబులు, శ్రోతృవక్తలు, జగద్వంద్యుఁడైన యీశ్వరుఁడొక్కఁడేయని, చేతోగమ్యుఁడైన యా మహాదేశిక సార్వభౌమునకే తనకృతికన్య నంకితమిచ్చిన ధన్యుఁడు ధూర్జటి. నరాంకితముఁ జేయ నంగీకరింపని కొద్దిమంది పోతనాది కవీంద్రులతోఁ దులదూఁగువాఁడీ ధూర్జటి కవీంద్రుఁడు. పోతరాజు పలికినట్లు, పలికించువిభుండు పశుపతియే యని కవీంద్రుని విశ్వాసము. తన కావ్యము నడచురీతిని జగత్ప్రభునిచేఁ బలికించినాఁడు. 'నవ్యభాషా శతఘానిగుంభన రసస్థితి' నొప్పునట్టి దాతని కైఁత. పరమేశ్వరుఁడే మఱల ధూర్జటి కవితను వ్యంగ్యముగా నతిక్రూరుని కథయందు రూపించి, మెచ్చుకొనినాఁడు.* విద్యాఖని, విద్యానిధియగు పరమేశ్వరుఁడు మెచ్చి 'సాహిత్య శ్రీవర' యని ప్రశంసించెను. కృతిప్రతి నభివర్ణించిన పద్యము మదగజయానము సాగించి గజాంబరధారిఁ గీర్తించినది. ఇందుఁ బేర్కొనఁబడిన గుణగణము లత్యంత మనోజ్ఞములై, సహజ సుందరములై లోకరీతిఁ బ్రతిబింబించుచున్నవి. కూఁతునిచ్చుచోట కుటుంబము, సంప్రదాయము, ఇల్లు వాకిలి, బంధుగుల బలము, సౌఖ్యమాదిగా గల విషయములను పిల్లతండ్రి విచారించి, తెలిసి, తృప్తిపడి, కన్నె నిచ్చునట్లున్నదీ పద్యము. ఈవిఱకే పెండ్లమున్నదసు—నిన, నామె సర్వలోకములకుఁ జల్లనితల్లి. సవతి పోరుండదు. బిడ్డలంచుమా సమస్త ప్రాణకోటి. సర్వభూతములను సమముగా జూడగల్గిన తండ్రి. పలుకునట్టి పలుకులా పొల్లులు గావు. అవి వేదాక్షరములు. అనగా నాతని పలుకులు వేదసామ్రాజ్యము గలవనియు, వేదములవలె ననుసరింపఁబడుననియు, నందువలన నాతని మాటకు తిరుగులేక సర్వాధిపత్యము, సత్య నమ్మతత్వమునున్నదని భావము. తిరుగాడు తావులంచుమా మోక్షార్థులైన మునిజన హృదయములు, సేవకులందునూ కనులఱాత శ్రీధరులు. ఈ రెండు పదముల నుపయోగించుటయందు విశేషము గలదు. సర్వవస్తుసృష్టి, పోషణ కర్మదక్షులే సేవకులను నది యందలి విశేషము. ఏవంగుణ విశేషణ విశిష్టుఁడైన యల్లుని వలన తన కృతికన్య ధన్యయగుననియు, నట్టి కన్యాదానమునఁ దానుఁ దనవంశము తరించెననియు నా కృతిపితయగు ధూర్జటి యాశయమని యెంచనగును.

**షష్ఠ్యంతములు :—**

ఈ షష్ఠ్యంత పద్యములందు ధూర్జటి కవీంద్రుని 'భవపరాఙ్ముఖత్వము' రూపు గట్టినది. నాదబిందు కళాతీతమై, జ్యోతిరూపమై, వెలుఁగొందు ఈశ్వర తత్వమున సర్వవ్యాపకత్వము, లోక కళ్యాణకరగుణము, ననుపమ కారుణిక స్వభావము, సృష్టి స్థితిలయాత్మకమగు నీశత్వము, శక్తియుతమైన శివరూపములు, ప్రతిపాదింపఁబడినవి షష్ఠ్యంత పద్యముల సంఖ్య చూడ ఐదు.

* శ్రీ. కా. మా. 3 ఆ. 167 ప.

ఆవిర్భవింపనున్న 'పంచముఖంబులతోడి ముక్తకంచుకాకార' 'పరమ శివ లింగరూప'మిందు వ్యంజింపఁబడుచున్నది. షష్ఠ్యంతములందలి మూఁడు, నాలుగు పద్యములందు 'మత్తద్విపము, భవఫణి, మత్తభృంగము'లను పదములు ఏనుగు, పాము, కీటకములు వ్యతిక్రమమున వ్యంజింపఁబడుచున్నవి గదా ! పరమేశ్వరుని గుణపంచకము నిరూపితమైన దీపద్యములందు నాదబిందు కళాతీతత్వము, ముని హృద్బహిరబహిఃపరిపూర్ణత్వము, భవనాశత్వము, సదయదృగంచలత్వము, అచ్యుత కేళీ జగత్సృష్టిసంహార స్థితి భంజన కరుణత్వములను నయిదు గుణములు వర్ణింపఁబడినవి. 'శ్రీకాళహస్తి' అనునదియే పంచముఖుఁడైన పరమశివునకు నిలయమని తెలుపుచున్నది

కథా సంవిధానమునకు మున్ను రూపొందించిన కృత్యవతరణికవలన ధూర్జటి కవి శివభక్తుఁడు, నుపాసకుఁడు, వేదాంతి, భవపరాఙ్ముఖుఁడను నంశములు వెల్లడి యగుచున్నవి. కవీంద్రుని వర్ణన నైపుణ్యము, నలంకార చిత్రణము, రసపోషణము, ధ్వని నిర్వహణములును, కవితారీతులును వ్యక్తములగుచున్నవి. ఇష్టదేవతా ప్రార్థన మీయన్ని గుణములకు తాపై కవిత్వంపుఁ దాపులీనుచున్నది. 'నవ్యకథాషాళత ఘానిగుంభన రసస్థితిఁ గథా సంవిధానము గావింపు'మని మహాదేశిక సార్వభౌముఁడైన పరమేశ్వరుని యనుమతిఁ గైకొనినాఁడు ధూర్జటి.

## కథా సంవిధానము

తాను నిర్మింపనున్న మహాప్రబంధమునకు 'సంవిధానంబునకు' ... అను శబ్ద ప్రయోగము గావించెను. అనగా తాను 'కథాసంవిధానము' గావింపనున్నాఁడని కవి పలికెనన్నమాట. కథను సంవిధాన మొనరించుటయందు విశేషము గలదు. మనః ప్రవృత్తుల కనుగుణముగా ఘట్టములఁ గాంచినపు డీ కథాసంవిధానము సార్థకమైన దనిపింపక తీరదు. అంతియేకాక ప్రతిపాదిత వస్తుగుణవిస్తి కనుకూలముగ, దోహదములుగా సన్నివేశ కల్పనములట్లుండగా, కథోపక్రమమునకుఁ బూర్వరంగముగాఁ గవీంద్రుఁడు చేసిన పురవర్ణన మపూర్వమై, యనన్యమై, యలరుచుండుటయు కథా సంవిధానమున భాగముగా స్వీకరింపఁదగియున్నది. సహృదయుని హృదయ క్షేత్ర మును పదనుచేసి తన భావబీజమును విత్తుట యిది. ప్రబంధములందుఁ బురవర్ణ నము సాగుటఁ గలదు. అందాయాకవుల ప్రతిభ, వ్యుత్పత్తులు గనుపడుచుండుట కద్దు. క్షేత్రమహామాహాత్మ్యుఁడని బిరుదుఁగన్న కవిసార్వభౌమ శ్రీనాథభట్ట సుకవీం ద్రుని కాశీఖండ, భీమఖండములందుఁ గల పురవర్ణనములకన్న నీ ప్రబంధమందలి

వర్ణనము విశిష్టమై వెలయుచున్నది. పురసౌధకుడ్యరత్నద్యుతులు, చంద్ర కాంత శిలాప్రాకారము, జనుల యానందమయ జీవితము, సర్వజీవుల సౌఖ్యము, చాతుర్వర్ణ్యముల వారి గుణవిశేషములు, కామినీ జనుల యునికి, గజాశ్వముల తీరు, అను విషయములను వర్ణించుటయందు గవీంద్రుని దృష్టి సూత్నము, వృష్టి వినూత్నము. సర్వవర్ణనములు శర్వమయములె. ఉపమిత సామగ్రియంతయుఁ గొల్లఁ గొనఁ దగినంత మోక్షనిధియే. మోక్షాపేక్ష కలిగిన సాధకునివలెఁ గవీంద్రుఁడు గనుపట్టుచున్నాఁడు.

కాళహస్తిపుర దైవవర్ణనము గావించిన "సంసారపారదోచ్చాటనానలకీల ... అమృత లింగాకరము కాళహస్తిపురము"* అను సీసపద్యము కావ్య ప్రయోజనము నకు సిడమెత్తునట్టిది. సీసమునందలి పెద్ద పాదములు నాల్గింటను ధూర్జటి భవపర్యాటు తను చతురాస్యములఁ జాటుచున్నది. సీసమందలి యెనిమిది చిన్న పాదములు బరను శివుని యష్టమూర్తికి నతులొనర్చుచున్నదివోలె నున్నవి. 'అనలకీల, తామ్ర, కుద్దాల, గోరాజ,' అను శబ్దములచే నీశ్వరుని ఫాలనేత్రము, జటాజూటము, పరశువు, వాహన ములు వ్యంజింపఁబడుచున్నవి. అట్టి పరశివుఁడు, కేవల దివ్య దేశిక హంసోపదిష్ట మార్గ నిర్గుణధ్యానులయిన సాధకజనులకు నిరుపమాన సౌఖ్యసంపత్తిని సంధానింప గలఁడనియు ధ్వని.

సంసారమును పాదరసముతోఁ బోల్చుటయనగా నిలుకడలేనిది, విప్రాయము నను భావము. కామ్యమును లతతోఁ బోల్చుటయనగా నెప్పటికప్పుడు మొగ్గ దొడు గుచు పచ్చగా నవనవోన్మేషముగా నుండుననుట. రాగము శాలిపనాంకురముతో బోల్చుటయనఁగా రక్తమాంసాదుల బెంచి రాగద్వేషాదుల కాకరమగు నమట నమమైన పనము గోరాజుతోఁ బోల్చుట యనగా కన్నుగానక విచ్చలవిడి విహరించు నది. కలుష సంచయము తామ్రమనుట నాశము చేయుట యసాధ్యమని భావము. సంకల్ప పాషాణమనుట దుర్భేద్యమైన సాంసారికమగు భావనయని యర్థము. శంకా కళంకము భుజంగమనుటయందు వక్రగతిపై మిఁకలి బాధాకరమగునదని యర్థము. కోపనేక్షణవిశిఖమనుట వలన స్త్రీవీక్షణముల చురుకుఁ జూపు హృదయక్షతి గల్గించు నని భావము. వీని యన్నిటికిని విరుగుడు అమృతమయ లింగమె.

---

* శ్రీ. కా. మా. 1 ఆ. 17 ప.

పుర సౌధకుడ్యఖచిత స్వర్ణరత్నద్యుతులు చూపఱులకు తనుమొగము లాఱుగాఁ గనుపట్టుట విచిత్రభావనను చిత్రించుటయందుఁ గవి కుమారస్వామిని వ్యంజించి చిత్రము గావించినాఁడు. మఱి కుమారస్వామి దర్శనము "చిత్తేక్షణ క్రీడాదుస్తరమార్గ సౌఖ్యరసవార్ధిఁ దెల్పునదియే యగును.'[1]

పట్టణైశ్వర్యమును బ్రతిబింబించు చంద్రకాంత రచిత ప్రాకారము శివునే తలఁపించుచున్నదట. హృదయమున కందని శివతత్త్వమువంటిదే యాప్రాకారము, దానియందుఁ బ్రతిఫలించు పురైశ్వర్యము.

ఆ పురమున మోక్షనిధి కలదు. దానినిఁ గొల్లగొనుటకు ప్రాఁః లకు నుత్తమ మధ్య మాధమత్వములడ్డురావు. 'కీటమునకైనం జక్రికైన న్మదాంధునకైనన్ బహుజీవహంతకయినన్న[2]నుట యందుఁ గవి ప్రకర ాౌచిత్యముగఁ బలికిన యా పలుకులందుఁ గావ్యార్థసూచనయుఁ గలదు. ఈశ్వరునర్చించి, ఉద్యానవనల్ బాసి మోక్షనిధిఁ గొల్లగొన్న చెలఁది, పాము, నేనుఁగు, కన్నప్పలు సూచింపబడిరి.

రాగులయిన మానవులు,[3] భోగులయిన కామినుల[4] వర్ణనములు శృంగారాత్మకము అయిన వానిని వైరాగ్య సూచకముగ, వేదాంతపరముగా రూపించి శాంత రసము లొనర్చుట ధూర్జటి యాధ్యాత్మికౌన్నత్యమును చాటుచున్నది.

మదగజములను అపధూతలతోఁ బోల్చుట, గుఱ్ఱముల వేగమును జయింప లేమను భావముతో మానవులు తమ మనస్సుల చాపల్యమును విరహిత మొనర్చు కొనిరని వర్ణించుటలును ధూర్జటి భావనైర్మల్యము, లోకాతిశాయిత్వములను తెలుపును.

చాతుర్వర్ణ్య వర్ణనమును రాజయోగైక మాత్రముగ వ్యంజించుట, కవీంద్రుని సాధనను దెలియఁ జేయును. శ్రీకాళహస్తిపురాధిపతియగు నీశ్వరుఁడే ప్రభువుగా శ్లేషింపఁబడినాఁడు.

---

1. శ్రీ. కా. మా. 1ఆ 18 ప.
2. ,, ,, ,, 20 ప.
3. శ్రీ. కా. మా. 1ఆ 21 ప.
4. ,, ,, ,, 24 ప.

ఈ విధముగాఁ జేసిన పురవర్ణనమున, 'చంద్రకాంత రచిత ప్రాకారమునఁ, దత్ప్రాంతమండలి యతులైశ్వర్యము ప్రతిబింబించినట్లు, ధూర్జటి కవీంద్రుని భవ పరాఙ్ముఖత్వము, 'నవ్యశాషా శతథానిగుంభన రసస్థితి' యుమఁ బ్రతిఫలించుచున్నది. ఆయన వర్ణన నైపుణి, అలంకార చిత్రణము, రసపోషణము, ధ్వని నిర్వహణ ములు 'ఆడంబరములై' యొప్పుచున్నవి. ప్రబంధమున నిర్వహింపనున్న తన కవితారీతుల నన్నింటికి నీ పురవర్ణనమునందె ప్రాతిపదికలు వైచినట్లు తోఁచును. రాగియై శృంగార రసానుభూతినిఁ దలమునుకలువైచి, విరాగియై శాంతరసమునఁ దేలిన కవీంద్రుని జీవితము, సాహిత్య మాధుర్యములందు 'అద్భుత మాయాబహు విభ్రమ భ్రమిత వస్తువ్రాతలోకోదయస్థితి లోఁగొన్న శివుని'[1] వలె నెలకొని యున్నది.

కథోపక్రమము :—

యాదవభూకాంతుని భక్తిఁ దెలియఁబూని కపట జంగమ రూపియైన పరమే శ్వరుని పురప్రవేశముతో, గథోపక్రమమైనది. మిండ జంగము రూప చిత్రణము పెద్దన సిద్ధునిఁ[2] దలపించుచున్నది. కథాకథనమున మూర్తి నిర్మాణమున ధూర్జటి కనబఱచిన ప్రజ్ఞావిశేషమునకిది తొలియుదాహరణము.[3] 'అపరంజి పావాలు, కేదార కంకణము, బంగారు వ్రాతచెఱంగుల గోణాము, రుద్రాక్షమాల, తోడిబెత్తము, సంధిగట్టిన, తరుణేందుధరుఁడు, ఒడ్డాణము, భూతి, పైవెట్టిన కస్తూరి బిళ్ళ దొట్టు, తాంబూలచర్వణార్ద్ర రాగ సౌజన్యము గల దంతపంక్తి' ఈ సామగ్రియంతయు గపట జంగముని స్వరూపమును భోగి, యోగియగు శివయోగిగా నిరూపించుచున్నది. అంతియేకాదు. శ్రీనాథుని నలునివర్ణన[4] స్ఫురణకుఁ దెచ్చును. ఈ రూపము సర్వ స్త్రీ జన సమ్మోహనముగా నున్నది. భూకాంతు నర్చించుట కాతని పస్లైరపు దానిని లోఁగొనవలెను. ఆ దాని 'పురపల్లవ ప్రకరనేత్రానంద బాష్పాంబుధారావర్షాగమ' మనతు 'చంచలాలతిక', 'దుర్వార ప్రసూనాస్త్ర తేజోవైశ్వానరసామిధేని'. అట్టి పరమసుందరియగు వామె నాకర్షించుటకు కేవలము సుందర రూపము చాలును.

1. శ్రీ. కా. మా. ప్ర. ఆ. 19 ప.
2. మనుచరిత్ర 1ఆ.—59 ప.
3. శ్రీ కా. మా. 3—55 ప.
4. శృం. నై. 1ఆ—62 ప.

నుటి యీజంగమరూపమేల ? ఆమె కేవల సంచరించే కాదు గనుక. ఆ సుందరి 'రశనాసూత్రస్థిత స్వర్ణపేటీ విన్యస్తకపర్ది' కాన, పరమశివాకార జంగను స్వరూపియై యేతెంచినాఁడు కపర్ది. ప్రతిదినమును 'జంగమార్చనము లేక తనిపుపడనొల్లనిది ఆ దాసి. తన యింటిని విచారుచేసి, పాదార్చనము గావించి, మూర్తమాడించి, శివార్చనమునకు బనివిని, విభూతి పీడియమునిచ్చి, మంచి షేలోగిరము లారగింప సమర్పించుట యామె నిత్య జంగమార్చనము. అతిథిగా నేతెంచిన జంగముని మనసు వచ్చిన రీతి పనివినుట యామె జంగమార్చనము. అంతటి 'జంగమార్చన తశా సామర్థ్య'ను, 'కందర్పశుద్ధాంత శ్రీ పరిహాసకృన్నిఖిల లోకాతీత సౌందర్య'ను మోహరింపఁజేయజాలిన యీ జంగముని సౌందర్యమునకు సుది తాల్మితూలని వధూటి యుండదనుట యతిశయోక్తి యేమి ? స్వభావోక్తియే.

ప్రతిపాదింపనున్న శివభక్తి తత్త్వమున కనుగుణముగాఁ గవీంద్రుఁడు తపట జంగను రూపమును, పస్లెరపు దాసి స్వరూపమును, శీల ప్రభావములను రూపొందించుట యాతని వస్తు నిర్వహణాబద్ధ బుద్ధివిఁ జాటుచున్నది. తన సుహిమముఁ బ్రకటింపఁ బాత్రమైన దీ దాసి పాత్ర. ఈ ఘట్టమందలి తొలి భాగమునఁ గవి శైవసంప్రదాయము, శివార్చనములను, కన్నడభాషా పరిచయమును ప్రదర్శించినాఁడు.

శైవ స్తుతిప్రాచీనమై కన్నడదేశమున బహుళవ్యాప్తిఁ జెందినది. బసవఁడు వీరశైవమును, పండితారాధ్యు లారాధ్యశైవమును వ్యాప్తిలోనికిఁ దెచ్చినారు. శైవ సంప్రదాయ ప్రసక్తమగుచున్నదిగాన నిచట కన్నడ పదప్రయోగము సముచితమై యొప్పుచున్నది. శివభక్తు లొండొరులతో మాట్లాడునప్పుడు ముఖ్యముగా సంప్రదాయములు ప్రసక్తమైనప్పుడు ఆ సంప్రదాయమునకు చెందిన పదజాలము వాడుట అలవాటే. శ్రీవైష్ణవులు తెలుఁగు దేశమున మాటలాడునపుడు 'పెరుమాళ్లు, సాయించండి', నమస్కరించుటకు 'దాసోహం' అనుట కద్దు. ఈ యర్థముననే శైవ సంప్రదాయము 'శరణార్థి చేయుట'.

'కామినీ కాయకాన్తారే కుచపర్వతదుర్గమే
మా సంచర మనః పాన్థ తత్రాస్తే స్మర తస్కరః'

అను భర్తృహరి ఛాయలు. —భ శృం. శ. 53 శ్లో

అని కాంతా ! నీ యింటికి
జనుదెంచెద నీదు గుబ్బచనుగొండల సం
దున, దెరువెఱుగక తిరిగెడి
మనసను తెరువరికిఁ దప్పిమాన్పం గదవే' —ప్ర. అ. 37 ప.

అను పద్యమునఁ గననగును.

అంతకుమునుపే మరు విరికుంతములఁ జిక్కువడియున్న యాకోమలి యనేక విలాసములచేఁ జొక్కఁజేసిన యా కుమారజంగముని తగులున నుండిపోయి యా జలజేక్షణ తన విధ్యుక్తధర్మమును మఱచెను. తప్పు చిన్నదైన, పెద్దదైన నొక్క తప్పును గావరుగాన భూపాలుఁ డా దాసినిన్నిఁ బట్టి తెండని భటుల బంపెను. అప్పటి దాసి మనస్థితి కడు విచిత్రమైన సందిగ్ధావస్థలోఁ బడెను. రాజు వలని భయము ముందునకు త్రోయుచుండ, 'తగులు తపసికడకు'[1] నుగిడించుచుండెను. రాజ సమ్ముఖమునకు వెడలుచున్న, వెడలి నిలిచియున్న యాదాసి యవస్థా చిత్రణము[2] ధూర్జటి కవీంద్రుఁడు మహాసమర్థముగఁ గావించెను. వేగిరపాటు, తొట్రుపాటు, కలవరపాటులతో నాపె సురతాంతస్థితియును కన్నుల గట్టివాఁడు కవి. ఆమె బయల్దేఱిన వేళయందు గల యామె రూపమును విశేషణములు పెక్కులు పలుకు చుండ, నెట్టిస్థితి నుండి యెంత వేగముగా కదలినదో తెల్పుటకొక్క విశేషణము చక్కని తెలుఁగు బలుకున నిలిపినాఁడు. 'గొబ్బునఁ గటిజుట్టుకొన్న చేలము' తో వచ్చుట యప్పటి యామె స్థితిఁ జాటుచున్నది.

ఆశ్లే పద్యము తుదిపాదమున 'రాజుముందర నిలిచె నంభోజవదన'[3] అన్న వాక్యము సమాసోక్తి, పరికరాలంకారములచే సొబగు లీనుచున్నది.

---

1. శ్రీ. కా. మా. 1 అ—46 ప.
2. అవస్థా చిత్రణము 'వర్ణనలు' అను ప్రకరణమున విపుల చర్చ గలదు.
3. శ్రీ. కా. మా. 1అ—47 ప.

'రాజు' శబ్దమునకు చంద్రుఁడను నర్థము స్వీకరించినప్పుడు దాసి 'యంభోజ వదన' యనుట సాభిప్రాయ విశేషణమై పరికరాలంకారనుగుచున్నది. పద్మము పద్మ విరోధియగు చంద్రదర్శనమున నాడి వత్తమై ముకుళించుకొనును. నిద్రదేఱెడు దాసి నేత్రములు నీరజములనుటయు, నింతియే. ప్రభువునెదుట దాసి భయభక్తులతో నిలువబడుట యను వాక్యముచే చంద్రునెదుట పద్మమువలె నున్నదని స్ఫురింపఁ జేయుటచే నిందు సమాసోక్తి యలంకారమున్నది. ఈ పద్యమున దాసినుండి భగవంతుఁడభిలషించు ప్రపత్తియు వ్యక్తపఱుపఁబడినది. 'కలఁగని నునముకోఁ గాళహస్తి విభుని వలఁచుచు దిక్కు నీవే యటంచు'* 'అన్యధాశరణం నాస్తి త్వమేవ శరణమ్మమ' అన్న ప్రపత్తియే గదా! సర్వభారము పరమేశ్వరునియందు సమర్పించి నప్పుడే భగవానుఁడు భక్తవత్సలుఁడై యనుగ్రహించుట. 'తావొక్కయంతయు లేద'ని, ఇతఃపరంబెఱుఁగనని' కుయ్యిడిన విహ్వల నాగేంద్రము తయ్యాలించినాఁడు గదా హరి. తనవలన తప్పు జరిగిపోయినది. కాదనుటకు వీలులేదు. రాజులా యొక తప్పును గావరు. మఱి తన భవితవ్యత్తేమి ? ఇప్పుడేమి చింతించి యేమి ఫలము ? అయిన తన నిత్య జంగమార్చన కళాసామర్థ్యము వట్టిపోవునా ? వచ్చిన కుమార జంగముని భక్తిపూర్వకముగా 'శరణార్థియొనర్చి, యొక్కచేఁ బ్రసదము లాంటి, తన్మృదులపాణి సరోరుహదత్త భూతి విద్దపునుమటం ధరించిన'దామె.

జంగముని సాక్షాచ్ఛివునిగా తలఁచి యర్చించుటయే కదా జంగమార్చనము. వచ్చిన వానిని 'నడలింగమూర్తి' యనుట యామెకుఁగల యట్టి భావమునే వెల్లడించు చున్నది. జంగమార్చనచే లింగమూర్తి సంతసించును కాన, కాళహస్తిపతి తనను తప్పక కాపాడునని విశ్వాసమామెకు గలదు. అందువలననే సర్వమును కాళహస్తి పతికి వదలి, ధైర్యముగా ప్రభుసమక్షమునకేగి నిలిచినది. ఎంత ధైర్యమున్నను ప్రభుసమక్షము కొంతకుఁ గొంత భయమునే కొల్పక మానదు. కనుక యూర్పులు సంచడించుచుండగా నిలిచినది.

ప్రభువాగ్రహోదగ్రుడై యామెను శిక్షించిన విధము విశిష్టమైనది. శిక్షలు స్త్రీ పురుషులకు వేర్వేఱుగా నుండును. కఠినమైన దండననునఁగా శిరోముండనము చేయించుట. అది సామాన్యమే కాని యిచట రాజున కా దాసి నట్టులే శిక్షించుటకు గవీంద్రుఁడు కారణమొకదానిని, ప్రయోజనము నొక్కదానిని భావించుటయే.

---

* శ్రీ కా. మా. 1ఆ–47 ప.

స్త్రీ సౌందర్యమునకు వివిధావయవముల సౌష్ఠవము, నిమ్నోన్నతము లిత్యాదిగా నెన్నియున్నను, సహజ సౌందర్య సముల్లాసము పెన్నెఱివేణి. అవి పెట్టని సొమ్ములు.[1] పట్టు సొగసులు. వేల్పుల భ్రమియింపఁజేయఁజాలిన మనోహర మూర్తికి శిరోజ సౌభాగ్యము శిరఃప్రాయమే గదా! ఆ దాసి సౌందర్య సౌకుమార్య ములను వర్ణించుచుఁ గని 'నీలవేణి'[2] 'క్రొమ్ముడి'[3] అను విశేషణములు ప్రయో గించుటయేగాక, శిక్ష విధించినట్లు వర్ణించిన పద్యమున 'వేల్పుల భ్రమయించు నీ చిగురుఁబోఁడి మనోహరమూర్తి రేఖకున్ వెలితియగుంగదా యనక'[4] నిర్దయుడై యాపె తలగొరిగింపఁ బంచెననుటయందు రాజునట్టి భావముననే నియమించెనా యనిపింపఁ గలదు. "వెలితియగుంగదా" యని యనకయని గ్రహింపనగును. ఇట్లు తల గొరిఁగించిన కాని యామె సౌందర్యము భంగము వొందదని యా ప్రభువు తలఁచినట్లు పైవాక్యము ధ్వనించుచున్నది. ఇంతటి కఠినశిక్ష విధించినగాని ప్రభువు నకు కోపము తగ్గలేదు, మంట యారలేదు. ఆమె సౌందర్యమున కా శిరోజ సౌభాగ్యమే కారణమని యాతఁడు నూహించుటచేతనే యీ విధమైన శిక్ష విధించినాఁడు.

పురజనులాడుకొను మాటలాతని చెవినిఁ బడక యుండవు. 'పురపల్లవప్రకర నేత్రానంద బాష్పాంబుధారా వర్షాగమచంచలా లతిక' యని యెల్లరముకొనుచుండు టయు దెలిసియుండును.

వేల్పుల భ్రమియింపఁజేయఁజాలిన సుందరిగాన, తనకొల్వున కేఁగుదెంచుట యందు జరిగిన తడవునకట్టి తగులమేదేని యుండియుండునని రాజూహింప గలిగినాడు. ఆమె సౌందర్యము నాతఁడే నోరార పలికియున్నాడు గదా. ఇచ్చటి మతి యొక్క లోకప్రవృత్తి మిక్కిలి గూఢముగా నిక్షిప్తమైనది వోలెఁదోచును. అంద గత్తెలను తన కొలువున నియమించుకొని ప్రభువులు సౌందర్యము తమకే యంకి

1. విజయవిలాసము—3 ఆ.—90 ప.
2. శ్రీ కా. మా. 1ఆ—44 ప.
3. శ్రీ.కా.మా. 1 ఆ-47 ప.
4. „ „ „ 40 ప.

తమకు కావలెను గాని, మొదలకడి యనుభోగ్యము కారాదనుకొనుట, అట్లు తమ కోరిక తీరనియెడల కక్షకట్టి యా సౌందర్యమును చూడలేక భగ్నమొనర్పఁ బూనుటయు మానవ సామాన్య మనఃప్రవృత్తి. అందున ప్రభువు నుండి తన కసిదీఱగా కఠినాతికఠినముఁగ శిక్షింపఁగలఁడు.

కవీంద్రుఁడు దాసి దయనీయ స్థితిని సహృదయమున పాదుకొల్పి యా పాత్ర యెడ సానుభూతిఁ గలిగించినాఁడు. కమనీయ కోమలాకృతిని, వికృత మొనర్చుటకుఁ బూనుటచే, నా రాజు నిర్దయుఁడుగా చిత్రింపఁబడుటచే, పాఠకుఁడు దాసి దైన్యస్థితికి జాలినొందును. ఆ శిక్ష కావించిన సౌందర్యభంజకత్వమునుఁ గవి తరువాతి పద్యమున సాక్షాత్కరింపఁజేసియున్నాఁడు. శిరోజ సౌభాగ్యము గోల్పోయిన యా దాసి 'జలదము వాసిన చంచల' 'చంచరీక సంబంధ విహీనాంచిత లత' యనుట యందామె యపహృత సౌందర్యము వ్యంజకమగుచున్నది. అట్టి యవమానము పాలయిన స్త్రీ లజ్జితయై 'చంచలగతి' మహావేగముగా, నేఁగి తపసి చరణములపై వ్రాలి పలవించినది. ప్రభుపు కొల్వున కేఁగుటలో దడయుట కా తపసి తగులమే కదా కారణము!

శిక్షిత దాసి పలవించిన తీరు ప్రబంధ సామాన్య లక్షణములకుఁ దప్పినది కాదు. ప్రబంధనాయికల విలాపము గూడ నొక విలాసమే, విలసనమే. శృంగార నైషధమందలి దమయంతి,[1] కాశీఖండమున కళావతి[2] మనుచరిత్రమందలి వరూథిని,[3] పారిజాతాపహరణమందలి సత్యాదేవి,[4] వసుచరిత్రమందలి గిరిక,[5] శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానములో[6] విలాప విలాసము లిట్టివే. ధూర్జటి చిత్రించిన దాసి కూడ 'పంచమ ధ్వనుల తానములీను పికాంగనాగతి'[7] నేడ్చినది.

---

1. శృ. నై.—4ఆ—87 ప.
2. కా. ఖం. 5ఆ—167 ప
3. మను. చ.—2ఆ—70 ప.
4. పారి.—1ఆ—133 ప.
5. వసు.—4ఆ—52 ప.
6. హరి. న—5ఆ—69 ప.
7. శ్రీ. కా. మా.—1ఆ. ప.—50 ప

తపసి చరణములపై వ్రాలి యామె గావించిన చేష్టలు శివోపచారములుగా రూపించుట శివభక్తాగ్రేసరుఁడైన ధూర్జటి కవీంద్రునకే చెల్లినది. ఓయను రోదనము, కనుఁగవ నీరు, నిడు వాలుగన్నులు, నెమ్మోము, కమ్మ నిట్టూర్పు.

దంతకాంతులు, నధరోష్ఠము, పాదములపై బడుటలు, ప్రణవమంత్రము, స్నాన, పుష్పపూజ, ధూప, దీప, నైవేద్య, నమస్కారములుగా రూపొందినవి. కన్నులు 'నీలోత్పలములు', మోము 'క్రొత్త నెత్తమ్మి', యనుటయందు దాసి కన్నులు పనవిపనవి విలపించియుండుటచే మఱింత పెద్దవి యయినవనియు, నవమాన దుఃఖభరముచే మొగము పూర్తిగా వికసించని పద్మముగా చిన్నఁబోయి యున్నదనియు, సాభిప్రాయముగాఁ బ్రయుక్తమైన విశేషణములు. శివోపచారములుగా నామె గావించిన చేష్టా వర్ణనమునను వీలయినంతవఱకామె సౌందర్యవర్ణనము జరిగినది. 'నిడువాలుగన్నులు నీలోత్పలములు, నెమ్మోము క్రొత్త నెత్తమ్మి, దంతకాంతులు', ముఖసౌందర్యము నందించుచున్నది.

ఇంతటి దయనీయస్థితినందు, చరణములను శరణమందిన దాసినిఁక నోపవలసిన సమయము వచ్చినది యీశ్వరునకు. యాదవ భూకాంతు నాకర్షించుటకు జేసిన ప్రయత్నములలోఁ దొల్తటి దాతనికి దాసియం దాగ్రహము గలుఁగజేయుట. ఇక రెండవదాతని కద్భుతము గలుగజేసినకాని, యాతడు తనకు దాసుగాఁ బరమశివుని జేరఁడు. పరీక్షించి యనుగ్రహించుట పరమేశ్వర లీలావిలాసము.

ఏడ్పు చాలుననుచు దాసి శిరముపై జంగమ లింగమూర్తి హస్తముంచినాఁడు. అంతియె. ఆ 'ఆ హస్తమస్తక సంయోగమ' ద్భుతావహమైనది. అదియొక యింద్రజాలము. ఆ దాసి శిరమునఁ గురులెంతవేగముగా, నందముగా నద్భుతముగా మొలకెత్తినవియో దెలుపుటయందుఁ గవీంద్రుఁడు కందచ్ఛంద శీఘ్రగతిని సమాశ్రయించి అలఁతి అలఁతి తునియలుగాఁ గాహళ సంఘించిన విధమున నలఁతి యలఁతి పదముల ప్రకృతార్థ చమత్కారమును మన మనస్సునకు సాక్షాత్కరింపఁ జేసినాఁడు. ఇదియొక కవితా చమత్కారము. తిక్కన కవీంద్రుఁడును ఉత్తరగోగ్రహణమున నర్జునుని శిరమున మొలిచినట్లు వెలసిన కిరీటమును వర్ణించుపట్టున కందమునే వాడినాఁడు.

పెట్టక కట్టక మౌళిం
బుట్టిన క్రియ దీధితులు నభోభాగంబున్
ముట్టి వెలుంగఁగ నింద్రుని
పట్టి కిరీటంబు వొలిచెఁ బ్రస్ఫురితంబై.[1]

ధూర్జటి యీ పద్యమిట్టిదే.

నెఱిమిగుల గలిగి నలుపై
తఱచై, మదన ప్రతాప దావాగ్ని శిఖల్
మెఱయ నవధూమ మనఁగాఁ
దెఱవకుఁ గచభరము వచ్చె దేవుని కరుణన్.[2]

ఇందలి 'నెఱిమిగులగలిగి' యను లఘువుల సమీకరణమున 'నలుపై' 'తఱచై' అను రెండు లఘువుల వెంట గురువుగా వెన్వెం[డి] పదములచే నైల్యము, సాంద్రత 'మదన ప్రతాప దావాగ్ని శిఖల్' యను[ట] నుచే శిరోజముల దైర్ఘ్యము, కొనలు సాగుటలు, 'మెఱయ నవధూమ మూఁడు గణములచే ముప్పాయలుగా నుండు నైగనిగ్యములు, సూచ్యములు[గ] నీ యంతటి యింద్రజాలము 'వచ్చె' ననునొక్క చిన్ని భూతకాలిక క్రియచే నొక్క క్షణములో జరిగిపోయెననిపించినాఁడు గవీంద్రుఁడు.

'ఎత్తిన నింద్రజాల గురుఁడెత్తిన బర్హమనంగ...[3]
'నెఱిమిగులగలిగి...'[4]

పై రెండు పద్యములు నమృత రసపోషకములై ఉత్ప్రేక్షాలంకార యలరుచున్నట్టివి. కవీంద్రుని శైలీ విన్యాసమున[5] కివి యుదాహరణీయము[లు]

---

1. భారతము—విరాటపర్వము—4ఆ—167 వ
2. నుఱియు
3. శ్రీ. కా. మా. 1ఆ
4. శ్రీ. కా. మా. 1ఆ
5. 'భాష : శైలి' యను ప్రకరణమును చూడనగును.

ప్రభు సేవకు బయల్దేరిన దాసి కీ కుమార జంగమునకు నెదురగుటతో నింటికి జనినారి ఖపురును. జంగమార్చనమునకుఁ దడవయినది. భటులచేఁ గొంపోఁబడి ప్రభు కోపానలమునకు గుఱియై, శిక్షితయై, తిరిగివచ్చి, యీశ్వరుననుగ్రహముఁ బొందుటచే నుగుడ రాజసన్నిధి కేగినది. ఆజ్ఞనిచ్చిన మఱుక్షణముననే, 'మోహనంబైన వేణి'తో నెదుట నిల్చిన దాసిని చూచిన ప్రభువునకు వెఱఁగయినది. తనయాజ్ఞ 'మంగలి' నెఱవేర్చియుండఁడని రాజున కనుమానమైనది. ఆజ్ఞాధిక్కారమా యమున దా వెఱఁగు పాటు. కనుక వెంటనే యా మంగలివానిఁ దెండని యాజ్ఞనిచ్చెను. దాసియు తాను యథార్థముగా ముండితయైతినని పలికినది. ఆ వాక్యము మఱింత యాశ్చర్య కరముగా నున్నది. తన గృహమునఁ గల 'సర్వమంగళాసన్న మనోహరాంగక మొక జంగమలింగము' వసించియున్నాఁడనియు నాతని కరుణచే తన కిట్లద్భుతముగా వెండ్రుకలు వనుదెంచెనని విన్నవించినది దాసి. ఆ వాక్యమున గల యామె 'శిరమునపై నా తపసి శ్రీకర కల్పమిడుట'యేమి, చిత్రముగా వెండ్రుకలు వచ్చుటేమి? ఆజ్ఞా భంగమయ్యెనేమియని యాగ్రహము నందిన యా ప్రభువు దాసి వాక్యము విని మదిని కుతుకపఱుచుకొని యట్టి యద్భుతమూర్తినిఁ గనులారఁగాంచ నేఁగెను. కేవల మద్భుతమూర్తి యని కాదతఁడేగినది. 'సర్వమంగళాసన్న మనోహరాంగకము'అను వాక్యమందలి ధ్వనించుచున్న ఈశ్వరుఁడు జంగముగా నేగుదెంచెనా, యేతెంచి యీ దాసి ననుగ్రహించెనా యని యాశ్చర్యము గలిగినది. ఆతఁడెవరో సాధారణ జంగమై యుండఁడు. ఆట్లనిపించిన మఱల భటులనుఁ బంపియొ, దాసినే పంపియో యా తపసినిఁ దన కొలువునకు తేఁబంపియుండును. దాసి పల్కిన వాక్యమందలి మహార్థము, ప్రత్యక్షముగ తన కన్నుల యెదుట జరిగిన చిత్రముల వలన, వాతపసి యసాధారణుఁడై యుండునని భావించినాఁడు ప్రభువు. స్వతస్సిద్ధముగా యాదవ భూకాంతుఁడు శివభక్తుడు. (జంగములను సాక్షాచ్ఛరలింగములుగా శివభక్తులెంచుదురు) ఆతని భక్తినిఁ బరీక్షించు టకే గద యీశ్వరుఁడు వచ్చినది!

ప్రభువులకు విన్నవించు దాసి వాక్యములు, వామె యింటఁగల యా జంగమునిపై గల మిక్కిలి భక్తితాత్పర్యములను వెల్లడించుచు, నామె యానంద మును వ్యక్తము జేయుచున్నవి. ఆ పద్యములు రెండును• ప్రభువడిగిన ప్రశ్న లందును, మొదటి ప్రశ్నకు దరువాత, రెండవ ప్రశ్నమునకు మొదటను దాసి

---

• శ్రీ.కా.మా. 1 ఆ-55, 56 ప.

సమాధానమిచ్చుట మిక్కిలి యుచితముగా నున్నది. ప్రభువు మొదట నామె కా 'మోహనంబైన వేటి' యెట్లు కలిగినాయని, యది మంగలి మాయ కాదుగదా యని సందేహము వెలిబుచ్చెను. రెండు ప్రశ్నలకు వరుసగనే సమాధానింపవచ్చును. కాని ముందు మంగలిని తెండని యాజ్ఞనిచ్చుటచే, వానియోగము నావవలసియున్నది. మఱి వాని దోషము లేదుకదా! మొదట ప్రభువులకు మంగలివానిపైఁ గలిగిన అనుమానాగ్రహము ఉడుపవలయునుగాన, దాసి 'ముందు నామాట వినుఁడు. వినిన వెనుక వాని దోషమేమియు లేదని మీకే తెలియగలద'ని యా విన్నపమందలి భావము. వెంటనే 'మంగలి మాయలేవియు' లేవని పల్కినది. ఆ సమాధానముతో ప్రభువున కాగ్రహము తగ్గి యాశ్చర్యము గలుగును. 'మీ మహాజ్ఞకొక భంగము కల్గునే?'యనుట దాసి వాక్యరచనా చణత్వమును వెలార్చును. ఎట్టి వ్యక్తికైన తనమాట చెల్లలేదనిన కోపము కలుగును. అందున ప్రభువు తానాజ్ఞాపించిన వ్యక్తి యాజ్ఞాపాలనము చేయలేదనిపించినప్పు డాగ్రహోదగ్రుఁ డగును గదా! ఫలితమెట్లున్నను ముందుగా నా ప్రభువుల యంతరంగమును తృప్తి వఱుపవలెను. మీ యాజ్ఞ చెల్లకుండుట యుండునా?' యనుటతో దన ప్రభుత్వమునకు భంగము కలుగలేదని తృప్తి చెందును. ఇఁక నెమ్మదిగ రెండవ సమాధానము పలికినదామె. అందు తన తపము ఫలించినదన్నది. తపము ఫలించుట యనఁగా దేనిని కోరి తానింత కాలము జంగమార్చన చేయుచున్నదో, తన జీవితమున నేది లక్ష్యముగా గలదో యది నెఱవేరినదని భావము సర్వమంగళాసన్న మనోహరాంగకమైన యొక జంగము లింగము తన యింటి కరుణతో వసించుటయే. నిజమునకు తపమా? అంతమాత్రమే కాదు. ఆ కరుణాంబుధి 'హస్తమస్తక సంయోగము' గురుఁడు శిష్యననుగ్రహించి, యుపదేశమిచ్చుట. ఆత్మానుసంధానమొనర్చుట. వీరశైవాచారమున 'దీక్షావిధి' యిది. గురువు తన శిష్యుని మస్తకముపై దన హస్తముంచి తన దివ్యకళను శిష్యునియందుఁ బ్రతిష్ఠించి, శిష్యుని భౌతిక శరీరమును 'లింగ' శరీరముగాఁ బరిణమింపజేసి, పంచాక్షరి నుపదేశమొనర్చి 'యిష్టలింగముఁ' బ్రసాదించును. ఈ దీక్షనందినవాడే శైవుఁడనిపించుకొనునఁట. ఈ సంప్రదాయ మిప్పటికిని 'దీక్ష పుచ్చుకొనివారా?' యను ప్రశ్నరూపమున లోకవ్యవహారమున మన్నది.*

* నన్నెచోడుని శైవ సంప్రదాయము — వి.వెం. — భారతి — ఏప్రియల్ 1969.

అయిన నీ ఘట్టమునఁ గ్రొత్తగా దానికి దీక్ష నిచ్చుట యన్నది లేదు. ఆపై యీవలకే 'శశనాసూత్రస్థిత స్వర్ణపేశీవిన్యస్తకపర్ది' గదా ! పంచాక్షరి నుపదేశించుట, యిష్టలింగమును ప్రసాదించుట యను నంశము లిచ్చట ప్రసక్తములు కావు కాని కుమార జంగముఁడిచ్చట 'హస్తమస్తక సంయోగము' చే దన దివ్యకళ నామె యందుఁ బ్రవేశపెట్టుటచేతనే యీ యద్భుతము జరిగినది.

చూడఁబోవు జంగమ లింగమందలి గౌరవాదరములచేఁ బ్రభువు కతిపయహిత పురోహిత సచివ సహితముగా దాసి యింటికిఁ జనెను. ఆ 'మందిమార్బలము' ప్రభుతకుఁ దార్కాణమే. అందులకు దానికి ముందుపయోగించిన 'చతురుదధివలయ క్షితిపతి' యను ప్రయోగము. ఆ క్షితిపతిత్వమునకిది యంగబలము. అనుప్రాస బహుళముగా నున్న యీవచన రచన యాదవ భూకాంతుని సపరివారముగా బయల్వెరుటను, ప్రభువు కోపమునణఁచుకొనుటనుఁ దెలియజేయుచున్నవి. అతనికిఁ గలిగిన కోపము దీర్ఘమైనది — 'కొనలుసాగు కనలు'. అంత దీర్ఘమైన కోపమును నుపశమించుకొని కుదుటబడుట చాలకష్టము. కనుక 'అనుకూలంబైన హృదయంబు సదయంబుగా' నొనరించుట. తీవ్రమైన కోపము వచ్చినంత త్వరగా తగ్గిపోవదను. తగ్గించుటకు కాలము, శ్రమ కావలెనను భావము పైనుదహరించిన చిన్నవాక్యము పెద్ద వాక్యము వలన స్ఫురింపఁగలదు. 'అమ్మచ్చెకంటి యింటికిం జని' యనువాక్యము నా ప్రభువేగిన వేగసూచకముగా నున్నది. జంగమలింగమునకు 'కరాంభోజ ముఖాంభోజముల బూజించు'ట యనగా మోమునఁ జేతులెత్తి 'శరణార్థి' చేయుట, కరములు, ముఖమునుఁ బద్మములతోఁ బోల్చుట కవి సమయమే. ఇందు విశేషమేమనగా రెండును సజాతీయములయినప్పుడే సంయోగమునకు సార్థక్యము.

'అనవుడుఁ గనుంగొనలఁ గొనలుసాగు కనలున కనుకూలంబైన
హృదయంబు సదయంబుగా, చతురుదధివలయితక్షితిపతి కతిపయ
హిత పురోహిత సచివసహితంబుగా, నమ్మచ్చెకంటి యింటికింజని:
జంగమ లింగంబు పదాంభోజంబులఁ గరాంభోజ ముఖాంభోజంబులం
బూజించి: వినయ వినమితోత్తమాంగుండై' ... *

* శ్రీ కా. మా. — 1 అ - 57 వ.

శ్రవణసుభగములైన పదావృత్తులచే నొప్పు నీయనుప్రాసభరిత వచనరచనమె కవీంద్రుని వచోవైభవమునకుఁ దార్కాణ.

జంగమలింగమునకు నమస్కరించి, ప్రభువు వేసిన ప్రశ్నయందు తననుఁ గూడ ననుగ్రహింపుఁడను నివేదనము గలదు. 'లీలార్థంబు విచ్చేసినార' ని ప్రశ్నించుట యందు రాజున కా తపసియందుఁ గల యీశ్వరభావము, 'ఇయ్యబ్జానన మీఁద నింత దయ మీకెట్లయ్యె' ననుటయందు దాసి యేసేవచేసి యాతని దయకుఁ బాత్రురాలయ్యె నను ప్రశ్నయు, తనవలన నేమైన సేవఁగైకొనరాదా యను భావములున్నవి. తనకు నట్టి సేవాభాగ్యముఁ గల్గించి తన్ను ధన్యుఁజేయుఁడని యాతని నివేదనము దాసి పలికిన పలుకులపైఁ గొంత యాశ్చర్యముఁ గలిగినను, స్వయముగా దాను వచ్చి చూచుటతో నా జంగమ స్వామియందు మహిమాన్విత తేజము గోచరించునది.

ఈ పద్యమున* ధూర్జటి కవీంద్రుఁడు రెండు విశిష్ట ప్రయోగములుఁ గావించి యున్నాఁడు. 'చెయ్యంగాఁగల', 'ఫణిగ్రామణీశయ్యాస్తుర్చిందు'. 'చేయంగాగల' యనుటకు గవీంద్రుఁడు గావించిన సృష్టి యిది. ధూర్జటి ప్రయోగ స్వాతంత్ర్యమున కిది యుదాహరణము. అది ప్రాసస్థానమున నున్నది గాన 'చేయగాగల' యని దిద్దుటకు వలను కానిది. రెండవ సమాస ప్రయోగము, పార్వతీశాతిశయమున కుపయోగించిన విశేషణము. ఆ విశేషణ ప్రయోగమున కిచటగల యౌచిత్యమెంతవఱకో విచారింపవలసియే యున్నది. 'ప్రసన్నమూర్తియై' యనుదానికి పోషకముగా నున్నదనిపించుచున్నది. దాసిని శిక్షించుటవలన తనపై నా జంగమ లింగమూర్తి కోపమంది యుండునని ప్రభువు భావించటంబట్టియే వేగమె సపరివారముగా నేఁగుదెంచుట. ప్రభువు వచ్చి నమస్కరించుటతోఁ గోపము గొంత తగ్గక తప్పదుగదా! అపైఁ గడు వినయమున తనసేవలు నంగీకరించి తనను గూడ ననుగ్రహింపుఁడని ప్రభువు వేడుకొనుటతో నాతని యాగ్రహమంతయు మటుమాయమై యుండును. 'నేజెయ్యంగాగల యూడిగం' బెయ్యది యని యడుగుటయందు తానేవిధమైన సేవఁ జేసిన యాతఁ డాగ్రహము విడి యనుగ్రహించునో తెలుపుఁడనియు, తనను కూడఁ దరింపఁ జేయుఁడనియు నన్న యావేదనతో గూడిన నివేదనమది. కాన కవీంద్రుఁడటఁ బ్రభువు మనమును కలవరపెట్టుచున్న యాతని యాగ్రహమూర్తి, ప్రభు నివేదనమునకు

* శ్రీ కా. మా. — 1 ఆ-58 ప.

ప్రసన్నమైన దనుటయె. 'పక్షిగ్రామణీశమ్యాస్త్రుఁ' డనుట, విష్ణుని బాణముగా గలవాఁడనుట, శివాతిశయమును బేర్కొనుటయేఁగాక, శత్రు నిబర్హణమునకు శస్త్రముఁ బట్టినట్టి యీశ్వరుఁడు కోపమునుపసంహరించుకొని ప్రసన్నుఁడయ్యెనుటను సమర్థింపఁజాలినదై యీవిశేషణము, విశిష్ట ప్రయోగము సముచితమై యొప్పుచున్నదనవలె.

యాదవ నాయకునిఁ గాళహస్తీశ్వరునకు ఆలయాధికముల లోపమెఱిఁగించు నుద్దేశము తోడనె తొలుత నాజంగమ లింగమూర్తి కాళహస్తి కేతెంచినాఁడు. త్రోవలో దాసి యగపడినది. దాని భక్తికి మెచ్చి వీడఁజాలక యామె యింటికేఁగిన, యా లింగమూర్తి, మఱి యానాయకుని తనకడకే రప్పించుకొనుటకు దాని నుపయోగించుకొనదగుననిపించినది. అందుల కతఁడు చూపిన మహిమ ముపయుక్తమైనది.

ఒక మహాధికారితో బనిపడినప్పుడాతని నెట్లు కలియుట యనునాలోచనము చేయుచో, నా యధికారికి మిక్కిలి కావలసిన వ్యక్తి పరిచయమైనచోఁ జాలును. అదే యిచ్చట సముచితముగ సంఘటించినది. ఇది లోకరీతి. అయినఁ బరమేశ్వరుఁడు తానుగా జంగమ రూపియై రాజుకొల్వునకేఁగిన ప్రభువర్చించి, యాజ్ఞఁ బాలించును గదా! నడుమ నీదాసియేల? ఈదాసి వృత్తమిందు రెండు విధములఁ గూర్పఁబడెను. త్రోవలో నెదురుపడుటచే ఆమె ప్రభువునకుఁ బళ్లెరపు దాసియని యప్పటి కెఱుకలేదు. ఆమె మొదట ప్రకటించిన భక్తి ప్రపత్తు లా జంగముని లోఁగొన్నవి.

**భక్తిపూర్వకమతి న్నరణార్తియొనర్చి యొక్కచేఁ బ్రపదములంటి**
**తన్మృదులపాణి సరోరుహాదత్తభూతి నిద్దపు నుదుటం ధరించి' నది.**

తన యింటి జంగమార్చన మందుకొనుమని వేడినది. ఆమె భక్తిభావము, నివేదనము లా లింగమూర్తిని ముగ్ధనొనర్చినవి. అపై నామె 'కందర్ప శుద్ధాంత శ్రీ పరిహాస కృన్నిశీల లోకాతీత సౌందర్య' మాతని మోహపఱచినది. దాని భక్తి కాతని మనఃకంజము రంజిలినది. ఆ దాసి భక్తి తగులమున నుండి యాతఁడు వీడిపోలేక పోయినాఁడు. ఇది యొక విధము.

ఆ పట్టణమునందలి ప్రాణుల మోక్షాపేక్షయం దుత్తమ మధ్య మాధమత్వములు లేవు గదా! పురపల్లవశ్రేణి నాకర్షించు సుందరియై, ప్రభువుల కొలువున పళ్లెరపుం దాసియైనను, శివాసక్తైక సంశీల గాన నామె నుద్ధరించుట వలన పరమేశ్వరుని భక్తవాత్సల్యము, తరతమభేద రాహిత్యములు, నతిథిగాఁ బూజించినవాని కోర్కె

మెట్టిదైన సర్వేశ్వర సమర్పణ బుద్ధితో సంగీకరించుట యను నతిథి సమారాధనా తత్త్వము లందావిష్కరింపఁబడినవి.

కాళహస్తిపురికి తనవచ్చిన హేతువుఁ బలికి, జంగముఁ డధిపుని 'కలధౌత శైల శిఖరాలను గేహముఁ గట్టఁబంపు'మని నియమించినాఁడు. ప్రభువు 'చెయ్యంగా గల' యాడిగ మదియే. స్వామి యాజ్ఞనప్లే నెఱవేర్తునని, గాళహస్తీశ్వరు గాథ నెఱిఁగింపుమని ప్రభువు ప్రార్థించెను.

'తదాది పురాణ కథా ప్రసంగముల్ వినవలతు' ననినాఁడు రాజు. అనగా గాళహస్తీశ్వరుఁడుగా వెలుగొందుచున్న పరమశివలింగమూర్తి యావిర్భావాదికము లెఱిఁగింపుమని యర్థము.

ఇది దాసి-మిండ జంగముల కథ. తాను నిర్వహింపనున్న కథావట నిర్మాణమున కిది పాదు. ఈ ఘట్టము కవీంద్రుని సర్వతోముఖమైన ప్రజ్ఞా ప్రదర్శనమునకు నాలవాలమైనది. సన్నివేశ కల్పనము[1], సంభాషణ విరచనము[2], మూర్తిచిత్రణము[3]. అవస్థాచిత్రణము,[4] రసపోషణము[5], శివభక్తిసారమ్యము[6], లోకజ్ఞత,[7] ప్రయోగ స్వాతంత్ర్యము,[8] శైలీసౌభాగ్యము[9] లు గలిగి కవిత్వము వ్యక్తిత్వముల మాధురీ మహిమకుఁ బ్రతిబింబమై యలరుచున్నది.

ఈ ఘట్టమునంతయు మహావేగముగా నొకదానివెంట నొకటిగా సంఘటనములఁ గూర్చుచు, కథనము చేసిన సందర్భమున దాసి ప్రభువునకు నివేదించిన విన్నపమున నొక కాలసూచకమైన ప్రయోగమున్నది. 'నా గృహంబులో నిన్నటి నుండియు' జంగమలింగము వసించియున్నాఁడనునది యది. అనఁగా జంగముఁడు దాసి యింటికేతెంచిన మఱునాఁడు, రాజు, దాసిఁ బిలువఁబంచుట, శిక్షించుట సంభవించినదని సూచించిన దా ప్రయోగము. దానికి త్రోవలో నెదురయిన జంగమ

---

1. శ్రీ కామా 1అ–33 ప–61 ప
2. ,, 1అ–35 ప–38 ప, 54–56, 58–61
3. ,, 1అ–30 ప, 33 ప
4. ,, 1అ–34, 42, 47 ప
5. ,, 1అ–32, 33, 37, 40, 41, 42, 43 ప–శృంగారము, 52, 52–అద్భుతము
6. శ్రీ కామా–1అ–35–51 ప
7. ,, –1అ–48, –55, 58, 60
8. ,, –1అ–58
9. ,, –1అ–32, 33, 34, 52, 53, 57, 58

లింగమూర్తి దాసి భక్తికి మెచ్చి యింటికి వచ్చెద పదమని వెంటఁబోయినాఁడు. ఆ దాసి ప్రభువు కొలువున కేగుచున్నట్లయిన నంతయు నొక్కదినముననే జరిగి యుండును గదా! అట్టితఱి 'నిన్నటి మండియు' ననునదెట్లు పొసగును? 'ఆ వేళన్' అనుట యందెట్టి కాలసూచనయు లేదు. ప్రభువుల కొలువునుండి సాయంవేళ నింటికిఁ జనుదెంచుచున్న దాసి కాలింగమూర్తి యెదురుపడి యుండవలె. ఆ ప్రస్తావనయు లేదు. ప్రసక్తి లేకున్నను జాగరూకతమైఁ బరిశీలించిన యెడల నాధారము దొరకుచున్నది. తన కోరికఁ దీర్చుట కంగీకరించిన యా దాసివెంట జంగను లింగమూర్తి 'చంద్రికాశ్రీ వెనువెంట నేగు నల శీతమయూఖుని రేఖ,[1] వలె నేఁగినాడు. ఈ యుపమాన వాక్యమున కాలసూచనము నిక్షిప్తమై యున్నదివోలెఁ దోఁపక మానదు. అతఁడు సుధాకరమౌళి యగుటచే 'శీతమయూఖుని రేఖ' తోఁ బోల్పబడుట సమంజసమే. చంద్రుఁడు చంద్రిక వెన్నంటునట్లభివర్ణించుటచే నామె సౌందర్యమును జక్కఁగఁ జెప్పినట్లయినది. ఆమె రతిసౌందర్యయని మొదటనే యాతని కనిపించినది.[2] ఆమె యాతనిని కందర్పునిగనే పలికినది.[3] తరువాత పలికినట్లు[4] వారిరువురును రతీమన్మథులతోఁ బోల్చబడవచ్చును కదా! చంద్రికా చంద్రులతోఁ బోల్చుటయందీ యుపార్థ మిమిడ్చినాఁడు ధూర్జటి కవీంద్రుడు. అది వెన్నెలవేళ యని యిందు వ్యంజింపబడుచున్నది. ఆ రాత్రి గడచిననాటి మఱునాడే కదా! ఆ దినమంతపఱకును తన 'జంగమార్చనము' నెఱవేరలేదని దాసి పలుకనే పలికియున్నది. 'ప్రతి దినంబును జంగమార్చనము లేక తనివిపడ నొల్ల'.[5] ఆ రేయి వేఁగిన తన వ్రతము నెఱవేరకపోయిన దన్నమాట. ఆ నాఁడిక జంగమార్చనము లేక గడుపవలసినదేనా యని యామె మనమునఁ గుందుచుండ నీ మిండ జంగముఁ దెదురయినాఁడన్నమాట.

ఫలితాంశము :- ప్రభువుల కొలువునుండి. రాత్రివేళ నింటికేతెంచుచున్న యా దాసి జంగమ లింగమూర్తినిఁ గాంచినది. 'శరణార్థియైనర్చి' తనకు జంగమార్చన భాగ్యము గలిగింపుమని కోరినది. యంగీకరించిన వానితో నింటికేగి యా రేయి తపసి తగులమునసుండి, మఱునాఁడుదయమున తన యుద్యోగ ధర్మమునకు వేళకేగలేక, రాజాగ్రహమునకు గుఱియైనది. కనుక యీ ఘట్టమందలి కథా సన్నివేశము రెండునాళ్ళకు సంబంధించినది.

---

1. శ్రీ కా. మా. 1ఆ – 39 వ
2. ,, 1ఆ – 36 వ
3. ,, 1ఆ – 35 వ
4. శ్రీ కా. మా. 1ఆ – 54 వ
5. ,, 1ఆ – 35 వ

'శ్రీకాళహస్తి శశిశేఖరు దివ్యనివాసపంక్తి మోహనముగఁ గట్టఁబంచెద'నని ప్రభువు 'తదాది పురాణ కథా ప్రసంగముల్ వినవలఁతు'నని నివేదించి, సవిస్తరముగా, గృపాంబుధియై తెలుపుమని ప్రార్థించెను. పై వాక్యమందలి 'తదాది పురాణ కథ' యను దానివలననే, జంగమ లింగమూర్తి క్షేత్రస్వామి యవతరించినది మొదలు కథ తెల్పుటకుద్యమించుట.

శివభక్తుల చరిత్ర కథనమిచ్చట నుండి ప్రారంభమగుచున్నది. శివభక్తులనేకులనేక సాత్రములందున్నను, ప్రభువడిగిన ప్రశ్నయందలి 'తద్' అనుదానిని మూలపురుషుఁడు కాళహస్తి శశిశేఖరుఁడే, కాన నా క్షేత్రమూర్తి యయిన 'శ్రీకాళహస్తీశ్వరు'ని యవతారమును తొలుతఁ బలుకుట సువర్ణముఖరీ నదీ జననముఁదెల్పుట, క్షేత్రనామ సార్థక్యమొనర్చు చెలఁదిపురుగు, పాము, నేనుఁగుల కథలుఁ బలుకుట, తరువాత వానితో సనుముగాఁ బూజలు గొనుచున్న 'కన్నప్ప' కథ దెలుపుట, నాపయి నా క్షేత్రస్వామి దర్శనము చేసి ధన్యులైన నత్కీరు, వేశ్యా తనయల గాథలు పలుకుట జరిగినది. పురుఁగు, పాము, నేనుఁగు, నాటవికుఁడైన భక్తుల కిజన్మమునకే ముక్తి లభించుటకు వలసిన సంస్కారము లేదు గాన వారికిఁ గల పూర్వజన్మవృత్తములను నాలుగవ యాశ్వాసమునఁ జుదను బలుకుట సంభవించినది.

భారతదేశమున భక్తవత్సలుఁడగు భగవానుఁడవతరించిన తావులు, దుర్గమ వనములు, నదీతీరములు, పర్వతములుగా నున్నవి. చెలఁది పూర్వజన్మమున విశ్వకర్మ కుమారుఁడైన యూర్ణనాభుని కీటకముగ శపించుచు బ్రహ్మ *'గజారణ్యమునందు బిల్వవనవీథివర్తివై యుండుమనియు, 'మున్నటన్ వశిష్ఠునకు ముక్తి సుఖంబు ఘటింప లింగమూర్తి నిలిచి' యుండెనవియు, నా లింగమూర్తి ఘణాకృతినుండు ననియుఁ బలికెను.

ఫణారాజన్మహాలింగముగా నీశ్వరుఁడు యమహాద్రి దరి నపతరింప నున్నాఁడు. వశిష్ఠుఁడు కోరిన ముక్తి ప్రసాదించుట కట్లావిర్భవించును.

---

* శ్రీ కా. మా. 4ఆ–142, 143 ప

వశిష్ఠుడు ముక్తికాంక్షచే మహేశ్వరుని గూర్చి మహోగ్రమగు తపమాచరించెను. సహజముగా నా బ్రహ్మర్షికి ముక్తియందు కాంక్ష కలుగలేదు. పుత్ర శోకము భరింపలేక వశిష్ఠుఁడు కొండనెక్కి కూలెను. భూదేవి యాతనిఁబట్టి యాత్మహత్య వలన సాధించునదేమియు నుండదనియు, నందువలన పుట్టువు కలుగకుండదనియు (మోక్షము) భావ వైరాగ్యమే యున్నచో పార్వతీరమణుని గొల్చిన జీవన్ముక్తి బొందుదువనియు హితవు బలికినది. వశిష్ఠుని భూదేవి 'వెఱ్ఱి' యని సంబోధించుట మిక్కిలి యుచితముగా నున్నది.

'కృష్ణో భోగి శుక స్త్యాగీ, రాజానో జనకరాఘవః
వశిష్ఠః కర్మ నిరతః, పఞ్చైతే జ్ఞానినస్సమా''

శ్రీ విద్యారణ్యుల తైత్తరీయ భాష్యము

బ్రహ్మజ్ఞానియైన వశిష్ఠుడు, భవబంధమైన పుత్ర సంతతిని విశ్వామిత్రుని వలనఁ గోల్పోయినందులకు దుఃఖించుట తగదు. అంతటి జ్ఞానియయ్యు పుత్రశోకము భరింపలేక ప్రాణము తీసికొనుటకుఁ బ్రయత్నించుట 'వెఱ్ఱి' కాక మఱియేమి ? దుఃఖియై బలవన్మరణమందిన మోక్షము లభింపదని తెలిసికొనఁగలిగియు నతఁడట్లవివేకియై ప్రవర్తించుటచే నతని స్థితికి బృథివి 'యయ్యో' యని జాలి తెలిపినది. సంసారమును రోయనివారు నవశ్యమాచరింపవలసినది భగవద్భజనము కాగా, సంసారమును రోసినవారు పరమేశ్వరునిఁ బ్రార్థింపకుండుటయేమి ? కాన నీశ్వరుఁ గొల్చిన 'జీవన్ముక్తి'* లభించునని పలికెను.

*జీవన్ముక్తిః 'శ్రీ సీతారామాంజనేయ సంవాదము'న వ్యాఖ్యయందిట్లున్నది. పుట 38

1. హర్షామర్ష భయక్రోధ కామకార్పణ్య దృష్టిభిః
   న హృష్యతి గ్లాయతి యః స జీవన్ముక్త ఉచ్యతే'
2. మౌన వాన్నిరహంభావో నిర్మానో ముక్త మత్సరః
   యః కరోతి గతోద్వేగ స్స జీవన్ముక్త ఉచ్యతే
3. యావతీ దృశ్యకలనా సకలేయం విలోక్యతే
   సాయేన సంస్థు సంత్యక్తా స జీవన్ముక్త ఉచ్యతే
4. ఉద్వేగానంద రహిత స్సమాయా స్వచ్ఛయాధియా
   న శోచతే న చోదేతి స జీవన్ముక్త ఉచ్యతే

జీవించియుండఁగనే భవబంధములనుండి విముక్తి, జన్మాంతమున జన్మ రాహిత్యములు గలుగుట జీవన్ముక్తి. కాననే వశిష్ఠుఁడు పరమేశ్వరానుగ్రహము బొంది తక్షణమే సాయుజ్యమందలేదు. 'నిజప్రతిష్ఠిత దివ్యలింగోపకంఠంబున' పరమేశ్వరానుగ్రహము బొందిన వృత్త కథనమున గవీంద్రుఁడు హృదయవాదియై, దక్షిణమూర్త్యుపాసకుఁడై కనుపట్టుచున్నాడు. పరమేశ్వరార్చనమునందు సాధకుఁడు చేయవలసిన మనస్సమర్పణ[1] భక్తపరాధీనుఁడైన యీశ్వరుని వాత్సల్యము,[2] భగవత్సాక్షాత్కారమున భక్తుఁడు బొందు దివ్యానుభూతులను[3] వర్ణించిన కవి 'స్వానుభవము'చేఁ బలికెనా యనిపించు ఘట్టమిది. వశిష్ఠుఁడు యాచించిన 'బ్రహ్మ విద్యాదనభిక్ష'[4] కోరిన 'చిన్మయాకృతి,[5] దర్శనములు కవి ధూర్జటికిఁజెందినవే. ఈ ఘట్టము ధూర్జటి కవీంద్రుని యాత్మీయతకు, వ్యక్తిత్వమునకుఁ బ్రతిబింబమై యొప్పు చున్నది. భవనిరాసము, మోక్షాపేక్ష, భక్తి తాత్పర్యములు కవీంద్రునివే.

పరమేశ్వరుఁడు పలికినట్లు, 'దేహమోహంబు విడిచి, సందేహముడిగి భక్తి భజియింపఁ'[6] దొరకొనినాఁడు వశిష్ఠుఁడు.

పరమేశ్వరుని గూర్చి మతిస్థైర్యముతో, నత్యుగ్రముగ వశిష్ఠమహర్షి తప మాచరించెను. ఎండ, యాఁకలి, విషజంతువులు, గాలి బాధలనుండి 'శ్రీగురుపాద రాజీవ యుగాతపత్రము, తరుణేందు భూషణ ధ్యాన సుధాధార, సకలాంగ భసిత కంచుకము, ఘన భక్తిగర్త నిఖాత చిత్తస్తంభములు వశిష్ఠునికి నీడనిచ్చి, యాహారమై, కవచమై చలింపనీయక యుండగా నున్నవి. సంసారమోహ జంబుక మునుఁ బట్టుటకు రాజయోగజాలము పన్నినాఁడు బ్రహ్మర్షి. పరమేశ్వరుచరణ కమలముల నాశ్రయించుట, శశిధరునామ సుమృతముగా గ్రోలుట, సకలాంగములను భస్మధారణము చేయుట, నిశ్చలభక్తి కలిగియుండుట, మున్నగు భగద్ధ్యానక్రమము, తపశ్చర్య రాజయోగము.[7] బ్రహ్మర్షి తపస్సను సింహాసనాసీనుఁడై మునిరాజయి విరాజిల్లినాఁడు.

---

1. శ్రీ కా. మ. 1ఆ–70 ప
2. ,, ,, 74 ప
3. ,, ,, 77 ప
4. శ్రీ కా. మా. 1ఆ–83 ప
5. ,, ,, 82 ప
6. ,, 4 ఆ–197 ప
7. ,, ,, 71 ప

రాజోపచారములవలె నీ మునిరాజునకును తపశ్చర్యా సమయమున నా గజారణ్య ముపచర్యలు గావించినది. అడవి యేనుఁగులు తొండముల దెచ్చిన యుదకము అభిషేక జలము కాగా, చమరీ మృగములు తమవాలములచే వింజామరలు వీచుచుండ, కోఁతులు పండ్లు కానుకలీయగా, కిరాతాంగనలు సేవలు చేయుచుండగా నా మునిరాజు తపస్సింహాసనాసీనుఁడై యలరారెను. 'రాజయోగను'నుటయందు రాజునకుఁగల్గు యోగము, రాజభోగము, రాజోపచారములను నర్థములు స్ఫురించును. కనుక వెంటనే తరువాత పద్యమున నా మునిరాజునకుఁ గలిగిన రాజోపచార విధి క్రమమును వర్ణించినాఁడు కని[1]

తరువాతి పద్యమున ముందురానున్న 'హస్తికాళముల' పోరాటము, వధ్య స్థానములను సూచించు భావము పోషితమైనది. 'ఖండాల' 'చండకుండలి' 'శ్రీ ఖండ స్థాణువు' పదప్రయోగముచే నీ యాగామి కథా సూచనను గుచున్నది.[2]

మహోగ్రముగ నిశ్చలముగా సాగించుచున్న వశిష్ఠుని తపమునకు పంచశర భంజనుండు గరుణించి ప్రత్యక్షమైనాఁడు. పరమేశ్వరుని భక్తరక్షణపర సంభ్రమము చూడ, గజేంద్రుని రక్షింపుటకై సంరంభియై యేఁగుదెంచిన హరివలె నున్నది. ఈ హరుఁడు నా హరివలె భక్తవత్సలుఁడు గదా మఱి! తన సేవలకై వాకిట గాచియున్న హరి, విరించులను తలఁపక, గిరిజాపతి పరిహాసములు పట్టించుకొనక, దగ్గఱనున్న కుమారులను చూడనైన చూడక, భక్తభక్తి కన్యాకరపంకజ గ్రహణనైష్ఠికుఁడై' సంభ్రమముతోఁ బ్రత్యక్షమయినాఁడు[4] పంచశరభంజనుఁడు. ఈ భావమునే తరువాత ధూర్జటి లింగరాజు ననుకరించెను.[5]

---

1. శ్రీ కా. మా. 1ఆ—72 ప
2. ,, ,, 73 ప
3. భాగ—అ. స్కం. 96 ప
4. శ్రీ కా. మా. 1ఆ—74 ప
5. శ్రీ కాప్ల. మా. లింగరాజు

నతి యొనరించి నిల్చిన జనార్దన వాగ్వరులన్ దెలంపక
ప్రతిహత దైత్య సంహరణ పద్ధతినెంచక. భృంగినాట్య సం
గతి బరికింప కాత్మసుతఁ కామిత మియ్యక నద్రిజా నిలో
లత విహరింప కమ్మునికులప్రభు వాంఛిత దాన దీక్షతోన్.

పరమేశ్వరుని దివ్య ప్రకాశము కేవల చర్మచక్షులకు దుర్నిరీక్ష్యమే కాదు, 'మనోదృష్టి దురధినివేశ నిరవకాశకృత దశదిశా ప్రదేశ'మైనట్టిది.[1] క్రమముగా నా దివ్యతేజము పరమ శివలింగ రూపమందినది. ఇయ్యది మహార్థగంభీరము, భగవ త్తత్వ నిరూపకమునైన మహా విషయము.

సృష్టి స్థితి లయకారకములయిన భగవదంశలు మూఁడింటికిని మూలము జ్యోతి స్వరూపము. దానికి కొలఁతలు, కొలఁదులు లేవు. సర్వము తేజోమయము. దాని సంకుచిత స్వరూపములే నిమిత్తములుగా వివిధ రూపములఁబొందుచున్నవి. 'సర్వకర్తృతాశక్తి, సర్వజ్ఞతాశక్తి, నిత్యపరిపూర్ణ తృప్తి, నిత్యతాశక్తి, స్వాతంత్ర్య శక్తి,' అను శక్తి పంచకము సంకోచము పొంది 'కల, విద్య, రాగ, కాల, నియతి' యను పంచ తత్త్వములుగాఁ బొందుటను కంచుకమందురు.[2] ఆ కంచుకమును పొంది పూర్ణసంవిత్స్వరూపము నాచ్ఛాదము పొంద, పరమేశ్వరుఁడు పంచముఖుఁడై ప్రత్యక్షముయినాఁడు. ఫణాలింగరూపిగా, నైదు పడగలు గల పాము నాకారముగాఁ బరమేశ్వరుఁడుండుట యిది. ఐదు ముఖములను పరమేశ్వరుని యైదు ముఖములు గను పాము పడగలుగను శ్లేషింపఁబడిన విధట. పృథివ్యాది పంచభూతములు త్వగాది పంచేంద్రియములు, శబ్దాదులగు పంచ విషయములు, నవిద్యాది పంచ క్లేశములు, అన్నాది పంచకోశములను పంచవిధసర్గములచేఁ గూడియున్న యీ ప్రపంచము భక్షించుటకు నైదు (పడగలు) నోళ్ళు కావలయును. ఇట్టి ప్రపంచము నుండి విముక్తిఁ బొందుటకట్టి పంచముఖ నర్చింపవలయుననుట, యిందలి పరమ రహస్యము.

తన హృదయమున భావించిన గిరిజానాథ స్వరూపము పల్కినట్లనిపించి, భయభక్తులతోఁ గన్నులు విచ్చి చూచిన వశిష్ఠునకు, 'పురఘస్మరు దిగ్పరిపూర్ణ దీప్తి సంపన్నతకు' భయము కలిగినది. ఆ భయముచేతనే, పరమేశ్వర సాక్షాత్కారమైన దను ప్రమోద సంభ్రమముల చేత నాతనికి (శరీర కంపనము, పులకాంకురతఁ స్వేదములు) సాత్త్వికోదయమయినది.

---

1. శ్రీ కా. మా. 1అ - 75 ప

2. విజ్ఞాన సర్వస్వము - 7వ సంపుటము - 357 పుట - జి. మా. శర్మ వ్యాసమాధారముగ.

ఈ యనుభూతి స్వానుభవమున గానఁబడునవియే కాని, బహుభాషా నైపుణిచేఁ దెలియఁబఱుకఁ గలిగినది కాదు. ఆ భక్త్యావేశమున నా భయోద్రేకమున, నా ప్రమోదాతిరేకమున వశిష్ఠుఁ డద్రిజాధీశునిఁ గావించిన నతి, నుతి, భక్తిపూరిత పర్వాంగునిగా నిరూపించుచున్నది. అన్ని విశేషణములును భావపునరుక్తి లేక విశ్వేశ్వరుని లోక నాయకత్వము, సారూప్యము, సర్వవ్యాపకత్వము, సర్వసాక్షిత్వము, సర్వభార ధురంధరత్వము, త్రిమూర్త్యాత్మకము, సర్వాధిక్యతలను నిరూపింపఁజాలినవి.[1] జగత్పరిపూర్ణుఁడగు నా పరమేశ్వరునియందే యిరువది నాలుగు తత్త్వములు పుట్టి యణఁగును. ఆ మూర్తి దృశ్యేతరమై భాసించునది.

వశిష్ఠుఁడు పరమేశ్వరుని కోరిన వరములు విచిత్రములై, సర్వోత్కృష్టములై బ్రహ్మర్షి స్థానమును సార్థకపఱచుచున్నవి. బ్రహ్మవిద్యాభిక్ష నిడుటయొకటి, యుగము లన్నిటియందు నిట్లే ఘోర సంసార గదాపన్నౌషధఘటికా నుహిమోన్నతిఁ బూజఁ గొనుమని యర్థించుట రెండవది.

బ్రహ్మవిద్యాభిక్ష నిచ్చుటకుఁ బరమేశ్వరుఁడు లింగరూపమున నున్న చాలదు. అతడు దేశికోత్తముఁడుగా విద్యోపదేశము చేయవలయును. కానఁ బరమేశ్వరుఁడు వశిష్ఠుని మొదటి కోరిక తీర్చుటకుఁ బ్రత్యేకముగా దక్షిణామూర్తి స్వరూపముఁ దాల్చెను. అది వశిష్ఠుడు వాంఛించిన 'చిన్మయాకృతి'. దృశ్యేతరమగు నా చిన్మయాకృతిఁ జూడగల్గిన ధన్యులకు వేఱు ముక్తి యేమి ? పృథివి బోధించియున్నది. జీవన్ముక్తియేగద. కాన వశిష్ఠుడు ముక్తి క్రమదను కాంక్షింపక, జీవముతోడనే చిన్మయరూపమును దర్శించుటనుఁ గోరెను. బ్రహ్మవిద్యయను నోదనభిక్షను వేడిన వశిష్ఠుడు పరమేశ్వరుని కోరుటయం దుపయోగించిన విశేషణము సాభిప్రాయమై, భారతీయ గార్హస్థ్య సంప్రదాయ గౌరవౌన్నత్యములను చాటఁజాలినదై యలరుచున్నది. 'ఆది గృహస్థశేఖరుడైన' పరమేశ్వరుని వశిష్ఠుడు 'బ్రహ్మవిద్యాదన భిక్ష' వేడినాఁడు. జటి పరివ్రాజక క్షపణకాపధూతాదులకు భిక్షనిడి యాదరించువారు గృహస్థులే.[2] అ బ్రహ్మవిద్యోపదేశము చేయుటకుఁ బరమేశ్వరుఁడు దక్షిణామూర్తిగా

1. భాగ — అ. స్కం. 88 ప. ను దలఁపునకు దెచ్చును.

2. మ. చ. — 1అ — 66 ప.

రూపొందినాఁడు. వశిష్ఠుడు కాంక్షించిన చిన్మయాకృతి యది. 'యస్సాక్షాత్కరతే ప్రబోధసమయే స్వాత్మాన మేవాద్వయం తస్మై శ్రీగురుమూర్తయే నమః' అనునట్లు వశిష్ఠర్షికి బ్రహ్మవిద్యాబోధకుఁ బరమేశ్వరుఁడిట్టి స్వాత్మారాముఁడై, ముదిత వదనుఁడై సాక్షాత్కరించెను. ఆ మునీశ్వరుల సంశయ విచ్ఛేదనమునకై పరమేశ్వరుఁడు దక్షిణామూర్తిగ సాక్షాత్కరించినాఁడు వటవిటపి మూలమున దక్షిణ దిశగా నాసీనుఁడై యావిర్భవించిన యా దక్షిణామూర్తి పెదవి కదపకయే శిష్యుల సంశయములు విచ్ఛేదింపఁ బడినవి. అట్లే యిచ్చటను బ్రత్యక్షమైన దక్షిణామూర్తి వశిష్ఠునకు బ్రహ్మవిద్యను దెలిపి యంతర్హితుఁడయినాఁడు. 'మనము చిద్రసములో మునిఁగిన మాటాడ నెఱుఁగఁడో యన మౌన మెసఁగ'[2] బ్రత్యక్షమై తన మౌనముద్ర చేతనే, 'ఈశ్వరోహమ్మను నీ రహస్యము దెల్పు మురువున సుజ్ఞానముద్ర మెలయఁగా వశిష్ఠునకు బ్రహ్మవిద్యోపదేశము గావించినాఁడు. దక్షిణామూర్తి స్వరూప తత్త్వములను ఆచార్య శ్రీ శంకర భగవత్పాదులు పలికియున్నారు.

వటవిటపి సమీపే భూమిభాగే నిషణ్ణం
సకలముని జనానాం జ్ఞాన దాతార మారాత్
త్రిభువనగురు మీశం దక్షిణామూర్తి దేవం
జననమరణ దుఃఖచ్ఛేద దక్షం నమామి'.

'చిత్రం వటతరోర్మూలే వృద్ధ శిష్యా గురుర్యువా
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః'

'మౌనవ్యాన ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాన్తే వసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందరూపం
స్వాత్మారామం ముదిత వదనం దక్షిణామూర్తి మీడే'.

ధూర్జటి కవీంద్రుఁడు పరతత్త్వ ప్రతిపాదనమందు జేసిన మూర్తి చిత్రణము వలన నాతఁడు దక్షిణామూర్తి యుపాసకుఁడనియు, 'ఈశ్వరోహమ్మను' పదముచే

---

1. మఱియు
2. శ్రీ. కా. మా. – 1ఆ – 86 ప.
3. శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమ్ – శ్రీ కాశీశ్వరాది స్తోత్ర మంజరి – పుట 14/10వ శీర్షిక/

శివాద్వైతియనియు మనము భావించుట కవకాశము గలుగుచున్నది. జననమరణ దుఃఖచ్ఛేదనదక్షుఁడైన దక్షిణామూర్తి, వశిష్ఠునకు 'మహావిషయదూరానందము, సంప్రాప్తాద్యంతంబైన' రహస్యముగఁ దెలిపెను.

'ఈశ్వరోఽహమ్మను నీ రహస్యము దెల్పు మురువున సుజ్ఞానముద్ర మెఱయ'

మనము చిద్రూపములో మునిగిన మాటాడ నెఱుఁగఁదోయన మౌనమేసక మెసఁగ దక్షిణామూర్తి రూపంబుఁదాల్చి శివుఁడు యౌవన శ్రీసమేతుఁడై యవతరింప' అను వాక్యములందు దక్షిణామూర్తి తత్త్వముఁ బలుకుటమైనది.

తొలుతగా వృద్ధమునులకు సంశయచ్ఛేదన కవతరించిన దక్షిణామూర్తియు యువకుఁడే. గురుర్యువా ... సంశయ నివారణకుఁజేరు శిష్యులు నివారణము పొంది యేఁగుచుండ, గురుస్థానమున నున్న దక్షిణామూర్తి యెల్లప్పుడు నానంద స్థితిలో నుండును. ఆ స్వామి ఆనందమునకు ప్రతీక. అతఁడెఱిఁగించు పరబ్రహ్మతత్త్వము నకు, 'కరకలిత చిన్ముద్ర ఆనందరూపము, ముదిత వదన'ములు చిహ్నములు. యువత్వమే ఆనందమునకుఁ బ్రతీక యని తైత్తరీయోపనిషత్ వాక్యము 'యువాస్యాత్, సాధుయువా, అధ్యాయికా ...[1] ఆనందమమనది బ్రహ్మానందము. విజ్ఞానమానందం బ్రహ్మేతి[2] ఆనందో బ్రహ్మేతివ్యజానాత్[3]. దక్షిణామూర్తి తన కారణ శరీరమైన ఆనందమును బ్రదర్శించుటయే యీ పద్యమందలి భావము. అందువలననే పై మూడు పాదములందలి భావమునుఁ జిత్రించెను.

'అంగుష్ఠము, తర్జనితోఁ గలిపి చూపుట 'కరకలితచిన్ముద్ర'. అదియే 'ఈశ్వరోఽహమ్మను' రహస్యము 'అది జ్ఞానముద్ర.

వశిష్ఠునికిఁ దెలిపిన విద్య బ్రహ్మవిద్య. ఆలోచింపగా నాలోచింపగా గోచరించునది, ప్రపంచ మనోవ్యాపార విస్తృతి కలది, భ్రాంతిచే జీవత్వముచే ప్రశస్తి పొందినది, బ్రహ్మ మొదలు పిపీలిక వఱకు వ్యాపించినది, మనోవిషయములకు

1. తైత్తిరీయము – బ్రహ్మానందవల్లి – ఉపనిషచ్చంద్రిక – పుట – 125
2. బృహ – 3–9–28
3. తైత్తరీ – 3–6

దూరమైన యానందము కలది, యాద్యంతరహితమైనది, సంసారపాశములను( గోయునది, యయినది బ్రహ్మవిద్య. ఆ విద్య బోధించుటకే పరమేశ్వరు(డు దక్షిణా మూర్తి స్వరూపము దాల్చినది. ఇట్టి 'యవగ్రహరహితంబును, గలుషాహితంబును నైన బ్రహ్మోపదేశమునే[1] బ్రహ్మపుత్రు(డైన ఋభువున కీశ్వరు(డు గావించెను. ధూర్జటి కవీంద్రు(డు దక్షిణామూర్త్యుపాసకుడనుటకు ప్రబంధమున చతుర్థాశ్వాసాంత పద్యము, తుట్టతుది పద్యమునను పంచచామరమున "వటక్షమాజవాస" యని యీశ్వ రుని సంబోధించుటయు( దార్కాణ. 'వటమూలనివాసు' అను గొల్పుటయు శైవా చారము.[2] కవీంద్రు(డు శివభక్తు(డు, శివాద్వైతి, దక్షిణామూర్త్యుపాసకు(డని పించును.

ఈ విధముగా క్షేత్రస్వామి ఫణారాజన్మహాలింగముగా నవతరింప(జేసిన వశిష్ఠుని తపశ్చర్య కథితమైనది.

ఆ స్వామి యవతరించుటకనుపైన తావును ముందుగానె కవీంద్రు(డు నెల కొల్పియున్నా(డు. అది గణారణ్యము. దక్షిణదిశా భాగమునగల కొండ. దానికి దక్షిణ కైలాసమను ప్రశస్తి యింకను కలుగలేదు. ఈశ్వరు(డొక్క(డే నిలిచిన కైలాసము కాదు గదా! పరమేశ్వరితో( బరమేశ్వరు(డు గూడియున్నప్పుడే యది కైలాసము కా(గలదు. ప్రబంధమందెల్లెడల( గవీంద్రు(డు శివుని శక్తియుక్తునిగనే చిత్రించెను. తరువాత భక్తులకు సాక్షాత్కరింపనున్నవా(డు గిరిజానాథు(డే. కైలాస మున నున్న ఈశ్వరు(డు, వశిష్ఠుని రెండవ కోరిక ననుసరించి[3] యుగముల నన్నిటి యందు భక్తులకు( బ్రసన్ను(డై నిలిచిపోవలసి వచ్చెను. వశిష్ఠు(డచట( బరమేశ్వ రుని( బ్రతిష్ఠించెను.[4]

పరమేశ్వరుని వీడి పరమేశ్వరి యుండజాలక యచ్చటకు విచ్చేసినది. కైలాస మందలి ప్రమథగణము, వారి రమణులును, బ్రహ్మాచ్యుతులు, దేవబృందములతో( గూడి యా పార్వతి యిటకేగుదెంచెను. ఇ(క కైలాస మొంటరియైనది. నిండు దనము కోల్పోయినది.

---

1. శ్రీ కా. మా. 2ఆ–88 వచన
2. భారతి–1969 స్పెషియల్-పుట 70
3. శ్రీ కా. మా. 1ఆ–84 ప
4. ,, ,, 89 ప

తలిదండ్రులు లేని తనయునివలె విషాదనుంది యూ హిమగిరియు నేలకు వచ్చి, పార్వతీ పరమేశ్వరులచెంత నిలిచినది. అచటనుండు చంద్ర సూర్యులను కదలిపచ్చుటచే వారి యకాలగమనము, నిర్వారొకే పర్యాయము వచ్చుటయు లోకముల కద్భుతమయ్యెను. తిరిగి యిచ్చట కైలాసమవతరించినది. ఇప్పుడిది దక్షిణ కైలాస[1] మయినది. క్షేత్రస్వామికింకను పేరు కలుగలేదు కాని, స్వామిని పేరు గన్నది. ఆ తల్లి "సమస్త భక్తభృంగంబులఁ జిన్మరంద రసగాఢ సుఖాప్తులఁ" జేయుటచే జ్ఞానప్రసూనాంబ యని కీర్తిగనినది.[2] అ దక్షిణ కైలాసమున వాదిమ దంపతులు ననరివారులై నివసించిరి. ఆ గిరివరునకు నుత్తర భాగమున మేరువును, భైరవ, దుర్గ నగములును, నాగముఖ రక్షితములై తనరుచుండెను. ఇప్పటికొక క్షేత్రము, క్షేత్రస్వామినీ స్వాములు వెలసినారు. అ ప్రాంతమున నామడవలకు నివసించు జనులు, ప్రాణులు శైవలక్షణము లేవియు ధరింపకయే శివత్వముఁదొందుట జిత్రము గదా ![3] ఇది విభావానాలంకారము. అగ్గిరీంద్ర మహిమాతిశయమట్టిది. పార్వతీ పరమేశ్వరుల యావాస మా గిరీంద్రము. ఆ పార్వతీ పరమేశ్వరులు వసించుటయు, వర్తించుటయు నా ప్రదేశమునకు మహత్వమును చేకూర్చుచున్నవి. కాన నాదిమ దంపతుల విహారము వర్ణించినాఁడు కవీంద్రుఁడు. ప్రబంధమునందు పలుతావుల వారి దాంపత్య జీవిత ప్రాశస్త్యము నుగ్గడించునట్టి విశేషణములఁ బ్రయోగించి యున్నాఁడు, కవి. చెలఁదికి గౌరీవామాంగుఁడుగా[4] పాము నేనుఁగులకు కొండలపేని పరిమి మాఁతుతోడం గూడి,[5] తిన్ననికి శీతవసుధాధరకన్యక ముప్పఁగేలుఁదామరకడప్రేలు పట్టుకొని[6] ప్రత్యక్షమైన ఈశ్వరుని నత్కీరుఁ డుమాజానికి[7] మ్రొక్కినాఁడు. అతనికి తుషారశైలతనయా దాంపత్యసావనగార్హస్థ్యముగా సాక్షాత్కరించినాఁడు.[8] 'జ్ఞానప్రసూనకళికయుఁదానున్'[9] వేశ్యాతనయల దైన్యంబుడుప నొక్కదేహమై యెదురై నిల్చి నాఁడీశ్వరుఁడు. తిన్నని పూర్వజన్మమైన అర్జునునకునుఁ

---

1. శ్రీ కా. మా. 1ఆ 95 ప
3. ,, ,, 91 ప
3. ,, ,, 103 ప
4. ,, 2ఆ 102 ప
5. ,, ,, 152 ప
6. శ్రీ కా. మా. 3ఆ—120
7. ,, ,, 218
8, ,, ,, 222
9. ,, 4ఆ—127

బరమేశ్వరుఁడు, 'అద్రిరాజతనయ శబరిగా'[1] వచ్చి, వామసీమావరోధాకారుండయి[2] ప్రత్యక్షమైనాఁడు. ప్రబంధమంతటను బరమేశ్వరుఁడు శక్తియుక్తునిగనే యభివర్ణింపఁ బడినాఁడు, స్తుతింపఁబడినాఁడు. ఈశ్వరు నీరీతి భావింపమన్నానను సూచన కవీంద్రుఁడు తొలిపద్యముననే కావించి యున్నాఁడు. 'శ్రీవిద్యానిధియై ... అర్యావామాంగము, దివ్యలింగము'[3] ను తనయభీష్టసిద్ధికై యర్థించి, ప్రార్థించినాఁడు. అట్టి దాంపత్యపావనగార్హస్థ్యము నొకపరి తిలకించి, పులకించుట కొఱకే కవీంద్రుఁడిట పార్వతీ పరమేశ్వరుల విహారమును జిత్రించెను. సందర్భానుసారముగా, శృంగారము, అద్భుతముల నిందుఁ బోషించినాఁడు. పార్వతీదేవి యవయవ వర్ణన చేసినను నౌచిత్యము చెడకుండఁ జేయుట కవీంద్రుని ప్రతిభకు నిదర్శనము. అవయవ నామకరణము లేకయే యుపమాన సామగ్రిచే నుపమిత సామగ్రిని వ్యంజింపజేయుటలో గవీంద్రుని యౌచిత్యము కొనియాడఁదగినది.

గిరిజా సహాయుఁడగుచుఁ బరమేశ్వరుఁడు విహరించిన 'విపినామ్రపల్లవచ్ఛాయలు'[4] ధూర్జటి 'దినముం జిత్తములో సువర్ణముఖరితీర ప్రదేశామ్రకానన మధ్యోపల వేదికాగ్రమున నానందంబునఁ బంకజాసన నిష్ఠ'[5]తో బరమేశ్వరుని ధ్యానించి నట్టివే. శ్రీకాళహస్తి పురోపవనమైన యామ్రవనము కవీంద్రుఁడు స్వానుభవముగాఁ జూచి విహరించినట్టిదే. ప్రబంధమున నా ప్రస్తావనము మూఁడుతావులందగపడు చున్నది.[6] ఆ ప్రాంతమున 'అమర మనుష్యదైత్య భుజగాదులు కూడి'[7] తిరుగాడుట శివాగమ ప్రభావమే. అచ్చట మఱియొక చిత్రమున్నది. వృక్షములు కూడ చరించు చుండునట. వృక్షము లచలములను భావమున వేల్పుభామ లుయ్యాలలు గట్టి యూఁగు చుండగా నాచరవృక్షములు కదలిపోవుచుండెను. కొంతవడికి తెలిసికొని వారు తమ వచ్చిన మార్గమును మఱచి యాందోళనపడిరి. కాని యంతలోననె వారికొక యుపాయము తోచనది. వారుయ్యాల లూఁగుచుండఁగా తమ కొప్పులనుండి రాలిన పూలు పడిన చొప్పు నరసికొనుచు నిండ్లకేగిరఁట. ఈ యూహ మిక్కిలి సొగసుగా నుండి

---

1. శ్రీ కా. మా. 4ఆ 178
2. ,, ,, 193
3. ,, 1ఆ 1ప
4. ,, ,, 98 ప
5. శ్రీ కా. శతక—35 ప
6. శ్రీ కా. మా. 1ఆ 98, 104, 149
7. ,, 1ఆ 105 ప

కవీంద్రుని భావనాబలము, వస్తు సాక్షాత్కారములు చమత్కార జనకములై యలరు చున్నవి గదా !

సువర్ణముఖరీ జనపము : క్షేత్రస్వామి యావిర్భావమునకు వశిష్ఠుడు కారకుడు కాగా, తీర్థావిర్భావమునకు, కుంభసంభవుడు హేతుభూతుడయినాడు. అగస్త్యుడుత్తరమునుండి బయల్వెడలి దక్షిణమున వింధ్యాద్రి నధిగమించి, వాని గర్వము విఱుగద్రొక్కి, గౌతమీ కృష్ణవేణులను తీర్థమాడి శ్రీశైలనాథు నర్చించి, జ్యోతి సిద్ధవటనాథునిఁగొల్చి దక్షిణ శైలానమేఁగుదెంచెను. ఇది యొక ప్రదక్షిణము వలెఁ దోఁచుచున్నది. జ్యోతి, సిద్ధవటములనునవి కడప మండల మందున్నట్టివి. హిమవంతమొక ప్రక్కకు కడునొడ్డగెడనయినది. అందులకుఁ గల గారణము చక్కగా నిరూపింపఁబడినది. పార్వతీ పరమేశ్వరుల నివాహమున కేతెంచిన దక్షిణ దిక్కునందలి చరాచర భూతములు గదలివచ్చుటచే, దక్షిణ దిక్కు తేలి, యుత్తర దిక్కు క్రిందికి వంగినది. హిమవంతము భూమికి మానదండము గదా[1]. ఆ యొదు దుడుకులను సరిచేయ గల్గిన వారిరువురే. భూతేశ్వరుఁడు, అగస్త్యుఁడు. భూతేశ్వరు నాజ్ఞపై కుంభసంభవుఁడు లోపాముద్రాసహితుఁడై దక్షిణయాత్ర గావించెను. వింధ్య పర్వతపు నాటోపము నణఁచివైచుట కగస్త్యుఁడు దక్షిణమున కేఁగుదెంచుట గలదు, హిమవంతుని చూచి గర్వియై వింధ్యుఁ డెదుగుట, తన్మూలముగా సూర్యచంద్రాదుల గమనమున కవరోధము గల్గుటచే దేవప్రార్థితుడై యగస్త్యుఁడు వింధ్యా గర్వము నణఁచుటకై దక్షిణమున కేతెంచుటయన్నది యైతిహ్యము[2]! వింధ్యుఁడెదుగుటయే కాక, బరువులేక పైకి లేచుటకు కారణముగా బలుకుటయు, నందులకు సమర్థుఁ డయ్యు తామఁ గ్రొత్త పెండ్లికొడుకగుటచే, దీక్షాకంకణము పసుపుబట్టలు విడువ రాకుండుటచేతను, కుంభజుఁడు తక్క తక్కొరులందుల కలఁతులు గాకపోవుటచేతను పరమేశ్వరుఁడగస్త్యునే యందులకు నియోగించెను. 'ఇది మాన్ప నీవైన నేనైనగాని

---

1. కుమార సంభవమ్ – కాళిదాస – 1 సర్గ – 1శ్లో

2. కాశీ. ఖం 2అ—98 వచన

సపర్ణులము[1]'గామని యీశ్వరుఁడే పలికెను. ఆదర్శ దాంపత్యమునకు తార్కాణ మైన లోపాముద్రాగస్త్యులు దక్షిణమునకు బయల్వెడలిరి. ఈ సందర్భమున భారతీయ సంప్రదాయ మొకటి సూచింపఁబడుచున్నది. పెండ్లియైన క్రొత్తలలో నెచ్చటకుఁ గదలకూడదను విషయము పార్వతీరమణున కన్వయించుచుఁడగా, గృహస్థుఁగానున్న వాఁడు భార్యా ద్వితీయుడయి మాత్రమే పుణ్యతీర్థ యాత్రచేయునన్న భారతీయ సంప్రదాయ' మందు సూచించబడుచున్నది. ఆ యిరువురును లోపాముద్రాగస్త్యులు హిమవంతమునుండి బయల్వెడలి వింధ్యనుదాటి దక్షిణ దేశమునకు వచ్చి, గోదావరీ, కృష్ణవేణులయందు తీర్థమాడి దైవతముల నర్చించుచు, కదలి శ్రీశైలమేగి భ్రమరాంబికా మల్లికార్జునుల నర్చించి, జ్యోతి సిద్ధవటములను దర్శించి క్రమముగా దక్షిణ కైలాసమునకు చేరిరి. దక్షిణ కైలాస పర్వత మద్దాని మహిమను చాటునదిగా నున్నది. ఆ క్షేత్ర ప్రాశస్త్యములలో ముఖ్యమైనది, 'భవమహామాయా విపర్యాసము'గ వెలయుట. వశిష్ఠుని కోరిక యదియే. అందులకే పరమేశ్వరుఁడు పహాళాజన్మహాలింగముగా నచట నవతరించినాఁడు. ఆ యీశ్వరు దర్శనము, నర్చనములు వారికి 'కాశికానాథ విప్రయోగ వ్యథ'ను దూరము గావించెను. వశిష్ఠుఁడు కోరిన బ్రహ్మవిద్యోపదేశము గావించి వెలసిన దక్షిణామూర్తిఁ గొలుచుటచే వారి కానంద పారవశ్యము గలిగెను. ముదిత వదనుఁడు, స్వాత్మారాముఁడు, కరకలిత చిన్ముద్రుఁడగు దక్షిణామూర్తిని దర్శించి యానందముందని వాఁడెవ్వఁడుండును ?

జ్ఞానప్రసూనాంబ పంచాశద్వర్ణమూర్తి, పంచవిద్యాస్వరూపగా రూపింపఁబడుట యందు శ్రీ విద్యాదేవిగ భావింపఁబడినది. ధూర్జటి కవీంద్రుని శ్రీవిద్యోపాసన కిది మఱియొక బలమగు తార్కాణము. వశిష్ఠున కుపదేశించిన బ్రహ్మవిద్య, శ్రీవిద్యకు నామాంతరమే గదా! 'వైఖరీ రూపశక్తి అ'కారము మొదలు 'హ' కారము వఱకు గల పంచాశద్వర్ణ స్వరూప మాతృకాశక్తి'యే[2] యీ పద్యమున వర్ణితమైన జ్ఞాన ప్రసూనాంబ.[3] ఈ తావున కవి 'పంచ' శబ్దమయిదు మాఱులు ప్రయోగించుటయందు నాతని శివశక్త్యాత్మకములగు నిజపద్వైతతత్త్వములను బ్రతిపాదించుటయే.

---

1. దీనికి మూలమిట్లున్నది. భూతాని భూతనాథస్య కల్యాణమభినందితుమ్
తద్భూరి భార సంభిన్న భూరుత్తర సంశ్రయా
నిమ్నతామాయయౌ యావత్పతాళ మాస్థితా.

2. శ్రీ చ. వి — పుట 23

3. శ్రీ కా. మా — 1 — 115 ప

పృథివి జల తేజో వాయ్వాకాశములను పంచభూతములు, గంధ రూప రస స్పర్శ శబ్దము లైదును, తన్మాత్రలు, జ్ఞాన కర్మేంద్రియములు పది, సంకల్పాత్మకమైన మనస్సు, మాయ, శుద్ధ విద్య, మహేశ్వరుఁడు, సదాశివుఁడు—ఇవి యిఱువదైదు తత్త్వములు[1] ఇది కవీంద్రుని యోగము జ్ఞానమును, శ్రీవిద్యోపాసనము తెలియఁజేయును.

పర్వతారోహణ శ్రమము, భక్తి తాత్పర్యము, పారవశ్యాతిశయము, కైవల్య ప్రయోజనములు స్పష్ట స్ఫురణమునకుఁ గవీంద్రుఁడు "ఎక్కిన దుర్గాంబ కొండను, చెల్లించిన మ్రొక్కును, చొక్కిన తీరును, ముక్తితాటంక సతని దక్కించుకొన్న రీతియు ద్విత్వకకార ('క్క') ప్రాసముచే సాధించినాఁడు. గీతమునకు ప్రయోజకత్వము కల్పించినాఁడిచట. గీతములంపు ప్రాసయుపయోగము క్వాచిత్కము. ప్రత్యేక ప్రయోజనము, సార్థకతలు లేనియెడల నట్టి రచన సాగదు. ఉదాహరణము నకు శ్రీనాథుని భీమేశ్వర పురాణమున నిట్టి యెందు రెండు పద్యములనుఁగాంచఁ గలము.[2] ఛందస్స్వీకారమున[3] ధూర్జటి సందర్భౌచిత్యములను పాటించును. 'జ్ఞాన పుష్పంబను వర్ణించిన పద్యమిట్టి యౌచిత్యాపాదకమైనట్టిదే. శ్రీదేవిని భక్తిపూర్వకముగా 'స్రగ్ధర'చేఁ గొల్చినాఁడు. జ్ఞానపుష్పంబను పుష్పధరగా వర్ణించుట యెంతయు సముచితముగా నలరుచున్నది. ఆర్య జనములచే గొలువఁబడుచుఁ గాంచనోన్న తాసనమున మన్న దుర్యోధనుని వర్ణించుటఁడిక్కిన స్రగ్ధరలోఁ గావించెను.

లోపాముద్రాగస్త్యులు మహారాజన్మహాలింగము, దక్షిణామూర్తి స్వరూపము, జ్ఞాన పుష్పంబలమఁగొలిచి, దుర్గాంబ కొండనెక్కి, సిదప గణేశ్వర భైరవాదులను సేవించి యానంద పారవశ్యములఁబొందిరి. కాని యగస్త్యమునీంద్రున కేదియో లోపించి నట్లనిపించినది. లోకనాయికా నాయకులు నాదిను దంపతులునయిన పార్వతీ పరమేశ్వరులు పుత్ర మిత్రసపరివారముగా వేంచేసి దక్షిణ కైలాసముగా వెలుఁగొందు నా చోట నొక పుణ్యనది లేకుండుట కొఱఁతయే యగును గదా !

---

1. శ్రీ ద. వి.—28 పుట 2. భీ. పు—2ఆ 59 మరియు 5ఆ 135 ప.
3. 'ఛందస్సు : అలంకారములు' అను ప్రకరణమునఁ జూడనగును.

'చంద్రికాకందళితంబు గాని నిండు చందురుచందంబును మందాకినీ సుందరంబగు పుణ్యనదీ ప్రవాహంబులేని కతంబున నిమ్మహాస్థలంబు దుఃఖంబు నావహించుచున్న యది' యని 'పరమేశ్వరు నుద్దేశించి తపంబొనర్చి యిక్కడ నొక్క నదిం బ్రవహింపఁజేయ వలయు'ననియు భావించి యందులకై, యచటి నాలుగు యోజనముల దూరమున తూర్పు దెసను గల కొండకేగి, యట కొండలోఁగల సెలయేటి యందుఁ దానమాడి తన కర్మానుష్ఠానముఁదీర్చి తపమునకుఁ గూర్చుండగా నాకాశవాణి యాతని తపఃఫలముగా నీశ్వరానుగ్రహముచే విపులజనంబులెల్ల వేడుకఁ బొందగ నాకాశగంగ ప్రవహించునని పల్కెను. ఈ రెండు సందర్భములును ధూర్జటి మూలమునకు సన్నిహితముగా ననువదించియున్నాడు.

ఆకాశ వాణ్యువాచైనమ్ అగస్త్యం జనతాం వరమ్
నదీ హీనోహ్యయం దేశమ్ ప్రసిద్ధోఽపి న శోభతే 1

జ్ఞాన విజ్ఞానవిముఖః సాకార ఇవ భూసుర
దీక్షేవ దక్షిణాహీన జ్యోత్స్నా హీనేవ శర్వరీ 2

స విభాతి నదీహీనా పృథ్వీయం భూసురోత్తమ
ప్రవర్తయ నదీమ్ క్వాచిత్ లోకానాం హితకామ్యయా 3

తన తపము ఫలించునా ఫలింపదా యను ననుమాన మాతనికి కొంత కలదు, అశ్రీవాణి పలికిన యభీష్ట సూచన విధాయక వాక్యము'చే నాశంకయుఁ దొలఁగినది. 'నా సంకల్పంబు నిర్విఘ్నంబుగా ననుగ్రహింపుండ'ని యగస్త్యుఁడు మునీశ్వరుల సన్నిధినిఁబలికి వారలచే ననుమతుఁడై యందులకుఁబూనుకొనెను గదా ! ఇంతవరకు నచ్చట నట్టి ప్రవాహమేల లేదా, యీశ్వరుని సంకల్పమెట్టిదై యున్నదో ? తన సంకల్పము నెఱవేఱుటకు పెద్దల యాశీర్వచనము, తన పూనిక రెండు నవసరములే. మునీశ్వరుల యనుమతిగావి పూనిక వహించిన యగస్త్యునకు, నభోవాణి పలుకులు శంకరాహిత్యము కలిగించి, హర్ష స్వాంతుఁగావించినది. తపమాచరించుచున్నది చంద్రమోఽలంకారుని గురించి, ఈశ్వరునికి మొదట నుపయోగించిన విశేషణము చంద్రమోఽలంకారుఁడు.

---

1. స్కాం. వై. వేం.–32అ 3 శ్లో 2. స్కాం. వై. వేం.–32అ 4శ్లో
3. ,, ,, ,, 5 శ్లో

ఇందు విశేషమొకదానినిఁ గనవలెను. తపమున కనుగ్రహింపవలసినవాఁడు గనుక చల్లని చంద్రుని యలంకారముగాఁ గలవాఁడు తప్పక చల్లగాఁజూచునని యాశంశ. అగస్త్యుని తపోతీవ్రతకు సృష్టి తలక్రిందులయినది. బ్రహ్మాదులు పరమ శివుని శరణు వేడిరి. అతఁడనుగ్రహించి, యామాత్రపుఁ గోరికకు తాను పోనక్కర లేదని పలికి, బ్రహ్మనే అభ్రగంగానదిని భూతలమునఁ బ్రవహింపఁజేసి యగస్త్యుని కోరిక తీర్పుమని యానతిచ్చెను. అంత కఠోరము, తీవ్రమయిన తపమాచరించినమ నీశ్వరుఁడు స్వయముగా సాక్షాత్కరింప నిష్టపడలేదు. ఇది విచిత్రము. అగస్త్యుని మనోభీష్ట మింతమాత్రమున కే నరుగ'నని పలికినాఁడు పరమేశ్వరుఁడు. వశిష్ఠునివలె మోక్షార్థికాఁడు గదా యగస్త్యుఁడు. ఒరులీయఁజాలిన కోరికలకు, నెఱవేర్పఁగలిగిన పనులకుఁ, దానుగా కదలనక్కఱలేదు. తాను నచటనొక నదినిఁ బ్రవహింపఁజేయ వలెనని సంకల్పించియే యున్నాఁడఁట. పరమేశ్వరుఁడు బ్రహ్మ వెంబడినే చదలేఱును బంపెదననియు, దాని నగస్త్యునకొసఁగి తిరిగి వచ్చివేయుమని యీశ్వరుని వాక్యము. మొదటనే మనము భావించినట్లు, ప్రబంధమున మోక్షాపేక్షులయిన భక్తులకు మాత్రమే పరమేశ్వరుఁడు సాక్షాత్కరించి సాయుజ్యమిచ్చెను. ఇచ్చట నగస్త్యుఁడు తన కొఱకుఁగాక క్షేత్రలోపముఁ దీర్చుటకు తపమాచరించుట జరిగినది. కానఁ బరమేశ్వరుఁడు రాక, బ్రహ్మవలననే యాతని కోరిక నెఱవేరఁజేసెను. సువర్ణశోభావిభవముతో బహుళభంగ సుహాముఖరత్వ సంపదతో భువి కేతెంచినదగుటచే నా నదికి 'సువర్ణముఖరీ' ప్రథ కలిగినది. అగస్త్యుఁడు తపమాచరించుటచే నా పర్వతమున కగస్త్యాద్రియనియుఁ బ్రసిద్ధి కలిగినది.

సువర్ణముఖరీ నద్యావిర్భావమును, పూర్వకవి సంప్రదాయము ననుసరించి* రూపకోత్ప్రేక్షోపమశ్లేషాద్యర్థాలంకారసముపేతముగ, ననుప్రాసాది శబ్దాలంకారయుతముగ వర్ణించుట యందే కవి ధూర్జటి ప్రత్యేకతఁజూపినాడు. అందాతని యూహా, :రిశీలన, విషయసేకరణలు వానినందించు వచన రచనా చమత్కారములు వెల్లడి యగుచున్నవి. భూభాగముపైఁ బ్రవహించునవి, యాయారంగుల నేలలపై వ్యాపించు చుండుటచే నాయా వర్ణములు పొంది యాయా నదులుగా గమపట్టినదట. ఎఱ్ఱని నేలపై నుండి శోణభద్రగను. తెల్లని నేలపై నుండి పాలేరుగను, నల్లని నేలపై నుండి కృష్ణవేణిగను, భావించెనని వర్ణించుట మిక్కిలి సుందరముగ నొప్పుచున్నది. వాసుదేవలీలావిలాసముతో మహాదేవ విభ్రమ విహారముతో పోల్చుట యటుండగా

* భాగ—ష. స్కం—326 ప, అ. స్కం—108, ద. స్క. ఉ. భా—601 ప.

ధూర్జటి యూక్ష్మియత, యాధ్యాత్మికతల నందించునది. యానదిని 'యోగీశ్వర భావ స్వభావంబు' తోఁజెప్పిన పోలిక, అయ్యది శ్లేషాశ్లేషితమై సుందరమై, నాద బిందు కళాతీతుఁడగు శ్రీకాళహస్తీశ్వరుని ననసార స్మరించునదై యలరుచున్నది. 'అమంద బిందుసనసుదయంబును, నిరంతర నాదప్రసాద మేదుర హృదయంబును, సంసార వారాకరతరణకారణ కళాప్రకాశంబును'[1] ఆ నదీ పావిత్ర్యము నుగ్గడించునట్లు 'పరి తంబులపై పండువెడలు చందమును' చెప్పిన రీతియు, ధూర్జటి కవి యాధ్యాత్మికతను వెలార్చునది.[2] ఆతనికిఁ గల శృంగారాసక్తియు రెండు తావులఁ గనుపట్టుచున్నది. 'కుసుమశరపరితాప పరవశ పళావిమిత్త మత్తవేదండ ఖండన క్రీడాఖండిత దండ కాండంబు[3]లు' 'వెలుపుడుపు నేపంబున నుపనాథులెత్తుకొని గుత్తంపుంజనుగుబ్బల యొత్తునఁ జిత్తంబులు చిత్తజాయత్తంబులై' తత్తరపడిరట, భిల్లాంగనల నెత్తికొనిన యుపనాథులు[4]. ఈ వచన రచనయందుఁ గవంద్రుఁడు తన వస్తు సాక్షాత్కార పద్ధతిని, పదముల పోహళింపుచేత సమాస సంఘటనచేత, లఘ్వక్షరములయు, ద్విత్వాక్షరములయు మపయోగము చేత సార్థకపరచినాఁ డనిపించును.

'ఉప్పరంబెగయు జలపక్షి లపక్ష విశేషంబులం బరగు తుంపర పరంపరల' భయోత్పాతముచేఁ గలిగిన చలనవేగము, టపటప కొట్టుకొను నవస్థను పట్టియుఁ జాలిన వా 'క్ష' కారావృత్తి. 'తుంపరపరంపర' యందలి యనుప్రాసము నిజముగా యా చల్లని స్పర్శసౌఖ్యము పాఠకుని మనమున కిచ్చుచుండును గదా !

'వెడలువెడ నిబు పేద నడుములకు' నెడరు పొడమునను వడువున, బడమి నడుగిడనోడు పడంతులు' వెలుపు, దల్లడపాటు, లఘ్వక్షర సమీకరణముచేఁ గనులఁ గట్టినది. పదునాల్గు లఘువులకు నడుమనొక గురునిడుటచే వారి నడుముల లఘుత్వము, నొటపెఁ దనముల సహృదయుల నలరించు కవివాదమత్కారము, కవి ప్రతిభ, తల్లడపాటుఁ జెంది, వేగముగఁబోఁబోఁయి యడుగులు వేయలేని వారి యవస్థా చిత్రణము కూడ కడుంగడు రమణీయము. ఇది గజేంద్ర మోక్షకథలో లక్ష్మీదేవి 'విష్ణునడుగుదునా యుడుగుదునా ? యన్న సంశయాపన్నను స్ఫురణకుఁ దెచ్చును.[5]

1. శ్రీ కా. మా. 1ఆ 142 వచన 19, 20, 21 పంక్తులు 31 పుట
2. ,, ,, ,, 6, 7, 8 పంక్తులు 32 పుట
3, ,, ,, ,, 5, 6 పంక్తులు 31 పుట
4. ,, ,, ,, 3, 4—3 1పుట,
5. భాగ. స్కం. 103ప.

నలుబది నాలుగు పంక్తులు నడచిన యీ వచనము సుపర్ణముఖరీనదీ ప్రవాహ వేగము, జనించిన నాదము, సాగిన దూరములను సూచించుచుఁ గవి ప్రతిభా వ్యుత్పత్తుల ప్రదర్శన రంగమై, యాతని హృదయమునకు దర్పణమై యలరు చున్నది. ఈ వచనమున మరియు రానున్న కథా సూచనము చేయఁబడినది. 'నిరవశేషీకృతార్జున శరసమూహంబున'[1] న్నది తిన్నని పూర్వజన్మలో నర్జునుఁడుగా నుండి పాశుపతాస్త్ర సంపాదనకై యతఁడు పశుపతిని గూర్చి తపమాచరించు సందర్భమున శాంబరీ భిల్లుఁడుగా నేఁగి పరమేశ్వరుఁ డాతనితో పోరు కల్పించుకొని మాయా విశేషముచేఁ గిరీటి యక్షయతూణముల నదృశ్య మొనర్చిన గాథను తెలుపుచున్నది.

అట్టి నదీతీరమున ప్రతిష్ఠించిన శివలింగోపాంతమున లోపాముద్రాగస్త్యులు తమ మనములను పంచేంద్రియ పథమునుండి మరలించి, పంచముఖుని మార్గమునకుఁ ద్రిప్పి పరమ పరవశత్వము నొంది ధన్యులయిరి.[2] అట్లు చేయుట నారికి లోచూపు వలన సాధ్యమైనది. కానకే 'చూపు బహిర్గతంబుగాగ' నగస్త్యుఁడు మునులెల్లర కయ్యది యుపదేశమగునట్లు పరమేశ్వరుని స్తుతించెను.[3] ఈ రెండు పద్యములును ధూర్జటి యాత్మీయతను వ్యక్తపఱుచు నాతని రచన కౌపదేశిక ప్రతిపత్తి గలదను సూచనము నందించుచున్నవి.

అగస్త్యుని ముఖమునఁ గవీంద్రుఁడు పరమేశ్వరుని పరమభక్తి పార వశ్యమునఁ బాడుకొనునట్టి గీ దండకము[4] అ దండకము ధూర్జటి కవీంద్రుడు తన శతకమున 'పరిశీలించితి మంత్ర తంత్రములు, చెప్పన్విింటి సాంఖ్యాది యోగ రహస్యంబులు, వేద శాస్త్రములు వక్కాణించితిన్', అని పలికినట్లు, కవీశునకుఁ గల మంత్ర తంత్ర శాస్త్ర పరిజ్ఞానము, యోగ రహస్య పరిచయము, వేద శాస్త్ర జ్ఞానము లకు నిలయమై విరాజిల్లుచున్నది. 'సత్యమై, నిత్యమై, జ్ఞానమై, జ్ఞేయమై, జ్ఞాతమైన పరమేశ్వరుని, బ్రశంసింపఁ బూనుట తన యపరాధముగా నివేదించుకొని తనను బూర్ణకారుణ్య దృష్టితోఁ జూడుమని వేడుకొనినాఁడు. భగవంతుని భక్తులపాలిటి కామధేనువు, కల్పకము, చింతామణి, చంద్రోదయము, వారి యాపదలకు వజ్రాయు ధము, సంతాపముల బోగొట్టువానిగా, సంకల్పము సిద్ధింపఁ జేయువానిగా నాలు

1. శ్రీ కా. మా. 1అ–142వ–పుట 27  2. శ్రీ కా. మా. 1అ 144 ప.
3. ,, ,, 145 ప.  4. ,, ,, 146 దం.
5. శ్రీ కా. హ. శ. 77 ప.

విశేషణములచే గొనియాడుటయందును ధూర్జటి కవీంద్రుఁడు తనకుఁగల 'షట్చక్రికా పీఠిఁజేతస్సమేతంబుగా వాయుపున్ గ్రోలుచున్' అన్నట్టి యోగ విద్యాభ్యాసమును వ్యక్తపఱచియున్నాఁడనిపించును. ఈ దండకమునఁ బ్రతిపాదించినది శివాద్వైతము.

పరమేశ్వరునిఁ గీర్తించి యగస్త్యుఁ డానంద దుగ్ధార్ణవమునఁగ్రీడించుచు జ్ఞాన ప్రసూన కలికను బాష్పోదకములు సోనలు గురియఁగాంచెను. మనస్సు భక్తిరసమున మునిఁగి పోయినట్లు గుర్తు కంటికొలఁకులనుండి బాష్పోదకములు కురియుట. ఇట్లు వర్ణించుట కాదు పలుకుట, స్వానుభవఫలమే కాని యన్యముకాఁజాలదు. భక్తి మగ్నత, దర్శనానందముల వర్ణన వచ్చినచోట ధూర్జటి మనకు కనుపించును. ప్రహ్లాదుని మాటున, గజేంద్రుని చాటున పోతన ప్రత్యక్షమైనట్లు, భగవల్లీలావర్ణన మున, భగవద్దర్శనానందము, భక్తి పారవశ్యము, పరమేశ్వర సాక్షాత్కారమున. బొందు సాత్త్వికోదయాది యనుభూతులు కేవలము ధూర్జటివే యనిపింపకమానదు.

లోపాముద్రాగస్త్యుల దాంపత్య మతి విచిత్రమైనదియు, యాదిమ దంపతుల దాంపత్యమునకు పోలినదని మునీశ్వరులు కొనియాడిరి. అగస్త్యుఁడు శైవచూడామణి యయిన, నామె పతివ్రతలలోఁ బ్రథమగణ్య. లోకమునకు నతని తపము కల్ప వృక్షము కాగా, నామె సాన్నిధ్యమే దాని ఫలము. వారిరువురు కూర్చుండిన ఆశైలోపాంత హేమముఖరీ ద్వీపవతీతటశిలా ప్రదేశము, ధూర్జటి ప్రతిదినము పంకజాసన నిష్ఠతోఁ గూర్చుండిన 'సువర్ణముఖరీ తీర ప్రదేశాశ్రమకానన మధ్యోపల వేదికయే.*

సకలమునులచేఁ గొనియాడఁబడిన యీ పుణ్య దంపతులు లోపాముద్రా గస్త్యుల పవిత్ర దాంపత్యమును గవీంద్రుఁడు కథారంభముమండియు చక్కఁగా పోషించెను.

భూతేశ్వరునాజ్ఞపై నిల్లాలుఁదాను కదలి దక్షిణమునకు బయల్దేరి కలశభవుఁడు వింధ్యనధిగమించి, గౌతమీ కృష్ణవేణుల నవగాహనమొనర్చి, శ్రీశైలనాథు నర్చించి, జ్యోతిసిద్ధవటముల దర్శించి, దక్షిణ కైలాసమరుదెంచెను. కుంభజుఁడు లోపా

* శ్రీ కా. మా. శ. 35 వ.

ముద్రతో గూడి దక్షిణ కైలాసము జేరెను. వసంతియుఁదాను ఫణారాజన్మహాలింగ మును గాంచెను. వధూయుతుఁడై ప్రణతుఁడై ధ్యానించెను.

ఆత్మవధూటితో గూడ దక్షిణామూర్తినిఁగొలిచినాఁడగస్త్యుఁడు. ఆత్మ సరసీ రుహలోచన కేలుపట్టియే కుంభజుండు తపముఁజేయఁదలచిన కొండమెక్కెను. సువర్ణముఖరి జనించిన తరువాత తత్తటినీ తటమందు శివలింగ ప్రతిష్ఠలు సల్పి, యగస్త్యుఁడు, లోపాముద్రయుఁదాను నదియందు స్నానము లాచరించి భూతియు రుద్రాక్షలు ధరించిరి. వారిరువురు 'విద్యావృంరూపములో' యనున ట్లతిశాంతాకారులై వెలుఁగొందిరి. ఆ దంపతులు ప్రాపంచిక సౌఖ్యములను వంచించి, పరమ పరవశులైరి.

విశ్వనాథున సేవించి కోరిన యర్థంబులుగాంచిన జంతుశ్రేణిఁ దెల్పుఁడని యాదవపతి మాయాజంగమాకారధరుని ప్రశ్నించినాఁడు. అటనుండి భగవన్మాహాత్మ్య నిరూపక సందర్భములు కథితము కానున్నవికాన, తరువాత రెండవ యాశ్వాసము మొదలగును. శైవమున, నందు శివాద్వైత భావమున పరమేశ్వరునకుఁ బ్రపంచ మున కభిన్నత్వము ప్రతిపాదింపబడును. 'బ్రహ్మాండ పిండాండబాహ్యాంతరాళంబులం బూర్ణమై....హరిబ్రహ్మకీటాంత జంతు ప్రజంబుల్ వినోదంబుగా ... దర్శింపనిసన్ ముక్తులన్ జేయుచున్ సత్యమై, నిత్యమై* .... వెలుఁగొందువాఁడు, పరమశివుఁడు. శివుఁడు తక్కతక్కిన దంతయు జంతుప్రజమే. అందువలననే 'హరిబ్రహ్మకీటాంత జంతుప్రజ, మని పలుకుట. ఈ క్షేత్రమున హరి, హరుని సేవించుట జరుగలేదు. హరి, పరమేశ్వరుని వేయిపూలతో నర్చించుచు నొక్క పుష్పము హరుని మాయచేఁ దఱుఁగగా, తన నేత్రాబ్జమునర్పించి యర్చించుట పురాణ ప్రసిద్ధము. ఆ విషయము ప్రబంధమున మూఁడవ యాశ్వాసాదిని 'శ్రీధరనయనాబ్జ సమారాధిత దివ్యాంఘ్రి శోణరాజీవ' (3ఆ 1ప) యను సంబోధనచే సూచింపఁబడినది. అదియుఁగాక యీ క్షేత్రస్వామిని హరి యర్చించుట యెచ్చటను లేదు. కాన బ్రహ్మకీటాంత జంతు ప్రజము నుద్ధరించిన తీరేయిందుఁ గథితము కానున్నది.

దక్షిణ కైలాసమున నదిలేని కొఱఁత తీర్చుటలోఁ బరమేశ్వరుని సంకల్పము ప్రధానము కాఁగా నగస్త్యుని తపము కారణమయినది. ఆ నద్యావిర్భావము బ్రహ్మ

---

* శ్రీ కా. మా. 1ఆ—146 దండకము

వలనఁ గలిగినది. ఈశ్వరునాజ్ఞచే బ్రహ్మ తనవెంటఁ బరమేశ్వరుఁడంపిన యాకాశ గంగానదిని తోడుకొనిపోయి, యగస్త్యున కనుగ్రహించినాఁడు. తాను నిమిత్త మాత్రుఁడుగా నది యావిర్భవించి యప్పటికాక్షేత్ర స్వరూపము ననుగ్రహముకాఁగా నాక్షేత్ర మహత్త్వ ప్రకటనకు బ్రహ్మయే యాది యగుట యెంతయు సముచితముగా నుండును.

ప్రబంధమునఁ బోషింపఁబడనున్న సర్వ విషయములు, శివాద్వైతభావనము, భక్తజనుల యందు పరమశివుని యనుగ్రహము, రసపోషణము, అలంకార విరచనము, వర్ణనము, పాత్ర చిత్రణము లిత్యాదిగాఁ విషయములన్నియు ప్రథమాశ్వాసమునఁ బ్రోది చేసికొని వికసించినవి. శృంగార కరుణాద్భుత శాంతరసము లిందుఁ బోషింపఁబడినవి. కవి ప్రతిభను వెలార్చు మూర్తి చిత్రణము, అవస్థాచిత్రణము, ఋతువర్ణనము, వచన రచనము, దండక రచనము, భాషా సౌభాగ్యము, శైలీ విన్యాసము లిందావిష్కరింపఁ బడినవి. కవీంద్రుని శ్రీవిద్యోపాసనము, యోగాది శాస్త్ర పరిచయము, ఆధ్యాత్మికౌన్నత్యములింద స్పష్టములయి చూపట్టుచున్నవి.

ఆశ్వాసాంతము :

ఆశ్వాసాదియందు వలె నాశ్వాసాంతమునను భవపరాఙ్ముఖుఁడైన కవి ధూర్జటి యాధ్యాత్మిక భావసంపత్తి వ్యక్తమగుచున్నది. ఆశ్వాసాంత పద్యములు పూర్వకవులమంతయు మూఁడు పద్యములలో జరుగుచుండుట, అందును మొదట నొకవృత్తము, తరువాత కందపద్యము, తుదను వేఱొక వృత్తముండుట పరిపాటి. మొదట శార్దూల మత్తేభములలో నొకటి, తరువాత కందము, స్రగ్ధర మాలిని యను వాని నుపయోగించుట పెక్కురు కవులు చేసిరి. అన్ని ఆశ్వాసాంతములందును శార్దూలము, కందము నుంచి తుదిపద్యము ఆశ్వాసమున కొకరీతిని తోటకము, పృథ్వీ, వనమయూరము, ఉత్సాహము, ఉపేంద్రవజ్ర, ఇంద్రవజ్ర, భుజంగప్రయాత, స్రగ్విణి, నర్కుటము, మంగళమహాశ్రీ, తరలము, మణిగణనికరము, కవిరాజ విరాజితము, స్వాగతము, మత్తకోకిల, ధృతి, మందారదామ, కాంతా, బంధుర, మందాక్రాంత, పంచచామరము – ఇత్యాదులయిన వాని నుపయోగించెడివారు. కొన్ని కావ్యములలో అన్ని అశ్వాసాంతములను మొదటి యాశ్వాసాంతమువలెనె యుంచిరి. శార్దూలము, కందము, పంచచామరము, అను వరుసలోఁ బూర్వపుతప్ప

లొందు రెండాశ్వాసాంతములు గావించియున్నారు.[1] అన్ని యాశ్వాసాంతములందు శార్దూలము, కందము, పంచచామరములచే వాడుట యందు ధూర్జటి విశిష్టత గోచరించుచున్నది. శార్దూలాంబరధారి, గజచర్మధారి యగు శివుని నుతించుటకు ధూర్జటి శార్దూల, మత్తేభముల నుపయోగించుట ప్రబంధమునందును, శతకమునందును గానగును. స్వామి యుపచార విధానమున వస్త్రము, సుగంధము, వింజామరలను నుపచారిత్రయముచే నర్చించుటవలె ధూర్జటి తన ప్రబంధాశ్వాసాంతములందు మూడు పద్యములను రచించినాఁ డనిపించుచున్నది.

కందరచనమునను ధూర్జటి యొక విశిష్టమైన పద్ధతి ననుసరించినాఁడువలెఁ దోఁచును. నాలుగాశ్వాసాంతము లందున్న కందములందు, మొదటి, మూఁడవ యాశ్వాసాంత పద్యములందలి రెండవ నాలుగవ పాదములు నగణాంతములుగా నుండఁగా, రెండవ నాలుగాశ్వాసాంత పద్యములందలి రెండవ నాలుగవ పాదము లందలి మొదటి గణము 'గగ' మగుటయుఁగాంచనగును.

గద్య :- ప్రబంధమందలి యీ యాశ్వాసాంత గద్యములననే యీ కృతికిఁ గర్త ధూర్జటి యనియు, నతని తలిదండ్రులు సింగము, నారాయణులనియుఁ దాత జక్కయ యనియు, గవీంద్రుఁడు భవపరాఙ్ముఖుఁడనియుఁ దెలియఁగలుగుచున్నాము. సామాన్యముగా ప్రబంధాశ్వాసాంత గద్యలందుఁ గవీంద్రులు తమ కుల గోత్ర సూత్రములను, మాతాపితలను, నామములుఁదెలుపుచు, గు • స్మరణము, భగవన్నామ స్మరణములు గావించుచు, తమ తమ కవితారీతుల నుగ్గడించుట సంప్రదాయము. ధూర్జటికిఁ బూర్వకవులును, తరువాత తన వంశీయులయిన వారును గద్యలట్లే రచించుకొనిరి. ఆ ధూర్జటి వంశీయులయిన వెంకటార్య, లింగరాజు, వేంకటరాయ కవుల గద్యలందు పై లక్షణములన్నియున్నవి కాని, విచిత్రముగా నందఱకును గురుఁడు శ్రీకాళహస్తీశ్వరుఁడే. ధూర్జటి కవీంద్రుఁడు భవపరాఙ్ముఖుఁడగుటచేతను, శివభక్తుఁడగుటచేతను, కుల గోత్ర సూత్రములను తడవక. కృతజ్ఞతాపూర్వకముగ పితరులను స్మరియించినాడు. పరమేశ్వరుని బ్రశంసించినాఁడు. కథా సందర్భము లందు హరికంటె హరుఁడతిశయముగాఁబల్కఁబడినను, గద్యయందు ధూర్జటి కవిగఁ గల హరిహరాభేద దృష్టి, హరియందు ద్వేషము లేకుండుటను చాటుటకొఱకే

---

* 1. పారిజాత 3ఆ—తిమ్మన

2. వసు 2ఆ—భట్టు మూర్తి

తలిదండ్రులకు విశేషములుగా లక్ష్మీనారాయణ శబ్దములనుపయోగించి, పురాణదంప తుల సాదృశ్యముచేఁ దన పితరుల యందలి భక్త్యతిశయమును వెలార్చినాడు.

"సింగమ రమానారాయణ 'జక్కయ్య నారాయణ' తనూభవ"

## ద్వితీయాశ్వాసము

శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రబంధమున నీయాశ్వాస మత్యంత ప్రధానమైనది. జగన్నాయకుఁడైన పరమేశ్వరునకు "శ్రీకాళహస్తి" యను నామము కలుగుటకు దోహదము చేసిన శ్రీ కాళహస్తుల కథలిందుఁ గథితములయినది. శ్రీ కాళహస్తులు శివునర్చించి సాయుజ్యమందుటకు మున్ను బ్రహ్మదేవుఁడభవునిఁ గూర్చి తపమాచ రించి, క్షేత్రమహిమను ప్రపంచమునకుఁ జాటుటయైనది.

"శ్రీ కాళహస్తి పతి వంటి దేవుండు, దివ్యతీర్థరాజములలోన దక్షిణ రజత శిఖరివంటి క్షేత్రంబు" (శ్రీ. కా. మా. 1ఆ-76 ప) లేదని తన వంటి వాంఛితార్థ సిద్ధుఁడు లేఁడని బ్రహ్మదేవుఁడు పలికిన వాక్యము, ద్వితీయాశ్వాసమందలి మొదటి భాగ కథయైనది. "శ్రీకాళహస్తీశతాప్రాచుర్యంబు పురాణ ప్రసిద్ధమ"గుట రెండవ భాగము.

బ్రహ్మతపము : ఈ కథను స్వీకరించుటయందుఁ గవి రెండు ప్రయోజన ములను సాధించినాఁడనఁదగియున్నది. సువర్ణముఖరీ తీరమున దక్షిణ కైలాసమున వెలసియున్న పరమేశ్వరునియు, క్షేత్రములదైన మహామహత్వ ప్రకటనము వాణీ నాథుని మూలమున ప్రకాశింపఁజేయుట మొదటి ప్రయోజనము.

పూర్వాశ్వాసమున వశిష్ఠుఁడు తపమొనర్చి యీశ్వరునిచే "బ్రహ్మవిద్యాదన భిక్ష"ఁబడసినాఁడు. అద్దాని నాతఁడు లోకమున కందింపలేదు. ఈ కథయందు బ్రహ్మపుత్రుఁడైన ఋభుసనునాతఁడు పరమేశ్వరునివలన నుపదేశమందిన యా పరావిద్యచే నాత్మారామత్వ మంది, బ్రహ్మజ్ఞానియై త్రిమ్మరుచు నిదాఘుఁడను ఋషీశ్వరుని మూలమున సనకాది మునుల కచ్చుపడఁగఁజేయగా, వారు సమస్త ముని చంద్రులకు నా బ్రహ్మవిద్యను వెలయించిరి.* ఇది రెండవ ప్రయోజనము.

---

*1. శ్రీ కా. మా. 2ఆ-88వ, 89, 90 ప.

అశ్వాసాదిపద్యముననే కవి తాను పలుకనున్న రెండు భాగముల కథను సూచించియున్నాఁడు.

'శ్రీ ఖండాచల మారుత
లేఖాస్పర్శాది విషయలీలాకృద్వి
ద్యాఖని మునిజనకల్పక
శాఖీ ! శ్రీ కాళహస్తి సదన ! మహేశా ! *

అను పద్యమునందలి 'విద్యాఖని', 'శ్రీకాళహస్తి' అను - సమాసములయందు బ్రహ్మ చెలఁదిపురుఁగు, పాము, ఏనుఁగులు, శ్లేషచే వ్యంజింపఁబడినవి. మొదటి ఆశ్వాసమున శ్రీకాళహస్తిశమహిమ కథను జంగమ లింగమూర్తి యాదవ భూకాంతునకుఁ బలుకుట మొదలిడినప్పటినుండి తుదివఱకెచ్చటను "శ్రీకాళహస్తి" పదమును ఈశ్వరునకు గాని, క్షేత్రమునకు గాని యుపయోగించియుండలేదు. అనఁగా గవీంద్రుఁడెంతటి మెళకువతో, శ్రద్ధతో కథానిర్వహణమొనర్చెనో యీ యంశము తెలుపుచున్నది.

మొదటి భాగమునఁ గథితమైన బ్రహ్మ తపమునందలి సంఘటనలన్నియు నుత్తరోత్తరములకుఁ బూర్వ పూర్వములు దోహదకరములుగా నిర్మింపఁబడినవి.

ఋభువు జననమునకు బ్రహ్మ తపము హేతువు. ఆ తపమున కా బ్రహ్మ చెందిన పశ్చాత్తాపము, పరితాపములు కారణములు. పుత్రహత్యా, పుత్ర హీనత లంశములకు మూలములు. దుర్మార్గులయిన ముప్పదివేల కుమారుల నుగ్రునిచే నముయింపజేసి, యా యుగ్రుని భస్మమొనరించినాఁడు, పరమేష్ఠి. బ్రహ్మకుమారులు దుర్మార్గులగుటయేమి ? ఋతుధర్మము, రేయింబవళ్లు తెలియక కాను మోహితుఁడయిన బ్రహ్మప్రేరేపణ వలన నీ కుమారులుదయించినారు.. ఇది కార్యకారణ సముదాయము. కథా సౌధ సోపాన పంక్తి.

సరస్వతీ బ్రహ్మ ప్రణయమును, దరువాతి పింగళసూరనయు, దన కళా పూర్ణోదయమున వర్ణించి, దానినే బీజముగా గొని గొప్ప ప్రబంధమునే యల్లినాఁడు. ఎవరు చేసిన తొందరపాటు చర్యకు వారే పశ్చాత్తప్తులు కావలెను, తత్పరిహార్థ

---

* శ్రీ కా. మా. 2ఆ – 1ప.

కార్యక్రమమునుఁ జేపట్టవలయును. అయినను బ్రహ్మ కొంచెరపాటున కాటంకము తెలుపక, పశ్చాత్తాపము ఫలము ఎ తపశ్చర్యకుఁ బరిచర్యకొనర్చి సరస్వతి, తన పాతివ్రత్యమునకు ననుకూలముగాఁగా నుగనిమాజ్ఞకు లోనైనది.[1]

బ్రహ్మనంతఁగా మరలు గొనుసన్నే సరస్వతీ రూపమింపుఁ జిత్రితమైనది.

'నవలావణ్య రసాలయంబు, గుణరత్నస్థాన మాస్యశ్రీపో
భవ బింబోదయ, మున్నత స్తనగిరీంద్ర వ్యక్తి, వాచా సుధా
భవదేశంబు, వళీతరంగము, తనూభద్ర ప్రభాశైవ దీ
ప్తి విలాసంబగు తత్కళత్రము సుధాబ్ధింబోలి సద్భక్తితో'[2]

తనకెన్ని మహిమలున్నను మగని ముందఱఁగాన బడకుండ భారతీదేవి, వినయ ధురంధర కాన 'వెంటనాయ బ్దునాలించు పాప' లాతని కక్ష్యాంతరమున నటు విడిచి భర్తను సమీపించినది. 'తమఁగొల్వ వచ్చిన పలుకుఁజెలువ చెలువ మరసి, యా 'పలరాజు చిలుక పలికిఁపలఁకి'యు, 'గొంతతడప్పు తగవుఁదలబోసి చిత్తంబు బిగియబట్టి' 'స్వస్వరూప వికారమును నుబుఁగు పెట్టి నాఁడటాఁడు'. కొలువు చాలించి లోని సౌధమున కేగి బ్రహ్మ, వాణి చెలువము 'వాగాగోచర మప్రతర్క్యంబు వినిర్వంద్వం బసాధారణంబ'యి, 'చోద్యంబతిలోక సుప్రతి మపర్యాయము'యుత్తి తనకు 'వాంఛాసాఫల్యము దీఱనేటదని పలికినాఁడు. ఇవియే కాఁబోలు 'వెన్నుకైన కలుగు చిమ్మ తెగుల'నుట. పతియాజ్ఞ యగుటయేమి, వాణి శతవాణి కాకుండుటేమి? ఆ శతవాణీ భోగ నిర్మగ్నతచే నలువ 'శతానందుఁడ'యినాఁడట. బ్రహ్మ యీ విధముగా శతానందుఁడగుట ధూర్జటి యుపజ్ఞ. ధూర్జటి లింగరాజుకూడ బ్రహ్మ నిట్లే శతానందునొనర్చినాఁడు. తరుణీ శతకము బింబాధరమాధుర్యము లానుట కతఁడు నాలుగు మోములు గలవాఁడగుట, కొంచ మిబ్బందియే యైనది. కాన నా నలువ కూరట లేదు. 'పుణ్యపాపములు లేవు'. కాల, ధర్మములు లేక, కార్యములు విడిచిన కామాంధునకుఁ బుణ్యపాపము లెట్లుండును ? "కామాతురాణాం న భయం న లజ్జా". ఇచ్చటఁగామాంధునకు లజ్జాభయముల ప్రసక్తిలేదు. వానివలననే కొలువు వీడి లోని భవనముకేగుట జరిగినది. ఇఁక మిగిలినది పుణ్యపాపముల దృష్టియే.

1. శ్రీ కా. మా. 2ఆ—15 ప.
2. ,, ,, —5 ప.

దిరి కోరికపైఁ గశ్యపుఁడు సంధ్యాసంగమ మిచ్చగించుటచేతనేగదా దైత్యులుద్భ వించినది. ఇచ్చట బ్రహ్మ కోరికను సరస్వతి యంగీకరింపక తప్పలేదు. సుఖించు నెడ వారలకుఁ బుణ్యపాపములు లేకపోయినవి. ఫలితము

'క్రూరు ల్ధూర్తులు, దోషకారులు, జగద్ద్రోహు ల్మహా భీషణా
కారు ల్ధర్మ విరోధు లన్యరమణీ కామాంధకారాంధు లా
చారభ్రష్టులు, లోక కంటకులు, శస్త్రవ్యగ్ర బాహు ల్కృపా
దూరు ల్మప్పదివేల రక్కసులు దోడ్తో'...పుట్టినారు. *

ఆ ధూర్తులు శివకేశవభేదములేక సర్వుల నొక గాటఁగట్టి కూలఁదోయుదుమా? నేలఁగలుపుదుమా, కొల్లగొట్టుదుమా? యని బయల్దేరిరి. అంతటి ధూర్తులకును తండ్రి యాజ్ఞ కోరవలయునని యుండుట విచిత్రమే. ఇది సృష్టి కర్తకొక పరీక్ష యైనది. వీరిని తన చేతులతో సృజించిన లోకముల మీఁదకు వదలుటయా, లేక యేమి చేయవలయు నన్నది ప్రశ్నమైనది. తన కామాంధ్యము వలన గదా యీ క్రూరకర్ముల జననము! తత్కాలికముగా వింధ్యకుఁ బొండని నియమించినాఁడు. వారి దుశ్చేష్టలకు జగంబెల్లఁ గాలిపోయినది. భూదేవి వచ్చి సృష్టికర్తకు మొఱపెట్టినది. ఇది యత్యంత సహజము, సుందరముగా నున్నది. బిడ్డల యాగడము పడలేక యిరుగుపొరుగువారు, తలిదండ్రులకు చెప్పినట్లున్నది. చిన్ని కృష్ణుని చిలిపి చేష్టలను తాళజాలక గోపికలు యశోదమ్మకు చెప్పుకొన్నదింతియే. కొడుకుల వలన గలిగిన సంక్షోభమును తొలగించుట తండ్రి బాధ్యతగా బ్రహ్మ స్వీకరించినాఁడు. తలిదండ్రుల యినవారు కొడుకులని, పెద్దవారు అన్నదమ్ములని చూడరాదు. కనుక తన కినుకయే రూపమెత్తినవాఁ డుగ్రుండయినాఁడు. అతనికి తండ్రి నియమించినది సహోదరుల వధావిధానము. చుట్టఱికము చూడరాదని శాసించినాఁడు. తొలుత నా రక్కసు లుద్భ వించినంతనే చుఱుకుఁ జూపులఁజూచిన, వారు భస్మమై యుండెడివారె. ఎంతయినను కొడుకులు గదా ! అప్పటికి వారి యాలోచనలే తెలిసినవి కాని చేష్టలు వెలినిఁబడలేదు. చేయి దాటిన వెనుక, చేయంగల కార్యము మిగిలిపోయినది. గోటితోఁబోవలసినది గొడ్డలివఱకు వచ్చినది. మందలించుట వలన జరుగునది కాదు. 'ఉగ్రసింహరథ మస్త్రిచయంబును వజ్ర కంచుకాన్వితమునిచ్చి' ఉగ్రుని సహజన్ముల దునిమి రమ్మని నియమించినాఁడు.

---

2. శ్రీ కా. మా. 2ఆ—23 ప.

రాక్షసులు రఘురామునిపై నడచిన రీతి, నా రక్కసు లుగ్రునిపై కవిసిరనుట యందు ఫలితాంశము సూచ్యమైనది. బలాబలములచింత లేకుండుటయు రాక్షసుల తత్వము, రాక్షసుల సైన్యములు విచ్చి పఱవగా, కోణపవీరులు "సాయంసమయ సూర్య సమానవక్త్రములతో" సక్రోధులై తలపడిరి. "సాయంసమయ" శబ్దము - రాక్షసులు విజృంభించు సమయమును సూచించునదియై[1] సాభిప్రాయమై యొప్పుచున్నది. వారాతనిపై 'గుప్వలేగ నెదిర్చిన రీతి' గలియఁబడుటయు వారాతనిచేత గ్రుంగు వారనియు సూచించుచున్నది. ప్రబంధ కథా నిర్వహణమున శాంతము నంగి రసముగాఁబోషించుచు, శృంగారమును తరువాతఁ బ్రధానముగా బోషించిన కవి ధూర్జటి కీ ఘట్టము, వీర, రౌద్ర, భయానక. బీభత్సరసము లంగరసములుగా నిర్వహించుట కుపయుక్తమైనది. ఉగ్రుఁడు బయల్వెడలుట, యుద్ధము లాచరించుటలందు వీర, రౌద్రములు, అతని స్వరూపము, యుద్ధక్రమములందు భయానక, బీభత్సరసములు పోషింపఁబడినవి.[2]

సహజమ్ములను చంపి వచ్చిన యుగ్రుని బ్రహ్మ నుండిపడి చూచుటతో నాతఁడు భస్మమయ్యెను. పుత్రహత్యాదోషము, పుత్రవిహీనత్వ దోషములు రెండును బ్రహ్మకుఁబరితాపముఁ గూర్చెను. కరుణము, రౌద్రములు రెండును కలిసినవి. రౌద్రమునకుఁకరుణము కారణమైనది. పుత్ర వధావిధానాకర్ణన గ్రథిత శోకానల దంచహ్యమాన మానసుఁడై మండిపడుచుం జూచినాఁడు బ్రహ్మ. దుర్మార్గులైన కొడుకులను, ఉగ్రునిఁబంపి చంపించినాఁడు. ఆ యుగ్రుని తానే చంపినాఁడు. సంతతి నిలువలేదు. అది యటులుండ, దోషములు రెండు చుట్టుకొన్నవి. వానికి తానే కారకుఁడు. ఇంక ముందెట్టి సంకల్పము గలిగిన నేమి వచ్చునో యన్నది యూతని భీతి. రక్కసులైన కొడుకుల జననమునకుఁదన కామాంధ్యము కారణము కాగా, ఉగ్రునియావిర్భావమునకు క్రోధము కారణమైనది. కామ, క్రోధములచే కలుషితమైన తన మనమున కూరట యెట్లు లభించునని యోచించినాఁడు బ్రహ్మ.

---

1. భా. రా. బాల కాం. 201 వ. (సంక్షిప్తము. సా. అ. వ.)
2. 'రసపోషణము'న విపులముగఁ జర్చింపబడనున్నవి.

తన నీ కాలుష్యమునుండి యీ పంచముఖుఁడు తక్క నెవరు నుద్ధరింపలేరు. దక్షిణకైలాస మాహాత్మ్యము తాను కన్నదియు, విన్నదియును. ఈశ్వరునాజ్ఞపై తానే గద యగస్త్యుని కోరికఁదీర్చుటకై యభ్రగంగానదిని భువికిఁదెచ్చి దక్షిణ. రౌప్యధరాధరంబు దాపున బ్రవహింపఁజేసినది! కరుణేక్షణుఁడైన యీ దేవదేవునిఁ బ్రార్థించి, 'సుతఘస్మరతా సుత హీనతా దుర్దాంతపయోధిపాతమున'దప్పి మనంబు సుఖంబు నొందఁ దలంచి, చతుర్ముఖుఁడు, సరస్వతితోఁగూడి దక్షిణ కైలాసమున కంచలతేరుపై నేఁగెను.

మొగలేటఁ దీర్థమాడి, యభవు దర్శించి, జ్ఞాన పుష్పంబుఁగొలిచి, పంచేంద్రియ సౌఖ్యంబుల పంవించి, పద్మాసనమునఁ గూర్చుండి పరమేష్ఠి పరమేశ్వరుని గూర్చి పెక్కేండ్లు తీవ్రముగ తపమాచరించెను. భగవానుఁడు సాక్షాత్కరించుటతోడనే తాను వాంఛితార్థ సిద్ధుఁడనని వలికినాడు బ్రహ్మ. అఖిల భూతాత్మమూర్తియు, నాత్మ విద్యా ధురంధరుండునగు కొమరుని కోరి యజుఁడా తపమాచరించుటచేఁ బరమేశ్వరుఁడు ప్రత్యక్షమగుట తోడనే తన కోరిక నెఱవేరినదని నాఁడతఁడు. కాని యీశ్వరుఁడింకను తన కొక నియమము పెట్టినాఁడు. దక్షిణ కైలాస పర్వత దర్శన మాత్రమునఁ బుత్రహత్యాదోషము పాసినది. పుత్ర ప్రాప్తి కొండొక వ్రతము సలుప వలసి యున్నది.

ప్రబంధమున రానున్న భక్తులెల్లరును సువర్ణముఖరీ నదీతీరమున గల ఫణారాఖ్యమహాలింగముఁగొల్చి తరించినవారె. మఱి బ్రహ్మయు నట్లొనర్పకున్న, నిఁక బ్రహ్మ దక్షిణ కైలాసమునకు వచ్చిన ప్రయోజనమేమున్నది ? క్షేత్ర స్వామినిఁ బూజింపక వరముఁబొందినట్లయిన బ్రహ్మ యిటకు రానవసరమే లేదు. అందువలననే పరమేశ్వరుఁడజున కొక్క వ్రతముఁబలికి, సుపుత్రునిఁగోరువా రవశ్యమద్దాని నాచరింప వలయునను భావమును వ్యక్తపఱచెను. ఈశ్వరుని వాక్యము లచే, క్షేత్రమునకు, తీర్థమునకు, మూర్తికి గల ప్రాముఖ్యము, సమగ్రమైన భగవన్మహిమ మీ కథవలన లోకమునకు వ్యక్తమగును. అందున సృష్టికర్తయగు పరమేష్ఠి యంతవానికే మనోవాంఛితము సిద్ధించిన దనఁగా నిఁక నా క్షేత్ర మహిమ మత్యద్భుతముగదా!

ఈశ్వరునాజ్ఞ ననుసరించి, యా సంవత్సరవ్రత మాచరింపఁగా చదువులమ్మ గర్భము ధరించి. నెలలు నిండిన వెనుక, "పరమార్థ రూపము, మహాయోగీశ్వ రో త్తంసము" నైన సుతరత్న ముద్భవించెను. వేదాంత వార్ధి మథింపగాఁ బుట్టిన జ్ఞానేందుఁడతఁడు. ఈ సుతజననము నవలంబముఁగా గొని కవి ధూర్జటి యుపనిష త్సార మెఱిఁగించుట గమనార్హము.

"వాఙ్మయంబైన వేదాంత వార్థియందు
నర్థమయుఁడైన చిద్విధుండవతరింపఁ
దన్ను మఱచిన తెఱఁగునఁ దమ్మిచూలి
ప్రమదమునఁజొక్కె వాణి గర్భమునుండి" 2 — 85

వాక్కునకుఁ బ్రయోజనమర్థము· ఉపనిషత్తులందించు పరమార్థ స్వరూపమే యితఁడను నట్లు బ్రహ్మకు పుత్త్రుఁడుదయించినాఁడు. వాణి యా సరస్వతి తనయుంచు 'బ్రహ్మమునే' గద పిండముగాఁదాల్చినది. సరస్వతినుండి పరమార్థ స్వరూపమావిర్భ వించుట యన పరమార్థమైన బ్రహ్మమునకు, సరస్వతితల్లి, యనఁగా మూలము. సరస్వతి యనఁగా విద్య. బ్రహ్మమనఁగా పరావిద్య, తత్త్వము, తెలియవలసినది. విద్యవలన పరావిద్య దెలిసికొనగలుగుట యగును గదా ! సర్వవిద్యలు నలువ నుండి కదా లోకమునకందినవి. తన వలన లోకమున కందిన విద్యను గాంచి యాతఁడు పరవశత్వమునందెను· తన తపము ఫలించినది. తన సృష్టిని తానే నాశమొందించి, యేమి చేయుటకుఁదోచక తపించిన బ్రహ్మకీ పరమార్థ రూపమును గాంచగనే ప్రమదము గలిగినది, పారవశ్యము కలిగినది, తాను కోరిన పుత్త్రుఁ డుదయించి నాఁడు. ఒక తండ్రి యానందమునకు మేరయేమి ? తనకిట్టి వరమిచ్చి యనుగ్రహిం చిన యీశ్వరునియందు కృతజ్ఞత కలవాఁడై బ్రహ్మ పరమేశ్వరునిఁ గీర్తించెను. బిడ్డ ననుగ్రహించినవాఁడే యా బిడ్డకు బుభువను పేరుఁబెట్టి యాత్మవిద్యోపదేశము చేసి పోయెను.

ఈ కథా ఘట్టము శాంతముతో నారంభమై, శృంగార, కరుణ, వీర రౌద్ర, బీభత్స, భయానకరసములచేఁబోషితమై తుదకు మఱల శాంతముతోడనే ముగిసినది.

బ్రహ్మ కొలువుండుట, తపమాచరించుట, పుత్రునిఁగనుటలు శాంతమున కిక్కుఁలు. సరస్వతి తోడిఁబ్రణయ కలాపము, సరస్వతి చూలు దాల్చుట (ఋభుపుని) లయందు శృంగారము, రక్కసులు లోక కంటకులగుటచే భూదేవి మొఱ యిడుటయందు, పుత్రశోకముచే బ్రహ్మదుఃఖించుటలందు గరుణము, రక్కసులమీఁది కుగ్రుఁడు దండు వెడలుట, యుద్ధము చేయుటలయందు వీర రౌద్రములు, రణ రంగము, వీర విహార ములు బీభత్స భయానకములుగా నుండుట లిందుఁగాంచగలము.

బ్రహ్మ కొలువున్నతీరు వర్ణించిన 'అఖిల విద్యా రహస్యములు శంక దీర్ప' ననువాక్యమునకు బీజముఁగవీంద్రుఁడు ఆశ్వాసాది పద్యమున 'విద్యాఖని' శబ్దముచే సూచనము గావించియున్నాఁడు.

సరస్వతీ స్వరూపవర్ణన గావించిన తీరునఁ గవీంద్రుని కవితారీతులు ధ్వనించుట నిఁట గమనింపఁదగిన విశేషము. ఆమె రూపమును సాలకడలితో నభేదాధ్యవసాయమున రూపకమొనర్చుట వెలితిఁ గనుపట్టు సౌందర్యముకాఁగా, ఐద్యమున నంతర్భూతయై గంగాయమునల సంగాన్వాహినిగాఁబ్రవహించు సరస్వతీనది వోలె నొక విశిష్టార్థము సముజ్వల మొనర్పఁబడినది. పద్యమునఁగల 'రస, గుణ, వ్యక్తి, వాచా, ప్రభా దీప్తి, శబ్దప్రయోగము మహార్థ ప్రతిపాదకమై వెలుఁగొందుచున్న దనవలె. కావ్య లక్షణము లన్నియు నిందు రసధ్వనిచే వ్యంజితములగుచున్నవి. రసాలయమై, గుణ రత్నస్థానమై, ఉన్నతవ్యక్తిత్వము గలిగి, సుభావనస్ఫూర్తితో, కాంతితో దీప్తమగునది కావ్యమన్న మహార్థము నందించుచు. సరస్వత్యంగములు వలెఁగవీంద్రుఁడిందు తన ప్రబంధ నిర్మాణమున నివియన్నియు నంగములని ధ్వనింపఁజేయుచున్నాఁడు. 'వళీ తరంగము' భావమై చిత్రి, 'ముఖచంద్రుననడు కావ్యమందించు మానసికాహ్లాదములను సూచించుచున్నది. అంతరంగమందలి వికాసము ముఖమునఁ బ్రతిఫలించుమగదా! తరువాతి పద్యమును* గవీంద్రుఁడు సరస్వతి కరచరణములందలి యలంకార ములను చక్కని చమత్కారముచే శబ్దార్థాలంకార యుతమైన వలుకు (సరస్వతి)హృద యంగమమను మనోహర భావసంపదనందించుచున్నాఁడు. "వజ్ర నిర్మిత తులాకోటి ద్వయంబునన్ ఝుళంఝుళనాదంబులు" శ్రవణపేయమగు నను ప్రాసాది శబ్దాలం కారములను, "మానసికపుఁగెంజాయ లుద్దాళించు పావలు" హృద్యములై ప్రకాశించు

* శ్రీ. కా. మా. 2ఆ - 6 ప

ఉపమాద్యర్థాలంకారములను వ్యంజితమొనర్చుచున్నది. సరస్వతీ సుధాబ్ధితోఁ బోల్పబడుట కడుంగడు సమంజసముగా నున్నది.[1]

ఇట్లే వాఙ్మయ సౌందర్యముఁగాంచి వాణీపతి పొందిన సిబ్బెఱపాటు కూడ తనవలనఁగలిగిన భాషాయోష పోవుచున్న హొయలు, సొగసులు గాంచి కవి పొందిన యాత్మానుభూతియా యనిపించునది: 'మోము పున్నమి చందమామ.... మొగములు గనుగొనంగ,[2] తన సృష్టియగు కవిత వెదజల్లిన ప్రసన్నత, హృదయమున సూటిగా నాటుకొను తీరు, గహనములయిన యంశముల కథనము, - వేదాంతాది, - గతియందలి యొయారములఁగాంచి కవి/అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః/[3] బ్రహ్మ పొందిన యాత్మానందమే యిది. తన సృష్టియందింత వైచిత్ర్యశ్రీము, * సౌందర్యము లున్నవే యని మురిసిపోయిన కవి హృదయమిది. విమర్శకుఁడై కవియే తన కవితా మర్మములఁబరామర్శించుచున్నట్లున్నది గాదా! ఇట్టిదే మఱియొక పద్యమును చూడఁ దగును.

'వాచాగోచర మప్రతర్క్యము నిర్ద్వంద్వం బసాధారణం
బాచోద్యం బటి లోక మప్రతిమ పర్యాయంబు వర్ణింపఁగా
నీ చెల్వంబిది నిక్క' ............... మ.[4]

పలుకఁజెలువ చెలువ మట్టిది. అయినను చతుర్ముఖునకు మనోజ్ఞక్రీడలందలి వాంఛా చాపల్యము తీఱలేదట. 'మనోజ్ఞక్రీడలు' మన్మథక్రీడలని బాహ్యార్థము. 'ముఖునఁబునట్టి చెలువ' వాఙ్మయ నిర్మాణమునకుఁజెందినవి. వాగీశున కింకను తన వాఙ్మయము ప్రపంచింపబడవలయు ననెడి తమి తీఱలేదని యంతరార్థము. వాణీ విలాసము నందు విలసినే 'శతథా' కావలెనని నలువ కోరిక. శతథా రూపొందిన విద్యల యందలి విహారము క్షేమకరమైనది కాదు. విన్యాసములు దుష్పరిణామములకుఁ దోవదీయరాదు. వక్రగతులు పట్టినచో నా వాఙ్మయమువలన లోక శ్రేయము గలుగదు.

---

1. చతుర్ముఖ ముఖాంభోజ వనహంసవధూర్మమ మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ...... దండి - కావ్యాదర్శము - 1వ పరిచ్ఛేదము.
2. శ్రీ.కా.మా. 2ఆ - 10ప
3. 9 శ్లో - 339 అధ్యా - అగ్నిపురాణము (చూ. కావ్య స్వరూపమ్ - 13)
4. శ్రీ.కా.మా. 2ఆ - 13 ప

'విశ్వశ్రేయఃకావ్య'మ్మనిగదా ఆర్యోక్తి। ఆత్మారామమయిన విద్య యొక్కటియే పరావిద్య. కానఁదాను సృజించిన తొలి భాషారూపములను నాశనమొనర్చినాఁడు. తన సృష్టి యిట్టిదే యగునేమొ యని భయపడి ఈశ్వరునే శరణు గోరినాఁడు "వాచకం సర్వవాఙ్మయమ్" అన్నట్లు, పంచముఖములనుండి ప్రపంచమునకు విద్యాభిక్ష నిడినవాఁడు, పరమేశ్వరుఁడు గాన, నా పంచముఖునే పరమేష్ఠి ప్రార్థించినాడు. శివ శక్త్యాత్మకమైన స్వరూపమె సర్వజ్ఞత్వము, సర్వవ్యాపకత్వము గలవి కాన, బ్రహ్మ విద్య నీయఁగల్గినది.

బ్రహ్మ తపశ్చర్య యందలి తత్త్వమీ లాగున భాసించుచున్నది. బ్రహ్మ తత్త్వము, బ్రహ్మ విద్యలోనుఁ బ్రతిపాదించిన యీ ఘట్టముననే కవి శృంగార రస నిర్వహణమున నించుక మితులు దాటె ననిపించును. 'ఇదియపనిగా గామాంధుండలగుచు బ్రహ్మ క్రీడింపకున్న లోక కంటకులయిన ముప్పదివేల రక్కసులు కుమారులుగఁ బుట్టి యుండరు. ఈ యాశ్వాసమున 'మొక్కిన నొకలేమ .........18 ప. మొదలు 'తొంపుగోరికల్నగవుతోడ ........' 21 వరకునున్న పద్యముల ప్రసక్తిలేకున్నను 'ఆరామంబులఁగెలిశైలముల........' 17ప, 'ఈ మూడ్కి..... ..।' 22 అను రెండు పద్యముల వలననె బ్రహ్మ పొందిన కామాంధ్యము స్పష్టముకాగలదు. పైనఁబేర్కొనిన 18 - 21 పద్యములు నాలుగును శృంగార రస పోషణ నతివెలముగాఁజేసినట్టివె. వీని వలనఁ గవికిఁగల శృంగార రాసిక్యము వెల్లడియగుచున్నది. ఇతరుల జంటలైనప్పుడది 'అతి' యనిపింపకుండెడిది. 'చాసి-మిండ జంగముల' కథయందు, వేశ్యమాతవచనము లందు శృంగారము సందర్భోచితముగనెయున్నవి. పార్వతీస్వరూపవర్ణనమున గలవి. శృంగార రసస్ఫూర్తి యౌచిత్య శోభితమై యలరారుచున్నది.

ప్రణయకలహము 18 ప, తీఱని తమి 19 ప, సంగమ పారవశ్యము 20 ప. సురతాంతస్థితి 21 ప. అనువాని వర్ణనవలనఁ గవికిఁగల శృంగార దృష్టి, అనుభవస్ఫూర్తి సమ్మేళనమందిన వనుటచే ధూర్జటి కవియందు ప్రత్యయముఁగోల్పోనక్కరలేదు.2

---

1. శ్రీ.కా.మా. 1ఆ -100 ప

2. వ్యక్తిత్వము : శృంగార రాసిక్యము అను ప్రకరణముఁజూడనగును.

ఉన్నంతలోనే సందర్భమునుబట్టి - చార్వాకమత ఖండనము, భవనిసరానమును గావించినాఁడు, ధూర్జటి కవీంద్రుఁడు. - క్రూరుల్థూర్తులు లోక కంటకులైన యా మున్నది వేల రక్కసుల యాగడములఁ బేర్కొనుటయందు

'....... మత్త చిత్తులగుచున్ సర్వంబు నేకంబు సే
సిరి వర్ణాశ్రమ ధర్మము ల్బుధుల గాసింబెట్టి చార్వాకమా
ర్గ తతులోర్వెఐ శరీర సౌఖ్య పరతం బ్రత్యక్ష సిద్ధాంతులై '[1]

ఇందు ధూర్జటి కవీంద్రుఁడు వర్ణాశ్రమ ధర్మములందుఁ దనకుఁగల ప్రత్యయము, శరీర సౌఖ్య పరత్వమునందలి యీసడింపు, చార్వాకమత మందలి నిరాదరణము, స్పష్టముగాఁ గనుపట్టుచున్నవి. ఈ వ్యక్తిత్వమును తరువాతి పద్యసంకను బల పఱచుచున్నది.

'కులశీలంబులు, జాతి భీతులు నసుక్రోశ త్రపా హేయ శం
కలు దూరంబులు సేసి, యిచ్చట సమగ్రస్ఫూర్తి వర్తించు వా
రలమై పోయిర ....' ని వారి ప్రవర్తన యెడల జాలింబొంది,
'అసార క్రూర సంసార మో

హలతా బద్ధు ...లై వారు అపవర్గానందముం బొంద లేకపోయిరనినాఁడు కవి[2] బ్రహ్మ కథను నిర్వహించుటయందు కవీంద్రుని దృష్టి యిదియే. 'కుటుంబ జంజాల పఱుమగ్న' సూచనను గార్హస్థ్య ధర్మము నిరాకరమనియు, నాత్మారామమగు బ్రహ్మ విద్యయే యభిలషణీయమనియుఁగవి యీ కథ వలనఁబ్రతిపాదించిన విషయము. ఈ ఘట్టము ప్రత్యేక మొక ప్రబంధముగా దీర్చినాఁడు, కవీంద్రుఁడు. వస్తువు, నాయకుఁడు, రసము, వర్ణన, కల్పన, ఆలంకారిక రచన మను సర్వ ప్రబంధ లక్షణము లిందు సమన్వయము హొందినవి. (బ్రహ్మ విద్య, ఋషువు, శాంతము, అంగములుగా శృంగార వీర రౌద్ర కరుణాద్భుత బీభత్సభయానకములు, పాత్ర చిత్రణ అవస్థా చిత్రణ, ఆశ్రమ వర్ణనాదికములగు వర్ణన ) మూలమునకుఁ, గొంది మార్పులు(బ్రహ్మ

1. శ్రీ. కా. మా. 2ఆ - 28 ప
2. ,, ,, ,, - 29 ప

రెండవమూఱు తపమాచరించి, క్షేత్రమున దన పేరున నవతరింపవలసినదని కోరుట ఇత్యాదిగా గల పది వరములు కోరుటలను విషయమిందు వదలబడినది.

శబ్దార్థాద్యలంకార శోభితమై, గుణరీతులచే నలరుచు, ధ్వని ప్రధానమై యీ కథ విశిష్ట ప్రబంధముగా విరాజిల్లుచున్నది.

రెండవ భాగము :- కథ నాలంకించుచున్న యాదవ భూకాంతునకు క్షేత్రమున కాపేరు గలిగిన విధాన మెఱుంగవలెనని కుతూహల మెచ్చుచుండెను. తమ్మిచూలి కథవిని, ప్రభువు కుహనాజంగమునకు నమస్కరించి 'శ్రీకాళహస్తి శతాప్రాచుర్యంబు పురాణ ప్రసిద్ధ'మైన విధముఁ దెలియఁజేయుఁడని ప్రార్థించెను.

సుధాంశుధరుఁడు గానఁ గరుణావననిధియై గిరిజేశుఁడు మూఁడు యుగములందు శివునర్చించి ధన్యులైన మువ్వురు భక్తుల చరితల నెఱిగింపఁబూను కొనెను. వశిష్ఠుఁడు కోరిన విధముగా 'యుగముల నెల్లఁ' బూజఁగొనిన పరమేశ్వరుని మహిమ చెప్పుచున్నాఁడు.

కథనమున నొక యొడుపున్నది. అడిగిన ప్రశ్నకొక వాక్యములో క్లుప్తముగా సమాధానము పలికి, క్రమముగా కథాత్రయ మెఱుఁగఁజేసినాఁడు కథకుఁడు.

"గౌరీశుండు, చెలఁది పాము గజముం గైవల్య సామ్రాజ్యల
క్ష్మీరూపంబగు తన్నుఁగూర్చుకొనఁగా శ్రీకాళహస్తీశ్వరుం
డై రాజిల్లె నని తదీయ భక్తి గరిమం బాద్యంతమున్నాతనికి వి
స్తారప్రౌఢి వచింతుఁ" అని నాఁడీశ్వరుఁడు.

చెలఁది :- అర్చన, భక్తి కొలఁది, శక్తి కొలఁది యుండును. చెలఁది పురుఁగు పరమేశ్వరుని కేమీయఁగలదు ? భూకాంతునకుఁ బరమేశ్వరుఁడు నియమించిన కాళహస్తి శశిశేఖరు దివ్య నివాస పంక్తి నిర్మాణమున కిది స్థూలరూపమైన వివరణము,

1. "అస్మిన్ క్షేత్రే మహాపుణ్యే సుయామన్నామతః శివః స్థాపస్య శివలింగస్య ప్రసిద్ధిర్భవత ధ్రువం" ఇది బ్రహ్మ కోరిన మూఁడవ వరము. ఇది సంస్కృతమునందలి శ్రీకాళహస్తి స్థలమాహాత్మ్య మందలిది. నేఁగోరినందున కాళహస్తి నిలయులు, సంస్కృత గ్రంథము నాంధ్రీకరించిన (ముద్రితము) శ్రీ కొట్ర వెంకట నృసింహ శాస్త్రిగారు దయతో మత్తరముఖమునఁ దెల్పినది. 6-8-70

2. శ్రీ. కా. మా. 2అ - 94

ప్రణాళికవలె నున్న దనిపించుచున్నది. ఈశ్వరాలయ నిర్మాణమున నుండవలసిన గృహములు, మందిరములు, గోపురములు, ప్రాకారములు, వీధులు, మున్నగునా గలవన్నియు, నేయే దైవతముల కాలయము లెట్లుండవలయు నన్న భావమున కీపద్యము (చెలంది పురుగు శివార్చన ప్రణాళికయై యలరుచున్నది. ఆలయ నిర్మాణము కడు భక్తి శ్రద్ధలతో జరుగవలసిన పని. దానికి విసుగు, విరామములుండరాదు. ఎప్పటి కప్పుడు మెఱుగులు దిద్దుటలు, శైథిల్యములున్న యెడల నవరణలు చేయుచునే యుండవలయును.

ఆత్మనిర్గత బహుతంతు పంక్తిచే నాలూతాధీశుఁడు దైవతనిలయములగట్టెను ఆ తంతు పంక్తిచే నిర్మితమైన యీ నిర్మాణమంతయుఁ బ్రాతఃకాలమున ముత్యాల వాల వలె తళ తళలాడినదని వర్ణించుట యందుఁ గవీంద్రుని పరిశీలనానుభవము (అబ్జర్వేషన్) స్పష్టమగును. అ మంచు బిందువుల పై సూర్య కిరణములంద వివిధకాంతుల వివిధ రత్న కాంతులనుఁగలిగించుట యీ దృశ్యము నూహించుట వలనఁగాక, బ్రత్యక్షముగాఁ జక్షుస్సంయోగముచే మాత్రమే వర్ణ్యమానమైనది. తంతు సంతానముచే నాలయ నిర్మాణమను నది చెలఁదికి చేతనైన పూజ. అదియే యది చేసిన శివార్చన. చెలఁది యర్చావిధానము నిరంతరముగా సాగినది. దినమంతయు, దానికొక గడియ నిలిచి విశ్రాంతి గొనుటకుఁదీఱలేదు. కారణము తంతు నిర్మితములయినవి గాన నా యిండులు గాలికెఁగిపోవు చుండుట, త్రెవ్విన పోగులను, జారిన పోగులనదుకుట, తీర్చుటయే సరిపోవుచుండెను. ఈ ప్రబంధమున వర్ణింపబడిన మిగిలిన శివభక్తులు శివార్చన యందుఁగొంత కాలమున్నఁ గొంత యయిన విరామము గలవారే. కాని యీ చెల్దఁది మాత్రమట్టిది కాదు. క్షణము ఊరకుండుటకు వీలులేక, తన నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుచునే యుండవలసి వచ్చినది. అది నిత్య పూజయైనది.

అనంతమయిన శ్రమమునకోర్చి, అదే జీవిత ధ్యేయముగా నాలయ నిర్మాణము గావించిన యీ చెలఁది పురుగు శ్రమమంతయు బూడిదపోసిన పన్నీరయినది. ఆకస్మికముగ నున్నట్లుండి యీ తంతుపటల నిర్మిత గృహజాల మంతయు భగ్గునమండి బుగ్గియాయెను. ఇది మెమ విచిత్రము! ఆ ప్రాంతముల నే కార్చిచ్చును రగుల్కొనలేదు.

అగ్నికిఁదోడు గాలియు లేదు. మఱి యీ దారుణ కాండ మెట్లు జరిగినది ? తన జీవిత మంతయు ధార వోసి ప్రయాసమున గట్టిన యిండ్లను దీపము కాల్చివేయుటయా ? అది తన వ్రతమునఁగల లోపమేమోయని భావించుట కా పురుగున కట్టి ఆలోచనా శక్తి లేదాయె. మఱి యా యాలయ నిర్మాణ మెట్టులు తలపోసినది ? 'పూర్వవాసనాగతమతి'[1] యై యాలయ నిర్మాణమున కుపక్రమించినది. అది దాని కెఱుకలేదు. తన యుపజ్ఞచే నిర్మించు చుంటినని తలపోసినది. ఎన్ని యాటంకములు గల్గుచున్నను వాని నెల్ల నధిగమించి, యాలయ నిర్మాణము గావించుచునే యుండెను. లౌకికమైన కారణ మొకటి దాని కగపడినది. నిప్పెచ్చటి నుండియో రాలేదు. అచ్చటనే వెలుగుచున్న దీప శిఖయే తన శ్రమఫలము నంతయు నిర్ధూమమొనర్చినది.

ఆ దీపమును మ్రింగిన గాని తన కోపము తీఱదు. క్రోధముఁజెందిన వారికి స్వ పరబలము నెఱుఁగు వివేకము పోవును. తంతు సంతాన నిర్మితమగు గృహ జాలమంతయు దగ్ధమొనరించిన యా దీపశిఖ, యా తంతువులకు మూలమైన తననుఁగాల్చి వేయునని యూహింపలేక పోయినదా ? ఊహించినది. దీపమును మ్రింగఁబోయిన తాను భస్మమగుదునని తెలియును. తన జీవితమును రోసినది, 'అటమటమైన జీవనమునందలి మోహము చాలునంచు' నా లూత దీపశిఖావివరముల మ్రింగపోయినది. చెలఁది దీప శిఖపై దూఁకుటకు రెండు కారణము లున్నవి. తన శ్రమమంతయు నిర్ధూమ ధామమగుటకు దీపశిఖ కారణమైనది, ఇఁక తన జీవితములో మఱల నట్టి నిర్మాణమొనరుపఁజాలనని నిరాశఁ జెందినది. మొదటిది ప్రతీకారేచ్ఛ, రెండవది నిరీహ. శరీరము పై మోహము విడిచిననే కాని త్యాగము, సమర్పణములుసాధ్యములుగావు. శరీర త్యాగమునకు శంకారహితముగా, మోహమును వీడవలయును. పరమేశ్వరుఁడర్జునునకు బోధించిన దిదియే. 'దేహమోహంబు విడిచి సందేహముడిగి, భక్తి భజియించిన వారు కామిత పదముగాంతురని'[2] యీశ్వరుని వచనము.

చెలఁది 'అటమటమైన జీవనమునందలి మోహము చాలు' ననుట, జన్మ రాహిత్యము నభిలషించుటయే. పరమేశ్వరునిఁగోరినదియు నదియే.

---

1. శ్రీ. కా. మా. 2 ఆ _ 95 ప

2. ,, , 4 ఆ - 197 ప

"నాకీ భవ దుఃఖంబులు
లేక, మహాజ్ఞాన రస విలీనుఁడనగుచున్
లోకంబెన్నఁడు నెఱుఁగని

యా కైవల్యాప్తి యభీష్ట"[1] మని ప్రార్థించినది. 'లూతా పాతాళ సామజాటవిక గోత్రాదేవ సర్పా... రాజివాక్షీయుగ' మెల్లరునుఁ బరమేశ్వరుని భవబంధములు తొలగించి సాయుజ్యమునే యిమ్మని కోరిరి.

శ్రుతులు శాస్త్రింబు ల్చెప్పగా లేని పరమేశ్వరుని శ్రీపాదము ల్నిలిచి సేవ సేయుటమే యుత్తమ ధర్మము. వేద శాస్త్రి మంత్ర విద్యలేవియు తెలియకయే, పరమేశ్వర పాద సంసేవాశక్తి చేతనె ముక్తులయిరని ధూర్జటి శతకము నందును స్మరించినాఁడు. 'ఏ వేదంబు పఠించె లూత ....'[2].

శివార్చనలొనరించి యసురులు, తపోవిభవముచే మునులు, యోగులు, సపయాచార పరులలును దార్భవికు లేరునుఁబొందఁజాలని సాయుజ్యమునుఁ దైఁబేకొ...సిన 'లూతా పాతాళవ సామజాటవికులు' పొందఁగలిగిరి. మంత్ర తంత్రముల పరిశీలనము, సాంఖ్యాది యోగ రహస్యముల వినికి, వేద శాస్త్రిముల బోధలు, బోధావిర్భావ నిధానము లయిన చదువులు గావు.[3]

దిక్కులు మూఁచుకొన్న ( నిసర్గ్నీకృతాజాండభాండ ప్రకాశా ।[4] ) తన దివ్య తేజఁబుల నా యూర్ణనాభమునఁ జేర్చుకొనినాఁడు.

ఈ తెలఁది పురుసు గావించిన 'నిరంతర నిర్మాణము' జంతు కోటి యొక్క 'పునరపి జననమ్ పునరపి మరణ' మ్మను నిరంతర సంసార చక్ర ప్రవర్తనము. ఆ భవ దుఃఖములు కరుణేక్షణుఁడై శివుని కారుణ్యమునఁగాని తొలఁగి పోవదు.

---

1. శ్రీ. కా. మా. 2ఆ - 105 ప
2. శ్రీ. కా. శత. - 13 ప
3. ,, ,, - 77 ప
4. శ్రీ. కా. దండ.

చెలఁడి పరమేశ్వరుని కోరిన కోరిక, దాని పూర్వ వాసనానుకూలమైనది. లేకున్న కీటజన్మము నుండి యుత్తమ జన్మఁగోరవచ్చునుగదా! కాదు. పరమశివునర్చించి, సాక్షాత్కారమందఁగలిగిన జీవన్ముక్తుల కన్యవిధమగు కోరిక లేలయుండును? ఈశ్వర దర్శనమే జన్మరాహిత్యమగుచుండఁగా నులల జన్మ, కోరికల వెలిఁబుచ్చుట మానవులకే కాదు, కీటాది జంతువులకైన కలుగరాదని యీ కథ నిరూపణ మొనర్చుచున్నది.

బ్రహ్మాది కీటపర్యంత సర్వ భక్తులనుఁబ్రోచు పరమశివుని భక్తవాత్సల్యముఁ జాటుటకుఁ బూర్వభాగమున బ్రహ్మకథయు, నీ భాగమున మొదటి కీటవృత్తమునుఁ గథితములైనవి. వేద శాస్త్రము లెఱుఁగ జాలని, నామ జపమాచరింపలేని మూక కీటమైన నిశ్చల భక్తి భావమున నిరంతర శివార్చన మొనర్చిన లలాటేక్షణుఁడు చూడఁ గరుణేక్షణుఁడై తరింపఁజేయునని యీ కీటవృత్తము వలన సుస్థాపితమైన శివతత్త్వ రహస్యము.

ఆ కీటము 'కుంభజ క్షితిధరకన్య కొంబు పరిషిక్త శరీర'మై శివునర్చించినది. ఈ ఘట్టమున నొక పరామర్శింపఁదగిన యంశమున్నది.

"సేవింపఁగఁ జెలఁది నేమముఁబరీక్షింప స్లలాటాక్షుఁడా
త్మావాసంబున నున్న దీపశిఖ కీలాభీల తీవ్రప్రభా
భావ్యావిష్టాంబరమై తగుల్కొని, తదీయాగారముల్ ధూపమై
పోవంజేసి......"[1] నాఁడు.

ఆ పరశివలింగ మూర్తి వెలసిన తావున దీప శిఖ వెలుఁగొందుట చర్చనీయమైనది. ఆలయాదికములు లేకున్నను ధూప దీప నైవేద్యములుఁండదగును. అవి నెరవేర్పఁగలవారు మానవులు. అది మానవ నివాసయోగ్యమయిన తావు కాలే దప్పటికి. ఆ దీపము నిత్యమచ్చట వెలుఁగొందుట యెట్లు సంభవించును? ఎచ్చటనుండియో వచ్చిన శివార్చకులెవరైన గాని యా జ్యోతిని వెలిగించి వెడలుచుండవలయును. అదియస్లేకావచ్చును. తిన్నని కాలమునకుఁగాని గుడి నిర్మాణము కాలేదు. (గుడి ముగ్గురెత్తి....[2])

1. శ్రీ.కా.మా. 2ఆ—99 ప
2. ,, 3ఆ—96 ప

మానవ నివాసయోగ్యములు కాని ప్రాంతములందు దేవతార్చన యిట్లే జరుగు చుండుటకలదు. అదియును గాక. యొక పరి వెలిగించిన నిత్యజ్యోతి యఖండముగా మాసములు కొలఁది వెలుగొందుట, నిప్పటికి మనము చూచుచున్నాము. బదరిలో నారు మాసములకొకసారి యర్చకులు గుడితలుపులు తీయుచుందురు. అప్పటికి నా జ్యోతి ప్రకాశించు చుండును. అట్లయిన నయియుండ వచ్చును.

అటుల వెలుగొందు దీప శిఖను లలాటాక్షుఁడే మంటించుట మరింత విచిత్రము. అతఁడు లలాటాక్షుఁడగుటచే యీ తంతు సంతానమును దగ్ధ మొనరుప జాలును కదా! మఱి యట్టి తఱి 'లలాటాక్ష' శబ్ద ప్రయోజనము సార్థకమగుట లేదనిపించును. మన్మథ వికారమును దగ్ధమొనర్చుటకు గదా యీశ్వరుఁడు లలాటాక్షుఁడైనాఁడు. చెలఁది, తన తంతు సంతానముచే నాలయ నిర్మాణము ను భవ పరంపరయందు బెక్కుడులు చిక్కుకొని వెలువడ లేకున్నది. కాన నగ్ని యవసరమైనది. చెలఁది నుండి పుట్టి, చెలఁదినె యావరించియున్న యీ బంధములను దగ్ధ మొనర్చుటకుఁ బరమేశ్వరుఁడు నిశ్చయించెనన్న పరమార్థమున 'లలాటాక్షుఁడ'ను విశేషణము ప్రయుక్తమైనది. అదియునుగాక దీప శిఖసంతగా ప్రజ్వలించి యీ గూటిని కాల్చివేయలేదు. అది పరమేశ్వర సంకల్పము. 'చెలఁది నేమ మున్ బరీక్షింప'ఁ దలచినాఁడు. అగ్గిచే దహించి సంకల్పించెను. గాన 'లలాటాక్ష' శబ్దము సార్థకము, సాభిప్రాయమునని యెంచదగును. నిర్మాణమేండ్ల కొలఁది సాగును. నిర్మూలన మొక్క క్షణములో జరుగును. ఏండ్ల తరబడి బంధించి బాధించు భవపాశము త్రెవ్వుటకొక్క క్షణమే పట్టునను రహస్యమునిందు నిక్షిప్త మొనర్చినట్లు తోచును.

ఆలయ భాగముల వర్ణనము ధూర్జటి కవీంద్రునకు శ్రీ కాళహస్తి దేవాలయ నిర్మాణ పరిచయమున్నట్లు తెలియఁజేయుచున్నది. 'గాల్చి త్రవ్విన బోఁగుల్ జాలిన [illegible] యనుసోపాన' యను వాక్యములు [illegible] లోని పరిశీలనమును, [illegible] క్కడెను గది కొక్క పెట్టిన్న [illegible] యీ కవీంద్రుని లోకజ్ఞ [illegible] చున్నవి.

'ప్రాతఃకాల తుషార శీకరచయ ప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగి, తద్బృందు చ్ఛటా జాత ఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహురత్నోద్దీర్ణ గేహంబులై
లూతా కల్పిత తంతు సద్మములు వొల్చు'[1]

సన్న ధూర్జటి పద్యము వలన ప్రకృతి పరిశీలన, వర్ణనములందున్న అనుభవమును, ప్రతిభయును వ్యక్తములగుచున్నవి. అందు 'కొంతసేపు' అన్నది 'తద్బృందచ్ఛట'లయని తెల్పుట. అవి బుద్బుదములు గదా! ఆ శబ్దమున మఱియొక మహార్థమును కవీశ్వరుఁడు సూచించినాఁడు. నిర్మాణమునకు పెక్కుఁడులు పట్టిన తంతుసదనముల మనికి స్వల్పకాలమే యనునది కథా సూచన సటులుండ, లోకమున భ్రమలుఁగొల్పు ప్రాపంచిక సౌఖ్యములు, సౌకర్యము లశాశ్వతములన్నది మహార్థము. ఆ తంతుసద్మములు 'లసన్మౌక్తికోపేతాగారములట్లు' అనుటయందలి 'అట్లు' అన్న శబ్దముకూడ నవి ముత్యాల శాలలు కావని వాని యథార్థ స్వరూపమది కాదను భావమున, వెలికి కనుపించునది తత్త్వము కాదనియు నంతరార్థమింకొకటి గలదనియు నందలి పరమార్థము. కాన్పైనట్లు, లేని వున్నట్లుండుటయే కదా చిత్రము! అందువలననే కవియు నాపై చిత్రి కబ్బురపాటు చెంది 'చెప్పంగాఁ దరింగాదె'యని వాక్యము చేయకుండ నుండ లేకున్నాఁడు.

చెలఁదికిఁ బ్రత్యక్షమైన పరమేశ్వరుని విశేషణములన్నియు నాతని భక్తవాత్సల్యమును, దైవోత్తమత్వమును చాటఁ జాలినవై యున్నవి. గౌరీవామాంగుఁడు కాన నాశరీర మతి సుకుమారమైనది. కాన నాతని కరము 'లేంగేలుగా' బలుకఁబడినది.

కథా ప్రారంభమున చెలఁది పుర్వుపేరు 'శ్రీ', పాముపేరు 'కాళము', హస్తిపేరు 'హస్తి'గా గలవు[2]. ఈ మూఁడును 'ప్రతంబున' పరమ శివునిఁ గొల్చినవి. ప్రతంబున ననఁగా దీక్షతో, భక్తిపూర్వకముగానని. ఈ మూఁడును జ్ఞానము, భక్తి, శక్తులను వానియందు, క్రమముగా నుత్తరోత్తరములు శ్రేష్ఠములుగా గలవి. తనచే నిర్మితమైన తంతు సంతానసద్మములు దగ్ధమగుటకుఁ గారణము దీపమేయన్నట్టిది చెలఁదికి గల జ్ఞానము. ఎడతెఱపి లేని నిత్యశివార్చన భక్తి తత్త్వమున తన శరీరమునుండి వచ్చు తంతువుల చేతనే శివార్చన చేయుట దాని శక్తి.

1. శ్రీ.కా.మా. 2ఆ-97 ప    2. శ్రీ.కా.మా. 2ఆ-93 ప

త్రేత, ద్వాపర యుగములందుఁ బరమేశ్వరునిఁ గొల్వవచ్చినవి కాళ, హస్తులు. త్రేతాయుగమునఁగాళము భక్తితో దివ్యమాణిక్యములనుఁ దన లోకము నుండి తెచ్చి యర్పించినది. అది త్రేతాయుగము తుదఁగొన్ని దినములనుండి యట్లొనర్చుచుండెను. ద్వాపరయుగము ప్రవేశించు వఱకుఁగాళము చేయు పూజ కెట్టి భంగము కలుగలేదు. ద్వాపరము ప్రవేశించుటతో నా వ్రతమునకు భంగము వాటిల్లినది. అమూల్యమైన రత్నములను ద్రోసివేసి యట ములుకంపలు,తీవలుపెట్టి యెవ్వఁడో యొకఁడు, తన పూజావిధానమును వృథా యొనర్చుట, కాళమునకు హృదయశల్యమైనది. తన భక్తియే యున్నతము, తన యర్చావిధియే యుత్తమమని యెంచుట వివిధభక్తి, యర్చావిధము లనుసరించు భక్తుల భావనము. ఇతరుల సేవ పనికి మాలినది, కీడొనరించునది యని భావించుటయు నంతియే. దివ్యములైన రత్నములచే పరమేశ్వరుఁడు లింగమూర్తి ధగధగాయమానముగా వెలుఁగొందు చున్నాఁడని కాళము భక్తి భావన.

ద్వాపరారంభమున శంకరునిఁగొల్చుటకు వచ్చిన గజము, శివలింగముపై బొలుండుట సహింపలేక, కఠినాశ్మములచే నెక్కడ నెక్కడఁ బూజగావించినారని భావించి, వానినిఁబొలగఁద్రోసి బిల్వ విటపశ్రేణీ వనాళాబ్జములచేఁ బూజించి వెడలి పోయెను. మొదటి తడవ యేనుఁగు వచ్చి చూచునప్పటి కున్న వాలు సహజముగా నెప్పటినుండియో శివలింగముమీఁద నడియుండునని తలఁచుటచే నది యొక పూజా విధానమని భావింపక, వానిఁద్రోసి, తాఁదెచ్చిన మాలూర శాఖలు, నాళీక కహ్లార కుముద పుష్పములు, గోసితెచ్చి యర్పించి వెడలినది. మఱునాఁడు ఫణి వచ్చి తా నుంచిన శివలింగము మీఁది 'రత్నముల్ గస్తులకాట గల్పి, ములుకంపలు తీవలు పెట్టి' తన పూజకు కీడొనరించిన వాఁడెవ్వఁడో యని కటకట బడినది. తనపూజ కెవఁడో విఘ్నొనరించినాఁడని చూడగనే పాము భావింపఁగలిగినది. కారణము, తానిన్ని దినములుఁగా సల్పుచున్న రత్నపూజ యెక్కడ చెదరక నిలిచియుండి, యాకస్మికముగా నీనాఁడది పొలఁగఁద్రోయబడుట, దాని స్థానమున ముళ్లు, కంప, తీగలుండుట చూడగా నిది యెవరో పగులొనర్చిన విఘ్నమనిపించినది. తానింతకాలము చేయుచున్న పూజాకీనాఁడిట్టి భంగము కలుగుట చూడలేకపోవుటచే, విషణ్ణ చిత్తముతో

ఇచ్చట పాము "ఏమననేర్తు" నన్న పదము దాని ప్రత్యర్థియందలి తీవ్రకోపమును వ్యక్త పఱచునది. తన పూజ భంగమొనర్చిన వాని మౌర్ఖ్యమెంతయో, తనకు తెలిసివచ్చినది. రత్నములఁ దొలఁగఁద్రోసి ములుకంపలు తీవలుంచుట మౌర్ఖ్యము కాక మఱేమి? ఆ ప్రత్యర్థి యెంతటి మదాంధుఁడు కాకున్న నిట్టి యెగ్గొనరించును ? తన స్వరూపము స్వభావములు దెలిసిన వాఁడిట్లొనర్చియుండిన వాని యవివేకము గద యది! లేక తన రూపు తెలియని వాఁడయిన నిఁక వానినేమియని యేమిప్రయోజనము? శక్తివంతుఁడై వాఁడొక తన కార్య మీలాగున భగ్నమైన ప్రత్యర్థి ఆపురేఖలు తెలియనపుడు భావించు తీరిదియే. "మదీయభాగ్యము" అను దానియందా శాళము తన పూజా విధానమందలి యుత్కృష్టతమఁ దలంచుటయ. తన యర్చా విధానౌన్నత్య మెఱుఁగజాలక వృథ పుచ్చిన వాఁడు మదాంధుడే,

ఆ ములుకంపలు తీవలమునీసి వైచుట శాళమునకు శ్రమ పూర్వకమైనది. కొమ్మలు(మారూర శాఖలు)పెద్దవి, ముళ్ళతో నున్నవి. పూవులు గుత్తులు గుత్తులుగ భారములుగా నున్నవి. అవి గజరాజు తొండమున విఱచి యూడబెఱికి తెచ్చినవిగదా! శివలింగము మీఁది శాలను ద్రోసివేయుట యేనుఁగునకు సుకరమే యైనది. ఆ కొమ్మలు, పూగుత్తులను నీసివేయుట పామునకు కష్టమే అయినది. ఈ యంత భావగాంభీర్యమునుఁ గవీంద్రుడు 'అల్లన నేనుఁగు పెట్టిన పెల్లంటోఁద్రోసి' యను వాక్యమునఁ దొడిగినాఁడు. 'ఏనుఁగు పెట్టిన పెల్ల' ననుటయందు వాని యాధిక్యమును, 'అల్లన' యనుటచే వానిని దొలఁగఁద్రోయుట యందలి శ్రమ, కాలములను సూచించుటయైనది. అంతియేకాదు, "ఎల్లన్" యనుట యందింకొక రమ్యార్థమున్నది. శత్రుశేషమన్నట్లు శత్రుపూజా చిహ్నములు కడవఱకుఁ దీసివేయుట యందలి పామునకున్న ప్రత్యర్థిపైఁగల స్పర్థ, శివునిపైఁగల తన భక్తి భావములను గవీంద్రుఁడు జెప్పినట్లయినది. "ఎడఁద నీసుమ భక్తిన్" యని చెప్పియున్నాఁడు. ఆ పామెంతగా మనోవ్యథఁ దొందినదియుఁ దెలియఁ జేయుటకు "ఎడఁద నీసుమ భక్తిన్ మల్లాడ" నని ప్రయోగింపఁబడినది. ఈసున భక్తియున్ అనక "ఈసును భక్తిన్" అనుటయందు కవి గడుసుదనముఁ జూపినాడు, ప్రత్యర్థిపైఁగల ఈర్ష్య, శివునిపైఁగల భక్తితో పోరాటము చేయుట కూడ నీ ప్రయోగముచే సూచించుట జరిగె

నది. ఈ వాక్యము కథా సూచకమై యొప్పుచున్నది. కాళ, గజములకు భక్తి విషయికమైన పోరాట మీర్ష్యచే జరుగనున్న దను కథా సూచన మిందు ధ్వనించు చున్నది. ప్రయోగించిన ప్రతి పదమును సార్థకము, సాభిప్రాయమునై యుండుట మహాకవి కవితారీతి యనుట కీ పద్య మొక్కటి చాలును. కాళము, గజములకుపయో గించిన పదములే యిందులకుఁ దారకాణ. "ఏనుఁగు" పెట్టినట్టి వెల్లన్" అను వాక్యమునందలి "వెల్లన్" శబ్దౌచిత్యము చూచితిమి. 'ఏనుఁగు' అనుటచేనది శాఖలు, పుష్పములనెన్నిటిని తేఁగలదో యన్నిటాలా ఎక్కువగా భావము స్ఫురింపఁజేయును. అట్లే "వాతాశనమున్" అనునది యాకాళమెంత శ్రమనడిదో తెలుపుట యట్లుండగా, పాము స్వభావము "రోజుట" — పగ బట్టుటకు చిహ్నమును సూచించుచున్నది. గాలి నాహారముగా గలది - పెద్ద పెద్ద నిట్టూర్పులు పుచ్చుచు వెడలినదను రమణీ యార్థమిందు ద్యోతక మగుచున్నది. పాము పగబట్టుటకు ప్రత్యర్థి గాలి చాలును. ఏనుఁగని తెలియకున్నను, పామునకా కొమ్మల రెమ్మల గాలి పసిగట్టి పగబట్టిన దను భావమిందు సూచింపఁ బడుచున్నది.

అది గజము పూజించి వెడలిన రెండవ దినము. ఆ రెండవ దినమున తన వేళకుఁ దావచ్చినది యేనుఁగు. "కపర్దికి" గాలుపెట్టి యెవ్వఁడో తన యజ్ఞతను చాలుకాసినాఁ డనిపించినది. మొదటి నా డది యెటనుండియో వచ్చిపడి యుండునని భావించి, దానిని గూర్చి వితర్కింప లేదు. యేనుఁగునకు రెండవ నాఁడు తన పూజ లేక జాలుండుటచే నన్యూది యెవ్వడో దుష్టుఁడై తన పూజఁ దొలఁగద్రోచి నాఁడని పించినది. జటాజూట ధారియైన శివునకు పుష్పము, ఆకులు అందముగా నుండును. జాలేమి యందమిచ్చును? కాని తన పూజఁ ద్రోసి వేయుట తనచే కాదు, పరను శివుని నెకసక్కెములాడుటయే యనిపించినది యేనుఁగునకు. ఈ విధమెఱుఁగ లేకుండుట యజ్ఞతయేకదా! వాని యవివేకమునకుఁ జింతించినదే కాని స్పర్ధ యింక నేర్పడలేదు.

ఈ పద్యమందలి "కపర్ది, జాలు, అజ్ఞతా సంతమసంబు, ఎకసక్కెపుఁ బూజలు" అన్న ప్రయోగములిట్లు సార్థకములయినవి.

ఇప్పటికి రెండంశములు తెలిసినవి. కాళ గజములు తమ తమ పూజా విధాన ములే శివునకుఁ దగినవని, యుత్తమములని భావించుట యొకటి. మహాంధుఁడైన ప్రత్యర్థి యెవరో యీ పని పనిచేసెనని పాము పగబట్టినది. ఎవడో యజ్ఞుఁడిట్లు చేసి యుండెనని వాని యవివేకమునకు జాలిపడినట్లు కొంతపడి చింతించినది యేనుఁ గన్నది రెండవ అంశము.

ఇఁక నీ పద్యమున నేనుఁగు పాము చేసినట్లు పూర్వ పూజ కొలఁగందోసి నట్లు వాచ్యము చేయలేదు. అనఁగా నేను గి కాళము చేసిన పూజనట్టులే యుంచి, తన పూజ చేసి వెడలెనని యర్థమా ? కా బ. 'ఎప్పటియనువున' శివపూజ చేసి యడవికిఁజనియెనట యేనుఁగు. అనఁగా 'ఫణి సమర్పించిన మణులెల్ల దోఁదోసి' యే వెడలినది. ఇంతు వ్రాసినట్లు వీఁదోయుటకు దానికి శ్రమము కాని, పట్టు దల కాని లేదనియు, రెండవ యాలోచనము లేక నిశ్చింతఁగా వెడలి పోయెననియు, భావములున్నవి. ఈ రెండవనాటి కథా ఘట్టమునందు, కాళము, గజముల జ్ఞానము (ఊహాపోహలు) లందలి యంతరము చక్కఁగా నంతర్భూతమై యున్నవి. తన పూజ భగ్నముగుట కావలెనని చేసిన శత్రుకృత్యమని యూహించినది కాళము. అది కేవలమొక యజ్ఞాని కృత్యమని భావించి యంతటితో నాగినది యేనుఁగు జ్ఞానము. రెండు దినముల కథ నడచినది. ఇంక రెండు దినముల కథయున్నది. మూడవ, నాఁడు తలఁపుల పోరాటము, నాలుగవ నాఁడు తనువుల పోరాటము రానున్నది. మూఁడవనాడుదయము పామొక యుహాపోదనే వచ్చినది. నిన్నటి తన పూజ తిరిగి భగ్నమైయుండునా యన్నది యాలోచన. కొంత అది యట్లే యయినది. తన పూజ యవమానింపఁబడుటయెది రెండవ పర్యాయము. ఇఁక మూడవ పర్యాయమిట్లు జరిగెనా, చెప్పుటకేమున్నది ? ప్రతీకారపర్వ, శత్రు వినాశనము తప్పదని నిశ్చ యించినది. శంకరుఁడు తనచేసిన రత్నపూజను త్రోసి యొరులు చేసిన పత్రి పూజలంగీకరించుట విచిత్రముగానున్నది. తనకంటె నితరుఁడు శివునకుఁబ్రియంకరుఁ డయ్యెనేమి ? తాను నమ్మిన దైవము పగవానితోఁగూడినట్లున్నది. శంకరున్న కీ కొమ్మలపూజ యెట్లు నచ్చును ? పోనిమ్ము ! ఆ తెచ్చిపెట్టిన వేమయినన సుకు మారములా ? కావే పినిని పరమేశ్వరుఁడు పార్వతి బాహులతికల వంటివిగా నంగీ కరించుట చిత్రము గదా !

ఇందు ప్రతీయమానమగు నుఱియొక విశిష్టార్థమును స్ఫురింపఁగలదు. సర్వపాత్రముల పేళ్లను ప్రయోగించునపుడు ధూర్జటి సాభిప్రాయములు, సార్థక ములునయిన వానినే యుపయోగించుచుండునని చూచితిమిగదా ! ఇది నట్లే సంభ వించినది. పార్వతీ శబ్దముచే పర్వతముకుఁ దుహిగదాఁ బలుకఁబడుచున్నది.

* శ్రీ.కా.మా. 2ఆ.116 ప

మఱి కొండచూఁతు బాహువులనే లతికాయుగముగా భావించు పరమేశ
చెట్లకొమ్మలేమి లెక్క యుండును ? అయిన నందులకొక రమ్యభావనము
చేయవచ్చును. ఆ పార్వతీ బాహులతికా సంగతిచే పులకాంకురములు గల
(కంటకితాంగ బాహులతికా సంగతి) కాని యీ కొమ్మల, బిల్వముల, తామర
వలని స్పర్శము సుఖప్రదము కాకపోగా మీఁదుమిక్కిలి దుఃఖ కారణము.

"ముక్కంటి మెఱుంగవే ? నొసటితంటి మహత్వము నీకుఁగ
కంటక బిల్వికా కనులఖండముల వలన "పార్వతీ కంటకితాంగ బాహులతి
సంగతి" వలన గలిగినట్టి సౌఖ్యము భావించియే యీ పూజనంగీకరించి య
గాన నా పారవశ్యముఁదన శక్తినే మఱచినట్లున్నాఁడు 'ముక్కంటి'. తన
భక్తున కవమానము జరిగినప్పు డుపయోగింపకున్న నా మూఁడవకంటి(నొస
ప్రయోజనమేమి ? ఇప్పుడవసరము గల్గినది కాన, మూఁడవ కంటినిఁ
తన పూజను భగ్నమొనర్చిన యీ దుర్మతిని దగ్ధము చేయవలయునన్నది
భావన. భగవంతుఁడు రక్షకుఁడా నూరకుండునా ? దైవము పగవానిఁ
గదా ! తా నవశ్యము శత్రునిర్మూలనము గావింప నిశ్చయించుకొన్నది
"ఎల్లియున్ వ్రతము కొల్లఁబోయినం జూచెదన్" అన్న వాక్యములోఁ
నిశ్చయము స్పష్టము. ఇది లోక సహజము. ఒకటి రెండు మార్లుపేక్షించి
కృత్యమును మూఁడవ మాఱుక శిక్షింపఁదలంచుట మానవ సహజము.
పాము, ఏనుఁగుల రెండు మానవ హృదయముననే భావనలు చేయుట, దుఃఖి
గనునార్హము. ఆ నిశ్చయ సూచనమే 'బుస్సుననూఁదుట'. దుష్ట
శివార్చనయందలి భాగమే. కాని కాళము చేసిన పూర్వపూజలందు ఏనుఁగు
ఘోఁద్రోచుట జరిగెను. శత్రు నిబర్హణమను నిశ్చయ సూచకముగా
'బుస్సున నూఁదుట' జరిగినది. మొదటి దినమున రోఁజుచు బోయినది, రెండ
తదంతరాయజనితోన్మాదంబున పుట్ట దూఱినది. పగబట్టిన పాము బుస
మహావేగముగా పుట్టఁదూరుట యిది.

"తదంతరాయ జనితోన్మాదంబు" అనుదానిలో పామునకుఁగల్గిన క్రోధా
సూచితమగుచుండగా "జనితోన్మాదంబు" లోని రెండు దీర్ఘాక్షరములు తోకఁ
త్రాఁచును స్ఫురణకుఁ దేఁజాలినవై యొప్పుచున్నవి. 'దూఱుచున్' అన్న
పదము గనుక వేగమును సూచించుచున్నది.

ఆ మూడవనాఁడే పాము తొలఁగినట్టి తరువాత నేనుఁగేఁగుదెంచినది. ఆ క్రిందటి రెండు దినముల వలెనె (నిన్న మొన్నంటవలెనే) తన పూజ చెరఁగి చాలున్నవి. అప్పటి హస్తికొక విషయము తెలిసినది. ఇదియేదో శత్రుకృత్యమేయని. తనతో చలంబున (మచ్చరించి) యీ దురాత్ముఁడెవరో మరల తన పూజఁదొలఁగించి చాల నుంచి పోయినాఁడు. అచ్చము పాము భావించిన రీతినే యేనుఁగును భావించినది. దాని వలెనె శంకరుఁడు వగవానిఁగూడెనని సేవించినది. రంగురంగుల చాల యందేమి సౌఖ్యమున్నది? నీలములు కలువలవైన? పచ్చలు బిల్వ పత్రములగునా? కెంపు లెట్టితామరలగునా? ఆ కలువలకన్న గంధము, బిల్వ పత్రములకన్న మార్దవము, కెంపు లకున్న శైత్యగుణము ఈ చాలకెట్లు కలుగును? పోనిమ్ము పరమేశ్వరుఁ డెన్నఁడు నా చాలనెఱుఁగని వాఁడనుకొనుటకా వీలులేనిది.

ఆ పరమేశ్వరుఁడు నివసించు చోటే చాలగుట్ట, పెండ్లియాడినది కొండకూఁతుసు, చేతఁబట్టిన విల్లు కొండ, ఎక్కిన రథము చాలకు నిలయమైన భూమి. ఇన్ని విధముల సర్వత్ర సర్వదా చాలతో పరిచయమున్న వానికింకను చాల నలంకారములుగాఁ దాల్ప మనసెట్లయినది మొ, నేనుఁగున కబ్బురము కలిగినది. పామునకు వలెనె యేనుఁగునకును వ్రత భంగమైనది. అట్లు చాల పూజనంగీకరించిన పరమేశ్వరునిఁ దా నేమనఁగలననిన గజము పరుకుల యందొక విశేషము గలదు. పాము తన వ్రతము భంగమొనర్చుచుండఁగాఁ దాను మాత్రము పరమేశ్వరు నేమనఁగలనని పలికినది యేనుఁగు కూడ. ఆ దురాత్ముని యందును, భగవంతునకు వాత్సల్యము కలిగి యుండి యుండును. ఎవరికి వారు వారి వారి భక్తి శక్తుల కొలఁది భగవంతుని పూజింపవచ్చును కాని యొరుల పూజను, వ్రతము భంగమొనర్చుట దుష్టబుద్ధియేకదా!

ఇప్పుడిఁక నా దురాత్మునిఁగూర్చి చిక్కులి యాలోచించి ప్రయోజనము లేదని నిశ్చయమునకు వచ్చినది. ఆ నాఁటిఁక నెంత వేచియున్నను శత్రువు రాఁడు. తాను పూజా సమయమునకు వచ్చుటకు ముప్పే యూతఁడెవఁడో వచ్చి పోవుచున్నాడు గనుక,

మఱునాఁడు నట్టులే రాఁగలఁడు. తాను వచ్చునప్పటికి తన పూజ భగ్నమయియున్న నిఁకఁ దా నోపఁజాలదు. ఇన్నినాళ్ళను తన వ్రతమునకు హాని యొనర్చుచున్న శత్రునిఁజూడవలెను. లేవు నాతనిఁజూడకున్న ప్రయోజనములేదు. ఆ శత్రువునుఁ జూడ గల్గినచో తాను ధన్యవంతుఁడనయ్యెదనని యేనుఁగు భావించినది. "వాఁడో నేనో నొకజాడఁదోలెద"మన్నది. ఇనుఁగా గంటికిఁ గనుపట్టకున్న యా పగవానిపై నేనుఁగున కెంతటి వైరము గలదో తెలుపుచున్నది. ఊరక చూచుట కాదు గజము కోరినది, వైరము నశించిపోవలె. వైరమెట్లు నశియించును? ఇరువురిలో నొక్కరే మిగులుట. ఎవరిదో యొక్కరి వ్రతమే సాగవలె. వాఁడుగాని నేను గాని యని యన్నను, తానే మిగులవలెననియు, తన పూజయే కొనసాగవలెననియు హస్తి నిశ్చయము. శత్రువు కంటెఁదాను తక్కువైనయెడల బ్రతికి ప్రయోజనము లేదు. పోరాటమునఁ దాను మరణించినను బాగుండును. శివార్చన యందసువులు బాయుటకన్నఁ గోర దగినదేమి యుండును?

ఏనుఁగు భావించిన యీ భావము, తీసికొనిన నిర్ణయమునఁ గవి మానవ మనస్తత్వావిష్కరణముఁ గావించినాఁడు. మచ్చరపుఁబిచ్చలింపట్టిదే కదా! ఆత్మ ప్రత్యయమున్న ప్రాణి యీలాగుననె భావించును. ధైర్యము, దీక్ష కలవారికిఁ బ్రాణముమీఁద దీపుండదు. తనకుఁ బ్రాణముపైఁ దీపులేదు. శౌర్య ప్రకటనము గావించి వ్రతము సాగించుకొనవలెను. తానశక్తుఁడైనచో బరమేశ్వరునకుఁ బ్రాణము లిచ్చివైచెదనని దృఢముగ నిశ్చయించుకొని యేనుఁగు, యథావిధి పూజఁగావించి వెడలిపోయెను.

పాము, గజముల స్పర్థ, దుఃఖములును సమము. ఈ రెండును పరస్పరము పగదీర్చుకొనుటకు నిశ్చయముజేసికొన్నవి. మూఁడవనాఁటి రాత్రి గడవ వలసి యున్నది. ఎప్పుడు తెల్లవారునా? యెప్పుడు శత్రునిఁ జూడగల్గుదుమా? వైరి నెట్లంత మొందింతుమా? యన్న యాలోచనముల తోడనే పూజల యనంతరము వెడలిపోయినవి. రెండింటి భక్తి భావములు, పూజా విధానములుఁ బరమేశ్వరునకు నచ్చినవియే. కాన వా రెండింటి యర్చనల గైకొనుచు, వారి వైరస్వభావమునుఁ గమనించుమనే పరమేశ్వరుఁడు లీలావిలాసముగ నూరకున్నాఁడు. కాళహస్తుల మనోభావగరిమలను నరికి సరిగాఁ గవి యావిష్కరించియున్నాఁడు.

ఇరువురి తలంపు లొక్కరీతినే, ఇరువురి మనోవేదన యొక్కరీతినే. ఇరువురు పరమేశ్వరుని నిష్ఠూరములాడినవారే. భగవంతునియందలి భక్త్యతిశయము, భక్తులకు స్వాతంత్ర్యమిచ్చును. భగవంతుని సఖునిగా, సమునిఁగా భావించి చనవుకొలఁది పరిహాసమాడుట, నిష్ఠూరములాడుట భక్తులకు పరిపాటి. కాని యంతలోనె తెలివంది, తమ యనాగ్రహమునకుఁ బరమేశ్వరునిఁ బలికి ప్రయోజనములేదని తెలిసి, భగవత్కైంకర్యమునఁ దమ ప్రాణములర్పించుటకు సిద్ధపడుదురు. ఇద్దఱుఁ గాళహస్తుల విషయమట్టిదియే. సమానమైన భక్తి శక్తులు, శ్రద్ధాసక్తులు గల యీ రెండింటి మనోరీతియు సమముగనే యుండును గదా! కవీంద్రుఁడీ చిత్రణము నట్టులే కావించెను. అవి రెండును మూఁడవ నాఁటి రాత్రి పొందిన యావేదనయు సమమే యన్నట్లు కవీంద్రుఁడు రెండింటి మనోవస్థా చిత్రణమునకు సీసపద్యములనే యుపయోగించుట సముచితముగానున్నది. ఇక పాత్ర స్వరూప స్వభావములను గాని, యవస్థా చిత్రణమును గాని గావించుటకు సీసపద్యములే తగినవి.

ఆ రెండు ప్రాణులును నిత్యమొనరించు స్నానపానాదికములు, నాహార విహారాదికములను వీడి, శత్రువినర్దనమునే తలంచుకొనుచు రాత్రి వేగించినవి. ప్రాణవల్లభలతోఁగూడి విహరింపలేదు. శత్రువొకఁడుండి తన వ్రతమునకు భంగము గావించుచుండఁగా మనస్సు మనస్సులో నుండదు. కంటికిఁ గునుకు రాదు, పంటికి మెతుకు తగదు. ఇల్లు పట్టదు. ఇల్లాలు గుర్తుండదు. వేడుకలుండవు, కోరికలుండవు, ఒక్కటే చింత. అది జ్వరము వలె పీడించును. ప్రతీకారేచ్ఛ బలముగనుటచే కాలము గడచుచున్నట్లనిపింపదు. గడియ యొక యుగమనిపించును. తెల్లవాఱిననే గాని కార్యము చక్కఁబడదు. సూర్యుఁడానాఁడు నడుమ దున్నట్లే యుండఁడు. దివాకరుఁడస్తమింపఁడేమో యనిపించును.

“ఎపుడు పడమటి కొండపై నెక్కు భానుఁడెప్పుడుదయించు ? నేఁటోదు నెప్పుడనుచు” రెండును రాత్రిని శివరాత్రిగాఁ గడిపినవి. శివరాత్రిగా గడపుట మిక్కిలి కష్టముగా గడపుట కాదు. శివునిపై మనసునుంచి, రేయెల్ల మేలుకువతో నుండి శివార్చనచేయుట. మఱి యీ రెండు జంతువులును శివరాత్రి జాగరము చేసినవి. తానే శివునర్చింపవలయును, శివుఁడు తన పూజనే గైకొనవలెను, శత్రు వుండరాదను భావముతో నా రెండును రేయి గడపినవి. తెల్లవాఱుటతోడ దమ భవిష్యత్ నిర్ణయమాయెను.

ఈ ఘట్టమున సూర్యాస్తమయము, పెంజీఁకటి వ్యాప్తి. చంద్రోదయము, పండు వెన్నెలలు, తిరిగి సూర్యోదయములు సుందర సుభగములుగా వర్ణింపబడినవి.[1] ఈ వర్ణనలయందు గమనింపఁదగు నంశములు మూఁడున్నవి సూర్యాస్తమయోదయములు రెండును సీసపద్యములం దుత్ప్రేక్షింపఁబడుటయు దక్షిణ వర్ణనలన్నియు నెనిమిది వృత్తములందు సాగుట యొక విశేషము. ఇందుఁ గవీంద్రుని విష్ణు ప్రశంస, హరిహరాద్వైతములు గనుపట్టు భావములుండుట రెండవ విశేషము. 'కాల విష్ణుండంధకార హైత్యుని ద్రేయఁజరమాద్రిఁబడిపోవు చక్రమనఁగ'[2] నస్తమింపుచున్న సూర్యబింబమును, వర్ణించుటయందు విష్ణుప్రశంస కలదు.[2] చీఁకటిని, తారకలను, చంద్రుని వర్ణించుచు

"సకలాపూర్ణుఁడు నీలవర్ణుఁడనుటల్ సత్యంబుగాఁదెల్పు పో
లికఁ బెంజీఁకటి నిండఁదారకలు వొల్చె న్నిర్జరధీశ్వరా
దికు లర్పించిన పువ్వు లట్లభవుఁ డద్దేవుండు భేదంబు గా
మికిఁదెల్లంబుగ నల్పు దెల్పఁగ ధరన్ మించెన్ శశాంకాగతిన్."[1]

అనిన పద్యమున హరిహరాద్వైతభావమును వెల్లడించినాఁడు, కవీంద్రుఁడు! పూర్ణ చంద్రుని ధరించిన శివుఁడును, నీలవర్ణుఁడగు కేశవుఁడు నొకటేయనుట్లుగా నా రేయి యున్నదఁట. మొదటఁబెంజీకటి నిండియున్నది. నక్షత్రములు వచ్చినవి. క్రమముగా చంద్రుని రాకకో నంతయుఁదెల్లగాఁ బ్రకాశించెను. పెంజీకటి శివునకు, చంద్రకాంతి విష్ణునకుఁదోఁచుట విచిత్రము గదా! కాదు. నలుపే తెలుపు, తెలుపే నలుపయినపు డింక భేదమెచ్చట? విష్ణుని రూపమే (నీలవర్ణము) శివుఁడయి, శివుని రూపమే (తెలుపు) విష్ణువయినపు డిట్లు చెప్పుటయే సమంజసము. "శివాయ విష్ణు రూపాయ, శివ రూపాయ విష్ణవే, శివస్యహృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః" యనిగదా! ఆ యిరువురి కభేదము తెల్పుటకే కవి యిట్లు వ్యతిక్రమముగా నున్నట్లనిపించు రీతిని వర్ణించినాఁడు. "అభవుఁడద్దేవుండు భేదంబుగాదు" యనియు వాచ్యము చేసినాఁడు.

---

1. 'వర్ణనలు' అను ప్రకరణమున విపులముగ పరామర్శ జరుగును.

2. శ్రీ.కా.మా. 2అ – 128 ప

3. ,, ,, – 132 ప

విష్ణు ప్రశంస చేసినాఁడు, హరి హరాద్వైతము నిరూపించినాఁడు. అయినను ధూర్జటికి శివ భక్తి పారవశ్యము తగ్గలేదు, శివ కేశవులం దభేదము భావించినను, భర్తృహరి పలికినట్లు

"మహేశ్వరే వా జగతామధీశ్వరే
జనార్దనే వా జగదన్తరాత్మని
న వస్తుభేదప్రతిపత్తి రస్తి మే
తథాపి భక్తి స్తరుణేందుశేఖరే"[1]

ధూర్జటి మనసు తరుణేందుశేఖరుని యందే మొగ్గినదని యా తరువాతి పద్యము నిరూపించును.

చంద్రోదయముఁ గవీంద్రుఁడు శివపూజ యొనరించుట యనెడి.

"ఉదయగ్రావము పానవట్టు, మణిషేకోదప్రవాహంబు వా
ర్ధి, దరీధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీప ప్రభారాజి కౌ
ముది, తారా నివహంబు లర్పిత సుమంబుల్గాఁ, దమోదూరసౌ
ఖ్యదమై శీతగభస్తి బింబ శివలింగంబొప్పెఁ బ్రాచీదిశన్"[2]

అంతయు శివోపచారములు, శివార్చనము, శివ స్వరూపము. చంద్రుఁడే శివుఁడు. సోముఁడనఁగా చంద్రుఁడును, స + ఉమ — ఉమాధీశ్వరుఁడగు పరమేశ్వరుఁడును. చంద్రదర్శనము శివదర్శనమే. ఉపాసనావిధియందుఁ దొలుత సాధకుఁడు పొందునది చంద్రకళాదర్శనము. చంద్రకళా విద్య యనునది శ్రీ విద్యకు నామాంతరము. తూర్పుఁగొండ పానవట్టము, సముద్రమే యభిషేకోదకము, కొండ గుహలలోని చీఁకటియే ధూపము యొక్క ధూమము. వెన్నెలయే దీపముల కాంతి, చుక్కలే పరమేశ్వరున కర్పించిన పుష్పములుగా తమోదూరమై సుఖప్రదమైనది, చంద్రుఁడను శివలింగము. తమమునకు చీఁకటి, తమోగుణమని రెండర్థములు. చంద్రుఁడు చీఁకటినిఁ బాఱఁద్రోలును, శివుఁడు

1. భ.సు.వై.శ. 84 శ్లో
2. శ్రీ.కా.మా. 2ఆ – 133 ప

తమోగుణమును హరించును. తమోగుణమనఁగా నవిద్య, యజ్ఞానములు. చీఁకటి పోఁగొట్టిన సౌఖ్యమబ్బును. అవిద్య నశించుట, జ్యోతిని గాంచుటయు, పరమ సౌఖ్యప్రదమైన మోక్షలబ్ధియే యనదగును.

ఈ వర్ణన మనకు శ్రీనాథుని పద్యమొకదానిని స్ఫురణకుఁదెచ్చును.

సీ. కాదు కాదుదయాద్రి కనక కూటంబిది
　　దంబైన పానవట్టంబు గాని
కాదు కాదిది సుధాకర పూర్ణబింబంబు
　　కాశ్మీర శంభులింగంబుగాని
కాదు కాదుదయరాగ ప్రకాశంబిది
　　నవకుంకుమా లేపనంబుగాని
కాదు కాదిది కళంకచ్ఛటారించోళి
　　పూజ చేసిన కల్వ పువ్వుగాని
తే. యనఁగ నష్టార్థవములు మిన్నంది కొనఁగ
ఇంద్రకాంతోపలంబులు జాలువాఱ
ననమశర సార్వభౌము ముత్యాల గొడుగు
విధుఁడు విశ్వంబు వెన్నెలవెల్లిఁదేల్చె[1]

"దంపతుల కింపుల్మిఁగా"[2] నుదయించిన చంద్రుఁడు 'దప్పకళాస్త్ర నిరూపితౌషధ క్రమములఁబండు వెన్నెలలు'[3] పాము నేనుఁగుల మనముల నేవిధమునుఁ బ్రభావితము గావింపలేక పోయినవి. వానికి విరోధ వహ్ని సహింపగ రానిదయ్యెను. ఏనుఁగు 'పిడియేనుఁగుల వెంటఁ' బడలేదు.[4] పాము 'ప్రాణనాయిక తోడం బర్యంకసీమల నుసకానఁబెనఁగ' లేదు.[5] ఎప్పుడు తెల్ల వాఱును, పగనెప్పుడు తీర్చుకొందునను నా రెండు నారాత్రి నెట్టులో వేగించినవి.

---

1. భీ.పు — 2ఆ 32 ప　　2. శ్రీ.కా.మా. 2ఆ 134 ప
3. శ్రీ.కా.మా.— 2ఆ 136 ప　　4. ,, ,, 125 సీ.పా!
5 శ్రీ.కా.మా. 2ఆ 119 సీ,4 పా

అది నాల్గవ దినము. కర్మసాక్షి యుదయించెను. సూర్యునిఁగర్మసాక్షియని పలుకుట యిట సాభిప్రాయము.

"పన్నగంబు, గజము, బలమునఁజలమునఁ
బోరుటెట్లొ? శివునిఁబొందుటెట్లొ?
చూడవలయు'ననుచు వేడుకతో వచ్చు
కరణి నంతఁదోఁచెఁగర్మసాక్షి"[1]

తెల్లవాఱుచుండగనే పాము, శత్రువుఁజంపుటకు బయల్వెడలిన కటారుకాని వలె పూజాస్థానముఁజేరినది. తాను భావించినట్లే తన పూజ తొలగఁ ద్రోయఁబడి యున్నది. అచ్చట పాముపడిన మనోవేదన, చేసిన నిశ్చయముల తీవ్రతను స్పష్టపరచుటకుఁగవీంద్రుడు కంద పద్యమున 'ట' వర్ణావృత్తిఁగావించెను.

"కటకటఁబడి, యిఁక నెటువలె
నటుకానీ, వానిఁదీర్తు నటు కాదేనిన్
నిటలాక్షున కర్పింతుం
జటులగతిం బ్రాణములు నిజంబుగ' ననుచున్"[2]

ఏమి కానున్నదో కానిమ్ము. పగ వానిని జంపుదును, లేదా ముక్కంటికి ప్రాణమిత్తునని పాము భావించినది. ఈ నిశ్చయము గజ మీవఱకె చేసికొనియున్నది. 'వాఁడో నేనో నొక జాడఁబోయెదము, లేదా జీవిమింకేటికిన్, అని భర్గునకుఁ బ్రాణము లిచ్చువాఁడనిన యింతలకీఁక సందియములేదవి నిశ్చయించుకొనియేయున్నది.

పామునకొక వింత శక్తియున్నది. కొంచెమై యడఁగి యుండఁగలదు, పెంచుకొని సాగగలదు. కొమ్మలు రెమ్మల నడుమ డాఁగియుండి, శత్రుని చూడవలె, తాను శత్రుని కంటఁబడరాదు. కాన "పిన్నరూపమగుచు బిల్వ శాఖాంబుజ నాళ మధ్య సీనుఁ గాళనాగ"[3] మడఁగియుండినది.

1. శ్రీ.కా.మా. 2ఆ — 139 ప
2. ,, ,, — 142 ప
3. ,, ,, — 143 ప

పాము హృదయమునకు బాధకలిగించునట్టియు, నిన్నటి దినమును తానొనరించినట్టియు పూజ ముందు చెడిచి, నేఁటి మొగలేటినీటితో, క్రొంగ్రొత్త నీరేరుహ మాలూర దళములతోఁ బూజసేయు తలంపున నేనుఁగు తొండము సాచినది. అందునకే గద పాము పొంచిచూచుచున్నది! అట్టి యవకాశము కలుగుటయున్న, భర్గుఁడా నాఁడు తన ననుగ్రహించె నన్నమాట. వెంటనే యేనుఁగు ముక్కుఁగ్రోళ్ళలోఁ బాము దూఱినది.

ఏనుఁగునకు మతిపోయినది. ఏదియో ప్రమాదము రానే వచ్చినది. తన తుండములో నేదియో ప్రవేశించి కలవరపరచుచున్నది. ఇప్పటికి రెండు ప్రాణులకు నొక నిశ్చయ స్థితి యేర్పడినది. తొండములోఁ బ్రవేశించుట, తనకిఁక బయటకు వచ్చు త్రోవ యుండదని పామునకు తెలియును. లోనప్రవేశించిన పాము వలనఁదనకుఁ బ్రాణ ప్రమాదమున్నదని యేనుఁగునకు ననిపించినది. శివార్చనయందుఁ బ్రాణత్యాగమునకు రెండును సిద్ధపడి యున్నవి. అయినను ప్రయత్నము సేయకుండుట జీవి లక్షణము కాదు. మకరి ముఖమునఁ జిక్కిన కరి వోలెనే తన ప్రయత్నము గావించి దిక్కుతోఁచక వైకుంఠునకుఁ గుయ్యిడినది. ఇప్పటిఁ గరి తన ప్రయత్నము విఫలమనోరథమై పరమేశ్వరునకుఁ బ్రాణమర్పించినది. అప్పటి యేనుఁగునకు శత్రుమర్దన మసాధ్యమని తన యశక్తతకుఁ జింతించుచు మొఱయిడినది. ఈ గజమట్లు కావున, తానెట్లును జావక తప్పదని యెఱిఁగి, 'చంప చచ్చుట జనాహ్లాదంబుగదా' యని వితర్కించి, దానిని చంపుటకుఁ బూనినది. కుంభస్థలములో ప్రవేశించిన పామునుఁ జంపవలయుననిన తన కుంభస్థల విదళనమె మార్గము. అనఁగాఁ దాను చావక తప్పదు. ఒరులచే నూరక యే చచ్చినదాని కంటె, నొరులను జంపుటలోఁ దాను చచ్చుట పౌరుష లక్షణముగదా! అది వీరలక్షణము. వీరలక్షణమును జనులు హర్షింతురు.

సముఁడైన శత్రువుతోఁ దలపడినపుడు వీరుఁడు ధావించు తీరిది. ఇది మానవ మనస్సంఘర్షణకుఁ బ్రతిబింబమైన యాలోచనము. కాని యీ పాప పరమేశ్వరుని సన్నిధిగాన నేనుఁగునకు మఱింత యుత్సాహము కలిగినది. దక్షిణకైలాస పర్వతమునే వధ్యశిలగా శత్రువును, తనను బలి యీయఁదలఁచినది. పరమేశ్వరుని వాసమగు నా దక్షిణకైలాస పర్వతమును వధ్యశిలగా బలియొసఁగుట తనకే కాక, తన

శత్రువునకు ముక్తి గలిగించుట తనకు భాగ్యమని యెంచినది హస్తి. తన పూనిన యీ పనికి మొలుత నేనుఁగు పరమేశ్వరునకు మ్రొక్కినది. మ్రొక్కుటయనఁగా తలవంచుట, చేతులెత్తుట గదా! ఏనుఁగు తొండమెత్తినది యనగా కుంభస్థలములో నున్న పాము పైకి దూసుకొని బయటకు వెడలిపోవునేమొ? కాన తుండమును చుట్ట చుట్టినది. తొండమునందలి యే కన్నముగుండ గూడ పాము బయటకు వెడలుట కవకాశములేకుండఁజేసినది. ఆ చుట్టిన తొండమును కుంభస్థలమునఁజేర్చినది. అది పరమేశ్వరునకు నమస్కారము. మోమునఁ జేతులు చేర్చుట. వెనుక కేఁగి, తల వంచి, వేగముగా ముందునకు పరుగులిడి, కొండను ఢీకొన్నది. ఆ కొండకొమ్ములు విరిగినవి. ఆ ఏనుఁగు తల వ్రయ్యలైనది. కొండ విరిగినదనఁగా నేనుఁగును కొండవంటిదే.

"కొండ కొండ తోడ గుండులు గూలంగ
దాఁకినట్లు దోఁచె, దళిత కుంభ
సీమనున్న పాము చిదిసె, నేనుంగును
బడియె, నెత్తురచటఁబడియకట్టె" *

పగిలిన యేనుఁగు తలనుండి పాము చిదిసి పడిపోయినది. "చిదియు" నను పదము మహాబీభత్సమగు రూపము పొందుటను దెల్పును. పాము రూపరేఖలు గర్తించుటకు వీలుకానియట్లు పచ్చడియయినది. కొండవంటి యేనుఁగు తల బ్రద్దలయ్యెను, గాన నెత్తురచ్చట మడుఁగు కట్టినది.

తొండమునుండి తలలోనికిఁ బ్రాకిన పామువలన యేనుఁగు పొందినబాధ, దానిని వెలికిఁజిమ్మఁజేసిన ప్రయత్నము వస్తు స్వభావ సహజ సుందరమైనది. దయనీయమైన దాని స్థితికిఁ బాఠకుల మనస్సు నారాటపడునట్లు చేయుటకు చూపిన నేర్పిది.

ఆకస్మికముగా ముక్కులోనికేగిన యొక్క సూక్ష్మజీవి వలన మానవుడెంత యారాటపడునో, దాని నుండి విముక్తి కెంత ప్రయత్నము చేయునో యంతయు నేనుఁగు పడినది. చేసినది ఒక్కొక్కతరి నొక యాలోచనము మెదడునఁ బ్రవేశించి, చికాకు పడునట్లున్నదిది.

---

* శ్రీ.కా.మా. 2ఆ — 151 ప

'మరణాంతాని వైరాని' యన్నట్లా రెండు జీవులును విగత జీవులగుటతో వైరము ముగియునది. ఆ వైరము మరణాంతకమైనట్టిది.

శివార్చనమునఁ బ్రాణమురిచ్చుట, శివార్చనమును భంగము జేసిన వారిని మారిమసంగుట వీర శైవులకు ధర్మము. ఇది యిట్టిదని పాలకుర్కి-వారి బసవ పురాణము, పండితారాధ్యచరిత్రలు పలుకుచున్నవి.[1] మడివాలు మాచయ భక్తుఁడిట్టివాఁడు.

'.............................. భవులు
శరణుల వస్త్రముల్ సంధిల్లి రేని
నోడఁజాఁబోడుతుఁజుండో'యని ఘంట
నాడాడ వ్రేయుచుఁగూడ జాటుచును......' 2
'పణితెంచుచో ముట్టుపాటైన నాకని
నణిముఖీఁజంపి మాచయ్య యున్నెడను' 3
వింతవాఁడొకఁడు మున్వినమిఁగాఁజేసి
సంతకుఁబోవుచో సంధిల్లినంతఁ
భాడిచి మీఁదికిఁజిమ్మెఁ; బొందియునచట
బొడలేదు: మ్రింగెనో! పోయెనో ధివికి 4

చెలఁది వృద్ధను తన శివార్చనకు భంగము కలిగించినది దీపశిఖయని గవా దానిమీఁదఁబడి మ్రింగఁబోయినది. 5

ఆ కాళహస్తులు రెండును, మరణించిన క్షేత్రము, తీర్థముల మహిమ వలన రుద్రగణాకారములఁజెందినవి. ఇట తీర్థ క్షేత్రమహిమ యుగ్గడించినట్లయినది.

---

1. బ.పు. సంక్షిప్తము. పీఠిక - పుట XIV 2వ పేరా 11, 12 పంక్తులు
2. ,, 4ఆ పుట 134 పంక్తులు 31, 32, 33
3. ,, ,, పుట 134 పంక్తులు 51, 52
4. ,, ,, పుట 135 పంక్తులు 69, 70, 71, 72
5. శ్రీ.కా.మా. 2ఆ - 101 ప

కొండలజేని కూరిమి కూఁతుతోడం గూగి చంద్రచూడామణి వృషభ వాహనారూఢుఁడై ప్రత్యక్షమై, వరములు వేడుఁడనుటయు, రుద్రగణాకారు లయిన యా కాళహస్తులు చేసిన నతులు, కోరిన వరములు తీర్థక్షేత్రస్వామి మాహాత్మ్య వర్ణనమును, భవపరాఙ్ముఖత్వమునుఁ దెలియజేయుచు, ధూర్జటి కవీంద్రుని క్షేత్ర పరిచయ జ్ఞానమును, ఆరాధనా వైవిధ్య మత తత్త్వ ప్రతిపాదనమును, భవపరాఙ్ముఖత్వమును వెల్లడించుచున్నవి. నిఖిలాగమముల నేర్పరులైనను శివమ్మక్తులు కారనియు, భగవంతునిఁ గొందరు సోఽహమ్మని కొలువగాఁ, గొందఱు దాసోఽహమ్మని సేవింతురు. కొందఱు మంత్రముల జపియింపగా, కొందఱు యోగములఁదపియింతురు. పరమేశ్వరుని సేవించిన వారు తక్కిన నీచులను గొల్వరు. ఈశ్వరు శరణు వేడినవారు పరులవంచ నిలువరు. ఈశ్వరుఁడను పెన్నిధిఁగాంచిన ధన్యుఁడు వేఱర్థముఁ గోరఁడు అభవుని పాదపంకజములఁ గొల్చుకున్న భవదుర్వాసన పాయదు. ఆ యీశ్వరుని రమావాగ్దేవీవల్లభులే వర్ణింప నేరరన్న నిఁక తమకు సాధ్యమగునా యన్నవి కాళహస్తులు.

'ఈ సంసారపయోధి లోనఁబడి మే మీఁదీఁధి దేహంబుపై
నానల్మానక తేలుచు న్మునుఁగుచుం, బ్రాణప్రయాణోన్ముఖా
యాసంబు ల్కతసంఖ్య లోర్చితిమి ! దేవా ! మమ్ము రక్షించి, మి
థ్యాసౌఖ్యంబులు చాలు, నిత్యసుఖ మిమ్మా![1] యంచుఁ బ్రా
ర్థించినవి.

ఇది ధూర్జటి కవీంద్రుని మొఱయును. మిథ్యా సౌఖ్యము లిఁకఁజాలును. దేహంబుపై నానల్మానంత కాలము సంసారపయోధిలో నీఁదీఁదక తప్పలేదు. ఆశాపాశములు కోసిన వెనుకఁ గోరఁదగినది నిత్యసుఖమే. జనన మరణాత్మకమగు నీ సంసారమక్కఱలేదు. దేహముపై మోహమువీఁడి, శంక దొలంగి భక్తిపూర్వకముఁ గోరెనుగానఁ బరమేశ్వరుఁడా రెండింటికి 'తన సర్వవ్యాపక జ్యోతిలో సాయుజ్యం బొన' గూర్చినాఁడు.[2]

1. శ్రీ.కా.మా. 2ఆ–154 ప 2-శ్రీ.కా.మా. 2ఆ-155 ష

చెలఁది పురుగునకుఁ[1] గాళహస్తులకు[2] సాయుజ్యమిచ్చుటచేఁ బరమేశ్వరున కప్పటివఱకు లేని, రాని క్రొత్తపేరొకటి కలిగినది. అంతవరకు నతఁడు పరమశివుడు, షడాధారజన్మహాలింగరూపి, శివుఁడు. ఇంతటినుండియు, నాతనికి శ్రీకాళహస్తిపతి[3] యనుప్రసిద్ధి గలిగినది. ఆ నాఁటినుండియే జగన్నాయకునకు 'శ్రీకాళహస్తీశతా ప్రాచుర్యము'[4] గలిగెను. ప్రబంధనామ సార్థక్యమిచటఁ జేకూఱినది.

ఈ యధ్యాయమున రెండుభాగములుగా గల క్షేత్రమాహాత్మ్య వర్ణనమునఁ గవీంద్రుఁడు కొన్ని విషయములను చిత్రముగఁ బలుకుట గమనింపగలము. సరస్వతిని సుధాబ్ధింబోల్చుట యందలి కవితా పారమ్యము మాత్రమే గాక తన యుపాసనమగు శ్రీ విద్యకు వ్యాఖ్యానప్రాయముగాఁ బలికి యున్నాఁడు. బ్రహ్మకు 'శతానంద' నామసార్థక్యప్రతిపాదనము చమత్కారావహముగనుండి పాఠక హృదయముల నలరించుట యటుండ, నాసా విలసనము బలుకుట యందలి విశేషము. ప్రత్యక్ష సిద్ధాంతులైన చార్వాక వాద ఖండనమొనర్చియున్నాఁడు కవి. తాను నిరూపించనున్న క్షేత్ర మాహాత్మ్యమున తొలుత నలువనేఁ బలికించుట యీ కథావిశేషము. బ్రహ్మదిత వానికి దోష దేయ మపహరించి, సుపుత్రావాప్తిఁ గలుగజేసిన దీ క్షేత్రము.

ఈశ్వరునిఁగూర్చి క్షేత్రమునఁ దపమాచరించియో, వ్రతముగా సేవించియో సాయుజ్యము బొందిన యాఱుగురు భక్తుల చరితములు, షట్చక్రారూఢ యగు శ్రీ విద్యారాధనమున, షట్చక్రములకు మూలముగ బ్రహ్మదండి యయినట్లు, బ్రహ్మ కథచేఁ జారితార్థములగుట గమనార్హమగు నంశము.

చెలఁది వలన సంసార చక్రప్రవర్తనము, కాళహస్తుల వలన స్పర్ధ, సమర్పణములను నంశములను బ్రతిపాదించుచు, ప్రాణలింగ పూజనాఘ్నము సాధించు శత్రు సంహారోద్యమయలి వలన భక్తుల వీరశైవ భక్తిని నిరూపించెను. వీరశైవ భక్తుల చరితము గథనమొనర్చుచునే గవీంద్రుఁడు తన వ్యక్తిత్వ ప్రతిపాదకమయిన శివాద్వైతమును, శ్రీవిద్యోపాసనమును స్పష్టముగా నిరూపించెను.

---

1. శ్రీ.కా.మా. 2ఆ - 107 ప
2. ,, ,, - 155 ప
3. శ్రీ.కా.మా. 2ఆ - 156 ప
4. ,, ,, - 91 ప

చెలది పలికిన 'సమయసంగతి' యను శబ్దముచే 'సమయాచార' 1 మను శ్రీవిద్యను వ్యంజింపఁజేసినాఁడు కవీంద్రుడు దానికుపబలకముగా దర్శనరతులను శబ్దప్రయోగము చేసి యున్నాడు.

చంద్రబింబమును శివలింగముగా రూపించి శివపారమ్యము ప్రతిపాదించు చున్నప్పటికిఁగవీంద్రునకుఁగల శివాద్వైతము బ్రకటించుటకు 'సకలాంహూర్ణుఁడు నీల వర్ణుఁడమటల్.... అభవుఁడస్థేవుండు భేదంబుగామి'ని కంఠోక్తిగాఁబలికియున్నాడు ధూర్జటి. కాళహస్తులచేఁ బరమేశ్వరుని మతింపఁజేయుటయందుఁ, దనకు గల వివిధ మత రహస్యావగాహనముఁదత్ఫలితమయిన పరిణతబుద్ధిఁబ్రకటించి యున్నాఁడు కవీంద్రుఁడు.

ఆశ్వాసాంతములందు ధూర్జటి రెండు విధములగు విశేషములనుఁబ్రయో గించుట పరిపాటి. తన శైవయుక్తికమగు భవ పరాఙ్ముఖత్వ ప్రకటనమొకటి, ముందు రామన్న కథాంశ సూచనము రెండవది.

'కామక్రోధ మదాంధకారపట లాఖండప్రచండార్క....' ఇత్యాది విశేషముల వలన తన భవపరాఙ్ముఖత్వముమఁబ్రకటించెను. 'చిద్విద్యాఘంటాపథచర' యనుట యందుఁదన శ్రీవిద్యార్చనమును వెల్లడించెను.

'తారక ఘంటారవ హృతమనోమృగవ్యాధేశా'![2] యనుటయందు నాదోపాసన మును స్ఫురింపఁజేయుమ, 'వ్యాధేశా' యనుటచే, రామన్న యాఖ్యానము నందలి తిన్నని కథా సూచనముమఁజేయుచున్నాఁడు కవీంద్రుడు,

1. 'సమయ' అను చంద్రకలయొక్కయు, 'సమయుని (శ్రీకంఠుని) యొక్కయు పూజను సహస్రార కమలమునందు చేయుట 'సమయమతము'. 'సమయ'యనఁగ వేదమని అర్థము. శ్రీదేవి వేదమునందు అర్థరూపముగ నున్నది. ఆమెకు 'సమయా' యను నామము కలిగినది. శ్రీదేవిని వేదార్థరూపమున భావించుట 'సమయ మతము'. వేదవిహితాచారము, సమయతము. వేదసమ్మతముగా శ్రీచక్రార్చ నాదులు బాహ్యపూజ రూపమునందు జరుపుట దక్షిణాచారము. ఈ ఆచారమున కామేశ్వరీ కామేశ్వరులు దేవతలు. దక్షిణామూర్తి ఋషి, వేద సమ్మత రాజోప చార దేవోపచారములు.

శ్రీ చక్ర విలసనము - 224, 225, 226 పుటలు ఆధారముగా.

2. శ్రీ.కా.మా. 2ఆ - 132 3. ఘంటానాదము - పారిభాషిక పద నిర్వచనాను బంధమునఁగననగును.

# తృతీయాశ్వాసము

పూర్వాశ్వాసములందు వలెనే తృతీయాశ్వాసమునను రెండు కథాభాగములు గలవు. ఇందు ముప్వురు శివభక్తుల చరితములు గథితములైనవి. మొదటి భాగమున తిన్నని కథయందు తిన్నఁడు, శివగోచరుఁడను హరద్విజుఁడును, రెండవ భాగమున సత్కారకవీంద్రుఁడును పాయుజ్యమందుటఁ బలుకఁబడినది.

ప్రారంభ పద్యమున శివాతిశాయిత్వమును ప్రకటించియున్నాడు.

'శ్రీధరనయనార్చ సమా

రాధిత దివ్యాంఘ్రిశోణరాజీవ!....' యని శివుని సంబోధించుట యది. దేవీ భాగవతమున, పూర్వ పురాణకథలందు నీ కథయున్నది. నన్నెచోడని కుమార సంభవమున నీ ప్రసక్తి కలదు.

'హరినేత్రాంబుజ మంఘ్రిపీఠ మజు హస్తాబ్జంబు ....1

బసవపురాణమున నీ ప్రసక్తి కలదు.

'పెన్నుండు దా నిత్య వేయుదామరల
నున్నతిఁబూన్ప నందొకటి లేకున్నఁ
గన్నప్డు వుచ్చి శ్రీ కంఠుఁబూజించి,
కన్నును నాఁటి చక్రముఁబడయండె?2

శ్రీనాథుఁడును తన భీమేశ్వర పురాణమునఁ పేర్కొనియున్నాఁడు.

'శైలభవవిరోధి భక్తిర
సాటోపంబెసఁగ వనరుహాలోకన ము
ద్ఘాటించి భీమనాథుని
హాటక పదపీఠి లోచనాబ్జముఁబెట్టెన్.' 3

శ్రీ కాళహస్తీశ్వర శతకమున నీ యంశమును ధూర్జటి స్మరియించియునాఁడు.4

---

1. కు.సం.-7ఆ-18ప 2. బ.పు. సంక్షిప్త 6ఆ-221 పు పం. 676-680

3. భీ.పు. 6ఆ-67 ప 4. శ్రీ.కా.శ. 104 ప (1523 తాళపత్ర)

శివభక్తులచరిత్రములను స్వీకరించుటయందు ధూర్జటి కవీంద్రుఁడొక ప్రణాళిక ననుసరించెనని లోలుతనే భావించియుంటిమి. మొదట చెలఁది పురుగు, తరువాత బాము నేనుఁగుల భక్తి భావములను వర్ణించి, తదుపరి మానవులందు అనా గరకుఁడు, ఉగ్రహింసాజీవనుఁడు నయిన తిన్నఁడు, ఆగమవేత్త పూజారియగు శివ బ్రాహ్మణుల కథలను రెండింటిని జోడించి పలికినాఁడు, ధూర్జటి.

పరమశివుఁడు వేదవిహితాచారులగు భక్తుల నెట్లు గరుణించునో, యట్లే 'శ్రుతివ్యవహారేతర మతమున'[1] నర్చించిన భక్తులను గూడఁ బ్రోచునను శివధర్మ రహస్యమును ప్రతిపాదించుట యీ మొదటి కథా భాగ సారాంశము. ఈశ్వరునకుఁ గావలసినది మహాభక్తిపరుఁడై సేయునర్చనమే కాని, భక్తికి శక్తికి కొలఁదులు లేవని యీశ్వరుని యీ వాక్యార్థము.

తిన్నని కథా కథనమునఁ గవీంద్రుఁడు ముగ్ధభక్తిని రూపు కట్టినాఁడు.

'నిక్కమీశ్వరునిఁగాని నిజమెఱుఁగమిని
ముక్కంటి భక్తులు ముగ్ధులు గారె'[2]

'స్వచ్ఛమైన వాత్సల్యము, పారవశ్యముతో గూడిన భక్తిభావము, వెన్నవంటి హృదయము, శివుని గాంచినంతనే ఆప్తుని వలె, మిత్రునివలె, పుత్రునివలె భావించి ముగ్ధభావముతో గీర్తించి, సేవించి, లాలించెడి, స్నేహ స్వభావము వారికి వెన్నతోఁ బెట్టిన సుగుణజాలము. వీరు శివుని కొఱకై ప్రాణములనైనను త్యజింప సిద్ధమై త్యాగోత్సాహభక్తి వీరులై యొప్పువారు.'[3]

శ్రీ కాళహస్తులు, తిన్నఁడు, శివగోచరాంకుఁడను భక్తులయిదుగురును ముగ్ధ భక్తులై, శివార్చనా విధియందుఁ దమ ప్రాణములనైన నర్పించుటకు సిద్ధపడిన వీర శైవులు. మిగిలిన నత్కీరుఁడు, వాలి, వేశ్యాతనయలు శివునర్చించిన శివభక్తులు. ప్రాణత్యాగమునకైన సిద్ధపడిన వీరభక్తుల చరిత్రముల నయిదింటిని గ్రహించుట యందుఁ గవీంద్రుఁడు శివతత్త్వమును 'పంచముఖానుకూల'[4]మనినట్లు, పంచముఖ ఘనారాజన్మహాలింగార్చ[5]నమును సూచించుటయా యని భావింపఁదగియున్నది.

---

1. శ్రీ.కా.మా. 3అ — 103 ప  2. బ.పు.సం.పుట 93. పం. 451 — 452

3. బ.పు.సం. పీఠిక పుట xi[1] — రెండవ పేరా  4. చూ.పారిభాషిక పదానుబంధము

5. శ్రీ.కా.మా. 1అ — 112 ప

తిన్నని కథ :

ఈ తిన్నని కథ పూర్వ గ్రంథములం దుదాహృతమై యున్నది. శైవ కావ్యములకు నాది గ్రంథమగు బసవ పురాణమున 'ఉడుమూరి కన్నప్ప కథ'[1], వర్ణింప బడినది. తుదను కన్నప్ప కథను ముగ్ధుని కథయనినాఁడు, సోమన. కావునఁదొల్లి ముగ్ధ స్వభావులను, 'దేవుఁడు కృపచేయుఁడెల్ల మిట్లనుచు పృథివి నీ ముగ్ధుల కథలు వాఁజెప్పఁగవలెమ్మె'[2]. పూర్వకావ్యేతివృత్తమును బసర్గ్రహణమునఁగల విశేషాంశములను గమనించినపుడుగాని, మనకవి ధూర్జటి విశిష్టత గోచరింపదు. పాల్కురికి సోమన పలికిన కథను, ధూర్జటి చెప్పిన కథను బ్రధానముగా గోచరించు భేదములను ముందు పరిశీలింతము.

1. సోమన కన్నప్ప కథను 'ఉడుమూరి కన్నప్ప' వేటకు బయలుదేరుటతోఁ బ్రారంభించినాఁడు. ధూర్జటి యంతటి ముగ్ధుడైన పరమ శివభక్తునిఁగన్న తలిదండ్రుల వృత్తము, తిన్నని జననములను, విద్యాభ్యాసము, వేఁటాయత్తమగుటయును వర్ణించినాఁడు.

2. సోమన కన్నప్పగాను కథఁబలుకఁగా ధూర్జటి 'తిన్నఁడు'గా వర్ణించి, తుదకు 'కన్నప్ప' యను పేర్వడుటను తెలిపెను.

3. స్వప్నమున నీశుఁడు రుద్రచిహ్నాలతోడ గనుపట్టి శ్రీ కాళహస్తీశునికిఁ దెలిపి యాతనినిఁగొల్వుమీ యని యంతర్థానమైనాఁడు.

ఈ యంశము రెండుకావ్యముల నొకేవిధముగా నున్నది. సోమన కేవలము రుద్రచిహ్నాలని పలుకఁగా, వానిని ధూర్జటి వివరముగాఁబలికియున్నాఁడు.

'ఒడలెందెల్ల విభూతి పూఁత, పులితోలొడ్డాణ ముల్లాడు కెం
జడ, లాత్మైక్య విచార నిశ్చల దృగబ్జాతంబు, లచ్చైన క
చ్ఛడ, మంసంబున రుండమాల, గళదేశస్థాణువుం గార్లెఁగా
నొడయుండొక్కరుఁ డక్కుమారు కలలోనుద్యత్కృపామూర్తియై'[3]

1. బ.పు.సం. 3ఆ – పుట 103–733
2. " " – పుట 122–1273, 74, 77, 78
3. శ్రీ.కా.మా. 3ఆ–55 ప

అట్టి కన్నప్ప కడలి శ్రీ కాళహస్తగిరిని జేరగా, నిటు దిన్నడు వేటయం చేకలమొకటి వెంబడింపగ శ్రీ కాళహస్తీశుని గాంచెను. అటువంటి కొండ దరిలో నొంటిగా నుండిన శివుని జూచి కటకటబడిన యాతడు, తన యుడుమూరికి రమ్మని యీశ్వరుని బ్రార్థించినాడు.

4. సోమన పలికిన, కన్నప్ప యారగింపజేసిన మృగములు పూర్వవృత్తము ధూర్జటి తెలుపలేదు.

5. ధూర్జటి తిన్నని తోడిమొటుకులు గృహమునకు రమ్మని ప్రార్థించుటయు, నాతడు తిరస్కరించుటయును చెలిపెను. సోమన కన్నప్ప తోడెటుకుల నట పదలిపైచెను.

6) ప్రాణలింగమునుబాసిపోనని నిశ్చయించిన కన్నప్ప పలెనె, తిన్నడును 'ఏవంక నభవుండుండిన నా, వంకనె తోడునీడమై వసియింతు' నని నిశ్చయించుకొనినాడు. నివేదనము సాధారణముగనేయున్నది. కలకుట్లు ఖండించుట, పచనము సేయుటలను సోమన బలుకగా, ధూర్జటి యా వివరణము జోలికి పోలేదు.

7) కన్నప్ప కథయందు 'ముసుగొల్పు తపసి' తిన్నని కథయందు శివగోచరాంకుడని శివబ్రాహ్మణోత్తముడని పేర్కొనబడెను. శివుని గుడి రెండవ నాడు సంగిలిమంగలముగా నున్నందులకు కన్నప్ప కథయందలి తపసి చింతించుట యందు చెంచు, ఏనుగుల కథలను దలచెను. తిన్నని కథయందు శివగోచరుడనేకులయిన పూర్వ శివభక్తుల గాథలను స్మరించి శివుని మెత్తిపొడుపుగా పలికెను. ఆ తపసి అమార్గమును బట్టిన యాభక్తుని జంపుదుననినాడు. ఈ శివగోచరుడు పాపాత్ముని జెప్పకున్న శివునికై కూడుగ్గిబట్టి ప్రాణము విడుతుననినాడు.

తపసి భావించిన చెలది, ఏనుగుల కథ కన్నప్ప కథయందు మరియొక విధముగానున్నది. ధూర్జటి కావ్యమున కాళము నేమగులు స్వర్తించి యొండొరుల జంపుకొని సాయుజ్యమందినవి. సోమన కన్నప్ప కథయందు వేరొక రీతిగా, చెలది ఏనుగులు పోరాడినవి. అచట చెలది, ఇచ్చట పాము రెండును ఏనుగు తుండమును బ్రవేశించినవి. కాని చెలది ఏమగును చంపగలిగినది. పాము లోన చిక్కువడి, ఏనుగు కొండను దాకుటతో నాసను మృతి జెందినది.

8. కంటికిఁగన్నిచ్చు వృత్తాంతము రెంటను సమమే. తపసికి కన్నప్ప ముగ్ధత్వమును బ్రకటింపదలచినాఁడు శివుఁడచట. ఇచ్చట శివుఁడు శివ బ్రాహ్మణునకు విన్పించునట్లు తా నాకిరాతుని బరీక్షించి చూడుమని పలికెను.

9. కన్నప్పనుఁగౌఁగిటఁ జేర్చుకొనఁగోరిన విధముగాఁ దనలోఁగలిపికొనినాఁడు, శివుఁడచ్చట. తపసి కన్నప్పను వినుతించెను. అంతియే. ఆ తపసి గతి యేమాయెనో తెలుపలేదు. ఇచ్చట ఇరువురకును శివుఁడు సాయుజ్యమిచ్చెను.

ఇప్పుడిఁక ధూర్జటి కవి కావించిన మార్పుల వలనఁ జేకూరిన ప్రయోజనముఁ బరిశీలింతము.

1. తిన్నని జనన వృత్తాంతము వివరముగ వర్ణించుట యందు ధూర్జటి తన కావ్యమును బ్రబంధముగఁ దీర్చు దృష్టి ప్రధానము. ప్రబంధోచితములయిన 'శివభక్తిమయుఁడైన శిశువుగా' జన్మింపనున్న తిన్నని తల్లిదండ్రుల ప్రాభవమును, జన్మభూమిని వర్ణించుట, ధనుర్విద్యాభ్యాసము, కాచేరిని జాతర, వేటసంరంభముల వర్ణించుట, శివుని గాంచి నిలిచిపోయి, సేవించి, తరించిన తిన్నని కథను ఒక ప్రబంధముగాఁ దీర్చుటకునై యింతగాఁ బ్రపంచించినాఁడు కవి.

2. తిన్నఁడు ముక్కంటికిఁగన్నిచ్చి కన్నప్ప యగుటను ధూర్జటి పలికెను. కన్నియగుమునుపు గల పేరెద్దియో సోమన తెలిపి యుండలేదు. తల్లిదండ్రులు పెట్టిన పేరేమియో ధూర్జటి తెలిపియున్నాఁడు. 'నందను తిన్నఁడనంబున కానంత కందళిత హృదయారవిందులై' తండ్రియుఁ బుళిందబృందారకుండును 'తిన్నఁ'డని పేరు పెట్టిరఁట. ఆ తిన్నఁడను పేరేమిటో కూడ ధూర్జటి పలికియున్నాఁడు. ఆ బాలుని గుణములను శివభక్తి లక్షణోపమానంబుల సమానములగుటచే తిన్నఁదనము. 'తిన్నఁగా ననఁగా, సరిగా, క్రమముగా, ఉండవలసిన తీరు' అని యర్థము గనుక, యా బాలుని గుణము లుండవలసిన తీరునే యున్నవను నర్థమున నా బాలునకుఁ దిన్నఁడని పేరిడిరి. ఆ తిన్నని గుణములు మీఁది పద్యమున దెల్పఁబడినవి.* ఇఁకముందు మహాభక్తుఁడు కానున్న యా తిన్నఁడు శివభక్తిమయతనువుగాఁగల శిశువుగాఁ బుట్టుటయు, బాల్యమున శివభక్తి లక్షణములను గలిగి యుండుటయును సముచితము, సమంజసమునగును గదా !

* శ్రీ.కా.మా. 3ఆ–30

3. కన్నప్ప, తపసి చెప్పినట్లు శ్రీ కాళహస్తిగిరి లింగమూర్తిఁగాంచెను. తిన్నఁడు జంగముఁడు పలికినరీతి బయల్వెరి వేఁటాడుచుండఁగా ఏకల మొకటి యెల యించుక తోడ్కొనిపోయినట్లు ధూర్జటి వర్ణించుటయందొక విశేషము గలదు. తిన్నని పూర్వజన్మ కథమునఁబరమేశ్వరుఁడగ్గను నాశ్రమముఁజేరినది యేకలముమ వెంబ డించియే కదా! అచ్చట భగవాముఁ దేకలమువెంట భక్తుని జేరి యాతని సమగ్ర హింపఁగా, నిచ్చట భక్తుని నేకలము కారణముగా భగవంతుఁడు తన దరిఁజేర్చికొని యనుగ్రహించినాఁడు. రెండు సందర్భములందును 'ఏకలము' సాధనమైనది. రెండింటయందు నా యేకలములు భగవద్విభ్రా ప్రకల్పితములే.

4. కలకుట్లు కొండకుఁజంపఁబడిన మృగములుమ పూర్వజన్మమున శివభక్తులైన యసురులని, ¹ సోమన తెలిపెను. ప్రస్తుతప్రబంధమున తిన్నని భక్తి ప్రప త్తులు ప్రధానముగాని యన్యములుగావు గాన ధూర్జటి వాని ప్రస్తావముఁదేలేదు.

5. తిన్నని తోడెంబకులు గృహమునకు తిరిగి రమ్మని ప్రార్థించి విఫలుడ గుటయందు, తిన్ననికి శివునియందు గలిగిన పరమభక్తి బంధనము బలపఱుచుట కలదు. వారి సంభాషణము స్నేహశీలమును, తల్లిదండ్రులకుఁ దిన్ననియందుండు వాత్సల్యము ప్రకటింపఁబడుటయు, తిన్నని శివార్చనా విధియందలి దృఢ నిశ్చయ ములను స్పష్టపఱుచుటకు దోహదము సేయుచున్నవి.

6. సందర్భోచిత్యముఁనాటించి కలకుట్లను గూర్చిన వివరములను వాని ఖండనములు, పచనము లివ్విధిగా గలవానిఁబ్రపంచింపక, తగు మాత్రము వాని రూపము, రుచులను మాత్రము సూచించి విడిచిపేసినాఁడు ధూర్జటి.[2]

7. అమార్గము బట్టిన భక్తుని దండించనని 'కన్నప్ప కథ'లో తపసి ప్రతినఁబట్టెను. తిన్నని కథలోని శివగోచరుఁడు శివాలయమును మలినమొనర్చు భక్తునిఁజెప్పకున్న తాను కూడుగ్గబట్టి శివునకుఁబ్రాణములిత్తునని పట్టుబడెను. ఆ తపసి

1. బ.పు సంక్షిప్తము 3అ పుట 107 పం. 823 - 824 మరియు 108 పు 845 - 852

2. ,, 3అ ,, 108 పం. 856 - 868

ప్రత్యర్థిని చంపుటనని భావించుట సోమనాథుని వీరశైవభక్త లక్షణమునకుఁ దగియే యున్నది. ఇచ్చట ధూర్జటి చిత్రించినాఁడు శివబ్రాహ్మణుఁడు. అనఁగా వీరశైవుఁడు గాఁడు. శ్రుతి మార్గమున శివునర్చించువాఁడు కాన శ్రుతి వ్యవహారేతర మతమునఁ బూజించుటకు సహింపలేక యాతఁడు, నిరశన వ్రతమునఁబట్టి శివునకుఁ బ్రాణార్పణము సేయుదునని భావించినాఁడు.

8. చెలఁది ఏనుఁగుఁజంపఁగఁగూట వీరశైవభక్తుల సాహసికములగు కథల యందలి అద్భుతమును బ్రకటించునదిగా నున్నది. ధూర్జటి వర్ణించిన పాము నేనుఁగుల పోరాటమత్యంత సహజమై యలరుచున్నది. సోమన కథయందు తపసి తల కోసిన తలపోఁతలలో నీ చెలఁది పాముగల కథ విడిచియుండుటకుఁ గారణము, బసవపురాణమున స్వీకరించిన శివభక్తుల గాథలయందు వీనికిఁ బ్రత్యేక స్థానము లేకుండుటయే. ధూర్జటి స్వీకరించిన కథ యితివృత్తమునకు చెలఁది పాము ఏనుఁగుల కథలే సార్థక్యముఁ జేకూర్చినవి.

9. తపసి తానుఁగా శత్రుని ఖండింతునని తలఁచినాఁడచట. పరమేశ్వరుఁడాతనికిఁ బలికి, కన్నప్పను బరీక్షింపలేదు. ఇచ్చట ముఖ్యముగా శివబ్రాహ్మణునకుఁ దెలిపి పరమేశ్వరుఁడు తిన్నని పరీక్షించినాఁడు. గుడి వెంగిలి పుంగలమొనర్చువానిఁ దెల్పకున్న గూడుగ్గబట్టి శివునకు బ్రాణములిత్తుననిన శివగోచరాంకుని సందేహమును బాపవలసిన స్థితి, బాధ్యత పరమేశ్వరుఁడు స్వీకరించినాఁడు. పరమశివుని కెఱుక లేక యేదున్నోనర్చు వీలులేదని నిష్ఠూరములాడిన శివబ్రాహ్మణుని పలుకులయందు, తన నల్లరిపెట్టుటకు, పరమేశ్వరుఁడు పగవానితోఁగూడెనని, యీ కుట్రయందాతనికి భాగమున్నదన్న యారోపణము ధ్వనించుచున్నది. తన కొందఱుభక్తులు నొక్క విధమేయని నిరూపించుకొనుటకుఁ బరమేశ్వరుఁడు తన నొక చెంచుభక్తుఁడు శ్రుతి వ్యవహారేతరముగ సేవించుచున్నాఁడనియు నాతని భక్తి తనకు నచ్చినదనియు, శివబ్రాహ్మణుఁడును స్వయముగాఁ బరిశీలించి తృప్తిజెందదగునని యాతనిని సాహసము నుండి ముందు నివారించుట జరిగినది.

10. తపసి కన్నప్పను దొంగడుటతో మఱియుఁ గన్పింపఁడు. కన్నప్ప కథలో నిత్య శివార్చనాతత్పరుఁడైన శివగోచరాంకుఁడిచట మోక్షార్హుఁడైనవాఁడు గాన,

తిన్ననితో గూడి పరమేశ్వరుని కరుణమునకుఁ బాత్రుఁడై సాయుజ్యమందెను. అది యునుఁ గాక ముందు తెలిపినరీతి నిచ్చటఁ బరమేశ్వరునకు ప్రతిమార్గరతులగు బారాధ్యులును ప్రీతులె యనుటయు, వారికిని వీరశైవభక్తులతో సమముగా సాయుజ్య మిచ్చుననుటయు నిరూపితమైనది.

ఈ విధముగా సోమన మండి భేదించిన విషయములన్నియు స్వీకరించి ప్రతిపా దించుటలు కవి ధూర్జటి ప్రబంధౌచిత్యములయిన దౌహృదము, జననము, వేఁట, జాతర, మద్యపానము, లనువాని సమన్వయమునకు, కవికి గల లోకజ్ఞత, శాస్త్రజ్ఞ తల ప్రకటనమునకు, రసపోషణాదికములగు సర్వౌచిత్య పోషణమునకును గుదురై తిన్నని కథయే యొక ప్రత్యేకప్రబంధముగా రూపొందుటకుపయోగించినవి.

పుళింద కులసంజాతుఁడైన తిన్నని వృత్త కథనమున ధూర్జటి యా కులాచార వ్యవహారములు, నాహార విహారములు విపరముగా వర్ణించియున్నాఁడు. ఈ ఘట్ట మున కవికి గలలోక పరిశీలనము, శృంగార రాసిక్యదృష్టియు వ్యక్తములగు చున్నవి. ఈ రెండంశములు మఱి యే సందర్భమునకుఁ బొందని యంతటి విస్తృతి, విశిష్టతలఁ గాంచినవి. 1

కవికి బోయల పక్కణమును గుఱ్చి యెంతయు నిశితము, సూక్ష్మమునైన పరిశీలన ముండుటంబట్టి యీ ఘట్టమున నింతటి సూక్ష్మాతిసూక్ష్మ వస్తువులను అతని దృష్టిమండి జాఱిపోవలేదు. అది పొత్తపినాఁటిలో ఉడుమూరు. ఆయూరు, నందలి చెంచులు, చెంచితలు, వారి వేష రచనము, స్వరూపస్వభావముల వర్ణనము కవీం ద్రుఁడే పలికినట్లు,

'క్షుద్రమోదాత్త మహత్త్వమద్భుత రసావహమై' నర్పటినది. ఆ ప్రాంత మున వన్యములయిన యనేక విచిత్రములగు వస్తువులు లభించును. వాని ననుభ వించుచు, ధరించుచు, "నెంత సంపదగల్గియు నెట్టివారుఁదమ కులాగత ధర్మకర్మ ములు విడువజాలరు. మంచెలమీఁద నెక్కిన శబర కాంతల వర్ణనమునఁ గవీం ద్రుని శృంగార రాసిక్యము గొంత గడిమీఱిన దనవలసియున్నది. క్రీడాభిరామమున పీఠికలో తత్కర్త శ్రీనాథుఁడొక చాటువులో "మకరధ్వజు విశ్రాంపటుక చెంపకన్పింప చీరగట్టినదయా చిగురుబోడి" యని ధ్వనింపఁజేయఁగా నీఁడు ధూర్జటి "మదనిల్లు బయల్పడ,²జేసినాఁడుతదితరము లయిన తావులయందలి శృంగార రసపోషణము హృదయరంజకముగనే యొప్పినది.।

1. లోకజ్ఞత, శృంగార రాసిక్యములను ప్రత్యేక ప్రకరణము న గలవు.

2. శ్రీ.కా.మా. 3ఆ - 10 ప 3 రసపోషణ ప్రకరణమున చర్చ కలదు

'తమ యిల్లాండ్ర మనోహరావయవ సౌందర్యంబులతో సామ్యవ
ర్గము పాటింపఁగనో, కిరాతులు నిజాగారంబులం గట్టి సిం
హ మయూరీ హరిణేభ శాఖిసములభనా హా! పెంతురాశంకఁ ద
ద్రమణీ మధ్య కచేక్షణ స్తనము లుత్పాదింపఁ గాకుండునే. 1

తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యమున దీనికొక సాదృశ్యము కను పట్టుచున్నది

'గతిమధ్య స్తన కుంతల స్తబక వీక్షాగర్వ దుర్వార యీ
సతిచే మానమె యూనమయ్యె। నిఁక నిస్సారంబు ప్రాణంబుదా
ల్చు తగుల్ గాదని రోసియావృషలివాలుందూపు,గొమ్మంట కా
హుతియో బర్హి మృగేంద్ర కుంభి చమరీయూథంబు నేణంబులున్. 2

ఉపమానముసుపమేయముగా నూహించుచు నిచట ప్రతీపానుప్రాణి తోత్ప్రే
క్షాలంకారమునకుఁ గ్రమముఁగూర్చి యలంకరించినాఁడు కవి. ఈ పద్యమందు శబర
కాంతలసౌందర్యము, శబరుల శౌర్యము రెండును జోడించినాఁడు. ధూర్జటి కావించినస్త్రీ
యవయవ వర్ణనమున నుపమించిన వస్తువులు దేశోచితమ్ములై యుండుట నాయా ప్రక
రణములందుఁగాంచగలము పార్వతిని వర్ణించినపుడు, ఉద్యానవనవిహారము గాన,
తీగెలు, పుష్పగుచ్ఛము, కురంగములు, పల్లవములు, 'ప్రతీపమున'నే తెల్పబడినవి.
శబరుల వాసితో మృగాలవాలము కానవచ్చుట మృగములతోఁ బోలిక చెప్పబడినది.

తిన్నని తల్లిదండ్రులు, కేవలము శాంబరీభిల్లుఁడైన శివుఁడును, శబర రూప
యగు గౌరియు నన్నట్లున్నారని యుత్ప్రేక్షించుట ముక్కాలి యర్థవంతమై యలరు
చున్నది. తిన్నని పూర్వజన్మమున నర్జునుఁడుగా బాణకబడుటయందు కైరాత విభు
నిగాఁ బరమేశ్వరుఁడు శబర కాంతగా పరమేశ్వరి వచ్చుట నిట స్ఫురణకుఁదెచ్చుచు,
గవీంద్రుఁడు తానా తిన్నని పూర్వజన్మ కథన మొనర్చుచున్నానని కథా సూచనము
చేయుచున్నట్లున్నది నాథనాథుఁడు తిన్నని తండ్రి. నాథనాథుఁడనుట సర్వలోక
నాథుఁడని గదా! గండరగండఁడను నర్థమే నాథనాథునకును తల్లి "తండె"

1. శ్రీ.కా.మా. 3ఆ 16 ప. 2. పాం.మా 3ఆ - 86 ప.

లిన్నని తల్లిదండ్రుల సామ విషయమున సంస్కృత శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యము నం గొంత భేదము కనఁబడుచున్నది. తల్లి 'కటిళ' తండ్రి 'తీర్థుఁడు' కాగా, విశాలమైన నేత్రములు గల కుమారునకుఁ దల్లి 'కణ్ణప్ప' యని పేరిడినట్లున్నది.

నాథనాథుని స్వరూప స్వభావముల వర్ణనమున గల పద్యము శబ్దాలంకార శోభితముగ నుండుటయే కాక సాభిప్రాయమై యలరుచున్నది. నానా మృగ ప్రాణ గంధవహములు కాతని నారాచములు దందశూకేంద్రములయినవి. సింహములను శిక్షించునట్టి విక్రమము, ఏనుఁగులమఁ జంపునట్టి బాహు బలము, లేడి దంపతులను చంపువేగము, తోడేళ్ల సుఁగూల్చు ప్రతాపములను, వర్ణించిన క్రమమున నా నాథనాథుని సింహ పరాక్రముఁడనియు, కరి హస్తములను బోలిన హస్తములు కలవాఁడనియు, లేడివేగము వంటి వేగము కలవాఁడనియు, తోడేలు వలె శత్రు సంహారము సేయువాఁడనియు సర్వస్వభావము స్ఫురించుచున్నది.

గీతమందలి రూపకమతి విచిత్రముగాఁ గూర్పఁబడినది.

నానా మృగ ప్రాణ గంధవాహ
దందశూకేంద్రనారాచ బృంద వర్ష
గంధరోద్దండ కోదండ కరుఁడు మించె
నాథనాథుండరణ్య భూనాథుఁడగుచు.*

మృగముల ప్రాణములను వాయువులకు పాములయిన బాణసమూహమును వర్షమును కురియు మేఘమయిన భయంకరమగు ధనుస్సు చేతియందుఁ గలవాఁడు. ఇందు బాణములను పాములతోడను, వర్షముతోడను రూపించుట విశేషము. వర్షపాతమును తుండపోతలు, ఏనుఁగు తొండములుగఁ బోల్చినట్లే ప్రేలాడు పాములుగ వర్ణించుటయుఁగని సమయము. అన్నిటియందును భావమొక్కటియే. ఎడతెఱిపి లేకుండుట. అయిన నిందు బాణముల ప్రయోజనము, వేగములను రెండు భావము లను రెండింటితోఁ బోల్చి రూపకముగావించుట విశేషము. మృగముల ప్రాణములను గొనుట యందు పాములై, తెఱపిలేక కురియుటయందు వర్షమును బోలియున్నవి బాణములు. నుచే వర్షము వచ్చుటకు మేఘము కావలెగదా! ఇందప్రాపము మేఘము వర్షించుటకు సూచనము. కాన నిచ్చట బాణవర్షమునకు మేఘము ధనుస్సయినది. అదియుగాక ధనుష్టంకారము మేఘ గర్జనుఁబోలియుండి మృగప్రాణభీకరమగుచుండును.

---

* శ్రీ.కా.మా. 3ఆ — 18 ప

నిరుపత్ప్రేక్షింపఁబడినది. ఇచట యుత్ప్రేక్ష, క్రమాలంకారముచేత పోషిత మైనది. ఇఁక నా తంపె కోర్కెలన్నియు ముందు తిన్నఁడు చేయనున్న చర్యలనే సూచించునవి. క్రూరమృగముల వధ, సువర్ణముఖరీతీరస్థ శివదర్శనము, గండూషజలముచే శివాభిషేకము, ఘోటి మాంసము దొప్పలయందభవునకర్పించుట, నేత్రములచే నీలగళు నర్చించుటలు తంపె—భావించినట్టి శివోపచారాదికములు, గర్భస్థ శిశువునకుఁ గలుగనున్నవి.

గర్భిణియగు స్త్రీ పొందు శారీరక పరిణామము, కోరు కోర్కెలు, గర్భస్థ శిశువునకు ముందు గలుగనున్న లక్షణములను, సూచించునవిగా వర్ణించుట తెలుఁగు కవి సంప్రదాయము. శృంగార శాకుంతలమున[1] శకుంతల, గర్భిణ్యవస్థా చిత్రణ మిప్పట్ల గుర్తింపఁదగినది. ఈ పద్యనిర్మాణమున పదముల కూర్పు శ్రీనాథునిఁ దలపించుచున్నది.

సరివచ్చు ననవచ్చు శతమన్యువీటికి
  వివిధ దేవాగార విభ్రమమునఁ
బ్రతివచ్చు ననవచ్చుఁ బాలమున్నీటికి
  నక్షయంబగు జీవనాభివృద్ధి
నెనవచ్చు ననవచ్చు నిందు బింబమునకు
  సకల కళావిలాసప్రవృద్ధి
దొరవచ్చు ననవచ్చుఁ దోయజాక్షుని మూర్తి
  కభిరామలక్ష్మీ సమగ్రమహిమ—[2]

అన్నఁడు క్రమాభివృద్ధిఁ బొందుటయందును ఉపమారమ్యతనుఁ జాటఁజాలినదై యొప్పుచున్నది.[3] బాలుఁడు మునిమునిపెనవ్వులు నవ్వుట, ముద్దుటడుగులు విదుల్చు కొనుట, పొరలఁబడుట, ఏడ్చుచుండుట, తడవిచూడుట, అడుగుపెట్టుటలను సర్వమును శివోన్ముఖముగా, భవపరాఙ్ముఖముగా రూపించినాఁడు కవిచంద్రుఁడు. బాలునిచేష్టలనుత్ప్రేక్షించుట కవిసమయమే. దానియందు లౌకికార్థమును గాక పారలౌకికార్థమును స్ఫురింపఁజేయుట భక్తులయిన కవుల మార్గము.

1. శృం.శా. 4 ఆ — 53 మొ. 57 వ వరకు.
2. భీ.పు. — 1ఆ 107 వావిళ్ల. 1958 ప్రచురణ
3. శ్రీ.కా.హా. 3ఆ—30 ప.

భరతుని బాల్యచేష్టలు భవిష్యచ్చక్రవర్తి లక్షణముల నుత్ప్రేక్షించినాఁడు పినవీరన

'నృపకిరీటంబు నిలుపుడునను మాడ్కి-
బొదిగిటిలోనుండి పదముఁనెత్తు———[1]
మఱియు సింహాసనంబునఁజేరి గొల్వనుండు
చందమునఁగూర్చుండ నేర్చె———[2]

శివభక్తి లక్షణలక్షితుఁడైన వానికిఁదలిదండ్రులు తిన్నఁడను నామకరణము సేయుట సార్థకముగా నున్నది కదా!

శబరుల రూపరేఖలు, వేషభాషలు, ఆటపాటలు, వేటాదికములగు సన్నాహములు, జాతర, వర్ణించినతీరుఁజూచిన ధూర్జటికవీంద్రుఁడు ప్రత్యక్షముగా నా బోయ పల్లెలయందు తిరిగి, తెలిసి వ్రాసినవాఁడనిపించక తప్పదు. వ్యక్తుల రూపచిత్రణము, అవస్థా చిత్రణము అందును, కవికిఁగల ప్రత్యక్షానుభవము, సూక్ష్మమౌ నిశితమైన పరిశీలనము స్పష్టములగుచున్నవి. 'చిట్టిపొట్లాకాయ సిరిసింగణావర్తి....'[3] 'కొంచపువింటి బిడ్డ, బొంగోలలు....తడవిల్లు వెదురు విల్లు....'[4] వారి యాయుధవిద్యలు, జాతరవేళయందలి వారి వేషభాషలు,[5] మాటలాడఁదలంచి మఱచిపోయెడివారు...[6] వేట సన్నాహము,[7] అచ్చట లభించు పదార్థములు[8] వర్ణించుపట్టు లింపలకుఁజూడఁదగినవి.[9]

తిన్నఁడు శివుని గొల్చుట యందలి ప్రధాన కథాంశము. స్వప్నమునఁనుగ పట్టిన 'ఉడయంకొక్కరుఁడు' తిన్నని కల్లువ్రేసిన నున్న లింగమూర్తి కడకేగు మని ప్రబోధించినాఁడు. ఏకల మెలయించుకపోగా, బోయిన తిన్నఁడు 'అవిద్యాధ్వాంత సంతాన సంతాప్రాంత నిశాంత జంతు సుఖమార్గ ప్రాపకాధంగదుఃఖాంతాసంగము, దివ్యలింగము' నుఁగాంచుటచే సంతోషము గలిగినది. ఆ పరమశివుని దర్శన మాతనికి సాత్త్వికోదయము గలిగించినది. ఇష్టదైవదర్శనమున సాత్త్వికానుభూతినందుట భక్తలక్షణము.

---

1. శృం.శా. 4ఆ — 64 ప. 2. శృంశా. 4 ఆ — 67 ప
3. శ్రీ.కా.మా. 3ఆ — 33 ప. 4. శ్రీ.కా.మా. 3 ఆ — 34, 35 ప
5. ,, ,, — 36 వచ. 5. ,, ,, — 41 ప
7. ,, ,, — 46 వచ. 47—51 ప 8. ,, ,, — 67,68,69ప
9. లోకజ్ఞత — శిక్షిత జూడఁదగును.

పరీక్షనకుఁ బరమేశ్వరుండు ప్రత్యక్షమైనప్పుడాతనికి సాత్త్వికోదయము గలిగినది.

కాలుతనే భావించినరీతిని తిన్నఁడు ముగ్ధభక్తుఁడు. పరమేశ్వరునిఁ జూడగనే యా లింగమూర్తియందు సఖ్యభావము, సోదర భావము గలిగినది. తోడు నీడ లేక చెట్టుక్రింద నొంటరిగా భీకరారణ్యమున నున్న శివుని తనవెంట రమ్మని వేడినాఁడు. అతనికి యడవిలో నాహారము, నీళ్ళపరిత్తుదగనుక, తన వెంట వచ్చినచో మంచిమంచి యాహారములు, సేవలు సమకూర్తునని పలికిన తిన్నని మౌగ్ధ్యము భక్తికి పరాకోట్యేమన్న. అంతభక్తిపూర్వకముగాఁ గోరుచు శబర వనితల సేవలనందింతుననుటలో శివునికి సుందరులందున్న వారినేయిత్తునన్నమాట విచిత్రముగా దోఁచుచున్నది గదా! పరమశివునకుఁ గాని, నదలింగమూర్తిగ భావింపఁబడు జంగమునకుఁగాని సర్వస్వమర్పించుటకు వెనుకాడకుండుట వీరశైవలక్షణము. అదియుఁగాక, శబరుల యాచార వ్యవహారములందు, నతిథిసేవలందట్టివి సర్వసామాన్యములు. కానఁ బరమేశ్వరుని సేవకు

'చుఱుకుఁ జూపునఁ గాలిన కొంతనుఱుకు
నుఱుకుఁ జూపులఁ బుట్టించు నెఱుకు వారి
ఋుఱుకు వలిగుబ్బ పాలిండ్ల యిగురుఁబోండ్ల'నిత్తుననినాఁడు.[1]

తన వెంట శివుఁడు రాకున్న నా యింటికేఁగననినాఁడతఁడు. అతనితోఁ డిదే తన లోక మనినాఁడు. ఆ లింగమూర్తి యందాతని భావము పాషాణముగాక పరమశివుఁడే. సంపెంగ తావి గ్రోలఁగడ్డైన భృంగమై యా తిన్నఁడు 'శివలింగ సంగాభంగుర హృదయాంతరంగుఁడై, తోడెఱుకుం గోరిక గాదనుచు నా లింగములోఁ బ్రాణముఁగాలము గడపాక నోడగట్టిన మాలంపై లంపెమండఁజేసి' నానని స్పష్టముగఁ బలికెను. తనకు 'చుట్టముఁ జలిదండ్రులు వెఱల్వాణుండు నీదైవమే' యనియు, దానచ్చటనే తనమ వేల్పునకై ప్రాణములను బోకార్తునవియు నది నిజమే యనియుఁ బలికెను.

శివునకుపచారములు చేయుటయే తన బంటుతనమని భావించి పుక్కిళ్ళయందు సువర్ణముఖీ జలముఁ దెచ్చి, దొప్పలందు నంజుఁడు దెచ్చి యద్రిరాజజ్జుని నారగింపుమని యర్పించినాఁడు. మొదట ప్రశ్నించినపుడు పలుకకుండిన నతడంతగా బాధపడలేదు. కాని తానెంతయొ భక్తితోఁ దెచ్చిన యూనంజుఁడను గ్రహింపకుండుట తిన్నని కర్థము కాలేదు. అతని మనము పరిపరివిధాలఁ బోయినది. తన తెచ్చిన కఱుకుట్లు

1. శ్రీ.కా.మా. 1ఆ - 77 ప.
2. ,, 2ఆ - 71 ప.

సరిగా కాలలేదో, శివునకు రుచిగా లేవో. లేక యలవాటు లేదో తనకు తెలియుటలేదు. లేక భవున కాఁకలి లేదేమొ? ఈ యన్నిటిలో నేదేనొకటి కారణమై యుండవచ్చు నని భావించినాఁడు తొలుత. కొంతసేపునకు తన సేవయందు దేమేని లోపముగల దేమోయని యనుమానము గలిగినది. కారణమేదైననుఁగాని, తన సేవలంగీకరించి తా నర్పించిన కలుకుల్లారగింపకున్న యెడల నిఁక తానెందులకు? తన జీవమెందులకని కటకట పడిఁనాడు తిన్నఁడు. తనసేవ, నివేదనలు, వృథాపోయిన నాఁడిక తా నేల బ్రదుకవలెననిపించినది? తోడెయుకులతో బలికినట్లు 'ఆ లింగములో బ్రాణముఁగాలము గడవాక నోడగట్టిన దూలంబై లంకెమండ'జేసెమగదా! తనవేలుపునకై తన ప్రాణములను బోకార్తుననియు నిశ్చయించుకొనియుండెను. తనకు మాఱుపలుకుటలేదు. తన నివేదనము నంగీకరింపలేదు. తనయందు తన దైవమున కనుగ్రహము తప్పిన తన బ్రతుకే వ్యర్థమైనది. శివుని పదాబ్జములపైఁబడి ప్రాణము విడుతునని రోద్వ దొడఁగిన యాభక్తుని, భక్తవత్సలుఁడు కరుణించెను. ఆ లింగమూర్తియే తన లోకమని, సర్వస్వమని, యాతని కొఱకై ప్రాణములర్పింపుటకున్న భక్తుని భక్తి తత్త్వమునకు గడియేమియున్నది? స్వచ్ఛముగాఁ దిన్నఁ డందిచ్చునందగా గరుకుల్లు నా భగవానుఁడారగించి, యాతని భక్తినంగీకరించినాఁడు.

అంతటిలో నా తిన్నని కథ యాఁగిపోఁదగును. తిన్నని కోరిక నెఱవేరినది గదా! భక్తిమార్గమందు గాని, భక్తులయందు గాని, పరమేశ్వరునకు భేదబుద్ధిలేదు. తిన్నని భక్తిమార్గము శ్రుతివ్యవహారేతరమైనది. శ్రుతివ్యవహారమతమున పూజించు భక్తులకది కంటగింపు. ఎవరి భక్తి మార్గము వారికది యొక్కటియే యనుసరణీయమని భావించుట, యన్యుల భక్తిమార్గము లుచితములుగావని యెంచుట, భక్త సామాన్యవిశేషము. ఇతర మార్గములందు దేని ననుసరించినను భగవంతునకిష్టమే.

'శ్రవణం, కీర్తనం, విష్ణోః, స్మరణం, పాదసేవనమ్
అర్చనం, వందనం, దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్'

అను నవవిధమైన భక్తిమార్గములందు, శక్తియుక్తులకొలఁది భక్తులు భగవంతు నర్పించుదురు. తిన్నఁడుస్మరణ, పాదసేవ,అర్చన, దాస్య,సఖ్య, ఆత్మనివేదనములను శ్రుతివ్యవహారేతరమతమునఁ బూజించుచు సేవింపసాఁగెను. శ్రుతివ్యవహారేతర మతమున

---

'నవవిధభక్తులు' — పుట - 22- 13, 14 పంక్తులు.

నా గుడిముందు ముగ్గులు పెట్టి యర్చించు శివబ్రాహ్మణున కా గుడియంతయు ఎంగిలి మంగలమైయుండుట సహింపరానిదయ్యెను. ఆ కసుమాలమంతయు నీశ్వరున కెట్లంగీకృత మాయెనో యాతఁడూహింపఁజాలకుండెను. అట్టి యర్చనము నా శివబ్రాహ్మణుఁడేఁడు దినములు సహించినాఁడు. ఇఁక నోర్వలేకపోయినాఁడు. ఇచటనొక విశేషమున్నది. ఏఁడు దినముల వఱకా శివబ్రాహ్మణుఁడూరకుండ గలిగెనన్నదది. సాధునేనుఁగులు మూఁడు నాళ్లకంటె నోర్వలేకపోయినవి. మఱి మానవేతర ప్రాణులకును, మానవులకును భేదము కొంచము. కాని యిచ్చట మానవుని ప్రకృతికి సంబంధించిన విషయమొకటి యూహింప వీలగుచున్నది. పరీక్షకు గాని ఉపవాసమునకు గాని మానవుని సహనము సప్తవాసర పర్యంతమేమొ అట్టులే తోఁచుచున్నది. వ్యాసమహర్షియు నేఁడు దినములు భిక్ష లభింపక పోవుటచే నిఁకనాపలేక కాశిని శపింపఁబూనినాఁడుగదా![1]

అపచారము సేయుటకు, నవహేళనచేయుటకు 'సఖుఁడా, సుతుఁడా, తరుణీమణియో, నిజసేవకుఁడా' తానొక్కెడఁ దగుదురు. పరులయినఁదన యనుమతి లేక దోసము చేయుటకు సమర్థులు కారని పలుకుటయందు, శివునకా కసుమాలపు విషయ మెఱుకయే యైయుండునని యా శివబ్రాహ్మణుఁడు తర్కించుకొని నిర్ణయమునకు వచ్చుట సమంజసమే. అట్టి రోఁత లా శివున కిష్టమైయుండుటలోఁ గ్రొత్త లేదని యాతఁడెత్తిపొడుపులతోఁ బలుకుట, భగవంతునియందు భక్తునకు గల చనవు, స్వాతంత్ర్యములు. ఈ సందర్భమున నాతనికి వరమశివుని పూర్వభక్తులర్చించిన విధానము లెట్టివో గుర్తునకు దగిలినవి.[2] మఱి యట్టి రోఁతయలవాటులున్న శివుఁడీనాఁడీ రోఁతనంగీకరించుటలో విప్రతిపత్తి యుండదనియే యనిపించిన దాతనికి. ఇది వ్యాజనిందగానున్నను వ్యాజస్తుతియే గావించినాఁడు గవీంద్రుడు. ధూర్జటి పరమశివుని లీలలు నోరార గొనియాడుటయిది. ఏనుఁగునిష్ఠే పరమేశ్వరుని భావించినది.[3]

తన దృష్టియందు శివునకపచారము గావించిన శత్రువును గూర్చి చింతించుచు ప్రాణము నర్పింతునని పలుకుటయందును గజ మీ రీతినే నడిచినది. అది గజముగాన

1. భీ.పు. 2 ఆ— 107 వచ, 116 ప.

2. వ్యక్తిత్వము— పూర్వభక్తస్మరణము గాంచఁదగును.

3. శ్రీ.కా.మా. 2ఆ—122 ప.

శత్రువుని జంపి కాఁజచ్చెద ననినది. ఆగమజ్ఞుడు, మానవుఁడుగాన నిచ్చట శివబ్రాహ్మణుఁడు కూడుగ్గబట్టి ప్రాణము విడుచుననినాఁడు. ఈ సందర్భమున ధూర్జటి శివగోచరుఁడైన శివబ్రాహ్మణుని చిత్రించుటయందలి విశేషము గమనింపఁగలము. పాల్కురికి సోమన తపసి, కేవల వీరశైవుడై కన్నప్పనుఁ జంపసిద్ధపడి వాటున మణగి యుండినట్లు వర్ణించినాఁడు. శివాపచారము గావించినవానిని చంపుటకుఁ బూనుట యాతపసి, మడివాలుమాచయ్యాదులయిన వీరశైవభక్తుల గాథలు తార్కాణ.

'అట్లనేఁడును వాఁడు నరుదెంచెనేని
యెట్లైనఁజంపక యేఁబోవ...... ![1]

ఇది సోమన చిత్రించిన తపసి భావన. ఇచ్చట శివబ్రాహ్మణున కాభావన తగినది కాదు. అనగా శివబ్రాహ్మణులు వీరశైవులుగాదని తెలియగలము. ఇట్టి శివబ్రాహ్మణుఁడే, హరద్విజుఁడుగా నత్కీరుని కథయందునుఁగననగును.[2] శివుని శ్రుతివ్యవహార మతమున నర్చించు బ్రాహ్మణులు శివ బ్రాహ్మణులు, ఇది యారాధ్యశైవమునకుఁజెందియుండుట. వీరశైవమునందు కులభేదము, లుండవు. ఆరాధ్యులందును శివాపచారము జరిగిన ప్రాణార్పణమొక లక్షణము శత్రుప్రాణహరణేచ్ఛ వీరశైవలక్షణముగాఁ గనుపట్టుచున్నది. ముగ్ధభక్తులు వీరశైవము నందును గలదనుటకు శ్రీ కాళహస్తులను, తిన్నఁడు, శివబ్రాహ్మణులును తార్కాణ. నత్కీరుని కథయందలి హరద్విజునకిట్టి పరీక్ష కలుగలేదు. అతని పూజ కొరులు భంగముకల్గించుట జరుగలేదు. ఆ హరిద్విజుఁడాత్మనివేదనము చేసి కొన్న వాడఁగుటచేఁబరమేశ్వరుఁడే యనుగ్రహింపఁ దలఁచినాఁడు. సర్వభారము పరమేశ్వరునిగా భావించుటయే యాత్మనివేదనము.

'తేన సంరక్షమాణస్య .... ఫలే స్వామ్య వియుక్తతా
కేశవార్పణ పర్యంతా .... హ్యాత్మనిక్షేప ఉచ్యతే.[3]

ఫలాఫలముల దృష్టిలేనియపుడు వేఱుచింతయుండదు. ఆ శ్లోకమును శివునకు తిరిగి యర్పించి వెడలిపోయినాఁడా హరిద్విజుఁడు.

---

1. బ.పు. సంక్షిప్తము 3ఆ - పుట 111 పంక్తులు 947, 943
1. శ్రీ.కా.మా. 3ఆ - 156 ప.
3. 'నవవిధ భక్తులు' — పుట 239 తుది రెండు పంక్తులు.

ప్రపత్తి పండుచున్న శివగోచరాంగమునకు పరమేశ్వరునివాణి వినిపించినది. కిరాతుని పూజ నాతఁడును బరీక్షింపఁదగునని పలికి, శివుఁడు తిన్ననికిఁ బరీక్షపెట్టినాడు.

చెంచుపట్టు, చెప్పుగొలతో నిర్మాల్యమును దోఁద్రోచి, గండూష జీవనసేక ముగించి, పత్త్రిరిడి, త్రోవగాచి తాఁసి తాల్చి, పోలాముష ఖండములను నివేదించినాఁడు. శంకరభగవత్పాదుల శివానందలహరియందు దీనికి మాతృకయనఁదగిన శ్లోక మొకటి కననగుచున్నది.

'మార్గావర్తితపాదుకా పశుపతే రఙ్గస్య కూర్చాయతే
గణ్డూషామ్బు నిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంస శేషకబలం నవ్యోపహారాయతే
భక్తిః కిం న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే' ।

అందిచ్చిన కలకుట్లారగింపక శివుఁడు మిన్నకుండుటతో తిన్నని కనుమానము గలిగినది. ఇన్నినాళ్ళను తా సందియ్యగా స్వీకరించిన తన దైవమీనాఁడేల గ్రహింప కున్నాఁడో తెలియుటలేదు. ఒకింత తడ వాలోచించునంతలోఁ బరమేశ్వరుని 'కను దమ్మిగ్రమ్మి బొటబొటఁ గనిరెంగన్నీరు'. అందముగాఁ దెల్లగా నున్న కన్నుదమ్మి కొంచెము కొంచెముగా నెఱ్ఱబడుచు 'నరుణపద్మ'మై నీరు కురియుచుండెను. అప్పటి కాక యాలోచనము కలిగినది తిన్ననికి. కంటి బాధచేఁ గాఁబోలు తినకున్నాఁడని యెంచినది. ఆ కంటి బాధ దా నెట్టుడుపగలనాయని యాలోచనము గావించినాఁడతఁడు. పసరుమందులు, కసరుమందులు తెచ్చి యుపయోగించినాఁడు. తెలిసిన, యనుభవమున్న వైద్య చికిత్సలన్నియుఁ జేసిచూచినాఁడు. మందులువాడుటకు మున్నుగాఁ దిన్నఁడు చేసిన యుపచారములత్యంత సహజమై, సుందరముగాఁ బ్రతిపాదింపఁ బడినవి. కన్నుగ్రబడినపుడు, సామాన్యముగాఁ జేయు నుపచారములివి. గుడ్డ పొట్లముగా బట్టి నోటి యావిరి చేసి, కంటికావిరిఁబట్టినాఁడు. అఱచేతితో చేయిరాచి పుట్టిన వేడిని కంటఁబెట్టినాఁడు. ఇంత తనకు వనమున లభించు నాకులలమును, మందులు మాఁకులు పెట్టి పాడి చూచినాఁడు. ఈ యుపచారముల వలన కంటినీరాఁగుట కాక, నెత్తురు కార్చుట మొదలు పెట్టినది. తన ప్రయత్నము లన్నియు వెల్లిగలిపిన చింతపండు, నీటఁబ్రాసిన ప్రాలునై[2] పోయినవి. అనగా వ్యర్థములయినవి.

1. శివా.ల. 63 శ్లో — స్తోత్రలహరి - పుట 100
2. ప్ర.హా.మా. 3అ - 11 ప.

మనసులకుఁ గలుగని వ్యాధి మానసిక మైనదగును. ఇతరుల కెవరికైన నపకారము తలపెట్టినను. లేక యపకృతిఁగావించినను, లేక యితరుల మనము నొవ్వఁబలికినను. కాని బాధకలుగవచ్చును.

'....మాయమ్మ జూచి పదరినకతనన్, నెట్టువిసెనో.......।'[1]

యనియు సందేహించి, తిన్నఁడు కొంత గడుసుఁదనముఁ బ్రకటించి నాఁడు. తన యయ్యయందుఁగల దనువును బురస్కరించుకొని 'అమ్మనుకలఁత, పెట్టుటచే నిట్లు బాధకలుగకుండునా ?' యన్న నెత్తిపొడుపు స్ఫురించుచున్నది మంచి యిల్లాలిని కష్టపెట్టిన ఫలితమూరక పోవదను లోకోక్తి నిచట ననుసంధింపఁ దగును. ఇంతకంటె విశిష్టమైన యర్థమె యిచ్చట తోఁచును. తరువాతి పద్య మునఁబశ్చాత్తాపముఁజెందిన యాతని తీరు, నుడియొక రమ్యార్థమును వ్యంజించు చున్నది. పార్వతి యెడఁ బరమేశ్వరుని శృంగారభావమిచట పలుకబడినది. అదే పనిగా గన్నుఁగదిలించుట యది. అదియే యొక జబ్బుగా మాఱును. ఈ భావ మునుఁబలికిన వెంటనే తిన్ననికి తాను శివాపచారము సేయుచుంటి ననిపించినది. మన్మథునిఁజంపిన పరమేశ్వరునిఁ గాముకునిగా భావించుట దోసఁగు కదా! స్వామికి లేని రోషాపరోణము గావించుట స్వామిద్రోహమె యగును.

కారణమేమయిన గార్యము గంటికిఁగన్పించుచున్నది. కంటికి రోగము వచ్చినది. అది మానుటకు దాఁజేయవలసిన యుపచర్యలు చేసినాఁడు, మందులు మాఁకులు వాడినాఁడు. ఫలితము శూన్యము. ఆలోచించినాఁడు. ఆలోచనమునకు లోచనమె మందని మదిని మెఱుపు మెఱసినది. కంటికిగన్నెమందు. ఆ యాలో చనము స్ఫురించుటతోఁ దిన్ననికి గలిగిన యానందమునకు మేఁరలేదు. తనవంటి బంటు కలిగినందులకు ఫలితమేమియని చింతించుచున్న యతనికిట్లు 'కన్నుమందు' సంతోషాతిశయముఁగలిగించినది. ఆ యానందపారవశ్యమున నాతని కొడలు తెలి యుట లేదు. వెస కన్నూడఁబెఱుకుటకు సిద్ధపడినాఁడు. ఆ తిన్నని భక్తి తాత్పర్య మున కీ ఘట్టము దర్పణము. శరీరముపై నాసవీడి, సమర్పణము చేయుటయే భగ వంతుడు కోరినది. 'దేహంబువిడిచి, సందేహముడిగి భక్తి భజియించిన'[2] భక్తుల

1. శ్రీ.కా.మా. 3ఆ - 112 ప.
2. ,, 4ఆ - 197 ప.

కాంక్షితపదముఁ బొందుచున్నని కాదా భగవత్సాక్షాత్కారము. కాంక్షితమున్నను లేకున్నను దేహమోహము విడుచుట, సంవేగమును ఉ అన్నవి భక్తలక్షణములు. తిన్నని స్థితియిదియే. అతనికింత వలకు నెట్టి కోరికయు లేదు. కేవలము నిష్కామునిగనే యర్చించుచున్నాఁడు. శివుని యొంటరితనము, వనవాసము లాతని మనసుఁ గరిగించినవి. ఇల్లు వాకిలి, ఆఁడుబిడ్డలు, కోడండ్రు బంధువులు, చుట్టాలుపక్కాలు, దాసదాసీ గణములు లేక, యన్నపానీయములొసఁగు వారు లేనిస్థితియందుఁ దిన్ననికి సఖ్యభావము. ఆత్మీయత లేర్పడినవి. సేవించుటయే యతని లక్ష్యము, కామ్యములు. వెలి ప్రయోజనము కొంత సేయలేదు. అట్టితఁడు బరమేశ్వరునికిఁ దనకన్ను సమర్పింపగలుగుట కన్నఁ దనకఁ గోరదగినది లేదు. ఆ భావము కలుగుటయేమి 'తూణీరాబాణముఁ జిమ్మునం' దిగుచుటయే వెంటనే జరిగిపోయినది ఆ కార్యనిర్వహణావేగము సూచించుటకే కవి ధూర్జటి 'చిమ్మునందిగిచి' యని ప్రయోగించినాఁడు. కనుగ్రుడ్డుఁ బెకలించుట గన్నులగట్టు ధూర్జటి చిత్రణమున 'తూణీరాబాణము చిమ్మునందిగిచి, భల్లముఖాగ్రము రక్తపద్మదృక్కోణముఁ జేర్చి త్రుచ్చి, యొక గ్రుడ్డు వడిం బెకలించి...*' యను వాక్యనిర్మాణ సౌభాగ్యము వెలార్చినాఁడు. ఇందలి 'చిమ్మునందిగిచి, చేర్చి, త్రుచ్చి, పెకలించి' యను సమాపక క్రియాపదములచే దృశ్యముఁ జిత్రించినాఁడు. భల్లముఖాగ్రము, అనుటయందు బాణతైక్ష్ణ్యము, నైశిత్యములును, 'రక్తపద్మదృక్కోణము'నందు తిన్నని నేత్రమునకుఁ గలిగిన ఘాతములనుఁ బలికినట్లయిన 'చేర్చిత్రుచ్చి' యను రెండసమాపక క్రియా పదములు వెంటవెంటనే కూర్చుటవలనది బాణము కంటికొలఁకులందు చేర్చుట, త్రుచ్చుట క్షణములో సంభవించెనను తీవ్రత, వేగములను సూచింపఁజాలినవి. త్రుచ్చిన భల్లముఖాగ్రము గ్రుడ్డునంతటిని చుట్టుత్రిప్పి పెకలించుట యనుభావము 'నొకగ్రుడ్డు వడిం బెకలించి' యని విశేషణ వ్యవధాన ప్రయోగముచే ద్యోతము చేయఁబడుచున్నది.

తిన్నని కన్ను బాణము గ్రుచ్చుటచే రక్తపద్మమయినది. ముక్కంటి కన్ను మున్నే శోణిత ద్రోణియైనది. నెత్తురు నిండియున్నది. కన్ను కనుపట్టుటయేలేదు. ఆ కంటిని వెంటనే తొలఁగించి, తనకంటి 'నమర్చి'వాఁడు, తిన్నఁడు. 'అమర్చి' యనుట యందును సొబఁగుదనము కలదు. ఏ స్థితియందుంచిన కన్ను కన్నుగా ప్రసన్నగా, తిన్నగా, నుండునో యట్లుండునట్లు జాగరూకుఁడై యుంచినాఁడన్నది యీ పద ప్రయోగ ప్రయోజనమనిపించుచున్నది.

---

* శ్రీ.కా.మా. 3ఆ - 115 ప.

ముక్కంటి నిజముగా ధన్యుఁడైనాడు. తనమున్నింటి కంటి కంటెఁ గూడ నిప్పటి తిన్నఁడమర్చిన కన్ను కడు మోహనమై యొప్పినది. అప్పటికి తన సేవ ఫలించెనని తిన్నఁడు మురియుచుండెను. నిజముగా వ్యాధియడఁగినపుడుగదా, సుందర నేత్రమమరినప్పుడు సంతోషించునది! శివుఁడు తిన్నని పరీక్షించుచుండెను. మొదటి కన్ను తిన్నగా నమరుటయేమి, రెండవకంటి వెంట నీరు గారుటారంభమగుట యేమి యొకే పర్యాయము సంఘటించినది. ఆ రెండవకన్ను నరుణిమత్వముఁ బొందినది. ఇప్పటికర్థమైనది, తిన్నని కిదియంతయు శివుని లీలయని. తా నింతవఱకుఁ బ్రమాద పడితినని తెలియుటతోఁ దిన్ననికి నవ్వు వచ్చినది. మొదటి కంటికిఁ గన్నిచ్చి నెగ్గిన తనకీ రెండవ పరీక్షయేమి? రెండవకంటినిఁ గూడ తా నీయలేఁడనియా యీశ్వరుని సందేహము? ఈశ్వరుని యీ యాలోచనమునకే తిన్నఁడు నవ్వినది కాను. ఇంకా ఇంకొకటిగూడఁ బలికినాఁడు రెండు కన్నుల నిచ్చిన వెనుక, ముక్కంటి మూడవ కన్నుకూడ కోటిప్రదోటివైనఁ దానేమి జేయగలడని శివుఁడు భావించి యుండును. అంతలకుఁదనకు మాత్రము సందేహముతోఁ. రెండవకంటియందుఁ గూడ నెప్పుడు నెత్తురు గార్చెనో యప్పుడే తిన్ననికదియంతయు శివుని యిచ్ఛయని తెలియవచ్చినది. ముక్కంటి కనుక మూడవ కంటిని గూడ నర్పించినచో తనకు మూడు కన్నులు లేవుగదా! ఏమి చేయగలఁడు? ఏమి చేయగలఁడో చెప్పినాఁడు.

'నీకృపచేతఁ గన్నులుండు నన్నవి నీకొల్లఁ' నని తన రెండవ కంటినిఁ గూడ నిత్తుననినాఁడు. కంటికిఁ గన్నులుంచన్న విషయము, ఈశ్వరుని కృపచేతనే తెలిసినాఁడు. ఉపాసకుఁడైనవాని యుపాసనమెట్లనఁగాఁ,

'లాలాటలోచనంబునఁ
గీలాలము దొరగెనేని, కేవలభక్తిన్
గీలించి, మనోదృష్టికి
మూలంబగు నాదుప్రాణములు నీకిత్తున్' 3ఆ - 17 ప.

ఈ రెండు కన్నులును చర్మచక్షువులు. పరమేశ్వరుని దర్శించుటకివి చాలవు. ఈశ్వరతత్త్వమెఱుఁగుటకు మనోదృష్టి యవసరము. మూఁడవ కంటికి వలసిన తన మనోదృష్టి నిచ్చినదైనననిదియు మనోదృష్టి నిచ్చినవాఁడేమి? అది

యట్లు సాధ్యమా? బాహ్యదృష్టికిఁ గనుగ్రుడ్లు మూలములయినట్లు, మనోదృష్టికి ప్రాణములు ముఖ్యములు. కనుగ్రుడ్లూడఁదీసినను మనోదృష్టి యంతరింపదు. మానవుని కర్మేంద్రియముల నన్నిటిని పనిచేయించునది మనస్సు. కర్మేంద్రియములున్నను మనస్సున కిష్టము లేకున్న నవి యేమియుఁ జేయఁజాలవు.

మనస్సు సరిగా లేనప్పుడు కన్నులు, చెవులు, నాలుక, ముక్కు, చర్మములు ప్రాణములతోనున్నను కమనీయ దృశ్యముఁ జూచి యానందింపలేఁడు, రమణీయ సంగీతము విని యానందింపలేఁడు, మధురమైన రుచిననుభవింప లేఁడు, కమ్మని వాసన చూడలేఁడు, స్పర్శ సౌఖ్యము ననుభవింపలేఁడు. వానిలో నే యొక్కటి లోపించినను మనస్సు అంతస్సౌందర్యము నాస్వాదింపఁగలదు. ఆ మనస్సు పనిచేయుట యన్నది ప్రాణములు పోవుటతో నాఁగిపోవును.

తన రెండు కన్నులతోఁ బరమేశ్వరునిఁ జూడ జాలకున్నను, మనో దృష్టితోఁ జూడగలనను స్థైర్యము కలదు. కాని మూఁడవ కంటికి సార్థక్యమిచ్చుట వ్యంజితము గావించుచున్నాఁడు తిన్నడు. ధూర్జటి మూఁడవకన్ను జ్ఞాననేత్రమునకు, అంతర్దృష్టికి, చిహ్నము. ఆ మూఁడవ కంటిచేతనే కామారి కామునిఁ జంపినది. ఐహికములను జయింపఁగల్గుటకు మానవునకు మనోదృష్టి మూఁడవకన్ను. పరమేశ్వరుఁ డిచ్చిన నేత్రములను ప్రాణములనుఁ బరమేశ్వరునికిచ్చుట కేమి? తాను చేయుచున్నది గొప్ప విశేషమేమియుఁ గాదని తిన్నని దృష్టి. సమర్పణ బుద్ధియదియే. ధూర్జటి మనోదృష్టియు నిదియే.

రెండవకంటినిచ్చుట క్లిష్టము. రెండవకంటినిఁ బెకలించిన తరువాత దానిని శివుని రెండవ కంటనమర్చుటకుఁ దనకు బాహ్య దృష్టి లేదు గదా! అందులకే శివుని రెండవకంటిని గుర్తుకొఱకు చెప్పుకాలినొకదాని నా తావున నుంచి, సునిశిత బాణమున తన రెండవకనుగ్రుడ్డునుఁ బెకలింపఁబూనినాఁడు. కన్నులు పోఁగొట్టుట ప్రాణములను హరించుట పరమశివుని లక్ష్యముకాదు. శివగోచరుని 'తవతవ' మాన్పుట కేర్పఱచిన పరీక్షయిది. పరీక్షయందుఁ దిన్నఁడు నెగ్గినాఁడు. మాటున నుండి శివబ్రాహ్మణుఁడునుఁ జూచుచునేయుండెను. రెండవ కన్నుగ్రుడ్డునుఁ బెకలించు వేగమునకు మున్నుగనే పరమేశ్వరుఁడు తిన్నని కరముఁబట్టి 'నిలుపు నిలుపు' మనినాఁడు. ఇచ్చటి యామ్రేడితము త్వరితార్థసూచకము. తిన్నని చేతిలోని యాశుగము నంటఁగఁ బట్టినాఁడు, ఖండపరశువు. ఖండపరశువు డాల్చు నేర్పు గలవాఁడగుటచేతనే తిన్నని చేతిలో బాణము నతిజాగరూకతతోఁ బట్టగలిగినాఁడనుట యిచ్చటి సాభిప్రాయ విశేషణ ప్రయోగము.

ప్రత్యక్షమైనశంకరుని ప్రభుత్వము, ప్రసన్నతలను దెల్పునది తర్వాతి పద్యము. హరియరవిందసూతి, మును లష్టదిశాపతులాదులుగా విభుచ్చరు లిరువంకలంగొలు చుట ప్రభుత్వముఁదెల్పుచుండగా

'..........శీతవసుధాధర కన్యక పుష్పగేలుఁదామరకడవేళ్లలు పట్టుకొ'నుట

ప్రసన్నతనుఁ జాటజాలిన విశేషణములు. కేవల గిరిజ యనియో కొండకూఁతురను నర్థమునఁబ్రయోగింపక, శీతవసుధాధ కన్యక యనుటచే చలిమల కూఁతురను విశేణము సాభిప్రాయమై యలరుచున్నది. ఆ చల్లని తల్లి సుకుమారమగు చేతికడవేళ్లలను విడువకుండుట దాంపత్యమహిమ, అనుగ్రహ విశేషముల సూచనము. తిన్నని యందాశివునకు గలనున్నన, ప్రసన్నతలం మిక్కిలియనుటకే 'నున్ననఁదిన్ననికిం బ్రసన్నుండై' యను మూఁడు పదములు వెన్వెంటనే ప్రయోగించుఁ.

శివుఁడు తిన్నని గ్రంతివ్యవహారేతరమత పూజఁ దా నంగీకరించినాఁడు. ఇది యంతయు శివబ్రాహ్మణుని 'తప' తప' మాన్పుటకు కాన నా శివగోచరునిఁ జూచి తమ పరీక్షయందు నెగ్గిన తిన్నని భక్తి మెచ్చగొలిపెనాయని యడుగుట సముచిత సముల్లాసమై, సంభావ్యమగుచున్నది. 'నీ మనసు వచ్చెనాయిఁక' ? ననుట మిక్కిలి సహజ సుందరమైన సందేహ నివృత్తి, సమాధానస్థాపనములుజేయునట్టి సరస సంప్రశ్నము. తిన్నని భక్తి నంగీకరింపకున్నయెడల వా శివబ్రాహ్మణుఁడు కూడుగ్గబట్టి తనకుఁబ్రణము లిత్తుననినాఁడు. అతనిని రక్షించుటయుఁదనయిచ్ఛ. ఆ తిన్నని 'యవిరళభక్తి మహిమ యాద్యంతముఁగంటివి గద ! సద్భక్తుండవుగా ?' యనునది యీశ్వరుని ప్రశ్న. తిన్నని నేత్రార్పణ చర్యలన్నింటిని తాఁడతనుండియుఁ జూచినప్పుడతఁడు సద్భక్తుఁ డనిపింపక తప్పదు. సర్వస్వమర్పింప సిద్ధపడిన భక్తుని కన్న వద్భక్తుఁడౌరుఁడుండఁడు బ్రాహ్మణుఁడు మాటేమి పలుకఁగలఁడు? తిన్నఁడంతటి సద్భక్తుఁడని తానూహింపలేడు. కన్నర్పించిన కన్నప్ప చరితముఁదాఁగన్నులారఁ జూచినాఁడు. ఆ భక్తి మహిమ కచ్చెరుపాటు చెందుటచే నా శివ బ్రాహ్మణునకు నోట మాటవాలేదు. కవి ధూర్జటి యూ సుందరభావమును గడుసుగా నాతనిచే నేమియుఁబల్కింపలేదు.

ప్రత్యక్షమైన పరమేశ్వరుఁడు వారినిద్దరనుఁబిలిచి వరము కోరుకొనుఁడనఁగా వారు పలికిన పలుకులు భగవద్దర్శనభాగ్యుల కుచితములైనవి. ఆదివ్య తేజము దర్శించిన వెనుక వారి మనము లానందామృతమున మగ్నమైనవి. చూపు, చిత్తములు మిన్నక యుండిపోయినవి, దేహముపైఁ బ్రీతియొకటి తొలఁగెను. కోరఁదగిన వరమిదియే. సమకూడినది. అయినను శివుఁడడుగుఁడని పలికినపుడిఁక నడుగఁదగిన దొక్కటి మిగిలిపోయినది. దేహధారణపైఁ బ్రీతి తొలఁగినది కానఁ బునర్భవము లేకుండుటయే కాంక్షింపఁదగినది.

వారు వరము కోరుచుఁ బలికిన మాట అత్యంత సుందరములై వ్యంగ్యవాసనా విలసితములై భగవన్మహిమానువర్ణనములై యలరుచుండెను. శివబ్రాహ్మణుండు తన యిరువురి పక్షమునఁ బలికిన పలుకులు దక్షుని సంభాషణ రీతినుండి తన యజ్ఞానమునకు క్షంతవ్యులమను నర్థమును, సర్వాంతర్యామియు సర్వేశ్వరుఁడునగు పరమేశ్వరుని భక్తవత్సలతయే తమ నిట్లనుగ్రహించినదను నర్థమును స్ఫురింపఁజేయుచుండెను. అతఁడు కిరాతుఁడు. శివునర్చించి మెప్పింపగల జ్ఞానములేనివాఁడు తాను పూజా విధానమున నర్చింపఁగలిగినను సాటి భక్తుని భక్తిని శంకించిన మలాత్ముఁడు. ఇట్టివారి పూజచే పరమేశ్వరుఁడు సంతృప్తిచెందియుండునని తాను భావించుట లేదట. కేవలము పరమేశ్వరుఁడు కోరి తన యంతట తామగా వారి ననుగ్రహింపఁదలఁచి ప్రత్యక్షమైనాఁడే కాని తమ సేవాభక్తుల వలన గాదని యాతని భక్తి తాత్పర్యము. అదియుఁగాక యీ ప్రశ్నమున నొక యందమున్నది. మొదటి యనుగ్రహము — ప్రత్యక్షమగుట — వారికిఁ బ్రోత్సాహము గనా చూపినది ! మరి రెండవ దానిని వారినడిగి చేయుము' నని యీశ్వరుఁడు పలుకటయేమి ? మొదటి యుపకారము చేసిన స్వామికి రెండవ యుపకారము చేయు స్వాతంత్ర్యము, చనవు లేవని యా? వారి నెట్లనుగ్రహింపవలెనో యీశ్వరునకుఁ దెలియును. వారికేది యుపకారమో యీశ్వరుఁడెఱుంగును. వారుగాఁ గోరనేల ? అట్లు కోరు నదృష్టము, గొంద భాగ్యము వారికిఁ గల్పింపఁ దలఁచిన భగవల్లీలయే యిది యంతయు. అయినను భక్తులను గూర్చి భగవంతుని కంటె నెఱుంగఁగలవారెవ్వరు? అతని చిత్తమున నుండు తలఁపుకన్న వారి తలఁపులు మిన్నకాఁజాలవు. ఈశ్వరుఁడే విధముగాఁ దలఁచిన నట్లే చేయుమనినాఁడు. ఇంతవఱకు చక్కఁగ నేసాగినది. ఇచ్చటనే విశేషమున్నది. సర్వభారము సర్వేశునిపై నుంచి యంతట నూరకుండిరా ? లేదు. అదియే లోకరీతి, భవప్రసూనమెడలించి, తాదాత్మ్యమిమ్మని కోరిరి.

పుట్టెడు బాధ మాన్పుమనుట, తాదాత్మ్య మిమ్మనుటలు రెండు కోరికలు. ఈ సన్నివేశమంతయుఁగడు గడుసుపోకడ పోయినది. దేహముపై మోహముతగ్గినది. వరమేమియు నక్కఱలేదు, అనుదినే క్రమ్మఱ పుట్టెడు బాధమాన్పుమని యొక వరము కోరుట ? పునర్జన్మలేకున్న నెచ్చటనుందురు వీరు ? శివుని లోకమున, శివుని సమీపమున. అట్లుండుట వీరి కాంక్షకాదు. శివునిలోఁదాదాత్మ్యము చెందుటయే వారి వాంఛ, కనుక నది రెండవ వరమైనది. పరమేశ్వరుఁడు కోరుకొనుమనినది వరమే. అనఁగా నొక్కటియే గదా ? మఱి వీరు రెండు వరములు కోరిరే ? అది యూపనకు సమ్మతమగునా ? అనగా వారు కోరినదియు నొక్క వరమే. అది రెండు భాగములుగా రెండు మాటలుగాఁగోరఁబడినది. అంతియే. మొదటి భాగమునకు వ్యాఖ్యానము, ఫలితాంశము రెండవ భాగము.

'భవన్మయమైన పూర్ణచిద్గగనములో మముంగలిపి క్రమ్మఱ బుట్టెడు బాధ మాన్పవే' యనిన వరమునకు భవప్రయాసమెదలించి, తాదాత్మ్యంబిమ్మనినది వ్యాఖ్యానము. అతడు నిరుపాధిక దయామయుజ్జ్వలుఁడు. అవ్యాజ కరుణానిధి, వారివి తన యనంతమైన యాత్మ రూపమునఁజేర్చుకొనినాఁడు. బంధములనుఁదీర్చినాఁడు.

శైవ ద్విజుఁడు, కిరాతులు, కోరిన వరముల క్రమమునే పరమేశ్వరుఁడను గ్రహించెనా యన్నట్లు కవిధూర్జటి రెండు పద్యములందలి వరముల క్రమ మును సంధింపఁబడుట చూడఁగలము. పూర్వాపరవిషయ సందర్భ సంఘటనములందుఁ గవీంద్రుని జాగరూకత నిచ్చట గాంచఁగలము.

వారు కోరిన వరములు ! 'భవన్మయమైన పూర్ణ చిద్గగనములో నుముంగలిపి క్రమ్మఱఁబుట్టెడు బాధ మాన్పవే' ఈశ్వరుఁడనుగ్రహించినదియు 'అనంతంబగు నాత్మరూపమునఁగూర్చెం, దీర్చి బంధంబులన్'.

శైవద్విజుఁడు, కిరాతులు కోరిన వరములను పునరుక్తి చేయుటయందుఁబ్రత్యేక ప్రయోజనము కానరాదు. కాని యది కవి ధూర్జటి యార్తియే యనఁదగియున్నది. దీనిని మఱియొక విధముగా నూహింప వీలగుచున్నది. భక్తులిరువురు గాన, ప్రత్యేక ప్రత్యేకముగా నిరువురుకోరుటవిధి తెలుపునని యూహించుట యది. కాని యిట్టి

విధానము పొందుపేసుఁగల సందర్భమునలేదు. కాని భవప్రయాసమెంతటి ప్రతీతమైనదో యనుభవ పూర్వకముగఁ గవి వారినోట రెండుమాటలు పలికించుటయనియు, కవి వ్యక్తిత్వమందు స్పష్టముగ గోచరించుచున్నదనియుఁ జెప్పనొప్పును.

## నత్కీరుని కథ

ఈ తృతీయాశ్వాసమందలి రెండవ భాగము నత్కీరునికథ. ఇంతవరకు గడిచిన ప్రబంధమునందలి భక్తులందఱును శ్రీ కాళహస్తియందు నిలిచి, శివుని గొలిచి, తరించినవారె. ఇఁక రానున్నవారు పై దేశమునుండి వచ్చి పరమేశ్వరుని దర్శనానుగ్రహములచే శివసాయుజ్యమంద గల్గిన ధన్యజీవులు. అందు నత్కీరుఁడీ తృతీయాశ్వాసోత్తర భాగమున వచ్చును. వేశ్యాతనయులు నాలుఁగవ యాశ్వాసమున వత్తురు. నత్కీరునకు సాక్షాత్ కుమారస్వామియే శ్రీ కాళహస్తిప మహిమ నెఱిఁగించి యమ్మాహాత్మ్యమనుగ్రహమునకుఁ బాత్రుఁ జేయును. వేశ్యాతనయులను సాక్షాచ్ఛ్రీకాళహస్తీశుఁడే వెంటఁగొని శ్రీ కాళహస్తి పురముఁ జేర్చును.

ప్రకృతము **నత్కీరుని కథ:-** ఈ కథా సంవిధానమున కవి ధూర్జటి స్వాతంత్ర్యేచ్ఛ నిర్భీక ప్రవృత్తి, సాహిత్య స్ఫురన్మాధురీమహిమలు వెల్లడియగుచున్నవి. ఈ కథావస్తు స్వీకరణమున కవీంద్రుఁడు స్వాతంత్ర్యము వహించెను. తొలుత భావించిన రీతిని యీ కథ సంస్కృత కాళహస్తి స్థలమాహాత్మ్యమున లేదు. సంస్కృత స్కాంద పురాణమునఁగలదు. కాని స్కాంద పురాణమున నీ కథ యుండుటను గూర్చి పండితులలో భిన్నాభిప్రాయము లున్నవి. స్కాందపురాణాంతరిత హాలాస్యమాహాత్మ్యమను గాథయందీ నత్కీరుని కథ కలదు. ఈ హాలాస్యమాహాత్మ్యమును తెలుఁగున గద్య, పద్య, ద్విపద, రూపములందనేకు లనువాదము చేసి యున్నారు.

నత్కీరుని కథ స్కాందమునఁ జేరుటను శంకించిన శ్రీ తిమ్మావఝ్ఝులవారు 'కందమెల్లాకల్లి'యను తమిళ వాక్యము నుదాహరించుచున్నారు. స్కాందమునఁ బెక్కు లప్పటికప్పుడు చేరుచు వచ్చిన కథలున్నవనుటయుఁ బండితలోకమునఁ గలదు. 'ధూర్జటి కవి నత్కీరుని యుదంతము మూలకథయందు లేకున్నను వస్తుమహిమను ప్రకటించుటకు ప్రత్యేకముగా చేర్చినాడు.

తమిళమున 'తిరువిళయాడల్' యను శివలీలావిలాసగ్రంథము, ధూర్జటి నత్కీరుని కథ కాకరమనియు, తమిళమందలి యీ కథయే క్రమముగా సంస్కృతీకరింపఁబడి స్కాందమునఁజేరి యుండరాదదా యనియు శ్రీ తిమ్మావధానులవారి యూహ. ఈ తిరువిళయాడల్ గ్రంథము (పరంజ్యోతిముని యనుపేరుగల తమిళకవి) క్రీ.శ 200 ఏండ్లకు ముందే చివరి సంఘకాల సంభవమని తెలియుచున్నది.[1] ధూర్జటి గ్రహించిన యీ నత్కీరుని కథ విషయమై పండితాభిప్రాయములు కొల్లలుగా నున్నవి. కథానిర్వహణమునకు మూలమని భావింపఁబడుచున్న 'తిరువిళయాడల్' యందలి కథా సంవిధానముతోఁబోల్చి, ధూర్జటి కల్పనములందలి సామంజస్యౌచిత్యములఁ జర్చించి 'సహజముగా నత్కీరుని గాథను యథాతథముగా వినియో చదివియో యుంచిన ఈ ధూర్జటి నత్కీరుని గాథ రమ్యాతిరమ్యముగా చిత్రితమై యుండెడిదేమొ'? యని పలికి శ్రీ శర్మ వాక్యము,[2] 'ఏతావతా నత్కీరుని గాథ ఆమూలాగ్రము ధూర్జటి పరిశీలింపలేదనుట సాహసమే యగునేమొ? పరిశీలించలేదనిన మహాకవి యమంద భావావేశముతో నీ నత్కీరుని కథ నింత చక్కగా నెట్లు వ్రాసియుండు'[3] నన్నవారి వాక్యము చేతనే పర్యాప్తమగుచున్నది. మొదటి వాక్యమున ధూర్జటి యీ నత్కీరుని కథను వినియు, చదివియు నుండఁడను భావము, రెండవ వాక్యమున దానికిఁబూర్తిగ వ్యతిరిక్తమయిన భావములు వ్యక్తములగుచున్నవి. తమ వ్యాసమందలి చివరి వాక్యమున నీ రెండు వాక్యములకును సమన్వయము కలిగించునదిగా "నత్కీరుఁడు శివునితో కైలాసమును గూర్చి పలికినట్లు 'కన్నదిగాను విన్నదిగాను' యన్నట్లు ధూర్జటి యీ గాథను కన్నదిగాదు విన్నదియే యనుచున్నాఁడా"[4] ? యను వాక్యముగలదు.

నత్కీరుని కథా స్వీకరణమున ధూర్జటి యత్యంత ప్రాచీన తమిళకావ్యమగు 'తిరువిళయాడల్' ను పరంపరగా వినియుండఁదగును. తిరువెంగళనాథుని

---

1. 2, 3, 4, :- ఆంధ్రపత్రిక 30-11-1958 శ్రీ కొంగూరి సూర్యనారాయణశర్మ,

ద్విపదకృతి మాత్రముండుట కపరాధమువేమి. వెంగళనాథుఁడు అచ్యుతదేవరాయల సామంతుఁడగు గొల్ల వెదరామన్నపతికి తన కృతినంకితమిచ్చి యుండుటచే క్రీ॥శ॥ 1538-40 ప్రాంతములవాఁడగుచున్నాఁడు.[1]

రాయల సమకాలమున గొంతకాలము ధూర్జటి జీవించి యుండవచ్చును. ధూర్జటి, తిరువెంగళనాథులు సమకాలికులైనవారు కాదగును. కాని ధూర్జటి యాతని కృతి చూచి యుండకపోవచ్చునని యూహించుటకు, తిరువెంగళనాథుఁడు రామనాడు జిల్లాలోని తిరుపత్తూరులో నున్నవాఁడు కాఁగా, ధూర్జటి నెల్లూరు మండలముననే యుండుటయు కారణములని పలుకవచ్చును.

కనుక ధూర్జటి [illegible] సంస్కృతస్కాందమందలి హాలాస్యమాహాత్మ్య ఖండమును చూచియె, దానియందలి కథ నాధారముగ గొని ప్రబంధోచితము లగు కల్పనలను, మార్పులను చేసియున్నాఁడని భావించుట లెస్స. సంస్కృత హాలాస్య మాహాత్మ్యము, తమిళ 'తిరువిళయాడల్' ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యమునందలి నత్కీరుని కథను తులనాత్మకముగఁ బరిశీలించి చూచినపుడు మనకుఁగొన్ని విషయములు స్పష్టములగును. సంస్కృత తమిళ గ్రంథములకు సాన్నిహిత్యముగలదు. ధూర్జటి కథనమందు ముఖ్యములైన కొన్ని యంశములు రెండింటితోడను భేదించుచున్నవి. తమిళకావ్యమందలి కథతో ధూర్జటి నత్కీరుని కథనుఁబోల్చి శ్రీ సూర్యనారాయణశర్మగారును,[2] సంస్కృతమునకనువాదమైన గురులింగశాస్త్రిగారి వచన కావ్యముతో బోల్చి శ్రీ కోటి నరసింహశాస్త్రిగారును,[3] ధూర్జటి నత్కీరుని కథను గూర్చిన విమర్శలను వెలయించియున్నారు.

నత్కీరుని కథా నిర్వహణమునఁబండిత విమర్శకులు వెలిబుచ్చిన యభిప్రాయములనుఁబరిశీలించి, వారి యాక్షేపములకు సమాధానముఁజెప్పుటకు మున్ను ధూర్జటి నిర్వహించిన కథ నెఱుఁగవలసియున్నది.

---

1. చొక్కనాథ చరిత్ర - పీఠిక 6 పుట ౘ. చంద్రశేఖరన్.
2. ఆంధ్రపత్రిక - 30-11-1958 సం.శ
3. భారతి - 1964 [illegible]

మధురాపుర వర్ణనమైన వెనుక, పాండ్యనృపాలు నాస్థానమున బహువిద్వత్కవీంద్రులు 'సంగపలగై' - శంఖపీఠి - నలంకరించుటయందు నక్కీరుఁడు ప్రథమ గణ్యుఁడుగఁ జేర్కొనఁబడుటయు జరిగినది. సభ మెచ్చునట్టి కవిత్వము చెప్పిన వారి కా పాండ్యభూపతి వేయిమాడలిచ్చి సత్కరించుచుండును. గ్రహచారము వక్రించి, యా దేశమున దుర్భిక్ష క్షామమేర్పడెను. ఏలిక-బంటు వాసిలేక జనులు తిండిలేక బాధలఁజెందిరి, ప్రాణములు వీడుచుండిరి. అది మానిసి మానిసితిను కఱవైనది. ఆ పట్టణమందలి మూలస్థానహరద్విజుఁడొకడు శరీరము వీడిపోవదలచెను. శివుఁడనుగ్రహించి యా హరద్విజునకు భూమీశుపై నొక్క పద్యమును శృంగార రసానపద్యముగా నరవ బాసయందు చెప్పి యిచ్చి, భూపతికిఁ జదివి వినిపించుమనియు, నద్దానిచే సంతుష్టుఁడైన రాజు శివబ్రాహ్మణునకు వేయిమాడల ముడుపిచ్చునవియు, నంతట కఱవుమ దీరి, వరంబు గురియుననియుఁ జెప్పి పంపెను.

రాజసభయందా పాఠుఁడు 'చదివిన పద్యమందలి భావమున 'పింఛరాతి గమనాధమ్మిల్ల బంధం సహజగంధంబని' యుండుటచే, నక్కీరుఁడవి తప్పని యుపహాసన మొనరించెను. హరద్విజుఁడు తనకందలి మంచిచెడ్డలు తెలియవనియుఁ బరమేశ్వరుఁడు' రచియించి యిచ్చినదనియుఁ బలికి వెనుకకిగిరిపోయెను. ఈశ్వరునకు తన స్థితిని నివేదించి తాను నమ్మి మోసపోయితినని పలికి, తన భాగ్యమిటు లుండఁగా నీశ్వరుని, నక్కీరుని దూషింపనేల యని, భైక్షవృత్తిచే బ్రతుకుదునని పలికెను. ఆ నక్కీరుని విషయమేదో చూతము పదమని పరమేశ్వరుఁడు పలికెను.

సభకేఁగిన యీశ్వరుఁడు తన చెప్పి పంపిన పద్యమందు అక్షరమును, అలంకారము, పదబంధము, రసములలోనే దానియందు తప్పుగలదో తెలుపుమనుచు, నూరకే మాత్సర్యముచే, తప్పు పట్టుటయే యని పలుకగా, నక్కీరుఁడు మున్ను తాఁదెలిపిన యభ్యంతరమునే తెలిపెను. అది యగణ్య విషయమున ననున్వయమగు నని శివుఁడు పలుకగా నక్కీరుఁడు అగణ్యుఁడగినఁ దగునేమో కాని యిల మనుజ లకుఁ దగదనియు, జగతి యందుఁ బ్రత్యక్షమున కది సరిగాదనియు, నీశ్వరుని వాదము గగన ప్రసూనవాదమనియు తిరస్కార పూర్వకముగా బలికెను. బాలా మాళపుఁబలుకులు కట్టిపెట్టుమని నక్కీరుఁడు పలుకుచుండే బరమేశ్వరుఁడు ఫాలాక్షుఁ (

దప్పెను. మూఁడవ కన్నే కాదు, తలచుట్టు కన్నులున్నను తప్పు తప్పే యందును కాని, మూఁడవ కంటినిఁ జూచి భయపడి తన వాదము నుపసంహరింపనని నత్కీరుఁడు హార్వాకము చేసెను. కుపితుఁడై ముక్కంటి నత్కీరుని కుష్ఠవ్యాధిచేఁ దపింపుమని శాపమిచ్చెను.

పశ్చాత్తప్తుఁడై శాపమోక్షముకోరిన నత్కీరుని, కైలాస దర్శనమును శాప ముక్తిగాఁ బలికి యంతర్హితుఁడాయెను. క్రమముగా వ్యాధిపీడితుఁడౌచు, నత్కీరుఁడు కైలాస దర్శన రతుఁడై తీర్థయాత్రలు చేయుచు నేఁగుచుండెను. చెవ్వందీశ్వరుని, జంబునాథశివలింగమును దర్శించి, కావేరినదిని దాటి, అరుణగిరిఁ జేరి జగదంబికను, విశ్వనాథుని నారాధించి, తిరుపత్తూరి పురాధినాయకుడైన పిచ్చనయనారుని దర్శించి, కదలి యేకామ్రనాథుని సేవించి, పెన్న దాటి, మణిమెన్నని తీర్థములఁ గాంచుచుఁ గాశీ విశ్వనాథుని దర్శించి, మరునకు కదిలెను. త్రోవలో నొక భూతమునకుఁ జిక్కి సుబ్రహ్మణ్యేశ్వరుఁ బ్రార్థించి, ఆ స్వామియనుగ్రహముచే తామరకొలఁకు నందు మునిఁగి, లేచి చూచునరికి శ్రీ కాళహస్తీశ్వరాలయముఁ గన్పించెను. శాపవిముక్తుఁడైన నత్కీరునకుఁ బార్వతీరమణుఁడు సాక్షాత్కరించెను. నూఱు పద్యములచే నా పరమేశ్వరుని స్తుతించి, నత్కీరుఁడు నరమిత్తునన్న యీశ్వరుని, సాయుజ్యముఁ గోరి పడసెను.

ధూర్జటి వర్ణించిన నత్కీరుని తీర్థయాత్ర ఆమహాకవి పాండ్య దేశము నుండి కదలి ఉత్తర భారతదేశమునందలి శ్రీవిశ్వనాథ నిలయమైన కాశీక్షేత్రము వరకు గల పుణ్య నదీనదములను, తీర్థక్షేత్ర దేవాలయములను తానుగానే దర్శించి తరించినవాఁడు వలె నున్నదనుట సత్యసన్నిహితమగును.

ధూర్జటి పంచభూత లింగములను వర్ణించెను కవి.

---

## పంచభూత లింగ క్షేత్రములు

1. పృథివి లింగము — కంచి — 3ఆ — 187ప,
2. జలలింగము — జంబులింగము — 3ఆ - 181 ప
3. తేజోలింగము — శ్రీ అరుణాచలము — 3 ఆ — 185 ప
4. వాయులింగము — శ్రీకాళహస్తి శివుఁడు
5. ఆకాశలింగము — చిదంబరము — 4ఆ, 57 ప

### నత్కీరుని కథపై వచ్చిన యాక్షేపములు, సందేహములు సమాధానములు :

శ్రీకాళహస్తిమాహాత్మ్యమునకు సంబంధించినది కాన నీ నత్కీరుని కథను ధూర్జటి తమిళ సంస్కృత గాథలను చూచి తన ప్రబంధమునఁజేర్చు కొనియుండుట సంభవమనియే యంగీకరింపఁదగును. ఆ కథా నిర్వహణమునఁ బ్రధానముగా విమర్శకు గురియయిన యంశములనుఁ బరిశీలించి పరామర్శించుదము.

ఆక్షేపములు :

1. మహీధవునిపై పద్యముచెప్పి పంపించిన శివుని పద్యమును పూర్తిగాఁ దెలుపక యందలి భావమిట్టిదని యొక్క వాక్యమును నుదాహరింపుట.

2. తమిళ పదంబులో 'నశ్చిన్నైలియల్' మయూరగమనయని యుండగా ధూర్జటి 'సింధురరాజగమనాధమ్మిల్ల' బాగంబనుట.1

3. శివుని పద్యమందు ప్రసక్తియుండిన యితర కవులా హరదీణుని యామకొనకుందురా? 'శైవ సంహితాసారసంగ్రహము'నే నాగ్రహింపవచ్చునా?2

4. ఇఁట నిటలాక్షపదము సార్థకము కాదు.3

5. స్కాందపురాణ కథ చదివిన తరువాత శ్రీనోరి గురులింగశాస్త్రిగారి (హాలాస్యమాహాత్మ్యము.) ధూర్జటి కథలో నత్కీరునితో శివుఁడు చేసిన వాదము సమంజసముగా లేదని మరింత దృఢపడును.4

---

1. ఆంధ్రపత్రిక 30-11-1958 శ్రీ.పొం.సూ.శ.

2, 3. ,, 7-12-1958 శ్రీ.కూ.శే.శ.

4. భారతి-మే 1954 శ్రీ.నో.గు.శా,

6. ధూర్జటి భక్తిభావము లేకను, ప్రమాణబుద్ధిచేతను దూరము విమర్శింపక ఉన్నదున్నట్లు గ్రహించెనని తోఁచును.[1]

7. కథా సంవిధానమున నతుకుల బొంతగా వ్రాసి యుండక తప్పదు.[2]

## సమాధానములు :

1. ఆక్షేపము : శ్రీ పిం. సూర్యనారాయణశర్మగారు తమ 'ధూర్జటి నత్కీరుఁడు' అన్న వ్యాసమున శివుఁడు చెప్పినట్టి పద్యము తెలుపక దానియర్థమునే చెప్పి యుండుటలో నాపద్యమేల పలుకలేదనునదియు, నది యూ రాజుపై చెప్పినట్లు గాన్పింపక యతుకుల బొంత యైనది. ఆపద్యము రాజుపై చెప్పినను, రాజు మనోభావము విశదీకరించుటకే యనుట యుక్తమా ?

## పరామర్శ : సమాధానము :

'రాజమనోభావము విశదీకరించుటకే రాజుపై చెప్పినను యుక్తమా ? శ్రీ శర్మగారి యీ వాక్యమును పరిశీలించుటకు, వారు ధూర్జటి తమిళ కావ్యకథను వినియున్నవాడనిబట్టి యనుసరించియుండిరని భావించినట్లున్నదని ఊహించవలసి యున్నది. సంస్కృత స్కాంద పురాణమున కనువాదమైన హాలాస్యమాహాత్మ్యమును గాని, శ్రీ శర్మగారు భావించుచున్న తమిళ 'తిరువిళయాడల్' కావ్యమునగాని, తిరువెంగళనాథుల 'చొక్కనాథ చరిత్రము' నందు గాని యున్న కథాంశమును ధూర్జటి వినియుండియు, గనియుండియు దానిని స్వీకరింపక మార్పుచేసెనని తెలియవలసియున్నది. ఆ మూలములలోని కథాంశము గ్రహించనప్పుడు శ్రీ శర్మగారి సందేహము సరియైనదనఁదగును. వాని మూడింటియందును ప్రౌఢపుద్యానవన విహారమున నాఘ్రాణించిన సుమగంధమును గూర్చి యాలోచించుచు నది తన పట్టపు రాణి కచబంధమునుండి వెలువడినదియో, లేక జన్మవాసనయో యని సందేహించుటయు[3] తన కాంత యొక్క ధమ్మిల్లమువలె పరిమళముగల పూవెందైన గలదా యని యెంచుటయు[4] పార్వతిఁ బూజించుచుండగా నామె శిరోజములు ఘుమఘుమ

1. భారతి-మే 1964 శ్రీ నో.వ.శా.
2. ఆంధ్రపత్రిక 30-11-1958
3. చొ.నా.చ. 51 విలా-262-266 పుటలు
4. భారతి 1960 నవంబరు శ్రీ తిమ్మావజ్ఝుల.

యని పరిహసించుటచేతను, సభలో నా భావమును బండితోత్తములచే వినఁదలఁచుట గారణముగా నా మూడు కథలయందుఁ గలవు. ప్రథమమున మీపించి శివుని పద్యము చెప్పిన హరవిప్రుఁడు ప్రభువుల మనసులో నున్న భావమున కనుగుణముగాఁ బద్యము చెప్పుటకు వచ్చిన వాఁడు కాఁడనునది మొదట గుర్తించుకొనవలసిన యంశము. అట్టి తఱి 'రాజుపై చెప్పినను రాజు మనోభావ విశదీకరణమగునా' యను సందేహము తొలఁగిపోవును.

ఇఁక శివుఁడు చెప్పినన్న యా పద్యము నెలఁబలుక వేదమనది బరిశీలింతము. కవియున్న సంస్కృత శ్లోకమునకు గాని, వినియున్న తమిళ శ్లోకమునకుగాని ధూర్జటి తెలుఁగున నొక పద్యము వ్రాసియుండఁడగును. ధూర్జటి యిచ్చట ప్రతిపాదింపఁదలఁచినది నత్కీరుని మౌర్ఖ్యము, శివునితోడి సంవాదమె కాని యన్యము కాదు. అప్పుడు నత్కీరుఁడెన్నదగిన యంశమేదియో దానిని పలికిన చాలును.

రాజసభకేఁగుదెంచి శివుఁడు

'ఈ రాజన్యునిమీఁద నేఁగవిత సాహిత్య స్ఫురన్మాధురీ
చారుప్రౌఢిమఁ జెప్పిపంప, విని మాత్సర్యంబు బాటించి న
త్కీరుండూరక తె తప్పు పట్టెనఁట ! యేదీ లక్షణంబో, యలం
కారంబో ?పదబంధమో, రసమో,? చక్కం జెప్పుఁడా తప్పనన్'*

అని ప్రశ్నించినట్లు శివుని పద్యమందలి లక్షణాలంకార పదబంధ రసములలో నే యది తప్పో యెంచ వలసియున్నది. వానియందు వేనియందును తప్పు పట్టక యందలి భావమె తప్పనినాఁడు కదా నత్కీరుఁడు ! ఆ భావమొక్కటియె సరికటించిన చాలును. ఆ పద్యమందలి కవితా చమత్కారము నత్కీరుఁడును తప్పు పట్టలేదాయె. నత్కీర, నీలకంఠుల సంవాదమునకుఁ దోవతీసినది యా పద్య భావమే కాని యా పద్యమందలి యితర లక్షణము లేనియుకావు. కాన నాపద్య భావమును మాత్రమే ధూర్జటి వచించెను. 'మాట యెట్టిదైనను భావమిదియే కదా' యనునది సంవాదమున సాధారణముగా వినవచ్చునది. కథా కథనమున కక్కఱ లేనిచో నా పద్యముఁ బలుక వలసిన పనిలేదు.

---

* శ్రీ.కా.మా. 3అ-167 ప.

శ్రీ శర్మగారనినట్లు రెండుచోట్ల గాక, ధూర్జటి రాజుపై చెప్పిన వాక్యమును ముమ్మాఱు ప్రయోగించినను, ప్రసక్తిలేని యీ పద్యమునుఁ బలుకలేదనియే భావింపఁదగియున్నది.

'ధూర్జటి కల్పనకనుగుణముగనైన నొక పద్యమును గూర్చి యందు 'సింధురరాజ గమనాధమ్మిల్లబంధంబు సహజగంధం' బని పూరించిన నెంతయో యతికినట్లుండుననే గాక, కథాసంవిధానమునకు మెఱుఁగు పెట్టినవాఁడై యుండెడివాఁడనియు శ్రీ సూర్యనారాయణశర్మగారనినారు. ధూర్జటి యట్లే యొక పద్యమును వ్రాసియుండినచో శర్మగారి వాక్యములోని 'యతికినట్లుండు' నన్నమాట సార్థకమయ్యెడిది.

## 2. ఆక్షేపము :

తమిళ పద్యములో 'నడ్పిన్ మైలియల్' మయూరగమన యని యుండగా ధూర్జటి 'సింధురరాజగమనా' యనినాఁడు. వాత్స్యాయనానుగా పురివిప్పి నడయాడు మయూరముల నడకల సొంపుల స్త్రీయనుట ధమ్మిల్లపదసామీప్యమునకు బహుళార్థద్యోతకముఁ గనుకదా !

## సమాధానము :

తమిళమందలి విశేషణము నేల మార్చెనో యని కదా సందేహము ! దానికి కొంత సమాధానముకూడ వారే యూహించి, యా తమిళ పద్య విశేషణమే సాభిప్రాయమై యుండుననియుఁ బలికియున్నారు, శర్మగారు. కాని మొదటి విషయము — ధూర్జటి యీ పద్యము చెప్పించినది, రాజు మనసులోనున్నదానికి వ్యాఖ్యానముగా గాదను విషయమును మఱువరాదు. రాజమనోభావ విశదీకరణము గావించుటకుఁ బూనినపుడుగదా, యీ తమిళపద్య విశేషణము మార్చనేల యను ప్రశ్న యుదయించుట. ఇది ప్రత్యేకముగా రాజుపై శృంగార రసానవద్యముగా చెప్పిపంపిన పద్యము. అట్టి తఱి సింధుర రాజగమనయనుట కంటె మయూర విలాసగమన యనిన బాగుండుననుకొనవలసిన యక్కఱయేలేదు. కేవల మనుప్రాసాలంకారమును, మధురపదబంధమునకు దగియుండునట్లు మాత్రమే యీ మార్పు చేసియుండెనని యూహించుట కవికి యున్న సహజ సుందర రచనా

సామర్థ్యమును శంకించుటయు, లేని కృతక శబ్దాలంకారాల రచనము నాపాదించుటయు నగును, కాని వేఱు కాదు. అట్లే నుయ్యూరముల నడలను బోల్చుట మన తెలుగు కవితా సంప్రదాయదూరమని ధూర్జటి యిట్టి మార్పు చేసియుండునని యూహించుటయు లెస్స. ఇది యొక మూలమునకు మార్పు కాదను ప్రధానాంశమే యిచట — చర్విత చర్వణమైనను బలుకఁదగినది.

## 3. ఆక్షేపము :

శివుని పద్యమం దుపపత్తియుండిన యితర కవు లా హారద్విజుని యూఁడుకొని యుండరా ? అట్టిచో తన పద్యదోషము గమనింపక, దోషకారణము లారయక — తాను తన భక్తుని యెడ కృపాసముద్రుఁడగుగాక — నత్కీరునిపై, అందును శైవ సంవిత్కాసారమరాళముపై నాగ్రహింపవచ్చునా ?

## పరామర్శ : సమాధానము :

హారద్విజుని వాక్యమునఁ దప్పు పట్టినది, నత్కీర కవీంద్రుఁడు. సభలోని తక్కిన కవులెల్లరును నా హారద్విజుని పద్యమును తప్పనలేదు, ఒప్పనలేదు. యథార్థమున కా పద్యమున నత్కీరుఁడు పట్టిన తప్పు వారికినిఁ దప్పనియే తోఁచి మిన్నకయుండిరి. నత్కీరుని వలెనే వారును హారద్విజుని వాక్యమునఁ గవి సమయమునకు వైరుధ్యమును భావించియుండుటయే యందులకుఁ గారణము. అనఁగా శివుని పద్యమం దుపపత్తి లేదనియే వా రూహించియుందురు. అది శివుని పద్యమని తొలుత తెలియకున్నను హారద్విజుఁడు తన 'కప్పరమీశ్వరుండు పసుపాశిపుపై రచియించి యిచ్చినాఁడని పలికిన తరువాతనైనఁ దెలిసినది గదా! అది శివుని పద్యమని తెలిసిన పిదపనైన నత్కీరుఁడు కాని, తదితర కవీంద్రులు గాని యా పద్యమందుఁ దాము గాంచిన దోసఁగను స్వవచనవ్యాఘాతము నాత్మప్రత్యయమునకు భిన్నము నగునట్లు నుడిని సవరించుకొని యది యొప్పేయని పలుకకుండుట యెంతయు సమంజసమై యలరుచున్నదనవలెను. శివుని పద్యమని తెలిసి భయపడలేదని తేలుచున్నది. అదియును గాక, హారద్విజుఁ డా వాక్యము పలికి, తత్క్షణమే వెనుదిరిగి యేనుగదా. వారు, సవరించుకొని నిన భావమునెట్లు పలుకుదురని యెంచనక్కఱలేదు. పద్యమెవ్వరిచే రచియింపఁబడినను, దోసఁగు దోసఁగే యని యీ కవీంద్రుల దృఢ

'శ్రీ' కథయందుఁ జూడనగు![1] పామును గజమునుఁ జంప లేకున్నఁడా నిటలాక్షునకు ప్రాణములర్పింతునని యోచించినది [2] నిటలాక్ష పదము భక్తుల యజ్ఞానకాష్ఠమును దహించుటకు సుసంయుక్తమగుచుండుట గమనింపఁగలము.

నిటలనేత్రముఁజూపుట తాను ముక్కంటిని సుమా యని హెచ్చరించుటయే. కృపాసముద్రుఁడు కాకున్న నా మూఁడవ కంటిచే దగ్ధమొనరించియుండెడువాఁడే కదా! శివుఁడు నిటలాక్షుఁడుగా సభయందుఁ బ్రవేశింపలేదు. జంగమరూపుల యందు నీలగ్రీవము, నిటలమున నేత్రము వంటి యలంకారములను తీర్చుకొని యేఁగుదెంచుట సంప్రదాయము. ధూర్జటి యభిప్రాయమున క్రోధోద్దీపితుఁడైన యీశ్వరుఁడనునదియె యీ నిటలాక్ష శబ్దప్రయోగ ప్రయోజనము. గమనవేగము, కోపతీవ్రతలకు ధ్వనిప్రాయముగా 'కట కట యన్నత్కీరుం, డఁట! కవితయుఁ దప్పు వట్టెనట! యెటువలెనో తెలిసెద! నని నిటలాక్షుఁడు వచ్చినాఁడు. ఆ కన్ను కేవలమలంకారముకాక యథార్థమే యన్న భావముతో సందర్భమునననుసరించి శివుఁడు తన నిటలనేత్రము చూపెను. కథా సంవిధానమున కీ పద్యమున నిటలాక్ష పదప్రయోగము సమంజసము, సముచితమే యనదగియున్నది.

## 5. ఆక్షేపము :

నత్కీరునితో శివుఁడు చేసిన వాదము సమంజసముగా లేదని మరింత దృఢపడును.

## పరామర్శ : సమాధానము :

స్కాంద పురాణమందలి కథ చదివిన తరువాత నీ యభిప్రాయము కలుగు చున్నదని శ్రీ శాస్త్రిగారి భావము.

నత్కీరుని కథ విషయమున సంస్కృత స్కాందమందలి హాలాస్యమాహాత్మ్య కథయందలి సన్నివేశములకును, తమిళమందలి 'తిరువిళయాడల్', గ్రంథమందలి సన్నివేశములకును, ధూర్జటి కృత శ్రీ కాళహస్తిమాహాత్మ్య ప్రబంధమందలి సన్నివేశములకును, తిరువెంగళనాథుని 'చొక్కనాథచరిత్ర' యందలి సన్నివేశములకును

---

1. శ్రీ.కా.మ. 2అ - 99ప  2. శ్రీ.కా.మా. 2అ - 142ప

సామ్యభేదములు పెక్కులు గానంబడుచున్నవి.

ఆయా కథలయందలి సంవాదరీతులను బరిశీలించినపుడు ధూర్జటి చిత్రించిన నత్కీర-శివసంవాదము, శివుడిచ్చిన శాపములు ప్రయోజనవంతములుగ గనుపట్టుచున్నవి. మిగిలిన గ్రంథములందు వానికంటె నిందలి నత్కీరుడు శారీరకముగా, మానసికముగ బాధ వ్యథలు జెంది శివానుగ్రహము బొందెను. శివుని కంటిసెగ తగిలి శాపము జెంది పొత్తామరలో దాగుట విచిత్రముగదా! సెగకంటి చిచ్చునకు బ్రతికి బట్టగట్టుటయా? శ్రీ శాస్త్రి పలికినట్లు స్కాందమందలి యీ సంవాద ఘట్టము బరిశీలించితిమేని శివుడచ్చట నత్కీరుని వచనములందు దోషము లెన్నుట, యందుచే నత్కీరుడింకను క్రోధము గలిగి వివాదము చేయుటలున్నవి. అంత శాస్త్రచర్చ జరిగిన వెనుకగూడ నత్కీరుడు శివుని భావమును నమ్మనని పలుకుట నుజింత మూర్ఖముగదా! తెనుగిన నిట్టిదిలేదు. చర్చలేదు. అడిగిన ప్రశ్నకు సమాధానము. సంస్కృతమున నత్కీరుడు లోకజ్ఞానము కూడ లేనివాడుగ బలుకబడినాడు. తమిళమున నట్టులేకలదు. కాన తెనుగుప్రబంధమున కథా సంవిధానమున కనుగుణమై సంవాదము సంగ్రహముగ, సూటిగా, స్పష్టముగా చిత్రింపబడినదని గమనింపగలము.

## 6. ఆక్షేపము :

ధూర్జటి భక్తిభావము చేతను, ప్రమాణ బుద్ధిచేతను దూరము వినుర్శింపక ఉన్నదున్నట్లు గ్రహించెనని తోచును.

### సమాధానము :

సంస్కృత హాలాస్యమాహాత్మ్యకర్తకును, ధూర్జటి నత్కీరుని కథకును సామ్యము లేశము, భేదమత్యంతమునని తెలినపుడిక పై వాక్యమునకు సార్థక్యమే లేదనవలసి యున్నది గదా.

## 7. ఆక్షేపము :

కథా సంవిధానమునుకుల బొంతమైనది.

**సమాధానము :** శ్రీ సూర్యనారాయణశర్మగారును, శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు

సంస్కృతము, తమిళ సాహిత్యములందు ప్రసిద్ధి నందిన కథాంశములనుగొన్ని స్వీకరించి, స్వీయప్రతిభచే గొన్నిటిని జేర్చి, ప్రబంధమున్ను నిర్వహించుటలో ఒగి, బిగి, తఱుగకుండునట్లు నిర్మించిన యీ నత్కీరుని కథయందలి కథా సంవిధాన మేమాత్రము 'అతుకుల బొంత'కాదు.

ఈ నత్కీరుని కథా సంవిధానమున ధూర్జటి కవీంద్రుడు ప్రదర్శించిన లోకజ్ఞత, స్త్రీ స్వభావచిత్రణము ద్యోతకమగుచున్నది. సమకాలీన కవుల నడుమనుండు మాత్సర్యమును గన్నులకు గట్టుచున్నాడు. నత్కీరుడు సుబ్రహ్మణ్యస్వామిని స్తుతించుటమూలమున దైవానుగ్రహము నొందినయదియు నిట్టిదే. ఆగ్రహించిన తండ్రిని సుముఖుని జేసికొనుట తనయుని ప్రేరేపించుట లోక సహజమైన విషయము. అదియుగాక ధూర్జటి కృత్యాపరిచారిక ... పైనుబ్బరియుండు గావించక, పుర వర్ణనమున వ్యంగ్యింపజేసెను సుబ్రహ్మణ్యుడు. మనసార నిచట నత్కీరుని ముఖమున సేవించినాడు. తమిళమున నక్కీరర్ కథ యందు లేని యీ సుబ్రహ్మణ్య స్తోత్రమును విడిగా తమిళమున గల సుబ్రహ్మణ్య స్తోత్రమును నంశమునుగాని యిట్లు మలచుట యందు ధూర్జటి పై ప్రయోజనమును సాధించినాడనవలె. అటులే నత్కీరుడు శివుని నూఱు ద్రావిడ పద్యములలో స్తుతించినాడన్న విషయమును తరువాత మఱల ధూర్జటి వేశ్యాతనయుల కథయందు స్మరియింపఁజేసినాఁడు.

ఈ విధముగా నత్కీరునిగాథయందు కథా సంవిధానము నతుకులబొంతగాగాక బింకముగాఁ డొంకముగానె యొనరించినాఁడు ధూర్జటి.

## నత్కీరునికథ : కథాసంవిధానము :-

మధురాపుర వర్ణన మారంభించుటతోడనే ధూర్జటి తాను నిర్వహింపనున్న కథ శివునిలీల యని మొదటి పద్యముననె సూచించినాఁడు. 'కపట చతుష్షష్టి గతులవాడిన వాలవాయి చొక్కేశునివాసభూమి.' నత్కీరుని కథనుఁ బలుకనున్నానని మూఁడవ పాదమున ద్రవిడభాషా పీఠతల, శంఖఫలకంబు చే సూచించినాఁడు. 'నిజదృగగ్నిపూజిత నీలకంఠ కూడలశయమవైకుంఠ' సమాసముచే శివుని సర్వాతిశాయిత్వమును స్థాపించినాడు.

x. శ్రీ.కా.మా. 1 ఆ — 18 ప.

'గంగాధరుని మహోగ్రా
పాంగము రతివిధవఁజేసె నాలోపల మా
యంగయకన్యాంబ కృపా
పాంగంబంగజుని దేవి సైదువంజేసెన్'.

అనుపద్యముచే పరమేశ్వరుఁడు నత్కీరుని శపించి కృపాసముద్రుఁడై తిరిగి కాపాడునను సూచనమును వ్యంజింపఁజేయుట నిప్పట్ల గమనింపవలసిన ధూర్జటి కవితా ప్రాభవము.

మహోగ్రాపాంగము మూఁడవకన్ను. దానిచేఁగాల్చినను, నతఁడు గంగాధరుఁడనుటచే ననుగ్రహించినను పరమేశ్వరుననుమతి లేనిదే యట్లు జరుగదు. నత్కీరుని కూడ శివకుమారుఁడగు కుమారస్వామి రక్షించుటయు నిట్టిదే.

లోకమాతృక రక్షింప సంపదలందొదలు మధురాపురమునం గలవు కల్గుట యీశ్వరలీలా విలాసమే. ఆ పురమందలి స్త్రీలందఱును పార్వతి పేర్ల నే వ్యవహరింపబడుచు, సర్వదా పరమేశ్వరి నామ సంస్మరణచే ధన్యులగుచుండిరట. నత్కీరాది కవీంద్రులు 'దివిషదన్నప్రాయవాగ్గుంఫసంపత్కావ్య ప్రతిపాదక ప్రతినిధులు'అనికొనియాడుట ధూర్జటి స్వీయకవితా వైభవమునకు వ్యాఖ్యాన ప్రాయముగానున్నవి. సందర్భోచితముగ నాయా తావులందుఁ గవులు పరోక్షముగ స్వీయకావ్యఘటితిఁబరామర్శించుట కద్దు. దీనికిఁబ్రతిబింబముగా పింగళి సూరనార్యుఁడు కళాపూర్ణోదయమునను, ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధములందిట్టి స్వీయకవితాప్రాగల్భ్య ప్రస్తుతులనుఁబరోక్షముగాఁ బాత్రలముఖమున బలికియున్నాఁడు. ధూర్జటి యీవిధముగనె యీఘట్టమునందే యీశ్వరునిచే సభాస్థలియందు 'సాహిత్య స్ఫురన్మాధురీ చారుప్రౌఢిమ'యను వాక్యమును, నత్కీరుని మెచ్చుకొనుచు 'సాహిత్య శ్రీవర' యను వాక్యమును బలికించి యున్నాఁడు. ఈరీతినిఁబలికిన ధూర్జటివాక్యములకు ప్రబంధమంతయుఁ దార్కాణముగ గ్రహింపఁదగియున్నది. ఈ ఘట్టమున నది మఱింత సార్థకమయి విలసిల్లుచున్నది. నత్కీరపరమేశ్వరులసంవాదము,నత్కీరుని పశ్చాత్తాపము, నత్కీరుని కుష్ఠవ్యాధి బాధ, మానసిక వ్యథ, తీర్థయాత్ర, వివిధక్షేత్ర దర్శనము, కొలనివర్ణనము భూతవృత్తము, సుబ్రహ్మణ్యుని యనునయము, శివానుగ్రహములను ఘట్టములందు ధూర్జటిసంభాషణరీతి, వర్ణన, రసపోషణ,కథనములందు భంద ఔచిత్యముతో నలరించి

యున్నాఁడు. శాస్త్రజ్ఞత, వాదనైపుణి, శబ్దార్థాలంకారశోభితరచనారీతి, మనస్తత్వ నిరూపక సమర్థములగు నత్కీరుని పాత్ర చిత్రణము, అవస్థాచిత్రణ చణత్వము, ఘాతరూప చిత్రణము, సద్యరచనా శిల్పములందుఁ దనకుఁగల ప్రజ్ఞను వెలార్చినాఁడు, ధూర్జటి.

హరద్విజుని నవమానించిన నత్కీరుని శక్తి సామర్థ్యముల విషయముఁ దెల్పుచు మనకు భయ మందేరిన పరమేశుని గమనవేగము, నత్కీరునియందలి నిర్లక్ష్య భావముల కనుగుణములగు పదప్రయోగమున కనువైన కందము నెత్తికొని ధూర్జటి సన్నివేశమున కౌచిత్యము సంపాదించుట నిప్పట్ల గమనింపఁ గలము.

'కటకట! యన్నత్కీరుఁడుం, దటఁ! కవితయుఁదప్పువట్టెనఁట! యెటు పదమీ యెటు వలెనో' తెలిపెదనని, 'నిటలాక్షుఁడువచ్చి కుంభినీపతిసభలోన్'[1] గమనవేగముఁ గందమందించు చుండఁగా 'అన్నత్కీరుండటఁట, తప్పుపట్టెనట అటుపదమీ యెటువలెనో అన్నది పదములా శివునకుఁ గలిగిన కోపతీవ్రత, నత్కీరునందలి యేహ్య భావముల వెల్లడించుచున్నవి.

నత్కీరుని శపించిన విధముఁ గందమునే చెందముగఁ బొందింపఁజేసినాఁడు కవీంద్రుఁడు. రెండులఘువులపై రెండు గురువులు రెండు పదములచే నీ శాపతీవ్రతను, కోపాధిక్యమును స్పష్టముఁ గావించుట జరిగినది. 'శపియించెం, గుపితుం డై'[2]

నత్కీరుఁడు నయనింపనున్న గహనములో మార్గమును వర్ణించుట యందు దీర్ఘ సమాసఘటనముచేఁ గూర్చిరమ్యగ సంకీర్ణతను, రాక్షసోత్కర సంచార భీకరత్వముఁ గన్నుల గట్టుచున్నయిది. మార్గ మార్గ మధ్యమునఁ దలఁచి, నత్కీరుఁడు గావించిన యాక్రోశము, గజేంద్రుని నిస్సహాయదశను, నాక్రోశమును స్మరణకుఁ దెచ్చు లాగున నున్నది. 'కరుణాసాగర! భక్తవత్సల! శివా! గౌరీశ! యెట్లోగదే?'[3]

సందర్భము నవకాశముగాఁగాని పోతనవలె, ధూర్జటియుఁ బరమేశ్వరుని మనసార, తనవి తీఱనట్లు కొనియాడి, మొఱలిడుచుండును. నత్కీరుఁడు, తనకుఁ గలుగనున్న కుష్ఠవ్యాధి భయంకర స్వరూపముఁ దలఁచుట, కాళఖండమందలి శివశర్మ పొందిన యావేదనమును స్మరణకు దెచ్చుచున్నది.

తనశతకమున ధూర్జటి యు యిట్టి యావేదనము పొందియున్నాఁడు 'దంతంబు ల్పడనప్పుడే .... .... ....'[4]

1. శ్రీ.కా.మా. 3 ఆ 166 ప    3. శ్రీ.కా.మా. 3 ఆ — 176 ప
2. ” ” 172 ప    4 శ్రీ. కా. శ. 116 ప

పరిబంధమందలి పైపద్యమున ధూర్జటి యుపప్లావచిత్రణముఁ గావించుచు బీభత్సరస పోషణముఁ గావించినాఁడు.

నక్కీరుఁడుత్తరమునకుఁ గదలుటతోడి కవులకు సంతసముఁ గూర్చినది. ఈ ఘట్ట మంతయు నక్కీరుని వెనుక మన ధూర్జటి నిలిచియున్నాఁడనిపించునుసు గదా! దక్షిణదేశ కవీంద్రుని చిత్రించునపుడు. ధూర్జటి, యాదేశీయుల యారాధ్య దైవమైన 'మురుగన్' – కుమారస్వామిని, నక్కీరునకు శాపవిమోచన మార్గోపదేశకునిగాఁ జిత్రించుట కడంగడు సముచితమగు కల్పనము. ఈశ్వరుని స్తుతించుచు నక్కీరుఁడు పలికిన నూఱుద్రావిడ పద్యములను, ధూర్జటి ప్రత్యేకముగా తానే యొక శతక రూపమునఁ బలికి యుండెనని యెంచుటయుఁగలదు.

భక్తులపేక్షించునది భీతిత్యాగము. నక్కీరునకుఁ గల భీతిని పరమేశ్వరుఁడు యాతఁడు కోరిన సాయుజ్యమిచ్చి యనుగ్రహించినాఁడు. నక్కీరుఁడు కోరిన కోరిక, ధూర్జటి కింకముఁ దీఱనికోర్కియే.

'ఈ సంసారముమఃఖావాసానందము, దీని పర్టింపగా నేసుఖము గలుగు....! నాసుఖము దనకిమ్మమనది ధూర్జటి నక్కీరుని ముఖమునఁ బరమేశ్వరునిఁ గోరినది. కవీంద్రుడు పలికినట్లు అవిద్యా సూత్రము ఖండింపఁబడిననేకాని జీవన ఖేదాంబరము కత్తిరింపఁబడఁజాలదు.

ఆశ్వాసాంతపద్యములందు పంచభూతాత్మక స్వరూపుడు, పరమార్థాకారుఁడు నగు పరమేశ్వరుని స్తుతించుచు, ధూర్జటి తన కథా సంవిధాన సూత్రమున 'గండూషిత, పంచాధినాథనందన, శబ్దములచే తిన్నని చరితమును, 'చక్షుశ్శ్రోత్ర పక్షీశ్వరా 'యను సంబోధనచే చెలఁదిని, 'వాగధీశ' శబ్దముచే బ్రహ్మ కథను పూర్వ కథితాంశములను స్మరియించినాఁడు.

తృతీయాశ్వాసము ధూర్జటి కథా సంవిధాన సామర్థ్యమునకు దర్పణమైనట్లే వ్యక్తిత్వమునకుఁ బ్రతిబింబమై నెగడుచున్నది.

# చతుర్థాశ్వాసము

కథా సంవిధానమున నిది నిర్వహణఘట్టము. తొలుత భావించియున్న రీతిని, ధూర్జటి, యొక ప్రణాళికననుసరించి, యీ కథా నిర్వహణమొనర్చు చున్నాఁడు.

'కందర్ప దర్పాంత శ్రీ పరిహాసకృన్నిఖిల లోకాతీతసౌందర్య,' 'పురపల్లవ ప్రకర నేత్రానంద బాష్పాంబుధారావర్షా గమచంచలాలతిక, దుర్వార ప్రసూనాస్త్ర తేజో వైశ్వానర సామిధేని,' 'శివాచారైక సంశీల' యగు దాసి కథతోఁ బ్రారంభించిన ప్రబంధమును 'లతాంతాస్త్ర కళావిధిజ్ఞలగు వారస్త్రీలలోఁబుట్టియు శైవధర్మంబె ధర్మంబుగాఁబూని, 'కళానిధి శేఖర భక్తియుక్తలైన వేశ్యాతనయల వృత్తముతో ముగించుట, ధూర్జటి వస్తునిర్వహణాచణత్వమున కుదాహరణ.

అనఁగా మొదటిపూస గుచ్చిన తావునకు దుదిపూసఁదెచ్చి గుచ్చి ముడి వేయుట యిది. అందువలననే యీ గ్రంథము ప్రబంధమైన దనవలసి యున్నది.

వేశ్యాతనయలవృత్తమున ధూర్జటి కవీంద్రుఁడు తనకుఁ గల కామశాస్త్రజ్ఞత లోకజ్ఞతలను, చక్కఁగాఁ బ్రదర్శించినాఁడు. వేశ్యల యిండ్లు, కుడ్యచిత్రములు, వారి గుణశీలములను, వేశ్యమాతల చిత్తవృత్తులు, మిక్కిలి పరిచయమున్నవానివలె ధూర్జటి వర్ణించుట, యాతని వ్యక్తిత్వమునకు కళంకముఁదేనక్కఱలేదు, నాఁటి రాజులయు, కవిరాజులయు వ్యక్తిగత జీవితములందు వేశ్యాసంపర్కమొక గౌరవముగా ఘనతగాఁ బరిగణింపఁబడెడిదని గుర్తుంచుకొనవలయును. కూఁతులపై గంపెడాశతో నున్న యీ వేశ్యమాతకుఁ బుట్టిన కన్యలిద్దరును జన్మాంతర వాసనాబలిమిచే, తల్లి మాటఁ బెడచెవినిఁ బెట్టిరి. 'శివభక్తి తనువులొత్తిన పగిది' వారు జనించుటచే, నుయ్యెలలోనున్నప్పుడే వారు 'తారకయోగ మార్గదర్శనరతు' లనిపించినారు. పాపము వారితల్లి, వారికి 'కొక్కోక కళావిలాసములకుం గల యర్థము జోలపాటగా' పాడి నది. కన్యలకూహ కలుగనప్పటికిఁ గృత్యములన్నిట వావివరుసలులేవి వారి పొందు, పొత్తులనే చిత్రింపఁ జేసినది. 'కులాచార ప్రధానోల్లసన్మదనామ్నాయ తదంగ శాస్త్రములఁ జదివించి తమ 'వారధర్మ విద్యాకుశలత్వము' వారల కచ్చుపడ వలెనని పాటుపడినది. కాని యీ ప్రయత్నములెల్ల వారిపట్ల చెవిటికి సంకూదినట్లె

యయినవి. వారియందు వయసుతోఁ బాటు వారధర్మములందాసక్తి తగ్గుచుండుటయు, శివపూజనాసక్తి, శైవాగమాంతర జ్ఞానము పార్వతీ ప్రాణేశభక్తియు, వృద్ధిఁ బొందుచుండెనట. నక్కీరుఁడు చెప్పిన నూఱు పద్యములను పాఠముసేసి, నిత్యవ్రతముగా బఠించుచుండిరి. కూఁతులమఁ జెరగొట్టుచున్న 'శివభక్తి పాడుగాన'ను కొనుచు దల్లి తనయలకు కులాచార ధర్మము నవలంబించి తన యాసలు సఫలమొనర్పుఁడని పెవిధములఁ గఱపినది. వారధర్మములను రోసి, సర్వవిధముల తనకు శరణ్యుఁడు పరమేశ్వరుఁడొక్కఁడేయని స్పష్టముచేసినారు వేశ్యాతనయులు. వీరి శివభక్తి పారమ్యము, ప్రహ్లాదుని విష్ణుభక్తి పారమ్యమునుఁ బోలియున్నది.

ఈ వేశ్యాతనయల గాథయందు ధూర్జటి భక్తి పారమ్యము నెంత వెలార్చినాఁడో శృంగార రాసికత్వము నంతగా వెలువరించినాఁడనవలె. వేశ్యాతనయల రూపరేఖలను వారి వృద్ధమాత వర్ణించినతీరు, కూఁతులకుఁ గావించిన బోధ లిందుకుఁ దావులు. తల్లి, కూఁతులు తుదిపట్టమునకు, దృఢనిర్ణయమునకు రాకతప్పలేదు. మణిమంత్ర తంత్ర విద్యలచే గాని, మందులచేఁ గాని, తన కూఁతులకున్న యీశ్వర జ్ఞానముపోన్పి, కామసుఖాసక్తలఁ జేసిన నెలఁతలకు వారికత గాఢమైన బహుమ్వోక, తన తనెల్ల కన్నెరికము నిచ్చిపెట్టుదునని వేశ్యమాత నిశ్చయించుకొనినది. తల్లిబోధ బాధపడలేక తమను శ్రీ కాళహస్తీశ్వరుని సన్నిధి జేర్చువాడెవరో గదాయని తలంచుచుండిరి. తల్లి తుది నిర్ణయమునకు వచ్చుటతోఁ గూఁతులకును తుదినిర్ణయమునకు రాక తప్పలేదు. అనగా తల్లి తొందరపాటే వారిని తొందరచేసినది. మొదటి పద్యము రెండవ పద్యమునకుఁ బ్రోత్సహించినట్లు, తల్లి నిర్ణయము కూఁతుల నిర్ణయమునకుఁ గారణమైనదను భావమును ధూర్జటి యీ రెండు నిర్ణయములను, వాని తొందరపాటును వెన్వెంటనే రెండు పద్యములను గూర్చుట వలనఁ బలికినట్లయ్యెను.

వేశ్యాతనయలు తమ తల్లి కావించినది బోధకాదని, బోధముఖుఁడు శ్రీ కాళహస్తీశ్వరుఁడే యని తలంచుటవలననే పరమేశ్వరునిఁ జేరగా నంత యారాటంపడిరి. కన్నగాండ్రు వేశ్యాతనయలను మోసగింపఁబూనుట, వారినుండి యూహుఁడు వారలఁ బ్రోచుట తరువాత ఘట్టము. దొంగలు మోసగించుటయందు నేర్పరులు. అందును స్త్రీలను మోసగింపఁబూనుట కడు సులభము. మఱియు కన్యలను, నాపై నింటినుండి [illegible] వారిని మోసగించుట కడుంగడు సులభమయినది. ఈ విషయమున కవీంద్రుఁడు లోకజ్ఞానమును, లోకానుభవమును నిరూపించుకొనెను.

ఇంటిముందు పంచ, యాపంచలో తిన్నెలుండుట ఆదర్శ గృహనిర్మాణవైఖరి. ఆ యరుగులపై మార్గాయాస మపనయించుకొను బాటసారులు కూర్చుండు చుందురు. ఒక్కొక్కప్పుడట్లు కూర్చుండియుండు వారిలో నింట దొంగతనముఁ జేయఁదలంచిన దొంగలు కూడ మారువేసములతో నుందురు.

వేశ్యాతనయలున్న గృహమునకు వెలుపలనున్న పంచ తిన్నియల మీఁద వేచియున్నవారు, కాచుకొనియున్నవారు జంగమ రూపులైన దొంగలు. ఆ యింటఁ గల కన్నియలు జంగమార్చకులని, శివ భక్తులని యూరివారెల్లఁ దెలియుదురుఁగాన, నా కన్నియలను మోసగింపవలెనన్న జంగమ వేషములు తగినవని వారీవరకె గ్రహించి యుందురు. అదియుఁగాక యూరిలోఁజేయబోవు దొంగతనములకు ముందు నిచ్చలు వారా తిన్నియలపైఁ జేరి యాలోచించు చుందురనియు భావింపఁదగును.

శ్రీ కాళహస్తీశ్వరునిఁ గొలువఁ దమ్ము దోడ్కొనిపోవు ధన్యులుండరా యని యా వేశ్యాతనయలు తలపోయుచుండ గన్నగాండ్రు వినినారఁట. ఇది విచిత్రము. వేశ్యాతనయల తలంపు కన్నగాండ్రకెట్లు తెలిసినది ? కన్యలు తలపోయుచుండఁ దెలిసికొనుట కష్టముగదా ! ఈ పద్యమునకుఁ బై పద్యమునకొక శతర్థక క్రియ కలదు. ఈ పద్యము తుమున్నర్థముతోఁ బ్రారంభమైనది. రెండింటిని కలిపిన 'అనుమన్ దలపోయన్' అగును. వారి మనసులోని కోరికను పెద్దగ పలికిరనియు, 'తలపోయన్' అనుటయందుఁ గేవలము మదిలో నాలోచించుకొనిరనిగాక, యా యాలోచనమును సంభాషణ రూపమున నా యప్పచెల్లెండ్రు, మాటలాడికొనిరని భావింపనగును

మనసు మనసులో లేనపుడు, వాద ప్రతివాదములు నడ్డునపుడు, తమ విషయము నవ్వులెవరైన వెలుపలనుండి వినుచున్నారేమొ యను భావమే కలుగకుండుట లోక సహజమైన విషయము. అట్టిదే యిచ్చటను సంభవించినది 'జనని తమ్మిం డ్రింప నారాటముల్, పోరాటంబు ఘనసంబులై ...' బాధింపగా, నా వేశ్యాతనయల మనములారాటముఁ జెందినవి. శ్రీ కాళహస్తి పోవక తప్పదనియు, తమ్మాప్రాంతములకు గొంపోవు ధన్యులెవరని యా యావేదనలోఁ బెద్దగనె పలువారికి వినిపించు నటులే పలికియుండిరి. తమ పలుకుల నొరులెవ్వరేని వినియుందురని వారూహించి యుండరాస్థితిలో.

తల్లి, కూతుండ్రు పోరాడుట నా కన్నుగాండ్రు గమనించుచునే యున్నారట. 'ఏలా తల్లితోఁ బోరఁగా ?' యని ప్రశ్నించినారు. ఈ పద్యము [49–53 ప] వేశ్యాతనయలు తల్లితోఁ బోరాడుచుండుటయు, గాళహస్తీశ్వరుఁగాంచ నారాటపడు చుండుటయు దొంగలకెఱుకయే యని తెలుపుచున్నది. తమ వెంట నా కన్నియలఁ దోడ్కొని పోవఁదలంచిన యా దొంగలకు వారి నాకర్షించుట, మోసగించుట సుల భమైనది. ఎట్టివారి మనస్సెఱిఁగి, పలుకులచేతనే మోసగించుట జరుగును. కన్నియల పోరాటము లెఱుకయయినవి. ఆ రెండింటికి, నా కన్యల మనస్సులలో నుండు రీతి సమాధానము బలికిన నత్యంత సుకరముగా వారు వశమగుదురు. ఇక తల్లితోఁ బోరాడఁ బనిలేదనియు, గాళహస్తీశ్వరుని సన్నిధికిఁ దాము చేర్చగలమనియుఁ బలు కులతో నా వేశ్యాతనయ లా దొంగల వాక్యములు తమ మదికి దగులుటయు. వారికి లోఁగుటయు జరిగినది. దొంగలు వారిని వెంటనే బయలు దేరుమనలేదు. ప్రయా ణము రాత్రివేళ యనినారు. వారి వాక్యము లా కన్యలకు యథార్థములనిపించి, తమ్ముఁ బ్రోవ సాధన్యుల నా కాళహస్తీశ్వరుఁడే పంపియుండునన్నంత విశ్వాసము కుది రినది. వారి హృదయములు పరమేశ్వరోన్ముఖములయినవి. దొంగలకు 'శరణార్థి చేసి తమసోహంబెల్లఁ జెల్లించిరి'.

జంగమాంగనలై, యింటి బిడ్డల నిర్వుర కనేకధనములిచ్చి వెంట నీసికొని, యా దొంగల వెంటఁ గదిలి, 'శివా!యని పల్కుడు' నద్దమరేయి గృహంబు పాడు పెట్టి పోయిరి.

దొంగలు వీరిని తప్పుత్రోవల ద్రిప్పి, కుంభకోణము, చిదంబరములు దాటించి తీసికొనిపోవుచుండిరి. అనేకగ్రామములంబా దొంగలు వేశ్యాతనయలంబంపి సొమ్ము లపహరింపఁ బ్రయత్నించుటయు, నప్పటప్పటికి బరమశివుఁడు కన్నియల కాత్మో పదేశము చేయుమిషచే జాగరూకలఁ జేయుచు రక్షించుచుండెను. అరణీనది తటి యందుఁగల వాలీశ్వరునిఁ బూజించిరి. అచ్చటికి 'తిరుకాళశైల కృదజశ్రీ భంగ శృంగములు' కంటికగపడుచుండును. ఆ రాత్రి వారచట నిదదేరిరి.

వాలి పూజించిన శివలింగ కథ యిట పేర్కొనఁబడినది. ఈ కథ నిచట ప్రసక్తము చేయుటయందు ధూర్జటి యౌచిత్యసంపాదనము గావించినవాఁడే యయినాఁ డన వలసియున్నది.

మహిమాన్వితుఁడగు పరమేశ్వరుని లీలలు వినియుండిరికాని, యింటిగడప కదిలి యెఱుఁగని యా వేశ్యాతనయలు క్రమముగాఁ బరమశివుని పుణ్యస్థలములు దర్శించుచు వచ్చుచుండిరి. ఈశ్వరుని భక్తియెంత గాఢముగ నుండునో, యీశ్వరుఁ డెంతటి భక్తపరాధీనుఁడో నిరూపించు నొక ఘట్టము తెలిసికొనుట కుత్సహించుట సహజముగుట నటులుంచగా, కనఁబోవు శ్రీ కాళహస్తి సమీప ప్రాంతమందలి పుణ్య స్థల విశేషములం దాసక్తి హెచ్చుటయు నత్యంత సహజము. అందున వా భక్తుఁడు నగము మనిషి, నగమునకు సన్నిహితుఁడైనను నతిచంచల స్వభావుఁడగువానరుఁడతఁడు. చంచలునియచంచల భక్తి విశేషము చాఁటు నా యైతిహ్యము కుతూహలమునకు గారణమయినది.

వాలి పరమేశ్వరునకుఁ గావించుకొనిన విన్నపము, చేసిన యాత్రి, కవి ధూర్జటి చేసినవి యనిపించును. అట్టి గాఢ ప్రపత్తి వేశ్యాతనయలకు నున్నట్టిదే యనియుప్యంజింపఁబడుచున్నది. ఆక్షేత్రమహిమ మత్యద్భుతమైనది. ఇనుపముక్కలు బంగరు శలాకలగును. మృతమృగములు సజీవములగును. వన్యాశనములు తివినవారికిఁ గాయసిద్ధియగును ఇత్యాదిగాగల యద్భుతము లెన్నియేనిఁగలవిచట.

నాలీక్వదుని కథ, సూర్యాస్తమయాది వర్ణనములచే కథయందుఁ గలిగిన కాల యాపనము, వేశ్యాతనయలు శ్రీ కాళహస్తిఁగని సమీపించుచున్నకాలఁడి యాసక్తి పెరు గుటకు వలసిన యెడము. పరమేశ్వరుఁడే స్వయముగా జంగమాకారమున ప్రమథు లతోఁ గదలివచ్చి, దొంగల బారినుండి యా వేశ్యాతనయల రక్షించి, శ్రీ కాళహస్తినిఁ జేర్చి యంతర్ధానమగుట వారిని ధన్యచరితులఁ జేయుట. ఇచ్చటగల సంధి వచనము దీర్ఘమై, దూరాన్వయముతో నుండుట విచారింపవలసిన యంశము. ఆ వచనమున పూర్వము కథితములయిన భక్తుల చరితములు స్మరింపఁబడినవి. ఈ విధానము ధూర్జటి కవీంద్రునకు సాజమైనది. పురమున వేశ్యాతనయలకుఁ గనుపట్టిన పౌరు లెల్లరు పరమ మాహేశ్వరులుగా నున్నవారు. మూర్తిత్రియాత్మకమైన దైవ వర్ణన మట మటల ప్రత్యక్షమైనది.

శ్రీ కాళహస్తిప తినిఁ జేరుచున్న యా భాగ్యవతులు పార్వతీకగుణ గౌరవముఁబొందినట్లున్న విభావనాలంకారము, వేశ్యాతనయలకు సహజ సౌందర్యము నాపాదించుచున్నది. భవ భవన దర్శనముచే వారికి గలిగిన మైపులకములను రూపించుటయందు కవి ధూర్జటి భక్తి పారమ్యము, భగవద్దర్శనానందానుభూతి

రూపుకట్టుచున్నవి. అప్పటి వారి సాహిత్యోదయము ధూర్జటి కవీంద్రునిదే.

“జ్ఞానప్రసూన కలికయుఁ దాను గన్యకల దైన్యంబుడుపన్
బూని యొరదేహమై యెదురై నిల్చి శివుండు ....” 4 ఆ — 127 ప.

సతీయుతుఁడైన పరమేశ్వరుఁడు భక్తులకు ప్రత్యక్షమగుచుండుట పూర్వ భక్త చరితములఁ జూచితిమి. ఇచ్చట నొక ప్రత్యేకతయున్నది. సతీపురుషగాఁగను పట్టినను పార్వతీపరమేశ్వరులొక్కటియేయను పరమేశ్వరతత్త్వమిట ననుసంధింపఁ బడుచున్నది. అర్ధనారీశ్వరతత్త్వమిటఁ బ్రత్యక్షీకరింపబడినది. శక్తియుక్తుఁడైన సర్వేశ్వరుఁడనియు కాక శివయు శివుఁడు నొక్కటియే యనియు శివశక్త్యాత్మక మీ జగత్తనియు ననెడి పరతత్త్వమును సూచించు ‘శివుఁడ’ను పదమిట నుపయుక్తమైనది.

వేశ్యాతనయుల ననుగ్రహించిన దొక తేజము. జననీజనక శరీరము, విద్యా పురుష సామరస్యసుఖాకారము, శృంగార శాంతరసమయమునైన దా దివ్యతేజము.

వేశ్యాతనయులకు సాయుజ్యమిచ్చిన శివునియనుగ్రహ విశేషమునుఁ బలుకుచో ధూర్జటి కవీంద్రుఁడొక కవితా చమత్కారము సూపి తన ప్రతిభా విశేషమును వెలార్చి యున్నాఁడు. ఎడతెగక సేవించు దాక్షాయణికి శివుఁడిచ్చినది సగము శరీరమే. వేశ్యాతనయులకు తన శరీరముననంటటను చోటిచ్చినాఁడట. ఆ చర్యకు దాక్షాయణి సిగ్గుఁజెందెనట. అనఁగా నందొక మహార్థము వ్యంజింపబడుచున్నదివోలె నగపడుచున్నది. వేశ్యాతనయుల భాగ్యమెంతకాకున్న వారలకుఁ బరమేశ్వరుఁడు సాయుజ్య మిచ్చెనన్నది యటులుండ, పూర్వభక్తులకిచ్చిన సాయుజ్యమునకు, వేశ్యాకన్యలకిచ్చిన సాయుజ్యమునకు పైకి గనుపట్టుచున్నను, నొక విశిష్టమైన అంతరము యున్నది. వారెల్లరు పురుగులు, పురుషులు సుందరాంగులైన యీ వేశ్యాతనయులకు శరీరమిచ్చుట సగము శరీరము నాక్రమించి యున్న దాక్షాయణికిసిగ్గు కల్గించుట యిందలి విశేషము. దాక్షాయణి సిగ్గు చెందుట యందిట్టి భావమున్నను వేశ్యాతనయుల భక్త్యుల్బణమున కచ్చెరుపాటు చెందినదన్నట్టిదది.

ఈ వేశ్యాతనయుల గాథను స్వీకరించుటయందు ధూర్జటి కవీంద్రుఁడొక ప్రత్యేక ప్రయోజనము సాధించెననవలసి యున్నది. సంస్కృతమునఁ గల శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యమునందలి యిరువురు రాజకన్యల చరితము ధూర్జటి వేశ్యాతనయుల

చరితముగా రూపొందించుటయందు కవి సాధించిన ప్రయోజనమేదియో పరిశీలింప వలసియున్నది. భక్తి ప్రత్తులకు దూరమై, వృత్తిరేతమైన నాతాపరణమందలి ప్రాణుల పరమేశ్వరభక్తిని జిత్రించుటకు ధూర్జటి పూనిక వహించిన విషయము నిప్పట్ల సమ పంధింపవలసి యున్నది. తొలుత నే భావించిన రీతిని, కవి ధూర్జటి వేశ్యయయిన దాసి కథతోఁ బ్రారంభించి, వేశ్యాతనయుల కథతో ముగించుట యాతని కథా ప్రణాళిక. ఆ దాసికి చెడగఁ బుత్తోడు లేమి ఈ వేశ్యాతనయులకు బుట్టిన దాది తల్లి వేశ్యాధర్మముల మప్పగెట్టినది. దాసికి జంగమార్చనము నిత్యకృత్యమైనది. వేశ్యాతనయుల కట్టి యవకాశములేక యిల్లే చెఱయైనది. దాసిని, వేశ్యాతనయుల నుద్ధరించుటకై పరమేశ్వరుఁడే స్వయముగా నేఁగుదెంచెను. ఆ దాసి జంగములనే శివు నిగా భావింపగా, నీఁట వేశ్యాతనయలు 'మనుపకు శరీరమొసఁగిన మగఁడు, చివంగసకు మగఁడు, మాయా సతికిన్ మగఁడు, మగవేల్పులకుదగు మగఁడు .. నయనహాఁడు, తనుకు మగఁడగునుగాని మనుజుఁడు మగఁడు కాజాలఁడనియుఁ బలికిరి. మనుపకు శరీరమొసఁగిన మగఁడే తమకు మగఁడు కావలయునని వాపోవుటచేత వే జ్ఞానపరిస్థా నకళికయు దాము నొకదేహమై యీశ్వరుఁడు సాక్షాత్కరించి, మెచ్చెగత సేవ సేయుం గాయుంబున సగంబిచ్చెదని నాతో యని సిగ్గుపడునట్లు, సాయుజ్య మిచ్చెను. ఈ సంవిధానమింత సమర్థవంతముగా ధూర్జటి నిర్వహించినాఁడు.

ఈ కథయందు వేశ్యాతనయులు 'రాజకళాధరుచరితము' చదువుకొనుచు పయనము సాగించిరని కలదు. వారు చదివిన 'రాజకాధర చరిత్రము' తమిళమూ, సంస్కృతమూ, తెలుఁగాయని శ్రీ రి. కోదండరామయ్యగారి కొక సందేహము కలిగినది. కాని ధూర్జటి యుపయోగించిన వానిముందరి విశేషణముఁజూచిన సందేహము తీరిపోవును. 'వాలి పూజించిన యా రాజకాధరుచరితము.' మైననారు తెలిసి. కొనిన వాలి చరిత్రమున చూచిన వాలీశ్వరు చరితమని యర్థము. అచట గల 'చదువుకొనుచు' అన్న క్రియకు నక్షర రూపమున గ్రంథమును పఠించుచు నని యర్థముకాక మననము చేసికొనుచు నను నర్థమేయిఁట సారస్యమైనది. గ్రథితమైనను, గాకున్నను వారు పురాణజ్ఞులయిన పౌరులవలన విని యున్నచరితమిది. ఆ పుణ్యచరితమునే స్మరించుకొనుచు నేఁగిరని భావము. అంతియేకాక వారు నత్కీరుఁడు చెప్పియున్న నూఱు బ్రావిశ పద్యములను ★ చదువుకొను చుండుటయు రెండునూఱు

★ శ్రీ.కా.మా. 4 అ — 24 పద్యము,

లుదాహరింపఁబడుట నిప్పట్లు గుర్తుంచుకొనదగును. వేశ్యాతనయులు మధుర పుర వాసులు, నత్కీరుని ద్రావిడ పద్యములను పాఠంబు సేసి, నిత్యవ్రతముగాఁ బఠించిన వారుగాన వారు తమిళ భాష నెఱిఁగినవారేయని తెల్లమగుచున్నది. కాన వేశ్యాతనయులు చదువుకొనుచు నేఁగిన రాజ కళాధరుచరితము తమిళ గ్రంథమందలిది కాకున్నను, వారు మనస్సులో మననముచేసికొన్నట్టిదే కాని యన్యముకాదు. వారు తమిళ భాషలు కానఁ దమిళముననే మననము చేసి యుందురని భావించుట నమంజసముగా నుండును. నత్కీరుని నూఱు పద్యములు కంఠస్థములయ్యెననియే కదా సారము !

ఈ వేశ్యాతనయుల కథ యందింకొక సంవిధానపై చిత్రి కలదు. అది నత్కీరుని కథ తరువాత వచ్చుట. అనఁగా నత్కీరుని కవితా ప్రభావము వారిపై బాగుగా పనిచేసినదని నిరూపించుట. అతని కవిత్వమందలి చమత్కారము, శివుని స్తుతించిన యా ద్రావిడ భాషా మాధుర్యము, కొనియాడబడిన శివుని గొప్పతనములు, వేశ్య కన్యలను ప్రభావితము చేసెనని కదా తేలునది.

"కవితా చమత్కారము మీఱ నత్కీరుండు చెప్పిన నూఱు పద్యంబులు పాఠంబుచేసి, నిత్యవ్రతంబుగాఁ బఠింపుచు ....[1]"

"ద్రవిళ కవిరచిత నుతిశత, మవిరళ గతిఁజదువుకొనుచు ...."[2]

అను రెండు తావుల నీప్రస్తావము గనగును. ఇందు నురియొక విచిత్రముగాన నగుచున్నది. వారెకంతటి పరమేశ్వరునియందు భక్తి కుదురుటకీ రెండుసందర్భములను నెలకొనిన తావు లత్యంత నముచితములై యలరుచున్నవి. మొదటి సందర్భము వారిని తొలుతగా ప్రభావితులనుఁజేయఁగా, రెండవ ఘట్టము వారి నిఁక నన్యవిచార వ్యవహార విదూరులఁ జేసినది.

ఇఁట కవి ధూర్జటి లోకజ్ఞతయు స్పష్టమగుచున్నది. భగవద్ధ్యానముతో గుడికి బయల్దేరుట, త్రోవలో భగవన్నామమును మననము చేసికొనుచు, భగవల్లీలను గాంచి పులకించిపోవుచు, గుడిప్రవేశించునప్పుడు, భగవద్దర్శనము చేయునప్పుడును భగవ న్నామమును బలుసారులు మననము చేయుట సహజము.

---

1, శ్రీ. కా. మా. 4అ.24 వచన

2 " 4 అ.120 ప.

త్రోవలో నెట్టి యాటంకములు గలిగినను, భగవత్సాన్నిధ్యము చేరునప్పటికి ఇతరము లన్నియు మఱచిపోయి స్థిరచిత్తముతో, నిశ్చల బుద్ధితో భగవద్ధ్యానమొనర్చుట భక్తుల లక్షణము అదియే ధూర్జటి యిందు రూపించినట్టిది.

పరమేశ్వరుని మహత్త్వ విశిష్టతను జెప్పుట కోయన్నట్లు కాళహస్తికిఁ దోడ్కొనివచ్చి, యంతర్ధానమైన శివుని, తరువాత భావించి వేశ్యాతనయులు బాధపడుట జరిగినది. ఆ లీలలను వారిట్లు భావించిరి.

ఫలము గొమ్మని ముందుఱ బెట్టి యాసఁ
గొలిపి, శిశువులఁ జేరంగ బిలిచినట్లు
తపసులకు జన్మఫలమైన తనమహత్త్వ
మెఱుకపడనీక, సర్వేశుఁ డేఁగె నకట!"★

## రెండవ భాగము

నాలుగవ యాశ్వాసమున రెండవభాగము 'చెలఁది, పాము, నిభము, నెఱుకుల పూర్వజన్మ ప్రసక్తియున్నది. ఈ నాలుగు జీవుల పూర్వవృత్తములనే యేల పలికెనో మొదటిలోనే భావించియుంటిమి. క్షేత్ర ప్రశస్తికిఁ గారకులయినవారు వీరు నల్వురే. మిగిలిన భక్తులెటనుండియో తుది ఘట్టమున నిచటికేఁగుదెంచి సాయుజ్యమందిరి. పై నల్గు రీ క్షేత్రముననే పెద్దకాలము శివార్చనలచే జీవితము గడిపి, శివారాధనకై ప్రాణములర్పింప సిద్ధపడినవారు. ఈ పూర్వజన్మ వృత్తాంత కథనము ధూర్జటి సంస్కృతమునకు భిన్నముగాఁ గావించినాఁడు.

సంస్కృత విషయమునకు ధూర్జటి రచియించిన విషయమునకు గల ప్రధాన వ్యత్యాసమెఱిఁగిన, ధూర్జటి చేసిన మార్పులలోని యౌచిత్యమెఱుఁగఁదగును.

సంస్కృతమున శ్రీకాళహస్తులు మువ్వురు పూర్వజన్మమున వేదాభ్యాసులైన బ్రాహ్మణ వంశజులై యుండుట చిత్రముగా నున్నది. మన తెలుఁగు ప్రబంధమున చెలఁది పూర్వజన్మమున విశ్వకర్మపుత్త్రుఁడైన యూర్ణనాభుఁడు. కాళము పూర్వజన్మమున పరమేశ్వరుని యలంకారమైన కాళుఁడు. హస్తియుఁ బూర్వజన్మమున

---

★ శ్రీ. కా. మా. 4 అ — 112 ప.

హస్తియను పేరుకల భ్రమరుఁడు. ఆ యా జంతువుల పూర్వజన్మములందలి నామములు, చేసిన యపరాధములు, పొందిన శాపములు, కారణకార్య సంబంధము గలిగి, కడు సమర్థవంతముగ నిర్వహింపఁబడినది.

చెలఁది : సృష్టి వైచిత్రిగల విశ్వకర్మకొడుకు ఊర్ణనాభుఁడు, బ్రహ్మను ధిక్కరించి సృష్టికిఁ బ్రతిసృష్టి చేయఁగాఁ గోపించిన యజుఁడతనిని కీటముగాఁ బుట్టుమని శపించెను. శాపఫలమైన జన్మయు, సృష్టి సామర్థ్యము గలిగినదే యగుట గమనార్హము. ఊర్ణనాభుఁ డూర్ణనాభముగనే జన్మ మెత్తినాఁడు. ఉదరమున తంతువుల గలిగించునది యని యూర్ణనాభమున కర్థముగదా! పూర్వజన్మవాసనమై 'ఆత్మ గుణాపాదిత చక్రసంక్రమ వినోదక్రీడ లాతాకృతియై' గజారణ్య బిల్వవన వీధీ వర్తియై యుండుట యాతని శాపము. అట్లే నిజగుణ పరిధాన విధాన ప్రవీణతం దిరిగిన దా చెలఁది. ధూర్జటి చెలఁది కావించిన ఉద్వర్తనఁ బేర్కొనుచుఁ బలికిన 'పూర్వవాసనా గతమతి' యదియే. 'ఆత్మగుణాపాదిత చక్ర సంక్రమ' మనుటకు ఫలమే, ఇందులు తీరఁగఁగట్టియును, గాలిఁ బ్రివ్వీన పోఁగుల్ జారిన పోఁగులు నమకం నీరుపనే' వానిపని యయినది. శాపమందినను సూర్ణనాభుని కా ఫలము 'అలిగి వలపుపై బడి' నటులే యయినది. అనఁగా శాప మాతనికి కష్టము గలిగింపక మనసులోని కోరిక యయిన కల్పనా శిల్ప ప్రావీణ్యమున కభివృద్ధికరముగనే పరిణమించినది. కోపించి యొకనో దూఁకగా సౌఖ్యప్రదమైన మైత్రని వలపుపైననే పడుట సంభవించినది. కోరినదియు, సమకూరినదియు నొక్కటియే యగుట యసాధారణము. కాని యిట యసాధారణ ప్రజ్ఞావంతుఁడగు సూర్ణనాభుని ప్రతిసృష్టి క్రియాదక్షత కాగ్రహమందినను సృష్టికర్తకాతని చాతుర్యమున కనువైన శాపము నొసంగుట యసాధారణమే కదా! సర్వసాధారణముగా శాపగ్రస్తులు తమ మనోభీష్టమునకు వ్యతిరిక్తమగు శాపమందుదురు, ఊర్ణనాభుని కథ యీ విధముగా నసాధారణమైనది.

సంస్కృత మూలమున, వేదాభ్యాసి యయిన సత్యాఖ్యుఁడగు బ్రాహ్మణునకు దుర్మార్గుఁడైన పుత్రుఁడుదయించి పంచాచార దూరుఁడై సాలెవారితో స్నేహము చేయుచు ధనము హరించుచు, రోగియు నగు పాటలుఁడను సాలెవానికి మమకార పుత్రుఁడై కరంధుఁడను పేరఁ బరఁగుచు సాలెకన్యను వివాహమాడి, వస్త్రవ్యాపారము చేసి,

దానాదికములఁజేసెను. మరణకాలమున బ్రాహ్మణునకు శివలింగారాధనకై పత్ర దానము చేయుటచే మఱుజన్మమున చెలఁదిగా జన్మించెను. అనఁగా బూర్వజన్మమున గల తంతువాయకుల సహవాసము, జీవనమును నెఱపియుండుట కారణముగా నున్నది.

**కాళము :** కాళము పూర్వజన్మ కథను 'గంధర్వ కామినీగానంబు విని తల యెత్తియాడెడు భుజగేంద్రముఖ' నని యారంభించుట కవి ధూర్జటి కథానిర్వహణ సామర్థ్యమును సందర్భౌచిత్యముతో నలరుచున్నదనిపించును. కైలాసనగ వర్ణనము ముక్తపదగ్రస్తముగా సీసమునఁబఱఁచుట మహోర్థనంతముగ నొప్పుచున్నది గొప్ప సర్పము చుట్టలు చుట్టికొని యున్నట్టిదా పద్యము· ఇది వృత్త్యౌచిత్యము, నలంకారౌ చిత్యములతో రత్నకాంతుల నీనుచున్నది· ఆ కాళుఁడు పరమేశుని యలంకారము. ఆ యలంకార రచనసేసికొను సమయమున కా కాళుఁడు ప్రియవధూసుఖి నెడబాయ లేక పాతాళముననే నిలిచిపోయెను. కాళముపైఁ గోపించిన శంభుఁడుగ్రుఁడయినాడు. శపించినాఁడు· నిత్య శివారాధకుఁడైన కాళుఁడా శాపమునకుఁ దాళఁజాలకపోయెను. పాతాళలోకముననే యుండిపొమ్మనినాఁడు. అది అధోభువనము· కామినుల వీడ నోపని కాముకుల కధోగతియే ఫలము. అట్టివారి కూర్ధ్వలోక దర్శన భాగ్యమును కలుగదు· ఆ మోహబంధము తీఱువఱ కా ప్రాణికి శివదర్శన భాగ్యము లభింపదు. పరమేశ్వరుఁడు పలికినట్లు 'దేహమోహంబు విడిచి, సందేహముడిగి భక్తి భజించిన' గాని కామితపదము గాంచనేరరు·

పరమేశ్వరుని వీడి తా నుండలేనని కాళునకు శివుఁడు దక్షిణకైలాసమున నవ రత్న పూజసేయుచు, హస్తితో గలుగు సాహసమునఁజచ్చి మోక్షముగాంతువని యనుగ్రహించినాఁడు· అట్టి శివలింగార్చనాపరుఁడైన కాళుఁడు శాపగ్రస్తుఁడైన వెనుక ప్రియుని వ్యామోహాబ్ధింకను వీడలేదు· గతమధుర స్మృతులఁ దలఁచుకొనుచు కొంతవడి వాపోయినాఁడు. శంకరుని సేవకు తన ప్రియ వధూప్రణయ మెట్లా టంకమయ్యెనో తడవి తడవి వనటఁజెందుటఁజూడ నాతని ప్రియవధూ ప్రణయ మెంత బలవత్తరమైనదో యూహింపనగును. కామాధిక్యమునకు కాళము ప్రతీక గాన నిట సందర్భౌచిత్యమొక ప్రక్కనుండగా, రెండవది కవి ధూర్జటి వ్యక్తిత్వము స్పష్టమగుచున్నది. కామినుల వీడనోపని కాముకుల కిహపర సౌఖ్యము గఱగదను నది ధూర్జటి యనుభవ శ్రుతి· ఈ పద్యమునఁ గవి ధూర్జటి శృంగారవ్యక్తి,

ఈశ్వరభక్తి యను రెండు మూర్తులను ప్రతిపాదితములయినవి, తన జీవితమునఁ బొందిన యనుభవసార మీ పద్యమునఁ దగియున్నది. ఈశ్వరువియందలి యార్తియిది· హరుని చిత్తంబునకు దూరమైతినను నది ధూర్జటి యాక్రోశమేయిది.

**సంస్కృతమున కథయిది :** వేదవేదాంగాభ్యాసియగు బ్రాహ్మణుఁడు, శివ పూజానిరతుఁడై, శివ పూజాధురంధరుఁడైన గంధర్వుఁడొకఁడు రత్నపూజ సేయుటఁజూచి దానివలన ఫలమేమి యనియు నవి యెట్లు సమకూడుననియు నడిగెను. రత్నపూజచే శివసాయుజ్యము కల్గుననియు నాగజన్మమంది పాతాళమున శివుని రత్న పూజ చేయుమనియు గంధర్వుఁడు పలికెను. శరీరత్యాగమొనర్చి రెండవ జన్మమున నాగమై పూర్వజన్మస్మృతిచే, శివభక్తి తత్పరుఁడై రత్నపూజఁజేసెను.

**హస్తి :** నిశతముగానున్న పార్వతీ పరమేశ్వరుల గృహమున, వాకిటివారిఁ ద్రోచి చేతస్తను వృత్తియుండొరగి లోనికిఁ బ్రవేశించినాఁడు హస్తిఆను పేరుగల ప్రమథుఁడు. భవాని వానిని మదించివచ్చుటచే, హస్తివి గమ్మని శపించెను· ఇచట నొక విశేషమున్నది. కవి లోకజ్ఞత నిధి చాటుచున్నది

'రతిసమ్మదకేలనక్రియ' యందున్న స్త్రీపురుషుల కంతరాయము గలిగినపుడు స్త్రీ యాగ్రహించుట, పురుషుఁడు నిగ్రహము చూపుట లోక సామాన్యము. ఆ ప్రమథుఁడట్లు వచ్చుట భవానికి నల్కయు సిగ్గును గస్తిబెట్టినది· సమయాసమయముల నెఱుఁగక ధూర్తుఁడై వచ్చుటచే నాతనిపై నలుక కలిగినది. అట్టి స్థితిలో భృత్యుని చూడవలసి వచ్చినందులకు సిగ్గు కలిగినది భవానికి. ఎంత చనవున్నను సందర్భాసందర్భముల గుఱుతెఱుంగక వచ్చుట యా హస్తికి గల మదాంధ్యము.

ముందువెనుక లాలోచింప కుండుట మదము. అది స్వోపజ్ఞపైఁగల మితిమిఁంచిన యహంభావము.

గజముగా శపింపఁబడిన యా హస్తి 'గజచర్మాంబరుని గంధ గజ గమన పదాంబుజము' లకు నెఱఁగెననుట యౌచితీశోభితమై యలరుచున్నది.

ఈ ఘట్టమున విప్రతిపత్తి యొండు కనబడుచున్నది.

'సామజమంబరమయ్యెన్, బాముసు నాభరణమయ్యె

శ్రీ· కా· మా· 4అ — 175 ప,

అను పద్యము ననుసరించి పాముతో బోరి మృతిఁజెందినవెనుక గదా యా సామజము శివున కంబరమయినది. అంతకమును పే శివునిట్లాలిని బలుకుమఁ గవి 'గజచర్మాంబరుని గంధ గజగమన' యనుట యెట్లు పొసంగును ? గజమంబరముగా మాఱకమును పే, శివునిట్లు 'గజచర్మాంబరుఁ'డని పలుకుట యావిపరీతి. హస్తియను ప్రమథుఁడు మొఱకున్నప్పటి కా శంబరుఁడు 'గజచర్మాంబరు'ఁడుగా లేఁడు. ఈ కథనమంతయు గజము శివునకంబరముగా మారిన వెనుకనె మిండజంగముగా నేఁగు దెంచిన శివుఁడు యాదవ భూకాంతునకుఁదెల్పుట, కాన నిది సరిపుచ్చుకొనదగునని సమాధానము బలుకపచ్చుమగాని యది కుదరదనవలసి వచ్చుచున్నది. కాని యిట మరియొక విశేషము నభ్యూహ సేయఁదగి యున్నది.

హస్తి మొఱకున్నప్పటికే శివుడు గజచర్మాంబరధారియై యుండుట కభ్యంతరము లేదు. తొలినుండియు శంభుఁడు గజచర్మము ధరించుట కలదు. ఈ సామజ మీల్గిన వెనుక యదియు నొక చర్మనుయినదేకాని, నాటిమండియే యతఁడు గజచర్మాంబరుఁడయ్యెనని కాదుగదా పలికినది ! కాన నిట్లు కనంబడున్న వైరుధ్యము తొలఁగి పోయినది.

తిన్నని పూర్వ జన్మము :-

పాశుపతాస్త్ర సంపాదనార్థియై యర్జునుఁ డింద్రకీలాద్రి పై తపమాచరించుట' ఈశ్వరుఁడు శాంబరీభిల్లుఁడుగా, నద్రిజాతనయ శబరియై తోడుకాగా, మూకాసురునిఁ బండిఁ జేసి కొని వచ్చి, కిరిమూలముగాఁ బోరు సల్పి యర్జునుని యక్షయ బాణముల నదృశ్యముఁ జేయుట, ముష్టి యుద్ధమున పరాక్రమించిన యర్జునుని మెచ్చి, పాశుపతాస్త్రమిచ్చుట యిందు కథితమైనది. ఈ కిరాతార్జునీయ గాథ భారతమున, శ్రీనాథుని హరవిలాస ముల నున్నట్టిదే. ధూర్జటి కథనమునందొక విశేషమున్నది. ఈశ్వరుఁడు ప్రత్యక్షమై వరము వేఁడుకొను మనినవు డర్జునుఁడు రెండు వరములు కోరెను. పూర్వగాథలందు పాశుపతాస్త్రము నొక్కదానినే కోరగా నిందు కిరీటి, "ఇదిగాక ముక్తిరమణీ హృదయేశత్వము వహింప నీవలయు" ననిన రెండవ వరమిట్లు ధూర్జటి, తాను స్వీకరించిన వస్తు నిర్వహణమునకు బలము కూర్చునదియై యలరుచున్నది పాశుపతాస్త్రమొక్కటి కోరి యంతతోఁ దృప్తిఁజెందిన, కిరీటికి మఱుజన్మమెత్త వలసిన యవసరములేదు. కాననే పూర్వకథల యందు పార్థుఁడు మఱుజన్మమందినట్లు లేదు. కన్నప్ప పొందిన ముక్తికి, పూర్వజన్మమున పునాది

గల్పించినాఁడు ధూర్జటి. సార్థునిగా నున్నప్పుడతనికి దేహమోహము వీడలేదు. శత్రుసంహారాపేక్షతోఁ దపమాచరించుట యది.

ఏదయిన మహాఫల మందవలెనన్న, దానికిఁదగిన యోగ్యత, యర్హతలు సంపాదించుకొనవలయును గదా! అందువలననే యీశ్వరుఁడు,

"దేహంబువిడిచి, సందేహముహడిగి

భక్తిభజియించి, కామితపదముగాంతు" వని యనుగ్రహించినాఁడు. ధూర్జటి గ్రహియించిన శివభక్తులెల్లరు దేహమోహంబు విడిచి, సందేహముడిగి పరమేశ్వరుని భక్తిభజియించి ముక్తి రమణీ హృదయేశత్వము వహించినవారలె. అంతటి మహావీరుఁడు, భక్తుండు నగు నర్జునుఁడు కిరాతుఁడుగా జన్మమెత్తుటకు కారణము, బంధుహరణమునకుఁగాంక్ష సేయుటయే.

ఈశ్వరుఁడు నిజేచ్ఛావిహారములు యాదవభూకాంతున కానతిచ్చుటచే, నా భూపాలుఁడు కృతార్థుఁడనైతినని తలంచెను. ఈశ్వరలీలలావిలాస కథనమునకు మొదలిడునప్పుడు పల్కినట్లే, ముగించుచు నీశ్వరుఁడా రాజు "నమ్మహాదేవుని నివాసంబు గట్టింపు" మని పల్కి యంతర్ధానమయ్యెను. ఇచ్చట 'అమ్మహాదేవుని' యని పలుకుట యందు ధూర్జటి పూర్వోక్త నిర్గుణ విశేషణ విశిష్టుఁడైన పరమేశ్వరుఁడను భావము నుద్ఘాటించుచున్నాఁడు. అదియుఁగాక యాదవ భూకాంతుఁడే యీశ్వరుని లీలా కథనము కాంక్షించి, యాలకించి, పులకించెనో, యా యీశ్వరుని యనియు నిందలి పరమార్థము. ఏ యాడిగము చేసి దాని యనుగ్రహీత యయ్యెనో, తానే యాడిగముచేసి యీశ్వరుని యనుగ్రహమును దొందుదునోయని భూకాంతుఁడడిగి నందున, పైన పేర్కొనిన మహాదేవుని నివాసగృహము కట్టించిన యెడలఁ బరమేశ్వరునకుఁదగిన సేవయగునని యీశ్వరుఁడు పలికి యుండెను.

తుదకు పరమేశ్వరుఁ'డమ్మహాదేవుని నివాసంబు గట్టింపు' మని పునరుక్తియేల చేసెనో గమనించిన, ధూర్జటి కవీంద్రుని కథానిర్వహణ సామర్థ్యము వ్యక్తమగును. ఆసక్తితోఁ గథలు వినుచున్న భూకాంతుఁడా యీశ్వరలీలా కథనానందసారసత్వమున మునిఁగి యుండెను. ఈ చెలఁదీపాము నిభమునెఱుకు, లెటింగి పూజించి ముక్తులైరెట్లు' అని యాదవ భూపుఁడడుగుట, దాని కీశ్వరుఁడు వారల పూర్వజన్మ కథన

మొనర్చుట పూర్తియయినది. ఇఁక జంగమలింగమునకు తనను రాకపలని ప్రయోజనమును పూర్తియయినది. అంతవఱకు నా వచ్చినది జంగమలింగ మనియే రాజునకు భ్రాంతము కన్నులమూయుటనే వచ్చిననాఁడంతర్ధానమందుటతోఁ బ్రభువునకుఁ బోద్యమైనది. పరమేశ్వరుఁడు తనకుఁ గథను చెప్పుటచే దాను కృతార్థుఁడనయితినని తన జన్మ కృతార్థత నందినదని పట్టణమును కృతార్థమయిన దనియు దాసి కృతార్థురాలయి నదనియుఁ బలుమాఱులు పలికినాఁడు.

ఈ పద్యమున కవి ధూర్జటి పొందిన యానందాతిరేకమిది. "కృతార్థ" శబ్దమీ యొక్క పద్యమున నాలుగు తడవులుపయోగించుట ప్రభువు పొందినభక్తి పారవశ్యము, నానందాతిశయమును వ్యక్తముచేయుటకుఁ జాలినదై యుండుట యటుంచి, కవి ధూర్జటి పొందిన నిరవధికానందము, నిర్భర భక్త్యుల్బణముల కిది దర్పణము వంటిదనఁదగియున్నది. ఈశ్వరునిఁజూడఁగలుగుట, యీశ్వరుని వాక్యము లాలించుట, యీశ్వరుని సాన్నిహిత్యము. పొందుటలే జన్మకు కృతార్థత.

"నలినాక్షుఁడను నిధానము గంటి నేనని
యుబ్బిగంతులువైచు .... ...." ×

ప్రస్తోమనిఁ వలపించునది యీ యాదవ భూకాంతుని పరమేశ్వర దర్శనానందానుభూతి. అయ్యాదవనాథుఁడు గృహమేఁగి పరమేశ్వరు నర్చించుటను వర్ణించిన పద్యము ధూర్జటి కవీంద్రుని వృత్తౌచిత్యమును వెలయించుచున్నది.

అనూన్వితముగా భణించినాఁడను భావమున "భజసనభజసనభయ" గణములు గల లయగ్రాహివృత్తమిది. పరమేశ్వరుని భక్తిభణియించి, భయ రహితుఁడైన యాదవాధిపుఁ డింపున్నాఁడు అష్టమూర్తి గుణాష్టక వర్ణన మిందత్యంత సముచితముగాఁ గానింపఁ బడినది.

ఒక్కొక్క పాదమున నొక్కొక్క పరమాద్భుత సంఘటనము కలదు. ఆ కథన మొక క్రమోపేతమై యలరుచున్నది.

మారహరుఁడై కదా శైలతనయారమణుఁడైనది యీశ్వరుఁడు! ఈశ్వరీ సహితుఁడై దక్షిణదిశాద్రి నధివసించి దక్షిణకైలాసమునకు వన్నె గూర్చినాఁడు.

---

× శ్రీ.మ.నాగ.సప్తమస్కం. 124 ప

మేరువును కార్ముకముగా ధరించి, విష్ణునంబకముగాఁగొని, బ్రహ్మ సారథిగా, భూమి రథముగాఁ జేసికొని, పురారియైనాఁడీశ్వరుఁడు.

సూర్యేందు, ధరణీ, రస, హుతాశన, సమీర, ఖ, మహేశ్వర శరీరుఁడై యీశ్వరుఁడష్టమూర్తియయినాఁడు.

యాదవనాయకుఁడు నిర్మింపజేసిన యాలయ, గోపురాదుల వర్ణనమున ధూర్జటి లోకజ్ఞత, పరిశీలనములు స్పష్టములగుచున్నవి. ఆ తావున గట్టించిన వివిధ దైవతాలయములను చూడఁగా ఈ ధూర్జటి కవీంద్రుఁడు లూతాధీశునిచే ప్రణాళికా [ప్లాన్] రచన సూచనముగా నిర్మింపఁజేసియే యున్నాడు.

**ఆశ్వాసాంతము :-** ఆశ్వాసాంత పద్యరచన విషయమున, ప్రథమాశ్వాసాంత పద్య పరిశీలన సందర్భమున పఠించితిమి. కేవల కవీంద్రుని యాత్మస్వరూపావిష్కరణమిది. జన్మజరా విపల్లవదశాది క్లేశములను సంహరింపుమనియు, బంధత్రయమును నాశము చేయుమనియు, భక్తవత్సలుఁడై ప్రభవించిన వటక్షమాజవాసుఁడు, నీవారాగ్రశిఖాంత చిద్రసనుఁడునైన చంద్రఖండమండనుని ధూర్జటి మనసార కోరి, నోరారఁగొనియాడి ధన్యుఁడయినాఁడు.

యాదవాధిపుని ప్రోవఁదలచి జంగమాకారమునఁ బరమేశ్వరుడేఁగుదెంచుటతో ప్రారంభమైన కథ, యయ్యాదవభూకాంతు ననుగ్రహించి, యాతనిచే నూడిగము సేయించుకొనుటతో సమాప్తమైనది.

ఆత్మ నిర్గత బహుతంతుపంక్తి గృహకల్పన శిల్పకళా ప్రవీణుఁడగు లూతాధీశుని వలెనె, కవిధూర్జటి కావ్యకల్పన శిల్పకళా ప్రవీణుఁడై తన భక్తిరచనలు తా పాగించి కృతార్థుడైనాడు.

—()—

# రసపోషణము

ధూర్జటి కవీంద్రుని ప్రబంధమునఁగల రసపరిపోషణమును బరిశీలించుటకు ముందు రసశబ్ద విచారమును, రసస్వరూపమును గూర్చి కొంత తెలియవలసి యున్నది.

కావ్యమున సర్వ ప్రయోజనమౌళిభూతమైన ఫల మానందము. అది రస వశమున నిష్పన్నమగును. ఈ 'రస' శబ్దము ఋగ్వేదమున సోమరసము, జలరసము పాలు, సారము అనునర్థములందు వాడబడియున్నది. అథర్వవేదములో నది 'రుచి' యనునర్థమునఁ గానవచ్చుచున్నది. ఉపనిషత్కాలమున దానికి సారమను నర్థమేర్పడినది. జగత్తునకుఁ బ్రధాన సారభూతమయినదియు, శాశ్వతానంద సంధాయకము నగు పరమాత్మ రసపదమున కర్థము. అందుచేతనే రసానందము బ్రహ్మానంద సహోదరమైనదని ప్రాజ్ఞులచే భావింపఁబడుచున్నది.

సహృదయుని హృదయమును గరఁగించునది, గాఢానుభూతిచే నొకని హృదయము నార్ద్రీకరించునదను భావమున ద్రవ వాచకమైన 'రస' శబ్దమిట యుక్తమై యుండునని భావింపఁదగును. అది బ్రహ్మానంద సబ్రహ్మచారియనినారు. బ్రహ్మానందము లోకోత్తరము, సనస్వపరకంపిరము, హ్లాదైకమయము, విఘ్నరహితము, విగళిత వేద్యాంతరము, స్వసంవేద్యమునని యనువహారంర పెద్దలచే సంభావింపఁబడినది. ఆ లక్షణములన్నియు నిండియుండుగఁబట్టిన అలౌకిక లోకానందము కావ్యానందము లేక రసానందము. అందుచేతనే యది బ్రహ్మానంద సబ్రహ్మచారి యని పెద్దవారి యాశయము.

రసనిష్పత్తి :

"విభావానుభావ వ్యభిచారిభావ సంయోగాద్రస నిష్పత్తిః" అని భరతాచార్యులు రససూత్రమును నిర్వచించి యున్నారు. అనఁగా నుత్పాదకములగు విభావములచే రత్యాది స్థాయిభావము నుత్పాద్యమై, గమకములగు ననుభావములచే గమ్యమై, పోషకములయిన వ్యభిచారులచేఁ బరిపుష్టమై రసమగును. * ఈ నిర్వచనమునకు వివరణముల నిచ్చుచు మతభేదములు ప్రకటించిన యాలంకారికులు పలువురున్నారు.

---

* కా — సం. పుట 283

అభినవగుప్తపాదుని యభివ్యక్తి వాదము ప్రకారము రసము సామాజికనిష్ఠము వాసనామూలకము, నలౌకికము, సాధారణీకరణ వ్యాపారాశ్రయము, వ్యంగ్యము, నానానందపర్యవసాయి. ఇదియే యర్వాచీన సర్వసాహిత్య ప్రతులకును పరను ప్రామాణికముగాఁ బరిగణింపఁబడుచు శిరోధార్యమైన సిద్ధాంతము.

భరతాచార్యులు రూపకరసమును గూర్చియే తెలుపగా నానందవర్ధనాచార్యులు శ్రవ్యకావ్యములకుఁగూడ దానిని సమన్వయించిరి.

రసములు : రసము న్నిట యొకటన్న స్వాదాత్మ యానందమే.

"ఆస్వాదాంకుర కందోస్తి ధర్మః కశ్చన చేతసః
రజస్తమోభ్యాం హీనస్య శుద్ధ తత్వ తయా సతః
స స్థాయీ కథ్యతే విజ్ఞై ర్విభావస్య పృథక్తయా
పృథగ్విధత్వం యాత్యేష సామాజికతయా సతాం" 1

అను కవికర్ణపూరగోస్వామి వాక్యముల ప్రకారము రసమొక్కటియే యనియు దాని కానందమే స్థాయిభావమనియు సిద్ధాంతమగుచున్నది మరి భిన్నభిన్న రసములకొక్కయానందమే స్థాయి యెట్లగుననుట కాతఁడే.

"రసస్యానంద ధర్మత్వాదై కథ్యం భావ ఏవ హి
ఉపాధి భేదాన్నానాత్వం రత్యాదయ ఉపాధయః" 2

యని సమాధానముఁబలికియున్నాఁడు. విభావాదులను ఉపాధులను బట్టియే యీరస భేదము లేర్పడుచున్నవని వాని భావము.

"శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌ చే త్యష్టౌ నాట్యేరసాః స్మృతాః" 3

1 కా. సం:పుట 312 3 నా.శా. 6 అధ్యా. 15శ్లో 92పుట (చౌ.శ్రీ.రా)
2 " 313

అను భరతాచార్యుల వాక్యములందు శాంతము రసముగాఁ బేర్కొనఁ బడలేదు. కాని యభినవగుప్తపాదాచార్యులు భరతుఁడు శాంతమును రసముగా ఋజుమార్గమున చెప్ప కున్నను భంగ్యంతరముగా నంగీకరించెనని యూహించిరి.

"శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యేరసాః స్మృతాః"

అను రీతిని శాంతమును రసముగాఁ బండితమండలి యంగీకరించియే యున్నది. కొందఱు ప్రేమరసము, వత్సల రసము, మాయారసము, భక్తి రసములుకూడ గల వని పలికియున్నారు, కాని వారి వాదములన్నియుఁ బ్రాజ్ఞులచేఁ బరాస్తములైనవి.

అంగిరసము : శాంతము :

ప్రబంధములందు శృంగార వీరములందొక్కటి యంగిరసముగా స్వీకరింపఁ బడుట సర్వసాధారణము. దశరూపక ప్రభేదమైన నాటకము విషయమున నిది నియమము. మన ప్రబంధముల విషయమున ఒక సమయమైనది. శాంతము నంగి రసముగాగాక యంగరసముగా మాత్రమే నిర్వహింప వలెనని ధ్వన్యాలోక వ్యాఖ్యాత చంద్రికాకారుఁడు పలికిన సిద్ధాంతమును నభినవగుప్తపాదులు నిరాకరించిరి. శాంతమునంగి రసముగా గల కావ్యములనేకములు గలవు. మహాభారతము, సౌందరనందము, బుద్ధచరితము లిత్యాదిగాగల శ్రవ్యకావ్యములును, ప్రబోధ చంద్రోదయేత్యాది దృశ్య కావ్యములును పెక్కులు గలవు.

అభినవగుప్త పాదులు వారి గురుపాదులయిన భట్టతౌతులును శాంతమును రస సార్వభౌమముగాఁబరిగణించిరని కాణేపండితుఁడు పేర్కొని యున్నాడు. ధూర్జటి కృత శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రబంధమున నంగిరసము శాంతమనియు శృంగార మంగరసములలోఁ బ్రధానమనియు నిర్ణయింప నవకాశముగలదు.

శాంత రస స్వరూపము :

శాంతమునకు స్థాయి భావవిషయమునను పెక్కు భిన్నాభిప్రాయములు గలవు. దశరూపకకర్త ధనంజయుఁడును తద్వ్యాఖ్యాత ధనికుఁడును శమమే శాంతమునకు స్థాయియని పలికిరి. రుద్రటుఁడు సమ్యక్ జ్ఞానము స్థాయి

యనఁగా నానందవర్ధనాచార్యులు తృష్ణాక్షయమే శాంత రసమునకు స్థాయిభావ మనియున్నారు. హేమచంద్రుఁడును పై యభిప్రాయమునే సమర్థించెను పలువురు పలు భావములను స్థాయిభావములుగాఁబలుకగా కొందఱు రత్యాదులగు నెనిమిది స్థాయి భావములలో నేదేనొకటి శాంతమునకు స్థాయి కాఁదగుననియు పలికియున్నారు. వివిధ మతముల పరిశీలనానంతరము శాంతమునకు తృష్ణాక్షయ రూపమగు శమమే స్థాయిభావ మనునది సిద్ధాంతముగ నంగీకార్యమగును.

తత్త్వజ్ఞాని యాలంబన విభావముగాగా, వేదాంత శ్రవణము, తపోగమనము, నాశ్రమ పర్ణశాలాదు లుద్దీపన విభావములగును. భగవద్దర్శన కాలమునఁగలుగు శరీరకంపము, స్వేదము, రోమాంచాదు లనుభావములయి, భయము, భక్తి యిత్యాదులు సంచారి భావములగును. ఇది శాంతరసము.

శాంతమంగిరసము :-

ఈ ప్రబంధమున శాంతమంగిరసమని సిద్ధాంత సమర్థనకుఁగావ్యమంతయుఁ దార్కాణము కావ్యారంభము, సమాప్తి, వస్తునిర్వహణము లీయంశమును చేనొక్కఁ జాటుచున్నవి.

శాంతరసాధి దేవతయగు పరబ్రహ్మమును శ్రీ విద్యానిధిగాఁబరిస్తుతించుట తోఁ గావ్యమారంభమైనది. "శ్రీ విద్యానిధియై .... ... ...."★

అను రీతిని కవీంద్రుఁడు పరబ్రహ్మ మూర్తిని శ్రీ విద్యాపతిని భవునిగాఁ జేర్కొనినాఁడు. ధూర్జటి కవీంద్రుఁడు "... పరమ హంసోత్తంస భావభృంగద్రాత తన్మయావస్థా ప్రదానచేళి"గా శ్రీ కాళహస్తి నిలయుఁడగు పరమేశ్వరుని సతియైన

★ శ్రీ. కా. మా. 1ఆ – 1 వ

జ్ఞాన ప్రసూనాంబసుఁ జేకొనుటయు, పైరసుని కేవల ధ్యానవాహనుఁడుగా మాత్రమే గాక యా ధ్యానము బంచాక్షర మంత్రమర్మమున కాధ్యాంతమైన వర్ణంబుతో నేకగ్రీవము చేసి పల్కొడిదిగా వర్ణించుటయు, గవీసనికిఁగల శాంతికామన యద్వైతభావనలు 'నిత్యానిత్య వస్తు విచార జనకమైన విరాగాఖ్యమగు శమమేఁ విలసిల్లుచున్నట్టిది.

గురుస్తుతియందుపయుక్తమైన 'రాజహంసము, ననుభవ గోచరుఁడ' ను విశేషణములు నీ విషయమునే సమర్థించుచున్నవి.

షష్ఠ్యంతముల విషయమున కృతిపుఁడగు శ్రీ కాళహస్తీశ్వరుని గుణగణ వర్ణనమున రూపరేఖా వర్ణనము, లీలా వర్ణనము, భూషాంబర వర్ణనముల కొక యద్వైతభావధారయే వెల్లిగొనుట చూడ శివ పరబ్రహ్మమహాతత్త్వమును మూదలించుట గమనింపఁగలము. ఇది కవిబ్రహ్మ తిక్కన మార్గము.

> 'అఖిల ప్రపంచ భిన్నాభిన్న జ్యోతికిని. నాదబింధుకళాతీతేశునకు'
>
> 'పంచేంద్రియమత్త ద్విపపంచాస్యకిశోరమునకు భవ ఫణిఖగరాట్పంచా
> కోటికి ....'
>
> ' .... హతభవపాశునకు'

ఇత్యాదిగా నడిచిన షష్ఠ్యంతరచనము కవీంద్రుని నిర్వేదము ప్రతిధ్వనించునది మేగదా!

కథారంభమునఁగల పురవర్ణనమును శివపరముగాఁజేయుటయు, పై జాడల్విలో కించిన నట 'మోక్షనిధిఁగొల్లగొనంగవచ్చు' ననుచు దాను గథనమొనర్పనున్న మోక్షాపేక్షులయిన శివభక్తులను వ్యంజిత మొనర్చుటయు,

'ఎలదోటల్ వనముల్ వధూకుచము లద్రీంద్రంబు' అను తావున శృంగారాం గములుగాఁజమత్కరించుటయు, చాతుర్వర్ణ్యముల వారిని 'రాజయోగైకరతులు' గా శ్లేషబలమున నిరూపించుటయు, శృంగారకళానిధులయిన కామినీజనులను యోగిజను లుగా శ్లేషించుటయు, మదపుటేనుఁగుల వర్ణనమున వీరరసాంగములను శాంత రసాంగములుగాఁబలుకుటయు, గుఱ్ఱములను వర్ణించుటయందు మానవులు చాపల్య రహిత సౌఖ్యంబులవి నాపాదించుకొందురని తెలుపుటయు, శాంతమును కవి తాలుత

నుండియుఁ బ్రభాసరసముగా నిర్వహింప నున్నాఁడను విషయమును స్థిరపఱచుచున్నవి. ఈ తావులందలి కొంతము రస స్థితి స్పందక రస భావమాత్రముగా నున్నట్టిది.

ఇది కృత్యారంభము, కథారంభము.

ఇఁక నీ ప్రబంధమునఁ జిత్రింపఁబడిన శివభక్తులెల్లరును మోక్షార్థులయినవారే. కావ్యాంతమునఁ బరమేశ్వరుఁడర్జునునకు బోధ గావించిన రీతిని

"దేహమోహంబు విడిచి, సందేహముడిగి
భక్తి భజియించి, కామిత పదము" 4 ఆ – 197ప.

నందిన శివభక్తులె. వారి కామిత పదము మోక్షము. ఈప్రబంధమునఁ గథితములయిన శివభక్తుల చరిత్రములు యాదవ భూకాంతునకు మింథబంగ మాదేశించినట్టిది. భువిపై పరమేశ్వరుఁడవతరించుటకుఁ గారకుఁడయిన వశిష్ఠుని కథ, మొగలేటి జననమునకుఁ గొరకు డయిన యగస్త్యుని తపము, ఋభుజననము, శ్రీకాళహస్తుల గాథ, తిన్నని కథ, నత్కీరుని కథ, వేశ్యాతనయలగాథలందు తృష్ణాక్షయ రూపనుగు నిర్వేదమే పుష్టినొంది మోక్షఫలకమగు శాంతరసస్థితినందినది.

దక్షిణకైలాసగిరిని ధూర్జటి కవీంద్రుఁడు మోక్షనిధిగాఁ బేర్కొనినాఁడు. ఆ గిరి పరిసరముల నివసించు ప్రాణులు

"...., కాలము సేరువమై ననీర్ష్యని
శ్వాసము హంసమంత్రమణి, చదలు మూయుట యోగనిద్ర, మూ
ర్ధాసము మంబు దత్పరవశత్వము సచ్చుట మోక్షమౌ తుదిన్." 1 – 102

శైవలక్షణము లేమియుఁ దాల్పకయే యచట ప్రాణులు 'చిత్రముగా శివత్వ' నుందురఁట. ఆ కొండ దరినున్న మొగలేటి తటముల మీఁదుగా వీచు పవమానములు 'భవదావాగ్ని విదాహముం జెఱుచునవి.'

నత్కీరుని కథయందు, నత్కీరుఁడు తీర్థయాత్రలు చేయునపుడు కాంచిన పంకజాకరవర్ణనము బ్రహ్మంబు తెలఁగుననున్నదని వర్ణించుటయందు పరబ్రహ్మతత్త్వావిష్కరణమైనది. 3 ఆ – 195, 196, 197 —

ఇక నాశ్వాసాంతములందు ధూర్జటి గావించిన కృతిపతివర్ణన మంతయుఁ దృష్టాంతరూప నిర్వేద నివేదనమే. కాని నీ పైయంశములఁ జూచినపుడు కావ్యమున శాంతమే యంగిరసమని నిర్ధారింపఁదగియున్నది. ఈ తావులన్నియు శాంతము రసభావమాత్రముగ నున్నట్టివి.

వశిష్ఠుని కథ : శాంతరస సమన్వయము :

ఈశవార్తుడైన వశిష్ఠునకుఁ బృథ్వి బోధఁ జేసినది.

మదిలో జనన మరణరూపమైన సంసారమును రోసినయెడల పార్వతీ రమణుని భక్తితోఁ గొల్చిన జీవన్ముక్తి లభించునని హితబోధ గావించినది పుడమిలేమ. వృద్ధ్యుపదేశముచే వైరాగ్యభావముదయించిన వశిష్ఠుఁడింపాలంబన విభావమైనాడు.

రాజయోగమూనపడిన బ్రహ్మర్షి భావించినది యుగ్రతపము. సర్వసాధారణముగా తపోవనభూములను వర్ణించునపుడు కవులు జాతివైరముగల జంతువులకు మైత్రిని వర్ణింతురు ఇట నట్లుగాక వశిష్ఠుని తపోనిష్ఠనే వర్ణించుట జరిగినది. ఆ తపోనిష్ఠకు, మదపు టేనుఁగులు. చమరీమృగములు, క్రోఁతులు, కిరాతాంగనలు వివిధోపచారములు చేసిరి. ఇట్టి తపోనిష్ఠ, యీయుపచారము లుద్దీపనవిభావము. విరాగియైన వశిష్ఠుఁడాలంబన విభావముకాఁగా, నాతఁడొనరించిన తీవ్రతప ముద్దీపన విభావ మగుచున్నమాట. 'నిజస్వాంతవిచింత్యమాన గిరిజానాథ స్వరూపంబు ప్రత్యక్ష మయ్యెనఁట వశిష్ఠునకు. అది యెంతని చిత్తనిత్యస్థిత శివయోగనిరూపకము అగుటతో నా బ్రహ్మర్షి కి భయము భక్తి కలిగినవి. ఇవి సంచారి భావములు.

"కన్నులువిచ్చిచూచి, పురమున్మరు దిక్పరిపూర్ణ దీప్తి సం
పన్నతనున్ భయాకులిత పద్మనిరీక్షణుఁడై, వడంకు పై
కొన్న, శరీరమంతయు గగుర్పొడువంగఁ బ్రమోద సంభ్రమ
స్విన్నలలాట భాగమునఁ జేతులుసేర్చి మునీంద్రుఁ డిట్లనున్" 1-77

పై పద్యమున వశిష్ఠమహర్షి యందిన యనుభావములు వర్ణింపఁబడినవి: కన్నులు విచ్చిచూచుట, భయాకులుఁడగుట, శరీరము వడంకుట, గగుర్పొడుచుట' ముఖమున స్వేదము గలుగుటలు సాత్త్విక భావములతో గూడిన యనుభావములు.

వశిష్ఠుఁడు పరమేశ్వరునిఁగీర్తించిన దాతనితత్త్వజ్ఞతను వెల్లడించుచున్నది.

"స్వానుభవంబునఁదథ్యము
గానంబడుగానీ మీ యఖండాద్వైత
జ్ఞానమయాకృతి బహుభా
షానైపుణిఁ దెలియునది యశక్యమఁట శివా! 1-80

ఈ వశిష్ఠుని వాక్యములు ధూర్జటి యఖండాద్వైత జ్ఞానధారను వెలార్చునట్టివి గదా! భవతాపజభావేతనచేఁదపించిన వశిష్ఠుఁడీశ్వరుని పునరయాచితవృత్తియగు సుఖమును గోరుట, తనకు బ్రహ్మవిద్యా భిక్షనిమ్మని ప్రార్థించుటచే దక్షిణామూర్తి

'చింతాంతస్థలమై, ప్రకాశిత జగచ్చిత్రక్రియాభోగమై
భ్రాంతిప్రాపిత జీవితాప్రథితమై, పద్మ ప్రసూతాద్యది కీ
టాంతవ్యాపకమై, మనో విషయదూరానందమై సంహృతా
ద్యంతంబైన రహస్యముం దెలిపి, పాశానీకముం గోయుచున్.' 1-88

ప్రసన్నుఁడైనాఁడు. వశిష్ఠునకు పాశానీకము తెగుట శాంతము రసస్థితిఁ జేరుట. ఈ విధముగా నీ వశిష్ఠుని కథయందు శాంతము రసముగాఁబోషింపఁబడుటను గమనించితిమి.

శృంగారమొకించుక, యద్భుతమొకింతగాగల యగస్త్యుని చరితమునను శాంతమె ప్రాధాన్యము వహించినది. గిరివర్ణనమున

"జడలు ధరింపరంగజుని జంపరు .... శివత్వమున్" 1—103

పార్వతివర్ణనమున — "అలరుందీగెలు .... " 1—100

గ్రీష్మర్తువర్ణనమునఁ-దూరీకృత స్తనభార కంచుకవదూజనము ....'' 1—122
అనుతాపుల నవ్భుత, శృంగారములు కడుమనోహరముగ నంగరసములుగ వ్యజ్యమానములయినవి. కఠోర తపముచేసిన యగస్త్యుఁడాలంబన విభావముగా, ఋతు వర్ణనాదిక ముద్దీపనవిభావముగా సంయమకులాధ్యక్షుఁడు సంతోషితస్వాంతుఁ డగుట యనుభావముగాఁ గాఁగా, నీశ్వరుని స్తుతియందా మునీంద్రుఁడు దేహముప్పొంగు

టయందు సాత్త్వికోదయమై, పౌరపశ్యత్భుందుటయందు జ్ఞానసూన కలికనుగాంచి బాష్పోదకములు గురియుటయందు సంచారిభావములుగా పెనుపొంది, దివ్యమునులకెల్ల నుపదేశముకాఁగఁ గావించిన శ్రీకంఠుని స్తుతి శాంతరస పుష్టినందెను. ఋభువు జననమున, స్వంగరసములయిన శృంగార, వీర, రౌద్రాద్భుత, భయానక, బీభత్సము లందు శృంగారమతిశయించినది. అంగిరసమగు శాంతము నతిశయించి నట్లున్నదిందలి శృంగారము. పశ్చాత్తాపముతో తపమాచరించిన బ్రహ్మ యాలంబన విభావముగాగల 'అటని యాశ్రమము శాంతరస రూపమయ్యె' [1] నన్న యాశ్రమ వాతావరణము, సరస్వతి గావించిన సేవను బ్రహ్మకావించిన తపోనిష్ఠ లుద్దీపనములైనవి. సాక్షాత్కరించిన యీశ్వరునిఁజూచిన బ్రహ్మకు 'మేనంగంపము, రోమహర్షణము ఱు' [2] కలిగినవి. ఈ రెండు భావములును సాత్త్వికములు. పరమార్థరూపమైన ఋభు జననమున బ్రహ్మ 'తమ్మునమఱచిన తెఱగున దమ్మిచూలి ప్రమదమునఁ జొక్కు' [3] టయు సాత్త్వికభావము. భక్తిభావమున గావించిన నమస్కారము లనుభావములయ్యెను. 'మహాయోగీశ్వరోత్తంసము, సదాశాంతస్వరూపము, దుఃఖ సంసార విదూరమానసమునయిన పరమార్థరూపుఁడయిన ఋభువు జనించుటతో శాంతము రసరూపము నందినది.

శ్రీకాళహస్తులు ::

అటమటమైన 'జీవనమందలి మోహము చాలు' ననిన చెలఁదిపుద్వేషు, రాత్రిని శివరాత్రిగా జాగరము చేసి వైరాగ్యము వహించిన పాముసు, 'ప్రాణము మీఁదిఁ దీపుగల ప్రాణులకున్ విరుదున్ వ్రతంబు కల్యాణకరణంబు'లు కావనిన యేనుఁగును, మూఁడు పుట్టము దాలంబములుగా, నవి చేసిన శివార్చన, పొందిన విఘ్నము లుద్దీపనములుగాఁ జెందిన యావేదన మనుభావముగా శాంతమిందు రసస్థితి నందినవి. పామునేనుఁగుల కథ యందు వానియూలాటనుందు శృంగారభావము, వాని పోరాటమునందు వీర రౌద్ర బీభత్సములు సంగరసములుగా భాసించినవి.

ఈశ్వరుఁడు కరుణించి ప్రత్యక్షమయినపు డవి కోరి పొందినట్టి మోక్షము సాయుజ్యము. మోక్షఫలకమైనశాంతమె యిందు ప్రధానరసము. తిన్నని కథ యందు శాంత శృంగార వీరాద్భుతములు నిర్వహింపఁబడినవి.

---

1. శ్రీ కా. మా. 2 ఆ—71 2. శ్రీ కా. మా. 2 ఆ—75 ప

3. శ్రీ కా. మా. 2 ఆ—85 ప.

'సంపెగతావి బుఱ్ఱింగుడైన భృంగంబు తెఱంగున' తిన్నఁడు పరమేశ్వరచర ణారవిందార్పిత హృదయారవిందుఁడగుటచే నాలంబన విభావమైనాఁడు. 'ఆ లింగ ముఖలోఁ బ్రాణము, గాఁపుగ డదాక నోడ గట్టిన దూలంబై లంకెనుండఁ' జేసిన తిన్ననికి దుండుకుడుకేకుండు యాతనిలో వైరాగ్యమేర్పడుట. తనకుఁ బుట్టువుఁ దల్లిదండ్రులు లేకుండు' నాశివుని తనవేలుపునకై తన ప్రాణములను పోకార్తునని దీక్షపట్టినాఁడు భక్తుఁడైన తిన్నఁడిదట ఆలంబన విభావము చేసిన స్వామికైంకర్యము ద్దీపనము. భారద్వాజునికొఱకు శివుఁడు చేసిన పరీక్షయు నుద్దీపన మే. భగవంతుని పొడగని వాడు చాంచల్యదూరంబులై 'చూపుంజిత్తము మిన్నకుం డుట' * యనుభావము. 'దేహముపైఁ దీపుంజీఁకటి' బాసినది. 'క్రమ్మఱబుట్టు బాధ లేకుండగ' భవస్మయమైన చిద్గగనములోఁ దమ్ము గలుపుకొమ్మని ప్రార్థింపగాఁ బరమేశ్వరుఁడప్పారి 'బంధములను దీర్చి, యనంతంబగు నాత్మరూపమునఁగూర్చు కొనెను. ఇది శాంతరస పరమావధి.

నత్కీరుని కథయందు పదను నిర్వహింపఁబడిన శాంతమునకుఁ దొలి భాగ మంతయుఁ బునాదిఁ నేర్పఱచినది. ప్రతిభాషలచే శివునకుఁ గోపము దెప్పించిన నత్కీ రుఁడు పశ్చాత్తాపము చెందుట యందాతనికి వైరాగ్యము కలుగలేదు. ఆర్తి, చింత మాత్రమే యాతని నట్టి పశ్చాత్తప్తునిఁ జేసెను. అయిన నీ కథయందు నాయకుఁడగు నత్కీరుని హృదయమున వైరాగ్యోదయమునకు, తదభివృద్ధికి వలసిన కథాంశము లున్నవి. పరమేశ్వరుఁడిచ్చిన శాపము మొట్టమొదటగా నాతనికి చింత, వంత కొంత కలిగించినను, క్రమముగా వ్యాపింపనున్న కుష్ఠవ్యాధి స్వరూపము నూహిం చుటచే వైరాగ్యమె జనించినది. అది క్రమముగా దర్శించిన క్షేత్రములవలనను, నాడిన తీర్థములవలనను పెంపొందినది.

కాన నార్తుఁడై విరాగియైన నత్కీరుఁడాలంబనముగా, నాతని తీర్థయాత్ర యుద్దీపనముగా, నాయా దైవదర్శన వేళలందుఁగలిగిన సంభ్రమాశ్చర్యానందము లనుభావములుగా, నీశ్వరుఁడు భీతిత్యాగమొనరించుట, దుఃఖావాసానందమయిన 'యీ సంసారమును వర్జింపఁగా గలుగు సుఖమును' దన కొనగూర్చుమని ప్రార్థించుటతో మోక్ష ఫలకమైన శాంతము రసస్వరూపమొందినది.

---

* శ్రీ కా.మా. 3 ఆ — 123 ప

ముక్తి వధూభుజంగుఁడే తమకు మగఁడనిన వేశ్యాతనయ లాలంబనముగా నున్నట్టిది చతుర్థాశ్వాసమునగల శాంతరస స్వరూపము. 'శివభక్తితనువులెత్తిన' పగిది నా వేశ్యాతనయ లిరువురు జన్మించిరి. పసిప్రాయమున నుమ్మెత్తలలో బడలించిన వారి స్థితి 'తారకమార్గదర్శన రతుల'స్థితి. శైశవావగమ వయోగణ్య లావణ్య గౌరవముగా వారియందు శాంభవంబైన తేజము, హృదయమున సంగముల నుదయమొంది, పెద్దవారయినారు. వారి వయోమరూప వర్ణన మిందుద్దీపనము. సత్కీర్తయని నూఱు పద్యముల పఠన ముద్దీపనము. శ్రీకాళహస్తీశు దర్శింప నుత్సాహులై బయలుదేరిన వారి వేషభాష లుద్దీపనములు.

'కుట్టిన చెంగావి గుడ్డల యొడికట్టుఁ
బొంకపుఁదామ్రతాటంకములును ........4ఆ-54 ప

తో త్రోవయందు వారుగాంచిన వివిధ పుణ్యక్షేత్ర దర్శనము లుద్దీపనవిభావములు, శివ వేషులై, శివార్చనచేసిన వారి శివపూజ యుద్దీపనము. భవభవనద్వార సమీపగతు లయిన యా వేశ్యాతనయలకుఁ బులకలు కలిగి, స్వేదము జనించి, యశ్రుపాతము కలిగినది. ఇవి సంచారి భావములు. ఒకే దేహమ్మై యెదుర నిలిచిన పార్వతీపరమేశ్వ రులఁగాంచి సాష్టాంగదండ ప్రణామములాచరించుట, యెదుట మసుట ముకుళితకర కమలలై మిన్నకుండుట అనుభావములు. పరమేశ్వరుని యనుగ్రహమున సాయు జ్యమందుటతో శాంతము రసస్థితినందెను.

శ్రీ కాళహస్తులయుఁగన్నప్పల పూర్వజన్మ కథలందుఁ గన్నప్ప పూర్వజన్మ చరిత్రము విశిష్టమైనది. వస్తు నిర్వహణమను ప్రకరణమున నీయంశము ప్రస్తా వింపఁబడినది. కాని యందలి యొకవిశేషమే, ధూర్జటి భవపరాఙ్ముఖుఁడనియుఁ, గై కొన్న శివభక్తచరితలను శాంతరసపరిధానముగా నిర్వహించెననియు బుజువు పఱుచునట్టిది:

అర్జునుఁడు సాక్షాత్కరించిన హరుని వరములు వేడుటయందలి దా విశేషము. తొలుత శత్రు సంహారమునకుఁబాశుపతము వేడి, యదిగాక ముక్తిరమణీ హృదయేశ త్వము వహింపనిమ్మనుట రెండవ కోరిక. తొలుతనే ముక్తి రమణీ హృదయే శత్వమడిగియున్నఁ బరమేశ్వరుఁడా జన్మముననే యిచ్చియుండెడివాఁడేమొ ! దేహ

మోహము వీడని కోరిక మొదటిది. కాన నా కోరిక వలన నాతనికి దేహమోహము వీడలేదను భావమునసే పరమేశ్వరుఁడర్జునునకు గావించిన యుపదేశము, నరుని ముఖమున నారాయణుఁడు గావించిన గీతోపదేశమునకు దారితీసినది. ఆ విషయము హరుఁడు స్పష్టము చేసియేయున్నాడు. 'బంధు హరణమునకుఁ గాంక్షచేసితిగాన' సాయుజ్య సామ్రాజ్యసౌఖ్యమీ జన్మమున నందవనినాఁడు.

ఇంద్రజునుఁడు ముక్తిరమణీహృదయేశత్వముఁగోరుట యమూలకమగు కల్పనము. ఇట్టికోరిక యర్జునునిచేఁబలికించుట, యీశ్వరునిచే 'దేహమోహంబు విడిచి సందేహముడిగి భక్తి భజియించి' ననే కామిత పదము గాంచగలుగుటయను నుపదేశమును చేయించుటలు, ధూర్జటి కవీంద్రుని మోక్షదృష్టి.

యాదవభూకాంతుని భక్తిఁదెలిపి, యాతని నుద్ధరింపఁగ శివుఁడు మాయా జంగముగా నేఁగుదెంచుటతో నారంభమైన యీకావ్యము పరమేశ్వరుఁడా భూకాంతుని యనుగ్రహించుటతో, పరిగ్రహించుటలో పరిసమాప్తమైనది.

కావ్యాది, యాశ్వాసాద్యంతములను ధూర్జటికిఁగల తృష్ణాక్షయము, వైరాగ్య సంపదలను వెలార్పఁ జాలియున్నవి. కృతిపుఁడైన యీశ్వరుని కొనియాడుట కుపయోగించిన విశేషణములందు కృత్యాది, షష్ఠ్యంతములంప వైరాగ్యభావన చూచి యుంటిమి. పరీతికథను గూర్చి యడుగుటకు పూనిన యాదవభూకాంతుఁడు 'ఇఁక నెవ్వరందు నీలగ్రీవున్ సేవించి ముక్తికాంతా జీవేశ్వరులై' రనియు,(2-157) 'భూతేశుకృపన్ గని రెవ్వరెంక మోక్షంబ'నియు (3-130) 'పిదపన్ గౌరీశుఁ బూజించి యెవ్వారలొ్చ నపవర్గమార్గమునఁ బోవంగాంచిర'నియు(3-223) ప్రశ్నించు టఁజూడఁగలము అట్లులే పరమేశ్వరునిఁగూర్చి పాత్రల ముఖమునగాని, తానుఁగా గాని పలుకునపుడు ధూర్జటి ముక్తి కాంతాహృదయేశత్వము నీయఁగలవానిగనే పలుకు చుండును.

పాశక్లేశగుణేషణేంద్రియతను ప్రత్యర్థి
బాహ్యోర్మికా కోశాదివ్యతిరిక్తమూర్తి .......1 – 162
శాంతాకార ! యిదంతా
హంతాచింతావిదూర? యపవర్గరమా
కాంతా కాంత ! ............ 1—163

"కాముక్రోధ మహాంధకార పటలాఖండ ప్రచండార్క-
చిద్విద్యాఘంటా పథచార! తారక ఘంటారవ
హృత మనోమృగ వ్యాధేశా! .... .... .... 2 — 159
"ఖండితాజపంజవాంధకార! .... .... .... 2 — 160
"మనోబాధావహ సంసార వ్యాధిప్రజపై ద్య ... 3 — 1
"అవిద్యాసూత్రదాత్రంబు, జీవన ఛేదాంబరకర్తరీముఖము
కైవల్యార్థ దానామృతాశన రత్నంబు .... .... 3 — 222
"చిదాకృతి .... .... .... 4 — 1
"జన్మ జరా విపల్లయదశాదిక్లేశ సంహారకా" .... 4 — 204
"బంధత్రయనాశక! భవబంధాదికబంధ రాశిబంధన విద్యా
బంధుర .... .... .... 4 — 205
"భేదవాదివాగఖండితా .... .... .... 4 — 2(6

ఇట్టితావులుగాక, యాయాపాత్రలమూలమున గావించిన పరమేశ్వర స్తుతిరూప విశేషణములు పెక్కులు, ధూర్జటి గ్రహించిన శివభక్తులయు, తనదైనట్టియునైన మోక్షాపేక్షను వ్యక్తము చేయఁజాలి, ప్రబంధమంతయు శాంతరసము ప్రధానముగా నిర్వహింపబడినదని సిద్ధాంత మొనరింపఁజాలియున్నవి.

ప్రబంధము లందలి శివభక్తులందరి యందలి "శివభక్తి" యమన దేక సూత్రత ఘటించినదని "వస్త్వైక్య"మను పంశమునఁ బరిశీలించియుంటిమి. అట్టి శివభక్తుల తృష్ణాక్షయమను స్థాయి. వారివారి శివార్చనా విధులచే నుద్దీపనము పొంది, వారివారి యనుభూతులు, చేష్ట లనుభావములుగాఁగలిగి, వారందిన సాయుజ్యములందు శాంతముగా రసపరిపుష్టి నందుటచే నీ ప్రబంధమున శాంత మంగిరసమని సిద్ధాంత మగుచున్నది.

### అంగరసములు : 1. శృంగారము :

రసభరితమగు కావ్యమున నొకటియంగిగా మిగిలిన వానిలో గొన్ని యంగరసములుగా నుండును. మన శ్రీ కాళహస్తి మాహాత్మ్య ప్రబంధమున శాంతమంగిరమని గమనించితిమి.

శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక బీభత్సాద్భుతము లిందంగరసములుగా భాసించియున్నవి. యథార్థమునకు వీనియందు శృంగారము తక్క-

దక్కినవన్నియు రసస్థితినందక రసభావమాత్రముగనే నిలిచినవి. శృంగారమంగ రసములలో ప్రధానముగ పోషింపఁబడినది. అంగిరసము కంటె నంగరసమతిశయముగ నిర్వహింపఁ బడగూడదు. కొన్నియెడల నంగరసమగు శృంగారమే యంగియగు శాంతమును మించెనా యనిపించు తావులును గలవని పండితులు తలఁచుటయుఁ గలదు. కాని కథావస్తువందంతటను శాంతమువలె విస్తరించి యుండక, శాంతము వీరముల కంగముగాఁ, గొన్నియెడల సాధనముగా నీ శృంగారము వర్తిల్లినది. పరిహార్య పశ్చాత్తాపముగాని, వైరాగ్యము కాని కల్గుటకు శృంగారము కొంచెమెక్కువగనె యాయాతావులఁ బోషింపఁబడినది.

"అథవా ప్రతిపక్షస్య వర్ణయిత్వా బహూన్ గుణాన్
తజ్జయా న్నాయకోత్కర్ష వర్ణనం చ మతం క్వచిత్"

అన్నట్లు శృంగార రసాధిక్యము శాంతరసతపరిపుష్టికొఱకే యని ధృవపడఁగలదు.

**శృంగార రస స్వరూపము :**

రసములకెల్ల నాద్యముగాఁ బేర్కొనఁబడుచు రసరాజముగాఁ బరిగణింపఁ బడునది శృంగారము.

భోజుఁడు 'శృంగారఏవ ఏకోరసః' యని శృంగారమొక్కటానినే రసముగా నంగీకరింతునని పలికినాఁడు. 'శృంగార ఏవ మధురః పరప్రహ్లాదనో రసః' అని ధ్వన్యాలోకము పలుకుచున్నది. ధర్మవిరుద్ధముగు కామము లేని శృంగార ముపాదేయమే యగును.

'ధర్మావిరుద్ధో భూతానాం కామోస్మి భరతర్షభ'* ధర్మానుబంధియగు శృంగారమే యత్యుత్తమము. అదియే యానందజనక మయినట్టిది. 'ఉత్తమ ప్రకృతి ప్రాయః రసశృంగార ఇష్యతే' అని సాహిత్య దర్పణ మనుచున్నది గదా!

ఈ శృంగారమునకు 'రతి' యనునది స్థాయిభావము. తరుణీతరుణులకు మనస్సునఁబొడమున సంభోగవిషయికమగు నభిలాష లేక కామము రతియనఁబడును.

* భ. గీ. వి. యో. శ్లో.—11

"తత్ర స్త్రీపుంసయోగనో ర్యాన్యాలంబనః ప్రేమాఖ్య శ్చిత్తవృత్తివిశేషోరతిః స్థాయిభావః" అన్న రసగంగాధరము పలికిన వాక్యము మిక్కిలి యర్థవంతముగా నున్నది.

స్త్రీ పురుషులాలంబనవిభావములుగా, ప్రాయము, సౌమ్ములు, చేష్టలు, యౌవనము, ఋతుశోభ చంద్రచంద్రికా మలయానిలాదు లుద్దీపన విభావములు. కటాక్షము, భ్రూవిక్షేపము, పాదాంగుష్ఠము నేలను రాచుట లిత్యాదియు, సాత్త్విక భావ చతుష్టయమును, ననుభావములగుచున్నవి. స్మృతి, చింత, మూర్ఛ యిత్యాదులు సంచారిభావములు.

ఈ సందర్భమున కవి ధూర్జటి 'శృంగారి' యని దోషమెన్నువారుగలరు. శృంగారి యనఁగా కేవలము జీవితమున శృంగారానుభూతి యెక్కువ కలవాఁడు, భోగలంపటుఁడను భావమున నెంచినప్పటి యన్వయక్లేశమది. రసరాజమగు శృంగారమున ప్రకరణోచిత ప్రకర్షముగ నిర్వహించినంత మాత్రమున కవికి భోగలంపటత్వ మంటగట్టుట భావ్యముకాని పని. ఒక ప్రశ్నకిచట నవకాశమున్నది. అంతటి భవపరాఙ్ముఖుఁ డనని తనంతో క్తిగాఁబలికెను గదా, యట్టికవి కింతటి శృంగారప్రసక్తి యేలయనునది యా ప్రశ్న, తొంటతనే గమనించినట్లు కవి వ్యక్తిత్వమును బట్టియిచ్చు కృత్యాది షష్ఠ్యంతము లాశ్వాసాద్యంతములందు ధూర్జటి వైరాగ్యము, నిర్వేదము, భవనిరాసము మోక్షాపేక్షలె వ్యక్తములగుచున్నవికాని యన్యముకాదు.

మానవ మన స్తత్త్వ పరిశీలనము చేసెన నిచట నొక విషయ మనుసంధింపఁ దగియున్నది. ఒక వ్యక్తియందు ఇచ్ఛ, స్వభావములు పరస్పరము విరుద్ధముగానుండు స్థితి యొకటి యుండును. ధూర్జటికి మోక్షమందిచ్ఛగలదు. కాని స్వభావతః జీవితమున నున్నది శృంగారానుభూతి. భవపరాఙ్ముఖుఁడనని తెల్పుకొనిన ధూర్జటి శృంగార వర్ణనమంతఁగాజేయుట కీ మనస్థితియే మూలమని యెంచఁదగియున్నది. ఇచ్ఛామాత్రాధీనమెకాని స్వభావకూలంకషముకాని స్థితి యతనిది. వైరాగ్యమున నప్పటికతనికి నిష్ఠకుదిరి యున్నను లేకున్నను నిచ్ఛకుదిరి యున్నదని భావింపనగును.

'శృంగారీ చేత్కవిః కావ్యజాతం రసమయం జగత్' అని ధ్వన్యాలోక కారుఁ డన్నట్లు శృంగారియగు కవి చేతియందు కావ్యము శృంగారమయమగుట యేమివింత?

జీవితమున కడచూచిన యనుభూతి ప్రవాహమే ధూర్జటిచేత యందు నీకావ్యమున శాంతమునకు సమముగా పోటీ పడినట్లు శృంగారము సింగారించినది. కావ్యమున మిగిలిన తావుల నీ శృంగారము రసస్థితినందలేదు. దాసి—మిండజంగములయు వాణీహారవిద్యాగర్భుల ప్రణయ ఘట్టమునను, శబరకాంతా కాంతుల వృత్తమునను మాత్రము శృంగారము రసస్వరూపమందినది.

## దాసి — మిండజంగముల కథ.

రచనా ప్రణాళిక ననుసరించి ధూర్జటి కవీంద్రుఁడు శృంగారఘట్టముతోఁ బ్రారంభించి శాంతముతో ముగించుట గమనింతుము. దాసి మిండజంగముల కథ కావ్యప్రవృత్తి కథనమునకు నాంది. హరుఁడర్జునునకు జేసిన యుపదేశము, యాదవ భూకాంతుఁ డమ్మహాదేవునకు నివాసంబు గట్టించి కృతార్థుఁడగుటతోఁ గథకు భరత వాక్యము.

రూపొందిన దాసియే సింగారంపుఁగుప్ప. అర్చించి, మాయాజంగముని మెప్పించి, యాదవనాథునొప్పించి, యామె తరించినది. ఇది శాంతమునకిక్క. కాని దాసి మిండజంగముల శృంగారవృత్తమొక శృంగారరసమయఘట్టమె. అందు దాసి - మిండ జంగము లాలంబన విభావము.

జంగము దాసితో

'కాంతా! నీ యింటికిఁ
జనుదెంచెద, నీదు గుబ్బచనుఁగొండల సం
దునఁ దెరువెఱుఁగక తిరిగెడి
మనసను తెరువరికి దప్పిమాన్పంగలవే!'

అని యడుగుట యందలి 'రతి' స్థాయిభావము. 'పనివిని యొదనని' యామె తెల్పిన యంగీకార మనుభావము. 'చంద్రికా శ్రీపెనువెంట నేఁగు నల శీతమయూఖుని రేఖఁబోలి, నానావిధ భోగ్య వస్తు కలనం దగు తన్నిలయంబు' జేరుటయు[2] నామె చిఱునగవులు, నలరుల సెజ్జ, లుద్దీపనవిభావములు.

1 శ్రీ.కా.మా. 1 ఆ—37 ప.
2 ,, ,, 39 ప.

ఇంపైన రతి ప్రసంగముల నర్ధనిమీలితనేత్ర పద్మములు, మూసిన చేతులు, కుంచితములు, మాటలచొక్కులు, వీడి వీడిపోనీని కవుంగిలింతలు, ననేక విలాసములు ననుభావములు. ఆ క్రీడయందు వారొందిన సంతోషము, సంభ్రమములు సంచారీభావములు.

## వాణీ హిరణ్యగర్భుల ప్రణయ వృత్తము

వాణీ హిరణ్యగర్భులప్రణయ వృత్తమునందు పూజ్యులగు నాదిమదంపతుల నడుమనట్లు మితిమించిన శృంగార వర్ణనముచితమా యను విషయమును బరిశీలింప వలసియున్నది.

అంతగా కామాంధులై ప్రవర్తింపనిదే బ్రహ్మకు లోకకంటకులైన కోటిన వీరులు కలుగలేరు. దాని ఫలము శివారాధన, తత్ఫలము పరబ్రహ్మరూపుడగు బుధుని జననము. శాంతరసము రూపుదాల్చిన నట్లుండు బుధుని జననమునకు పూర్వము శృంగారమంత యవసరమైనది. స్వారోచిష మనుసంభవమునకు పూర్వము వరూధిని ప్రవరుల ప్రణయవృత్తమట్టిది కదా! కాకున్న నచట యనుభయుని స్వరతి కారణముగా శృంగారమున కౌచిత్యము కలిగినది. ఇచ్చట శృంగారము పుష్టినొందిన రసమై భాసించినది.

వాణీహిరణ్యగర్భుల ప్రణయవృత్తమున వాణిని జూచి యతడు నాలంబనవిభావము జూచి.

'నలువ తనుఁగోల్వవచ్చిన పలుకు చెలువ
చెలువ మరయుచు వలరాజు చిలుకుముకికిఁ

దలఁకె'[1]నాఁడు. ఆమెవంక తనవాంఛావాత్సల్యమునకు సాఫల్యము లేదని తనయభిలాషమును చతుర్ముఖుఁడు వెల్లడించినాఁడు. ఇది యాపట్టమునందలి శృంగార మునకు స్థాయిభావము. నవపత్రి తలఁకుసకుఁగారణ మా పలుకుఁజెలువ చేష్టలు. అది యిచటి యుద్దీపనవిభావము.

'మ్రొక్కిన నొకతేమ మోమొత్తుఁగాఁజేయుఁ
దిట్టుఁగూరిమి నొక్కతిఁగదోఁడి......[2]

ఈ విధముగా నా శతవాగ్వనజానన మోమొత్తుగాఁజేయుట, తిట్టుట, తలపట్టు కొనుట, యదలించుట, యూనవెట్టుట, యేడ్చుట, ముసుగుపెట్టి పవళించుట, కోపించుట

1, శ్రీ.కా.మా. 2 అ - 10 ప
2. ,, ,, - 18 ప

లిత్యాదులిందలి[1] యనుభావములు. ఆమె కలయికచే నలువ పలుకులకలికి పొందిన యనుభూతులు సంచారిభావములు. బ్రహ్మ అంగంబుమఱచుట, పరవశుఁడగుట, సొక్కుట, సోలుటలును,[2] సరస్వతి నిట్టూర్పు గాడ్పు, చూపుసోలుట, దేహము పొంగుటలు[3] వ్యభిచారిభావములు. ఈ విధముగా నీఘట్టమున శృంగారము రసపరి పుష్టి నందినది.

శృంగారము భావస్థితినుండి రసస్థితికిఁ గొంతజేరువగాఁబోయిన యింకొక ఘట్టము తిన్నని కథలోని శబరులవృత్తము. తిన్నని జన్మమునకు ముందుగల వర్ణనములందు శృంగారము భావస్థితియందే యుండిపోయినది. 'మంచెలమీఁద నెక్కి-కటిమండలిఁజుట్టిన పాఱుటాకులించించుక చంచలించి మరునిల్లు బయల్పడఁజేయఁ బిట్టలన్ జెంచెత లార్చి ప్రేయుదురు చిత్రముగా నొడిసెళ్ళబాహుమూలాంచిత దీధితుల్ చిఱుతలైన చనుంగవమీఁదఁబర్వగన్'[4]

ఈ సందర్భమునందలి భావము వాచ్యమైనందువలన బింకము విగిలెనే కాని పొంకము సడలినది. కావ్యమందెచ్చటను చలించని కవి మనసిచట పాఱుటాకుల చంచలనముచే నించుక చలించినదని యంగీకరింపక తప్పదు. జాత్యుచితమని సమర్థింపఁ బ్రయత్నించినను 'మరునిల్లుబయ'ల్పఱచుట పాడిగాదుగదా! మధుపాన మత్తులైన శబర దంపతులయుఁ, జెంచెత లుపనాథులతోఁ గూడుటయు, వారి మత్తాలాపములును, చేష్టలును శృంగారాభాసమునకుఁ ద్రోవ చేసినట్టివి. ఇందలి స్వేచ్ఛా రతియు, నుపనాయకరతియు నగుటచే నిది సంభోగాభాస మగుచున్నది.

రసస్థితినందకున్నను శృంగారవర్ణన మెక్కువగ జరిగిన ఘట్టము వేశ్యాతనయుల గాథ.

ఈ కథయందు 'శివభక్తి తనువులెత్తిన' కూఁతులమనము మార్చుటకు వేశ్యమాత చేయుప్రయత్నములకు, బోధల కనుకూలముగా శృంగార వర్ణన మావశ్యకమైనది. వారవనితాగృహముకాన నచ్చటి గృహవర్ణనమున శృంగారముండుట యుచితమే. అయిన నిందు కవి ధూర్జటికిఁగల కామశాస్త్ర పరిచయము వ్యక్తమగుచున్నది.

1. శ్రీ.కా.మా. 2ఆ - 18 ప
2. ,, ,, 20 ప
3. శ్రీ.కా.మా. 2ఆ - 21ప
4. ,, 3ఆ - 10ప

ఈ వేశ్యాతనయల కథయందు శృంగారభాసము చెందినదివోలె నగుపించు నుద్దీపన విభావములు మెండుగా నుండియు, వాలంబనవిభావ మాభాసమగుటతోఁ దదితర సంచారీ భావానుభావములకుఁదావు దొరకకుంటచే, శృంగారము రసస్థితికిఁ జేరఁజాలక పోయినది.

వృద్ధ వేశ్యమాత తనయలకుఁ 'కొక్కోకకళావిలాసములకుంగల యర్థము జోలపాటగా'ఁబాడినది.

రతివధూమదనులు రంభాకుబేరపు
    త్రకు లూర్వశీపురూరవులు, మేన
కాకౌశికులు, గోపికా ముకుందులు, ధాన్య
    మాలినీ రావణుల్ మత్స్యలోచ
నర్ష్యశృంగులు, దాశనలినేక్షణా పరా
    శరులు, తారానిశాచరులు, గౌత
మాంగనా దేవేంద్రు లమరవేశ్యా జయం
    తులు, ద్రౌపదీ పాండవులు, పృథార్క
హితులు, నడిచినగతులాత్మసుతలఁ బెంచు
నింటిగోడల వ్రాయించు నిందువదన[1]

తన తనయలకు వావివరుసలు లేని వారధర్మము నెఱుఁగజేయుట కా తల్లి యట్లు గృహకుడ్యములపైఁ జిత్తరువుల వ్రాయించినదఁట. అంతియేకాదు

'కూచిమార మనోజ ఘోటికాపుత్రాది
    కానీత కామసిద్ధాంతముల'ను[2] నూదిపోసినది.

నృత్యగాన విద్యలనారితేఁ జేసినది. పణ్యాధర్మము పాదుకొల్పుటకు పంచకర పాట్లఁబడిన దా వృద్ధమాత. ఈ ప్రయత్నములన్నియు నుద్దీపనవిభావములే.

1. శ్రీ. కా. మా. 4ఆ - 14 ప    2. శ్రీ. కా. మా. 4ఆ - 16 ప

జననాంతరవాసనచే నా కన్నియలాలంబనము కాలేదు. అంతట నా శృంగారా భాసము చెందినదే యగుచున్న దనిపించునుగదా! మరియు నీ సందర్భమున రతి మన్మథులతో, మత్స్యలోచనర్ష్యశృంగుల, ద్రౌపదీ పాండవుల ప్రసక్తి యందలి యౌచిత్యము చింత్యము. తల్లి వారి శైవభక్తికి జింతించుచు తన తనయల సొబఁగు, సొగసుందనములమఁదఁ వుటయు నుద్దీపనవిభావములె.

> 'కన్నెలు చిత్తజాతుఁడొక కాలము నేయని పుష్పబాణముల్
> చన్నులు శృంఖలారహిత శంబర జిన్మదకుంభికుంభముల్
> ప్రన్ననినవ్వు కాఱఁడనిఁబర్విన వెన్నెల, దేహకాంతి సం
> పన్నత తప్తహేమరుచి, భామలు పల్లవభోగ్యలౌదురే ? [1]

తరువాతి రెండు పద్యములిట్టివే. [2]

అంగరసమైన శాంతమునకును, నంగిరసమగు శృంగారమునకు సను ప్రాధాన్యమె యిత్తునన్నట్లు ధూర్జటి, యీ ఘట్టమున రసనిర్వహణము సాగించెను. వేశ్యా తనయలకు తల్లి గావించిన పెంపకము, బోధలు శృంగారరసప్లావితములు కాగా, శివభక్తి తనుపులెత్తిన యీ విద్ధల వైరాగ్యము ముదిరి శ్రీ కాళహస్తీశుని దర్శించుటకుఁ జెందిన యాత్రము, చేసిన పయనము, పొందిన దర్శనము, నందిన సాయుజ్యములు శాంతరసప్రధానములైనవి. ఈ రహస్యమును ధూర్జటి, వేశ్యా తనయలకు సాక్షాత్కరించిన పార్వతీ పరమేశ్వరుల దివ్యసంయోగమును వర్ణించివర్ణించి 'జననీ జనకశరీరంబును, విద్యాపురుషసామరస్య సుఖాకారంబును, శృంగారశాంతరసమయంబును, ప్రత్యక్షభోగ మోక్షప్రదసమయంబునునై, యొక్క మహాతేజం బెసరుకట్టం గన్నులకు మిఱుమిట్లుగొన నిల్చె' నటనినాఁడు. [3]

ఈ విధముగా నంగరసములలో శృంగారము మొదటగాఁ జెప్పఁదగినదని వచ్చుము. రసస్థితినందక రసభావమాత్రముగా శృంగారము వర్ణింపఁబడిన తావులు ప్రబంధమున మఱికొన్ని కలవు.

---

1. శ్రీ.కా.మా. 4ఆ - 46 ప 2. శ్రీ.కా.మా. 4ఆ - 47, 48 ప

3. శ్రీ.కా.మా. 4ఆ - 128 వచన.

రసభావమాత్రముగా శృంగార ప్రశంశ కలతావులు :

పార్వతీ పరమేశ్వరుల విహార సందర్భమున పార్వతీ పరమేశ్వరులు ఆలంబనము కాగా, అలరుంగేఁగెలు, పువ్వుగుత్తులు, కురంగాలోకము ల్పల్లవంబులు, పంచానన మధ్యముల్మృదుకరంబు ల్బింబము ల్లాదిమీసలవీజాములు నద్రిజావాయవ సౌభాగ్యంబు తో నీడురాగలవో ? రేవో ?.[1] యన్న విధమున సాగినపార్వతీదేవి శరీరావయవ సౌందర్యవర్ణనము, వారు విహరించిన విపినాంత్రము పల్లవచ్ఛాయలు, గిరిదరీ విర్ణనము,[2] లుద్దీపనములయినవి.

'గిరిజా కర్ణోత్పలోద్వాసి తోల్బణ గండ స్థల ఘర్మ వారి' యన్నది సాత్త్విక భావ మయినది. మంచు గుబ్బలి రాజు కుమారిఁగూడి, వేలుపుల పెద్ద జముచెన కొండఁ దన్ను చెలిసిన వారికి నన్నిదెసల,దాన యగు రీతి బహువేషధారి,[3] నపభోగ రతి గృహనాథుఁడగుచు విహరించినాఁడు పరమేశ్వరుఁడు.

ఇచ్చటి శృంగార మతిపవిత్రమై కేవలవ్యజ్యమానమై యలరారినట్టిది.

లోపాముద్రాదేవిని చేయిబట్టి దక్షిణ కైలాసాగమేఁగు నగస్త్యుని వర్ణించు పట్టుల, ధూర్జటికి సర్వేసర్వత్ర కల పవిత్రదాంపత్య మందలి మృదులశృంగార మొలి కినది.

'చేరగబోయి యాత్మ సరసీరుహలోచన కేలు పట్టి వ
క్షోరుహ కుంభ భారమున సూక్ష్మవలగ్నము పీడఁబొందఁ బొం
దారయువృత్తి రమ్మనుచు నాదరణంబునఁ దోడుకొంచు...'[4]

నగస్త్యుడు ధర్మపత్నితోఁగూడి నడచెనఁట.

అగస్త్యుఁడు తపమునకుఁబూనెను. గ్రీష్మర్తు వర్ణనమున నీ శృంగారచ్ఛాయలు పర్వినవి.

'దూరీకృత స్తనభారకంచుక వధూజనము ......
...... ప్రాణేశ్వరీ పరిరంభణ ప్రత్యూహకారి....!'[5]

1. శ్రీ.కా.మా. 1ఆ — 100
2. ,, ,, — 97 వ
3. శ్రీ.కా.మా. 1ఆ — 101 వ
4. ,, ,, — 118 వ
5. శ్రీ.కా.మా. 1ఆ — 122 వ

ప్రబంధమున పవిత్రశృంగారమునకుఁ బ్రతీకలయిన పవిత్ర దాంపత్యములను స్మరియించుట ధూర్జటి హృదయము. కావ్యారంభమున స్మరించిన ఆర్యా వామాంగము, పార్వతీపరమేశ్వరులు, లోపాముద్రాగస్త్యులు, భక్తులకు సాక్షాత్కరించిన యీశ్వరుఁడే వేళను పార్వతీపతిగనేయుండుట, ఇందులకుఁదార్కాణలు. వశిష్ఠునకు వినిపించిన కంఠము గిరిజానాథ స్వరూపంబు పల్కిన యట్లైనది? బ్రహ్మ గాంచినది 'సోము' న[2] లోపాముద్రాగస్త్యులను మునీంద్రులు

'శితికంఠుఁడద్రికన్యా, పతియై సుఖియయ్యె భువనభవనంబునఁద

త్ప్రీతిగా లోపాముద్రా, పతియై సుఖియైతి'[3]...వని కొనియాడిరి.

చెలఁది కీశ్వరుఁడు 'గౌరీవామాంగుఁడు'[4]గాఁ బ్రత్యక్షమగుటయు, బాముసేనుఁగులకు 'కొండలరేని కూరిమికూఁతుతోడఁగూడి చంద్రచూడామణి వృషభవాహనారూఢుండై'[5] సాక్షాత్కరించుటయు, తిన్నఁడు హరద్విజులకు 'శీతవసుధాధర కన్యక ముద్దుఁగేలుఁదామర కడఁవ్రేలు పట్టుకొని'[6] ప్రత్యక్షమగుటయు, 'జ్ఞానప్రసూనాంబా నాథుండు'[7] నత్కీరునికిఁగన్పట్టి, 'తుషారశైలతనయా జాంపత్య సంపన్న పావనగార్హస్థ్యము'[8] గా సాయుజ్యమిచ్చుటయు, వేశ్యాతనయలకు 'జ్ఞానప్రసూన కళికయుఁదామంబూని యొక దేహమై యెసఁగె నిల్చి'[9] 'శృంగారశాంతరసమయంబునుఁ బ్రత్యక్షభోగమోక్ష ప్రదసమయంబునై యొక్క మహాతేజంబెదురఁగట్టం'[10] గనుపట్టి సాయుజ్యమిచ్చుటయు, అర్జునునకుఁ బరమేశ్వరుఁడు 'వామనీమానరోధాకారుండై' యిమే ప్రత్యక్షమగుటయు, నట్టి పవిత్ర దాంపత్య గౌరవస్థాపకములగు తావులే.

---

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీ.కా.మా | 1ఆ | – 76 ప | 6. | శ్రీ.కా.మా. | 3ఆ | – 120 ప |
| 2. | ,, | ,, | – 131 ప | 7. | ,, | ,, | – 217 ప |
| 3. | ,, | ,, | – 153 ప | 8. | ,, | ,, | – 222 ప |
| 4. | ,, | 2ఆ | – 122 ప | 9. | ,, | 4ఆ | – 127 ప |
| 5. | ,, | ,, | – 152 ప | 10. | ,, | ,, | – 128 ప |

ఇఁక శృంగారాంగముల నితరాంగములుగను, నితర రసాంగములను శృంగారాంగములుగవర్ణించు పట్టులునుగలవు. శాంత, వీరముల కంగములుగా శృంగారాంగముల ప్రశంసయు, కొన్ని యెడల శృంగారసభాసముగా ప్రస్తావింపఁబడుటయుఁ గలదు.

దుర్గాదేవి స్తుతియందు శృంగారము వీరాంగముగ వర్ణింపబడినది.

కాస రాసురరాజ కంఠ నిర్గతరక్త
పంకంబు శ్రీపాద పద్మలాక్ష
చండముండాహవ సంభ్రమ స్తనజాత
ఘర్మ వాఃకణరాజి కంఠమాల
రక్తబీజాది మర్దన సమయాట్టహా
సము మోమునకు లోధ్ర సుమరజంబు
శుంభనిశుంభ రక్షోవీర సంహార
వేళఁగప్పిన ధూళి మేలి ముసుఁగు
గాఁగ నే దేవి వీర శృంగార మూర్తి
యగుచు శోభిల్లునట్టి దుర్గాంబ...'[1] గొల్చినాడు ధూర్జటి.

కామినీ జనుల వర్ణనమున శృంగారాంగములను శాంతాంగములుగ శ్లేషభావమున బోషించినాఁడు కవీంద్రుఁడు.

'పరిచిత బిందునై పుణి సపారకళాసుభవ ప్రసక్తి నా
దరస వివేకసంపద, సదాశుకవాక్య సుధాసుభూతి, మో
హరహిత వృత్తి, బ్రిస్ఫురదనంగ రహస్య విచార బుద్ధి న
ప్పురమునఁగామినీజనులు పొల్తురు యోగిజనంబుల పోలికన్' 2

శృంగారమునకు బాధకమగు భక్తిభావవర్ణనము 'కాళహస్తుల' కథయందుఁగాంచఁ గలము. పాముఁనేనుఁగులు పరస్పరము పగబట్టి, శత్రువెవరో తెలియక, తమ యర్చావిధి భంగమగుటకుఁజింతనొందుట యీ ఘట్టము.

---

1. శ్రీ.కా.మా. 1 అ – 4ప

2. ” ” – 24ప

"భోగవతీ పురంబునఁ జొచ్చి బోటుల
తోడ నాడెడు జలక్రీడ లుడిగి
ప్రాణనాయికతోడఁ బర్యంకసీమల
మనకానఁ బెనఁగు సంభ్రమము విడిచి
నిద్రవోయెడు సుఖమెల్ల నేలఁగలిపి...."1 పాము రాత్రిని శివరాత్రిగా జాగరము చేసినది.

ఇఁక నేనుఁగు 'పిడియేనుఁగుల వెంటఁబడిపోక యుడుగని
పెడవిల్లు వేడిమి విడుపు చూప 2
'చింతయన్ వేఁకి తను లోను చేసి'కొనుటగాఁ దపియించినది

తిన్నఁడు భక్తిపూర్వకముగాఁ బరమేశ్వరునకు నివేదించుకొనునప్పుడు శృంగార పరిసక్తి గలిగి భక్తిభావమునకు బాధకనుయ్యెనా యనిపించునుగాని, యిది యాతని ముగ్ధభక్తికిఁ బోషకమైనదనియే యెంచఁదగును.

'ఇల్లో ముంగిలియో యనుంగుఁజెలులో....' లేని యా లింగ మూర్తికిఁదన వెంటవచ్చిన యెడల

'చుఱుకుఁజూపులఁగాలిన కొఱతనుఱుకు
నుఱుకుఁ జూపులఁ బుట్టించు నెఱుకు వారి
యుఱుకు వలిగుబ్బ పాలిండ్ల యిగురుఁబోండ్ల' 3
సేవఁగల్పింతుననినాఁగు తిన్నఁడు.

కాళుఁడు 'హరునిచిత్తంబునకు దూరమైతి'నని పశ్చాత్తపుఁడగునప్పటి యా వర్ణనమున నా కాళని భోగానుభూతి స్మరణరూపమున శాంతమున కంగములాగ శృంగారాంగములు పేర్కొనఁబడినవి.

"తారాచలారోహణారంభమునకుఁ బ్రి
త్యూహరూపములు పయోధరములు
శంకరపద పద్మ సందర్శనసంతరా
య నిధానములు కటాక్షాంచలములు....' 4

1. శ్రీ. కా. మా. 2ఆ–119 ప 3. శ్రీ. కా. మా. 3ఆ–71 ప
2. " "–125ప 4. " " 4ఆ–165ప

అట్లే రౌద్రాంగములు శృంగారములగుటను, 'వాణీహిరణ్యగర్భుల' కథ యందుఁగాంచఁగలము, మాఱు రూపములు ధరించిన సరస్వతి బ్రహ్మ చేష్టలకుఁ గావించినఁ బ్రతిచేష్టలు రౌద్రాంగములు. అవి యచట శృంగారమున కంగములుగాఁ గూర్పఁబడినవి.

'మొఱ్ఱకిన నొకతేమ మోమెఱ్ఱఁగాఁ జేయుఁ
దిట్టుఁగూరిమి నొక్కతీగఁబోఁడి
తలపట్టుకొను నొక్క తరుణీ లలామంబు,
హుమ్మని యదలించు నొక్కయింతి....' * 1

ఇందలి మోమెఱ్ఱఁగాఁజేయుట, తిట్టుట, తల పట్టుకొనుట, హుమ్మని యదలించుట, యానపెట్టుట, యేడ్చుట, ముసుగు పెట్టుట లు కోపనుమ స్థాయి భావముగా గల రౌద్రరసమున కంగములయిన యనుభావములు. ఈ రౌద్రరసాంగములిచట శృంగారాంగములుగఁ జిత్రింపఁబడినవి.

## 2. వీ ర ము

ఈ ప్రబంధమున నంగరసములలోఁ దర్వాతఁ బేర్కొనఁదగినది వీరము, బ్రహ్మకుమారుఁ డుగ్రుఁడనువాఁడు కోణపవీరులతోఁ జేసిన యుద్ధము, కాదంబ్రవేయ భుజంగము లొనరించిన పోరాటము, తిన్నఁడు నిర్వహించిన వేట, తుదకు మాయా కిరాతార్జునుల సంగరములను ఘట్టములం దీ వీరము రసముగ నిర్వహింపఁబడిన దన నొప్పియున్నది. అయా తావుల నీ వీరమునకు రౌద్రము, బీభత్సాద్భుతములు పోష కములుగా నిర్వహింపఁబడినవి.

కోణపవీరుల నుక్కడగించి రమ్మని బ్రహ్మ తన కుమారుఁడగు నుగ్రుని నియమించెను. ఉగ్రసింహరథ మస్త్రచయమును బూని కోణప వీరులపై దండు వెడలిన యుగ్రుని పూనిక 'ఉత్సాహ' మనునది వీరరసమునకు స్థాయిభావము.

ఉగ్రుఁ డాలంబన విభావముకాఁగా, కోణపవీరుల సన్నాహ ముద్దీపన విభావ మైనది. చటులవిక్రమగరిమమై నార్పులతో బొబ్బలతోఁగోణపవీరు లుద్దీపనము గల్గించిరి. తన యస్త్రశస్త్రములు వారిపై వమ్మగుటతో మగుడ్రినకు

'క్రోధాగ్ని ప్రభరీతి శోణరుచి దృక్కోణంబులం జిం'దెను'2

1. శ్రీ. కా. మా. 2ఆ—18 ప 2. శ్రీ.కా.మా. 2ఆ—46 ప

ఉగ్రుని కన్ను త్రెంపఁబడుట యమభావము. ఇది రౌద్రాంగము. ఇచట నది వీరాంగముగా శోభించినది. యుద్ధతీవ్రత బీభత్సమైనది.

'దిక్కులఁ గ్రిక్కిఱి యలంగఁ జక్రగుణ సందీప్త ధ్వనుల్మీఱఁగా
నెక్కుల్ వచ్చిన కాలసర్పముల పెక్కింపఁ గంకపత్రంబులన్
జొక్కంపు నిశాత బాణముల నా జోదేసె, బేతాళముల్
గుక్కిళ్ళింగఁగఁ గ్రొత్తనెత్తురుల వాగుల్పాఱఁగ్రవ్యాదులున్'1

బేతాళముల్ గుక్కిళ్ళింగఁగఁగా గ్రొత్త నెత్తురుల వాగులుగాఁ బాఱుట బీభత్స రసాంగము. తిరిగియుగ్రుని 'మహోగ్రనిరీక్షణంబులన్ నిప్పులురాలి'నవి. విజృంభించిన యా రక్కసులేసిన బాణముల కాతని 'కంఠమునన్ భుజమ్ములన్ జిప్పిలి వేఁడి నెత్తురులు జేగురు సేఁకులు కొండనుండి జాఱొప్పనఁగా'జీనవి. ఇందు మొదటిది రౌద్రాంగము కాఁగా, రెండవది బీభత్సాంగము.

ఉగ్రుఁడు విజృంభించి గావించిన యుద్ధ ఫలితము రౌద్రాంగము.

'చెక్కల్సేసెన్రథంబు, లశ్వములఁగూల్చెన్, ఖండఖండంబులై
తెక్కెంబుల్పడనేసె, రత్నమయకోటీరంబులుం దూణముల్
వ్రక్కల్గానొనరించె, ధూళిఁగలిపెన్వర్మంబులన్, సూతులన్
జక్కాడెం,దనుమాడెవింట్ల నసురుల్ సంక్షోభముం బొందఁగన్'2

ఉగ్రుని శత్రువస్తునాశము రౌద్రాంగముకాఁగా, రక్కసులు పొందిన సంక్షోభము భయాన కాంగమగుచున్నది.

ఈయుద్ధవీరమునకు 'తీవ్రవాతూలాస్త్రంబున నందఱన్ గెడపు'టతో రసస్థితి కలిగినది. రణరంగమత్యంత బీభత్సమయినది. బీభత్సరసవిషయము మీఁదఁ జూడఁగలము.

---

1. శ్రీ.కా.మా. 2 ఆ — 52ప 2. శ్రీ.కా.మా. 2ఆ—58 ప

కాద్రవేయ భుజంగముల పోరాటము:

"ఎప్పుడు తెల్లవాఱును? సహింపఁగరాని విరోధిసర్పునే

చొప్పున నార్తు మొక్కి?' యనుచుం దమలో" దలపోసిన పాముసేనుఁగుల తలఁపు స్థాయి నావము. పాము నేనుఁగు లాలంబన విభావములు. పాము 'ముక్కి గోళ్లలో నెక్కి యుద్దండ క్రీడ దసీయ కుంభకుహర స్థానంబునం దిమ్మ'రుట యుద్దీపన విభావము. ఏనుఁగు కావించిన ప్రయత్నము లనుభావములు.

'మొగలేటి మడుఁగున మునిఁగి తుండమ్మున
నుదక మాకర్షించి యూఁది యూఁది
కడుఁగ పాలము దాఁకి కలఁగంగఁజ్రంగా
జేసాచి జిబ్బునఁజీఁది చీఁది
యిలమీఁదఁదలదాక నీ పక్కి నా పక్కిఁ
బెడమర్లుగాఁ బొడ పెట్టి పెట్టి
యుడివోని వేదన నున్నచో నుండక
పనిలేని పరువులు పాఱి పాఱి
పెద్దమ్రాఁకులతోఁ గుంభ పీఠ యుగముఁ
దోముకొనుచుఁ బట్టులు దూఱి దూఱి
పాముసేసిన దుఃఖంబు సామజంబు
దీర్చుకొన వెరవెఱుగఁక...' గ[1] పడిన పాట్లనుభావములు.

'తుండ మిఱియంగాఁ జుట్టి వక్ష స్థలంబునఁగీలించి, పిఱిందికింబని, శిరంబు న్వంచి, యక్కొండ భగ్గునఁదాఁ[2]కుట రౌద్రాంగము.

'దళితకుంభ, సీమనున్న పాము చిదిసె, నేనుఁగులు రెండును మరణించుటతో వీరము రసస్థితి నందినది.

---

1. శ్రీ.కా.మా. 2 అ – 148 ప 2. శ్రీ.కా.మా. 2 అ – 150 ప

3. శ్రీ.కా.మా. 2 అ – 151 ప

తిన్నఁడు వేటకుఁబోవుట : వేటకు బయల్దేరిన తిన్నఁడాలంబన విభావము. వేట ప్రయత్నము, పరికరముల సమీకరణము ఉద్దీపన విభావములు. ఈ ఘట్టమున వీరము రసస్థితి నందక రసభావ మాత్రముగనే కూర్చబడినది.

మాయాకిరాతార్జునుల సంగరము : ఈ ప్రబంధమున వీరము పరిపూర్ణముగ వీర రసస్థితి నందిన దీ ఘట్టముననే యని చెప్పఁదగియున్నది. పూర్వోక్త ఘట్టములందు వీర రసము తన్న తద్రసమునకుఁ బోషకముగా నున్న రౌద్రమే మించిన దనిపించును.

ఈ ఘట్టమున మాయా కిరాతార్జును లాలంబన విభావములు. వరాహ రూప మందిన మూకాసురు నే నేసితి నన్న మాయా కిరాతార్జునుల వీరా లాపము ఉద్దీపన విభావములు.

'చెయ్యెచ్చి యొక కొంతసేపు నేర్పున బల్మి
యినుమడింపఁగఁ బోరనీక మలసె'[1]

ఇత్యాదిగ హరుఁడును హరిహయసుతుఁడును సాగించిన సుల్లసంగర రీతులు అనుభావములు.

అర్జునుఁడు పొందిన వెగడుపాటు, వారిరువురు గావించిన యట్టహాసములను లను భావములు. లయతాండవకరుం డుప్పొంగుట సంచారీ భావము ఈశ్వరుఁ డను గ్రహించుటతో నర్జునుని పాశుపతాస్త్ర లబ్ధియయినది. ఇది యిందలి వీర రసస్థితి.

## 3. కరుణరసము :

దాసి - మిండ జంగముల కథయందు కరుణ రసము నిర్వహింపఁబడినది. 'చంచరీక సంబంధ విహీనాంచితలత యను'[2] నట్లు ముండిత శిరస్కయైన దాసి పొందిన దుఃఖము స్థాయిభావము. దాసి యాలంబన విభావము. తొలఁగిన సౌందర్య ముద్దీపన విభావము. తపసిచరణములపై ప్రాలి 'దృగంబుపూరములు వెల్లిగొనన్ బలవించు'ట[3] ఓ యని రోదించుట, నిట్టూర్పు పుచ్చుట[4] లను భావములు.

---

1. శ్రీ.కా.మా. 4ఆ – 191 ప 3. శ్రీ కా.మా. 1ఆ – 50 ప
2. " 1ఆ – 49 ప 4. " " – 51 ప

అశ్రుపాతము సాత్త్విక భావము. చింతించుట సంచారీభావము. ఈ విధముగా నీఘట్టమున కరుణము రస స్వరూపమందినది.

## 4. రౌద్రము :

ఉగ్రుఁడు కోణపవీరుల నుక్కడఁగించు ఘట్టమున నీ రౌద్రము సర్వాంగీణ ముగ రస రూపము దాల్చినదని చెప్పనగును. ఈ యంశము 'వీరము'నఁ బరికించి తిమి. ఆ ఘట్టమున రససామగ్రియంతయు రౌద్ర సంబంధియే యనిపింపఁగలదు. అపరాధులయిన కోణపవీరులను శిక్షించుటకు దండ్రిచే నియమితుడైన యుగ్రుని యాటోపము, వీరవిహారము, విజయసాధనములు వర్ణింపఁబడిన వచట.

పాము నేనుఁగుల పోరాటమున నేనుఁగు కొండతో భగ్గుని తాకుట రౌద్రాంగమె. అర్జునుఁడు హరుని 'సాటల జలాటావళి పీడగ శేషుఁడూడఁగ' వింటితో గొట్టుట. వారు గావించిన మల్లయుద్ధరీతులును రౌద్రాంగములె.

## 5. హాస్యము :

హాస్యమునకు స్థాయిభావ విషయమున 'వికృతాకార వాగ్వేష చేష్టా దేర్కు_ర కాచ్ఛవేత్ హాస్యా హాసః స్థాయిభావః' అన్నది సాహిత్యదర్పణ నిర్వచనముకాగా, 'వాగంగాది వికార దర్శన జన్మా వికాసాఖ్యో హాసః' అన్నది రసగంగాధర లక్షణ ముగా నున్నది.

వికృతములయిన వాగంగములయు, వేషములయు దర్శనమునఁగలుగు చిత్త వికాసమే హాసమను స్థాయిభావముని గ్రహింపఁదగినది.

ఈ ప్రబంధమునఁదృతీయాశ్వాసమునఁగల శబరుల వృత్తాంతమున హాస్యము తొంగిచూచినది. సుధ పానమత్తులైన శబరదంపతు లాలంబనము. ఒడలు తెలి యక వారు గావించిన చేష్ట లనుభావములు.

'మాటలాడఁదలంచి మఱచి పోయెడువారు
నడువఁబోవుచుఁ దొట్రుపడెడు వారు
నూరకుండెదమని యుండనోపని వారు
లేచెదమని లేవలేని వారు
బనిలేని పని బట్టబయలు దిట్టెడు వారుఁ
బాడనేరకయును బాడు వారు
నెదురైన వారికి నెల్ల మ్రొక్కెడు వారు
వ్రీడావిహీనులై యాడు వారు
జాలఁద్రావియు మగుడఁజేసాఁచు వారు
దొడరి యుపదంశఖండము ల్దొడుకు వారునైరి ..."[1]

ఇందు తొట్రుపాటు, లేవలేక పోవుట, బట్టబయలు దిట్టుట, పాడుట, మ్రొక్కుట, యాడుట, చేసాఁచుట లను భావములయినని. మధుర మధురపాస్వాదనమున వారందిన మోదము, వారిచర్యలందు గన్నట్టు నున్మాదము, నుదములు సంచారి భావములు.

బట్టబయలు దిట్టుట, యుండనోపకుండుట లిత్యాదులను సంచారి భావములు. ఇందలి మదము తరుణ మదమనఁబడును.

'మదము మదిరాదికృత స

మ్మద మోహవ్యతికరంబ'[2] ని వాక్యాలంకార సంగ్రహ నిర్వచనమిచ్చుట ననుసంధింపఁదగియున్నది.

తిన్నని కథయందలి శివబ్రాహ్మణుని రూపచిత్రణమున హాస్యము కేవల మర్ధచమత్కృతిచే వ్యజ్యమానమైనది. 'కుండబొజ్జయు, నొకపాటి గుజ్జురూపు'[3] నత్కీరుని కథయందు హరద్విజుఁడు దీనుఁడై సభయందు తన చెప్పిన పద్యము తనది కాదని పలుకునప్పటి వళ స్థితి యూహించిన నతఁడు నగుబాటు పాలయ్యె ననిపింపకతప్పదు. నత్కీరుఁడాతని పద్యము విన్నంతనే నవ్వుచు 'లోకమునగదె ?' యని యవహేళన చేసినాఁడు. హరద్విజుఁడు దీనుఁడయ్యెనే కాని, నత్కీరుని

1. శ్రీ. కా. మా. 3 ఆ-41 ప 2. కా. సం. 3 ఆ-75 ప
3. శ్రీ కా. మా. 3 ఆ-94 ప

వాక్యములకు వెంటనే సభ నవ్వియుండును. సభకు కలిగించిన యీనవ్వు వెటకారముతో గూడినది కాగా, నా భారద్వాజుని వాక్యములకు జాలితో గూడిన నవ్వు నవ్వియుండునుగదా !

## 6. బీభత్సము

'కదర్యవస్తు విలోకన జన్మా విచికిత్సాఖ్యశ్చిత్తవృత్తి విశేషో జుగుప్సా' అని రసగంగాధరము. ఏవగింపుఁగొలుపు పురీషాది వస్తువులను జూచుటవలనఁబుట్టు విచికిత్సయను చిత్తవృత్తి విశేషమును జుగుప్సయందురు. మన యీ శ్రీకాళహస్తి మాహాత్మ్య' ప్రబంధమున బీభత్సము రసస్థితి వహించిన ఘట్టము ద్వితీయాశ్వాసమందలి రణరంగ వర్ణనము. 'ప్రోవు దప్పక ధరణింబడియున్న మానవాహార హరిశాబక కళేబరంబులు 'వారణంబుల యుట్టఁ గట్టపడుటంజేసి తొట్టిన నెత్తురు మడువు'[1] లుగానున్న దృశ్యమచట నాలంబన విభావము. 'పదడునందొదివిన మెదడునుం, బ్రిదరంబులం జదిసి కదిసినమాంసంబు'లు నాలంబన విభావములు. విగతవీరులైన తేరులును, జర్జరితాంగంబులైన తురంగంబులును, శరీరభేదిత శరవ్రాతులైన సూతులును....రుధిరసమాక్రాంతులైన మావంతులును, యమకింకరాయత్తులయిన రాహుత్తులు' నిందాలంబనములు.

'ఆ నెత్తురు మడువులం దెట్టువలుగట్టిన యంపకట్టియలం దెప్పలు కట్టుకొని యాడందలపెట్టు బిడ్డల యద్దైతనంబునకు, మనంబున ఘనంబున ఘనంబగు వేడుక వాడమఁబెద్దయుఁ బ్రొద్దు ముద్దాడు శాకినీడాకినుల కలకలంబును, బచ్చిపొలసుఁదిని వెగటగుటఁజేసి—కండలు బరి కట్టియలన్నటి కలుకట్టు గొలుపం బాలుపడి తిరుగు భూతబేతాళబాలికాదుల కోలాహలంబు .... 'డాగిలి ముప్రిచ్చులాడు దయ్యంపుఁ దొయ్యలుల సయ్యాటంపు గయ్యంబును....కళేబరంబులంజూచి సజీవ శంకాతంకంబునం గొంకి, వెనుక పదంబులు గ్రమ్మకొనం జిమ్మినదమ్మునఁగదలతుండినఁజెంది పండువు సేయుగోమాయు పరంపరారావంబు'[2]లనునవి యుద్దీపనవిభావములు. ఇందు భూతభేతాళాదుల చేష్ట లనుభావములు.

1. మఱియు 2. శ్రీ.కా.మా. 2ఆ—63 వ

'ఏనుఁగు తుండంబులం దూములమరిం'చుటచే చెమరించుట సాత్త్వికభావము. ఈ ఘట్టమున గోమాయు పరంపరా రావంబనునది భయానకాంగము.

నత్కీరుఁడు తాఁబొందనున్న కుష్ఠవ్యాధిఁదలఁచి బాధ నొందు సందర్భమున నీ బీభత్సము భావమాత్రమునఁగలదు.

'లివిరి యంగమ్ములఁ దిమ్మిరెత్తక మున్న యొడలెల్ల మచ్చలఁ జెడకమున్న బొడుపులు మేన నేర్పడక మున్నతమపునఁజీము రక్తములు ....గారక మున్న దేహమీఁగలు మూఁగి తినకమున్న'[1] యనుభావమునుఁగవి 'జనులు చూడ రోయకమున్న' యని వ్యజ్యమానముచేసెను. చీము నెత్తురు పేనఁబొప్పిలంగ ఈఁగలు మూఁగియు రేఁగియు....[2]

## 7. భయానకము :

'వ్యాఘ్రదర్శనాది జన్మా పరమానర్థ విషయకో వైక్లబ్యాఖ్యః స భయం' క్రూరాకారముఁజూచినప్పుడు గలుగు మరణాది రూపమహానర్థశంక కలుగుట భయమను స్థాయిభావము.

నత్కీరుని కథ యందు దుర్భిక్షవర్ణనమున 'మానిసి మానిసిఁదినుకట'యని వర్ణింపఁబడినది. అనఁగా మనుజునకుఁదోడిమనుజునిఁజూచుటయే భీతావహము కల్గించు భయానక ఘట్టమది. మరణాశంక గలుగు చున్నది గదా! ఇచ్చట భయానకము భయమను స్థాయిభావ మాత్రముగ నిలిచి యున్నది.

నత్కీరునిఁబట్టికొన్న భూతవర్ణన భయానకమైనది. క్రూర వీక్షణ వ్రిఖల గుడ్డులు, కోఱలు, నూర్ధ్వకేశముల్ నీరదనీలగాత్రమును, నిష్ఠురవాక్యము,లట్టహాసముల్, ఘోరవకంపనిస్వనము, భీకర హేతియు, మానవావాస్థిహారా రవముల్సెలంగ, వికటాకృతితో నొకభూతమాతనిన్'[3] అనునదియు నిచట భయమును స్థాయిభావము

1. శ్రీ.కా.మా. 3ఆ – 177 ప   2. శ్రీ.కామా – 3ఆ – 193 ప
3. శ్రీ.కా.మా. 3ఆ – 200 ప

'నెఱిమిగుల గలిగి, నలుపై,
తఱచై, మదనప్రతాపదావాగ్ని శిఖల్
మెఱయ నవధూమమనఁగాఁ,

దెటవకుఁగచభరమువచ్చె'....నట.* ఈపద్యములందలి యుత్ప్రేక్షిత సామగ్రి యాపె శిరోజ సౌందర్యముచనందగించును, నద్భుత చర్యనూహ కందించుచుండఁగా 'నద్భుతంబుగ' నని వాచ్యమునేయ నక్కరలేదు.

అట్టిలె నత్కీరుఁడు కొలనిపొంతఁగాంచిన యాశ్చర్యకర దృశ్యము వర్ణింపఁ బడుట వలననే యచట నద్భుతము వ్యజ్యమానమగుచున్నది. అదటయు 'నద్భుత రసపరవశుండై' యని వాచ్యము చేయఁబడినది.

'తద్వటంబుననుండి రాలిన పండుటాకులు బట్టబయటఁ బడినయవి విహంగంబులు, జలంబునం బడినయవి మీనంబులునై పోవు నందొక్క పలాశంబు జలాశయంబున సగమును దటప్రదేశంబున సగమును బడి, మీనపక్షిత్వంబులఁగైకొని, లోపలికి వెలుపలికిం దివియు' చుండుట యచటి దృశ్యము, అది చమత్కారావహమైనది.

సుబ్రహ్మణ్యేశ్వరు నుపదేశము ననుసరించి నత్కీరుఁడు 'డెందంబులో నానందంబుదయింప నక్కొలనిలో సత్యనిష్ఠం గృతస్నానుండై తలయెత్తఁగా నెదుటఁగానవచ్చె నాలోనవాచీనస్థాణునగంబు హేమముఖరీ సింధు వప్రతీరంబునన్' కొలవిలో మునిఁగి తల యెత్తిన నత్కీరునకు శ్రీ కాళహస్తియందలి దక్షిణ శిలాద్రియు, సువర్ణముఖరియు, గనుపట్టుట, కుష్ఠవ్యాధి మానుటయు నద్భుతరసావహములే గదా!

వేశ్యాతనయలు సాయుజ్యనుందుటను స్థానము వారికి సంభ్రమము పెరిగి, వెఱఁగందినారు. కంటికిఁగన్పించుచునే యంతర్ధానమందుట యద్భుతముగదా! ఇది యద్భుతరసభావము. ఇట్టులే యర్జునుని తూణీరనుందొక బాణమైనను లేకపోవుట యాకస్మికముగ జరిగిన ఘటనము. దానికతఁడద్భుతమందినాఁడు.

శివభక్త చరితలనెఱిఁగించి మాయాజంగమంతర్హితుఁడగుటతో, గథలాలకించు చున్న యాదవభూకాంతునకుఁ జోద్యమయినది. ఇది యద్భుతరసమునకు స్థాయిభావమె కదా! 'ప్రాతఃకాల తుషార శీకరచయప్రాప్తిన్ లవన్మౌక్తికోపేతాగారము లట్లు చెల్వెసఁగి, తద్బిందుచ్ఛటాజాత ఖద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహురత్నోద్దీర్ణ

* శ్రీ.కా.మా. 1అ–53 ప

గేహంబులై లూతాకల్పిత తంతు సద్మములు' జూడఁజిత్రములై యొప్పినవిగదా! జముదెసవెండికొండ ప్రాంతములఁజరియించు ప్రాణులు శైవలక్షణము లేవియుఁ బొందకయె యా పర్వతమాహాత్మ్యముచే శివత్వమునుఁబొందుదురఁట.

'జడలు ధరింప రంగజుని జంపరు, పూయరు బూదిపూఁత మై
నడుగురు భిక్ష, కట్ట రజినాంబరము, ల్చరియింపరు పే
రడవుల, నగ్గిరీంద్ర మహిమాతిశయం బిఁక నేమి సెప్పదున్
బడయుదు రూరకుండియును బ్రాణులు చిత్రముగా శివత్వ
మున్'[2]

శ్రీ కాళహస్తిక్షేత్రమాహాత్మ్యమునిట్టిదే.

'ఏమని చెప్ప నిచ్చటి యహీన మహత్వము? దోమ నచ్చినన్
సామజపూజఁగొంచు, మఱి సామజ మీల్గిన సామజారియై
సేమముఁబొందుఁ గాముకుఁడు చెల్వకుఁగా మరుచేతఁ జచ్చినని
గాముని(జంపుఁదామగుడఁగామినితోనాడఁగూడియుండియున్'[3]

వాళీశ్వరుని వృత్తమున తిరుకాళశైల మహిమను వర్ణించు తావున నద్భుతములగలవు.

ఎఱుకు లీ గిరిమీద నిచ్చఁద్రిమ్మర నయో
మయ సాధనములు హేమంబులగును
శబరులు మృగములఁజంపి యుమ్మల డిగ్గి
వచ్చు నాలోపల సజీసంబులగును
వ్యాధు లీ కొండపై వన్యాశనంబులు
సేవింపఁగాఁ గాయసిద్ధి యగును
జెంచు లీ యద్రినిద్రించి మేల్కొను వేళఁ
దమ సధాతుల తల్ప తలము లగును
దృశ్యమగువారికిందు నిధిస్రజంబు
దృశ్యమగుఁగూడి తమతోడఁ దిరుగు జనము
విస్మయము చెప్ప నాక్కొక్క వేళ దీని
సానుభూముల మహిమాతిశయ విధంబు[4]

ఇనుము బంగారమగుట, మృతజంతువులు మగిడి బ్రతుకుట లిత్యాద్యద్భుతములు గదా!

1. శ్రీ.కా.మా. 1అ - 103 ప
2. ,, 2అ - 97 ప
3. శ్రీ.కా.మా. 1అ - 158 ప
4. ,, 4అ - 83 ప

అద్భుత రసవిషయమున నీ ప్రబంధమే యొక యద్భుతము. పురుగులైన చెలది, పాములు, ఏనుగు, బోయవాడైన దేవదాసు, ఖీవహంతయయిన తిన్నఁడను శివభక్తులు శివునర్చించి సాయుజ్యమందుటయు, నత్కీరుడు కుష్ఠవ్యాధి బాధా నివృత్తిజెంది సాయుజ్యమందుటయు, వేశ్యాతనయలంతర్ధానమై సాయుజ్య మందుటయు, నన్నియు నద్భుత సంఘటనములేకదా ! కథానిర్వహణమంతయు నద్భుతమే యనఁజాలి యున్నది. రస, భావ, శబ్దనాద్యములాలక వమనదోష మీ ప్రకరణము తుదఁబరి శీలింతము.

## 9. భక్తి :

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజతః భావః ప్రోక్తః" అన్నట్లు 'భక్తి దేవతావిషయికమగు రతియగుటచే రసము కాదనియు భావమేయనియు' ప్రాచీనులు పలికి యున్నారు. దాదాపు సాహిత్యశాస్త్రకారు లెల్లరును భక్తి రసము గాదనియు భావమే యనియు సిద్ధాంతముఁ గావించిరి. జగన్నాథ పండితరాయలు భక్తికి విభావానుభావవ్యభిచారి సామగ్రిని నిర్దేశించి తుదకు రసత్వము నంగీకరింప లేదు. 'ఉజ్జ్వలనీలమణి' కర్తయగు రూపగోస్వామి, భక్తికి రసత్వము నంగీకరించి ప్రతిపాదించిన వారిలో ప్రథముఁడు. పరివ్రాజకాచార్యుఁడగు మధుసూదన సరస్వతి, తన 'హరిభక్తి రసాయనము'ను గ్రంథమున భక్తికి రసత్వమును సప్రమాణముగఁ బ్రతిపాదించియున్నాఁడు

"కాంతాది విషయా వా రసాద్యాస్తత్ర నేదృశం
రసత్వం పుష్యతే పూర్ణసుఖా స్పర్శిత్వకారణాత్
పరిపూర్ణ రసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా !"

భగవద్రతియందువలె కాంతాది విషయికములగు నే రసములందును బూర్ణ సుఖము లేక యానందముగలుగదు. కాన వానియందుఁ దగిన రసపుష్టిలేదు. అవి క్షుద్రరసములు. భగవద్రతియో పూర్ణమైన రసము. మిణుఁగురు పుర్వుల కంటె సూర్యకాంతి బలవత్తరమైనట్లు భక్తియు మిగిలిన రసములకంటె శ్రేష్ఠము, బల వత్తరము నైనదని మధుసూదన సరస్వతి ప్రతిపాదించెను.

శృంగారమున నొక ప్రభేదముగా, భగవద్విషయికమగు రతిని యిస్థాభావముగా గలిగి క్రమపుష్టినొంది రసస్థితి చెందునది భక్తియని భావింపఁబగి యున్నది. ఈ భక్తి రసమునకు భగవంతుఁడే యాలంబన విభావము. తచ్చరిత్ర లుద్దీపనవిభావములు. భగవద్దర్శనకాలజనిత నేత్రాదివికారము లనుభావములు. నిర్వేద, శంక, హర్షాదులు వ్యభిచారి భావములు. రోమాంచ, స్వేదాశ్రువు లిత్యాదులు సాత్త్వికభావములు.

ఈ దృష్టితోఁ బరికించినపుడు మన ప్రబంధమున నీ భక్తి రసత్వము నందినదియే యని భావింప వలసియుచున్న దనవలెను.

శ్రీ కాళహస్తీశ్వరుఁడాలంబన విభావముగా గ్రహియింపఁదగును. భక్తుల పరమేశ్వర దర్శనాపేక్ష యిందలి భగవద్విషయకమగు రతి యనఁబడు స్థాయి భావము, మహిమాన్వితములగు పరమేశ్వరుని లీలలను వర్ణించు చరిత్ర లుద్దీపన విభావము లగుచున్నవి. భగవంతుని చిన్మయాకృతిఁజూపుమని పశిష్ఠుఁడు కోరుట యిందలి స్థాయిభావము. కన్నులు విచ్చిచూచుట, భయాకులిత పద్మనిరీక్షణుఁడగుట చేతులు మోడ్చుట లనుభావములు. వడంకు, శరీరమంతయు గగుర్పొడుచుట, లలాటభాగము స్విన్నమగుటలు సంచారీభావములు.

అగస్త్యుని కథయందు దక్షిణకైలాసదర్శనాపేక్ష స్థాయిభావము. ఆ గిరి దర్శనమున 'ప్రమదాశ్రుతతుల్ దృగ్గోళంబులఁదొరఁగు'ట[1] స్వాత్త్వికభావము. ఫణారాజన్మహాలింగమును.

'కాంచి వధూయుతుఁడై పుల, కాంచితదేహమునఁబ్రణతుఁడై ధ్యానించెన్
గించిన్ముకుళితనయన యుు, గాంచలుఁడై మౌని దర్శనానందముతోన్'[2]

కించిన్ముకుళిత నయనయుగాంచలుఁడగుట యనుభావము, పులకితదేహుఁడగుట యందలి గగుర్పాటు సాత్త్వికభావము.

ఇట్లే శివభక్తులు పరమేశ్వరునే తను సర్వస్వముగాఁదలంచి, సమర్పణ బుద్ధితో సేవించి, దర్శించి, తరించినారు. ప్రబంధమందలి ప్రధానరసమయిన శాంతమున నీ భక్తిరస మంతర్వాహినిగా వ్యాప్తమయియున్నది.

1. శ్రీ.కా.మా. 1ఆ - 111 ప
2. ,, ,, - 113 ప

### రసద్వయ సమ్మేళనము :

రసనిర్వహణమున నీ కవీంద్రుఁడా యా ఘట్టములందు శాంతశృంగారములు, వీరశృంగారములు, రౌద్రశృంగారములు, వీర రౌద్రముల నే విధముగా నొకదాని యంగము లింకొక దానికంగములుగాఁబోషించెనో పరికించియుంటిమి. పరస్పర విరుద్ధరసములకు సమ్మేళనము కలిగించి రసత్వమునకు భంజకత్వము కలుగకుండ నిర్వహించుట కవి ప్రతిభకుఁదారకాణ.

### రసభాసము :

ఇట రసాభాసము గూర్చి దర్పణ, రసగంగాధరకారుల వక్కాణుల సమన్వయము ననుసంధించుట సముచితము.

"ఏకత్రైవానురాగ శ్చేత్తిర్యఙ్మ్లేచ్ఛగతో౽పివా
యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాస స్త్రిధానుతః"

ఈ ప్రబంధమున శబరదంపతుల విషయమునను, పామునేనుఁగుల విషయమున నీ శృంగారాభాసము వర్తిలినట్లు గమనించితిమి.

ఈ సందర్భమున దర్పణమందలి లక్షణమును, రసగంగాధరమందలి లక్షణమును పరిశీలించినపుడు రసాభావవిషయమున నవి యుత్తరోత్తరము ఉత్కృష్టములుగాఁ గనుపట్టఁగలవు.

'అనౌచిత్య ప్రవృత్తత్వే హ్యాభాసోరభావయోః' అన్నది దర్పణము. లోక మర్యాద నతిక్రమించిన నాయికా నాయకుల ప్రవర్తనమందుత్పన్నమగునది రసాభాస మగుచున్నది. కాని యిచ్చటనొక ప్రతిబంధక మగపడుచున్నది. ఒకేయొక సంఘటనము కొందఱకు రసానుభూతికల్గింపఁగా, మఱికొందఱకది రసాభాసముగాఁ దోచవచ్చును. ఇట్టి సందర్భము లందొకరి కౌచిత్యము భావింపఁగా నింకొకరి కనౌచిత్య మనసించుచున్నదిగదా ! రసము, భావముల కాభాస మిందుబలుకఁబడినది.

ఈ విషయమున రసగంగాధరకర్తతెల్పిన లక్షణము సర్వవిధముల సమగ్రమైనదని చెప్పనొప్పును. 'అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వం' అనుచితమగు నాలంబన విభావము వలననె రసాభాసము కలుగుననుట యిది.

భావము రసస్థితికి పరిపుష్టినందుటకు వలసిన విభావానుభావ వ్యభిచారభావములను రస సామగ్రియందు నాలంబనవిభావ మత్యంత ప్రధానమైనది. తదితరములన్నియున్న నాలంబనవిభావము లేకున్నగాని, యనుచితముగా నున్నగాని యట రసమున కాభాసమే కలుగును.

అనుభయనిష్ఠమయినది రసాభాసమనియు, తద్విపరణయందు సాహిత్యదర్పణ కర్త పలికెనేగాని, యుభయనిష్ఠమయ్యు నది లోకమర్యాదాతిక్రమణమైన యెడల నద్ది రసాభాసమె యనవలసివచ్చును.

ఉపనాయకరతిని రసాభాసముగాఁ బేర్కొనియున్నారు. ఇచ్చట మఱియొని యంశము జూడఁదగియున్నదనిపించును. వితంతువగు స్త్రీయును, బ్రహ్మచారిగాక విధురుఁడుగాని యైన పురుషుఁడును పరస్పరము ప్రేమించుకొనినపుడది యుభయ నిష్ఠానురాగము కాన రసమేయనవలసవచ్చును. కాని యది లోకమర్యాదనతిక్రమించి యనౌచిత్యమునకు గుఱియగుచున్నది. కాన సాహిత్య దర్పణలక్షణము రసభావముల యాభాసమునుఁ గొన్నటికిఁ బరిమితము చేయఁగా, రసగంగాధరకర్త యాలంబన విభావమందలి యనౌచిత్యము రసాభాసహేతునని పలుకుట మీఁదెల్లఁగినట్లు వ్యాయం సంపూర్ణమై, సమగ్రార్థస్ఫూర్తిదమై యలరుచున్నదనవచ్చును.

వమన దోషము: ప్రబంధమున స్థాయిభావ, రస పదములు వాచ్యములయిన తావులు కొన్నికలవు. అట్లు వాచ్యము సేయుటను లాక్షణికులు 'వమనదోషము'గా నెంతురు. విభావానుభావములచే వ్యంగ్యమై పుష్టమైన రస సందర్భ మొకానొకచో రసశబ్దము వాచ్యమైనంతమాత్రమున వమనదోషము కాజాలదు.

ఉగ్రుఁడు కోణపవీరులతోఁగావించిన యుద్ధము సందర్భమున రణరంగ వర్ణనమునఁగవీంద్రుఁడు.

"...కాకఘూక జంబుక వనశునకంబులు వచ్చి వందఱలాడి యవ్వలవ్వలికి వెడలివచ్చు నేనుఁగు పీనుఁగుల డొక్కలతో డుక్కి డాగిలి ప్రముచ్చులాడు దయ్యంపుఁ దొయ్యలుల నయ్యాటంపుఁ గయ్యంబును, వీరరసావేశంబున విజయాకాపర వశత్వంబును"*

---

* శ్రీ.కా.మా. 2ఆ - 63 వచన

ఇది బీభత్సరసపోషణము జరుగు సందర్భమేకాని వీరరసపోషణమునకు దాపైనది కాదు.

బ్రహ్మ తపమాచరించుచున్న యాశ్రమభూమివర్ణనమున

"తల్లి గానని లేడి పిల్లకుఁ జన్నిచ్చి, పెంచు బెబ్బులి తనబిడ్డయట్లు...
......శరభములను, బట్టి యొయ్యన ధాత్రిపైఁ బెట్టి కాచు

గండభేరుండ పక్షులు గలిగి యజుని
యాశ్రమము శాంతరసరూపమయ్యె నపుడు.[1]

ఈ పద్యమునఁ బలికిన 'శాంతరసరూపమయ్యె'నన్న వాక్యమునవమనదోషము లేదనుటకచట శాంతము రసస్థితినందుటకు వలసిన శాంతరససామగ్రియం దుద్దీపన విభావమొక్కటి మాత్రమే కలదు. కనుక నచట శాంతము రసస్థితినందునను ప్రస్తావమేలేదు. అందుచే శాంతరస శబ్దము వమనదోషమునకు గురి కాలేదన వచ్చును.

సత్కారుఁడు పౌలనిపొంతఁగాంచిన యచ్యుతమును 'రస' శబ్దముచే వాచ్యము చేసినాఁడు కవీంద్రుఁడు. ఇది యథార్థమునకు రసస్థితినందఁదగిన ఘట్టము. ఇచ్చట పండుటాకుల పతన మాలంబనముగా, రూపపరిణామ ముద్దీపనముగా, పారవశ్యమనుభావముగా నచ్యుతరసము రసస్థితినందు తావిది. కాని నిచ్చట 'నచ్యుతరస పరవశుండై' యనినపుడు వమనదోషము పట్టుకున్నదనియే యనవలసి వచ్చునేమొ ? కాని యిచ్చట మఱియొక సమాధానము చెప్పఁదగును. వ్యంగ్యముగా నున్నపు డేర్పడు సౌందర్యము వాచ్యమునఁ గొంత తగ్గునేకాని పూర్తిగ భంగము చెందదు. ప్రకారాంతమున శబ్దశక్తిచే వాచ్యములైనపుడు చమత్కారమునకు న్యూనతకల్గి, గుణీభూతవ్యంగ్యమను కావ్యభేదమగుచున్నదికాని దోషదుష్టమగుట లేదు.[2] కాన నీ తావున నచ్యుతమునకు రసశబ్దవాచ్యతచే గుణీభూతవ్యంగ్యమేర్పడు చున్నదే కాని వమనదోషము కల్గుటలేదని భావింపఁదగియున్నది.

---

1. శ్రీ.కా.మా. 2అ - 71 ప
2. ఆం.ధ్వ.త్ప. అ. పుట 564

# పాత్ర నిర్మాణము.

సహృదయులగు సామాజికులకు బ్రహ్మానంద సబ్రహ్మచారియగు రసానందము నందించునది పాత్ర. 'రస' శబ్దమెంత సార్థకమైనదియో, 'పాత్ర' శబ్దము నంత సార్థకమైనదియే. ఆధేయమైన రసమున కాధారమగునది పాత్రమే కదా! రస, పాత్రముల కట్టి యాధేయాధారముల సంబంధమున్నది. ఆధారమెంత రుచిగనున్న నాధేయ మంత రుచిగనుండును గదా! రసనిర్వహణమంతయుఁ బాత్ర చిత్రణము, పాత్రపోషణము లపై నాధారపడియుండును.

'పాత్రచిత్రణము, పాత్ర పోషణము' అనునవి సర్వసాధారణముగా పర్యాయ పదములుగ నుపయుక్తము లగుచుండును కాని జాగరూకతమైఁ బరిశీలించినపుడు రెంటికిఁ గనిపింపని మౌలికభేదమొ కలదని తెలియఁగలము. స్వభావప్రసిద్ధములగు పూర్వనిర్మితపాత్రములకు తత్తత్స్వభావోచితమైన పరిష్కారము జరిగినపు డది పాత్ర పోషణము, క్రొత్తగా పాత్రలను నిర్మించినపుడును, ప్రాఁతపాత్రలకు కొంగ్రొత్త రీతుల జీవకళ పొదుగునపుడును నది పాత్రచిత్రణము అని యొక సమయము చేసికొనఁ దగును. ఈ రెండింటి సమ్మేళనసమగ్ర ఫలస్వరూపమె పాత్రనిర్మాణ మనవచ్చును.

ఈ పాత్ర నిర్మాణము ప్రధానముగ స్వరూప, స్వభావ చిత్రణములని రెండు రీతుల భావింపనగును. అందు స్వరూపచిత్రణమును మఱల రెండు తరగతులుగ వింగడించుకొనఁదగును. 1. మూర్తి చిత్రణము, 2. అవస్థాచిత్రణము. అట్టులే స్వభావ చిత్రణమును ప్రత్యక్షము, పరోక్షమునని మఱి రెండు విధములున్నట్లు గమనింతము.

ఇంక నీ పాత్రలు రెండు తీరుల వర్గీకరింపఁబడఁదగును. సాంప్రదాయికములు (కన్వెన్షనల్), స్వతంత్రములు(ఇండిపెండెంట్స్) అని అవి రెండు విధములు. సాంప్రదాయికములలో గొంత స్వతంత్రత, స్వతంత్రములలో గొంత సాంప్రదాయికత అను రీతినిఁ గూడఁగొన్ని పాత్రలు మన సాహిత్యమునఁ గానవచ్చుచున్నవి.

## సాంప్రదాయికములగు పాత్రలు :

రామాయణ, భారత, భాగవతాది వస్తువులందుఁ బ్రసిద్ధిఁగన్న రావణ, దుర్యోధన, హిరణ్యకశిపాది పాత్రల స్వభావముల గురించిన యూహలు లోకమున రూఢియాలములై యున్నవి.

ఇట్టి ప్రసిద్ధ స్వభావానుగుణములగు పాత్రలయందు తరువాత గొంత స్వతంత్ర ప్రతిపత్తి చేరి వానికిఁ గ్రొత్త రూపులు దిద్దిన తావులు లేకపోలేదు. దుష్టస్వభావములు గలవాని యందుఁగననగు శిష్టలక్షణములకే వెలుఁగునిచ్చి వానిని ప్రతినాయక స్థితినుండి నాయకస్థితికిఁ బైకెత్తిన చిత్రణములు, సాంప్రదాయికములలో స్వతంత్రత గలట్టివని చూచు చున్నము.

## స్వతంత్ర పాత్రలు :

కేవల కల్పితములగు పాత్రలివి. 'కళాపూర్ణోదయము'న 'సుగాత్రీశాలీనలు, కలభాషిణీమణికంధరులు,' 'కన్యాశుల్కం' లోని మధురవాణి ఇత్యాదులు(శూద్రకుని వసంతసేనకు మధురవాణి కొంత మేరకు మానస పుత్రిక.)

కావ్యప్రతిపాత్తములైన సర్వ విషయములకును కవికిఁగల ఊహాశాలిత(ఇమాజినేషన్), విషయజ్ఞత (ఇన్ఫర్మేషన్), పరిశీలన (అబ్జర్వేషన్), అనుభవము (ఎక్స్పీరియన్స్) అను నాలుగు శక్తులును గాని వానియందే దేనొకదానిని గాని జను స్థానము లుగాఁ బలుకఁదగును. ఈ నాలుగును కవి కవితాసామాగ్రియును ప్రతిభావ్యుత్పత్తులపై నాధారపడియుండును. మూర్తి చిత్రణమున గాని, యవస్థా చిత్రణమునఁగాని కవికిఁగల పై శక్తుల ప్రభావ ప్రాబల్యములుండును.

## స్వరూప చిత్రణము :-

ఇవి మూర్తి చిత్రణము, అవస్థాచిత్రణములని రెండు తెఱఁగులని గమనించితిమి. ఒక పాత్రయొక్క బాహ్యరూపరేఖలు, అందచందములు, వేషభాషలు వర్ణించుటను మూర్తిచిత్రణముగా భావింపదగును. ఒక ప్రత్యేక సందర్భమున నొక పాత్రయొక్క బహిఃస్థితికాని, మనఃస్థితిగాని ప్రత్యేకముగాఁ జిత్రింపఁబడినచో దాని నవస్థాచిత్రణమనఁదగును.

పైఁ బేర్కొనిన మూర్తిచిత్రణము, అవస్థాచిత్రణములు మన కవి ధూర్జటి పాటించినరీతిఁ బరిశీలింతము.

మూర్తిచిత్రణము :-

మూర్తిచిత్రణము గావించుటయందాయా పాత్రలకు కథయందుగల ప్రాముఖ్యము, స్థానములు మాత్రమేకాక మఱియొక్కటి కూడ గమనార్హమగు నంశముకలదు. ఒక్కొక్కటి యొక పాత్ర యొక్క యంతస్స్వభావ నిరూపకముగా నా బాహిరరూపచిత్రణము జరుగుచుండును.

"శ్రీ కాళహస్తి మాహాత్మ్యము"నఁ గల మూర్తిచిత్రణము స్త్రీ, పురుష రూప చిత్రణములందుఁ గనఁగలము.

1. స్త్రీ రూపచిత్రణము :- మన ప్రబంధమున స్త్రీమూర్తి, దేవతాస్త్రీలు శివభక్తులయిన మానవ భామినులు, వేశ్యలరూపము లందుఁ జిత్రింపబడినది.

అ. దుర్గాదేవి :- ప్రథమాశ్వాసమునఁదొలుతఁగావించిన దేవతాస్తుతియందు ధూర్జటి కవీంద్రుడు దుర్గాదేవి స్తోత్రమున వీరశృంగారమూర్తిగా దేవిని చిత్రించుట గమనింతము. దేవతామూర్తి దర్శనమాపాదమస్తకముగా సాగుట నౌచిత్యముగ నుండును. అ యౌచిత్య సాహిత్యముతోడనే యీ వర్ణనము సాగిన దీ ప్రబంధమున, ఈ రసద్వయ సమ్మేళనముగల వర్ణనమున వీరము శృంగారమున కలంకారప్రాయమై యలరుచున్నది.

సీ॥ కాసరాసురరాజ కంఠనిర్గత రక్త
పంకంబు శ్రీపాద పద్మలాక్ష
చండ ముండాహవ సంభ్రమ స్తనజాత
ఘర్మవారికణ రాజి కంఠమాల
రక్తబీజాది మర్దన సముద్యాట్టహా
సము మోముననలో ప్రసుమరజంబు
శుంభనిశుంభ రణోర్వీర సంహార
వేళఁగప్పిన ధూళి మేలుము సఁగు

తే॥ గాఁగ నేదేవి వీరశృంగారమూర్తి,
యగుచు శోభిల్లు నట్టి దుర్గాంబఁగొలుతుఁ
గనకముఖరీ సమాఖ్య గంగా ప్రతీర,
హాటకాచలతుంగ శృంగాగ్రగేహ.

— శ్రీ.కా.మా. 1అ - 4ప.

దేవి శ్రీ పాదపద్మముల యొయ్యారపునడకు, కంఠమాల, హాసమున కెంజిఁదనము, మేలు ముసుగులుగా నేర్పడిన సౌందర్యయందము వీరరసానుభావములు. తొలుత వీరమూర్తియైన యా దేవి కా రసభావములన్నియు శృంగార రసానుభావములుగా రూపొందినవను భావమును కవీంద్రుఁడు 'వీరశృంగారమూర్తి' యని ప్రయోగించుట చేతనే సూచించుచున్నాడు. శృంగారమూర్తియందు వీరముఁజూపిన పోతన

"రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
.........................................
హరికి నరికిఁజూడ నందంద శృంగార
వీరరసములోలి విస్తరిల్ల"[1]

అను పద్యమున శృంగార వీరరసములని వచించి యున్నాఁడుగదా! ధూర్జటి కవీంద్రుఁడు దుర్గాదేవి స్తోత్రము, దుర్గాదేవి స్వరూపవర్ణనము గావించుటయందు విశేషమైనదానిని గమనింపఁగలము. పాదములు, స్తనద్వయము, ముఖములను విశేషముగ శరీరములను మూఁడుప్రధాన భాగములుగ వర్ణించుట జరిగినది. ఆ మూఁడు భాగములందును ప్రధానావయవములే - సర్వసాధారణముగా సర్వావయవ సౌందర్యము వర్ణించునట్లుగాక, ధూర్జటియే చేసిన పార్వతి రూపవర్ణనమువలె [2] వర్ణించుట

1. పోతన శ్రీ.మ.భా.ద.స్కం.ఉ.భా. 183 ప/ఆం.సా.అకా/
2. శ్రీ.కా.మా. 1అ—100ప.

యందారని ప్రత్యేకత తెలియుచుము. నిండుగా వస్త్రాలంకారభూషితయగు స్త్రీమూర్తి యందు గోచరించు నవయవములనే వర్ణించుట యీ విశేషము. పాదపద్మములు, సున్నతములగు కుచములు, ముఖములనునవి యివి. ఇంక సాధారణముగా గనుపట్టు ఊరువులు, నాభి, వళిత్రయము లిచ్చట గానరావు.

మూర్జటి కవీంద్రుడు శ్రీ విద్యానిధియని భావించియుంటిమికదా!

షష్ఠ్రికాకారూపయగు శ్రీదేవిని దుర్గాదేవి యందు ప్రతిపాదించుటయందీ విశేషము నిర్వాహముగా నిక్షిప్తమైనదివలెఁ దోఁపఁగలదు. కానరాసురుఁడు, చండముండులు, రక్తబీజుఁడు, శుంభనిశుంభు లను నార్వురు రక్కసుల నామె యుక్కడఁగించినట్లు వర్ణితమైనది. ఇదియే యీ విశేషము.

దుర్గాదేవి పాదపద్మములకు, కంఠమునకు, శిరమునకు నా యీ రక్కసుల సంహార ఫలితము లందముఁగూర్చుచున్నట్లు వర్ణింపబడినది. ఇట్టి వర్ణనముచే దేవి దివ్య మంగళ విగ్రహమునకు పేరవిహారముచే వికృతికలుగక యలంకారమేయయ్యెననుటంబది.

దేవి రూపచిత్రణమునఁగవీంద్రుఁడు మిక్కిలి ప్రత్యయముఁగన్పఱచెనని తెలియుచుము. 'మేలుమునుఁగు' అను శబ్దముచే దేవిదేహవర్ణనమున శృంగారము నతివేలముగా వర్ణింపక యుచితరీతిని, పరిమితిలోననే సమకూర్చెను.

**ఆ. సరస్వతీమూర్తి :—** రూపకానుప్రాణితోపమాలంకారముచే సరస్వతీ దేవినిఁ గైసేసినాఁడు కవీంద్రుఁడు.

'నవలావణ్య రసాలయంబు, గుణరత్నస్థాన, మూస్యత్కుపా
ధవ బింబోదయ, మున్నత స్తనగిరీంద్ర వ్యక్తి, వాచాసుధా
భవదేశంబు, వళీతరంగము, తనూభద్ర ప్రభాఫేన దీ
ప్తి విలాసంబగు తత్కళత్రము సుధాబ్ధింబోలి సద్భక్తితోన్.'*

---

* శ్రీ.కా.మా, 2ఆ—69.

సరస్వతీమూర్తి సాలసంద్రపటముతో సమమింపఁబడినది. 'శిపాథపబింబము, వాచానుధాళపదేశము, ప్రభాఫేన' శబ్దములచే '..........సర్వశుక్లా సరస్వతీ' యను నట్లామె 'తనూభద్రదీప్తివిలాస వైభవముఁ' గమ్మల గట్టుచున్నాఁడు కవీంద్రుఁడు.

ఈ సరస్వతీ రూపచిత్రణము వలనఁ గవి యొక ప్రయోజనమునే సాధించినాఁడనఁదగియున్నది. ఆ పలుకుఁజెలువ చెలుప మట్లప్రతర్క్యమును, వివిర్ధ్యంప్పు మసాధారణముగాననే నలువ చిలుకుపలికిఁ దలఁకుటయు, నామెవంక వాంఛాచాపల్యము తీరలేదు కనుక, తనకోరిక దీరుటకామెను శతవాగ్వనజాసను కమ్మని కోరినాఁడు. శతానందుఁడై, కామాంధుడై బ్రహ్మ పుణ్యపాంసులు దలంపక సుఖించుటయు, ఫలితము గా కోణపవీరులు జనించుటయు, వారినిఁ జంపుటకు మగ్రుని పుట్టించుటయు, నాతనిని కోపదృష్టిచేఁ జూచి క్రమందించుటయు, ఫలితముగా నీశ్వరునిఁగూర్చి తపమాచరించి పుత్రహత్యా, పుత్రరాహిత్య దోషములను పోగొట్టికొని బుధుని పుత్రునిగా బడసెను.

క్షేత్ర తీర్థ దైవతముల మాహాత్మ్య ప్రకటనమునకు దొలితారకాణ బ్రహ్మ తపఃఫలముగు బుధుజననము. కాన నీ సరస్వతీరూప వర్ణన మిట్లిచట, కథావస్తువునకు, ప్రబంధనామసార్థక్యమునకు దోహదమై విరాజిల్లుచున్నది.

**శివభక్తులయిన స్త్రీరూపచిత్రణము :—** మన ప్రబంధమున స్త్రీరూప చిత్రణమున శివభక్తురాండ్రయిన వారి చిత్రణము చతుర్థాశ్వాసమున వేశ్యాతనయల వర్ణనముసఁగలదు.

విరక్తచిత్తలై, దొంగలమాటలకు నంచితలై శ్రీకాళహస్తికిఁబ్రయాణమైన వేశ్యాతనయల వర్ణనము.

"కట్టెన చెంగావిగుడ్డల రెమోశికట్టుఁ
  బొంకవుఁదాౣ్ప తాటంకములును,
వివిధ వస్త్రచ్ఛేద విరచిత కంథలుఁ
  బూఁత విభూతి త్రిపుండ్రకములుఁ
గరముూలములఁ వేలు కప్పెరల్ జోలెలు
  భద్రరుద్రాక్ష నైపథ్యములను

శివసూత్ర బంధ భాసిత శంభులింగముల్
కట్టిన కుంకుమాపుఁబుట్టములును
జిగురు డాకేల భసిత భస్త్రికలుఁదనర
దొంగ జంగము తెలుపంప, జంగమాంగ
నావిలాసంబుఁ గైకొని నళినముఖులు
కాళహస్తిని దర్శించు కాంతఁగదలి[1] నారా వేశ్యాతనయలు

చెంగావి కట్టిన యొడికట్టు, తామ్రతాటంకములు, కంథలు, నూదిపెండెకట్లు, చంకలకు దిగిల్చికొనిన కపాలముల జోలెలు, అలంకారముగనున్న రుద్రాక్షలు, మెడ యందు సూత్రబద్ధములగు శివలింగములు, కట్టిన కొంచెము మాసిన గుడ్డలు, ఎడమ చేతులయందు విభూతియుండు తిత్తులు, గల యా వేశ్యాతనయలు జంగమాంగనలుగా నత్యంత సహజముగా రూపొందింపబడినారిచట. ఈ శివభక్తులయి, జంగమాంగనల రూపుఁగొన్న పీఠికర్షనము శ్రీనాథుని చిఱుకొండనంబి భార్య తిరువెంగనాంచినిఁ బరీక్షించుటకు వాలుపోయుమనుచు మాయాజోగిత రూపమున నేఁగుదెంచిన భవాని రూప వర్ణనమును జ్ఞప్తికిఁ దేఁగలదు.

'ఫాల పట్టికయందు భస్మత్రిపుండ్రంబుఁ
గర్ణంబులను తాగికమ్మదోయి
.... .... .... .... .... .... .... .... .... .... .... .... ....
కటిమండలంబునఁ గరకంచుఁ బుట్టంబు
మడిచికట్టిన మేలిమి నడిమికట్టు
.... .... .... .... .... .... .... .... .... .... .... .... ....[2]

చెంగావి యొడికట్టులు, భస్మత్రిపుండ్రములు, తామ్రతాటంకములు, కంథలు రుద్రాక్షమాలలు, భసితభస్త్రికలు, సర్వసాధారణ జంగమాంగనల స్వరూప విశేషములని యీ రెండు పద్యముల పరిశీలనము వలనఁ దెలియ నగుచున్నది.

---

1. శ్రీ.కా.మా. 4ఆ—54ప.
2. హరవిలాస — 2ఆ — 91 ప—1, 3 పాదములు.

ఆలయ ప్రవేశము సేయు వేశ్యాతనయల స్వరూపచిత్రణ మత్యంత రమణీయముగ, శివనిరాసనూచకములగు నుపమానములతోఁ గావింపఁబడినది.

"తనువు దుర్గతి ద్రోవఁజనకుండఁ గట్టిన
  కట్టులగతిఁ బెండెకట్టు లమర
వెనుకకు నొదిగి రొమ్మెయ్యన జాఱు ఘన తమో
  గ్రంథులగతిఁ గీలుఁగంటు లమర
'రారాదు మీకుఁగర్మము లారా! నిలుఁ'డని
  పలికెడుగతి జపభాష లెసఁగఁ
దమ యాత్మ చిన్మయాత్మను గూడఁబోఁ జేష్ట
  లుడిగినగతి మనసూరకుండఁ

పుండరీకభవాండకరండ కుహర
బహిరబహిరహః పరిపూర్ణ భావనాది
క ప్రకాశాంగు, నిరుపాధిక ప్రభావుఁ
గాళహస్తీశు, దర్శింపఁ గదియునపుడు"*

శివభక్తురాండ్రయిన యా వేశ్యాతనయల వేషభాషల నిట్లుత్ప్రేక్షించుట కవి ధూర్జటి శివనిరాసమగు వ్యక్తిత్వద్యోతకమై యలరుచున్నది.

ముఖమునఁబెట్టికొన్న పెండెకట్టులు, దేహము శివునర్పింపక నరకము ప్రవేశించుట నాటంకపఱచు నడ్డుకట్టలుగ నున్నవట. 'పెండెకట్టులు, కీలుగంటులు, జపభాషలు, మనసూరకుండుట'లను, వేషభాషలతీరు పరికించినప్పుడు, తుదిస్థితి మనసూరకుండుట పరమోత్కృష్టమైనది. ఆత్మ చిన్మయాత్మను దర్శింపనుండుటకవి సూచకము.

---

* శ్రీ.కా.మా., 4ఆ — 126ప.

పరమేశ్వరు దివ్యతేజము లప్పుడు 'బొదువం జాంచల్యహారంబులై చూపుం జిత్తము మిన్నుముట్టినయవి'[1] యని తిన్నఁడును, శివబ్రాహ్మణుఁడును సాక్షాత్కరించిన శివునికి విస్మయించుకొనుటయందు, శంకరుని దర్శనము భక్తుని హృదయమును మిన్ను కుందుఁ ల్లొసరించునని తెలియుచున్నది. ఈ వేశ్యాతనయలే పార్వతీపరమేశ్వరుల సాక్షాత్కారము కలిగి నప్పుడు 'ఎదుటనుదుట ముకుళిత కరపుటంబు లిడుకొని మిన్నకున్నారు'[2] అట్టియనిర్వచనీయానంద స్థితిని ద్యోతము చేయుటయే మనసూరకుండుట. ప్రత్యక్షమైన యీశ్వరుని స్తుతించిన బ్రహ్మ మొదట పల్కినదియు నీ భావమే.

'.... .... .... .... ... ....
... ఇంకెట్లు లోకాతీతమై దృష్టికిన్
లోనై యుండని మీ చిదాకృతినుపశ్లోకింపఁగా నేర్చెదన్
నానాభంగుల నూరకుండుటయ ధన్యత్వంబు నాబుద్ధికిన్'[3]

దేహము దుర్గతిపొందకుండ కాపాడుకొనుట, ఘనతమోగ్రంథులను జారవిడుచుట కర్మములను నిలిపివేయుటయు క్రమముగా నాత్మ చిన్మయాత్మను జూచుటకు వలసిన స్థితులని యీ చిత్రణమునఁ దెలియఁదగిన యంశము.

దేవతాస్త్రీరూప చిత్రణము, శివభక్తులయిన మానవభామినుల రూపవర్ణనము తరువాత గమనింపఁదగినది వేశ్యమాత రూపవర్ణనము.
తేటీ యా యా వేశ్య బాలెంతగా నున్నప్పటి రూపము.

'తలఁబంకిచిన నూనె, పుక్కిలు సదా తాంబూలమున్, నేత్రిక
జ్జలమున్, గంధరఁగట్టుకొన్న వసపూసల్ గబ్బిపాలుబ్బుగు
బ్బలు, నేకాంగుళి కర్పితాలిక లసద్భస్మంబు, జిడ్డైన దు
వ్వలువం జెల్వుగ బిడ్డకాన్పు నడిపె న్వాయమాతీ బాలెంతయై'[4]

1. శ్రీ.కా.మా. 3ఆ - 123 ప.
2. ,, 4ఆ - 123 వచనము
3. ,, 2ఆ - 77 ప
4. ,, 4ఆ - 10ప

ఈ బాలెంత రూప చిత్రణమునఁ గవీంద్రుని లోకజ్ఞత వెల్లడియగుచున్నది. ఈ పద్యమున నొక విశేషమున్నది. అది యీ వేశ్యకూఁతుల శివభక్తి తత్పరత సెవగించుకొనునది, శివభక్తి పాడుగానని దూషించునదికాదా 'ఏకాంగవీరాల్ని తాలిక లసద్భస్మ' మెట్లగుచున్నది యీ విషయము. వారధర్మదోషయందు శివభక్తిని ప్రచారము చేయవలెనన్న చేకాని,

'ధనము గలిగిన జంగమార్చన మొనర్చు
శివునకఖిలోపచార ముల్సేయవచ్చు' నన్నదిగదా ! *

అను పేరు మాణిక్యవల్లి పురహరపురవాసి. కాన నామె శివభక్తి కలదియే కాని, కులాచారమునకు ప్రాముఖ్యమిచ్చినది. కాన నుదుట భస్మధారణము సాధారణ గృహ క్రమాగతాచారమే కాని యన్యముకాదు.

స్త్రీ రూపచిత్రణము పరిశీలించితిమి. ఇఁక పురుష రూపచిత్రణముఁ బరికింతము.

## 2. పురుష రూపచిత్రణము.

ఈ ప్రబంధమునఁ బరమేశ్వరుడు వివిధ ఘట్టములందుఁ బొందిన వివిధ రూపముల చిత్రణము, శివబ్రాహ్మణుల రూపచిత్రణములని పురుషరూప చిత్రణములను గమనింపఁగలము. అందు

### 1. పరమేశ్వరుని రూపచిత్రణము :—

ఈశ్వరుఁడు జంగమ వేషము మూఁడు తావులఁ దాల్చినాఁడు.

అ. ప్రథమాశ్వాసమున దాని-మిండ జంగముల కథ యందు జంగమ రూపము :

“అమరఁగా నెత్తమ్ముల నపరంజి పావాలు
కరమునఁ గేదార కంకణంబు

* శ్రీ.హ.సా. 4ఆ—౫5 ప.

బంగారుపాత్ర చెఱంగుల గోణాము
గళమున రుద్రాక్ష కంఠమాల
యొక కేల భసితభస్త్రికతోడి బెత్తంబు
సందిగట్టిన తరుణేందుధరుఁడు
మాణిక్యదుచుల యొడ్డాణంబు, భాతిపైఁ
బెట్టిన కస్తూరి బిళ్ళబొట్టు
సార్వకాలిక తాంబూల చర్వణార్ద్రి
రాగసౌభాగ్యమునఁ బద్మరాగమణులఁ
దృణముగఁ గాఁ జూచు దంతపంక్తియును గలిగి
యంగజారాతి యొక మొండ జంగమగుచు." *

అది మనచరిత్రమునందు ప్రవరు ననుగ్రహింపవచ్చిన సిద్ధుని రూపముఁ జూపింపఁజేయుచున్నది.

'ముడిచిన యొంటి కెంజడ మూయు మువ్వన్నె
మెగముతోలు కిరీటముగ ధరించి
కకపాలకేదార కటక ముద్రిత పాణిఁ
గుఱుచ లాతాముతోఁ గూర్చిపట్టి
మైణేయమైన యొడ్డాణంబు లవణిచే
నక్కళించిన పొట్ట మరక్కళించి
యూరకుట చ్ఛాయ నవఘళింపఁగజాలు
బడుగు దేహంబున భస్మమలఁది

* శ్రీ.శా.మా. 1ఆ–30 ప.

మిట్టయుఱమున నిడుయోగపట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోఁగులు చవుకళి పఁ
గావికుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్దేహ పూషధసిద్ధుఁ డొకఁడు! [1]

ఆ. తిన్ననికిఁగలలోఁగన్పట్టిన జంగమరూపము :-

'ఒడలం దెల్ల విభూతిపూఁత పులితోలొడ్డాణమల్లాడు కెం
జడ లాత్మైకవిచార నిశ్చల దృగబ్జాతంబు లచ్చైన క
చ్చడ, మంసంబున రుండమాల, గళదేశస్థాణుపుంగాలఁగా
నొడయండొక్కరుఁ డకుటమూరుకలలో నుద్యత్స్వరూపా
మూర్తియై.' [2]

ఇ. వేశ్యాతనయలను రక్షించి మార్గదర్శకత్వము వహింప నేఁగు దెంచిన స్వామి :-

'శ్రీకాళహస్తి గౌరీపతిస్తోత్రముల్
పెట్టిన వెలిబూఁది పెండెకట్టు
గళములఁగురుబోడతలల రుద్రాక్షలు
గండచలత్తామ్రకుండలములు
ధాతురాగాంగ వస్త్రమ్ములు గోచులు
నెడమ ముంజేతుల నెసఁగు సజ్జ
లును, దీవ్రధావనంబునఁ బుట్టు చెమటలఁ
జెదరి పుప్పొలు గోయు శీఘ్రగతులు

1. మనుచ - 1ఆ- 59ప.
2. శ్రీ.కా.మా. 2ఆ-55 ప.

గలుగు ప్రమథులతోడ శ్రీకాళహస్తి
శివుఁడు ననుదెంచెఁదనుఁబూజసేయ వలచి
పత్రపుష్ప ఫలంబులు భక్తిఁదెచ్చు
ద్రవిళజంగమ వేషంబు లవధరించి'.*

పై మూఁడు సందర్భములందునుఁజిత్రితమైన జంగమురూప మత్యంత సందర్భశుద్ధి కలిగినదై విరాజిల్లుచున్నది.

దాసి నాకర్షించుట కేఁగుదెంచిన జంగముఁడు 'అంగజారాతి'. జంగముఁడే యైనను, దాసి, 'పురపల్లవప్రకర నేత్రానంద వాష్పాంబుధారా వర్షాగమ చంచలాలతిక, దుర్వార ప్రసూనాస్త్రి తేజోవైశ్వానర సామధేని, కందర్పకుస్తాంతశ్రీ పరిహాసకృన్నిఖిల లోకాతీత సౌందర్య' కాన నాపె కితఁడంగజుని వలెనె కన్పట్టవలెను. సాధారణముగ గ్రహించు 'అంగజారాతి' యన మన్మథుని సంహరించినాఁడను నర్థము కాదిచట. అయ్యంగజుని కన్న మిన్నయగు సొగసుందనము, సొబగుందనములచే నాతనిని జయించినాఁడను సుందర మనోహర భావము స్వీకార్యమిచట. భక్తికిచట శృంగారము సింగారమయినది. నెత్తని నెత్తముల వంటి యడుగుఁ, వానికి వన్నెగూర్చు పసిడి పాదుకలు, బంగారులంచు గోణాము, మాణిక్యరుచుల యొడ్డాణంబు, కస్తూరిబొట్టు, సార్వకాలిక తాంబూలచర్వణార్ద్రరాగ సౌభాగ్యము, పద్మరాగమణులను తృణీకరించు దంతపంక్తి గలవాఁడనుట యందాతఁడు భోగభాగ్యముల నెనఁగు వాఁడుగా దాసి యెదుటఁ బ్రత్యక్షీకరించుట యన్నమాట. తిన్ననికిఁ గన్పట్టిన జంగము కట్టినది పులితోలొడ్డాణము. ఒడలెల్ల బూఁది, రుద్రాక్షలు, గోచులు పెండెకట్లు మున్నగు జంగమ సాధారణ విశేషణములె. ఇఁక జంగముఁడు ధరించిన 'స్థాణువు' దాసి కడకువచ్చినపుడు పందిఁగట్టియుండగా తిన్ననికడకు గళమున ధరించి వచ్చెను. వేశ్యాతనయలకుఁ గానుపించినపుడు ప్రమథులు 'ఎడమముంజేతుల సజ్జలు' ధరించి యుండిరి.

ఈ విధముగాఁ బరమేశ్వరుఁడు రూపొందార్చిన శివభక్తిగాఁ జిత్రింపఁబడినాఁడు. ముచ్చోట ముచ్చటగాఁ దీర్చిన మూఁడు పద్యములందలి మూర్తి చిత్రణముల వలనఁ

*శ్రీ.కా.మా 4ఆ–103 ప.

గజేంద్రుఁడు మంచి ప్రయోజనములనే సాధించినాఁడు. మొదటి ఖండజంగమ రూపము కావ్యేతివృత్తమున నాదికాగా, నడుమ తిన్ననికిఁ గలయందు గన్పట్టిన 'ఒకయ'ని రూపము కథను తాపస్వామునిఁ గూర్చినది. ఇఁక తుదను వేశ్యాతనయలను శ్రీ కాళహస్తికిఁ దోడ్కొనిచని కథను ముగించినది.

పై మూఁడు సంధ్యములును భగవానుఁడు భక్తులనుద్ధరించుటకుఁ దానుగా వచ్చి ప్రబోధకుఁడై, యాచార్యుఁడై యాపదుద్ధారకుఁడయి, యపవర్గ ప్రాప్తిఁ గల్గించుటను ఈశ్వర తత్త్వనిరూపకములై యున్నవి.

వశిష్ఠునకుఁ బరమ కృపామూర్తియై పరమేశ్వరుఁడు దక్షిణామూర్తిగా సాక్షాత్కరించినాఁడు.

"తన్నులోనుగఁ జుట్టుకొన్న పటచ్ఛాయ
నిజదీప్తి మొగులుగా నింగిఁబర్వ
బ్రహ్మ సింహాసనామరద్రుమ పల్లవశిఖా
చ్ఛటలుగాఁ గుఱుచ కెంజడలు దనర
నీశ్వరోహమ్మను నీ రహస్యము దెల్ప
మారుపున సుజ్ఞానముద్ర మెఱయ
మనము చిద్రసములో మునిఁగిన మాటాడ
నెఱుఁగఁడోయన మౌనమొసక మొసఁగ
నమ్మహాలింగమధ్యంబునందునుండి
దక్షిణామూర్తిరూపంబు దాల్చి శివుఁడు
యౌవనశ్రీసమేతుఁడై యవతరింప
శక్తి తండ్రియు నత్యంత భక్తి తోడ. *

ఈ పద్యమునఁ బ్రతిపాదింపఁబడిన దక్షిణామూర్తి స్వరూపపై విషయమును 'వస్తు నిర్వహణము'ను ప్రకరణమున విపులముగాఁ బరిశీలించియుంటిని.

* (శ్రీ.కా.మా. 1అ-86ప)

ఉ. కాళము పూర్వజన్మకథనమునందుః గొలువున్న శివుఁడు :—

తొంగలి తూల శార్దూల చర్మముఁగట్టి
భూతి మైఁ దగ నెఱిపూఁతఁ బూసి
క్రొన్నెలవిరి జటాకోటీరమునఁ దాల్చి
బ్రహ్మకపాలహారములఁ బూని
యురగేంద్రు శేషు నుత్తరజందెముగ వేసి
కర్కోటకుని నందెగా నొనర్చి
శ్రవములఁ గంబలాశ్వతరుల ధరియించి
తుంబురుఁగరకంకణంబు చేసేసి
వలయు భూషణవితతిఁగా జలువకులముఁ
జేయుచోఁ బ్రియవధూమణి బాయు నెడరు
కాళఁజాలకపోయి పాతాళసీమ
నున్న కాళంబుఁగోపించి యుగ్రుఁడప్పుడు. *

ఇందు శివుని యంగరాగము లంబరాభరణాదుల వర్ణనముగలదు. కటిన పుట్టము శార్దూలచర్మము. పూఁతపూసినది భూతి. తలదాల్చినది క్రొన్నెలవిరి. మెడఁ దాల్చినవి బ్రహ్మకపాలహారములు. శేషుఁడుత్తరజందెము, కర్కోటకుఁడందె. కంబళ, అశ్వతరులు అను సర్పముల శ్రవముల నలంకరించినాడు. కరకంకణముగా తుంబురుఁ డందగించెను. మరియొక చేతికి కాళుఁడు వలసియుండెను. అతఁడు ప్రియవధూమణిని పాయలేక పాతాళమునుండి రాలేకపోయినాఁడు. కోపించినాఁడుగ్రుఁడు.

ఇప్పటి శివుని రూపము "ఉగ్రుఁడు". శంకరునిగా, శివునిగా గాక ఉగ్రుఁడుగా రూపింపఁబడుట నిప్పట్ల నెంతయు సముచితముగా నున్నదనవలె. తలపై దాల్చిన చంద్రుఁడొక్కఁడు తక్క తక్కిన వేషభూషలు శార్దూల చర్మము, బ్రహ్మ కపాలములు,

---

* శ్రీ.కా.మా. 4అ – 159ప.

హాసభాష) లోని యుగ్రతకుఁ జిహ్నములు. కోపించిన యుగ్రుఁడు శరణుకోరిన వానిని క్షమింపఁగల్గుట యుండుటె 'క్రొన్నెలవిరి జటాకోటీరమునఁదాల్చిన' ఫలము.

సీ. శాంబరీభిల్లుఁడర్జునునకగపడుట :-

జడకొప్పు కేకిపింఛపుఁ ద్రాటిచుట్టగా
  బిరుదుహాహితరేఖ వీఁకెగాఁగ
సెగలుచల్లెడు కన్ను జేగురుబొట్టుగా
  శ్రుతిఫణి యౌషధ లతిక గాఁగ
మెకసు బుక్కలపేరు మేటి తామరలుగాఁ
  దోలుదుప్పటి రొండఁదోలుగాఁగ
జేతిపినాకంబు సెలవింటిజద్దగా
  శూలమెచ్చిన యంపకోలగాఁగ
బ్రమథులెల్లను కోలుగా నద్రిరాజతనయ
శబరిగా, నాల్గువేదముల్ జాగిలములు
గాఁగ, మూకాసురుని బందిగా నొనర్చి
శబరుఁడై భర్గుఁడర్జునాశ్రమముఁ జొరఁగ. *

శ్రీనాథుఁడు తన హరవిలాసమున శాంబరీ భిల్లుని వర్ణించిన తీరునకిదిఁ బ్రతిగాఁ గనుపట్టుచున్నదివోలె తోఁపఁగలదు.

విశటపాటల జటామకుటికా భారంబు
  కలికైన జుంజురు నెఱులుగాఁగ
జాయ సుధాధామ శకలావతంసంబు
  పెడకొప్పుపైనుండు పీఁకె గాఁగ

* శ్రీ కా.మా. 4ఆ–116 ప.

ఘనలలాటంబునఁగనుపట్టు కనుచిచ్చు
గైరిక ద్రవతిలకంబు గాఁగ
భుజమధ్యమునఁ గ్రాలు భుజగహారంబులు
గురిజపూసల గుబ్బసరులుగాఁగ
శంకరుండు కిరాతవేషంబుఁదాల్చి
యగజ చెంచెతయై తోడ నరుగుదేరఁ
బాణి నోంకారదివ్యచాపము ధరించి
వచ్చె వివ్వాచ్చు వరతపోవనముకడకు.*

కథాఘట్టమొక్కటియే యగుటచే నీ యిరువురు కావించిన రూపచిత్రణములకు సామ్యమంతఁగా గన్పట్టుచున్నది. ఈ శాంటబిల్లుని రూపచిత్రణమున ధూర్జటి తనకుఁగల కైరాతవేషపరిచయమున జక్కఁగాఁ బ్రదర్శించినాఁడు.

ఇప్పట్ల జక్కన విక్రమార్క చరిత్రమునఁగనఁగు చెంచు రూపచిత్రణముఁ గూడనగుమ.

తలమీఁదఁ జెరివినఁ దనరారు నునుఁజెంత
యమృతాంశురేఖచందమున నమర
మేదినీరేణువు మెయినిండఁగాఁబర్వి
భసితాంగరాగ సంపదవహింప
జుంజు వెంట్రుక లెత్తి చుట్టిన శేఁడీఁగ
పన్నగాధీశ్వరు పగిది మెఱయఁ
గరమొప్పు నుదిటిపై గైరికతిలకంబు
ఫాలలోచన భాతిఁబరఁగుచుండ

* హర. 7ఆ _ 41ప.

శబరుఁడొక్కరుఁడే తెంచె సంభ్రమమున
శంకరుఁడు తొల్లి శబరవేషము వహించె
నంచు మదిలోన నీసు ధరించి తాను
నీశునాకృతిఁ గైకొన్న యెఱుకనంగ.[1]

2. శివబ్రాహ్మణుని రూపము :-

మన ప్రబంధమున హరిద్విజు లిరువురు పేర్కొనఁబడినారు. తిన్నని కథ, నత్కీరుని కథలయందు వీరు ప్రస్తావింపఁబడిరి. కాని నత్కీరుని కథయందు శివబ్రాహ్మణుని రూపరేఖావర్ణనము లేదు. తిన్నని పరీక్షించు నడుమన ప్రవేశపెట్టఁబడు శివగోచరుఁడను హరిద్విజుని రూపచిత్రణము మాత్రము కలదు.

పంచాక్షరీ పూత భసిత త్రిపుండ్రాంకి
తాంగ భాగములు, స్నానార్ద్రశిఖయుఁ
గ్రమకృతగ్రంథసూత్ర ప్రోత రుద్రాక్ష
భూషణంబులు, శైవభాషణములు
నాగుల్ఫలంబమానాంబు శోణంబైన
పోత్రంబు, నుపవీత సూత్రములను
గరగృహీతాభిషేక క్షీర సంపూర్ణ
భాండంబు బుష్పకరండకంబుఁ

గుండబొజ్జయు, నొకపాటి గుజ్జురూపు
నుత్తరీయంబుఁ దనరంగ యోగిహృదయ
గోచరుని గొల్వ శివచిహ్నగోచరాంకుఁ
డొకఁడు వచ్చె శివబ్రాహ్మణోత్తముండు.[2]

1. వి.చ. 2ఆ - 123ప.
2. శ్రీ.కా.మా. 3ఆ - 94ప.

ఇట్లు చిత్రింపబడినవాడు శివగోచరుడను శివబ్రాహ్మణుడు. వేష, భాష లన్నియు శైవములుగనున్నను శివబ్రాహ్మణ శబ్దవాచ్యుడగుటచే నతడు లింగధారి యైనట్లు తోచదు. ధూర్జటి సుగిలిన జంగములయు, భక్తులయు వర్ణనమున లింగధారు లుగ చిత్రించి యున్నాడు. శివభక్తుడయ్యు బ్రాహ్మణ ధర్మము వీడనివాడని గా భావము. అందున నీ శివబ్రాహ్మణుడు గుడి పూజారి. నత్కీరుని కథయందలి హర ద్విజుడును 'మూలస్థానహరద్విజుడే' గదా! అనగా నతడును శివాలయమున పూజారి యయిన బ్రాహ్మణుడు. కాన నిట్టి శివగోచరుడును లింగధారి కాని శివబ్రాహ్మణుడే యన్నమాట. కనుకనే యాతని స్వరూపవర్ణనమున [illegible] ధరించినట్లు లేదు.

## అవస్థా చిత్రణము

పాత్ర నిర్మాణమున నీ యవస్థా చిత్రణ మొకవిధమని గమనింపవలెను. ఒక ప్రత్యేక సందర్భమున నొక పాత్రయొక్క బహిఃస్థితిగాని, మనఃస్థితిగాని ప్రత్యేకముగా చిత్రింపబడుట నవస్థాచిత్రణమని భావింపదగును. ఒకపాత్రయొక్క యీ యవస్థాచిత్రణము చలదచల విభేదముచే ద్వివిధము. కాయికమనియు, మానసిక మనియు న యవస్థా భేదము మరల రెండు విధములు.




ఈ చిత్రణము వలన నాయా పాత్రముల ప్రాముఖ్యము వర్ధింపబడుటయేకాక ఏదేనొక క్రియకు ద్వారా విక్రియపొందుట (రియాక్షన్) చేత నా పాత్ర పొందిన స్వాభావిక మనఃస్థితిని ప్రతిపాదించుటను ప్రయోజనముగా నెంచదగును.

ఇట్టి యవస్థాచిత్రణమున నచలావస్థా చిత్రణమునందుకంటె చలదవస్థాచిత్రణమున కవి కౌశలము గాననగును. అచలావస్థయందలి సౌభాగ్యాదులు చలదవస్థా చిత్రణమునే ద్విగుణీకృతమయ్యెనను భ్రమగొల్పును. అచలవస్తుసౌందర్యముకంటె, కదలిక గలిగి చైతన్యవంతమగు చలదవస్థయందలి సౌందర్యమతిశయించును. ఒక అజంతా చిత్రసుందరి యందలి సౌందర్యముకంటె, జంగమకనకశలాకవోని సుందరియొక్క నడలు, హొయలు కమనీయమనోరంజకము, నాహ్లాదకరమై యలరారును కదా! ఒక నిశ్చలమగు కొలని సౌందర్యముకంటె, గలగలపారు సెలయేటి సౌభాగ్యము కనువిందు గొల్పును కదా! చిత్రలేఖనమునందున నొక యచలావస్థయందున్న చిత్రముకంటె చలదవస్థయందున్నట్లుండు నొక నదీ ప్రవాహపు వంపులు, సొంపులు గూర్చును కదా!

కాయికమగు నవస్థాచిత్రణమునకన్న మానసికమగు నవస్థాచిత్రణము మిన్నగా నలరారుచుండును.

అచలావస్థాచిత్రణము :- వీణవాయించుచున్న వరూధిని స్థితి యిది :-

తతనితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపు కావిరంగులీన
శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁగాయ
లుత్తుంగకుచపాళి నత్తమిల్ల
తరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁగనుదోయి
రతిపారవశ్యవిభ్రమము దెలుప—— (మను. 2 ఆ. 27)

చలదవస్థాచిత్రణము :- ప్రవరునిచూచిన వరూధిని తత్తరపాటు :-

చూచి, ఝళంఝళత్కటక సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులున్ దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడన్

బూచిన రెయికన్ బోఁకరును బోదియఁ జేరి విలోకనప్రభా
పీఠికలన్ దదీయ పడవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్.
(మను. 2 – 29)

కాయికావస్థాచిత్రణము :– శ్రీ కృష్ణుడు పారిజాతమును రుక్మిణికిచ్చెనని విన్న సత్యభామ స్థితి :–

మాసిన చీర కట్టుకొని, మౌనముతోడ, నిరస్తభూషయై
కాసెనకట్టు గట్టి, నిడువాలిక కస్తురి పట్టువెట్టి, లో
గాసిలి, చీఁకటింట కడఁగంకటిపై జలజాంత చంద్రరే
ఖా సదృశాంగియై పొరలె గాఢమనోజ విషాద వేదనన్.[1]

మానసికావస్థాచిత్రణము :– ఆమెపొందిన మనోవేదన నత్యంత సహజసుందరముగాఁ జిత్రించినాఁడు తిమ్మన కవి.

అని విని క్రేటుపడ్డ యురగాంగనయుం బలె, నేయివోయ భ
గ్గున దరిగొన్న భీషణహుతాశనకీల యనఁగ లేచి, హె
చ్చిన కనుదోయికెంపు తన చెక్కులఁ గుంకుమ పత్త్రభంగ సం
జనిత నవీన కాంతి వెదచల్లఁగ గద్గదఖిన్న కంఠియై[2]

ఈ విధముగా పాత్రనిర్మాణమున మూర్తిచిత్రణము కంటె ప్రాముఖ్యము వహించుచున్నది, యవస్థాచిత్రణమని గ్రహింపగలము.

మన 'శ్రీకాళహస్తిమాహాత్మ్య' ప్రబంధమున నీ యవస్థాచిత్రణమెంత కమనీయముగా, రమణీయముగా, సుభగసుందరముగా నిర్వహింపఁబడినదియు గమనింతము గాక.

---

1. పారి. 1ఆ – 99 ప
2. ,, 1ఆ – 82 ప

## చలదవస్థాచిత్రణము

ఇది కాయిక, మానసిక భేదములచే ద్వివిధముగాఁ బరిగణింప దగియున్నది. మన ప్రబంధమున నీ చలదవస్థాచిత్రణము గావింపబడియున్న తావుల గమనింతము

**1. కాయికము - వాసి - పిండజంగముల కథ :-**

అ. సుకుమార జంగము సుధాకరమౌళియు, దాసియుఁ గూడియాడిన స్థితి యిందుఁ జిత్రితమగుచున్నది.

తానుఁ గుమార జంగమసుధాకరమౌళియుఁ గూడియాడి యిం
పైన రతి ప్రసంగములు, నర్ధనిమీలిత నేత్రపద్మముల్
మానని చుంబనంబులును, మాటలచొక్కులు, నీడిపో
నీని కవుంగిలింతలు ననేక విలాసములం జెలంగఁగన్,*

ఇవి రతికేళీ విలాసము. ప్రబంధ సాహిత్యశృంగార పరిపోషకమైన స్థితియిది.

ఆ. రాజాజ్ఞచే భటులచేఁ గొనిపోఁబడుచున్న వాసి స్థితిని కవి యత్యంత సహజముగా, స్వభావసిద్ధముగాఁ జిత్రించినాఁడు.

పడిఁగొల్పి యొకకేల ముడిచిన కొప్పుముడి
గొబ్బునఁ గటిఁజుట్టుకొన్న చేల
మొండెకొంటఁ బెనఁగొనియున్న హారంబులు
నిద్రదేఱెడి నేత్రనీరజములు
వాడఁబాఱిన తీఁగవంటి చక్కని మేను
చిన్నికెంపులతోడి చిగురుమోవి
పిఱుదుభారంబున బెణఁకెడు పదములు
చనుఁగవ ప్రేఁగున జడియు కౌను

* శ్రీ.కా.మా. 1 - 125.

గలిగి, కలఁగని మనముతోఁ గాళహస్తి
విభుని దలఁచుచు దిక్కని వేయటంచు
సరఁగ నేతెంచె యూర్ప్వులు సందడింప
రాజుముందర నిలిచె సంభోజవదన [1]

పద్యరామణీయకమును 'వస్తునిర్వహణము'న జూచియున్నారము. ఇందు రాజు చేసిన గ్యాజ్ఞకు, దాసి పొందిన విక్రియ (రియాక్షన్) రూపింపబడినది.

ఇ. వాజీపతుర్ముఖుల ప్రణయోదంతమున ప్రణయకేళీ వర్ణనము :-

ప్రొక్కిన నొకలేమ మోము ముట్టఁగాఁజేయుఁ
 దిట్టుఁ గూరిమినొక్క తీఁగఁబోఁడి
తలవట్టుకొను నొక్క తరుణీలలామంబు
 పలుమ్రాని యదలించు నొక్క యింతి
పట్టకుమని యానపెట్టు నొక్క వధూటి
 యేడుచు నొక్క పూర్ణేందువదన
ముసుఁగునెట్టుచు నొక్క ముద్దియ పవళించు
 సిగ్గులేదను నీకుఁజెలువ యొకతె
మఱియుఁగోపించి వలసిన మాణిక్యనుండు,
వారిజాక్షుల దగినట్లు గారవించి
రతిసుఖంబులఁ జొక్క నోరంత ప్రొద్దు,
నజుఁడు మన్నన రాజ్యసింహాసనమున.[2]

1. శ్రీ.కా.మా 1ఆ - 47ప.
2. శ్రీ.కా.మా, 2ఆ - 18ప.

తక్కుతంబునఁగొంతతలఁపు గలుగుఁ
బరిరంభణంబునఁబరవశుఁడగు నఖం
బుల నాఁటఁజెనకినఁ దెలిపినొందు...[1]

ఇందు బ్రహ్మకామాంధ్యము, రతిసారవశ్యములు వర్ణింపబడినవి.

ఈ. బ్రహ్మకుమారులు కోణపపీరులు క్రూరకర్ములై, తండ్రిపంపున వింధ్యగిరి జేరుట:-

మించినవేడ్కఁ గక్కసులు మీసలు దేలుచు, దిక్కుడుంగముల్
చించుక పాఱ నార్చుచు, మషీమలినాంగ సునీలిమచ్ఛటా
వంచితభానులై, కయిదువజ్జళిపించుచు, లోకమెల్ల భ
క్షించెదమంచు, వింధ్యగిరిఁ జేరగవచ్చిరి తండ్రిపంపునన్.[2]

విజృంభించి, లోకకంటకులు గానున్న కోణపవీరుల క్రౌర్య, ధార్ష్ట్యములకు సూచకము గా నున్న దీ పద్యము.

ఉ. గుర్విణ్యవస్థాచిత్రణము ,- (గర్భిణీ స్థితి)

మన ప్రబంధమున గుర్విణ్యవస్థాచిత్రణము మూడుతావుల జరిగినవి.

1. పరమార్థస్వరూపముగా నవతరింపనున్న ఋభువును గర్భమునఁదాల్చిన సరస్వతి స్థితి :-

నెల రెణ్ణెల్లకుఁజేరచిక్కెఁ ద్రిజగన్నిర్మాత యిల్లాలికిన్
జలఁగెం జిట్టుమ, లంకురించె నరుచుల్, చెక్కుల్ప్రభాశేందుమం
డలతేజంబున నొప్పె, గొను బలిసెన్ డాసెం గుచాగ్రంబులన్
నలుపాయాసము దోఁచె నెన్నడ నభిన్నంబయ్యె నిట్టూర్పులున్.[3]

1. శ్రీ.కా.మా. 2అ - 20ప.
2. శ్రీ.కా.మా. 2అ - 26ప.
3. శ్రీ.కా.మా. 2అ - 80ప.

2. తిన్నని గర్భమున ధరించియున్న తండె స్థితి ;

భసింతాంగరాగ శోభావిలాసంబుతో
బ్రతివచ్చు నాననపాండు గరిమ
కంఠహాలాహాల కాళిమచ్ఛవితోడ
నెనవచ్చు గుబ్బచన్మొనల నలుపు
పరశివాకృతితోడ సరివచ్చు నణుతరం
బగుజాలి ఘనతరంబైన నడుము
స్వస్వరూపవిచార సంప్రాప్తశాంతితో
మార్పడు జిత్తైకమౌన జడిమ
పరభవానంద క్రీడ జరుగనీక, జొహ్నాదము...[1]

3. వేశ్యమాత మాణిక్యవల్లి గర్భిణ్యవస్థ :

ఆ వామేక్షణ దైవయోగమున గర్భాధానముం బొందినన్
వేవిళ్ళయ్యె నరోచకంబు వొడమెన్, వెల్లందనం బాస్యరా
జీవ వ్యాపకమయ్యె, నోపమి జనించెం బూపులున్ గుబ్బయున్
లావయ్యెన్ గటిశోటిసంగ సుఖమల్పంబయ్యె, నాపిమ్మటన్.[2]

పై మూఁడు సందర్భములను బరిశీలించునపుడు, కవి ధూర్జటి యూహాశాలిత, లోకజ్ఞతలు వెల్లడికాఁగలవు. గర్భిణులైన మానవభామినులను జూచిన ధూర్జటికి సరస్వతి యు నటిస్థితియందే యుండునని మనమునఁ దోచి కావించిన యవస్థాచిత్రణమిది. అతని యూహజ్ఞత కీ లోకజ్ఞత తెలియఁగలుగుచున్నది. మానవభామినులకు బహుకాలము

1. శ్రీ.కా.మా. 2ఆ—22 ప.

2. శ్రీ.కా.మా. 4ఆ_7 ప.

గలుగు నొక సౌకర్యమును తండె, మాణిక్యవల్లుల యందు గడు సహజముగా వర్ణింయు, నా విషయమును సరస్వతి విషయమునఁ బలుకకుండుట మిక్కిలి యుచితముగాను యున్నదనవలె

చిన్నసి తల్లి తండ్రి గర్భిణిగా నున్నయప్పుడు 'నరభసానంగక్రీడ జరుగనీ'లేదు. మాణిక్య వల్లికి పాపము 'విటకోటి సంగసుఖాశ నన్నుగిల్లినదట. ఈ చిత్రణములు వ్యక్తుల శీలచిత్రణమునకు వన్నెబెట్టునవిగా యలరుచున్నవిగదా!

ఊ. శ్రీకాళహస్తుల కథ :—

1. సాలెపురుగు :— పత్రిమయిలై పొల్పు తంతుసద్మములు వినిర్మించు జూడ సరి క్రమము చక్కగాఁ జిత్రింపఁబడినది.

"తిరుగ నీఁగతి నింటులు,
తీరగఁగట్టియును, గాలిఁ ద్రెవ్వినపోఁగుల్
జారిన పోఁగులు నడుకం
దీసుపనే కాని నిలుకఁదీరక దినముల్"[1]

ఇది చెలఁది చేసిన నిత్య శివార్చనముగదా!

2. పాము :—

శుండాలంబు కరంబు సోఁప ఫణిరాజున్మెచ్చి 'నా పూజ భ
ర్గుం డీవేళ ననుగ్రహించె'నని ముక్కుంగ్రోళ్ళలో నిక్కి యు
ద్దండక్రీడఁ దవీయ ఇ భుజగహారస్థానంబునం ద్రిమ్మరినది.[2]

3. ఏనుగు :— కొండల్గూలఁగ నెత్తి మొత్తుకొని యేనుఁగు చిక్కుల్మట్టి గిచెట్టుచు

1. శ్రీ.కా.మా. 2ఆ - 98ప.
2. శ్రీ.కా.మా. 2ఆ - 147ప.

మొగలేటి మడుఁగున మునిఁగి తుండమ్మున
నుదకమాకర్షించి యూఁది యూఁది
కముఁగపాలము దాఁకి కలఁగంగఁజిక్కఁగా
జేసాచి జిఱ్ఱునఁజీఁది చీఁది
యిలమీఁదఁదలదాఁక నీప్రక్క నాప్రక్క
బెడమర్లఁగాఁబొడ పెట్టి పెట్టి,
యుడివోని వేదన సున్నదో నుఁడక
పనిలేసి పరువులు పఱిపఱి
పెద్దప్రాఁకులతోఁ గుంభపీఠయుగముఁ
దోముకొనుచు జెట్లు దూఱితూఱి
పాముచేసిన దుఃఖంబు పాముజంబు
దీర్చుకొను పెరపెఱుఁగక, ధీరబుద్ధి.[1]

వివిధరీతుల నారాటముచెందిన యేనుఁగు తాను చచ్చుట యెట్లును తప్పదుగాన దాయను చంపి చచ్చుట ఆనాహ్లాదమగునుగా

అని మత్తేభము, జిత్తజాహితుని దిక్కై క్రమ్మెక్కి 'యిక్కాళమే కనుమంబోపునొ?' యంచుఁగుండమిటి యుంగాఁజుట్టి, వక్షస్థలం బునఁగీలించి, పిఱిందికిఁజని, శిరంబున్నంచి, యక్కొండ భగ్గునఁదాఁకె, న్వడిఁగుంభముల్వ్రగులఁ దత్కూటంబు లూటాడగన్.[2]

ముక్కుంగ్రోళ్ళలోనెక్కి యల్లకల్లోలము గావించుచు పాముసేసిన బాధను తాళఁజాలక యేనుఁగు పడిన పాట్లివి. తలలోగాని, చెవిలోగాని, కంటిలోగాని, ముక్కులోగాని

1. శ్రీ.కా.మా. 2ఆ - 148ప.
2. శ్రీ.కా.మా. 2ఆ - 150ప.

దేవిని చూచి కలతఁబెట్టునప్పుడు మానవుఁడు చెందు వేదనను, కవీంద్రుఁడిచట నేనుఁగునకుఁగల్గినట్లు చిత్రించి, తన యుపజ్ఞకు విషయజ్ఞతకు దోడించి కృతకృత్యుఁడై నాఁడు. ఆ పామువలన నా యేనుఁగు ఎంతగా బాధ చెందినదో యీ పద్యము వలన గవి పాఠకుని మనోనయనముల కగపడునట్లు చిత్రింపఁగలిగినాఁడు. ఇది ఏనుఁగు పొందిన మనోవేదనకు బాహ్య రూపమగు పోరాటము, శత్రుసైనికుల కార్యములకు లూనిన యేనుఁగుపోకడాసి విజృంభణము జక్కఁగ చూపించియున్నాఁడు.

మొక్కలంబుగఁ జొచ్చి ముక్కోన వ్రయ్యగా
భటకోటిచట్టలు వాపి పాపి
యారోహకులతోన హయముఁగబళించి
వేమారు నేలతో వ్రేసి వ్రేసి
భద్రేభములువీఁపు పడఁదాఁకఁగోల్కొని
గుండెలువగులంగఁ గ్రుమ్మి క్రుమ్మి
రథ్యసారథులతో రథములుద్ధతిఁబట్టి
దద్దఱ వినువీథిఁ ద్రిప్పి త్రిప్పి
విమతరాజన్యవరసైన్య, కమలషండ
ఖండనోద్దండ విహరణక్రమనిరూఢి
నెదురులేక రణంబులో నేపుచూపె
భట్టి జగజెట్టి దీకొల్ప భద్రగజము.*

ఎ. శైశవావస్థలు :—

ఈ ప్రబంధమున నీ శైశవావస్థాచిత్రణములు రెండు తావుల గలవు. తిన్నఁడు వేశ్యాతనయుల గాథలయందీ చిత్రణములు గలవు. అందు తిన్నఁడును, ఇందు వేశ్యా తనయులును శైశవముగడచి తరుణులయినవారు. సరస్వతీదేవి కన్నట్టు [illegible]

* వి.చ. 4ఆ - 111ప.

నృపకిరీటంబుల నిలుపుదు ననుమూడ్కి
ఖాదిగిటిలోనుండి పదగు లెత్తు
క్షితి మిన్నువడ్డను జేయెత్తి రక్షింతు
ననురీతిఁ జేతులలల్లార్చి యనుచు ...[1]

సింహాసనంబునఁ జేరి రాజుల గొల్వనుంను
చందమునఁ గూర్చుండ నేర్చె
ధర్మంబు నాల్గుపదంబుల నడిపింతు
ననువిధంబున నడిచా డనేర్చె ......[2]

వేశ్యాతనయలశైశవము :- వేశ్యాతనయల బాల్యచేష్టలన్నియు శివపారమ్యములె.

ఆ పసిబిడ్డలేమి జననాంతర వాసనయో? కనుంగవం
జూపు లిగుర్చుచో శివునిఁజూడఁదలంతురు, పల్కనేర్చుచోఁ
దాపస మానసాంబుధిసుధాకరు శంకరు రూపవర్ణనా
లాపములాడఁబోదురు, కళానిధిశేఖర భక్తియుక్తలై.[3]

౨. తిన్నని కథ ; చెంచెతలు :-

పండినచేలకుఁగావలికాయు చెంచెతలు మంచెలెక్కి యున్నస్థితిచిత్రణము.

మంచెలమీఁదనెక్కి, కటిమండలిఁజుట్టిన పాలుటాకుశోభిం
చించుక చెంచలించి, నరుసిల్లు బయల్పడఁజేయుఁబిట్టలన్.

1. శ్రీం.శా. 4ఆ - 64ప.
2. శ్రీం.శా. 4ఆ - 66ప.
3. శ్రీ.కా.మా 4ఆ-18 ప.

ఱెంచెత లార్చి వేఁయుదురు చిత్రముగా నొడిసెళ్ల బాహుళమ్మా
లాంచిత దీధితుల్ చిఱుతలైఁ చనుంగవమీఁదఁ బర్వఁగన్. [1]

ఇచ్చటి చెంచెతల వలదవస్థాచిత్రణమునఁ గవి ధూర్జటి తన పరిశీలన పాటవమును వెలార్చినాడు. అయిన నిచ్చోట కవికిఁగల శృంగారరాసికత్వమును, అందలి కొంత యనౌచిత్యమును వస్తునిష్పాదనమునఁ జూచియుంటిమి. చేతికొలఁది నొడిసెల బాలురుప్పుటయందలి వేగముచేత వారి యొడలంతయు చంచలించినది, నడుమ నడుమ కేకలిడుచు చేతులనాడించుచు వారు పిట్టల నదిలించుట నిట భావింపఁగలము. జాత్యుచితముగ వేషములలవఱచుకొనిన వారి పాఱుటాకుల కదలికచే వారిగుట్టు బట్టబయలగుచుండుట యిది

మధుపానమత్తులైన శబరులచేష్టలు :- హాస్యరససంభరితమగు నీ దృశ్యమును ధూర్జటి స్వభావోక్తి సుభగముగాఁ జిత్రించుటఁ గనఁగలుగుదుము.

మాటలాడఁదలంచి మఱచిపోయెడు వారు
నడుమఁ బోవుచుఁ దొట్రుపడెడు వారు
నూరకుండెదమని యుండనోపని వారు
లేచెదమని లేవలేనివారు
పనిలేని పని బట్టబయలు దిట్టెడు వారు
పాడ నేరకయును బాడు వారు
నెదురైనవారికి నెల్ల మ్రొక్కెడు వారు
వ్రీడావిహీనులై యాడు వారు
జాలఁ ద్రావియు మగుడఁ జేపాఁచువారు,
దొడరి యుపదంశభాండముల్ ద్రోయు వారు
నైరి, మృగయాధిదైవతయాత్రయందుఁ
బానములు చేసి శబరదంపతులు రతుల. [2]

1. శ్రీ.కా.మా. 3ఆ — 10ప.
2. శ్రీ.కా.మా. 3ఆ—41 ప.

త్రాగుబోతుం స్థితి యిట్టిదేగదా! ఆకారాలాపచేష్టితములందు వక్రతకల్గి హాస్యజనకమగు దృశ్యమిది.

రక్కసులచే నూగ మనవడలుబొంది యార్తారావము గావించు మునీంద్రుల దయనీయస్థితిని మహాకవి వికటాకారహాస్యాత్మకముగ చిత్రించియున్నాడు.

జడలూడ యపాలకై నడిఁ జిక్కుఁ జీసుఁగా
నవసి పైఁబడిపోరలాడు వారు
పదియైదుసంజల పరువెత్తి చనలేక
దగదొట్టి పెదవులు దడుపు వారు
గంపతాఁకుల జీరుగంబులై వీపులఁ
జీరలంటఁగఁ బొడఁద్రోయు వారు......*

చిన్నఁడు ముక్కంటికంటికి కంటివైద్యము సేయుట :—

కోకపోట్లం బావిగొన నూఁడి యొత్తుచుఁ
గవోష్ణ కరభాగమునఁ గాఁచి
నెత్తి తంగేడాకు మెత్తి, రేచకి నిమ్మ
పంటి నీరున నూఱి పట్టువెట్టి
తెల్లదింటెన పువ్వుఁ దెచ్చి తద్రసమిడి
కలివెపువ్వులుగోసి నలఁచి పిండి
పేరిన నెయిపెట్టి పెరుఁగునత్తులు నైచి
చనుఁబాలతో రాచి సంకుచమిరి

* శృం. శా. 3 ఆ — 106 ప.

విన్నమందులు, తా సరికన్నమందు
లడిగి తెచ్చినమందులు నడవిమందు
లెన్ని చేసిన మానక యిందుమౌళి
కన్నుతో డేఁబడి నెత్తురు గాఱుటయును.[1]

ఇందు తిన్నఁడు చేసిన వైద్యము, నందులకుపయోగించిన యౌషధములు, కవి ధూర్జటికిఁగల శాస్త్రజ్ఞత లోకజ్ఞతలను వెల్లడిచేయజాలియున్నవి. కన్నప్ప చేసిన నేత్రవైద్యమును పాల్కురికి సోమనయు వర్ణించియున్నాడు. కాని యట నాతఁడు మందులేవియు తెచ్చియుపయోగింపలేదు. కాని ముక్కంటికంటియందు నలుసున్నదని భావించి యాతఁడు దానినిఁదీయ జేసిన ప్రయత్నముహాడ సత్యంబు సహజసుందరముగా నున్నది.

కరతలాంగుళము లఁగను తెప్పలెత్తి
'నెరసున్న' దని వ జూసి కష్టించి యూఁదుఁ
బరఁగ నాలుక గ్రుడ్డుపైఁద్రిప్పిత్రిప్పి
రొరయుచు నారయుచు నొయ్యనఁజూచుఁ
జిరావిఁగొని కంటఁజేర్చి హత్తించి
చీరెల్లఁదడిసినఁజికు ...[2]

ఆ కన్నప్ప చేసిన చివరి ప్రయత్నముతో నారంభించి మన తిన్నఁడు తన వైద్యముచేసినాఁడు. వస్త్రమును నోట నమిలి ఊఁదిన వెచ్చదనము పుట్టుట సర్వుల కనుభూతమగునదియే. అట్టులే కంటిరెప్పలెత్తి, నాలుక కొసతో టుడుచుటయు లోక సహజమైనది. ఎన్నిమందులు వాడినను, సొంతవైద్యము చేసినను పరమేశ్వరుని కంట నెరుగాఱుట యాఁగలేదు. తనకుఁగల లౌకికజ్ఞానముసుపయోగించి 'ఉష్ణం ఉష్ణేన శీతల'మ్మనురీతిని,

1. శ్రీ.కా.మా. 3ఆ – 110 ప.
2. బ.పు. – పుట 114 పం 1025 – 1030.

'వేఁడి సెచ్చయైన నెచ్చెలి మందుగా
గాదె మానునట్లు గంటి కింకఁ
గంటికంటె మందుగలదె ముక్కంటికిఁ ?
గంటిననుచు బోయ గదియఁబోయి.' [1]

'ప్రాణము వోవునో, తనువు భంగము నొందునో' నాక, తూణికా
బాణము జిఙ్ఞునం దిగిచి, భల్లముఖాగ్రము రక్తపద్మదృ
క్కోణముఁ జేర్చి గ్రుచ్చి, యొక గ్రుడ్డువడిం బెకలించి, శోణిత
ద్రోణికయైన దైవతశిరోమణి కంటన మర్చె నంతటన్, [2]

బాణమును జిఙ్ఞునఁ దిగుచుట, దృక్కోణముఁజేర్చి గ్రుచ్చుట, యొక గ్రుడ్డు వడింబెకలించుట, ముక్కంటికంటఁ దనకంటి నమర్చుట యను నీ ఘటనలన్నియు వెన్వెంటనే, జరిగిపోయి, యొక మహాద్భుత సంఘటనము సంభవించినట్లు మనము కాంచ గలము. ఇందు 'తిగిచి, గ్రుచ్చి, పెకలించి, అమర్చె' అను క్రియలొకదాని కొకటి కార్యకారణ, ఫలపరికరములయి తిన్నని యీ చర్యకొక దృశ్యీకరణ శక్తి నొసఁగ గల్గినవి. ఈశ్వరుని మఱియొక కంటికి నీరు గ్రమ్మినది. తాను కన్న (తెలిపిన, చూచిన) మందుండ నేయుచున్నది. తిన్నఁడు తన రెండవకంటి నూడబెఱికి ముక్కంటికమర్చ బూను నను నొక చక్కని చలనచిత్రణమై భాసించుచున్నది.

'అని చెప్పఁగాల నిటలా
క్షుని కన్నొనఁ దన్ను పట్టి, సునిశిత బాణం
బునఁ దన రెండవ కన్నుగ్రు
డ్డును బెకలింపఁగ....' బూనినాఁడు తిన్నఁడు. [3]

---

1 శ్రీ.కా. మా. 3ఆ - 141ప.
2. ,, 3ఆ - 115ప.
3. ,, 3ఆ - 118ప.

ఇందలి చెప్పుగాలితో తన్నిపట్టుట, పెకలింపఁబూనుట అతని ప్రయత్నమును ప్రత్యక్షీకరింపఁజాలియున్నవి.

౫. నత్కీరుని కథ :-

శప్తుఁడైన నత్కీరుఁడు కైలాసాచల దర్శనోత్సుకుఁడై పయనించుచు పడినపాట్లు కడు దయనీయమై, బీభత్సరసావహమై యొప్పుచున్నవి.

ఒకకొన్ని పయనంబు లొయ్యనొయ్యనఁ బోయి
  నడుచు నోపికలేక నడుము నడుము
నడుముబట్టుక నిల్వఁబడియుఁ గూర్చుండియుఁ
  జాఁగి డోఁగియుఁ గొన్ని జంగలరిగి
పొడలువెట్టుచుఁ దన కడుగాముడై యుండఁ
  జీము నెత్తురు మేన జిప్పిలంగ
నీఁగలుమూఁగియు రేఁగియు రసుద్రుస్సు
  మ్మానఁగ నుత్తాల శైలాంతరంబు... *

కుష్ఠవ్యాధిపీడితుఁడైన మనుజుఁ డెట్టి వికృతరూపమంది, పయనము చేయునపుడు పడిన బాధలను వర్ణించిన ఈ పద్యము నత్కీరుని యవస్థను గన్నుల గట్టఁజాలియున్నది.

౬. వాలీశ్వరుని కథ :-

ఆరవీడటిని యున్నచోటఁ బూర్వ మొక సరోవరముండెడిది అప్పట నొక నాఁడు వాలి తన సజలింగమును పీఠమునఁ బెట్టి పూజించి, తిరిగి తీసికొనఁబోవగా నా లింగము వేలికి రాలేదు. ఇఁక దానిని తీయుటకు వాలి చేసిన ప్రయత్నము లంతింతలు గావు. ఒకచేతితో, రెండుచేతులతో పెకలింపఁజూచినఁ బ్రయత్నించియు విఫలుఁడైనాఁడు. తుదిగా నాతఁడు చేసిన ప్రయత్నమును కడు బాగుగా వర్ణించినాఁడు కవి ధూర్జటి. ఇది స్వభావోక్తి సుభగమై యలరుచున్నది.

---

* శ్రీ.కా.మా. 3ఆ - 103ప.

గ్రక్కునఁ దీచి, వాలమున గాఢతరంబుగఁజుట్టి, పిక్కలు
క్కొక్కఁగఁద్రొక్కి, నిల్చి, తనువించుక వంచి, కరంబులూరులన్
నొక్కి, ముఖాంబుజంబునఁ గనుంగవఁ గెంపు జనింపఁజేవమై
నిక్కఁగఁగ్రుంగెఁబాదములు నేల, జలింపదు లింగ మేమియున్ [1]

తనకుఁగల శక్తియుక్తులనన్నిటినిఁగూడదీసి, నేలలో నిలిచిపోయిన లింగమును పెకలింపఁజేసిన ప్రయత్నము, వాలి సర్వాంగీణమగు ప్రకంపనము మన మనోనేత్రములఁ బ్రతిఫలింపఁగలదు. ఇట్టి చలదవస్థాచిత్రణములు మనకుఁ గావ్యములందచ్చటచ్చటఁ గాంచగలము. ముఖ్యముగా వానరుని పూనికను చిత్రించు ఘట్టములు మనకు రామకథ లయందుఁ గన్పట్టును.

హనుమంతుఁడు సముద్రలంఘనమునకుఁబూనిక వహించినప్పటి ఘట్టము భాస్కరరామాయణమునను, మొల్లరామాయణమునను గడుంగడు చక్కఁగా చిత్రింపఁబడినది

సరిపాదంబుల పొందుగా నిలిపి, దోస్తంభంబు లంకించి, ని
ర్భర దర్పంబునఁబొంగి, యున్నతిత శుంభద్గ్రావ మస్త్రధంకష
స్ఫురదోగ్రంబుగ లంకదిక్కుఁ గనుఁగొంచుం గ్రోధరక్తాస్యుఁడై
గిరి క్రుంగంబడఁదాఁచి దాఁటె బలుకీశాగతిన్ మింటికిన్. [2]

మొగముబిగించి పాదములు ముస్తముగా నటనూది త్రొక్కి నీ
టుగ మొగమెత్తి భీకరకఠోరరవంబున నార్చి బాహుల
త్యగణితలీల సాఁచి వలయంబుగ వాలము ద్రిప్పి వేగునన్
నగము నగమ్ము గ్రుంగఁగనిపానసుఁడు నింగికి దాఁటు టిప్పునన్ [3]

---

1. శ్రీ.కా.మా. 4ఆ – 74ప.
2. భా.రా.సుం. 17ప.
3. మొ.రా.సుం. 19ప.

పాలకడలియందు గవ్వపుఁగొండను ముసుఁగనీక చెత్తిపట్టిన పాంచజన్యధరుని శ్రీనాథుఁ డిట్టి స్థితియందున్నట్లే వర్ణించియున్నాఁడు.

కటిమండలంబునఁ గనకంపు నునుఁజేల
దృఢముగా బిగియించి దిండుగట్టి
కట్టాలు యితెంబైన కురవహుంకారంబు
గావించె దిక్కులు గ్రక్కదలఁగ
సముధికావష్టంభ సంరంభ జృంభణ
సముకూర్చె నిజభుజాస్తంభమునకుఁ
బాదాభిఘట్టనఁ బార్శ్వదేశంబుల
నదలించి ధాత్రిగ్రక్కదలఁ జేసి
పట్టె, గదలించె, నసియ గ్చెఁ గాంతగల్చె
నెత్తె, వక్షస్థలంబున నెటియునొత్తెఁ
దోయజాక్షుండు లోకైక దుర్ధరుండు
తాల్చె నవలీల నిట్లు మందరనగంబు.*

ఓ :- కిరాతార్జునుల పోరు :

రుద్రార్జును లొండొరులు జయము పొందఁగోరి పోరిన తీరు అమ్నాతావహమైనది. కావ్యము లందనేకములగు తావుల తులాయుద్ధములున్నవి. కిరాతార్జునుల గాథ తెలుఁగున హరవిలాసమునను, శ్రీకాళహస్తి మాహాత్మ్యమునను గలదు. కోదండరణము చాలించిన వెనుక వారిరువురును మల్ల సంగరము గావించిరి.

---

* హర.వి. 6ఆ — 45ప.

మల్లచఱచికొనుచు, మహి పాదఘట్టనఁ
దల్లడిలఁగఁజేసి తనుపులించు
కించుకంత వంచి యిరువురుఁదొడ లప్ప
ళించి వెదకి తెఱపి లేమిఁజేసి.[1]

చెయ్యిచ్చి, యొక కొంతసేపు నేర్పున బల్మి
యినుమడింపఁగఁజారనీక మలసి
యొకతెఱంగునఁజొచ్చి, యొండొండఁగాసెలు
దొడికి పట్టుక కొంతతడవు పోరి
యది మాని, కొంత ప్రొద్దవని నూఁదిన కాళ్లు
పెకలించి పడవైవఁ బెనఁగి పెనఁగి
మఱికొంతవడి, మెడవిఱిచి భుజమ్ములఁ
జిక్కించి , యకుట్టన నొక్కినొక్కి
నహుముల నొడిసి, కబళించి, పుడమిమీఁద
సమముగా వ్రాలి బలపరాక్రమము తెలఁగ
హెచ్చుగుందేమియును లేక యీశ్వరుండు
హరిహయసుతుండు మల్లంగరక్రమొ ర్ప[2]

భారతమునను, హరవిలాసమునను కిరాతార్జునుల పోరు వర్ణింపబడిన నిట్లులేదు. చేసిన మల్లయుద్ధము గాదు ! మిక్కిలి పట్టుదలతోఁ దలపడినట్టి మల్ల యుద్ధమును సీసపద్యమున రూపెంచినట్లుగ నన్యఛందములందు, నందును కందము, గీతములందు రూపించుట యసాధ్యము. నన్నయగారి కథనాత్మక శైలియందు నిలిచి పఠింపుటకవకాశములేదు. ఆ సందర్భమునొక ఘట్టముగా, నొక ఖండకృతియై యనునట్లు

1. శ్రీ.కా.మా. 2ఆ – 98ప.
2. శ్రీ.కా.మా. 2ఆ – 147ప.

కూర్చినవారు, శ్రీకాళహస్తి క్షేత్రప్రాశస్త్య ప్రకటనము గావింపఁదలచిన వారు శ్రీనాథ ధూర్జటి కవీంద్రులు. శ్రీనాథుఁడీ తన తలంపును కిరాతార్జునీయకథను పల్కిన సప్తమాశ్వాసమును ప్రారంభించుట యందే స్థాపించి యున్నాఁడు.

శ్రీకాళహస్తినాథా
ప్రాకారాంతప్రణీత పాతాళగుహా!
శ్రీకాళహస్తి భక్తసు
ధీకల్పితవిభవ! యవచి దేవయ తిప్పా![1]

ధూర్జటి చిత్రించిన యీ యవస్థాచిత్రణమున నొక దృశ్యమును నిలుపఁగలుగుచున్నాఁడు. మల్లసంగరమునందలి మెలకువలు, పట్టులు, పెనగులాటలు, బలిమి యిత్యాదులు ఒకరిపై నొకరు సాధింపఁదలచిన విజయము, శత్రుని విడువరాని భావములు, ఎదతెంపిలేని పోరాటము లీ సీసపద్యమున సమృద్ధిగ నందింపఁగల్గినాఁడు. ఇందలి భాషా సౌందర్యము రానున్న "భాష" యను ప్రకరణమున జూచెదము.

## 2. మానసికావస్థాచిత్రణము :-

పర్వతపుత్రి కావించిన యత్యుగ్రమైన తపమునకు మెచ్చి హరుఁడు ప్రత్యక్షమగుట.

వాకిటఁగాచియున్న హరి వారిజసంభవముఖ్య దేవతా
నీకమునుం దలంప కవనీధరజా దరహాసలోలతం
బోక, సమీపవర్తులగు పుత్రులఁ జూడక, భక్త భక్తిక
న్యాకరిపంకజగ్రహణ నైష్ఠికుఁడై కడు సంభ్రమంబునన్.[2]

---

1. హర. వి. 7ఆ - 1ప.
2. శ్రీ.కా.మా. 1ఆ - 14ప.

ఇది గజేంద్రుని ఉయ్యాలించి, గజప్రాణావనోత్సాహియై సంరంభముతో నేఁగుదెంచిన హరినిఁదలపించుచున్నది. 'సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపడు....'[2]

ఇదిభక్తవత్సలుఁడైన భగవంతుని శీలము. భక్తుని పిలుపువిన్న భగవంతునికి ఆలుబిడ్డలు, ఆప్తులు తలపున నిలువరు హరుని నిష్ఠ వశిష్ఠునను గ్రహించుటయె కాని తన దర్శనముకోరి, వాకిట వేచియున్న విష్ణు విరించు లాదిగాగల దేవతల విషయము పట్టించు కొనలేదు. చిఱునగవులు చిందించుచున్న శైలనగసుతయు నగధరు నాకర్షింపలేదు. ఒద్దచెరి ముచ్చటగా నాడుచు నడయాడుచున్న ముద్దు బిడ్డలను ముద్దుసేయలేదు. ఆ హరుని మనమున వశిష్ఠుని తపోనిష్ఠయే నిల్చినది. అతని ననుగ్రహించుటనే తన నిష్ఠగా నెంచినాఁడు.

ధూర్జటివంశీయుఁడును, 'శ్రీకాళహస్తి స్థలమాహాత్మ్యము'ను రచించిన వాఁడు నగు ధూర్జటి లింగరాజును తన కావ్యమున వశిష్ఠుని తపోఘట్టమున నిట్టి యవస్థాచిత్ర ణమునే కావించెను

నతిరియొనరించి నిల్చిన జనార్దన వాగ్భవములన్ దెలంపక
ప్రతిహత దైత్య సంహరణ పద్ధతినెంచక, భృంగి నాట్య సం
గతిఁబరికింప కాత్మసుత కామిత మిచ్చుట కయ్యద్రిజావిలో
లత విహరింప కమ్మునికులప్రభు వాంఛిత దానదీక్షతో.[3]

ప్రత్యక్షమైన పరమేశ్వరుని దర్శనమునకు పులకితాంగుఁడైన వశిష్ఠుని పారవశ్య స్థితిని కవి ధూర్జటి కడు మనోహరముగా, లోకజ్ఞుల అనుభవములతోఁ జిత్రించె నని పించును.

---

1. భాగ. 8 స్కం. 88ప.
2. శ్రీ.కా.స్థ.మా.

కన్నులు విచ్చిచూచి పురఘస్మరు దివ్యరిఘార్ణ దీప్తి సం
పన్నతకుఁ గన్ భయాకులిత పద్మకిరీటుఁడై, వడంకు పై
కొన్న శరీరమంతయు గగుర్పొడువంగ బ్రమోద సంభ్రమ
స్విన్నలలాట భాగమున జేతులు సేర్చి మునీంద్రుఁ డిట్లనున్.[1]

ధూర్జటి కవికిఁగల విషయజ్ఞత, అనుభవములిందు సమ్మేళనమందినవని చెప్పనొప్పను. అపూర్వమగు నొక గొప్పవెలుఁగు చూచినప్పుడు కన్నులకు మిఱుమిట్లుగొల్పుట, శరీరము కంపించుట, ఆ వణఁకుపాటునకు ముఖమున చెమటపట్టుటలు అనుభవమునఁ దెలియునట్టివి.

## అచలావస్థాచిత్రణము

కాయికము :—

1. ఒకరాజ సభాదర్శనానుభవమును పురస్కరించుకొని, బ్రహ్మ సభను సృష్టి స్వరూపమునే కల్పించుట కవి ధూర్జటి యొక్క పరిశీలనము, ఊహాశాలితయను లక్షణము లీ సభాచిత్రణమున గోచరింపగలవు.

అఖిలవిద్యారహస్యములు శంకలు దీర్ప
సరసనుండెడు మునీశ్వరులు పొగడ
స్వస్తికహస్తులై సమ్ముఖంబున బరా
బరిగాఁగ సర్వసుపర్వులుండఁ
గరతల యుగళి వక్త్రములు గప్పక విన్న
పంబుల కొలకు దిక్పతులు సేరఁ
బూర్వదేవతలు కింకుర్వాణులై తన
కనుసన్న నలసిన పనులు సేయ
గరుడగంధర్వ భుజఁగ కిన్నర పిశాచ,
భటులు చావడిముంగట బట్టబయలఁ
జటులతరవృత్తిఁ గోటుల సంఖ్య లెసఁగ
నబ్జగర్భుండు గొలువున్న యవసరమున.[2]

---

1. శ్రీ.కా.మా. 1అ– 77ప.
2. శ్రీ.కా.మా. 2అ – 4ప.

ఈ చిత్రణమున వాచస్పతియొక్క వైదుష్యము, ప్రభుత్వములు వ్యక్తము లైనవి. ఒక ప్రభునాస్థానమున నే యే రీతుల నెచ్చ పెచ్చట నే యే వ్యక్తుల స్థానము లెట్లుండునో కవి చక్కగా నిరూపణము గావించిన స్థితి యిది. పండితులు రాజబంధువులు, అధికారులు, సేవకులు, తదితరులు నిలిచిన తావులరీతిని, బ్రహ్మసభయందును, మునీశ్వరులు, దేవతలు, దిక్పతులు, రక్కసులు, గరుడగంధర్వభుజగకిన్నరపిశాచభటులా యా తావుల తమతమ యధికారములు, అవసరముల కొలఁది సేవించుచున్న కొలువు స్వరూపమత్యంత సహజముగాఁ జిత్రించినాఁడు ధూర్జటికవీంద్రుఁడు.

2. కూటమియందు నూరటలేని బ్రహ్మస్థితిని వర్ణించు పట్టిది.

> తోరపుఁగోరిక, ల్నగవుతోడి మొగంబును, జక్కవద్దళ్ళం
> గారపుఁగొప్పు, క్రొంజెమట గాతెవు గండము, సందడించు ని
> ట్టూరుపు గాడ్పు, వేడుకల నుబ్బెడు దేహము, సోలుఁజూపు,నో
> ప్పారుటగాని నల్వకొకయప్పుడు నూరటలేదు కూటమిన్.*

బ్రహ్మ పొందిన రత్యంత స్థితి యీ వర్ణనము. కాయికముగా నాతఁడందిన సాత్త్వికానుభూతిని చిత్రించుట మానవసహజమగు నీ స్థితిని సృష్టికర్త కన్వయించుట ఉత్తమగు చిత్రణముగదా!

మానసికము :—

1. రాజుచే శిక్షితయైన దాసి, తన గృహమునకేఁగువెంచి, యట వసించియున్న జంగము పాదములఁబడి దీనయై తనస్థితిని మాటల వలన గాక తనమనఃస్థితి కనురూపము కాయింపరిణామములచే నివేదించుట మనఃస్థితికి ముఖము దర్పణము వంటిది. అందువలననే యిచ్చట నా దాసి తన ముఖావిర్భూత పరిణామములచే తన మనోవ్యథ నందించినదయినది.

---

* శ్రీ.కా.మా. 2ఆ_21ప.

ఓ యను రోదనం బోంకారముగాఁ
గనుఁగవ నీరు మజ్జనము గాఁగ
నిడువాలు గన్నులు నీలోత్పలములుగా
నిమ్మోము క్రొత్త నెత్తమ్మిగాఁగఁ
గమ్మని నిట్టూర్పుగాడ్పు ధూపంబుగా
దంత కాంతులు దీపతతులుగాఁగ
నధరోష్ఠ మమృతోపహారంబుగాఁబదా
బ్జంబులఁబడుట దండంబుగాఁగ
నవధరించెనొకాక లోకైకవిభుఁడు,
భక్తజనముల మ్రుంగిటిపారిజాత
'మేల యేడ్చెదు మానవేచాలు'ననుచు
హస్తమస్తకసంయోగమాచరించి.*

ఈ చిత్రణమునఁ గవి రెండు ప్రయోజనములను సాధించినాఁడు. ఆమె మనఃస్థితికిఁ బ్రతిబింబమగు కాయిక పరిణామ చిత్రణమొకటి, యామె శరీరావయవ సౌందర్య వర్ణనమింకొకటి. ఈ రెండింటి యందంతర్వాహినిగా శివార్చన మనునది యలరుచున్నది శివోపచారముల నిర్వహణరీతిని మనము 'వస్తు నిర్వహణము'నఁ గాంచియుంటిమి. పెద్దపెట్టున వెక్కివెక్కి విలపించుట, కన్నుల నీరు గార్చుట, కన్నులుబ్బుట, మొగ మెఱ్ఱవడుట లేక పాలిపోవుట, నిట్టూర్పులు పుచ్చుట, పెదవులు వడఁకుట లాసి పొందిన మనోవ్యధకు బాహిరములగు చిన్నెలు. కన్నులు నీలోత్పలములగుట, మొగము నెత్తమ్మియగుట, నిట్టూర్పు కమ్మగానుండుట, దంతకాంతులు, అమృతోపమానమైన యధరము లిత్యాదు లామె సౌందర్య నిరూపకములుగాఁ జిత్రింపఁబడిన తెన్నులు. ఓ యను రోదనము ఓంకారముగా, కన్నులు ముఖములను కలువలు పద్మములు పూజా ప్రసూనములుగా, నిట్టూర్పు ధూపముగా, దంతముల కాంతులు దీపములుగా, అధర

---

* శ్రీ.కా మా. 1ఆ ‒ 61ప.

మమృతోపహారముగా, పాదములబడుట సాష్టాంగదండప్రమాణామముగా, క్రమముగా మంత్రపూర్వకమైన శివోపచారవిధి నిర్వర్తించినట్లున్న చిత్రణము కవి ధూర్జటి యభిమతము.

1. బిడ్డలను గర్భములందాల్చిన మాలాంధ్రుు, కలుగనున్న బిడ్డల స్వరూప స్వభావానురూపములగు వేవిళ్ళు పొందుట లోకసహజము. మన ప్రబంధమున నట్టి మాలాంధ్రులిరువురు గలరు. బుభువును గననున్న సరస్వతియు, తిన్నని గననున్న తండెయు నిట్టి స్థితిలో నుండి వారు కాంక్షించిన కాంక్షల చిత్రణములను చూతుము.

అ. సరస్వతి కోరికలు :-

సౌఖ్యలేశము లేని సంసారమోహాబ్ధి
మానము విడిచి త్రిమ్మరఁగఁగోరు
ముక్తిసామ్రాజ్యాభిషిక్తులై విహరించు
యోగిసిద్ధులలోన నుండఁగోరు
మానముద్రాసక్తి మదికి నింపగుచోట
నేకాంతమున వసియింపఁగోరు
స్వప్రార్థితప్రాప్తమగు పదార్థంబుల
దీపనాదివ్యథఁ దీర్పఁగోరు
విష్టపవ్యాపకంబు సవిస్మయంబు
నైన బ్రహ్మాండము పిండమై యాత్మగర్భ
గోళముననుండఁదన్మహాగుణము లెల్లఁ
దెలుపు వెలపున సంతటఁబలుకు వెలఁది. *

---

* శ్రీ.కా.మా 2ఆ-88 ప.

ఆ. తండె కోరికలు :—

పంచాననా నేకప వ్యాఘ్రఘకోలాది
మృగములఁ జంపఁ గామించె లేఁడు
శైలోపకంఠ నిర్ఝరసైకతస్థలి
శివునిదర్శింప గాంక్షించె నబల
ఖండేందుశేఖరు గండూషితాంబుధా
రల మజ్జనము సేయఁ దలఁచె నింతి
చవియైన ఘోణిమాంసమ్ము దొప్పలఁబెట్టి
యభవున కర్పింప నతివ గోరె
నేత్రనీలోత్పలంబుల నీలగళుని
యర్చనము సేయఁజింతించె నంబుజాక్షి
గర్భగోళమునందున్న యర్భకునకుఁ
గలగుణంబులఁదెలిపెడు కరణినపుడు.*

ఈ యిరువురు స్త్రీల కోరికలును వారికారికిఁగలుదనున్న కుమారుల స్వభావము అట్టివి. పరమూర్తిరూపముగా నవతరింపనున్న బుధుస్వభావము సరస్వతియందు కోరికం రూపమున సూచితమయినది. అటవికముగా, ముగ్ధ భక్తునిగా జన్మింపనున్న తిన్నని చేష్టలకనురూపములయిన కోరికలు తండెయందున్నట్లును సూచ్యముచేయబడినది. అంతియెకాదు వాచ్యమును సేయఁబడనది.

భరతుని గర్భమున ధరించియున్న శకుంతలకుఁగలిగిన కోరికలు నిట్టివిగనే పిల్లం మఱ్ఱి పినవీరన వర్ణించియున్నాఁడు.

---

* శ్రీం.శా. 3ఆ - 24ప.

శాశ్వతకీర్తులం దిశల సారణసేయఁదలంచు, సర్వభూ
మీశ్వర భామినీ జనమునెల్ల బనుల్గొన నిచ్చగించు, నీ
విశ్వము నేలుకోదివురు, ప్రేకటికోరుకులందు నా ఢిగ
ర్భేశ్వరుఁగుక్షిలోన ధరియించిన యట్టి మహానుభావతన్.[1]

చంద్రగుప్తుని భార్యలు నల్గురు గర్భిణులయి నప్పు డట్టి మనఃస్థితిని జక్కన తన విక్రమార్క చరిత్రమున చిత్రించియున్నాఁడు.

వేదవేదాంగాది విద్యలు శీలింప
శీలవతీకాంత చింతసేయు
ధరణి నేకాతపత్రముగ నేలుకొనంగ
సతతంబు రాగమంజరి తలంచు
.... .... .... .... ....[2]

3. పాము నేనుఁగుల కథ :—

శత్రుస్వరూపమేమొ తెలియకున్నను, తమరనుచేసిన శివపూజలు భగ్నములగు చుండుట చూచిన పాము, నేనుఁగులు రెండును, రెండు దినములు గడిచిన వెనుక మూఁడవ నాటి రాత్రి మిగుల వ్యథ జెందినవి. వేపకడ శత్రువిదళనమో, ఆత్మనమ ర్పణమో జరిగి తీరవలయునను సంకల్పములకు వచ్చినవి. ఆ రెండు ప్రాణులకును ఎప్పుడుతెల్లవాఱునా, ఎప్పుడు దాయను దాయుదునా యని యదే చింతగా నారాత్రిని గడిపిన స్థితి, యారాత్రియంతయునున్న హాని మనఃస్థితిని కవి ధూర్జటి మానవస్వభావా రోపణముచేఁజక్కఁగా నావిష్కరించెను.

1. శృంశా. 4అ – 57ప.
2. వి.చ. 1అ – 187ప.

అ. పాము మనఃస్థితి చిత్రణము:-

భోగవతీ ఝురంబునఁజొచ్చి, బోటుల
తోడనానాడెడు జలక్రీడ లుడిగి
పువ్వుఁబోణులఁ దానుఁ బొత్తుల భుజియించు
మధుర సుధాహారవిధిఁ దొలంగి,
బహువిధ తాన సంపన్న గానంబుల
నిక్కి చొక్కెడు తననేర్పు వదలి
ప్రాణనాయికతోడఁ బర్యంకసీమల
మసలానఁబెనఁగు సంభ్రమము విడిచి
నిద్రపోయెడు సుఖమెల్ల నేలఁగలిపి
ప్రతిదినంబును దాఁజేయు రత్నపూజ
శివునిపై నుండకుండినఁ జింతనొంది
రాత్రి శివరాత్రిగా జాగరమ్ముఁజేసి.*

ఆ. ఇఁక నేనుఁగు మనఃస్థితి యిట్టిది :-

పిడియేనుగుల వెంటఁబడిపోక యడుగని
వెడవిల్తు వేఁడిమి విడుపుచూపఁ
గరమున నుదకంబు కడుఁజల్లుకొనకున్నఁ
దెమలని మిహిరదాహము దొలంగ
సరసునఁజొచ్చి తామరతూండ్లు మెసఁగక
మానని యాఁకటిమంట లార

2. శ్రీ.కా.మా. 2ఆ - 119ప.

సింహపోతములు ఘోషింపఁ బుట్టిన భయా
తంకాగ్ని తహతహఁ గ్రుంక బాఱి
కెట్టి వెట్టలుఁదనమీఁద నెక్కలేక,
పంచబంగాళమైపోవఁ బాణలింగ
పూజనావిఘ్నమునయంగుఁ బుట్టినట్టి
చింతయన్ వెఁకి తను లోనుసేసికొనియె.*

ఆ రెండింటికిని మనస్సు మనస్సులో లేకపోవుటచే ప్రియురాండ్రతో క్రీడలాస లేదు., స్నానపానాదుల దృష్టిలేదు, పంటికి మెతుకతకలేదు. కంటికి కునుకంటలేదు. అంతటిది, వాని యాచింత. మనస్సులో నొక సంకల్పము చేసికొనిన ఒరువాత, నది కార్యరూపము తాల్చువరకు మఱియెట్టి యాలోచనలు చేయక పోవుట నట్లుంచి, నిత్యకృత్యములే నిలిచిపోవుట లోకసహజమగు ననుభవము. అందున తమ యర్చావిధి కాటంకము గల్గించు శత్రుని చూడవలె, వానియంతు చూడవలె,లేకున్న తానంతముకావలె. ఇట్టి చింత రెండింటికి సమమగుటచే నా రెండింటి మనఃస్థితిని సమముగా సీసములందే కావించు కవీంద్రుని పృత్యౌచితీపాలనము, చిత్రణాకౌశలములు వెల్లడి యగుచున్నవి.

4. శప్తుఁడైన నత్కీరుని పయనమునకు మున్ను పొందిన మనఃస్థితి యిది :—

తివిరి యంగమ్మునఁ దిమ్మిరెత్తక మున్న
యొడలెల్ల మచ్చలఁ జెడక మున్న
దళమెక్కి గాత్రంబు చెలువు దప్పక మున్న
బుడుపులు మేననేర్పడక మున్న
యలత విగ్రహమున నంకురింపక మున్న
కాయంబు వెడరూపుగాక మున్న

* శ్రీ.కా.మా. 2ఆ - 126ప.

తనుపుర(జీము రక్తములు గారక మున్న
దేహమీ(గలు మూ(గి తినక మున్న
భైక్ష మనుగం( బోయినపట్ల జనులు
చూడ రోయకమున్న కాలాడినపుడు
నడువ లే( గాక కైలాసనగము( జూడ
హరుని వాక్యంబు శక్యమే పరిహరింప,[1]

కష్టవ్యాధి భయంకర స్వరూపమును మనస్సులో దల(చినంతనే యొడలు గగుర్పొడిచి, భయమావరించుకొనును. వ్యాధిపీడితమైన శరీరస్వరూపము మహా బీభత్సముగానుండును. ఆసిట్టి భయంకర వ్యాధికి పూర్తిగా లో(బడక ముందే పయనము సాగింప వలయుననియు, లేకున్న తా నశక్తు(డగుటయేకాక, తనను(జూచిన జనము ఏవగించుకొనుననియు పట్టిమొత తన జీవితము దుర్భర మగుననియు( దలపోయునప్పటి సత్కివుని మనఃస్థితి చిత్రణమే యిది.

ఇట్టి మనఃస్థితి చిత్రణము కాశీఖండమందలి శివశర్మ కథయందును గలదు.

పొడిదగ్గు కంఠంబు(బొరిపుచ్చకయ మున్న
తల ప్రకంపంబు( బొందకయు మున్న
బొమలు కన్నులమీ(ద(బొదివి వ్రాలక మున్న
పరనేత్రముల కడ్డుపడక మున్న
.... .... .... ....[2]

ధూర్జటి కవీంద్రు(డు తన శతకమున నీ భావమునే స్మరియించినా(డు.

దంతంబుల్పడనప్పుడే, తనువునం దారూఢి యున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే

1. శ్రీ.కా.మా. 3ఆ — 177ప.
2. కా.ఖం. 3ఆ – 85ప.

వింతల్మైన జరింపనప్పుడే కురులెల్లెల్ల గానప్పుడే
చింతింపన్వలె నీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా !

దాశరథీశతకములో కంచెర్ల గోపన్నయు నిట్లే వ్యథఁజెందినాఁడు.

మనమున నూహాపోహలు మర్వకమున్నె కఫాదిరోగము
ల్దనువున నంటి మేను బిగి దప్పకమున్నె నరుండు మోక్షసా
ధన మొనరింపఁగా వలయు దత్త్వవిచారము మానియుండుట
ల్తనువునకున్ విరోధమిది దాశరథీ ! కరుణాపయోనిధీ !*

ఆంధ్రకవి ధూర్జటి కథానిర్వహణమునకుఁ బ్రాణమైన పాత్రనిర్మాణమున నెంత కౌశలము, వైదగ్ధ్యములు వెలార్చెనో పరిశీలించితిమి. రసాస్వాదన కాధారమైన 'పాత్ర' నిర్మాణమున పాత్రపోషణ, పాత్రచిత్రణములను రెండురీతుల తన పోషణచిత్రముల యందలి నైపుణ్యమును గమనింపగలిగితిమి.
వానివాని స్వభావోచితమగు పరిష్కారములు జరిపి పాత్రపోషణము గావించియున్నాఁడు. నాసిమిండజంగముల కల్పితపాత్ర సృష్టివలనను, నత్కీరుఁడు, వేశ్యాతనయలు అను పాత్రలకు క్రొంగ్రొత్త మెఱుఁగులు దిద్దుటవలనను, ధూర్జటికవీంద్రుఁడు పాత్రచిత్రణము గావించెను.

మన ప్రబంధమున 'సరస్వతీబ్రహ్మలు, పార్వతీపరమేశ్వరులు, శ్రీకాళహస్తులు, తిన్నఁడు కిరాతార్జునులు' అనునవి పూర్వప్రసిద్ధములగు పాత్రలు.

ఆయా పాత్రలాయా సందర్భములందు ఒక్కొక్క సంఘటనకు విక్రియఁ బొందుటయు, లేక కథాసందర్భమున వానివానికి గల ప్రాముఖ్యములను బొందుటయు నా యా పాత్రము లా యా ఘట్టములందు చలదచలావస్థలయందా యా కాయికమానసికములగు నవస్థలఁబొందుటయు సర్వము సమ్మేళనముంది చక్కని పాత్రనిర్మాణము జరిగినది.

* * *

* దా.శ. ప. 79 (ప్రచురణ – 1924)

# వర్ణనా వైయాత్యము

**వర్ణనము:-**

కనుల కింపుగొలుపు రంగులవలెనే కథాంశమునకు వలయు వాతావరణమును **కల్పించునది** వర్ణనము అనఁబడును. కథయెడల సహృదయుని సుముఖుని చేయుటకై **సృజించు** వాతావరణము వర్ణనమనఁబడును. వర్ణనలవలన కావ్యమునకు గలుగు ప్రయో**జనము**లను ప్రధానముగ నీ క్రింది విధముగా భావింపవచ్చును.

1. సహృదయులకు నీరస సన్నివేశములందలి వైముఖ్యమును తొలగించి, రక్తి వంతములైన వానియెడల సౌముఖ్యము కలిగించుట. వర్ణనలు రక్తిలోప పూరకములే కాక రక్తి నినుమడింపఁజేయఁ గలిగియుండును.

2. రసపోషణ కుద్దీపనము కలిగించుట.

3. కవికిఁగల ఊహాశాలిత, పాండిత్యముల ప్రదర్శనమున కనువైన స్థానములగుట. 'ప్రజ్ఞా నవ నవోన్మేషశాలినీ ప్రతిభా మతా తదను ప్రాణనా జీవేద్వర్ణనా నిపుణః కవిః' అని భామహుఁడనుటయు, 'లోకోత్తర వర్ణనా నిపుణ కవికర్మ కావ్యం' అని మమ్మటాచార్యులనుటయు, నిట్టిదే. వర్ణనావిహీనమగు కావ్యము పేలవము, నీరసమునై యుండును. రసపుష్టికిఁ దోడ్పడుచు, పూర్వరంగ ప్రకల్పనము కావించుచు, కవికిని, కావ్యమునకును మెప్పుగలిగించునవి, యొప్పుఁగూర్చునవి వర్ణనలు. కావ్యసౌందర్యాపాదహేతువులలో వర్ణనలొకటి.

ప్రౌఢకవులు కథాంశ స్వభావనిరూపకములుగ నీ వర్ణనలు గావించియున్నారు. కథాగమనమునకు కంటకములుగాకాక, దోహదము కలిగించుచు నాహ్లాదకరములుగా వర్ణనలు చేయుట ప్రతిభావంతులగు కవుల యాచారము. కేవలము వర్ణనలను తమ పాండితీప్రకర్షను ప్రదర్శించుటకు గరిడీసాములుగా నుపయోగించుకొని విసుపుజనింపఁ

జేయు కవులును లేకపోలేదు. కలములు ఝళిపించి కవాతు కసరత్తులకు గరిడిసాలలుగా వర్ణనలు చేసినవారును కలరు. కథాసందర్భమున కవసరమున్నను లేకున్నను ఒక నియమముగా గ్రహించి అష్టాదశవర్ణనము తప్పక యుండితీరవలసినదే యని యెవరును చెప్పియుండలేదు. వస్తుస్వభావమును బట్టి కొన్నివర్ణనలకు తావుండనేయుండదు. అవసరమును బట్టి క్రొత్త వర్ణనములు కొన్ని చేరవచ్చును. విధిగా నన్నింటిని చేర్చి కావ్యముచెప్పుట భావదౌర్బల్య మనవలసినదె యుండును. ఈ భావదౌర్బల్యము నవ యాంధ్రకవి ధూర్జటికి లేదు. 18, 22, 32లను సంఖ్యతో నిమిత్తములేక, కథాగమన మున కడ్డునిలువని రీతిని, సందర్భమునకు మెఱుఁగులుపెట్టుతీరున ధూర్జటి కవీంద్రుఁడు సంఖ్యలో నెక్కువగనే వర్ణనలుగావించి యున్నాఁడు. అతని వర్ణనలు కథాస్వభావాను గుణముగను రసోద్దీపకముగ నలరారుచున్నవి.

ప్రబంధములందష్టాదశవర్ణనములుగాఁ దేర్కొనఁబడినవి యివి :

కావ్యాలంకారసంగ్రహము : పుర సింధు నగర్త్వన శశి
సరసీ, వన, మధు, రతిప్రసంగ, విరహముల్
పరిణయ, తనయోదయ, నయ
విరచిన, యూ, త్రాజి, దౌత్య, విభువర్ణనముల్.[1]

ప్రతాపరుద్రీయమున దౌత్యస్థానమున దూత్యకము, మధుస్థానమున 'మధుపానము'లున్నవి.

సాహిత్యదర్పణకారుఁడిట్లుచెప్పెను :-

సంధ్యా, సూర్యేందు, రజనీ, ప్రదోష, ధ్వాంత, వాసరాః
ప్రాతర్మధ్యాహ్న, మృగయా, శైల, ర్తు వన సాగరాః
సంభోగ విప్రలంభౌచ ముని, స్వర్గ, పురా ధ్వరాః
రణప్రయాణోపయమ మంత్రపుత్రోదయాదయః[2]

1. కా.సం. 2 అ - 166ప. (పుట-233)
2. కా.సం.పు. - 234

అప్పకవి వర్ణనలు 22గా నలికియున్నాఁడు :

1 పురము, 2 షడృతువులు, 3 ప్రయాణము, 4 శైలము, 5 వేఁట 6 సాగరము, 7 మౌనీంద్రపుణ్యాశ్రమము, 8 మంత్రము, 9 దూతము, 10 రణము, 11 విజయము, 12 మద్యపానము, 13 వనవిహారము, 14 జలకేళి, 15 కన్యాంగసౌందర్య వర్ణనము, 16 చంద్రోదయ 17 సూర్యోదయములు, 18 విప్రలంభము 19 పరిణయము, 20 సురతము, 21 సౌహృదము, 22 సుతజననములు.

అలంకారశేఖరకారుఁడు :

1 రాజు, 2 రాణి, 3 దేశము, 4 గ్రామము, 5 పురి, 6 నది 7 సరస్సు, 8 అబ్ధి, 9 అరణ్యము. 10 ఉద్యానము, 11 అద్రి, 12 రణము, 13 ప్రయాణము, 14 గుఱ్ఱము, 15 ఏనుఁగు, 16 సూర్యోదయ, 17 చంద్రోదయములు, 19 వివాహము, 20 స్వయంవరము, 21 సురాపానము, 22 పుష్పాపచయము, 23 జలకేళి, 24 సంభోగము, 25 విప్రలంభము, 26 మృగయ, 27 ఆశ్రమము, 28 కళలు, 29 ఋతువుల వయస్సుయొక్కయు సంధులు, 30 ధాతు, 31 వృక్ష, 32 అభిసారికలు, అనువానిని పేర్కొనెను.*

శ్రీకాళహస్తి మాహాత్మ్యమున కవి ధూర్జటి కావించిన వర్ణనములు దరిదాపుగా నలుబది కానఁబడుచున్నవి. నాలుగైదు మాత్రము సూచ్యములుగా నున్నవేగాని, మిగిలిన వన్నియు స్పష్టముగా ననుకూర్పఁబడినవే

1. పురవర్ణన :- పట్టణము, ప్రాకారము, చాతుర్వర్ణ్యము, కామినీజనులు, ఏనుఁగులు, గుఱ్ఱములు. 2. ఋతువులు, 3. ప్రయాణము, 4. శైలము, 5. వేట, 6. సాగరము, 7. ఋష్యాశ్రమము, 8. రణము, 9. మద్యపానము, 10. వనవిహారము 11. కన్యాంగసౌందర్యము, 12. చంద్రోదయము, 13. సూర్యోదయము, 14. సురతము, 15. సౌహృదము, 16. సుతజననము, 17. ప్రభు, 18. చీఁకటి, 20. వెన్నెల, 21. చంద్రాస్తమయము, 22. సూర్యాస్తమయము, 23. నది 24 సరస్సు, 25 దుర్భిక్షము, 26. భూతము, 27. ఆటవిక జీవనము, 28. బాల్యక్రీడలు, 29. ప్రాతర్వేళ, 30. సూర్యాస్తమయచంద్రోదయము, 31. నక్షత్రములు. 32. చంద్ర

---

* కా.సం పుట – 234

బింబము శివలింగము, 33. వృక్షములు, ((1) మఱ్ఱి (2) చీఁకటిచెట్టు) 34. మంత్రము, 35. పరిణయము, 36. విప్రలంభము, 37. జలకేళి 38. ప్రభాతము.

38-48 వఱకున్న అంశములందు తుదియంశము తక్క, తక్కినవి సూచనమాత్రములుగ నున్నవనవచ్చును.

వర్ణనలు సంఖ్యలో మిక్కుటముగ గన్పించుచున్నను, కథాంశము నెప్పుడు నాటంకపఱచునవిగాలేక, కవిప్రతిభ కల్పనాశిల్పములకు, కవిత్వతత్త్వములకు, వ్యక్తిత్వమునకు తార్కాణములుగా వెలుఁగొందుచున్నవి.

ఈ అన్ని విధములయిన వర్ణనములందును ధూర్జటి సాధారణముగా ప్రబంధకవులు వర్ణించినట్లు రూపకోత్ప్రేక్షాలంకారములచేతనే యలంకరించినను, వానిని ప్రతిపాదనమున నొక్కొక్కచో వైశిష్ట్యమును ప్రదర్శించి యొకవిశిష్టస్థానము నాక్రమించి యున్నాఁడు.

## 1. పురవర్ణనము :

సర్వసాధారణముగా పురవర్ణనమున కోటగోడలు, అగడ్తలు, ఉద్యానవనములు కొండలు, చాతుర్వర్ణ్యములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు. సతీజనాదులు చమత్కారముగ రూపకోత్ప్రేక్షాద్యలంకారములతో వర్ణించుచుండగ ధూర్జటికవీంద్రుఁడు తన ప్రబంధమున నీ పురవర్ణనము మూఁడు తావుల నొనరించి యున్నాఁడు. శ్రీకాళహస్తి పురము, మధురాపురము లీ చోటుల వర్ణనములైనవి.

అ. శ్రీకాళహస్తి పురవర్ణనము : తన యిష్టదైవమగు శ్రీకాళహస్తీశుని పట్టణమును ధూర్జటి శివపారమ్య ముట్టిపడునట్లు రూపొందించియున్నాఁడు.

పట్టణము, వాడలయందలి కుడ్యములు, ప్రాకారము, పురజనులు, చాతుర్వర్ణ్యముల వారు, కామినీజనులు, దంతావళకోటి, తేజు లన్నక్రమమున వర్ణించియున్నాఁడు కవి.

పట్టణము : అమృతలింగాకరమైయున్న శ్రీకాళహస్తిపురము సౌఖ్యసంపత్తిసాధక జననివాస మయినట్టిది. అయిన సౌఖ్యసంపత్తి యెట్టిదో పరికించిన ధూర్జటి రాజయోగ దృష్టి, ఆధ్యాత్మికములు వ్యక్తములగుచుండును.

సంసార పారదోచ్చాటనానలకీల
కలుషసంచయ తామ్ర గంధకంబు
కామలతా మూల కందకుద్దాలంబు
సంకల్పపాషాణ టంకముఖము
రాగశాలి వనాంకుర కడంగరీయంబు
శంకాకళంక భుజంగ నకులి
నవమనోగోరాజ నాసికా రజ్జువు
కోపనేక్షణ విశిఖోపలంబు.
దివ్యదేశిక హంసోపదిష్ట మార్గ,
నిర్గుణధ్యాన సంధాన నిరుపమాన
సౌఖ్యసంపత్తిసాధక జననివాస
మమృతలింగాకరము కాళహస్తిపురము.

వైషయికవైముఖ్య దృష్టికితోడు, కవీంద్రునకుఁగల లోకజ్ఞత, శాస్త్రజ్ఞతలు తెలియఁ గలవు. పాదరసమున కగ్ని, తామ్రమునకు గంధకము, లిత్యాదులాతని శాస్త్రజ్ఞతను తెలుపుచున్నవి. దివ్యదేశికహంసోపదిష్టనిర్గుణధ్యాన సంధానమున నాతఁడందిన నిరుప మాన సౌఖ్యసంపత్తి కా కాళహస్తీశుఁడే మూలకందమనెడు నంశమును తెలియుచున్నాము.

**వాడవాడలందలికృత్యములు** : ఆ పురమందలి వాడవాడలందలి కృత్యములు సంపదున్నతిని చాటచాలినవని పల్కుటయందును ధూర్జటి కుమారస్వామి నామస్మరణ మును గావించుటఁ గాంచఁగలము.

---

* శ్రీ.కా.మా. 1ఆ - 17ప.

ఆడంజిత్రము, వాడవాడ ఘనకుడ్యస్వర్ణ రత్నద్యుతుల్
చూడంజూడఁగ షణ్ముఖీకరణ తేజోరూఢిఁజిత్రేక్షణ
క్రీడాదుస్తరమార్గసౌఖ్యరసవార్ధిం దేల్చుఁదత్పట్టణ
క్రోడక్షోణినటన్న నవ్యపురముల్ గొండాట కర్హాంబులే. [1]

ఆ గోడలందు తాపఁబడిన రత్నముల కాంతులయందు చూచినవారి ప్రతిబింబములు ఆఱుగాగన్పట్టునను ఆద్భుతమును పలుకుచునే, తాను కావ్యాదియందు చేయని షణ్ముఖస్తుతి నీ విధముగా గావించుచున్నాఁడనిపించును. చిత్తమునకు గాని, చూపులకుఁగాని అందని దివ్యానుభూతి యిది.

ప్రాకారము :

అతులైశ్వర్య పరంపరావిలసితం బెసట్టి తత్పట్టణ
ప్రతిబింబంబునఁ జంద్రకాంత రచిత ప్రాకారమొప్పారు న
ద్భుతమాయా బహువిభ్రమ భ్రమితవస్తువ్రాత లోకోదయ
స్థితి లోఁగొన్న శివుండనంగ, హృదయాచింత్యప్రభావంబునన్ [2]

చంద్రకాంత శిలలచే నిర్మితమైన యీ పురప్రాకారమున, పట్టణమందలి సమస్త వస్తు సముదాయమును బ్రతిబింబించుట చూడగా, సర్వలోకములను తనలోఁబ్రతిఫలింప చేయుచున్న శివుఁడా యనిపించుట యింతలి యందము. దీనిచే పురప్రాకారౌన్నత్యమును బలికినట్లయినది. ప్రాకారమెంత యెత్తుగా నున్ననేకాని, పట్టణమందలి సర్వ వస్తుజాలమును ప్రతిఫలింప జేయజాలదుకదా! అంతియేకాదు. ఇచ్చట మఱియొక మహార్థమును

1. శ్రీ.కా.మా. 1ఆ– 18వ.

2. శ్రీ.కా.మా. 1ఆ – 19వ.

ధ్వనింపఁజేయఁబడుచున్నదనవలె. ప్రాకారము తెల్లగానుండుటయు, "వ్యోమకేశి" యగు శివునితోఁబోల్పఁబడుటయు వలన నది యత్యున్నతమైన దనునంశ మది.

**పురజనులు :** ఆ పురవాసులు కైవల్య సంభోగాపేక్షులు, అపవర్గరమాకాంక్షులు వారియందుత్తమ మధ్యమాధమత్వములు లేవు. ఎల్లరు సట్టివారే. విహారవ్యాహారములందు ఇతర పురములందలి జనులకు శ్రీకాళహస్తి పురజనులు భిన్నులుగాఁ గన్పట్టుచున్నారు. ఇచ్చటి జనులు, వసనములు, ప్రవాసులు, ఆసనములు లేవంశృంగారప్రధానములు గాక, యవి మోక్షసాధనములుగా నుండుట చిత్రముగదా! కవియె యచ్చటి ప్రజల యీ తీరుఁగాంచి "ఎటనవులకెందుం గాన మీ చిత్రముల్" అని ముక్కుపై నంగుళి నుంచికొని యట్లున్నాఁడు.

ఎలదోటల్వాసము, ల్వ్యధమాకుచముల్ప్రద్రింద్రదంబు, లాకంటికిన్
ఫలముల్వాతెర, లంగజాగమకళాబంధంబు లిచ్చాసనం
బులు, కోపంబునఁబాయుటల్ తపము, సంభోగంబు కైవల్యమం
దుల లీలారతినుండు మాఁనవుల కెందుంగాన మీ చిత్రముల్[1]

కైవల్య మపేక్షించువారు అరణ్యములలో కొండలనడుమ ఫలములాహారముగాఁ గొనుచు వివిధాసనములపై నుండి తపమాచరింతురు. పురజనుల శృంగార చేష్టలనీ కైవల్యసాధనములుగా రూపించుట, కవి ధూర్జటియొక్క వ్యక్తిత్వములోని శాంత, శృంగారములు రెండింటి సహవాసమును సూచింపఁజాలి యున్నది. ఇచ్చట శృంగారాంగములను శాంతాంగములుగాఁబలుకుట, దసనమ్మేళనమున గనికిఁగల కౌశలము తెలియఁగలదు. తాను చిత్రింపఁబోవు శివభక్తులలో ఉత్తమ మధ్య మాధమత్వములు[2] లేవనుట, కథాగతపాత్రసూచనమో యన్నట్లు

---

1. శ్రీ.కా.మా. 1ఆ - 21ప.
2. శ్రీ.కా.మా. 1ఆ - 22ప.

జనలోకోన్నతమైన తత్పురము 'దూ,చా' తప్పకుండంగ వ
ర్ణనసేయన్ వశమౌనె కీటమునకైనం, జక్రికైన, స్మదాం
ధునకైనన్ ; బహుజీవహంతకయునన్, దుర్వాసనల్ బాసి మో
క్షనిధిం గొల్లగొనంగ వచ్చునట, పై జాడల్విలోకించినన్.[1]

ఆ పురమాహాత్మ్యము వర్ణింపతరముగాదనుచు, సర్వప్రాణికోటికిని దుర్వాసనల్ బాసి, మోక్షనిధి ననుభవింపఁగల యవకాశములను గల్పించునట్టి దా పట్టణమని పలికి పూర్జటి యిందు రమణీయార్థములను రెండింటిని నిక్షిప్తమొనర్చెనా యనిపింపఁగలదు.

1. కథా సందర్భమునఁ బ్రతిపాదింపబడుచున్న శ్రీకాళహస్తులయిన చెలఁది పురుగు, పాము, ఏనుఁగు, తిన్నఁడు, అను వారలు మోక్షనిధిని గొల్లగొనినారను నర్థము.

2. ఆ పురమాహాత్మ్య వర్ణనము కావించుటకు ఆదిశేషునకైన, విష్ణునకైన, బ్రహ్మకైన, రుద్రునికైన, శక్యముగాదను చమత్కారము లింటు శ్లేషచే వ్యంజింపఁ జేయుచున్నాఁడు కవి.

| | | |
|---|---|---|
| కీటకము | — | చెలఁది పురుగు, ఆదిశేషుఁడు. |
| చక్రి | — | పాము, విష్ణుఁడు. |
| మదాంధుడు | — | ఏనుఁగు, కామాంధుఁడగు బ్రహ్మ[2] |
| జీవహంత | — | బోయఁడగు తిన్నఁడు, రుద్రుఁడు. |

పాము అను నర్థమున 'పురుగు' అనునది వ్యవహారసిద్ధము. 'పురుగుపుట్ర' 'పురుగూ బూచి' ఇత్యాదులం దీ యర్థము గలదు. పురమును వర్ణింపశక్యము గాదను నర్థమున నీ రెండవ యర్థమును సమన్వయించుకొన నగును. "వర్ణన సేయన్ వశమౌనె కీటమునకైనం, జక్రికైన, స్మదాంధునకైన, బహుజీవహంతకయునన్" అను నట్లును, దుర్వాసనల్ బాసి మోక్షనిధిం గొల్లగొనంగవచ్చు నటనను నర్థమున 'కీటమునకైనం జక్రికైనస్మదాంధునకైన బహుజీవహంత కయునన్ దుర్వాసనల్‌బాసి మోక్షనిధింగొల్లగొనంగ

1. శ్రీ.కా.మా. 1ఆ – 22ప.
2. శ్రీ.కా.మా. 1ఆ – 20ప.

వచ్చినట' యను నన్వయమును గ్రహింపఁదగును. అన్వయమునఁగల చమత్కారమిది,

చాతుర్వర్ణ్యములవారు : పురమందు వసించు నాలుగువర్ణములవారిని వర్ణించుట ప్రబంధ సామాన్యమే. కాని యిచ్చట ధూర్జటి తన యధ్యాత్మభావపరంపరను శ్లేషానుప్రాణితమైన యథాసంఖ్యాలంకారమున గ్రుచ్చి నేసినాఁడు. వారివారి ధర్మములను రాజయోగైక సామ్రాజ్యసాధనములుగ శ్లేషించియున్నాఁడు.

నైజంబులగు నిత్యనైమిత్తికంబులు
  నను పుచో బ్రహ్మార్పణంబు సేసి
సంగరహిత బుద్ధి శాంతనవ స్ఫూర్తి
  వైరివర్గంబు సంహారమాడి
ప్రబలమహార్థ ప్రభాసమాన స్థితి
  కోశంబులుం బెడి కొలఁదు లరసి
యాతపశీతవాతాదుల సమముగా
  నాత్మప్రయత్నంబులందుఁ దలఁచి
సంచరింతురు బ్రాహ్మణ క్షత్ర వైశ్య
శూద్రులప్పీట సంతత భద్రహృదయు
నిరుపమానంద విహరణోన్నిద్రులగుచు
రాజయోగైక సామ్రాజ్యరతులభఁగి. *

| | | |
|---|---|---|
| సంగరహిత, సంగ రహిత | } | అను తావుల సంభంగశ్లేషయు |
| శాంతనవ, శాంత నవ | | |

తదితరములయిన తావులయందు నిత్యనైమిత్తికంబులు, బ్రహ్మార్పణము, వైరివర్గము మహార్థము, కోశంబులు, ఆతపశీతవాతాదులను నెడల నభంగ శ్లేషముఁ గలదు.

* శ్రీ.కా.మా. 1ఆ - 28ప.

ఆయా ధర్మములను క్రమముగాఁ బలుకుటయందు యథాసంఖ్యమను నలంకారమును గలదు.

**కామినీ జనులు :** యోగిజనములతోఁ బోల్చుచు కామినీ జనులను వర్ణించుటయు శ్లేషాధారముగ గావించియున్నాఁడు కవీంద్రుఁడు.

పరిచిత బంధనైపుణిఁ, నపార కళానుభవప్రసక్తి నా
దరస వివేకసంపద సదాశుకవాక్య సుధానుభూతి మో
హరహిత వృత్తిఁ బ్రస్ఫుర దనంగరహస్య విచారబుద్ధి న
ప్పురమునఁ గామినీజనులు పోల్తురు యోగి జనంబు పోలికన్[1]

ఇందలి శ్లేష అభంగమయినది. బంధ, కళ, నాద, శుక, మోహ, అనంగ శబ్దములచే కామినీ జనులకు యోగిజనులకు నభేదప్రతిపత్తిచే నుపమానము పలికెను.

**ఏనుఁగులు :** ఆ పురమందలి యేనుఁగులు అవధూతలతోఁ బోల్పబడినవి.

అరగంటం గనుగొంట, మందగతిఁ, బూర్ణాహంకృతం, బ్రార్థనా
కర భుక్తిస్థితి, ముక్తలోక భయశంకావృత్తి నున్మత్తన
వ్యరతి, న్సత్వసమగ్రత, న్మదోదిత పద్మాభ్యున్నతి, న్గంధ మం
ధర దంతావళకోటి యొప్పు నవధూత ప్రక్రియం దత్పురిన్.[2]

అవధూత స్వభావము గంధగజేంద్రస్వభావముతో సరిపోల్పఁబడినవి.

**గుఱ్ఱములు :** గుఱ్ఱముల వేగము మనోవేగమును గూడ మించినదను నర్థమున నా పురమందలి మానవులు తమ మనోచాంచల్యమును కోల్పోయి స్థిరత్వము నందినవారుచుఁ గ వివారు నిశ్చలులై మోక్షసౌఖ్యమునుఁ బొందగల్గుచున్నారని తెలుపుటయైనది. గుఱ్ఱముల వేగమును గెలువలేమని మానవుల మనస్సులు చంచలత్వమును మానుకొనెననుట యిందలి చమత్కారము.

---

1. శ్రీ.తా.మా. 1 ఆ – 24 ప.
2. శ్రీ.తా.మా. 1 ఆ – 26 ప.

ఆ పురి తేజుల వేగ
వ్యాపారము గెలుననోప మను సిబ్బితిఁబో
చాపలవిరహిత సౌఖ్యం
బాపాదించుకొను మానవావళి మనముల్.*

పైన పేర్కొనిన విధముగా పేసుఁగులు, గుణములను వర్ణించుట పట్లను కవి ధూర్జటి అవధూతము, మోక్షార్థులయిన వారి నిశ్చలతత్వమును దోల్చుట చూడ, ప్రతిపద్యము యందన్ని యెడలను తనకుగల శివపారమ్యమును, ఆధ్యాత్మిక తత్వమును వెలార్చు వాఁడని తెలియఁగలము.

ప్రబంధసామాన్యమగు పురవర్ణనమునకు, ధూర్జటి కావించిన పురవర్ణనమునకు గల వ్యత్యాసమును, ధూర్జటి విశిష్టతను గమనించితిమి

ఆ. మధురాపురవర్ణనము :

మధురానగరము హాలవాయి చొక్కనాథుని నివాసభూమి.

కపట చతుష్షష్టిగతుల నాడిన హాల
వాయిచొక్కశు నివాసభూమి
యతని పట్టపుదేవియైన మీనేక్షణా
ధరతనూభవకుఁ బ్రధానగృహము
ద్రవిడభాషాపీఠతల శంఖఫలకంబు
గల కనకాబ్జపుష్కరిణి కిరవు
దక్షిణాంబుధి వధూతామ్రపర్ణినది
నవతు వైఘను నెన్నఁజాలు నునికి

* శ్రీ.కా.మా. 1అ_25ప.

నిజదృగబ్జ ప్రపూజిత నీలకంఠ
కూడలళఘుయ వైకుంఠ కుఠితాఘ
నిఖల సంపత్పరంపరా నిహిత కింప
చాన తాపంబు మధురాభిధానపురంబు.*

శ్రీకాళహస్తి పురమున వలె నిచట పురవర్ణనము జరుగుచున్నను విశేషమొకటిగలదు. ఈ పురవర్ణనము చేసిన పద్యమందలి యంశములన్నియు కథా సందర్భములను సన్ని వేశములను సూచించునవియై సాభిప్రాయములగుచునే ప్రయుక్తమైనట్లు గ్రహింపగలము.

ఇది తృతీయాశ్వాసమునందలి రెండవభాగము. ఇందు నక్కీరుని కథరానున్నది. దాని యా యితివృత్త సంఘటనములను సూచించు విశేషములే యిచ్చట ప్రయోగింపఁ బడినవి.

1. బ్రాహ్మణరూపమున బ్రాహ్మణుని రక్షించుటకునై పాండ్యుని కొలువు కూట మునకుఁబోవుట, నక్కీరునితో వాదులాడుట, శపించుటయు సుందరేశుని(చొక్కనాథుని) అఱువదినాలుగు లీలలలో నొకదానిని మొదటిపాద భావమట్టానిని సూచించుచున్నది.

2. పట్టపుదేవి మీనాక్షి ప్రస్తావనము కూడ నట్టిదే. నక్కీరునితో వాదమునకులుట కును బ్రాహ్మణునకు చెప్పిపంపినట్టి పద్యము యొక్క భావము, నక్కీరుఁడు ప్రశ్నింప పరమేశ్వరుఁడంగీకరించినట్టియు నైన గిరితనయా కచభారంబు సహజగంధంబను ప్రసక్తిని సూచించె. ఆ వర్ణనమే నక్కీరుని కథ కాయువు పట్టనఁదగినది.

3. కంఠఫలకము : 'వివిధవన్యప్రాయవాగ్గుంఫ సంపత్కావ్యప్రతిపాదక ప్రతిఫలకు నక్కీరాది కవీంద్రులకు సంద్రెండుగురకు నిలయమైన పీఠముగా బలుకఁ బడినున్నది.

4. కనకాబ్జపుష్కరిణి . నక్కీరుఁడు ఒక్కయాత్రలో గాంచిన సరస్సును, కుమార స్వామి నక్కీరుని మునకవేయుమని పలికిన సందర్భాలనును స్ఫురింపఁజేయును.

---

* శ్రీ.కా.మా 3ఆ—131 ప.

5. నదుల ప్రసంగము :— తామ్రపర్ణి, వైఘలను నదులను పలుకుటచే సత్కీరుఁడు కావింపఁబోవు తీర్థయాత్ర, అందున కావేరి, గంగ, పెన్న, గుండ్లకమ్మ, కృష్ణవేణి గౌతమీగంగ, మున్నగు నదుల నవగాహ మొనర్ప నున్నాఁడను నంశమును సూచించుట యైనది.

6. దృగబ్జపరిపూజితనీలకంఠ :— ఈ ప్రసక్తిచే ధూర్జటి మూఁడు విశేషములు దెలిపినట్లగుచున్నది. నిటలాక్షుఁడనని తెలిపి సత్కీరుని భయపఱచుటయు, నిటలనేత్రుఁడయినను భయపడని నత్కీరుఁడు శప్తుఁడగుటయు సూచించుటయొకటి. ఆశ్వాసాద్యంతములందు గత, అనాగత కథాంశములను సూచించునట్లు తృతీయాశ్వాసమున మొదటి భాగమున చెప్పిన కన్నప్ప కన్నిచ్చిన వృత్తమును గుర్తు చేయుట రెండవది. ఇఁక విష్ణుఁడు కన్నర్పించి శివుని మెప్పించుటయును నంశమును బలుకుటచే శివాతిశాయిత్వము బలుకుట మూఁడవది.

౭. వేశ్యాతనయల కథలోని మధురాపురము :—

ఇందలి మధురాపురమున నివసించు వారు మీనాక్షీ సుందరేశ్వరులే. ఇచ్చట పుర వర్ణనము ప్రబంధసామాన్యముగా రాజుల పరాక్రమము, కోటగోడల యౌన్నత్యము, అగడితల లోతుపాతులు, సౌధముల కాంతులు వర్ణింపఁబడినవి.

రాజులు వీర ఘోరాజులలో వల
రాజు తోడురు జయరతికి ననఁగ ...[1]

సర్వము లక్ష్మీనిలయములై పెంజిల్లుచున్నవట

శ్రీవనజాక్షికిన్ జననసింధువు, తత్పరి బొమ్మగింపు నా
నావసథంబు, లాస్యపథ లంబుజలోచన, లాటపల్లు, ధా
త్రీవరమార్గముల్ రథ హరిద్వారదాదులు బొమ్మ, లాడు ని
చ్చావచనావళుల్ నిగమశాస్త్రములై విలసిల్లు నెప్పుడున్.[2]

1. శ్రీ.కా.మా. 4అ - 3ప.
2. శ్రీ.కా.మా. 1ఆ - 4ప.

ఆ పురమందలి యిండ్లు, స్త్రీలు, రాచబాటలు, రథ, గజాశ్వాదులు, శాస్త్రములు, అన్నియు లక్ష్మీనిలయములే యనుటచే నా పురము సకల సంపత్సమేతమేనని పల్కెను. తరువాతి పద్యమున ధూర్జటి కథా సందర్భమును సూచించుచున్నాడు.

ధరణికిఁ గంఠ భూషణము తన్నగరంబు, తదీయమస్తకా
భరణము పార్థివాన్వయము ప్రాణము దానికి రాజనందనో
త్కరము, తదాత్మకున్ మదనదాహరసప్రదసైశ్య వీథి, త
త్సరసిజలోచనల్ గుఱుతు చక్కదనంబు వారిలోపలన్.[1]

ఇందలి యంశములొకదాని కంటె నొకటి యుదాత్తము, ఉత్కృష్టమనని వర్ణింపబడినది. ఆ పురమే భూమికి కంఠభూషణముగాగ, దానికి తలమానికమైనది అందలి రాజవంశము. ఆ రాజవంశమునకు రాజనందనులు ప్రాణమువంటివారు. వారికి గలుగు మదన తాపమును పోగొట్టజాలిన వారా నగరమందలి వేశ్యాజనము అనగా అంతటి ప్రాముఖ్యము కలిగిన వేశ్యలయొక్క, అంతటి అందెగత్తెలయిన వేశ్యలయు నివాసస్థానమైన యీ పట్టణమున, "ఉలిముట్టని లింగము"లయిన యిరువురు వేశ్యాతనయుల "సుకవి వధూభుజంగుడే" తమకు భుజంగుడని వేశ్యాధర్మమువోసిన వారి కథ చెప్పబడనున్నది కాన పురవర్ణనమున వేశ్యలకంటె ప్రాముఖ్యమిచ్చుట సంభవించిన దనిపించుచున్నది.

ఈ విధముగా ధూర్జటి తన ప్రబంధమును మూడు తావులందు పుర వర్ణనము గావించియున్నాడు. మధురాపురవర్ణనమున్న రెండుతావులయందు నాతని కథను బట్టి,వర్ణనవైఖరి మెఱయుచుండగా, మొదటి శ్రీకాళహస్తి పురవర్ణనమున కవి ధూర్జటి కవిత్వము, వ్యక్తిత్వము, రెండు నొకదానిలో నొకటి కలిసిపోయి, ఒకదాని కొకటి బలమై వెలసినదని చెప్పనొప్పును.

మధురాపురవర్ణనము రాయల ఆముక్తమాల్యద,[2] జక్కన విక్రమార్కచరిత్ర[3] ధరణిదేవుల నాగయమాత్యుని దశావతారచరిత్రముల[4] యందును గలదు. జక్కన 44

---

1. శ్రీ.కా.మా. 4ఆ - 5ప.
2. ఆ.మా. 2ఆ - 3ప.
3. వి.చ. 1ఆ
4. ద చ. 9ఆ

పద్యములందు వర్ణించియున్నాఁడు, ఆ పూర్వవర్ణనము లేవియు ధూర్జటి పురవర్ణనము వలె విశిష్టమైనవికావు. ప్రథమాపసామాన్యముగనున్నవి. ధూర్జటి కావించిన రెండు చాపులయందలి మధురాపురవర్ణనము కథాసందర్భమున కనురూపముగ, పూర్వరంగ ప్రక్రియగ. దివ్యముగా నున్నది. కథలో ఒక అంగముగా, ప్రవేశికగా నలరారినది మధురాపురవర్ణనము,

## 2. శైలవర్ణనము :-

'శ్రీకాళహస్తి మాహాత్మ్యము'న శైలవర్ణనము మూఁడు చోటుల గాన్పించును, అందు దక్షిణకైలాసమను 'జముదెనకొండ', భైరవాద్రి, ఉత్తరకైలాసనగములు వర్ణింపఁబడినవి.

దక్షిణకైలాసనగము :- ఇది యిందు జముదెనకొండ, శమనాశాద్రియనియు వ్యవహృతమైనది. శ్రీకాళహస్తి యందుగల పర్వతములేవే దైవముల కావాసమై వెల సినవో పలుకుచు వానిదే నని ఠక్షితమై యలరారుచుండునని, తెలుఁగగా పరిచయము చేసెను. ఆ పర్వతము, పార్వతీ పరమేశ్వరులు భూలోకమున కేఁగుచెంచుటచే వారిని విడిచి యుండలేక, వెనుకంచి భువికేతెంచిన కైలాసమే.

> "కైలాసం బగజేశులఁగొలువ రాఁగా భక్తితో దేవతా
> శైలంబుం జనుదెంచెఁ గూడి ——*

అగజేశువెంట సర్వదేవతానళి భువికేతెంచుట యిది. మేరుపర్వతమును కైలాసాగము ననుసరించెననఁగా, అందుండు దేవతలును వచ్చిరని యర్థము. భూలోకమునకు దిగిన యా కైలాసమే దక్షిణకైలాసమనఁబరగినది. ఆపర్వతమునకు నుత్తరభాగమున మేరువు నిలిచినది. ఆమేరువునకు భైరవ, దుర్గ, నాగ పర్వతములు పరివేష్టించి యున్నవి.

ఆ దక్షిణకైలాస పర్వతప్రాంతమున పార్వతితోఁగూడిన పరమేశ్వరుఁడు నీట నివాసవైభవోన్నతిని మఱచి విహరించినాఁడట. ఆ జముదెనకొండ

---

* శ్రీ.కా.మా. 1ఆ - 64వ.

‘అణిమాదిప్రదమై, పురాణకథాకంబై, మోక్షదంబైనది’, [1]

ఆ కొండపై అలరుందీగలు, ద్రాక్షగుత్తులు, కురంగములు, పల్లవములు, పంచాననములు, మధుకరములు, బింబములు, దాడిమీఫలములున్నవి. అచ్చట పరమేశ్వరుండు గిరిజాసహాయుండై, సంయమిగా, కిరాతసంచారియై, సిద్ధగ్రామస్థుడై రతినాథుడై, అన్నివేళల నానాయగురీతి బహువేషధారియై, విహరించుచుండెను. ఆ గిరికి నాలుగు దెసల నామడదూరములోపల మృతి చెందువారికి మోక్షములభించును, అమర మనుష్య, దైత్య, భుజగాదులా గిరీంద్రముపై ‘అఖండ సౌఖ్యప్రదాయకమైన శివాగమ ప్రభావము’ తమకు సరివచ్చెనా యన్నట్లు తిరుగుచుందురు.

ఈ పర్వత మాహాత్మ్యము నుగ్గడించిన దీరు పరమాశ్చర్యకరము.

“జడలు ధరింప, రంగజుని జంపరు, పూయరు బూదిపూఁత మై
నడుగరు భిక్ష, కట్టరజినాంబరము, ల్చరియింపఁబోరు పే
రడవుల, నగ్గిరీంద్ర మహిమాతిశయం బిక నేమి చెప్పుదున్ !
బడయుదు రా రికిందియును ప్రాణులు చిత్రముగా శివత్వమున్”[2]

జడలుధరించుట, అంగజుని చంపుట, బూదిపూఁత మైనలఁదుకొనుట, భిక్షమడుగుట, అజినాంబరములు గట్టుట, పేరడవులఁజరియించుటలు శివుని స్వరూపస్వభావములు. ఇవి యేవియు నాచరింపకయే యీ గిరీంద్రమున వసించు ప్రాణులు శివసామ్యమును పొందుట విచిత్రముగదా! కార్యసాధనకు వలయు కారణములు, సాధనములు లేకయే కార్యము సాధించినట్లు పలుకుట విభావనాలంకారము. కేవల మీ కొండయందుండుట చేతనే యిట్టి "శివత్వ" మందుట, యీ గిరీంద్రమహిమాతిశయము. దానినెంతని, యెట్లని వర్ణింపశక్యమగును? కాదు. అంతియేకాదు, ఆ గిరిపై ప్రసరించు వాయువులు, ‘భవదావాగ్నివిదాహమును’ చల్లార్చును.

---

1. శ్రీ.కా.మా. 1ఆ – 97ప.
2. శ్రీ కా.మా. 1ఆ – 103ప.

లోపాముద్రతోఁగూడి యగస్త్యుఁడు గాంచిన యీ దక్షిణకైలాస వర్ణనము అంత్యానుప్రాసాలంకారాలంకృతమై యలరుచున్నది.

ప్రణుతుల్సేయుచుఁ గాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁ గూడి ద
క్షిణకైలాసము, సంచితోపహారకృత శ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్, భవమహామాయావిపర్యాసమున్
గణనాతీతనటీవిలాసము, సమగ్రశ్రీ సముల్లాసమున్.*

ధూర్జటి కవీంద్రుని శైలివిన్యాసమునకు సరిపోఁదగిన పద్యమిది. పర్వతవర్ణనమున మిగిలిన విశేషణముల కంటె 'భవమహామాయావిపర్యాసమున్' అనునది కవి భవపరాఙ్ముఖతను సూచించునది. ఈ కైలాసనగ వర్ణనము మిక్కిలి కాళము పూర్వ జన్మకథనమునఁ గననగును. పరమేశ్వరు నలంకారములతో పోల్చఁదగు కాళుఁడు, కైలాసము నందలి కాలకంఠుసేవకు జాగుసేయుచును వర్ణించుచున్న కైలాసవర్ణము గలదు.

గంధర్వకామినీ గానంబు విని తల
లెత్తి యాడెడి భుజగేంద్రములును
భుజగఫణారత్నములు దీధితులఁ బ్రకా
శించు తమస్సమాశ్లిష్టగుహలు
గుహలఁ బ్రతిధ్వనుల్ ఘుమఘుమయనఁ బారు
నిర్మలోదకముల నిర్ఝరములు
నిర్ఝరతటములు నిరుపాధిక సమాధి
యోగనిద్రారతినుండు మునులు

* శ్రీ.కా.మా. 1అ - 109ప.

మునులు తపములు నిర్విఘ్నములగ ఫలింప
భక్తి రక్షించుకొనివచ్చు ప్రమథగణము
ప్రమథగణ భామినీయుత పార్వతీ వి
లాసములు గల్గి తనరు కైలాసనగము.*

సందర్భౌచిత్యముగల వర్ణనమిది భుజగేంద్రముగు కాళము పూర్వజన్మవృత్త కథనము భుజగేంద్రములతో ప్రారంభించుట యెంతయు సముచితముగా నున్నది. పడగవిప్పిన పాముల ధైర్యమును సూచించుటకోయన్నట్లు, పద్యము ముక్తపదగ్రహస్తముతో సాగినవి. ఆ యా వాని గుణములు, స్వభావములు సహజసుందరములై స్వభావోక్తి సుభగములై యలరుచున్నవి. 'గానరసంఫణి' యన్నట్లు పాటకు పాములు పడగెత్తి ఆడుటలు, పాముల తలల నుండు మణులకాంతులచే అంధకారబంధురములగు కొండగుహలు ప్రకాశవంతము లగుట, గుహల నొరసికొనుచు పాఱు సెలయేఱుల గలగలధ్వనులు ప్రతిధ్వనించుట, ఆ నిర్మలోదకముల తీరమున నిశ్చలమైన తపస్సమాధి యందు మునులు లుండుట, వారి తపములు నిర్విఘ్నములుగ కొనసాగుటకు ప్రమథులు రక్షణసేయుట, వారి స్త్రీలతో గూడిన పార్వతి విలాసములతో గూడియుండుటలా కొండ పై గల విశేషములు.

ఇచ్చట గావించిన కైలాసనగ వర్ణనము కవి తృప్తితీర గానించినట్టిది. ఇది ఉత్తర కైలాసరజతగిరి.ఆ వాతావరణమంతయు నెంత శుభ్రమైనదియో,శుక్లమైనదియో తెలుపుటకో యనునట్లు తరువాతి పద్యము పలుకబడినది. వేశ్యాతనయలు దక్షిణ కైలాస గిరి దర్శనమునకై యాత్రచేయుచున్నప్పుడు త్రోవలో భైరవునిలయమగు భైరవాద్రివర్ణనము జరిగినది. అది అద్భుతావహము. ఆ కొండ పుట్టుకయే ఒక అద్భుతము. నిలిచిపోయిన శంకరుని వెలికితీయుటకు, సరోవరమును పూడ్చుటకై, వాలి తెచ్చివేసిన కొండయది. భైరవాస్పదమగు నా కొండపై నుమతో సర్వేశ్వరుండు చరించుచుండునట.

* శ్రీకా.మా. 4ఆ – 152ప.

ఫణిపతిహార భానఘనభస్మ సుధాకర భూమి తాళికే
క్షణ ధవళప్రభా కలిత సానుచర ద్వృషభాధిపున్ ఖనిల్
ఖణిలున అంకెవేయ కెఱుఁగన్నమకూడదు, చూడ నన్నగా
గణిత గుచిప్రసారము జగత్త్రియగాహకమై వెలుంగగన్.[1]

తెల్లని సర్పములను వాని, మన్మథునిదేహపు భస్మమును, అమృత కిరణుఁడైన చంద్రుని ధరించిన, శివుని తెల్లని శరీరకాంతిలో మునిఁగిన ఆ కొండచరియ యందు తిరిగెడు శివుని వాహనమైన తెల్లని ఎద్దు గుర్తింపబడుట కష్టమయ్యెను. ఖణిల్లని అంకెవేసినగానీ దానిని గుర్తింపలేము. ఇది ఉన్మీలితాలంకారము. కొండతెలుపుదనము నతిశయముగాఁజేసిపలుకుటచే నతిశయోక్తియుఁ గలదు.

ఆ కొండయందు వసించు పశుపక్ష్యములు సైతము శివుదారగింపక, తమ తమ యాహారములు ముట్టుకొనవు, ఇతరములను తాకనియవనుటు, వాని వాని శివభక్తి తాత్పర్య వైశిష్ట్యము వెల్లడించుటయే.

ఫలములఁగాచు నద్రిసుత పాణి శుకంబు, వృషభంబుఁగాచు శా
ద్వలములఁ గాచు దంతిముఖవాహన మత్తుతరాజిఁ, గాచు జో
గుల యిలువేల్పు వాజి, మదిఁగోరక బోనము, భక్తులీశ్వరుం
గొలిచినదాకఁదత్కుధరకూట గళత్తటినీ తటంబులన్.[2]

పరమేశ్వరుఁడారగింపనిదే పార్వతిచేతిలోని పెంపుడు చిలుక వృక్షఫలములను తినదు, వృషభము పచ్చికమేయదు, ఎలుక అక్షతలను తినదు, కుక్కఅన్నము ముట్టదు, అంతియేకాక అవి, ఆ యా పదార్థములను (ఫలాదులను) ఇతర జంతువులను సైతము

1. శ్రీ.కా.మా. 4ఆ 153ప.

2. శ్రీ.కా.మా. 1ఆ - 154ప.

పుట్టుకొననీయక రక్షగా గాచుచుండునట. కైలాసంగమాహాత్మ్యము నుగ్గడించుచు నీ వర్ణనమును దలపించునదియే తెనాలి రామలింగని ఘటికాచలమాహాత్మ్య మందలి ఋష్యాశ్రమ వర్ణనము.

మొకరి తేఁటులు మూతిముట్టవు తేనియల్
శ్రీమధుశాసి కర్పించి కాని
కోకిలమ్ములు చివురాకులు గొఱుకవు
శ్రీవనమాలి కర్పించి కాని
లేఁబచ్చికల్ కబళింపవు హరిణముల్
శ్రీనీలమూర్తి కర్పించి కాని
ఫలభుజిక్రియలకు జిలుకలు తలఁపవు
శ్రీమాధవునకు నర్పించి కాని
యితర జంతువులును హరి మతిఁదలంచి
కాని యే వర్తనములకుఁబూనవనిన
నా తపోవన మాహాత్మ్య మభినుతింప
నలవియే వేమొగంబుల చిలువకైన. [1]

ఆ కొండనుండి ప్రవహించు ఫలరసప్రవాహము సెలయేళ్ళందు కలియుచుండగా నా సంగమమును భ్రాంతిచే మును లా నీటియందు స్నానము లాచరింతురట. [2]

వెండికొండతెలుపును వర్ణించిన తీరుచూడ, కవీంద్రుని యూహాశాలిత విశద మగును.

---

1. ఘ.మా. 1ఆ – 13ప.
2. శ్రీ.కా.మా. 4ఆ – 155ప.

పారదరాశి చంచలతఁ బాసి వసించెనో శైలమై సుధా
నీరధి నిల్చెనో, కుముదినీపతి కాంతి ఘనీభవించెనో
నా రజతాద్రి ముక్తలలనామణి కేళి సుధాంశుకాంతి రా
జీరచితోరు సౌధగతిఁజెల్వెసఁగు న్మునిసేవ్య సిద్ధమై[1]

ఉజ్జ్వలత్వము గలిగిన పాదరసము, పాలసంద్రము, వెన్నెల, అనునవి గడ్డకట్టి శుద్ధగా ఘనీభవించినవా యన్నట్లు ఆ వెండికొండ ఉన్నదనుట యిది. ఈ యన్నింటికి మించి యా గిరి ముక్తలలనా నివాసమయిన మేడను చంద్రకాంత శిలలతో కట్టినట్లున్నదనుట ఈ పద్యమునందలి విశిష్టతగా మనసు భావింపనగును. పైన జరిగిన పర్వత వర్ణనమున వెండికొండ తెల్లఁదనము, చల్లదనము తీయఁదనములు వెల్లడింపఁబడినవి. శివభక్తుల భక్తి తాత్పర్యములు పేర్కొనఁబడినవి. 'ముక్తలలనామణికేళి సుధాంశుకాంతి రాజీరచితోరు సౌధగతిఁజెల్వెసఁగు' ప్రత్యేకముగా జేర్కొనుట కవీంద్రుని మోక్ష దృష్టి వ్యక్తమగుచున్నది. ద్రవస్వరూపము ఘనరూపముగ మారినట్లు ఉత్ప్రేక్షించుటయె కవీశుని ప్రతిభా ప్రాగల్భ్యము.

తెలుఁగు సాహిత్యమున సర్వతవర్ణనములు పెక్కు తావులఁ గందుము. అనుప్రాసాలంకారములతో వెలుఁగొందు వృత్తములును గలవు

కరిసిలిమంత దంతపరిఖ ద్వీపఖండిత దేవదారువున్
మదనవినోదకందళిత మానసమానసవాస భీరువున్
బ్రదరపదాచ్యుత క్రకచపాటిత లస్తక దేశ చారువున్
ముదిత చమూరువున్ ఫలితమూలనమేరువు నా సుమేరువున్.[2]

హేలమెయిన్ స్మహీరమణుఁడెక్కెను నిశ్చలనమ్రదేవతా
సాలముఁ గంధరస్థసురచారణ దంపతిగాన వీచి వా

1. శ్రీ.కా.మా., 4ఆ - 8ప.
2. నాచనసోమన- ఉత్తరహరివంశము. 2ఆ - 38ప.

చాలముఁ దుంగశృంగ తటసక్తమణీఘనరుక్త తార కా
జాలముఁ బారిజాతవన సంస్థితిమూలము హేమశైలమున్

ఈ వర్ణనమంతయు సర్వప్రబంధసామాన్యమే కాని ధూర్జటి శ్రీకాళహస్తి వర్ణన మహత్త్వము.

ఎఱుకు లీ గిరిమీఁద నిచ్చ ద్రిమ్మర నయో
మయసాధనములు హేమంబులగును
శబరులు మృగములఁ జంపి యుమ్మల డిగ్గి
వచ్చు నాఁటికి సజీవంబులగును
వ్యాధు లీ కొండపై వన్యాశనంబులు
సేవింపఁగాఁ గాయసిద్ధియగును
జెంచు లీ యద్రి నిద్రించి మేల్కొను వేళ
దమపధాతువుల తల్పతలములగును
దృశ్యమగు వారికిందు నిధివ్రజంబు
దృశ్యమగుఁ గూడి తమ తోడఁ దిరుగు జనము
విస్మయము చెప్ప నొక్కొక్క వేళ, దీని
సానుభూముల మహిమాతిశయ విధంబు.*

ఇనుము బంగారమగుట, నిర్జీవములు సజీవములగుట, వన్యమూలయిన వానిని ఉపయోగించిన కాయసిద్ధి (వయస్తంభము) కలుగుట, దాలు ప్రియుదాంద్ర తల్పతలము లగుట, నిధులు కనపట్టుచుండుట, విస్మయము కలిగించునుగదా! *

ఏదేని ఒక వింత సంఘటనము నిరతము జరుగదు. ఎల్లప్పుడు జరిగిన అందు విచిత్రము లేదు. ఒక్కొక్కప్పుడట్టి విచిత్రములు కలుగుటయే అద్భుతము. ఈ అభిప్రాయము

* శ్రీ.కా.మా. 4ఆ - 83ప

రోడనే కవిఁ నిస్మయమడు చెప్పనొక్కొక్కవేళ దీని, సానుభూముల మహిమాతిశయ విధంబు' అని పల్కుట లేకున్న నా కొండయందు వేటాడు ఎఱుక బంగారమగునమ నాళచే ఇనుసాయధము తెచ్చుకొనుచుండుట నిత్యము జరుగుచుండును. అట్లే చంపిన మృగములు మరల బ్రతికియుండుటచే వారికి వేట భగ్నమగును అటులనే వన్యాశనములు తిన్నప్పు డంతట కాయసిద్ధిజరుగదు. నిద్రించిన ప్రతిసమయమున సవిప్రియతల్పములు కాజాలవు ఎప్పుడు చూచిన నప్పుడు నిధులు కన్పింపవు. సామాన్యముగా తమతో వచ్చిన జనమెక్క డెక్కడగలరో కనుపించుటయు అసాధ్యము. కనుకనే ఇట్టి అసాధ్యములు, అసాధారణము లొక్కొక్కవేళయందే కల్గుచుండు ననినాఁడు కవీశుఁడు.

౩. ఋతువర్ణనములు :- క్షేత్రమున నవ్యావిర్భావమునకై 'అగస్త్యుఁడు తప మాచరించిన సందర్భమున నీ ఋతువర్ణనముఁగాంచగలము. ధూజనుల వేడుకకై మాత్రమెకాక, 'భవవకిల్బిషవిద్విష దక్షిసింధువును జేయుటకు అగస్త్యుఁ డుగ్రతపము నసఁగడంగెను అభ్రవాణియు నాతన కభీష్టానుకూలమగు వాక్యమునే వలికెను. అగస్త్యుని తపమున గ్రీష్మ, వర్ష, శిశిర ర్తులు వర్ణితములయినవి.

గ్రీష్మర్తువర్ణనము :- అగస్త్యుని తపమున మొదట ఎండకాలము వర్ణింప బడినది.

దూరీకృతోస్తనభారకంచుక వధూ
  జనము మానవకరాంచద్వ్యజనన॥
గంధసారాచల గంధవాహ రిరంసు
  జన్యముష్ణీకృత శ్వాసచయము
విక్షిప్తజల సమావిర్భూత బాష్పభూ
  తల, మధ్వగాయస దాయకంబు
ప్రా ణేశ్వరీ పరీరంభణ ప్రత్యూహ
  కారి, పఁర్ణోద్గమనపర్తు

యంబరాంతర విజృంభ దాంబుపూర
సంచరిష్ణుపరస్పరస్థలవిహార
సమభిలాష ప్రపర్ధిష్ణు చటుల తాప
మంత నేతెంచె దారుణోష్ణాగమంబు.[1]

ఎండెఁ గొలంకులెల్లను, మహీధరముల్ దవవహ్నికీలలన్
మండె, ధరాతలం బినుపమంగలమున్ బలెనుండెఁ గాలి, యా
మెండల నేమిసెప్పఁ బరమేశ్వర! యావరణాంబురాశి తే
కుండిన, నాఁడె పొక్కిపడకుండునె పద్మభవాండభాండముల్[2]

స్త్రీలు తమస్తనకంచుకములను విడుచుట, మనుజుల చేతులందు విసనకఱ్ఱలుండుట, మలయపర్వతమున విహరింపఁగోరిక కలుగుట, భూమినుండి ఆవిరి ఎగయుట, దాటసాయల కాపాసముగలుగుట, పర్యంకయోగనిలింతల కెడచాటుకలుగుట, మహాకాశములందును, నీడయందును చిరుప్రాణులు పెడాకటోదిరుగుటకు కోరుకొనునట్లుచేసెడి తీవ్రతాపము కలుగుటయు, తప్తమై భయంకరమైన వేసవికాలము ధర్మము,

కొలఁకులన్నియు నెండిపోయెను. చంద్రశిలలవలె కొండలు మండిపోవుచుండెను. గాలి అంతయు కమన పెనమువలె వేడెక్కెను. చుట్టునుండు సంద్రము లేకుండిన బ్రహ్మాండము పగిలిపోయెడిది. ఎండవేడిమి యెంత తీవ్రముగా నుండెనోయనునది ఈ రెండు పద్యములందును సహజసుందరముగా వర్ణింపఁబడినవి. ఇందు కవిలోకజ్ఞత, పరిశీలనములు స్పష్టములగుచున్నవి. సీస పద్యమున ప్రతిపాదము రెండు రెండు సమాసములచే కూర్చఁబడుటయు, మొదటి సమాసము రెండవ దానికన్న పెద్దదిగనుండుటయు రెండవ సమాసమందలి అర్థమునకు మొదటి సమాసమందలి యర్థము దోహదము చేయుచున్న దనిపింపఁగలదు. స్తనములమీఁది కంచుకము విడచుట, విసనకఱ్ఱతో విసరుకొనవచ్చుటకును, వెచ్చని ఊర్పులు, చల్లని పర్వతములమీఁది కేగవలయు నను

1 శ్రీ.కా.మా. 1ఆ - 122ప.
2 శ్రీ.కా.మా. 1ఆ - 123ప.

కోరికకు బాటసారుల కాయాసము గల్గుటకు భూమి ఆవిరి విడుచుటయు, ప్రాణేశ్వరిని కౌఁగిలింతలఁజేర్చుకుండుటకు ఒడలు చెమటపట్టుటయు కారణము లు, ఫలితములుగాఁ బలుకుట జరిగినది.

రెండవ పద్యము తెలుఁగు జాతీయతకు, పలుకుబడికి పట్టుకొమ్మగా నున్నది. ఎండుట, మండుట, పొక్కిపడుట, ఇనుపముంగాలువలె నుండుట అను నివి ఎండ తీవ్రతను చక్కఁగా రూపింపఁజాలియున్నవి. ఋతువర్ణనముఁ గ్రీష్మర్తువర్ణనము పలుం కొలఁది కవులు కావించియున్నారు. నన్నయ, నన్నెచోడుఁడు, పెద్దన మున్నగు వారెందఱో కావించిన వానిలో నొండురెండీ సందర్భమునఁ జూపఁగలను.

నన్నయ్య పద్యము :-

ఉరుతర దావపావక శిఖోత్కలిత శ్వసనంబులన్ సితే
తరగతి తీవ్రతిగ్మకరధామ సహస్రములన్ బహుప్రవా
హారహితాంబు నిమ్నగాతతులునై కృశనీర్ఘములై నిదాఘవా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబులై.

నన్నెచోడని పద్యము :-

ఆతపభీతి నీడలు రయంబున వృక్షముల క్రింద డాఁగెనో
యా తరులుం దృషాభిహతులై తమనీడలు దారు ద్రావెనో
భీతి ననంగ నీడ లుపపాదపమూలములం దడంగె గ్రీ
ష్మాతత మధ్య వాసరములం దుఁజలింపక యుండు నెండలన్.

ఆధునికులలో తిరుపతి వేంకటకవుల పద్యమొకటి యత్యంత రమణీయముగానున్నది.

ఇతరుల దాహపుం గతుల నెన్నఁగనేల ? దినేశుఁ డంత వాఁ
డతి తరతృష్ణ చేఁదన సహస్రకరమ్ములు సాచి సేమపుం
గతి విడనాడి కుంటలనె కాదు, నదమ్ములఁ గాదు, కూపసం
తతులనె కాదు కంటికిఁ గనంబడినంతయుఁ ద్రావె నీరముల్.

వర్షర్తువు :- నాలుగు పద్యములందునడచిన యీ వర్షర్తు వర్ణనము కవి ధూర్జటి వర్ణనా నిపుణతకు, పంచభూత తత్త్వనిరూపణకు దారకాణయై యున్నది. మబ్బులుపట్టుట, ఉఱుములుఱుముట, వర్షములు ఇతర భూతముల నణఁచివేయుట ఈవర్ణనమున గలవు.

అంతం బూర్వపు వైరముం దలఁచి వింధ్య గ్రావకూటంబు ల
భ్రాంతంబంతయుఁగప్పెనో, జలధి యాత్మారాతిపైఁ బోయి నిఁ
ర్జింతుంగా కని యెత్తివచ్చెనో, తనుం జెండాడు భాస్వంతు మా
యింతుంగాకని నిల్చెనో యిరులు, నా నేతెంచెఁగా లాభ్రముల్.*

అగస్త్యుని తపమాచరించు సందర్భమున, నీ పద్యమున వింధ్యగిరి ఆకాశముపై దండెత్తి ఆక్రమించెనోయని ప్రారంభించుట మిక్కిలి సముచితమైన సందర్భము తన తలవంచి గురుఁడగస్త్యుఁడు వెడలగనే, వింధ్యుఁడు ఆకాశముపై ప్రతీకారేచ్ఛతో తిరిగి పెరిగి క్రమ్మివేసెనో యనునట్లు నల్లని మబ్బులావరించుట యిది. మేఱువుతోఁబోటీగా పెరిగిన వింధ్యవలన సూర్యచంద్రుల గమనము నిరోధింపబడుటచే వెలుఁగులేక, అంతయు అంధకారబంధురమగును. మబ్బులు నల్లగా నుండుటం విధముగా నూహించుట రమణీయోత్ప్రేక్షమే. సముద్రము తన శత్రువగు నాకాశముపై దండెత్తెనా యన్నది రెండవ యుత్ప్రేక్ష. సముద్రజలము నీలముగా నుండునని వర్ణించుట కవి సమయమే కాక, దూరమునుండి అట్లు కన్పించుట, ఆకాశనీలిమ ప్రతిఫలనమని శాస్త్రజ్ఞులందురు. అదియుగాక సముద్రజలమును, ఆవిరిచేసి ఆకసమెత్తుకొని పోవుటయు కలదుకదా! కనుక సంద్రమున కంబరము శత్రువే. కాన ఎండాకాలమేఁగిన వెనుక సముద్రమునకు సూర్యతాపము తొలఁగుటనుగాన స్వేచ్ఛగా నది ఆకసము మీఁదికి దండెత్తి వచ్చెననుట యిది. ఇది యిందలి స్వారస్యము.

ఉఱుములు, మెఱుపుల వర్ణనము తెలుఁగుఁబలుకులజల్లుచేఁ గవి వర్షమునకు బలిమి చేకూర్చిన వాఁడయ్యెను.

* శ్రీ.కా.మా. 1ఆ - 126ప.

మొగులు మొగులున మెఱుఁగులు నిగుడ దొడఁగె
మెఱుఁగు మెఱుఁగున నుఱుములు మెండుకొనియె
నుఱుము నుఱుమంగఁ బిడుగులు నుప్పతిల్లె
నింతకంతకు వర్షంబు నెక్కుడయ్యె ...*

ఇందు 'వర్షంబు' అన్న యొక్కటి తత్సమము. ఈ పద్యమున ప్రతిపాదమున కవి ప్రతిభ యత్యంతముగా మెఱయుచున్నది. మబ్బులు దట్టముగా ఒకదాని సరసన నింకొకటి చేరుట, ఒకదానికొకటి తగిలిన యొరపిడి వలన మెఱుపులు కలుగుట, మొదటిపాదము సూచించుచున్నది. అన్నియు లఘువులే. మబ్బులెంత దగ్గరగానున్నవో, మెఱుపులెంత వేగముగా కనిపించి కనుమఱుగగు చుండెనో యీ సర్వలఘుపాదము స్పష్టపఱచుచున్నది. రెండవపాదమున ఉఱుములు ఉఱుముటను 'మెండుకొనియె' అను క్రియా పదమున పూర్ణబిందు పూర్వక 'డ' వర్ణ ప్రయోగము, సూచించుచున్నదనవచ్చును. అట్లే మూఁడవ పాదమున 'ఉఱునుంగ బిడుగులు నుప్పతిల్లె' అను వాక్యమున 'నల' మందలి గురువు, తుదిరెండు 'గల' ములు పిడుగుల శబ్దము, ప్రతిధ్వనులను సూచింప గాలిఁయున్నవి. తుదిపాదమునందలి గణములన్నియు గురుసహితములై, వర్షాధిక్యమును సూచించుచున్నది.

'నీరు నేల మెఱుఁగును నింగి గాడ్పుఁడానయై' ముని తపమాచరించినాఁడు. ఇందలి పంచభూతములను తానేయైనట్లు నీరు వర్షించినట్లు పేర్కొనఁబడినది. నీరు, తక్కిన నాలుగు భూతములను ముంచివేసి యంతటను తానుగనే కనుపట్టినదఁట. అనఁగా వర్షాధిక్యమంతటిదని నొగసైన యర్థము. కాన సర్వభూతములును నీరుగఁగను పట్టుటచే మునియు పంచభూతస్వరూపుఁడై తపమాచరించినాఁడనుట.

ప్రళయవేళా సముద్భవ పుష్కలావర్త
కాది పయోద వర్షాంబు వనంగ
నూర్ధ్వాండకర్పరం బుఱుములచే వ్రక్క

---

* శ్రీ.కా.మా 1ఆ—127 ప.

గ్కొనఁబడిన క్రమము 'వాయువును, మిన్ను, తేజంబు,వసుమతియు' అన్న విధమున డియొక విశేషము స్ఫురింపఁగలదు తక్కిన భూతములను నీరాక్రమించుటచే పంచ భూతాత్మకమగు ప్రకృతి వికృతిచెందెనా యన్నట్లు, అవి విలోమ క్రమమునఁబలుక కినట్లును మనము గమనింపఁగలము. ఇట్టి విచిత్ర, విశిష్టవిధానము కవి ధూర్జటి బాహాయందు నిలిచినట్టిదే యనవలసియున్నది. కాకున్న, ధూర్జటి పంచభూతములను క్రమమునే వర్ణింపలేక పోవునా?

ఇంక వర్షమును వర్ణించుమూడవ పద్యము :-

తెలుపుం దేజము నంతనంతట, దటిత్తీవ్ర ప్రభాపుంజమై
తలచూపున్ ధర మేదినీధర శిఖాదంభంబునన్ గర్జగా
పిలుగిచ్చున్ గగనంబు, వర్ష సఖుడై యేతెంచు గాడ్పున్, దమున్
జలదాసార మడంచెనో? యని జను ల్శంకింపకుండ న్మదిన్,*

పంచభూతములందు నీరు విజృంభించి, మిగిలిన వానిని కప్పదమంచ ఆక్రమించినదని జనులు కల్లోలపడుచుండ, నా నాలుఁగు భూతములను నడుమనడుమ తాము న్నట్లు తెలుపుటను కవి చక్కఁగా చమత్కరించినాఁడు. ఎడతెగనివానిలో వర్షించుట న్నపుడు నడుమ మెఱుపులు వచ్చుట తేజమునకు, అప్పుడప్పుడు కన్పట్టు కొండ శిఖరములు పృథివికి, విన్పించు ఉఱుములు ఆకసమునకు, వర్షమునకు తోడుగా వీచుగాలి వాయువునకు చిహ్నములుగా గన్పడుచున్నవని యిందలి చమత్కారము 'తెలుపుంచె జము' 'తెలుపు' శబ్దము క్రియగాకాక, తేజమును విశేషణముగా గూడ గ్రహింపఁ దగియున్నవి కొండశిఖరరూపమున నేల తలయెత్తి చూచుట, ఆకాశము గర్జనగా గొంతెత్తి పలుకుట యనునవి రమణీయార్థ ప్రతిపాదకములై యలరుచున్నవి. అభ్రమునను వర్ణించుటాన్నిన మహాసుందరభావ సమంచితముగా చిత్రించిన తెలుగు కవులనేకులున్నారు

యమునద్గంగము కృష్ణభూమదిలమజ్జాతొన్మనుష్యంబు నీ
లమహీంధ్ర న్నిఖిలాచలాళి తమాల దూర్వాన మిందీవర

* శ్రీ.కా.మా. 1అ - 129ప.

తుక్కముద్రశ్రేణి వికద్విహింగము దమస్తోమద్రహోర్మ్మప్రభా
సముదాయంబగుచుండె లోక మలఘుశ్యామాభ్రము ల్పర్వినన్.[1]

మేఘమును ప్రబంధముతో నుపమించినాఁడు రామాభ్యుదయ కర్త రామభద్ర కవి.

ధారాశుద్ధిఁ బ్రసిద్ధిఁ గాంచి ఘనశబ్దస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
ఘోరంబైన రసస్థితిన్ దరళవిద్యున్మాలికాలంకృతో
దారంబై కవిసేవ్యవశా వనమయూరారా యూథిఁ బ్రాపించి వ
ర్షారంభంబు ప్రబంధమట్లఖిల పద్యాక్రాంత మయ్యెందగన్.[2]

అన్యాయంబున హెచ్చి గ్రీష్మఋతురాజు శ్రాంతమున్ భోజనో
దన్యాతాపము నేర్పరింపఁ గని క్రోధస్ఫూర్తి గర్జిల్లి ప
ర్జన్యుం డంభరరథస్థితిన్ మణిగణచ్ఛాయల్ దలిర్పన్ మహా
జన్యస్థేమము సూపెనో యన శరాసారంబు పర్వెన్ వడిన్.[3]

సీతువు :—

ఆ తరువాత జంతునివహంబు వడంక, నణంకువేది యో
షాతతి ప్రాణవల్లభుల సంతతముం బరిరంభణంబులన్
బ్రీతులఁ జేయ, సూర్య శశిబింబ మటంచుఁ జకోరదంపతుల్
భీతిఁ దోఁ అంగవచ్చె నతిభీకర శైత్యము శీతకాలమున్.[4]

---

1. ...... భాస్కరరామాయణము కిష్కింధ - 384 ప.
2. ...... రామాభ్యుదయము 6 13 ప.
3. ...... శకుంతలాపరిణయము. కృష్ణ 1ఆ — 142ప.
4. శ్రీ.కా.మా. 1ఆ — 130ప.

చలికాలపు ప్రభావమును వర్ణించు నీ తావున ధూర్జటి పల్కిన 'సూర్యశశిబింబమటంచు చకోరదంపతుల్ ఫెలిపె' అనుట చక్కని యూహ. చకోరదంపతులు చంద్రుడున్నప్పుడే వచ్చును, సూర్యుని వేడిమి కవి జయింపరాదు. వెన్నెలయే వాని ఆహారముకదా! సూర్యుని చంద్రునిగా భావించెనన్గా సూర్యుఁడు వేడిమిని కోల్పోయెనని. అనఁగా నా కాలమున చల్లదనము సూర్యసంతతి వాని వెట్టనే చల్లబడెనని యందమైన భావన. చలిబాధ పడలేకయే త్రిమూర్తులు సంతతవధూ యోగమునం దాసుదురట.

ఈ హేమంతము రాకఁజూచి రమణీ హేలాపరీరంభ స
త్సాహాయ్యంబునఁగాని దీని గెలువన్ శక్యంబు గాదంచుఁదా
రూహాపోహ విధింద్రిమూర్తులు సతీయుక్తాంగులైనారు గా
కోహో! వారలదేమి సంతత వధూ యోగంబు లేఁగందురే ?

(పోతన భాగవతము)

సూర్యుఁడు త్వరగ నస్తమించుటను పోతన చలి కారణముగనే యని యుత్ప్రేక్షించినాఁడు.

పొడుపుఁగొండమీఁద బొడుచుట మొదలుగాఁ
బరువు వెట్టి యినుఁడు పశ్చిమాద్రి
మఱుఁగుఁ జొచ్చెఁ గాక మసలినఁ జలిచేత
జిక్కఁ జిక్కెననఁగఁ జిక్కకున్నె.[1]

చలిబాధ నత్యంత మనోహరముగా శ్రీనాథుఁడు వర్ణించియున్నాఁడు.

ప్రక్కలువంచు, వంచిమునుపంట్లను పండ్లనరాచు రాచి ఱొ
మ్మొక్కలఁ జేయుఁ జేసి తలయల్లనఁ గాళులసందు సందిలోఁ
జక్కలినొక్కు, నొక్కి యిరుచంబడ గుమ్మడిమూటగట్టి పీ
పెక్కు దువాళిచేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేకువన్.[2]

1. భాగ. 10స్కం. పూర్వ - 801ప.
2. క్రీ.రా. 46ప.

4. ప్రయాణము :-

మన ప్రబంధమున నీ ప్రయాణము మూఁడు తావులఁ గనఁగలము. ప్రథమాశ్వాసమున లోపాముద్రాగస్త్యులయాత్ర, తృతీయాశ్వాసమున నత్కీరుని తీర్థయాత్ర, చతుర్థాశ్వాసమున వేశ్యాతనయల యాత్రలు వర్ణింపబడినవి.

ప్రథమాశ్వాసమున—

'వింధ్యపర్వతగర్వంబు విఱుగఁద్రొక్కి
గౌతమీ కృష్ణ వేణ్యవగాహనములు
సేసి శ్రీశైలనాథు దర్శించి జ్యోతి
సిద్ధవటినాథుఁగొల్చి—[1] లోపాముద్రాగస్త్యులు

శ్రీకాళహస్తీశుని దర్శింప నేఁగుదెంచిరి. వీరి యాత్ర శ్రీకాళహస్తీశునే దర్శించుటకు, సేవించుటకు బయలుదేరకున్నను, శ్రీకాళహస్తి చూచిన వెనుక ముందునకేఁగక, ఆ క్షేత్రమాహాత్మ్యమునకు, ఆ దైవత దివ్యత్వమున కానందమంది, యచట నది లేకుండుటచే చింతించి యందులకు తపమాచరించి, స్వర్ణముఖరీ నద్యావిర్భావమునకు హేతుభూతుఁడగుటచే, నాతని సంతగా సాగర్శించిన ఫణారాజన్మహాలింగమును కవి ధూరటి తన కత్యంత ప్రియతమమైన అనుప్రాసాలంకారములచే నలంకరించెను.

ప్రణతుల్సేయుచుఁగాంచెఁగుంభజుఁడు లోపాముద్రతోఁగూడి ద
క్షిణ కైలాసము నంబికాహరకృత శ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్, భవ మహావిపర్యాసమున్
గణనాతీత నటీవిలాసము, సమగ్ర శ్రీ సముల్లాసమున్.[2]

కాంచెన్ వంచిత పాంచభౌతిక సుఖాకారాంగమున్ జిన్నటీ
సంచారాంచిత రింగమున్, ముని మనస్సమ్యక్పరిష్వంగమున్

---

1. శ్రీ.కా.మా. 1ఆ - 108ప.
2. శ్రీ.కా.మా. 1ఆ - 109ప.

బంచాస్త్రాగ్రిసు మరుద్భుజంగము, గృపా పాణింధమూపాంగముస్
బ్రొంచన్ముక్తి కళత్రసంగము ఫణారాజన్మహాలింగముస్.[1]

దక్షిణకైలాసము అందలి ఫణారాజన్మహాలింగముల దర్శనవర్ణనమిది

తృతీయాశ్వాసము:- వర్ణింపబడిన ప్రయాణములం దీ నత్కీరుని యాత్ర మిక్కిలి విపులముగ వివరింపబడినది. ఉత్తర కైలాస దర్శనాపేక్షియై బయల్దేరిన నత్కీరుడనేక తీర్థములు, క్షేత్రములను నవగాహముసేసియు, దర్శించియు, దైవతముల నర్చించియు, తుదకు సుబ్రహ్మణ్యేశ్వరు నను్గ్రహముచే దక్షిణ కైలాసము దర్శించి శాపవిముక్తుడయ్యెను. ఈ యాత్రయందాతడు పెక్కు, పట్టణములను, నదులను, కొండలను, అడవులను, దేవాలయములను చూచుచు నేగెను. ఈ వర్ణనమున ధూర్జటి రసవద్వ్యగద్య రచనా చణత్వము వెలార్చినాడు. రెంటిని అంత్యానుప్రాస, వృత్త్యనుప్రాసాది శబ్దాలంకారములఁ గైసేసినాడనఁదగును. చిన్నందీశ్వరుని, జంబునాథుని, కావేరి నదిని, అరుణగిరిని, తిరువయ్యూరినాయకుఁడగు ఓదిపిచ్చనయనారుని, ఏకరసాలేశ్వరుని, పెన్న, గుండ్లకమ్మ, కృష్ణవేణి, గౌతమీగంగ, పీఠికాపురము, సింహాచలము, శ్రీకూర్మము, గోకర్ణము, పురుషోత్తము, కృత్తివాసము, కటకము, జలేశ్వరము, నందనేశ్వరము, గగనేశ్వరము, గయ, గంగ, కాశి, అరణ్యము, సరస్సులను గాంచెను.

ఈ సర్వవస్తువర్ణనమునందును గవీంద్రుఁడు తన కవిత్వముతోఁబాటు వ్యక్తిత్వమును గూడ వెలార్చియున్నాఁడు.

చిన్నందీశ్వరు నీశ్వరేశ్వరునిఁ గాంచెన్, భీషణాంభోలతల్
ద్రెవ్వం, దీవ్రతరాంగసంభవ శరశ్రేణీవిదాహవ్యథల్
దివ్వం ——[2]
చనిచని దాఁటెనంతఁ గవి చంద్రుఁడు ధన్యఁగవేరకన్య, జీ
వనశితఖడ్గ ఖండిత భవ ప్రథవాఘవిరోధిసైన్య —[3]

1. శ్రీ.కా.మా. 1అ - 112ప.
2. శ్రీ.కా.మా. 3అ - 130ప.
3. శ్రీ.కా.మా. 3అ - 132ప.

అరుణగిరీంద్రదకూటము, గృతాఘకపోలచపేటమున్, నిరం
తరభవ దావపావకవిదాహకృపీటము—[1]
—— అంహోమతంగ సింహంబగు సింహాచలంబును—[2]

వైరాగ్యంనాతని భవనిరాసము, వైరాగ్యములు వ్యక్తములగుచుండగా, నతని ముక్తి కాంక్షను వెల్లడించుటయు నయసాటులఁగాంచఁగలము.

'— నిత్యమ, జ్ఞనరతకోటి ముక్తిపద, సౌఖ్యాదాన్య—[3]
—— ప్రదీపితముక్తివధూకిరీటమున్ ——[4]
—— శివున్ముక్తి వారి రుహాక్షీపతిన్ ——[5]

...... ముక్తివధూ చరణకటకంబును .. [6] ఇత్యాది చోట్ల నాతని ముక్తికాంక్షఁగాంచఁ గలము. నదులు, సరస్సులు, మత్రివృక్షముల వర్ణనలను వేయిగా గాంచుదము.

చతుర్థాశ్వాసము:—

వేశ్యాతనయలు, దొంగమాటలునమ్మి శ్రీకాళహస్తీశ్వరునిఁగాంచఁబయనమైరి. పంచకోశములఁగుంభేశుఁగొలిచి, చిదంబరమేఁగి, సంభ్రమముఁజూచి, శ్రీకాళహస్తికి సమీపమున గల లడనేది, సరోవరముసుఁజూచి యచటి వారీశ్వరునిఁబూజించి, భైరవునిఁగొల్చి, శ్రీకాళహస్తీశునిచే శ్రీకాళహస్తికిఁ గొంపోబడిరి. వారిపూజించిన లింగమును, వారు అపవర్గమావిభుఁగా భావించిరి భైరవాన్వయము కొండయు 'ఘోరసంసారమఃఖదవాగ్నివ్యథఁబాయు' ఁజేయునదట.

1 శ్రీ.కా.మా. 3ఆ 134ప.
2. ,, 3ఆ 133ప
3. ,, 3ఆ 132ప
4. ,, 3ఆ 134ప
5. ,, 3ఆ 137ప
6. ,, 3ఆ – 133ప.

**5. వేట :-** తిన్నని కథయందు వేటవర్ణనము గలదు.[1]

తిన్నని తండ్రి నాథనాథుడు కొడుకును తగిన వారలను వేటకుఁజనుమనెను. వేట వర్ణనమున కవి ధూర్జటి లోకజ్ఞత స్పష్టమగుచున్నది. ఆటవికజీవనముతోడను, ఆటవిక వస్తువులతోడను మిక్కిలి పరిచయము, వేటకేఁగువారి సంరంభము, వేట సాధనము లయు జంతువులయు పరిచయము ధూర్జటికి మిక్కుటముగా గలదని యెఱుఁగఁగలము వలలు, వేఁటపక్కులు, ఘుంగిసలు, సివ్వంగులు, ఎద్దులు, వేటపశులు, బోనులు, చిక్కములు, త్రాళ్లు మున్నగువాని వివరములను, వేటలందు గల తెరవేఁట, డేగవేఁట, ఘుంగివేఁట, ఏదువేఁట, సివ్వంగివేఁట, ఇఱ్ఱివేఁట, గంటవేఁట ఎద్దువేట, ఏడివేఁట,జొంపవేఁట మున్నగు విధములనగు జంతువులను వేటాడుటలందలి యొడుపులు వర్ణించినతీరుఁజూడ, కవీంద్రునకు వానియందలి ప్రత్యక్షానుభూతి తెలిసికొనఁగలము. ఇది యతని పరిచయశక్తికి తార్కాణ. తిన్నఁడు వేఁటయందు పట్టిన జంతువులనొక మాలగా గ్రుచ్చి తండ్రికి కానుకగాఁ బంపెనఁట. ఆ జంతువుల క్రమము నొక చంపక మాలయందుఁగూర్చినాఁడు కవి.

> పులులు, కురంగముల్, లకురటిపోతము, లేదులు, మున్నుఁబిళ్లు, దు
> ప్పులు, కణుఁతు, లిఱ్ఱులు, చిఱుతపులపోతులు, కొర్నవగండ్లు, భల్లుకం
> బులు, చమరీమృగంబు, లెనుపోతులు, కస్తురిపిల్లు, లాదిగాఁ
> గల మృగరాజిఁ బెక్కువిహగంబులఁ గానుకలంపెఁ దండ్రికిన్[2]

పెద్దన మనుచరిత్రము, ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రము, పిల్లలమర్రి పినవీరన శాకుంతలము లందును, రామభద్రుని రామాభ్యుదయము, మట్ల అనంత భూపాలుని కకుత్స్థవిజయము, అల్లమరాజు రామకృష్ణకవి కవిచకోరచంద్రోదయము, లిత్యాదు లందలి వేటవర్ణనములున్నవి కావి యవి కోరితెచ్చి పెట్టుకొన్నట్లుండును. కాని మన

---

1. శ్రీ.కా.మా. 3ఆ - 46ప. నుండియు 47ప.
2. శ్రీ.కా.మా. 3ఆ - 48ప.

శ్రీకాళహస్తి మాహాత్మ్యములోని వేటవర్ణనముకథలో సంపర్శశుద్ధియు, సహజత్వము కలిగియున్నది తిన్నని యా వేట, యుడుమూరినుండి కొండదరి నున్న పాతాళాజస్మట్లింగము కడకు తిన్నని జేర్చి కథను దోహదము గావించి ది.

6. సాగరము :- వేశ్యాతనయలకథయందు సముద్రము వర్ణింపబడినది. మూడు కందములలో, రెండు సీసములలో సముద్రము వర్ణింపబడినది.

భంగపరస్పరఘట్టన
భంగసముద్భూత బిందుపటలంబు, మరితి
త్సంగవులకుం దానొసఁగు న
భంగుర మౌక్తిక వితాన భంగిం దనరెన్[1]

అను కందపద్యమున భంగోత్తుంగము సంద్రపుటలల ఘోష వినవచ్చును గదా. కవి రత్నాకరమను నామమునకు సార్థక్యతకూర్చినాఁడు తరువాతి పద్యమున

రత్నము లిభరత్నముఁదరు
రత్నవధూరత్న ధేనురత్నంబులు, గ్లౌ
రత్న మమృతరత్నము హరి
రత్నమునుంగలిగి మెఱయు రత్నాకరమున్[2]

ఆ సముద్రమున దొరికినవన్నియు రత్నములేకాని రాలు, నత్తగుల్లలు కావను రమ్యోక్తి మూన, నన్నివిధములయిన రత్నముల కాకరము కనుకనే యది రత్నాకరమనుట సార్థకమైనది.

సముద్రము నీలముగా భాసించును. ఆ నీలిమ మేఘములు, ఇంద్రుఁడు, నల్లనికాటుక, నల్లగలువ, కస్తూరి, తుమ్మెదల నీలవర్ణములతో నుపమింపఁబడియుండుట యటుండగా

1. శ్రీ.కా.మా 4ఆ—61 ప.
2. శ్రీ.కా మా. 4ఆ - 62ప.

నా సముద్రమందలి నీలవర్ణమునకు కారణము నుత్ప్రేక్షించుటయందుఁగవీంద్రుని యుపజ్ఞఁదెలియఁగలము

తనయందుఁ బవ్వళించిన నీలవర్ణుని
 నీడ నీరంబెల్ల నిండెననఁగ
హేళికినోడి తా నెటకుఁబాఱఁగలేక
 తనయందుఁదిమిరంబు దాఁగెననఁగ
దనయందుఁబడబాగ్ని ఘనతరజ్వాలలు
 మండఁగ నుదరంబు మాఁడెననఁగ
జంబూఫలద్యుతి నంబరంబంతయుఁ
 దనయందుఁబ్రతిఫలించినదియనఁగ

నీరదవ్రాత పురుహూత నీలకణ్ఠ, లాతనీచ్ఛవ్వ కస్తూరికాళిజాత
సన్నిభచ్ఛాయఁగనుపట్టు—" నట సాగరేంద్రుఁడు *

సంద్రమున హరి పవ్వళించుట, బడబాగ్ని యుండుటలు పురాణప్రసిద్ధములుకాగ, హానిచే ప్రభావితమైనట్లు, చీఁకటిదాఁగినట్లు, ఆకసపు వర్ణమంతయు ప్రతిఫలించినట్లు పల్కుట యందు ధూర్జటి లోకజ్ఞత,శాస్త్రజ్ఞతలు, వ్యక్తములగుచున్నవి. ఇంకాకవి యుపజ్ఞతయు వ్యక్తమగుచున్నది.

దరిదన్ని తిరిగెడి తెరఁగలు చనుఁదెంచు,
 తరగలు నొండొంటిఁదాకు రవము
గుములు గూడుక కంథరము లాకసముదిగ్గి
 నీరంబుఁగ్రోలెడి నిబిడరవము
మబ్బునఁ గసరెత్తి యుబ్బి యంతంతకుఁ
 బొరలంగఁబడిమెదు భూరి రవము
ననుదిన పూర్వాపరాహ్ణ వేళలఁబోటు,
 పాడిచి విచ్చిన పీటి ఘోరు రవము

* శ్రీ.కా.మా. 4ఆ - 63ప

దశదిశాభాగముల ప్రతిధ్వనుల నీన,
వలయశైలాది గిరిగుహావాస సింహ
శరభ శార్దూల హృదయ భీకరములగుచుఁ
దనకు నైజంబులుగ మించు వనధిరాజు.[1]

సముద్రమును శంభుమూర్తితో నుపమించిన వర్ణనము ఒకటి పంచతంత్రమునఁ గను పట్టుచున్నది.

రంగదుత్తుంగ తరంగ సంఘంబులు, సరసాభినయ కరాబ్జములు గాఁగ
బహువిధప్రచలన పాఠీనపంక్తులు, ధవళవిలోల నేత్రములు గాఁగ
సురుచిర స్నిగ్ధ పాండుర ఫేనపటలంబు, చారుతరాట్టహాసంబు గాఁగ
బోలునని తన్ను జనములు పొగడునట్టి వర్ణనకు నెక్కు డొప్పు మహా
ర్ణనంబు—[2]

సముద్రమునే గంధగజముతోఁ బోల్చినాఁడు అయ్యలరాజు రామభద్రుఁడు.

— గంధగజలీలఁ గ్రాలు సాగరముఁగాంచి,

... గంధగజలీలఁ గ్రాలు సాగరముఁగాంచి,[3]

**7.** ఋష్యాశ్రమము :— మన ప్రబంధమున వశిష్ఠుని తపము, అగస్త్యునితపము బ్రహ్మతపములు, గావించిన సందర్భములు గలవు.

**వశిష్ఠుని తపము :—** రాజయోగజాల మూవపడి వశిష్ఠుఁడుగ్రమైన తపమాచరింప బూనెను.

---

1. శ్రీ.కా.మా. 4ఆ — 60ప.
2. పం.తం.మా.నా. 4ఆ — 6ప
3. రామా. 7ఆ — 38ప.

దానానేకపముల్ కరాపహృతపాథఃపూరముల్దెచ్చి యు
ద్వ్యాప్తస్నాన జలకంబులార్చఁ జమరీ జాలంబు వాలంబులన్
వీవం గ్రోఁతులు పండ్లు గానుకలు గావింపం, గిరాతాంగనల్
సేవ స్సేయఁ జెలంగె నమ్ముని తపస్సింహాసనాసీనుఁడై. [1]

అడవియేనుగులు తొండములతో నీరుదెచ్చి స్నానము లాచరింపఁజేయుచుండగా చమరీ మృగములు వీవనలు వీచుచుండగా, క్రోఁతులు పండ్లు కానుకగా నిచ్చుచుండ యాటవిక స్త్రీలు సేవచేయుచుండగా, వశిష్ఠుఁడుగ్రతపమాచరించెను. ఆ తపమాచరించిన తావు మహిమనుగ్గడించుచు కథాసూచనము చేసినాఁడు

శుండాలార్భక షండగండతల ఖర్జూ భగ్నోపార్జనా
ఖండగ్రావము, చండకుండలి విశేక వ్యాప్తికింపైన శ్రీ
ఖండస్థాణువు, శారికా శుక విహంగవ్రాత పుండ్రేక్షు కో
దండక్రీడకు నీడమై, తపమతిస్థైర్యంబునన్ జేయఁగన్. [2]

ఇందు ఏనుగు, పాము, దక్షిణకైలాసాద్రులు ధ్వనింపఁజేయబడినవి.

అగస్త్యుని తపమున :- ఈ సందర్భమున కవి మూఁడు ఋతువులను వర్ణించుచున్నాఁడు. తపోవనవర్ణనము గావించియుండలేదు.

బ్రహ్మతపమున:- ఈ ఘట్టమున కవి దూర్జటి ప్రబంధసామాన్య ఋష్యాశ్రమ వర్ణన గావించియున్నాఁడు. బ్రహ్మతపమునకు సకలభూతములు సేవలొసఁగినవి.

గాంగేయము ఖరీతరంగసంగ సదా, గతిమహోగ్రగ్రీష్మ దుఃఖము హరింప
సతత వాచంయమేశ్వర కృతక్రతు హవి, ర్జ్వలదగ్ని కీలలు చలినడంప
నికటద్రుమస్థిత నీలకంఠములు, పురలోడ్జి వాసలబిరుసు మాన్ప
నాగంబు లాభోగభోగంబులడ్డంబు, పట్టి ఝుంఝూనిలపంక్తి నుడుప

1 శ్రీ.కా.ఖం. 1ఆ - 72ప.
2 శ్రీ.కా.ఖం. 1ఆ - 73ప.

నఖిలభూతాత్మమూర్తియై యతిశయిల్లు,
కొండుకుఁబడయంగ సర్వేశుఁగూర్చి తపము
సేసె, నటుకాన బవనాగ్నిశిఖిభుజంగేంద్రదు,
లాదిగాఁగూడి విధికి సహాయులైరి.[1]

స్వర్ణముఖరీ తరంగముల సంపర్కముచే వీచుగాలి గ్రీష్మాతపమును పోగొట్టుచుండెను. మునీశ్వరుల యజ్ఞకుండములనుండి వచ్చి అగ్నిజ్వాలలు చలినణఁచుచుండెను. సమీప వృక్షములందున్న నెమళ్లు పింఛములు విప్పి వాన మీదపడకుండ కాపాడుచుండెను. పాములు పడగలు విప్పి ఝంఝూనిలము నాపుచుండెను. సీసమందలి పెద్దపాదము లలో నాలుగవది మనోహరమణీయమైనది. పాములకు వాయువు కదా ఆహారము; మహానిలయ మును సైతము పాములుపడగలుపట్టి యాపివేయుచున్నవనఁగా, నా వాయువు నాహార ముగా లోఁగొనుటచే, గాలి యిఁక వానినివీడి ముందుకు పోగలేదు.

ఇక నాశ్రమమహిమాను వర్ణనము, శాంతరసమయముగా నున్నదని వర్ణించుటలో ధూర్జటియు ప్రబంధసామాన్యమార్గముననే పయనించెను.

తల్లిగానని లేడిపిల్లకుఁ జన్నిచ్చి, పెంచు బెబ్బులి తనబిడ్డయట్లు
దైవికంబున గూడు తప్పి నేలను బడ్డ రామచిలుక బోదలఁ బ్రోచుఁబిల్లి
యెండ చేఁ గాగిన కొండగోఁటి నెయ్యఁదెచ్చి, యెలమావినీడల నిలుపుఁ
గ్రోఁతి
యెడఁబాసిపోయిన పిడియేనుఁగులఁగూర్చి, కరివిరహంబు కేసరి
హరించు

స్తనితముల కెగఁబడినచ్చు శరభములను
బట్టి యెయ్యన ధాత్రిపైఁబెట్టి కాచు
గండభేరుండ పక్షులుగలిగి యజుని,
యాశ్రమము శాంతరసరూపమయ్యెనపుడు.[2]

---

1. శ్రీ కా.మా. 2ఆ_70ప.
2. శ్రీ.కా.మా. 2ఆ _ 71ప

తల్లి వి కనలేక గిగుబుబెందు లేడిపిల్లకు పెద్దపులి పాలిచ్చుట, నేలపైబడిన చిలుకను పిల్లి రక్షించుట, కొండగొఱియను క్రోతిరక్షించుట, ఆడేనుఁగు మగయేనుఁగును చేర్చి సింగపుపు వాని విరహమును పోగొట్టుట, శరభములను గండభేరుండములు రక్షించుట ఏ యా శ్రమమునఁ గననగు విచిత్ర సన్నివేశములు. తపోవనభూములనిట్లు అజస్ర వైరులగు జంతుజాలము పరస్పర మైత్రి సహకారముంతో మెలఁగుట సర్వసాధారణ విషయము అట్టి చరితమూ శ్రమభూముల మహిమను వెల్లడించును.

నాచనసోమన, శ్రీనాథుడు, పినవీరన, పింగళిసూరన ఇత్యాదుల యందీ వర్ణనము గాంచగలము.

నాచనసోమన :-

పవనవేగవిశీర్ణపాదపాగ్రంబుల, జడియుడుంతగఁబట్టు సామజములు
పూజార్థనియమిత పుష్పవాటికలపై, మధుకరంబులఁజోపు
మర్కటములు
నవభృధస్నానపర్యంత నిర్మలతకై కాసారముఁగాచు కాపరములు
నిజకోటజభాగ నీవారసీమలు, సారక గావలియుండు సూకరములు
గలిగి కంసవైరి కన్నులపండుపై, చెలువుమిగిలెఁ బూర్ణకలశ విగళదా
లవాల...*

శ్రీనాథుఁడు :-

కంఠాయనము సేయుగరఁటి శుండాదండ, పుష్కరమున సింహ
పోతకము
వాలాగ్రసుఖ ఘలవదన మించుక యెత్తి, ముద్దాడుఁబులి లేటిముద్దరాలి
నింపుకౌఁగిటఁజేర్చి నెమ్మిమైఁదోఁడేలు, కొదమ చింబోతును గుస్తరించు
గుంజ మంటపకుటి క్రోడమధ్యంబున నాఖులతోఁ జెరలాడు నడవిపిల్లి

* ఉ.హరి — 2ఆ — 100ప.

మొండతోఁకకయుండఁగ నెత్తిపట్టి
బగలు ముంగిటి భుజగంబు పడగ గొడుగు
క్రోత్రితో మైత్రి పాటించు గొనుడగొత్తి మా
కార్త్వికేయుని పుణ్యాశ్రమాంతరమున¹

వివరణ :-

వృద్ధసింహమునకు విహారింపఁదొండంబు, కైదండగా నిచ్చు గంధగజము
పులి క్రొత్తయీనికఁ బొదరింటిలోఁ కిఁబులిటాలి తగఁ బ్రోఁగొఁచోవు హరిణి
శరభంబు కొనఁగోళ్ల శిరము నువ్వగ, జోకిలు కనుమోడ్చు సుఖనిద్ర
గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన, వింతలేక చనిచ్చు బాలింతకరిణి

ములుకకోడుతఁ జెరలాడు జెనసి పిల్లి,
నెమ్మి పురివిచ్చి నిలిచి పింఛమ్ము నీడ
భుజగకన్య నాడించుఁబూరినమలి,
అనఘు కణ్వమునీంద్రు పుణ్యాశ్రమమున.²

సూచన :-

ఆవులు నాఁగన్న అమోఘ ఫులులును, బులులచెన్గుదువంగఁబోవు
లేళ్లు
లేళ్ల చెర్లాట రంజిల్లెడు హరులును, హరులు గోళ్లనుగోఁత నలచు
కరులుఁ

---

1. కాశీ ఖండ. 2ఆ - 43ప.
2. శృం.శా. 2ఆ - 45ప.

గడలకటాళి వైఖరి నాడు పాములుఁ బాముల లాలించు బభ్రుతతులు
బభ్రుతతుల ప్రక్కఁ బాయని యెలుకలు, నెలుకలఁ బెంచు పిల్లులును.

8. **రణము** :— మన ప్రబంధమున రణవర్ణనము రెండుచోటులఁ గలదు. బ్రహ్మ ప్రసాదప్రాప్తుఁడగువాఁడు, నిశాచరులగు కోణపవీరులపైఁ దంద్రియూథపై దండువెడలి, నారలంకకుఁ జొచ్చియార్చుట, కిరాతార్జునులు పోరుట అను తావుల నీ రణవర్ణనము గలదు.

**ఉగ్రగుని రణము** :— ఈ ఘట్టమున పద్యగద్యములు రెండును వీరరౌద్ర రసపూరితములై భయానక బీభత్సాదులుపాంగములుగా నిర్వహింపఁబడినవి.

గరళంబుద్ధతి నా రగింపఁజను నుగ్రవ్యగ్రవిస్ఫూర్తి సా
గర మాపోశన మెత్తు కుంభజుని రేఖన్, ధ్వాంత సంతాన సు
స్థిరగం దీర్చు దినేంద్రుచందమున, నా సేనం గనుంగొంచు, భీ
కర వేగంబునఁ దాఁకె నుగ్రుఁ డుగ్రంబైన రూపంబునన్.[2]

రౌద్రమూర్తి యైన యుగ్రుని విజృంభణమిది. రణాంతమున నాహవస్థల మతి భయంకరమై, జుగుప్సావహమై యున్నదానిని కవీంద్రుఁడు గద్యమున వృత్త్యనుప్రాసాద్యలంకారములతో వర్ణించియున్నాఁడు. బీభత్సరసనిర్వహణమున నీ యంశము పరిశీలింపఁబడెను.

ఇఁక గిరాతార్జునుల మల్లసంగర సందర్భమున నింకొక రణవర్ణనముగలదు. ఆ వర్ణనము భారతదేశమున నందును ముఖ్యముగాఁ దెలుఁగుదేశమున మనకుఁ బరిచితమగు మల్లయుద్ధమును కన్నుల గట్టినాఁడు ధూర్జటి. స్వభావసుందరముగ నలరుచున్నట్టి వర్ణనమిది.

---

1. కళా పూ. 3ఆ - 12ప.
2. శ్రీ.కా.మా. 2ఆ - 40ప.

అవి హాస్యరసాలవాలమై యొప్పుచున్నది 'మాటలాడఁదలంచి మఱచిపోయెడువారు, నడువఁబోవ ప్రమాదపడువారు ..[1] ఇవ్విధంబున మధుర మధుర రసాస్వాదనామోద మేదుర వినోదంబుఁ గేలి సలిపినారు శబరులు.

మధుపానమత్తుల నాటచేష్టలు వర్ణించునప్పుడు చక్కని స్థితిదృశ్యము నందించిన వాఁడు హరిభట్టు

'తతతతామరసాక్షి తలపంతమూడకు, వివివిభీణాకంఠవీణఁ దెమ్ము
పపపప టలగంధి పాటవ డు మొకింత, కుకుకు కుందస్మితకురులు
ముడువు...[2]

11. వనవిహారము :- పార్వతీపరమేశ్వరుల వనవిహారవర్ణనమిందుగాంచ నగును. 'మంచుగుబ్బలి రాజకుమారిఁగూడి, వేలుపులపెద్ద జముదెస వెండికొండ' దరిని బహువేషధారి యగుచు ద్రిమ్మరుచుండునట.

'శిష్టసంసారముష్టింపచాశ్రమముల, వెలఁగు సంయమిగృహమేధి
యగుచు
గాంతార మధ్య పక్కణ విహారంబులఁ జలుపు గిరాత సంసారి యగుచు
సంతతాంతర్యాగ సాధకస్థలముల, నలరారు సిద్ధ గృహస్థుడగుచు
లలితచతుర్విధాలంకారములఁ దాల్చు, నవభోగ రతిగృహనాథుఁడగుచు

మంచుగుబ్బలిరాజుకుమారిఁగూడి, వేలుపుపెద్ద జముదెస వెండికొండ
దన్నుఁ దెలిసినవారికి నన్ని దెసలఁ దానయగు రీతి బహువేషధారి
యగుచు'[3]

---

1. శ్రీ.కా.మా. 2ఆ - 41ప.
2. నా పు. 2ఆ - 158ప.
3. శ్రీ.కా మా. 1ఆ 101ప.

ఈ విహారపద్యవర్ణనమునఁగవి పరమేశ్వరుని పార్వతీసహితునిగా వర్ణించుట పురాణ దంపతుల ఆదర్శదాంపత్యమును, ఎడమెఱుగని జంటగా నుండుటను పల్కినట్లున్నది తెలుపనే మనము భావించవచ్చును, ధూర్జటి 'తుషారశైలతనయావాంఛా సంపన్న పావనగాత్రస్థ్యము'నే వర్ణించు నీ పద్యము రూఢియొనర్చుచున్నది. వన విహారమును వర్ణించిన కవులనేకులుగలరు. వారెల్లరు నాయికానాయకుల శృంగార విలాసములు, నాయిక చెలులతోగూడ పుష్పాపచయముచేయుటలు వృక్షములకు దోహద క్రియలొనర్చుటలు వర్ణించియున్నారు. తిక్కన నిర్వచనోత్తర రామాయణము, నాచన సోమన ఉత్తరహరివంశము, రామభద్రకవి రామాభ్యుదయము, నృసింహకవి కవికర్ణ రసాయనము, భట్టుమూర్తి వసుచరిత్రము, సూరన కళాపూర్ణోదయము, అన్నయ సుదక్షిణాపరిణయము, తెలగన్న యయాతిచరిత్రము, ధర్మయామాత్యుని నలచరిత్రము, పైడిమర్రి వేంకటపతి చంద్రాంగద చరిత్రము, లింగనకవి ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము, అక్కినేపల్లి నృసింహకవి ఉషావతీ పరిణయము, చళ్ళపిళ్ళ నరసకవి యామినీ పూర్ణతిలకావిలాసము, పుట్టు వేంకటరామకృష్ణకవి పట్టాభిరామాయణము, నారపరాజు కొండకవి కవిజనచకోర చంద్రోదయము, కందుకూరి వీరేశలింగకవి రసిక జనమనోరంజనము, కొంతి వేంకటరామశాస్త్రి శంతనూపాఖ్యానములను కావ్యములందు వన విహారము వర్ణింపబడినది.

12. కన్యాంగ సౌందర్యము:- వేశ్యాతనయల కథయందు కన్యాంగసౌందర్యము వర్ణింపబడినది. సర్వసాధారణముగా కన్యాంగసౌందర్యవర్ణనము నుంచుకొనిరిగాని, ధూర్జటి వేశ్యాతనయలు శైశవమును వీడి సంధికాలము శివభక్తియుతులైనవారి శారీరక పరిణామమును శాంభవదేవోపాస్యానుగుణముగ నిరూపించినాఁడు.

శివపూజనాసక్తిఁ జిన్నిచన్నులపెక్కు, వయుఁ బ్రత్యహంబును నయమునఁ
జూప
శైవాగమాంతర జ్ఞానంబుఁ దనులతా, ప్రభయు నంతంతకు నభినవముగఁ
బార్వతీప్రాణేశభక్తియు, గూకట్లు నెలసి నానాటికి వృద్ధిఁబొంద
వారకులాచార వాసనాబాల్యంబు, లోకపూట కొకపూట కుడిగిపోవ

> శాంభవంబైన తేజంబు శైశవాప, గమవయోగణ్యలావణ్య గౌరవంబు
> హృదయమునను, సంగతంబుల నుదయమొందఁ జదువఁబోవుదు రిరువురు
> మదవతులును.[1]

మానసికము, శారీరకములగు పరిణామములు రెండు నొక్కక్రమమున సంభవించినవనుట ఈ వర్ణనము. 'హృదయము సంగతంబుల' శాంభవంబైన తేజంబు శైశవాపగను వయోగణ్యలావణ్య గౌరవంబు లుదయమొందినవి. శాంభవంబగు తేజంబు రూపుగొనుటకు తొలుత శివపూజనాసక్తి కలుగుట, అది క్రమముగా శైవాగమాంతర జ్ఞానముగా పరిణామమందుట, పార్వతీ ప్రాణేశభక్తి వృద్ధిపొందుట జరుగగా వారకులాచారవాసన వదలిపోయినది. అట్లే యవ్వనమున కారంభచిహ్నములవలె చిన్నచన్నులగపడుట, తనుల తామ్రప్రభ యభినవముగ పెంపొందుట, ముచ్చటగా కూకట్లు వృద్ధిపొందుట, బాల్యముడుగుటలు వయోగణ్యలావణ్య గౌరవ ముదయమందుటకు కారణాలు.

13. చంద్రోదయము :—చంద్రోదయమునకు మున్ను తారకలు పొల్చుటను శివకేశవుల కభేదముగను, చంద్రబింబమును శివలింగముతో నభేదముగను వర్ణించుట, మన ప్రబంధమందలి చంద్రవర్ణనమునకుగల విశిష్టత. ఇచ్చటి చంద్రోదయము శృంగారరసప్రాధాన్యముగల యితివృత్తమున, ఘట్టమునకు చెందినదికాదు. శివార్చనాపరము లగుకాళహస్తుల పోరాటమునకు మున్ను రాత్రియగుటచే చంద్రుఁడు శివుఁడేయైనాఁడు. చంద్రుడును శివుఁడును సోములేకదా!

> ఉదయగ్రావము పానవట్ట మభిషేకోదప్రవాహంబు వా
> ర్ధి, దరీధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీపప్రభారాజి కౌ
> ముది, తారానివహంబు లర్పితసుమంబుల్గా, దమోదూరసా
> ఖ్యదమై శీతగభస్తిబింబ శివలింగంబొప్పెఁ బ్రాచీదిశన్.[2]

చంద్రునుదయమున కాలవాలమైన తూర్పుకొండ, తూర్పుసంద్రము, అలముకొన్న చీకటి, వెన్నెల, నక్షత్రములు, శివలింగమునకు పానవట్టముగా, అభిషేకజలముగా

---

1. శ్రీ.కా.మా. 4ఆ – 23ప
2. ,, 2ఆ – 133ప

ధూపముగా, దీపకాంతిగా, పూజాపుష్పములుగా రూపొందినవి. ఇరువురును తమో హరసౌఖ్యకారకులే.

ఇట్టి వర్ణనలు ఇక్కాలి రక్కావ శ్రీనాథుని భీమఖండమున చంద్రవర్ణనమున జూడగలము.

కాదు కాదుదయాద్రి కనకకూటంబిది, దంబైన పానవట్టంబుగాని
కాదు కాదిది సుధాకరపూర్ణబింబంబు కాశ్మీర శంభులింగంబుగాని
కాదు కాదుదయరాగప్రకాశంబిది నవకుంకుమాలేపనంబుగాని
కాదు కాదిది కళంకచ్ఛటారించోళి పూజచేసినకల్వపువ్వుగాని
యనఁగ సప్తార్ణవములు మిన్నందికొనఁగ, జంద్రకాంతోపలంబులు జాలు వాఱ
నసమశర సార్వభౌము ముత్యాలగొడుగు, విధుఁడు విశ్వంబు వెన్నెల వెల్లి దేల్చె.*

ధూర్జటి కవీంద్రుఁడు చంద్రవర్ణన గావించిన వేశౌకతావునను, నిట్టి శివ పార మ్యమునే ప్రకటించెను. వేశ్యాతనయలు శ్రీకాళహస్తికిఁ బయనము సాగించుటలో గడచిన రాత్రివర్ణననిది. అచ్చట చంద్రుఁడు భూతేశునితోఁబోల్చబడెను. తరువాఁ సూర్యాస్తమయము చంద్రోదయములు రెండునొకేసారి జరిగినట్లు వర్ణింపబడెను. మఱల చంద్రుని యుదాత్తత కొనియాడఁబడెను.

వామాంగభామినీశ్యామ భామాళియు, గంఠహాలాహలకాళిమంబు
నాకాశకేశపాశాసితచ్ఛాయయుఁ జూళికాసింధుశైవాలరుచియుఁ
గరకృష్ణసారాక్షిఘనధూమనీలిమ, శేషభూషణ ఫణాసీమ నలుపుఁ
గటితటకీలిత కరటిచర్మద్యుతి, మేచక శూల శోభాచయంబు,

* భీ.ఖ 2ఆ – 41ప

భువనలోచను పైనెత్తిపోవు నంధకారబృందమునకుఁ దోడుగాఁగ నూర్చి
వెనుక నేతెంచు భూతేశువిధను దనర, జంద్రుఁ డుదయాద్రిపై నొప్పె
సాంద్రకాంతి.[1]

ఇందు చంద్రుఁడు శివునితోఁ బోల్పఁబడుటఁ గాంచితిమి. అయిన, పద్యవర్ణనమంతయు శివరూపచిత్రణమే. నల్లరూపు కలిగిన విశేషణములన్నియు శివునియలంకారములే. కాని శివుఁడు తెల్లనివాఁడే. శివునివంటి తెల్లనివాఁడే చంద్రుఁడును కాన శివుని నీలిమ విశిష్టములగు నాభరణములన్నియు చీఁకటితోఁ బోల్చి, యావెనుక చంద్రుని పలుకుట యిందలి చమత్కారము.

సూర్యాస్తమయము, చంద్రోదయము నొకేమారు జరిగినవను నంశము స్ఫురించునట్లు ఒకే పద్యమున కవి యాఁ రెంటినిఁ గూర్చెను.

**తిమిర దినేంద్రజా జలము దెచ్చి, యజాండఘటంబునందుఁబో**
**సి, మరలఁ బశ్చిమాశయను చెల్వ వహించిన పద్మరాగ కుం**
**భము గతి సూర్యుఁడుం జనియెఁ బ్రాక్సతి వెన్నెలవెల్లు వీటితో**
**యము వడఁబోయు హేమకలశాకృతిఁ జంద్రుఁడు నొప్పె నయ్యెడన్**[2]

పశ్చిమదిక్కున అస్తమించుచున్న సూర్యుఁడును, తూర్పున నుదయించుచున్న చంద్రుఁడు నొకే సమయమున నుండుటయిది. అస్తమించుచున్న సూర్యుఁడు పద్మరాగకుంభమువలె, ఉదయించుచున్న చంద్రుఁడు బంగారుకుండవలె నుండుట సహజమగు వర్ణనము. చీఁకటియను యమునను క్రుమ్మరించిపోయినాఁడు సూర్యుఁడు. వెన్నెల యను ఆకాశ గంగాజలమును తెచ్చునట్టివాఁడు చంద్రుఁడు.

**గగనాహార్య్యమృగేంద్రశాబకము, నక్షత్రాంబుజారణ్యమ**
**ధ్యగహంసంబు, నిశావధూకరతలోద్యన్మల్లికాగుచ్ఛ, మ**
**ధ్యగబాధావహ చిత్తభూకటకయాత్రాపతాకాక్షితచ్ఛత్ర, మొ**
**ప్పుగతిం జంద్రుఁడు దోఁచె, దంపతుల కింపుల్మీఱఁ దొల్తెసన్**[3]

1. శ్రీ.కా.మా. 4ఆ - 80ప.
2. ,, 4ఆ - 91ప
3. ,, 2ఆ - 134ప

చంద్రుని స్వరూపస్వభావము లిందు ల్లేఖింపఁబడెను చంద్రుఁడమృతకలశముగా నుత్ప్రేక్షింపఁబడినాఁడు. తరువాతి పద్యమున

గరుడానీత సుధాఘటంబుగొనిపోగా నిర్జర శ్రేణి వెం
ట రయంబారఁగఁ బాఱు నాగముల చూడారత్న సందోహ మం
బరవీథిం బరగింపఁ జంద్రుఁ డుదయింపందోఁచె దోషా ముఖా
త్కరముం జిందమృతంబు బిందువుల శంకం బ్రస్ఫుటం జేయుచున్,[1]

గరుడునిచే గొనిపోఁబడిన యమృతభాండమువలె చంద్రుఁడున్నాఁడట. వాని నుండి రాలుచున్న యమృతపు బిందువులుగా చుక్కలు వెలుగొందుచుండెనట. ఇట్టిదే వేశ్యాతనయుల కథయందొకటి కననగును.

కాముకహృద్వధింగలఁచు కన్నము, బుష్పము దేవకోటికిన్
వ్యోమపథంబు లేనె వెరగొప్పెడు పర్వము, నవ్వముత్పల
శ్రీమతికిన్, జకోరమహిమధుప ళికిఁ బ్రోచునన్న మై
యామవతీశబింబ ముదయాచల మెక్కెఁ బ్రభాళి పెక్కునన్.[2]

ఐట్టుమూర్తి హరిశ్చంద్రనలో పాఖ్యానమున నీనికి సౌందర్యము దాల్చు వర్ణనమొకటి కనఁబడును.

కళలకు నిమ్ము, సోమ్ముసెగకంటికి, మింటికిఁ జెన్ను, వెన్నుతో
య్యాలి సయిదోడు, కూడు దివిజాళికి హేళికి జంట, తుంటవిల్
గలదొరవిందు, పొందుమిరిగల్వకు, జల్వకునిక్క, రిక్కరే
వెలఁదుల, నీవి-బాళితుచిపిచికిఁ, బ్రాచికినచ్చెఁ జెచ్చెరన్,[3]

---

1. శ్రీ.కా.మా. 2ఆ – 135ప
2. ,, 2ఆ – 92ప
3. హరి.నలో. 4ఆ – 16ప

చుక్కలతేఁడు, చీఁకటి సూఁడు వెలుంగులఱేనిజోడు బల్
జక్కవపుల్గుమొత్తముల సారెకు నేఁచెడు వాఁడు చక్కనౌ
మిక్కిలి కంటి దేవరకు మేల్నగమై తగువాఁడు కల్వలన్
మక్కువఁ బ్రోచుఱేఁడు మరుమామ కనంబడె దూర్పుకొండపై[1]

**14. సూర్యోదయము :-** మన ప్రబంధమున ఏ సూర్యోదయ వర్ణనము రెండు చోట్లనున్నవి. పామునేనుఁగుల పోరు కథయందును, వేశ్యాతనయుల కథయందునుఁ గలదు. పామునేనుఁగుల కథయందు సూర్యోదయ వర్ణనము సందర్భోచితమై, సాభిప్రాయమై యలరుచున్నది.

పన్నగంబు, గజంబు. బలమునఁ జలమున, బోరుచెట్లో? శివునిఁబొందు
చెట్లో ?
చూడఁ దలయు' ననుచు వేడుకతో వచ్చె, కరణి, నంతఁ దోఁచెఁ గర్మ
సాక్షి.[2]

ఇచ్చటి 'కర్మసాక్షి' యను సూర్యునకుపయుక్తమైన విశేషణము సాభిప్రాయము. ప్రపంచమున సర్వజీవుల సర్వకార్యములకు సాక్షిభూతుఁడుకాన సూర్యుఁడు నాఁటి పామునేనుఁగుల పోరు జరుగు తీరు, పరమేశు బొందురీతి చూడవలయున నిఁ ఉదయించె ననుట కవి ప్రతిభకు నిదర్శనము. ఇచట సూర్యోదయవర్ణనము దీర్ఘముగా సాగకుండుట యెంతయు సముచితముగా నున్నది. పామునేనుఁగులు రెండును క్రిందటి రాత్రి మిక్కిలిగా బాధపడి, 'యెప్పుడు తెల్లవాఱును? సహింపగరాని విరోధివహ్ని నేఁడొప్పున నార్తు మెక్కొ? యనుచు,[3] వేఁగించినవికాన, సూర్యుఁడును వేగముగా నేఁగుదెంచెననుటకు సూచనగ కవి ధూర్జటి యిచ్చట సూర్యోదయమును ఒక్కగీతములో, వేగసూచకము లయిన చిన్నచిన్నపదముల ప్రయోగమున వర్ణించుట కవీంద్రుని యౌచితీపాలనమును, కథనచైపుణిని వ్యక్తము చేయును.

---

1. ర.జ.మ. 4ఆ - 9ప
2. శ్రీ.కా.మా. 2ఆ - 139ప.
3. శ్రీ.కా.మా. 2ఆ - 137ప.

వేశ్యాతనయలకథయందు సూర్యోదయ మొకవృత్తము గలదు. చంద్రు నుల్లేఖించినట్లే, కవి సూర్యునిగూడ నుల్లేఖించెను.

చీకటికానచిచ్చు, భవచేలకుసుంభము, తూర్పుకొండకున్
గూఁకటిరత్న మబ్జవనసూరిమింపంట, చకోరరాజి పే
రాఁకటిమంట, శోణకిరణావళి గంట, రథాంగకేళికిం
దేఁకువపెంట, మింటజను దెంచె దినేంద్రుఁడు కాలఘంటయై[1].

ఈ పద్యమున సూర్యుని వర్ణించుటయందు మొదటి విశేషణము, తుదివిశేషణమును స్వరూపస్వభావవ్యంజక సమర్థములై యొప్పుచున్నవి. చీఁకటిని ద్రోచి లోకమునకు సర్వజాంతవజీవరక్షా సమర్థమైన వెలుఁగునిచ్చుట దినేంద్రుని కృత్యముగాఁ భాస్కరుఁడు కాలస్వరూపుఁడను నంశమును 'కాలఘంటయై' యను విశేషణముచే తెలిపినట్లయినది. ఈ రెండు విశేషణముల నడుమగల విశేషణములన్నియు ప్రబంధసామాన్యములే. ఈ రెండు నట్టివేయయినను ఆరెండింటినే మొదలను తుదనుంచుటయే యిందలి విశేషము. రూపకోల్లేఖాలంకారములచే నీవర్ణన మలంకరింపఁబడినది.

15. సురతము : దాసి-మిండజంగముల కథయందును, వాణీశతానందుల కథయందును సురతవర్ణనము జరిగినది.

తానుఁ గుమారజంగమ సుధాకరిమాళియుఁ గూడిమాడి యిం
పైన రతి ప్రసంగములు, నర్ధనిమీలితనేత్ర పద్మముల్
మానని చుంబనంబులును మాటలచొక్కులు, వీడివీడిపో
నీని కౌఁగిలింతలు, ననేకవిలాసములుం జెలంగఁగన్.[2]

1. శ్రీ.కా.మా. 4అ - 97ప.

2. శ్రీ.కా.మా. 1ఆ - 42ప.

ఎక్కడఁజుట్టినం గళలయిక్కువ లెక్కడ నొరసోఁకినన్
జక్కెరలప్ప లేమనిన సారసుధారస మొట్టులుండినన్
జక్కదనంబు పెన్నిధులు, సంభ్రమ మొప్పఁగ నేమి సేసినన్
మక్కువ చెయ్వులై మఱియు మన్మథకేళి రొనర్చునంతటన్. 1

దాసి-మిండజంగముల కలయికయగుటచే నిందలి వర్ణనము శృంగారము రసస్థితి చేరినట్లు వర్ణింపఁబడినది. ఆ దాసి 'పురపల్లవప్రకరనేత్రానందబాష్పాంబుధారావర్షాగమ చంచలాలతిక'2, అతఁడును 'సౌందర్యము చూచి కామశరసంతాపంబునుం బొందకుండిన కాంతామణి'3 లేని సుందరుఁడు. వారిదువురును కూడిమాడి, యనేకవిలాసములం జెలంగుటకు ఇంపైన రతిప్రసంగములు ప్రారంభముకాగా, వీకవీడిపోని కౌఁగిలింతలు ఫలితాంశము. వారి సర్వచర్యలును మన్మథకేళికి దోహదకారులే యయినవి. వారి యప్పటి మనఃస్థితి నందించునది రెండవ పద్యము.

తననతియెడల వాంఛాచాపల్యము తీఱకపోవుటచే వాణీవల్లభుఁడు, తనకోరిక ఏడేరుట కామెను శతవాగ్వనజానన కావలయునని కోరుటతో నిచ్చటి ప్రసంగము ప్రారంభమైనది. శతానందుఁడను పేరు బ్రహ్మకు కలుగుటకీపద్య కారణమైనది.

అందున కెంతయుం బ్రమదమందుచుఁ బుష్పిత వల్లులందు నిం
చిందిరశాబకంబు పువుదేనియ గ్రోలెడిరీతి నూర్వరం
బొంది, సుధాధరగ్రహణ భూరిసుఖంబుల నొందుచున్నతా
సంపుఁడనంగ నొప్పెసఁగె నాఁడు మొదల్కథలస్విధాతయున్.4

---

1. శ్రీ.కా.మా. 1ఆ 43ప.
2. ,, 1ఆ 33ప
3. ,, 1ఆ 32ప
4. ,, 2ఆ 16ప

బ్రహ్మకు శతానంద శబ్దము నిట్లు సార్థకము చేయుట కవి ధూర్జటి యుపజ్ఞయే. తరువాత ధూర్జటి లింగరాజుకవియు తన 'శ్రీకాళహస్తిస్థలమాహాత్మ్యము' నందు దీని ననుసరించి యున్నాడు. దేశకాలములు మఱచి హృజ్జాతాంధకారాంధుడై బ్రహ్మ, రతిసుఖంబులఁ దేలెసి,

అధరపల్లవపాన సంగంబుమఱచు దం, తక్షతంబునఁ గొంత తలఁపుఁ గలుగు
బరిరంభణంబునఁ బరవశుఁ డగు, నఖంబులు నాఁట జెనకినఁ దెలివినొందు
బహుబంధరీతికి లోఁబడి చొక్కుఁ, గళరవ, శ్రవణంబుచేత నెచ్చరిక నొందు
సురతాంత సుఖమున సోలుఁ, దాంబూలంబు సేయింప నించుక సేద దేఱు మగుడ
బాలికాసంగసౌఖ్యాబ్ధి నోలలాడు.[1]

'నల్వకొకయప్పుడు సారకలేదు కూటమిన్'[2]. కామాంధకారాంధుఁడైన బ్రహ్మ చేష్టలవలనఁ గల్గినవారును 'అన్యరమణీకామాంధకారాంధు' లేయయిన కోణపవీరులు.

16. దౌహృదము:- పాత్రనిర్మాణమున గుర్విణ్యవస్థా చిత్రణమున నీదౌహృదము విపులముగఁ జిత్రింపఁబడినది. ఈ దౌహృదము మన ప్రబంధమున మూఁడు తావులఁ గనంబడుచున్నది. సరస్వతి ఋభువును గర్భమున దాల్చినప్పుడును, తదెంతిన్నని కడుపున ధరించియున్నపుడును, మాణిక్యవల్లి యను వేశ్య చూలింతయైనప్పుడు నీ చిత్రణము గలదు.

సరస్వతి :

నెలరెండ్లెల్లకఁ జీరచిక్కెఁ ద్రిజగన్నిర్మాత యిల్లాలికిన్
జెలఁగెం జిట్టుము లంకురించె నరుచుల్, చెక్కుల్ ప్రభాతేందు మం
డలతేజంబున నొప్పెఁ గౌను బలిసెన్ దాసెం గుచాగ్రంబులన్
నలు పాయాసము దోఁచె నభినగంబయ్యె నిట్టూర్పులున్.[3]

1. శ్రీ.కా.మా. 2ఆ - 20ప.
2. ,, 2ఆ 21ప
3. ,, 2ఆ - 30ప.

తెల్లనగు మేను కుసుమితవల్లి గాఁగ
గురుకుచంబులు పుష్పమంజరులు గాఁగ,
నందునుండెడి నలుపు లిందిందిరములు
గాఁగ జెలువొందె వాగ్దేవి గర్భమహిమ.[1]

అస్మల్లోనున్న పుత్రహత్యాకళంక,
మాతృజాభావతాదోష మాతృరూప
మైన పిండంబు గర్భస్థమైన, బైట,
వెడలెనఁ జచ్చు మొనలందుఁ బొడమె నలుపు.[2]

సౌఖ్యలేశములేని సంసారమోహాబ్ధి, మానము విడిచి త్రిమ్మరఁగఁగోరు
ముక్తిసామ్రాజ్యాభిషిక్తులై విహరించు, యోగసిద్ధులలోన నుండఁగోరు
మానమ్ము దాసక్తి మదికి నింపగుచోట, నేకాంతమున వసియింపఁగోరు
సత్ప్రవృత్తి ప్రాప్తమగు పదార్థంబుల, దీపనాదిన్యథఁదీర్పఁగోరు
విష్టపవ్యాపకంబు సవిస్మయంబు, నైన బ్రహ్మంబు పిండమైయాత్మగర్భ
గోళముననుండఁ, దన్మహాగుణములెల్లఁదెలుపు మెలపున నంతటఁబలుకు
వెలది.[3]

గర్భిణి దనుమొనలకుఁగలుగు నలుపును, పుత్రహత్య, పుత్రరాహిత్యములను దోషములను గురుతుగాఁబలుకుట ప్రకరణౌచిత్యముగా నలరుచున్నది. మనసులోని బాధలను శరీరమున గుర్తులు మిగులుట యదియేకదా!

తండె : తండెకు శైలజాధిపుకరుణచే నెల మనలేను. ఆ తండె పొందిన శారీరక పరిణామ మంతయు శివాత్మకముగఁబలుకుట కవి ధూర్జటి శివపారమ్యతను వ్యక్తముసేయునది.

---

1 శ్రీ.కా.మా. 2ఆ - 81ప.
2 శ్రీ.కా.మా. 2ఆ - 82ప.
3 శ్రీ.కా.మా. 2ఆ - 83ప.

భసితాంగరాగ శోభావిలాసంబుతో. బ్రబలివచ్చు నానన పాండుగరిమ
కంఠహాలాహల కాళిమచ్ఛవితోడ, నెచ్చు నెగుబ్బచన్నొనల నలుపు
పరశివాకృతితోడ సరిచ్చు నణుతరం, బనజాలి ఘనతరంబైన నడుము
స్వస్వరూప విచార సంప్రాప్తశాంతితో, మార్పడుఁజెల్వె మానజడిమ[1]

సరభసానంగ క్రీడజనునుసీక,
దౌహృదము 'గర్భమునను స్నతనయుఁడీశుఁ
బ్రథై ప్రకాశింపఁగలఁడని' యపుడుదెలుపు,
కరణిఁబెంపొందె నమ్మందగామినికిని.

ఒక తర్వాత రెండు పద్యములును కలుగనున్న కుమారుని గుణశీలములకు సూచకము లుగా నున్నవి.

గంధగజకుంభ శాతినన్నకర్చారేఖ,చారుమృగరాజ మధ్య శృంగారగరిమ
చెలుపఁగలఁడల్ల శిశువని చెప్పునట్లు. సుదతిచన్నులు నడుమును
సొబగు దప్పె.[2]

పంచాననానేకప వ్యాఘ్రసూకోలాది, మృగములఁ జంపఁ గామించె లేమ
శైలోపకంఠనిర్ఝరసైకతస్థలి, శివునిదర్శింపఁ గాంక్షించె నాల
ఖండేందుశేఖరు గండూషితాంబుధారల మజ్జనము సేయదలఁచె నింతి
చవిమైన ఘోణి మాంసమ్ము దొప్పలఁబెట్టి, యభవున కర్పింపనలివనోరె

నేత్రనీలోత్పలంబుల నీలగళుని,యర్చనముసేయఁజింతించె నంబుజాక్షి
గర్భగోళమునందున్న యర్భకునకుఁ, గల గుణంబులఁ దెలిపెడుకరణి
నపుడు.[3]

---

1. శ్రీ.కా.మా 3ఆ- 22ప.
2. శ్రీ.కా మా. 3ఆ - 23ప.
3. శ్రీ.కా.మా. 3ఆ - 24ప

చెప్పఁడా వరింపనున్న శిరోపచారముల నీ తుదిపద్యమున సూచించుటయైనది.

సరస్వతి, తండెల గర్భిణ్యవస్థా చిత్రణమునకును, వేశ్యాసూరా గర్భిణ్యవస్థా చిత్రణమునకును నంతరము గలదు. మాణిక్యవల్లి దౌహృదవర్ణనము సాధారణముగనే యున్నది.

ఆ వామేక్షణ దైవయోగమున గర్భాధానముం బొందినన్
వేవిళ్లయ్యె, నరోచికంబు వొడమెన్, వెల్లందనం బాస్యరా
జీవవ్యాపకమయ్యె, నోపమి జనించెం, జూపులన్ గుక్షియున్
లావయ్యెన్, విటకోటిసంగసుఖ మల్పంబయ్యె, నాపిమ్మటన్.[1]

ఈ మూడింటి చిత్రణమునందు బ్రహ్మవిద్యానిధియగు బుధుజననమునందును, పరమభక్తాగ్రణియగు తిన్నని జననమునందును వారివారి తల్లుల సావిత్ర్యమును పోషించుట యందుగల యాసక్తి కవిధూర్జటికి ఒక వేశ్యను వర్ణించుటయందు లేదని తెలియఁగలము.

17. సుతజననము:- బుధుజననము, తిన్నని జననము, వేశ్యాతనయల జననము లిందుగలవు.

బుధుడు

వాఙ్మయంబైన వేదాంతవార్ధియందు,
నర్థమయుఁడైన చిద్విధుఁడవతరింపఁ
దన్ను మఱచిన తెఱంగునఁ దమ్మిచూలి,
ప్రమదమునఁ జొక్కెఁ; వాణి గర్భమునుండి.[2]

1. శ్రీ.కా.మా. 4ఆ - 7ప.
2. శ్రీ.కా.మా. 2ఆ - 85ప.

ఉదయించెం బరమార్థరూపము, మహాయోగీశ్వరోత్తంస, మీ
శదయావర్ధిత దివ్యతేజము, సదా శాంత స్వరూపంబు, దుః
ఖదసంసారవిదూరమానసము లోకంబుగ్సక్రీడలన్
బొదలంగా సుకరత్నమంత బననీ పుణ్యప్రభావంబునన్.[1]

ఇందలి 'దుఃఖదసంసారవిదూరమానసము' కవి ధూర్జటిదియే.

తిన్నఁడు :-

శుభముహూర్తమునందు నిభరాజగామిని, శివభక్తిమును పైన శిశువుఁ
గనియె

సంసారమోహపాశముఁగోసినటువలె, బొడ్డుగోసిరి పిన్నబిడ్డనికిని—[2]

ధూర్జటి కోరిక సంసారమోహపాశము తెగుటయే.

వేశ్యాతనయలు :- ప్రొద్దులనెల సొచ్చిన, స
మ్మున్నద్దియకు జనించిరపుడు మోహనమూర్తులే
ముద్దుమొగంబుల కన్యక,
లిద్దఱు, శివభక్తి తనువులెత్తిన పగిదిన్.[3]

మోహపాపులయందు జనించిన బిడ్డల విశేషములను పేర్కొనుటయందు కవి ధూర్జటి బ్రహ్మవిద్యాశక్తి, శివభక్తులు రూపుదాల్చినట్లున్నది.

వాఙ్మయుండైన వేదాంత వార్ధియందు, నర్ధమయుడైన చిద్విభుఁడు ముక్తుఁ, శివభక్తి మును పైన శిశువు తిన్నఁడుకాగా, తనువులెత్తిన శివభక్తియే వేశ్యాతనయలు.

1. శ్రీ కా.మా. 2ఆ_ 86ప.
2. శ్రీ.కా.మా. 3ఆ _ 22ప
3. ,, 4ఆ - 8ప.

18. మంత్రము :- ఈ ప్రబంధమున మంత్రమనునది వాచ్యముగా నెచ్చటనుఁబలుకఁ బడలేదు. వశిష్ఠునకు పృథవిలేపి 'స. సారమున్ రోసినన్ దేవోత్తంసునిఁబార్వతీరమణు భక్తిం గొల్వుమా, చేకుఱున్ జీవన్ముక్తి '[1] యని యుపదేశించుటయందును, వింధ్యగిరి గర్వమణఁపుమని భూతేశుఁడు ఘటసూతిని నియమించుటయందును,[2] భూదేవి దుఃఖము దీర్పఁగా బ్రహ్మ యుగ్రుని సృజించి కోణపవీరుల 'ఉద్ధతగతినందఱందునిమి, దైవత కోటులు నింగిఁబొంగ, భూసతికి ప్రియంబొసర్పు' [3] మని నియమిందుటయందును తిన్నని భక్తి నిఁబరీక్షించుదమని పరమేశ్వరుఁడు శివగోచరునితోఁబలికి, తిన్నని పరీక్షి, చుటకు చేసిన యత్నమునందును,[4] నత్కీరునకు కుమారస్వామి తెలిపిన యుపాయాంత రమందును,[5] మంత్రమను నీయంశము సూచ్యమయినదని గమనించుదము.

19. పరిణయము :- ఇదియు పార్వతీపరమేశ్వరుల వివాహము సూచ్యముగాఁ బలుకబడుటయందున్నట్లు తెలియుదుము.

వీరి 'పెండ్లి చూడంగ దక్షిణ దిక్చరాచరభూతములు హిమశైలమునకు,[6] వచ్చుటను ధూర్జటి ప్రసక్తము చేసెను.

20. ద్యూతమనునది యీ ప్రబంధమున పేర్కొనఁబడలేదు.

21. విప్రలంభము;- వశిష్ఠుని కోరికననుసరించి భువియందు నిలిచిపోయిన పర మేశ్వరుని విడిచి 'పరమేశ్వరియుఁబరమేశ్వర చిరవిరహంబు సహింపజాలసందెనని పలుకు సందర్భమున[7] నిది సూచింపఁబడెను.

---

1. శ్రీ.కా.మా. 1ఆ 66ప. 2. శ్రీ.కా.మా. 1ఆ - 108ప.
3. శ్రీ.కా.మా. 2ఆ - 81ప. 4. ,, 3ఆ - 104ప.
5. ,, 3ఆ - 213ప. 6. ,, 1ఆ - 108ప.
7. ,, 1ఆ - 89ప.

**22.** జలకేళి;- పార్వతితోఁగూడ పరమేశ్వరుఁడు దక్షిణాకైలాసప్రాంతములందు "క్రీడించు నొకవేళ గరిదరీ నిర్ఝరధారాపనీతనిదాఘుఁడగుచుండు"[1] నను వాక్యముచే జలకేళియు సూచ్యమయినది.

అప్పకవి తెలిపిన అరువది రెండు వర్ణనము లీ ప్రబంధమున పొందిన సమన్వయమును బరిశీలించితిమి. అవికాక, యింకను మన ప్రబంధమునఁగనగు వర్ణనములు మఱి కొన్ని యున్నవి.

1. ప్రభువు 2. సూర్యాస్తమయము 3. సూర్యాస్తమయ చంద్రోదయములు 4. సంధ్య 5. చీఁకటి 6. నక్షత్రములు 7. వెన్నెల 8. చంద్రబింబము శివలింగము 9. చంద్రాస్తమయము 10. ప్రాతర్వేళ 11 నది 12. సరస్సు 13. దుర్భిక్షము 14. వృక్షము 15. ఆటవిక జీవితము 16. బాల్యక్రీడలు 17. భూతము.

1. ప్రభువు :-

అ. శ్రీకాళహస్తి పురమున కధీశ్వరుఁడు యాదవభూకాంతుఁడు. అతఁడు శివునితో నభేదవ్యవసాయమున రూపింపఁబడినాఁడు. శ్రీకాళహస్తిపురమునేలు రాజు, శ్రీకాళహస్తినిలయుఁడగు పరమేశ్వరునితోఁ బోల్పబడుట కడుంగడు సముచిత మగు వర్ణనము.

శివనయనాక్షి జంగమస్థావరజంతుసం, తానమెన్నఁడు జవదాఁటవెఱవఁ

దన తేజమున నస్పదన్యత్సదోషర్బు, ధారణ-చంద్రములైన నడఁగిపోవ

దనదు శక్తిత్రయంబున సమస్తప్రపంచంబుల కభివృద్ధి సంభవిల్లఁ

గను మహాప్రకృతి పెద్దల చిత్తవృత్తికి, నగణితాశ్చర్యంబునావహింపఁ

జెలఁగె విశ్వేశ్వరుఁడు రాజశేఖరుఁడు, కనుత శతకోటి పరివృఢ కరటి
కంధర

విషధరాధీశ హరిముఖవివిధభువన, భారవహులకుఁ బ్రాణంబుప్రాణ
మగుచు.[2]

1. శ్రీ కా.మా. 1ఆ - 93వ.

2. ,, 1ఆ - 26వ.

శ్లేషానుప్రాణితాతిశయోక్త్యలంకారముతో నలంకరింపబడిన యీ పద్యము ధూర్జటి శివభక్తి ప్రాశస్త్యమును కథారంభమునుండియే వెల్లడించుచున్నది.

ఆ. తిన్నని తండ్రి నాథనాథుడు :— బోయనృపుఁడైన నాథనాథుని వర్ణనము జాత్యుచితమై యలరుచున్నది.

తనవిక్రమదర్పంబు హర్యక్ష, శిక్షవిచక్షణాక్షీణగరిమ
తనబాహుబలముకాంతారదంతావళ, దయితా నవీన వైధవ్యకరము
తనజవంబు కురంగదంపతీ పుంజాజ, రంజన భంజనాఖంజయశము
తనప్రతాపము మృగాదనసార్వభౌమదు, ర్వార గర్వాపహాదారుణంబు
గాఁగ, నానామృగఘ్రాణగంధవాహ, దందశూకేంద్ర నారాచబృంద వర్ష
కంధరోద్దండ కోదండకరుఁడు, మించె, నాథనాథుండరణ్య భూనాథుఁడగుచు.[1]

ఇ. మధురాపురాధ్యక్షుఁడగు పాండ్యనృపాలుఁడు:

ఈ నృపాలుని వర్ణనము మూఁడు పద్యములందు గలదు.

ఆపురమేలు భూవిభుఁడనంతపరాక్రముఁడప్రతర్క్యధా
త్రీపరిపాలన ప్రథిత ధీనిధి, వైరినృపప్రతాప సం
జ్ఞాపతి వాసవానిక యశస్సముదీర్ణుఁడుదీర్ణదాన వి
ద్యాపరకర్ణుఁడర్ణవసమగ్రగభీరుఁడు చారుఁడెంతయున్.[2]

---

1. శ్రీ.కా.మా. 3ఆ - 18ప
2. ,, 3ఆ - 138ప

అళఘుయ చోక్కనాథ శివుఁడల్లుఁడు, మూర్తి హిమప్రభాసము
జ్జ్వలఘనకీర్తి, ధైర్యమును శౌర్యము, భూభరణప్రభావముం
దలపనశక్యమై, వెలయ, దత్పురిపాండ్యనృపాలుఁడేలు ని
చ్చలు మిహికామహీధరము చందమునం గులగోత్రపాలుఁడై.[1]

ఆరాజు, పాండ్యధాత్రీ ధౌరంధర్యప్రమోదితగ్రావ హరి
ద్వారణ భుజంగపతి భూ దారకమఠపరివృఢ ప్రథానిధి యగుచున్[2]

మహాపరాక్రమనిధియగు పాండ్యనృపాలురవర్ణనమిది. మొదటి రెండును కథాకాలము నాఁటిపాండ్యుని పూర్వపు రాజవర్ణనముకాగా తుది కందము, ప్రకృత నృపాలుని వర్ణనము. మొట్టమొదటి రాజు అళఘుయచొక్కనాథునికి మామయయినవాఁడు. శివుని యల్లునిగా బొందఁగలిగినరాజు ఆపాండ్య నృపాలుడు. అట్టివాని వంశమున జనించిన వాఁడగుటచే కథాకాలమునాఁటి రాజు వర్ణనము నామ్రేడితము కావింపక కథనమునకు దోహదమగు కందమున చేసినాఁడు కవీంద్రుఁడు. అంతియేగాదారాజు,

అసిగినదిచ్చునర్థులకు, నాప్తులకిచ్చు మనంబు, కూటమిం
బడఁతులకిచ్చు సౌఖ్యములు, బంధుజనంబులకిచ్చు సంపదల్,
పుడమి సమస్తజాతులకు బొంకమి నుత్సవమిచ్చు, శత్రులన్
బొడవడఁగించి సాధుజనపుంగవకోటికి నిచ్చు వేడుకల్[3]

అట్టి కడు సమర్థముగాఁబాలించు రాజు దేశమున మఱి దుర్భిక్షము కల్గుట కేవలము ఈశ్వరేచ్ఛయే. ఈశ్వరుఁడు పరీక్షింపదలచుటయే దానికిఁగతము.

**2. సూర్యాస్తమయము:-** అ. పాము నేసుఁగుల కథయందు సూర్యాస్తమయము మీఁద పద్యములందు వర్ణింపబడినది.

---

1. శ్రీ.కా.మా. 3ఆ - 139ప
2. ,, 3ఆ - 143ప
3. ,, 3ఆ - 147ప

ప్రాగ్వధూమణి చిమ్మ, బశ్చిమకాంత, పట్టిన చెంగల్వబంతి యనఁగ
గాలవిష్ణుం డంధకారదైత్యుని వ్రేయం, జరమాద్రిఁ బడిపోవు చక్ర
మనఁగ
దినమహీరుహమునఁ దేజోమయంబుగా, బండి రాలిన పెద్దపండనంగ
దినమండి దేవదానవయుద్ధ రక్తార్ద్రమై నేలఁగూలు రథాంగమనఁగ
బద్మినీ సంగమశాంతిఁ బరిహరింప, నపరజలనిధి జలజంబు లాడఁబోవు
తరణి, నెఱపంజ, చందురుఁగా విపచ్ఛదంబు ధరఁబెట్టి, భానుబింబంబు
గ్రుంకె.[1]

తారాలోకము సంప్రకాశ ముఖచందంబై ప్రపాదింప, సం
ధ్యారాగావృతమై తమఃపటలసంతానంబు గప్పంగ, నం
భోరేఖల్గళదశ్రుధారలగతిం బొల్పారఁగఁ బోయెఁ గ
ష్టోరవాత్రితము నవ్వ, లోకనయనుం డంధీకృత ప్రాణియై,[2]
తిమిరపుఁగాలసర్పవితతిన్ గుహ లీఁగి చనంగఁ దోలి య
భ్రము వడి నెక్కిచూచి దిగి, పన్నగలోకముఁజొచ్చి పోవున
ట్లామరఁ బతంగదేవుఁ డపరాంబుధిఁ గ్రుంకెఁ, దదీయసేన తు
త్తుమురుగఁ బోరియు, న్మగుడఁ దోడనె ధాత్రినిఁ గూడముట్టగన్.[3]

మొదటిపద్యమునను న్న యుత్ప్రేక్షమాలిక హృద్యమైనది. ఇతరకావ్యములందు సూర్య చంద్రుల యుదయములందిట్టి యుత్ప్రేక్షలు కలవుగాని, సూర్యాస్తమయ వర్ణనమున, నే ప్రబంధమున మాత్రమే యిట్టి వర్ణన కలదనిపించును. జక్కన విక్రమార్క చరిత్రమునందు నిట్టివర్ణన మఱియొకటి కానగుచున్నది.

---

1. శ్రీ.కా.మా. 2ఆ - 123ప.
2. శ్రీ.కా.మా. 2ఆ - 129ప.
3. శ్రీ.కా.మా. 2ఆ - 130ప

పశ్చిమాంభోనిధి ప్రాంతదేశంబు నం దెల్లి విద్రుమ కుంజమనఁగ [1]
జరమాద్రి శిఖర దేశంబునఁ గనుపట్టు రమణీయ ఘనరత్న గండమనఁగ

ధూర్జటి పద్యమున నెఱిగింపఁబడిన సొగసులివి, కవీంద్రుని వర్ణనాశక్తిని మెచ్చుచునక. అట్లే తుదిపద్యము కవీంద్రుని యుపజ్ఞకుఁ బాత్రము.

చీఁకట్లను సర్పసమూహమును పాతాళ్రోలి, యవి యెంతవఱకు పాఱినవో చూచుటకా యన్నట్లు ఆకాశమెక్కి, నూఁది దిగివచ్చి వానిని తఱుముకొనుచు పాతాళమునకేగెనా యన్నట్లు సూర్యుఁడస్తమించినాఁడట. చీఁకట్లను సర్పములతో పోల్చుటచే, వానిని పాతాళమునకుఁ దఱ్ఱోలుటయు, వాని యునికిని కనిపెట్టి యుండుటకు ఎత్తైన ప్రదేశము ఆకసమునకెక్కి చూచుటయు, నిగి మఱల వానిననుసరించుచు నాగలోకమున కేగెనో యన్నట్లతఁడస్తమించెననుట మిక్కిలి సొగసయిన యూహముగదా!

ఆ. వేశ్యాతనయుల గాథ :-

సాయంకాల రఘుక్షితీశ్వరుఁడు కెంజాయన్ముఖంబొప్పగా
జాయవ్వచ్చి తమిస్రతీవ్రతర కాండధ్వస్తపాదంబుగా
జేయం, జక్ర వధూధరా సుతకు విశ్లేషవ్యథాపాదియై
మాయా హేమమృగంబు నాఁ బడియె మార్తాండుఁడస్తాద్రిపై.[2]

ఈ పద్యమున రెండు విశేషములున్నవి. సాయంకాలమును రఘురామునితోఁ బోల్చుట, సూర్యుని మాయాకాంచనమృగముతోఁ బోల్చుట. ఇట్టి కల్పన మనన్యశిల్పము. చక్రవాకవధువను సీత కెడబాటు కలిగించి, సాయంకాలమను రామునిచేఁ గూల్చబడిన మాయామృగమునా సూర్యుడస్తమించినాఁడు.

సూర్యాస్తమయము వర్ణించిన పై రెండు తావులయందును. కాలవిష్ణుఁడు, సాయంకాల రఘుపతీశ్వరుఁడును పదములచే ధూర్జటి విష్ణునెడగల సహిష్ణుత వ్యక్తము చేయబడు చున్నది. అతడు విష్ణుద్వేషి కాఁడని నిరూపించునవి యీ రెండు పదములును.

---

1. వి.చ. 3ఆ - 86ప
2. శ్రీ.కా.మా. 4ఆ - 87ప.

3. సూర్యాస్తమయ చంద్రోదయములు :— ప్రబంధములందు సూర్య చంద్రుల యుదయాస్తమయములు వేర్వేఱుగా వర్ణింపబడు కలదు. సూర్యాస్తమయ చంద్రోదయములు, చంద్రాస్తమయ సూర్యోదయములు ఒకదానినొకటి యనుసరించి యుండినను నడుమ సంధ్యలుండును. కొన్ని దినములందు సూర్యాస్తమయమే చంద్రోదయమగుటయు, సూర్యోదయమైనను చంద్రబింబములుండుటయుఁ గలదు. కాన నట్టియవకాశమును కవి ధూర్జటి చక్కగా నుపయోగించుకొనుట మనము గమనింతుము.

ధైరవాద్రిని దర్శించిన వేశ్యాతనయలకుఁ గన్పట్టిన దృశ్యము.

తిమిరదినేంద్రజాజలముఁ దెచ్చి యజాండఘటంబునందుఁ బో
సి మరల బశ్చిమాశయను జెల్వ వహించిన పద్మరాగపుం
భమగతి సూర్యుఁడుండఁ బయిఁ బ్రాక్సతి వెన్నెలవేల్పుకేటి తో
యము ముఁచఁబోయు హేమకలశాకృతిఁ జంద్రుఁడు నొప్పె నయ్యెడన్*

సూర్యాస్తమయ సమయమునఁ గల సూర్యబింబము, చంద్రోదయకాలమందలి లేత వెన్నెలతోడి బంగరు కలశమువంటి చంద్రబింబము లొకే సమయమునఁ గన్పట్టుట. చీఁకటియనెడు యమునాజలమును దెచ్చి బ్రహ్మాండమను కుండయందుఁ బోసి మరల పడమటిదిక్కనెడు కాంత చేతియందుఁ దాల్చిన పద్మరాగమణులకాంతిగల కలశము వలె సూర్యబింబము లదుండెననుటయు, నా సమయముననే తూర్పు దిక్కనెడు స్త్రీ తెల్లని ఆకాశగంగయందలి నీటిని వడఁబోయు బంగారు కలశమువలె చంద్రబింబ ముదయించె ననుటయు సొగసైన యుపమానములు. యమునాజలము నల్లగా నుండుట, గంగాజలము తెల్లగా నుండుట లిందు పలుకబడినది. ప్రపంచమునఁ గలము కొన్న చీఁకటిని వెలఁగ్రోసి స్వచ్ఛమైన వెన్నెల నీట నందించుటకు వడబోత యవసరము. కాన చంద్రుఁడను బంగారు కలశముచే నావడఁబోయుట వీలయినది.

4. సంధ్య :— ఈ ప్రబంధమున నరుణోదయమునకు బూర్వము సంధ్యారాగము వర్ణితమైనది. ఇది ఉత్ప్రేక్షలతో గూర్పబడి రంజకముగా నొప్పుచున్నది.

---

* శ్రీ.కా.మా. 4అ - 91ప.

నిర్ణిద్రపూర్వాద్రి నీప ప్రసూనాళి, రాగాంబురాశి తరంగమనగ
భానుభిల్ల గభస్తి భల్ల భగ్నతమోచ్ఛ, జల్ల నిర్యద్రక్త పంకమనఁగ
రజనీసుధాకర రతివియోగ నిదాన, కామప్రతాపాగ్ని ధామమనఁగ
సంధ్యానిదేవతా చారుపీఠ ప్రోత, పద్మరాగ ప్రభాపటలమనగఁ
గాలరసవాది బ్రహ్మాండగోళ మెల్లఁ, జిత్రబుద్ధి సువర్ణంబు సేయఁదలఁచి
ద్యుమణి శిఖమీఁదఁజల్లు సిందూరరాశి, యనఁగ నొప్పారె నరుణ
శోణాంశురాజి.[1]

ఎఱ్ఱని యీ సంధ్యారాగమిట్లున్నదఁట. తూర్పుకొండపైఁ జక్కగా వికసించిన మంకెనపువ్వుల యందమనెడు సముద్రమందలి యొక యలయా యనునట్లు, సూర్యుడనెడు భిల్లుని కిరణములనెడు బాణములచే చీల్చఁబడిన చీఁకటి యనెడు ఎలుగుబంటి యొంటినుండి జాలువాఱెడు నెత్తురనునట్లు, రాత్రి చంద్రుల కలయికను నెడబాటు కలుగుటచే జనించిన కామప్రతాపాగ్నియా యనునట్లు, సంధ్యాదేవి పాదపీఠమునకు అలంకారముగఁగట్టబడిన పద్మరాగమణుల కాంతిపుంజమనునట్లు, కాలమనెడు రససిద్ధుడు బ్రహ్మాండమునంతను బంగారుమయము చేర్పఁ దలచి సూర్యుని నెత్తిపై చిలికిన సిందూరమో యనునట్లు సంధ్యారాగమొప్పుచుండెను.

5. చీఁకటి:— సూర్యాస్తమయము తరువాత ప్రపంచము నావరించిన చీఁకటిని ధూర్జటి కవీంద్రుఁడు వృక్షముతో నుపమించుట యాతని భావనాపటిమకుఁ దార్కాణగా నెంచఁదగును.

విపులాలవాలమునిండి, శైలగుహలన్ వేళ్ళూరి, శాఖల్ దిగం
తపదమ్ముల్ పొదువ, న్వియత్తలము మీఁదన్మించి యొప్పారఁగ, ద
ట్టపుఁ బెంజీఁకటి చెట్టుఁబుట్టుకొనియుండన్బోల్చె, దారల్ దదీ
య పలాశాంతర దర్శితోర్ధ్వభువనోద్యద్దీప్తి ఖండక్రియన్.[2]

1. శ్రీ.కా.మా. 2ఆ - 138ప.
2. శ్రీ కా.మా. 2ఆ - 131ప.

వ్రేళ్ళు కొండగుహలందు వ్రాకిన గొప్ప పోవెగల్గి, దిక్కు లన్నియు వ్యాపించిన కొమ్మలు గల్గి, ఆకసముమీదికేఁగిన మహావృక్షమువలె పెంజీకటి ప్రపంచమునావరించెను. అచెట్టు కొమ్మలయాకుల నడిమిసందులనుండి పైలోకములు కన్పించుచున్నవా యన్నట్లు నక్షత్రములు వెలుఁగొందుచుండెను ప్రబంధకవులనేకులు తమోవర్ణనము గావించిరిగాని చీఁకటిని వృక్షముతో పోల్చినది లేదు. చీఁకటిచెట్టు అనునది యుండుట వేఱు విషయము. చీఁకటిని చెట్టుతోఁ బోల్చుట యిచ్చటి విశేషము.

'అంబరంబను కాయమానంబునందు,
నల్లుకొన్న తమంబను మల్లెతీగె' [1]

అని తమ నయనోల్లాసమున శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణకవి చీఁకటిని మల్లె తీగతో పోల్చిదానికి పూచిన యసమశరుని యమ్ములుగా నక్షత్రములను వర్ణించెను.

వేశ్యాతనయులు పయనము సేయుచుండ నొకచోట సూర్యాస్తమయమునయినది. అచ్చట తమోవర్ణనము గలదు. ఇచ్చటి యుపమానము ధూర్జటి కవీంద్రుని శివసారమ్యమునే చాటుచు, నాఁటి ప్రత్యేకతను సూచించుచున్నది.

పంకేరుహాప్తబింబము, గ్రుంగఁదిమిరంబజాండగోళము నిండెన్
శంకాతమఃపరంపర, శంకర చిద్రహితమానసంబును బోలెన్.[2]

చిన్మయరూపుఁడైన శంకరుని నిలుపని మానసమెట్లు, సందేహమను చీఁకటితో నల్లగా నుండునో, యాచీఁకటి యట్లుండెనట సందేహము, పాపము, కల్మషము నల్లనివిగా నూహించుట కవిసమయము.

శంకరుని చిన్మయత్వమెఱిఁగిన మానసమున శంకాతమమునిలువదు. అట్లే చీఁకటిని శివరహితమానసముగా నుపమించుటయు ధూర్జటి శివసారమ్యమును జాటఁజాలినదై యొప్పుచున్నది.

---

1. నయ. 3ఆ — 102ప
2. శ్రీ.కా.మా. 4ఆ — 88ప

'వామాంగభామినీ శ్యామధామాళియుఁ, గంఠహాలాహలకాళిమంబు
నాకాశకేశపాశాసితచ్ఛాయయుఁ, జూళికాసింధుశైవాల రుచియు
గరకృష్ణసారాక్షి ఘనధూమనీలిమ, శేషభూషణఫణాసీమనలుపు
గటితటకీలిత కరటి చర్మద్యుతి, మేచక శూల శోభాచయంబు

భువనలోచనునిపై నెత్తిపోవు నంధకారబృందము— [1]

ఈశ్వరుని వామభాగమునఁగల పార్వతి శరీరకాంతియగు శ్యామవర్ణము, కంఠమునఁ గల కాలకూటవిషముకాంతి నలుపు, శివుని శిరోజపాశమయిన యాకాశవర్ణము నీలము, నెత్తిపైఁగల గంగయందలి నాచుకాంతి శ్యామము, చేతియందలి కృష్ణసారమను లేడి యొక్క రూపము నలుపు, భూషణముగా నున్న శేషుని పడగపైనున్న నల్లకాంతి, నడుమునకుఁగట్టుకొన్న యేనుఁగు చర్మపుకాంతి నలుపు, చేతియందలి శూలము కాంతి నీలము—ఈ నీలిమలన్నియు చీఁకటికి పోల్పబడినవి.

6. నక్షత్రములు :—

1. 'సకలాపూర్ణుఁడు నీలవర్ణుఁడ' నుటల్ సత్యంబుగాఁ దెల్పుచో
లికఁ బెంజీఁకటి నిండఁ దారకలు పొల్చెన్ నిర్జరాధీశ్వరా
దికులర్పించిన పుష్పవల్లభవుఁ డద్దేవుండు భేదంబు గా
మికిఁ దెల్లంబుగ, నల్పుదెల్పుగ ధరన్ మించెన్ శశాంకాగతిన్,[2]

ఏకేశ్వరతత్త్వమును బ్రతిపాదించు ధూర్జటి దృష్టియిది. చంద్రచూడుఁడగు శివుఁడు నీలవర్ణుఁడే యనుట సత్యము. ఆ సత్యము చాటుటో యన్నట్లు, నల్లని చీఁకటినిండ, తెల్లని చుక్కలు కనుపట్టుచున్నవి. చంద్రోదయమును సూచించినప్పుడు యీస్థితి నామి

1. శ్రీ.కా.మా. 4ఆ — 90ప.
2. శ్రీ.కా.మా. 2ఆ — 132ప.

పై నల్పు తెల్పులు కలిసిపెలుఁగొందుచున్నవి. అంతియేకాదు, ఆ తెల్లని చుక్కలు పూర్వదిగధీశ్వరుఁడగు ఇంద్రుఁడుపూపతి నర్చించు పువ్వులని కవీంద్రుఁడుత్ప్రేక్షించుట సొగసైన కల్పనము. ప్రబంధకవులు నక్షత్రములను తెల్లని ముత్తెములనఁగ, వటి కంపుటుండలనఁగ, వెన్నెలకుప్పలనఁగ, వరజాంబుకణికలనఁగ, నభోగతులునించు సనలనఁగ, అమృతం బిందుంపురులనఁగ, సేసలనఁగ, కపురంపు పూసలనఁగ, మల్లికా సునునికాయమనఁగ, మన్మథబాణములనఁగ, రత్నదీపికలనఁగ, ఇత్యాదిగ బెక్కురీతుల నుత్ప్రేక్షించియున్నారు. చుక్కలను పువ్వులుగా నుత్ప్రేక్షించియున్నను, ధూర్జటి వానిని శివార్చనాసుమములుగా రూపించుట యాతనిశివభక్తి పారమ్యమునే వెలార్చుచున్నదిగదా!

2. చీఁకటిని చెట్టుగాఁబోల్చి, ధూర్జటి తారకలను పిష్ట ఖండములుగా నుత్ప్రేక్షించుటయు చూతుము.

> విపులాంబాలమునిండి ... ... ... ... ద
> ట్టపు బెంజీఁకటిచెట్టుఁజుట్టుకొనియుండన్బొల్చెఁదారల్తదీ
> యపలాశాంతరదర్శితోర్ధ్వ భువనోద్య దీదిప్తిఖండక్రియన్. *

ఆకసముమీఁద చెట్టుగా వ్యాపించియున్న చీఁకటి చెట్టునకా నక్షత్రములు పట్టుకొని ఆచెట్టు ఆకులనడుమనుండి కానఁబడెను. మీఁదిలోకములకు చెందిన కాంతి ఖండములన నొప్పుచుండెనట. ఇచట రమణీయార్థము నొకదానిని యూహసేయఁదగును. చెట్టున నుండు ఆకులెంత దట్టముగానున్నను, వాని నడుమ కొంతకుఁగొంత సన్నని యవకాశము లుండును. ఊర్ధ్వలోకములు కాంతిమండలములనియు, నాలోకనుండలి కాంతులీ వృక్ష పలాశాంతరములగుండ చూడనగుచున్నవనియు నిందలి చమత్కారము. ఇటనొక స్థితి దృశ్యముసు మనమనోనేత్రముల రూపొందించుకొననగును. ఒక కాంతి మండలమున

---

* శ్రీ.కా.మా. 2ఆ _ 131ప

కడుగా నొక జల్లెడవంటిదానినుంచి దూరముగా నుండి చూచునపుడు కలిగలనుండి. అవల నఖండముగా నున్నకాంతిమండల మనేక ఖండములుగా, ముక్కలుగా చుక్కలుగా కన్పట్టును చంద్రుఁడుడుంపఁగా గన్పడు నక్షత్రములనుకూడ ఘటికపీఁటుఁ డింకను మధురముగా నూహ సేసెను.

'గరుడానీతసుధాఘటంబు గొనిపోగా ... ... ...
తోడ్తోనుడూ
త్కారముం జిందమృతంపు బిందువుల శంకం గ్రమ్మగం జేయుచున్.'[1]

గరుడుఁడు తెచ్చిన యమృత భాండమువలె చంద్రుడుండఁగా, పాములు నాసికై అర్థములను నైదు దోషప్రక్రియలును, బలుకు, నిల్పు, పూఁత, మేఁత, ద్రావకమను నైదు ప్రయోగములును, సూచకములై యలరుచున్నవి.

రెండవచోటున వెన్నెల యాహార వైవిధ్యము దోఁచునట్లు వర్ణింపబడినది.

వెన్నెలగుంజు నంజుకొని, వెన్నెలప్రోవు భుజించి, నాలిక
న్వెన్నెల గుజ్జుఁజాలఁగొని, వెన్నెలతేటలఁ ద్రావి, వేడుకన్
వెన్నెల కాను బట్టుకొని, వీథులయందుఁ జకోరదంపతుల్
మిన్నులుముట్టి, వెన్నెలలు మేపుచుఁబిల్లలు దామునాడఁగన్.[2]

భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, పానీయములను నైదు విధములగు నాహారములుగా వెన్నెల యిందుఁ బ్రతిపాదింపఁబడుట విశేషము. వెన్నెలంగుంజు భక్ష్యము, వెన్నెల ప్రోవు భోజ్యము, వెన్నెలగుజ్జు లేహ్యము, వెన్నెలతేట పానీయము, వెన్నెలకాను చోష్యములుగా గ్రహింపఁదగును.

రెండుచోట్లను వెన్నెలను ధూర్జటి కవీంద్రుఁడు నైదైదురీతులు వర్ణించుట పంచవిధాత్మక నిరూపణమునందుఁగల యాసక్తి, యభిమానములను వెల్లడించుచున్నదనవచ్చును.

1. శ్రీ.కా.మా. 2ఆ 135ప.
2. ,, 4ఆ 93ప

ఇతర కవులందఱును వెన్నెలను వర్ణించినవారేకాని, యీవిధముగా పోషకప్రక్రియలుగా, ఆహారనీతులుగ వర్ణించియుండలేదు. ఈ విశిష్టమగు రీతిని వర్ణించుటచే వెన్నెలయందలి అనుభవయోగ్యత, ఆస్వాదయోగ్యతలు పలికినట్లయినవిగదా,

8. చంద్రబింబము శివుని లింగముగా వర్ణించుట:-

ఉదయనగాగ్రిమము పానపట్టమభిషేకోదపరివాహంబు, వా
ర్ధిందరీధ్వాంతము ధూపధూమము మహజ్జ్వాలద్దీప సరిభారాజి కౌ
ముది, తారానివహంబు లర్చితసుమంబుల్ గాఁ దమోఘాకార ప్రా
ఖ్యదమై శీతగభస్తిబింబశివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్.[1]

ఇది శ్రీనాథుని పద్యమునకు ఛాయగా గన్పడుచున్నది.

కాదు కాదుదయాద్రి కనకకూటంబిది, దండైన పానపట్టంబుగాని...[2]

చంద్రుని భూతేశునితో నభేదముగాఁబల్కిన తావిధివలలోనె గమనించితిమి. దీని వలన ప్రాకృతికపిండములగల శివభావమ్మునఁ దెలియఁగలము సర్వమును శివమయముగా శివాద్వైతముగా భావించుట ప్రాకటిమతమని భావింపవగియున్నది.

9. చంద్రాస్తమయము :- వేశ్యాతనయల కథయందు చంద్రాస్తమయమును వర్ణింపఁబడినది.

తారాపోగ్రిష్ఠులఁ గాలసూతుఁడు వియద్వారాశి వేఁటాడి, పా
ష్ణారంభంబున బుట్టఁబెట్టి, నులివాయుంగుంజి, యీడాఱఁజె
న్నారన్బైచిన జాలమోయనఁగ, శోభాకించనత్వంబునన్
దారానాయక మండలంబమరె నస్తగ్రావకూటంబులన్.[3]

---

1. శ్రీ.కా.మా. 2అ - 133ప.
2. భీ.పు 2ఆ - 42ప
3. శ్రీ.కా.మా. 4ఆ - 96ప.

ధూర్జటి కల్పనాశిల్ప రామణీయకమున కిదియొక మచ్చుతునక. చంద్రుఁడు, కాలమను జాలరి, నక్షత్రములను చేపలను, ఆకాశమను సముద్రమున వేఁటాడి, ప్రాతఃకాలమను బుట్టలో బెట్టి, జాడించి యీఁకునట్లుగా పఱచిన వలయా యనునట్లు కాంతి గోల్పోయెనని రూపింపఁబడియెను. ఇది కవీశుని లోకజ్ఞతను, పరిశీలనమును చాటజాలినదియై, యాతని భావనాపటిమను వెలార్చుచున్నది.

10. ప్రాతర్వేళ :- లూతాధీశుని కథాకథనమున నీవర్ణనమత్యంత వర్ణరంజితమై కొంతలీనుచున్నది.

ప్రాతఃకాలతుషారశీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వొసఁగి, తద్బిందుచ్ఛటాజాత ఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు ఖచురత్నోద్దీర్ణ గేహంబులై
లూతాకల్పిత తంతు సద్మములు వొల్చెం జెప్పఁజిత్రంబులై [2]

లోకపరిశీలన, ప్రకృతిపరిశీలనములు కవీశుని భావనకు బలము చేకూర్చి శిల్ప సంపదను సమకూర్చిన వర్ణనమియ్యది.

ఆ 'శ్రీ' యను సాలెఁడల్లిన వివిధతంతునిర్మిత సద్మములపైగల మంచు బిందువులు సూర్యకిరణములకాంతినిఁబొంది వివిధరత్నవర్ణరంజితములై వెలుఁగొందినట్లున్నవనుట యాచిత్రణమందలి వైచిత్రి. ఇది చిత్రమే కదా యని కవియే 'చెప్పఁజిత్రంబులై' యని చెప్పనే చెప్పినాఁడు.

11. నది :- ఈ ప్రబంధమున నదీవర్ణనము క్షేత్రమాహాత్మ్య వర్ణమున నొక యంగముగా భాసించినది. సువర్ణముఖరీనద్యావిర్భావము మొదట వర్ణింపఁబడినది. తీర్థ, క్షేత్ర, దైవతములను మూఁడింటియందును నద్యావిర్భావము తెలుపఁబడుచున్నది. శ్రీకాళహస్తి యందు నదిలేకుండుటకుఁజింతించి యగస్త్యుఁడు తపంబొనరించి, గంగను భూమి కవతరింపఁజేసినాఁడు. అగస్త్యుని తపమునకు మెచ్చి బ్రహ్మను పంపి, పరమేశ్వరుఁడు గంగను భూమికంపెను.

"సువర్ణశోభా విభవంబుతో బహుళభంగ మహోముఖరత్వసంపదన్
దేవసేషురంబు సనుదెంచినఁ గాంచి విరించి తద్గుణ
శ్రీ వెలయన్ 'సువర్ణముఖరీ' ప్రథ దానికిఁగల్గజేయచున్ "[1]

— అళాంతంబుల్ వగులంగ్ర మోయుచు, నభంబొద్యంతముస్సీకరా
క్రాంతంబై మెఱయన్సువర్ణముఖరీ గంగానదీరత్నమున్ '.[2]

అట్లావిర్భవించిన గంగానది భూమికేతెంచుటయందలి యందము, చందములను కవి శబ్దాలంకారముచే ధ్వనింపఁజేసి, సహృదయహృదయముగోచరముగ, తనపరిశీలనము, పరిచయములచే ప్రవహింపఁజేసినాఁడు.

'పవనాశన భవనభువనంబొరయుచుం బ్రవహింపందొడంగె, నప్పుడు హరినఖర ముఖ వినిర్దళిత కుంభికుంభగళిత ముక్తాఫలంబుల నిజగర్భకుక్షి ముక్తముక్తాఫలంబులుఁ, గాల పరిపక్వసమాగతమరణ చమరీమృగనీలవాలంబు శైవాలంబులు, వళక్షచామరజాలంబులు డిండీరికా ధవళితకల్లోలంబులు .... .... యరుణధరణీభాగయోగంబున శోణభద్రా కారంబును, శ్వేతధాతలనమేత స్రోతంబులవలన క్షీర తరంగిణీ శృంగారంబును, నీలక్షోణీతలప్రవాహశ్రేణివలనఁ గృష్ణవేణీవిలాసంబును, నద్దంబుగనుండు కొండలఁ దాఁకి తిరిగి తిరిగి యరుగుదెంచుటంజేసి పునఃపునః ప్రవాహమోహనంబునుం దనర .... యోగీశ్వరభావస్వభావంబునుంబోలె నమందబిందుసముదయంబును నిరంతర నాద ప్రసాదమేదుర హృదయంబును, సంసార వారాకరతరణ కారణ కళాప్రకారంబును.... .... వాసుదేవ లీలావిలాసంబునుంబోలె మత్స్యకచ్ఛపాద్యవతారవిహారంబును, శంఖచక్ర శోభితాకారంబును, .... .... వేంకటాచలాకారంబై పరశురామేశ్వరక్రీడ రంగంబునకు రంగవల్లియై, కాళహస్తిపుర లక్ష్మి బాలికామణికి మణిమాలికయై, యోంకార పుటభేదన భాగ్యదేవతాభిరామంబై పరస్పర వీచికరోత్క్షిప్త శీకరమౌక్తికాక్షతజాలంబుల వారా కరువరుం బరిణయంబయ్యె— —[3]

1. శ్రీ.కా.మా 1ఆ— 140ప.

2. శ్రీ.కా.మా. 1ఆ - 141ప.

3. శ్రీ.కా.మా. 1ఆ - 142ప

ఈ వచన మొక విశిష్టరచనమై వెలయుచున్నది. ఆ నది ప్రవహించిన వేగము, దూరము లను సూచించుచు, వేగమందలి ధ్వనిని ధ్వనింపఁజేయుచు, కవీంద్రుని యోగశాస్త్రజ్ఞత లోకజ్ఞత, భావనాపటిమ, ఆధ్యాత్మికదృష్టులకు నెలవై వెలయుచున్నది.

ఈ వచనరచనరీతి కాదంబరినుండి, అనంతుఁడు, పోతన, పినవీరనల ద్వారమున తెలుఁగున ప్రవేశించినది.

2. నక్కీరుని తీర్థయాత్రలవర్ణనమున ననేక నదులు పేర్కొనఁబడినవి. కావేరి, పెన్న, గుండ్లకమ్మ, కృష్ణవేణి, గౌతమీగంగ, యను నదులందు కావేరి ప్రత్యేకించి యొక పద్యమున వర్ణింపఁబడినది.

చనిచని దాఁటె నంతఁ గవిచంద్రుఁడు, ధన్యఁగ నేరకన్య,
వనశితఖడ్గఖండిత భవప్రథ వాఘు విరోధిసైన్య, బా
వన నిజనామసంస్మరణ వారితమానవదైన్య, నిత్యమ
జ్జనరతకోటి ముక్తిపదసౌఖ్యవదాన్య, గృతానగాహ్వఁడై.[1]

అంత్యప్రాసాలంకారితమైనదీ కావేరీనది. ఈ కావేరీనదియు జీవన శితఖడ్గఖండిత భవ ప్రథవాఘ విరోధిసైన్యగా, నిత్యమజ్జనరతకోటిముక్తిపదసౌఖ్య వదాన్యగా రూపింపఁ బడుట కవీంద్రుని భవనిరాసము, ముక్తికాంక్షలను వ్యక్తము సేయుచున్నది.

12 సరస్సు :- ఈ ప్రబంధమునందలి సరోవరవర్ణనము ధూర్జటికవీంద్రుని యోగ శాస్త్రజ్ఞత, శ్లేషానుప్రాణితోపమగా రూపొందినది.

హంస సంసదభీష్టవిహార హేతువై బహుజీవకహృద్యమై, యప్రతర్క్య
మగుచు నద్వంద్వమై, పంకజాకరంబు, పొలిచె బ్రహ్మంబు తెఱఁగునఁ
బూర్ణమగుచు.[2]

1. శ్రీ.కా.మా. 3అ - 182ప.

2. ,, 3అ - 195ప.

కవీంద్రుని యాధ్యాత్మిక భావహారకిది యూహింపఁబడఁదగినది. తరువాత రెండు పద్యములు కూడ, కవీంద్రుని రాజయోగవిద్యానిజ్ఞతను వెలార్పఁజాలినవియే.

తమ్ములరజోవికారము, గ్రమ్మెడు వాసనలు, దళముగానెసఁగెడు కో
కమ్ములు, నూర్ముల్లు, జెలఁగఁగ, దమికొలను భవము బోలెఁ దద్దయు
నొప్పెన్.[1]

దళములలో రథాంగనినదంబు, పరాగము, రాజహంస సం
కులము, శిలీముఖభ్రమణ ఘోషము, నన్యకబంధములన్నను
జ్జ్వలతర పుండరీకములుఁ జాలగగల్గి, మహావనస్థితిన్
బొలుపువహించు నక్కొలనిపొంతకు నొయ్యఁజేరి, యచ్చటన్[2]

ఇందు మొదటినానియందు కొలను భవముతోఁ బోల్పఁబడినది. రెండవదానియందు యుద్ధభూమితోఁబోల్పఁబడినది.

తెలుగు సాహిత్యమున కాసారము పలురీతులనుపమింపబడుట కలదు. సముద్రము, రాజుకొలువు, సార్వభౌముఁడు, మున్యాశ్రమము, జముకాణము శార్ఙ్గపాణి, ప్రౌఢవేశ్య, శివుఁడు, అశ్వమేధమహాధ్వరిములతో బోల్పఁబడినది కాసారము. యుద్ధభూమికిఁబోల్చుటయందు యోగశాస్త్రము ధ్వనిరూపమున వ్యంజిత మగుట కవీంద్రుని రాజయోగ విద్యాభినివేశము తెలియఁగలము.

13. **దుర్భిక్షము :-** గ్రహములు వక్రించుటచే, మీనమునకు శనివచ్చుట, అభద్రక్షామమహాక్షోభము కల్గినది. ధూర్జటికవి యీదుర్భిక్షమును ఎనిమిది పద్యములలో పట్టించినాఁడు. సీసమున శని మీనమునకు వచ్చుట కన్యలో చినుకు పడకపోవుట, మఖలో నుఱుముపుటుటయు, జనము తల్లడిల్లునట్లు మహాక్షామమేర్పడుటను పల్కి, కవి, తరువాత ప్రజలు తిండికొఱకు పడినతిప్పలు, తిన్నధాన్యములు, పంటలు చెడి పోవుటలు, ఆఁకటిచిచ్చునకు జనులాహుతియగుట, దేశమును వీడి జనులు విదేశములకు

1. శ్రీ.కా.మా. 3ఆ – 196ప.
2. ,, 3ఆ – 197ప

వలసలేగుట వర్ణించెను. క్షుత్తీవ్రతను తెలుపుచు ప్రజలు వికృతాకారములను

తోలును నెమ్ములున్నిగిలి, త్రోసినఁదొంబదిచోట్లఁ గూలు వా
రాలిని బిడ్డలన్విడిచి యాఁకటిచిచ్చున వెచ్చపోవు వా
రేలిక బంటు వాసిరవయించుక లేక కృశించువారునై ——
తూలిరట జనులు.

ఆఁకటిచిచ్చునకు రాజు, బంటు భేదములేదని పల్కుటచే జనులెల్లరు నేవిధముగ బాధ పడిరో తెలియగలము. ప్రకృతికి భేదబుద్ధి యుండదు గదా. భీకరమై

'మానిసిమాసి, పసు కఱవై 'నదది. వరాహపురాణమున నీక్షామమెంతటి భయంకరమైనదో వర్ణింపబడినది. ఆకావ్యకర్తయును శని మీనమునకేగు టెంచుటచే క్షామమేర్పడెనని పలికియున్నాఁడు. '—— మీనంబునకున్, బూషాత్మజుండు వచ్చిన, దోషంబునఁజేసి' కఱవు వచ్చినదఁట.

పసిమిచెడి సస్యములు కసవుదినలేమిం
బసరములు వట్టినదులిసుకలను జిప్పలను
మిసమిసను గన్ విగతరసగరిమ నింకెన్ ... ... గఱవు

గుసముసఁగె విశ్వమును పెద లయవిభాతిన్' అనుచు లయవిభాతియుఁ దెల్పఁబల్కెను. దుర్భిక్షమహారాజు విజృంభించుటను తరువాత సీసమున వర్ణించియున్నాఁడాకవి.

14. మఱ్ఱి వృక్షము :— సత్కీరుఁడు విశ్రాంతిఁదీసికొన్న మఱ్ఱి వృక్షము వర్ణింపబడినది. ఆ వృక్షవైశాల్యము, సాంద్రతలను తెలుపుటకోయన్నట్లు సీసమున వర్ణింపఁబడినది.

తనపలాశశ్రేణి ధరకంతటికిఁ బచ్చ, పట్టుబట్టంపు మేల్కట్టు గాఁగ
దనయూర్ధ్వశాఖావితానంబు సురలకు, మరకత, రచితహర్మ్యములు
గాఁగ

దనరెఁ గోష్ఠముల్ మునులకుఁగల్పిత, పర్ణశాలాకలాపములు గాఁగ
జనదిశాంత శ్రాంతి ఘన వటచ్ఛాయ, వలయమాద్రిహరిణ శాద్వలము గాఁగ

వాలఖిల్యమునీశ్వరావాసమైన, రోహణమురీతిఁ బిత్రుముక్తి దేహమగుచు

గయఁ బ్రసిద్ధిఁ బహించు నక్షయవటంబు, చందమునున్న యొకమఱ్ఱి క్రిందికేగి,[1]

పూర్వకవులనేకులీవృక్షవర్ణనము గావించియున్నారు. పోతన దక్షిణామూర్తి నివాసమైన వటమును వర్ణించియుండుటనిచ్చట గుర్తునకుఁదెచ్చుకొనఁదగును.

ఉజ్జ్వలంబై శతయోజనంబుల పొడవును పంచసప్తతియోజనములఁ
బఱవును గల్గి యేపట్టునఁ దిరుగని, నీడ శోభిల్ల నిర్ణితనుగుచుఁ...[2]

సీసమునఁగానన్నసు, శాఖాదైర్ఘ్యమును, నిబిడత్వమును సూచించు కృష్ణరాయల మఱ్ఱి వృక్షవర్ణనమును చూడనగును.

శాంచెన్నైష్ణవుఁడర్ధయోజన జటాఘూటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాట చరుస్మరుద్రయదవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృతవ్రణచ్ఛలన లిప్యాపాదితాధ్వన్యని
స్సంచారాత్త మహాఫలోపమ ఫలస్ఫాయద్వటస్తోమమున్.[3]

హంసవింశతియందు నిట్టిమఱ్ఱి వృక్షవర్ణనము సీసమునఁగలదు.

1. శ్రీ.కా.మా. 3ఆ – 193ప.

2. భాగ 4స్కం. 132ప

3. ఆ..మా 6ఆ – 15వ

సద్విజరాజసంశ్రయమహాస్పదలీల, శాఖలుకకుంబంత చయముఁ బ్రాఁక
సాంద్రవర్ణక్రమ స్థాయిగ్వనముఁన మించు, జటలనంటావాప్తిసటిమ
మెఱయ...*

ధూర్జటి వర్ణించిన మఱ్ఱి విశాలమై, పథికులకు విశ్రాంతింగల్పింపఁజాలినది. దేహబాధతో బయనము సేయుచు నలసియున్న నత్కీరునకు విశ్రాంతి యవసరము. కాన కథా గమనమునకు దోహదకారిగనే యీ వటవర్ణనము సాగినది.

**15. ఆటవిక జీవితము :-** తిన్ననికథయందు కైరాతజీవితవర్ణనము విపులముగాఁ గావింప బడినది. ఆటవికుల వేషభాషలు, ఆహారవిహారములు, ఆటపాటలు ఆచార వ్యవహారములు, వస్తుసంభారము లతివిస్తరముగాఁగావించుటఁజూడ ధూర్జటికవీంద్రు నకు ఆటవిక జీవిత విధానమునందలి నిశిత పరిశీలనము, పరిచయములు విశదము. మధుపానము, వేట, వైద్యము, లిత్యాదులుగా వర్ణింపబడినవి. ఇంతిగా వర్ణింపఁబడినను వారిజీవితవిధానకథనము కథ కాటంకము గలుగక తత్కథానాయకుఁడగు తిన్నని జన్మ, వృద్ధి, గుణ శీలముల ప్రస్తుతములుగా వెలసినవి. ఈ వర్ణనమంతయు నెట్లు కథా సందర్భమున కనువుగాఁ జేయబడెనో యా కథానిర్వహణ పరిశీలన సందర్భమునఁ గాంచియుంటిమి.

**16. బాల్యక్రీడలు :-** మన ప్రబంధమున నీ బాల్యక్రీడలు తిన్ననివియు, వేశ్యా తనయలవియు నైన బాల్యక్రీడలు వర్ణింపఁబడినవి. తిన్ననిబాల్యక్రీడలు జాత్యుచితముగా నుండగా వేశ్యాతనయల బాల్యక్రీడలు, రూపుదాల్చిన శివభక్తి కనువుగా, శివపరముగా నున్నవి.

చన్నుపోట్లాకాయ, సిరిసింగణావతి, గుమగుమ గుంచాలు, కుందెనగుని
నాఁగేటిక్రమ చ్చులాటలు, నెన్నకాయలు, వెన్నెలకుప్పలు తన్నుబిల్ల
తూటుచ తుంటా , గీరనగి జలు, పిల్లదీపాలంకి, బిల్లగోడు
చిమగుమచ్చలపోటి, చెండుగట్టినబోది, యల్లియుప్పనఁబట్టె లప్పళాలు

---

*. ద్వాంపవింశతి ఆ - 116వ.

చిక్కచాబిల్ల, లోట్టిళ్లు, చిందజాడి, యైన శైశవక్రీడావిహారసరణిఁ
జెంచుకొమరులతోడ నుద్ధించుకొను, దిన్నడభినవబాల్యసంపన్నుఁ
డగుచు,[1]

ఆ నాఁడా ప్రాంతములందున్న యాటలవి. అవియు నరణ్యములం దాటవికులాడుకొను నాటలు. ఇఁక వేశ్యాతనయలు, వేశ్యాగృహమునఁబెరుగుచున్నను శివభక్తి తనువులెత్తినవారుగాన, వారి బాల్యక్రీడలన్నియు శివపరములుగను, శివార్పితముగ మాత్రమే యున్నవి. శివభక్తలై, తల్లిని రోసి, గృహమునువీడి, శ్రీ కాళహస్తిఁ జేరినవారుగానఁ నట్టివారి బాల్యమును శివార్పితముగనే శివాంకితముగనే జరుగుట సహజసుందరము, స్వభావోక్తి సుభగముగ నుండును.

కన్యకలెల్లఁగూడి రతికాములనోఁచఁగ దాము భూమి భృ
త్కన్యకనీశునిందలఁచి తత్తదలంకృతు లంబికాశివా
జాన్యఖిలార్చనావిధుల చందముగా వివరించి లోకసా
మాన్యవివాహగానము లుమాగిరిశస్తుతిగాఁగఁ బాడుచున్,[2]

కనకశిలాకలం దెగడు కన్యలు గట్టినబొమ్మరిల్లు శం
భుని గుడి, బొమ్మశంకరుఁడు, బోనము గుజ్జనగూడు, వేడ్కఁజే
సిన పనులన్నియున్ శివుని సేవ యొనర్పఁగ బడ్డపాట్లుగా
మనమున నూహసేయుదురు, మానుని తొల్లిటి జన్మవాసనల్.[3]

బొమ్మలపెండ్లిళ్లుగా నితరవేశ్యాకన్యలు రతిమన్మథులకుఁజేయగా, వీరు పార్వతీపరమేశ్వరులకు వివాహముగావింతురఁట. ఇండ్లు కట్టుకొనునాటయందు వీరు శివునికిల్లుగా గుడి, అందుబొమ్మగా శివునిజేసి మిగిలిన పిండివంటలు, చిఱుతిండ్లు అన్నియు శివునికి సేవలుగా జేసెడివారఁట. అట్లు సేయుట వారి జననాంతర వాసనా ఫలమేగదా!

---

1. శ్రీ.కా.మా. 3అ — 33ప. 2. శ్రీ.కా.మా. 4అ — 20ప

3. [illegible]

**17. భూతవర్ణనము :—** నత్కీరునిఁబట్టిన భూతవర్ణనమిందొకటి కలదు.

'క్రూరనిరీక్షణప్రభలగుడ్డులు, కోఱలు, నూర్ధ్వకేశముల్
నీరదనీలగాత్రమును, నిష్ఠురవాక్యము, లట్టహాసముల్
ఘోరవకంఠనిస్వనము, భీకరహేతియు, మానవాస్థి హా
రారవము ల్సెలంగ, వికటాకృతితో నొకభూతమాతనిన్'[1]

బట్టికొనినని.

తెలుఁగు సాహిత్యములోఁబూర్వులు భూతవర్ణనము సేసియుండిరి. అనంతామాత్యుఁడు భోజరాజీయమున రత్నమండనుఁడను రాకొమరునిఁబట్టిన బ్రహ్మరక్షసుని వర్ణించి యున్నాఁడు.

క్రూరపుఁజూపులున్నిడుదకోఱలు నుగ్రపుమోము నెత్తుటం
బేరిన కోరమీసములు, బిఱ్ఱన వెంట్రుకలుం గృశత్వముం
గూరినదేహము న్వ్రేడదకుక్షియు ఘోరరవంబు గల్గియే
పారిన బ్రహ్మరాక్షసుఁడుదగ్రబలుం డొకఁడవ్వనంబులోన్.[2]

పాలదానరిఁబట్టిన బ్రహ్మరాక్షసుని రాయలొక సీసమున వర్ణించియున్నాఁడు.

మృతమర్త్యరెంటాకనిడ్డఁజాలకనేత్రు, రంజిల్లు పెనుబొట్టుముంజివాని
బల్లచీమల వక్రభల్లాతకియుఁబోలె, నెఱ్ఱదుప్పటినొప్పు కత్తివాని...[3]

— ౦ —

1. శ్రీ.కా.మా. 3ఆ - 200ప. 2. భో.రా. 4ఆ - 42ప
3. ఆ.మా. - 6ఆ 19ప

# ఔచిత్యము

"ఉచితస్య హి యోభావః తదౌచిత్యం ప్రచక్షతే" అనునది యౌచిత్యపదమునకు వ్యుత్పత్తి. ఆలంకారికులలో నీ యౌచిత్యపదమును తొలిగా నుపయోగించినవాఁడు రుద్రటుఁడు.

'ఏతాః ప్రయత్నా దధిగమ్య సమ్యక్
ఔచిత్యమాలోచ్య తథార్థ సంస్థమ్.'
'ఇతి యమక మశేషం సమ్యగాలోచయద్భిః
సుకవిభి రభియుక్తైః వస్తు ఔచిత్యవిద్భిః' —కావ్యాలంకారము

ఔచిత్యశబ్దప్రయోగము కావింపకున్నను ఔచిత్య ప్రాముఖ్యమును సూచించు ప్రాచీనాలంకారికు లెక్కఁరు పలికియున్నారు.

'యథాభావరసావస్థం —— ——' అను నాట్యశాస్త్రవాక్యము, భామహుని 'సన్నివేశవిశేషాత్ దురుక్తమపి శోభతే' అను వాక్యార్థము, దండికృత 'సముదాయార్థశూన్యం తదపార్థమితీష్యతే ఉన్మత్త మత్త బాలానా ముక్తే రన్యత్రదుష్యతి' అను వాక్యార్థము ను ఔచిత్యమును సూచించున్నటివే.

రసమున ప్రాణమౌచిత్యముగాఁబలికిన యానందవర్ధనాచార్యులు 'అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్' అని పలుకుట, దండ్యాచార్యుల 'కథాప్యగ్రామ్యతైవనం భారం వహతి భూయసా' అను వాక్యమునకు ప్రతిబింబమనిపించును. ఆనందవర్ధనాచార్యులు ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా' చక్కని యౌచిత్యము గల కావ్యము రసోపనిషత్తేయని యుద్ఘాటించియున్నారు. కుంతక మహిమభట్టులు నౌచిత్య ప్రశంసచేసియున్నారు.

ఔచిత్యము నొకప్రస్థానముగా ప్రస్ఫుటము గావించినవాఁడు క్షేమేంద్రుఁడు. అతడు 'ఔచిత్యవిచారచర్చ' యను లక్షణ గ్రంథమును రచియించెను.

ఔచిత్యస్య చమత్కార కారిణశ్చారు చర్వణే
రసజీవిత భూతస్య విచారం కురుతేఽధునా[1]

కావ్యస్యాఽలమలంకారైః, కింమిథ్యాగుణితైర్గుణైః
యస్యజీవి మౌచిత్య విచింత్యాఽపి నదృశ్యతే [2]

అలంకారాస్త్వలంకారా గుణఏవ గుణాస్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యజీవితమ్.[3]

కావ్యమునకు జీవితభూతమైన యౌచిత్యము లేకున్నచో నిఁక నలంకారములేల? గుణములేల? అలంకారము లలంకారములే, గుణములు గుణములే. అనఁగా నవి కావ్య జీవితముగావన్నమాట.

ఇట్టి యౌచిత్యమును, క్షేమేంద్రుఁడు 29 భేదములుగా వింగడించి యుదాహరించి చూపెను.

ఔచితీపరిపాలనము సంస్కారమునకు గుర్తు. జీవితముకాని, సాహిత్యముకాని ఔచితీమహితమైనపుడే ఉదాత్తసంస్కారము, ఉదాత్తకావ్యములగును. కావ్యము యొక్క నంసారప్రాణస్నాయువులను స్పృశించునది ఔచిత్యము ఈ యౌచితీ పరిపాలన మొక యసిధారావ్రతము. కవికౌశలమున కీయౌచిత్యము నికషోపలము.

ప్రస్తుతము శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రబంధమున, శాస్త్ర విధానమున నౌచితీ పరిపాలనమునుగాక సహృదయ హృదయోపదిష్టమార్గమున సమీక్షింతము. 'వస్తు నిర్వహణము, పాత్రపోషణము, రసపోషణములను పూర్వప్రకరణములందు ప్రాసంగికముగ యథావకాశముగా బరిశీలించియుంటిమి. ఇట మిగిలిన కతిపయ ముఖ్య సందర్భములందామహాకవియొక్క ఔచితీపరిపాలనమును కొంతకొంత చూతము.

కావ్యాదియందే 'శ్రీవిద్యానిధియై, మహామహిమచేఁజెన్నై ....' అను తొలి పద్యమును కావ్యార్థసూచనముగా విరచించుటయే ఔచితీపరిపాలనమునకు నాంది యన దగియున్నది. అష్టేపురవర్ణనము నాస్యతోదర్శనీయమగు శివసారమ్యముగ గావించుటయు ధూర్జటిమహాకవి యౌచితీసంపదకుఁ దార్కాణగా పేర్కొనఁదగును.

---

1. ఔ.వి.చ 2. ఔ.వి.చ 4 3. ఔ.వి.చ 5

శివతేజఃపులకిత ప్రకృతి ప్రత్యణువున నిండి నిబిడీకృతమైన మాహాత్మ్యమున కంతటికి నిధానముగ కాళహస్తీశ్వరిని సంభావించినాఁడు కవీంద్రుఁడు. అందువలన నిది శివసారమ్యభావనామయముగా చిత్రించుట యందెంతయు నౌచిత్యసముల్లసమై యలరు చున్నది.

మాయాజంగమరూపచిత్రణమున[1] స్వభావోక్తి అలంకారము నాశ్రయించుట యందు, యాథావస్తువర్ణనము, సాత్త్రమూర్తి సాక్షాత్కారము లౌచితీ శోభితములయినవి. దాని దీనస్థితిని[2] శివోపచారములుగా మాహించుట, యుత్ప్రేక్షించుటయు మిక్కిలి యౌచిత్యముగా నున్నది.

లోపాముద్రాగస్త్యుల పవిత్రదాంపత్యచిత్రణము, పాతివ్రత్యమహిమ, లోకోత్తర మధురామరాగబంధములు సముచితములై సమలంకృతముగా భాసించుచున్నవి. 'జ్ఞాన ప్రసూనాంబ' యను నామసార్థక్యత నిరూపించుట కవీంద్రుని యౌచితీపరిపాలన పాటవమును వెల్లడించుచున్నది. 'సమస్త భక్తభృంగంబులఁ జిన్మరందరస గాఢ సుఖాప్తులు[3], చేయుటచే నామె జ్ఞానప్రసూనాంబయయినది. 'పరమహంసోత్తంస భావభృంగవ్రాత తన్మయావస్థా ప్రదానకేళి' కాన నామె జ్ఞానప్రసూనకలిక.

'బ్రహ్మ' నూర్వ్వరన్, బొంది సుధాధరగ్రహణ భూరి సుఖంబుల
నొందుచున్ శతా
నందుఁడనంగ నొప్పెసఁగు నాఁడు మొదల్ కథలన్ విధాతయున్[5].

బ్రహ్మశతానందుఁడనఁబడుటకు గల యౌచిత్యమిందు ప్రకరణోచితముగా బ్రతిపాదింప బడినది.

అటులనే పాము శివునిగూర్చి పలుకుచు

'కంటక మెట్లు నాక సుముఖత్వము నొందితి వయ్యా? పార్వతీ
కంటకితాంగబాహులతికాయుగసంగతిఁ బోలె, దుఃఖ కృ
త్కంటకబిల్వశాకములకాండము లెత్తిన మోచిమోచి, ము
క్కంటి! యెఱుంగవే? నొసలికంటిమహత్త్వము నీకుఁ గల్గుటన్.'[6]

---

1. శ్రీ.కా.మా. 1ఆ – 30ప. 2. శ్రీ.కా.మా. 1ఆ– 51ప.
3. శ్రీ.కా.మా. 1ఆ 91ప. 4. శ్రీ.కా.మా. 1ఆ – 2ప
5. ,, 2ఆ 16ప 6. ,, 3ఆ – 117ప

అనుటయందు 'ముక్కంటి' యను సంబోధనము సముచితమైనట్టిది. ఇక వేశ్యా తనయలు గాంచిన సముద్రమును 'రత్నాకర' శబ్దమునకు సార్థక్యత కలుగునట్లు వర్ణించుటయు నాహౌచిత్యముగా నలరుచున్నదిగదా!

రత్నము లిభరత్నము లుదరురత్న వధూరత్న ధేనురత్నంబులు గ్లౌ
రత్నమమృతరత్నము హరిరత్నమునుం గలిగి మెఱయు రత్నా
కరమున్.[1]

పాము ఏనుఁగులు తమయర్చావిధి నొరుల భంగపరచుటకు సహించిన యీశ్వరు సహనమును భావించినరీతి యప్పటి యాపాత్రల మనఃస్థితులకుచితములై యొప్పుచున్నవి 'కంటకమెట్లునాక సుముఖత్వమునొందితివయ్య'[2] 'ఉనికి శిలోచ్చయంబు, నిజయోష శిలోచ్చయరాజపుత్త్రి'[3]

పాము 'రాత్రి శివరాత్రిగా జాగరమ్ముజే'[4]సిన తీరు భక్తివిశేష ప్రతిపాదక సమర్థమై యౌచితివిలసితమైనట్టిది.

శివబ్రాహ్మణుని రూపచిత్రణమునిట్టి యౌచితీశోభితమైనదే. తిన్నఁడు 'నాలాటలోచనంబున, గీలాలము దొరఁగెనెని, కేవలభక్తిన్ గిలించి మనోదృష్టి, మూలంబగు'[6] .... తనదు ప్రాణములీశ్వరునకిత్తుననుట ముగ్ధభక్తుఁడగు నాతని సమర్పణబుద్ధి నావిష్కరించుట నౌచితీవిలసితమగుచున్నది.

నిక్కఁడుని కథయందలి మధురాపురవర్ణనము[7] కథాసందర్భసూచకమై యుండుచున్నవి. వర్ణనమందలి యౌచిత్యము వేశ్యాతనయల వయోవికాసవర్ణనమునకై వనిష్ట నిక్షేపింపఁబడుట కవీంద్రుని శివభక్తిపారమ్యమును వెలార్చునౌచితిసంపద.

పద, వాక్య, రస, గుణ, అలంకారాదికములగు నౌచిత్యములు మన మీయా ఘట్టముల కడ పరిశీలించియుంటిమి.

---

1. శ్రీ.కా.మా. 4ఆ - 62వ.
2. శ్రీ.కా.మా. 2ఆ - 117వ
3. ,, 2ఆ - 12?వ
4. శ్రీ.కా.మా. 2ఆ - 119వ
5. శ్రీ.కా.మా. 3ఆ - 94వ.
6. ,, 3ఆ - 117వ
7. శ్రీ.కా.మా. 3ఆ - 131వ.
8. ,, 4ఆ - 23వ

లోపాముద్రాగస్త్యులు జ్ఞానపుష్పాంబును[1] సగ్గురచే పూజించుట వృత్తౌచిత్యము. అట్లే పాము నేనుగులు పొందిన దీర్ఘవ్యథను రెండింటికిని రెండు సమమైన సీసములను[2] ఉపయోగించుటయు, కాళము పూర్వజన్మకథను 'గంధర్వకామినీగానంబువిని తలలెత్తి యాడెడు భుజగేంద్రములను'[3] అని ప్రారంభించుటయు వృత్తౌచిత్యమే యగును. అన్నింటికిమించి కవీంద్రుఁడు గావించిన యాశ్వాసాది, ఆశ్వాసాంతపద్యములు కథా సందర్భసూచకములుగను, కథానాయక గుణోత్కర్ష కలిగించునవిగనుండుట నప్పటి కప్పుడు పరామర్శించియుంటిమి. ధూర్జటి ప్రబంధరచనమునఁగొన్ని యనౌచిత్యములకుఁ బాలుపడెనని యనుటయుఁగలదు. వారు పేర్కొనిన యనౌచిత్యములను, అందలి యౌచిత్యమునుఁ బరిశీలింతము.

ఆక్షేపములు :— అనౌచిత్యముగా ప్రతిపాదింపఁబడిన యంశములు.

1. శ్రీ కాళహస్తి నాయకుఁడాకస్మికముగా యాదవభూకాంతుని భక్తిని పరీక్షింప నేతెంచెనని యున్నదిగాని, గ్రంథమంతటను యాదవభూపాలునాతఁడు పరీక్షించుటకు చేసిన ప్రయత్నము లేదు. తుదకాకాస్మికముగా కృతార్థుడవయ్యెదవని పల్కి శివుఁడంత ర్హితుడయిపోయెను. కథారంభమునచేసిన ప్రతిపాదనము సఫలముకాలేదు.

2. వీరశైవుఁడుకాని ధూర్జటి వీరశైవరాజ్యయుమునుండు దాసి — మిండజంగముల లంజెఱికపు ప్రశంసచేయుట చింత్యము.

3. తిన్నని వాక్యములలో 'చుఱుకుజూపునఁగాలిన కొంతెనుఱుకు
నుఱుకుఁజూపుల బుట్టించు నెఱకువారి
యుఱుకు వలిగుబ్బ పాలిండ్ల యుగురు జోండ్ల
నేవలిచ్చెద నీకు విచ్చేయుమయ్య'[4]

అనునది బాలభాషోచితముగా లేదు.

4. కిరాత స్త్రీ యవయవములనుపమించటలో వారికచములను 'మయూరీ' శబ్దముతో వాచ్యము చేయుట హీనౌపమ్యముగా నున్నది.

5. వృద్ధవేశ్య తనబిడ్డలను పచ్చిపచ్చిగా వర్ణించుట యుక్తముగా లేదు.

---

1. శ్రీ.కా.మా. 1ఆ— 115ప. 2. శ్రీ.కా.మా. 2ఆ - 119, 125ప.
3. శ్రీ.కా.మా. 4ఆ - 15 ప 4. ,, 3ఆ — 71ప

పరామర్శ – సమాధానము :– 1. యాదవభూకాంతుని భక్తిని దెలియుట కేతెంచిన శివుఁడు మిండజంగమముగా పురప్రవేశముచేసి, మహాలింగనివాసములేమికి చింతించుట రాజునకు గల శివభక్తి నాక్షేపించుటయే అగును. యాదవ భూకాంతునివంటి భక్తవరుఁ డింకెవ్వఁడును లేఁడనుభావముతో వచ్చిన శివుని కాపురమున నాలయము లేకుండుట బాధాకరమయినది. మఱి యాలోపము బూరింపఁజేయవలెనన్న రాజు కధకు తానుగానేఁగక, దాసి మూలముగా నాతనికాగ్రహము దెప్పించి, తనమహత్త్వముచే కురులు మొలిపించి, దాసి వాక్యములచే నాకర్షితుఁడయిన ప్రభువును, శివుఁడు తనకథకే రప్పించుకొనెను 'నిమన్మహాకపటలీల వశీకృతుఁజే 'సితాఁడనని శివుడాతనితో పలికెను. రాజు శివభక్తుండని యెఱిగియేకదా పరీక్షింపవచ్చినది । అందును యాదవ భూకాంతునంతటి భక్తుఁడు లేఁడనుకొనుచు చూతమనివచ్చిన శివుని కాపురమునందాలయము లేకుండుటచే తన భక్తుని భక్తి యిట్టిదియేనా యనిపించి, పరీక్షింప దొరకొనెను. 'భక్తిని తెలియవచ్చుట' యనఁగా పరీక్షించుటకు అని కాదు. అతని భక్తి విశేషమెట్టిదో స్వయముగా కన్నులార గాంచుదమని వచ్చెననియే. ఆపురమందలి చోద్యములను బుధుల్ సెప్పగా విని 'వచ్చితనుంగొన' నిచ్చగించినాఁడు శంభుఁడు. వచ్చిన తరువాత నారాజు భక్తి యందలి లోపముకానవచ్చినది. కాన నాతనికావిషయమెఱింగింప దాని నుపయోగించెను. "నేను నీకీ కథను జెప్పవచ్చి, తినఁ యందు పురమున నాలయము లేని విషయము దెల్పుట యనుభావమే కలదు.

తుదకు తరువాతి కథ తెల్పుమని ముందే, కృతార్థుఁడవయ్యెదవని పల్కి శివుఁడంతర్ధానమగుట యందేమియు విప్రతిపత్తి లేదు. చెలఁది, పాము, ఏనుఁగు, ఎఱుకుల పూర్వజన్మ కథల నెఱుఁగఁగోరిన యాదవభూకాంతుని కాకథలు జెప్పి "కృతార్థుఁడవ య్యెద, వమ్మహాదేవుని నివాసంబుగట్టింపుమనుచునంతర్హితుండయ్యె" అను వాక్యముచే కథాప్రారంభమున ప్రతిపాదించిన యంశము సఫలము కాలేదనుట ప్రమాద జనితము. క్షేత్రమాహాత్మ్యమును కథనము సేయుటకు ముందు 'రాజా! కలధౌతశైల శిఖరాలయ గేహముఁగట్టఁబంపవే" యను శివునివాక్యమునకీ తుదివాక్యము "అమ్మహాదేవుని నివాసము గట్టింపుమ" మట కథారంభమున చేసిన ప్రతిపాదనము సఫలము సేయుటయే. చెలఁదిపురుగు కథతో ప్రారంభమై తిన్నని పూర్వజన్మ కథనముతో ముగియుట క్షేత్ర ప్రాశస్త్యమునకు మూలములైన జీవిత కథనములు పూర్తియయినవి.

తరువాత కథలడుగవలసిన యవసరము రాజునకు లేదు. కారణము శ్రీకాళహస్తి క్షేత్రమున ముక్తి పొందిన నత్కీరుఁడు వేశ్యాతనయలగాథలు కూడబలుకుటచే నీఁకదెలియ వలసిన కథాంశములు మిగులలేదు. కనుక కథారంభమున చేసిన ప్రతిపాదనము సఫలమే యయినదనవలసియున్నది.

2. ధూర్జటికవీంద్రుఁడు వీరశైవుఁడు కాడు. కాని వీరశైవాచారములను, వీరశైవ భక్తులగాథలను తనప్రబంధమున చలికియున్నాఁడు. ఆక్షేపము తెలిపినవారన్నట్లు నున ప్రబంధమున దాసి-మిండజంగములకథ, తిన్ననికి కలలో మిండజంగముగా శివుఁడు గనుపట్టు ఘట్టము, వేశ్యాకన్యలను కాపాడుటకు మిండజంగము వచ్చుట యను లావుల మిండజంగముల ప్రశంస కలిగినది. అట్లే ముగ్ధభక్తుఁడై తిన్నఁడు తనకన్నిచ్చి ప్రాణమిచ్చుటకు సిద్ధపడుటయు వీరశైవభక్తలక్షణమే కదా! పాము నేనుఁగులు తమ యర్చావిధులను భంగపఱచిన శక్తుని ప్రాణము తీయుట కాయత్తపడుట, ప్రాణమర్పించుటకు సిద్ధపడుటలును వీరశైవలక్షణమే. శివప్రశంసయందు శివాధిక్యమును చాటు 'శ్రీధరసయనాబ్జ సమారాధిత దివ్యాంఘ్రిశోణరాజీవ' అనుటయందు విష్ణుఁడు శివునకు కన్నర్పించుటయు వీరశైవలక్షణమే. వీరశైవభక్తుల గాథలను రెండింటిని స్వీకరించినప్పుడు, ప్రసక్తాంశములను పోషించుటయందాతావులంచుచితమగు రసపోషణము గావించుట యుచితమే కాని యనుచితము కాదు.

3. తిన్నని "పలుకులు ముద్దులొలుకుచు బాలవాక్యములవలె స్వభావసిద్ధములుగానున్నవి. కాన యీ పద్యములలో ఒకపద్యము, బాలభాషోచితముగా కన్పట్టుటలేదు.[1] "ఇది నాటకములోని ప్రల్లవలె నున్నది. ఈ మాటలుగాని, యిందలిభావముగాని బాలునకు సహజముగఁదోపదు" అని వావిలికొలను సుబ్బారావుగారు తమపీఠికలో విమర్శించినారు"[2] పై వాక్యములందు తిన్నని బాలునిగాఁదలఁచుట జరిగినది. వేఁటకు బయల్దేరిన తిన్నఁడు 'నవయౌవనసంపాసన్నమయిన'[3] వాఁడేగాని బాలుఁడుగాఁడు. అతని వాక్యములు వయస్సున పిల్లవాఁడు గానున్నప్పటివనికాక ముగ్ధత్వముచే గలిగినవని భావింపవలయును. తిన్నఁడు వయస్సున యువకుఁడు, మనస్సున ముగ్ధుఁడు. అదియుగాక యాటవికుఁడు శివునకర్పింతునన్నదనిలో యువతులుండుట జాత్యుచితమే కాని యనుచితముగాదు. అతనిది బాలభావముకాదనుట, బాలుఁడను శబ్దమున కమాయికుండనియే యిచట యర్థముగా గ్రహింపవలసియున్నది. తెలియఁజాలని వాఁడను నర్థమున శిశుపాలుని భీష్ముఁడు 'శిశుపాలుఁడు బాలుఁడు' అని పలికెను. కాన తిన్నని వాక్యము బాలభాషోచితము కాదనుట అతడు

---

1. శ్రీ.కా.మా. పీఠిక పుట 42    2. శ్రీ.కా.మా. పీఠిక పుట 42

3. శ్రీ.కా.మా. 3ఆ - 36ప.

వయస్సున బాలుఁడయి నప్పుడుగదా! అనేక మృగములను చంపి మాలగా గ్రుచ్చి తండ్రి కంపినతిన్నఁడు బాలుఁడు కాఁడు. ఇల్లాలిని కలిగియుండుట యెట్టి వేడిమియో తెలిసిన వయస్సాతనిది. కాన నిచ్చటఁగలదని భావించిన యనౌచిత్యము తొలఁగిపోయి పాత్రౌచిత్యము, ప్రకరణౌచిత్యములే కలవని యెంచఁదగును.

కావ్యములందుఁ గవిసమయములని కొన్ని ప్రయుక్త మగుచుండును. ఆ కవి సమయములన్నియు సరియైనవని యనలేము సర్వసాధారణముగా స్త్రీ కంఠమును ఆడు కోకిల కంఠముతోఁబోల్చుట కవి సమయముగా గలదు.

ఏడ్చె ... ... బాలపల్లవగ్రాస కషాయకంఠ కలకంఠవధూకల
కాకలీ ధ్వనిన్,[1]

ధూర్జటికూడ 'పంచమస్వనుల తానములీను పికాంగనాగతిన్'[2] అనియే దాసి కంఠమును ఆడుకోయిలతో బోల్చినాఁడు. కాని యాడుకోయిల కూయదు. కూయునది మగకోకిల. 'కలకంఠీకోకిల కంఠకోమలకుహూకార'[3]. అట్లే ఆడునది మగనెమలి కాని యాడు నెమలి కాదు. కాని మయూరిని నాట్యమునకుఁబోల్చుటయు, నితకలకుఁబోల్చుటయు కవిసమయముగా నున్నవి.

అట్లే 'పికాంగన' యను రీతి నిచట, ధూర్జటి కచభరమునకు 'మయూరి'ని పోల్చుటయు జరిగినది. అంతమాత్రమున దీనిని హీనోపమ్యమని, యనౌచిత్యమని తలపఁబనిలేదు.

౬. వృద్ధవేశ్య తనబిడ్డలవర్ణనమును పచ్చి పచ్చిగా చేయుట :

వేశ్య, అందుని వృద్ధవేశ్య, తనజీవనమున కాధారము తావలయునుగాన కూతుల మెచ్చుయందు, వారికి విద్యగఱపుటయందు, వారవృత్తికి విముఖలగుసవారికి తన హితవులు బలుకుటయందు ప్రకరణౌచిత్యమే కలదుకాని యన్యముకాదు.

క్షేమేంద్రుఁడు పలికిన యన్ని విధములగు నౌచిత్యములను సాకల్యముగ సమ న్వయించుట యిచటి మన ప్రయత్నముకాదు, గనుక, పూర్వప్రకరణములం దాయా చాపల సందర్భోచితముగా రస, భావ, గుణ, అలంకార, భాష, సమాస, నామ, శబ్ద వాక్య, పాత్ర, వర్ణనేత్యాదుల యౌచిత్యమును బరామర్శించియే యుంటిమి. కనుక నిట్లు సంక్షిప్త సమీక్షసేయుట.

---

1 పారి 4ఆ - 133 ప 2 శ్రీ.కా.మా. 1 ఆ - 50ప
3 కాశీ 1 ఆ - 59ప, శ్రీ.కా.మా. 3 ఆ - 11ప

# భాష - శైలి

**భాష:-**

బహుళాంధ్రోక్తిమయప్రపంచ పరమేష్ఠి నన్నయభట్టు. సమకాలీన శిష్టవ్యవహారికమును నియమితమైన ప్రయోగమునగు భాషనెన్నుకొని, సంస్కరించి, కలరుచి ప్రచురమైన సంస్కృతంపుటంటుగట్టి, తెలుగు జాతికి కావ్యఫలమును ప్రసాదించిన మహామనీషి యతఁడు. సహజమధురమైన తెలుగు, సముదాత్త గంభీరమగు సంస్కృత భాషాసాహచర్యమున తేజరిల్లుచు ఆ భట్టారకుని యొజ్జబంచులఁబడి అర్వాచీన సర్వాంధ్ర కవులకును బహుధా ఉపాదేయమైనది.

తీరుతియ్యమున తెలుఁగుబలుకుఁ గపురంపుఁబలుకులు గుప్పినవాఁడు తిక్కయజ్వ. నన్నయ సంస్కృతప్రౌఢి, తిక్కన తెలుఁగుదనములను చక్కగా మేళగించినవాఁడు కవిసార్వభౌముఁడు శ్రీనాథభట్ట సుకవీంద్రుఁడు. రసపాకమున కనువైన రాజమార్గ మేర్పఱదుకొన్న వాఁడా కవిసార్వభౌముఁడు. శ్రీనాథుఁడు హరవిలాసమున తెలుఁగుదనము, నైషధమున సంస్కృతప్రౌఢి, కాశీఖండమందుభయభాషాశక్తికల చక్కందనమునుఁ బ్రదర్శించినాఁడు. ఈశ్వరార్చన కళాశీలమునను హృదయంకషమైన రాసిక్య సంపత్తియందును మాత్రమేకాదు పరమ రమణీయమైన యేవంవిధభాషా శక్తిక యందును, రసాభ్యుచితశైలీప్రాగల్భ్యమునందును, శ్రీనాథమహాకవితో పోలిక లిరుగు పొరుగుగాఁగల కవిలోకసారిషదుఁడు ధూర్జటి.

నన్నయ ననుకరింపఁబూనుట తరువాతికవులకు పరిపాటియైనది. భావము, భాష యందు నన్నయ తిక్కనల ననుకరింపఁబ్రయత్నించిన వారనేకులు గలరు. చిరకాలాను గతముగా వేఁగిమండలమునఁబండిత సంప్రదాయమును, నెల్లూరు మండలమున దేశీయ సంప్రదాయమును ప్రబలుచువచ్చినవి. భాషా భావనా మార్గములందు పండితసంప్రదాయమునకు ప్రభువు, ప్రవక్త తిక్కన, ధూర్జటియు, శ్రీనాథప్రభృతులవలెనే నన్నయమార్గానుయాయి అనుటయే లెస్స.

శ్రీనాథుని కవిత్వమందలియౌద్ధత్యము ధూర్జటియందుఁగనఁబడదు. ఉద్ధత రస సందర్భములు శ్రీనాథునియందున్నట్లుగా ధూర్జటియందు లేవు. ఇట్టి యావశ్యకత ధూర్జటికవిత్వమందుఁగలుగలేదు. ధూర్జటికవిత్వమందుమధుర రససందర్భములే యధి

క్రము. కర్ణాటకశబ్దప్రయోగమునందుఁగన్పించు సామ్యము, కేవలానుకరణముగాక, కథాసందర్భము శైవసంబంధియగుటయు, ధూర్జటి నివసించిన ప్రాంతము చిత్తూరు మండలము ఆనాటి కర్ణాటకసామ్రాజ్యమందలిదగుటయే ప్రధానకారణముగాఁగలిగెనని యెంచ కసంప్రదాయసూచకముగా "శరణార్థిసేయు"[1] ప్రయోగముకూడ నిట్టిదే.

రచనమున సంస్కృతము, తెలుఁగు భాషలప్రయోగము శ్రీనాథుని రీతిసే గమనించఁగలము. పూర్వార్ధము తెలుఁగు, ఉత్తరార్ధము సంస్కృతము లుండుట శ్రీనాథుని ధోరణికాగా, తిక్కనవలె పూర్వార్ధము సంస్కృతము నుత్తరార్ధము తెలుఁగుగా రచించుటయు ధూర్జటి భాషావిషయమునఁ జూడఁగలము.

విహరించు నొకవేళ విపినాగ్రమపల్లవచ్ఛాయల గిరిజా సహాయుఁడగుచు
క్రీడించు నొకవేళ గిరిదరీ నిర్ఝర ధారాపనీత సదాఘుఁడగుచు...[2]
కంఠహాలాహల కాళిమచ్ఛవితోడఁ, నెవచుచ్చు గుబ్బచన్నొసలనలుపు[3]

గద్యరచనమునఁ దెనుఁగువారి కాదర్శమైనది సంస్కృతకాదంబరి. ధూర్జటికిఁ బూర్వులు తిక్కన, అనంతామాత్య, పోతన, పినవీరవాదులు తాదృశగద్యరచనావిన్యాసము గావించియున్నారు. సంధిపదసమాసములుగానున్న తావులుగాక, వర్ణనాత్మకములయిన దీర్ఘ వచనరచనలు ధూర్జటియందు పూర్వోక్తప్రకారములై శబ్దాలంకారభూషితమై యలరుచున్నవి. [illegible] పోలికలను, క్రౌంచనిజాకర, తిన్ననివేఁట, నత్కీరుని [illegible] సత్యాన్వయుల శ్రీకాళహస్తియాత్ర, వారికి పార్వతీపరమేశ్వరుల సాక్షాత్కారము, [illegible] జంగమదర్శనార్థియై కాళహస్తిపతి వచ్చి [illegible], వశిష్ఠునకు పరమేశ్వరుఁడు పంచముఖుఁడై పరశివలింగరూపమున సాక్షాత్కరించుట, బ్రహ్మ యీశ్వరునిగూర్చి తపమాచరింపఁబూనుట, హరద్విజునకు హరుఁడనుగ్రహించి పద్యమిచ్చుట, సుబ్రహ్మణ్యుఁడు భూతమును జంపుట, వేశ్యమాత తనయల కుపదేశింపఁబూనుట, అను తావులందలి నాతిదీర్ఘములు, నాత్యల్పములయిన వచనములందును ధూర్జటి గద్యరచనావ్యాసముఁ దిలకింపఁగలము.

---

1 శ్రీ.కా.మా. 1ఆ - 34ప 4ఆ - 53ప    2 శ్రీ.కా.మా. 1ఆ - 98ప
3 శ్రీ.కా.మా. 3ఆ - 22ప

ఇఁక ధూర్జటి భాషనుగూర్చి తానుగాఁజెప్పుకొనిన విశేషణములను పరిశీలింతము. తన కవిత్వమున ప్రౌఢిమ, మధురిమలున్నట్లు కవి యాయా సందర్భముల నాయా పాత్రలచేఁ బలికించినాఁడు. ఆయాపాత్రలని వేఱుగాఁజెప్పఁబనిలేదు. ఈరెండు శబ్దములను ప్రయోగించినది పరమేశ్వరుఁడే.

ధూర్జటికవి తనభాష "నవ్యభాష" యని పేర్కొనియున్నాఁడు. రసామగుణమగు భాష ప్రబంధకవుల సామాన్యవిశేషము కాని ధూర్జటిని దేశికోత్తముఁడు.

'నీ శివభక్తి కావ్యసరణిం గను ధన్యతఁ బొంద నవ్యభా
షాశోభానిగుంభసరసస్థితి నొప్పుదలిర్ప జెప్పు...[1]

మని ఆదేశించినాఁడు. కావ్యమందలి సర్వవస్తు నిర్వాహణమును శివపారమ్యముగా నొనర్చి భక్తికి రసస్థితి సమకూర్చునట్లుచేయుట ధూర్జటి "నవ్యభాషా" రచన. పురవర్ణనము, పాత్రచిత్రణము, దాసివిలాపము, తండె గుర్విణ్యవస్థాచిత్రణము, తిన్ననియు, వేశ్యానసయులయు, బాల్యచేష్టలు, క్రీడలు, తటాకములు, సముద్రము, చంద్రుఁడు, ఇత్యాది వర్ణనములన్నియు శివపరములుగాఁ జేయఁబడినవి. ధూర్జటికిఁగల శివభక్తి కావ్యత్వమందినవి. పైన పేర్కొనిన విషయములనుఁ బరిశీలించునప్పటి "వస్తునిర్వహణము", "వర్ణనలు" అనుప్రకరణములందు ధూర్జటి శివభక్తి యెట్లు వ్యక్తమైనదో పరిశీలించియుంటిమి అట్టి శివభక్తిమయముగా చేసిన కావ్యరచన నవ్యభాషారచన.

అతులైశ్వర్య పరంపరా విలసితంబైనట్టి తత్పట్టణ
ప్రతిబింబంబునఁ జంద్రకాంతరచిత ప్రాకారమొప్పారు న
న్యూనా యూ బహువిభ్రమభ్రమిత వస్తువ్రాత లోకోదయ
స్థితి లోఁగొన్న శివుండనంగ హృదయాచింత్యప్రభావంబునన్.[2]

కాళహస్తి ప్రభువర్ణనము [3] నిట్టిదే. చంద్రబింబము శివలింగముగా రూపింపబడినది.[3]

ఉదయాగ్రావము పానవట్టమభిషేకోదప్రవాహంబు వా
ర్థి దరీధ్వాంతము ధూపధూపము జ్వలద్దీప ప్రభారాజి కౌ
ముది తారానివహంబు లర్పితసుమంబుల్ గాఁదమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తిబింబ శివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్.[4]

1. శ్రీ.కా.మా. 1ఆ - 8ప    2. శ్రీ.కా.మా. 1 ఆ - 19ప
3. శ్రీ.కా.మా. 1ఆ - 28ప    4. ,,    2 ఆ - 133

పరమేశ్వరుఁడె 'ప్రౌఢ, మాధురీ చారుప్రౌఢిమ' అను శబ్దములను కవిత్వపరముగా ప్రయోగించియున్నాఁడు. ప్రౌఢి మధురిమల సమ్మేళనము 'సర్వభాష 'యని ధూర్జటి యభిప్రాయమై యుండునని మనము భావింపనగును.

ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు
పలుకునుడికారమున నాంధ్రభాష యండ్రు
ఎవ్వ రేమన్న నండ్రు నాకేల కొఱఁత
నాకవిత్వంబు నిజము గర్ణాటభాష.[1]

అను శ్రీనాథుని పలుకునుబట్టి సంస్కృతాంధ్రముల చక్కని మేళగింపు కర్ణాటభాషయని శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రిగారభిప్రాయపడినారు.

ధూర్జటి కవీంద్రుఁడు తనకవితా ప్రౌఢిని, మాధుర్యమును పరమేశ్వరుని ముఖమున, పాండ్య ప్రభువు కొలువుకూటమునఁ బలికియున్నాఁడు. కవులు తమకవితాగుణములను పాత్రలముఖమున ప్రకటించుటకలదు. అట్టిదే యీవాక్యము.

ఈ రాజన్యునిమీఁద నేఁగవిత సాహిత్య స్ఫురద్వాఙ్మాధురీ
చారుప్రౌఢిమఁ జెప్పి పంప, విని మాత్సర్యంబు వాటించి న,
త్క్రూరుండారకె తప్పువట్టెనఁట! యేలక్షణంబో? యలం
కారంబో? పదబంధమో? రసమో? చక్కం జెప్పఁడా తప్పునన్,[2]

తనకవిత్వము 'మాధుర్యము చారుప్రౌఢి' యనువానితో గూడినదనియు, అలంకారము, పదబంధము, రసమిత్యాదులగు సర్వలక్షణములు కలదనియు నావాక్యమున చెప్పినట్లున్నది. అంతియేకాదు ధూర్జటి తనశతకమునందున, తన కవితా లక్షణముల సూచించుకొనియున్నాఁడు.

'జలకంబుల్ రసముల్, ప్రసూనములు వాచాబంధముల్, వాద్యముల్
గలశబ్దధ్వను, లంచితాంబరమలంకారంబు, దీప్తుల్ మెఱుం
గులు, నైవేద్యము మాధురీమహిమగా, గొల్తున్ నినుం భక్తి రం
జిల, దివ్యార్చనగూర్చి నేర్చినక్రియన్ శ్రీకాళహస్తీశ్వరా!— ప.

---

1. భీ.పు 1ఆ - 15ప    2. శ్రీ.కా.మా. 3ఆ - 157ప

నైసర్గికమయిన స్వీయకవితామాధుర్యమును. ధూర్జటి, శ్రీ కాళహస్తీశ్వరునకు నైవేద్యముగా సమర్పించుకొనినాఁడు. ధూర్జటి ప్రపౌత్రుఁడగు కుమారధూర్జటియు, మహాకవి ధూర్జటి కవిత్వమును కొనియాడుచు, "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల కల్గెనో యతులితమాధురీమహిమ నా......" యనినాఁడు.

ధూర్జటికవీంద్రుని భాషయందు ప్రౌఢి, మాధుర్యములను వస్తునిర్వహణమున నాయాసందర్భములందుఁ బరికించియుంటిమి. సంస్కృతభాషా ప్రౌఢి, తెలుఁగు బలుకుల పొంకము, శిథిలబంధమగు మాధుర్యమును మచ్చునకొండు రెండుగాఁ జూతము.

సంస్కృత భాషా ప్రౌఢి :—

అక్కడఁదొల్లి సింహశరభాది మృగాకులమై పునఃపునః
పక్కణనిక్వణ క్రకచణబంధురమై, శబరీకిరాత స
మ్యక్స్మృత మన్మథశ్రమ విహార మహాఖురళీకుటుంగమై
వాక్కబళీకృతేతర దవజ్వలనోగ్రవనంబు చెల్వగున్.[1]

శుండాలార్భక షండగండతల ఖర్జూభర్జనోపార్జనా
ఖండగ్రావము, చంచరీండలి విశంకవ్యాప్తి కింపైన, శ్రీ
ఖండస్థాణువు, శారికాశుక విహంగవ్రాత పుంజీకృతో
దండక్రీడకు నీడమై, తప మతిస్థైరగంబునం జేయగన్.

తెలుఁగుబలుకుఁజెలువము :

మొగులు మొగిలున మెఱుగులు నిగుడఁదొడఁగె
మెఱుఁగు మెఱుఁగున నుఱుములు మొందుకొనియె
నుఱుము నుఱుమంగఁబిడుగులు నుప్పతిల్లె
నింతకంతను వర్షంబు నెక్కుడయ్యె.[3]

---

1. శ్రీ.కా.మా. 1ఆ – 65ప  2. శ్రీ.కా.మా. 1ఆ 73ప
3. శ్రీ.కా.మా. 1ఆ – 127ప

ఇందు "పక్షంబు" అన్న యొక్క పదము మాత్రమే తత్సమము.

మోము పున్నమచందమామ వెన్నెలఁగాయ, డెందంపుఁ గెందమ్మి
క్రిందుపడెనో?
వాలుఁజూపనియెడు వేలుపుజేనికై, నుపచాయ గట్టుగట్టవిరుఁబడెనో?
కొప్పను చీఁకటిగుంపు గప్పుకొనంగఁ దలఁపుదెవ్వరి త్రోవఁదప్పిపడెనో?
రాయంచనడల రాయిడిఁ దాల్మితా, మరతూఁడు దుమురుగా నురల
బడెనో?

నలువ, తనుగొల్వవచ్చిన పలుకుఁజెలువ, చెలువమరయుచు, వలరాజు
చిలుకుములికిఁ
దలఁకి, మిన్నక యొకకొంతతడవు నిలిచె, మునులు దమతమ మొగములు
గనుఁగొనంగ.[1]

ఇందు మునులనుపద యొక్కటి మాత్రము తత్సమము,

సంస్కృతాంధ్రముల చక్కని సమ్మేళనము :

దిక్కుల్ పిక్కటిలంగఁ జక్రగుణసందీప్త ధ్వనుల్మీఱఁగా
రెక్కల్వచ్చిన కాలసర్పముల పేర్మిం గంకపత్త్రంబులన్
జొక్కంబైన నిశాతబాణముల నాజోదేసె, బేతాళికుల్
గ్రుక్కిళ్ళింగఁగఁ ద్రొత్తునెత్తురులు వాగుల్వాఱఁ గ్రవ్యాదులున్.[2]

**మాధుర్యము:-** 'పృథక్పదత్వం మాధుర్య' మ్మని వామనాచార్యుని లక్షణము. అనఁగా చక్కని విడివిడిపదములతో నిలచియుండు మాధుర్యము. ధూర్జటి రచనమున పలికిన భాష యెక్కువ భాగ మీమాధుర్యమునకుఁ జెందినది. అదియే ధూర్జటి మాధురీ మహిమ.

1. శ్రీ కా.మా. 2అ - 10ప
2. ,, 2ఆ - 52ప

ఎలదోటల్వనముల్, వధూకుచములద్రీంద్రింబు, లోకంటికిన్
ఫలముల్పో తెర, లంగజాగమకళాబంధంబులిచ్ఛాసనం
బుల్, కోపంబునఁబోయుటల్ తపము, సంభోగంబు కైవల్యమం
దుల లీలారతి నుండు మానవుల కెందుం గానమీచిత్రముల్.[1]

మగువకు శరీర మొసఁగిన మగఁడు, చిదంగనకు మగఁడు, మాయాసతికిన్
మగఁడు, మగవేలుల్పకుఁదకు, మగఁడు మగఁడుగాక యెకు మనుజుఁడు
మగఁడే?[2]

ఈ కేళీసదనంబు లీ మృగమదం, బీ చంద్ర, మీ చందనం
బీ కాశ్మీరము, లీ దుకూలాంబరము, లీ హారాదిరత్నాంకితా
నేకాలంకృతు, లీ కరండనిచయం, బీ తూఁగు మంచంబు, లే
నీ కన్యార్థముగా ఘటించితి, దయాశీలా! పరింకెట్లకో? [3]

భాషయందు ధూర్జటి పలుకుబడులు, జాతీయములు, ప్రయోగవైచిత్రిని శతథా ప్రదర్శించియున్నాఁడు.

**పలుకుబడులు:-** చిమ్మంజీఁకటి, జాలిపడు, కన్నారన్, చిన్నంబుచ్చక, ప్రొద్దుపుచ్చు, కాసంతైన, వీసంతైన, చిన్నంబంతయు, కొఱగాకపోవు, చెంపల్వేయు, విన్నంబోవు, మొఱపెట్టు, చిటుకన్నన్, రచ్చల్వేయు, తృణంబువాంఛింప, పొట్టకుగాన్, బోగులం బొడుచు, చేదోడై, నీలాపనిందలపుచింత, సేకొను, సూటిపోయు, కొల్లగొను, జవదాటు, పనివిను, కాలము చేరువయగు, రెక్కల్వచ్చు, నిప్పురాలు, కడిగండల్గాగ, చేతడియారదు, పేదెత్తు, గుండెగూడుదీగు, మిన్నుదన్ను, చీరచిక్కు, అచ్చుదలయగు, అచ్చుపడఁజేయు, గగ్గులకాటగల్పు, అగ్గిబడఁజేయు, మల్లాడు, బుస్సనపోనూఁదు, కనుమూయు, మనసువచ్చు, లోంగుండు, ఎగసన్రోయు, కసరెత్తు, హటము, రొక్కారొక్కముల్, కారాకూరసుల కస్తింబెట్టు, కారుకమ్మగ, బుద్ధిసెప్పు, అడ్డాకుల బెట్టు, కావుగట్టు, చేనేతన్, ఇత్యాదులు.

---

1. శ్రీ.కా.మా. 1ఆ - 21ప 4ఆ - 68ప 2 శ్రీ.కా.మా. 4ఆ - 42ప

3. శ్రీ.కా.మా. 4ఆ - 15ప

జాతీయములు:— తామరతంపరై, నీచిత్తంబు నాభాగ్యంబు, నీరమ్మంపుముపాల ముంపుము, నీపంచంబడియుండగా, గుమ్మడికాయలోను నవగింజంతైన, ముంగిటి వారణాసి, కదుసే కైలాసము, ఇచ్చెదలద్రోచిన జూరువట్టుకొనిగ్రేలాడు, ఏనుగుపై నెక్కి దిడ్డిమాఋదురె, చింతకంత, మేకనెందవచటన్, వెలివాడనమ్మిబాపనిల్లుగలదా, మంచినీళ్లు గలవా చత్రాతిలో?, దూపతప్పకుండంగ, హస్తిమశకాంతరము, ప్రాణంబు ప్రాణమగుట, మందునకునైన, నోరుపాచనోరనెయుండ, పయింబువ్వులుసల్లినయట్టు కుమ్మరికొకయేడును గుదెకొక పెట్టన్నమాట, పగవానినిగూడె దైవమున్, త్రోసినరొంట దిచోట్లగూలు, కాలాదినప్పుడు, ఆడబోపుతీర్థమెదురైనరీతి, వావివరుసల్, తలమెత్తి ఠరుగు, ప్రొద్దుపొటుక్కనంచెదప, అలిగి పఱపుపైబడినగతి.

ప్రయోగవైచిత్రి:— సాధరణముగా శైవకవులవలెనే ధూర్జటియు ప్రయోగములందు వైలక్షణ్యముం బ్రదర్శించెను

1. కొనుసకు 'క' ఆదేశము చేయుట: వినుట్చక, పెట్టుక, ఎలయించుక, పిల్చుక, పట్టుక, కూడుక, ప్రచ్చక.

2. ఇకారసంధి :— లేడి + ఉండగా — లేడుడంగా, బీతుండగా, భీతయ్యెదున్, తంద్రాన, పిందెంతో, క్రీడించక, మాపటినందుననన్, కానప్పుడే, పడనప్పుడే, రోయనప్పుడే

3 క్త్వార్థేకారసంధి :— అంపి + ఇచ్చు — అందిచ్చు, అందియ్య, లొంగుండెడు, ఈఁదీడి.

4. నుగాగామలోపము :— జాఱు + ఒప్పున — జాఱొప్పున, చిందమృతము, వేటలాడెఱకుగోవాళుల్, అద్రిరాజల్లుని, వొత్తామర.

5. ప్రయోగమున లేని పదములు వాడుట :— అరటములు, కొట్రు, గగ్గులకాడు లూలాపూలవుమాటలు.

6. వ్యవహారసిద్ధప్రయోగములు సేయుట :— అంతా, చేయంగాపోతే, ఒల్లనంటే, రోసిరోయదు, పాసీసాయదు, చేసీచేయదు, రోసిందేటిది, పూసిందేటిది, మూసిందేటిసి, చేసిందేటిది, చేసునె, వాటిన్.

7. విశిష్ట ప్రయోగములు — వాండ్రు, తోబుట్లు, మూలర్కాము, వొంగర్కాము ఇండ్లిండ్లు, భవ్యంబు, తెలుసో, చక్రోనకో, దుర్మేధనుల్, మఖిన్, ఎఱింగిన్, ఉన్నెడ, వన్నె గిన్నె ఉన్నప్పుడే, భోగే.

8. అన్యదేశీయములు :- క. కన్నడపదప్రయోగములు :- బిజమాడు, దేవర, బిడారు, మూర్త మాడు, మాడబేకు.

చ. తమిళము :- తిరు పెణ్ణు, మణ్ణు, దోసెలు.

ట. ఉర్దు :- గులాము

ప్రౌఢియందు శ్రీనాథుని యొరవడి ననుసరించి, ప్రయోగ స్వాతంత్ర్యమున శైవకవుల పక్కఁబోయిన ధూర్జటి మధురకవిత సెప్పి, తనభాషను 'నవ్యభాషగాఁ' దీర్చికొనినాఁడు.

శైలి :-

కవి ఏయర్థమును పాఠకునకందింపఁదలఁచెనో, ఆ యర్థమునకు పర్చస్వత జీవకళ తెచ్చునట్టి, స్ఫూర్తిమంతమైన రచనా విన్యాసము — శైలియనఁబడును. అర్థ స్వభావ జీవలక్షణమును, సందర్భసౌందర్యమును సద్యోహృద్యముగ నావర్జించు రచనావిన్యాసమే శైలియని భావించుటన్నమాట.

రసానుగుణమగు నర్థములతోఁగూడిన పదసముదాయమును వృత్తియని ప్రకాశ వర్షుఁడు తనరసార్ణవాలంకారమునఁ బలికియున్నాఁడు.

'రసోచితార్థసంబద్ధ సంతానశాలినీ, మనోవికాస సంకోచవర్త్మనాత్ వృత్తిరుచ్యతే'
— 3 — 24

మమ్మటుఁడు, అభినవగుప్తుఁడు, ఆదిగా గల లాక్షణికుల యభిప్రాయములందును వృత్తి రసవ్యంజకమగు పదసంయోజనముగా భావింపఁబడుచున్నది. విశిష్టపదరచనమగు రీతినే కావ్యాత్మగాఁబలికినవాఁడు వామనుఁడు. రచనావిన్యాసక్రమమును రీతి యనినాఁడు రాజశేఖరుఁడు. అన్యోన్యమైత్రిగల పదములకూర్పును శయ్యయని విశ్వనాథుని వాక్యము పలుకుచున్నది. రసోచితమగు శబ్దార్థ నిబంధనము పాకమని ఏకావళి పలుకుచున్నది.

అర్థసౌందర్యసముద్బోధకమగు శబ్దసౌందర్యానుసంధాన మను మద్దేశమున ఆనందవర్ధనాచార్యులు 'సంఘటన' యని ప్రయోగించినారు. అట్టి వివేకముగల తెలుగు

కవులు కూడ తాదృశమైన సముద్దేశముతోడనే బంధము, కూర్పు, పొందు, అల్లిక యను పలుకులతో శైలిస్వరూపమును వ్యపదేశించినట్లు గ్రహింపగలము. వృత్తి, రీతి, శయ్య, పాకము అను పదములు, శైలీశబ్దార్థసముద్దేశమునకు సాక్షికమగు ప్రాతినిధ్యమునే వహించును. ఆ సర్వనిర్వచనముల సారమును, సంఘటన, బంధములను పలుకుల పరమార్థముతో ననుసంధిరతుమేని శైలీశబ్దార్థమును సమగ్రముగా సాక్షాత్కరించును

మన తెలుగు సాహిత్యమున శైలీవిన్యాసము ముప్పోకలఁబోయినట్లు కవిత్రయము వానికాద్యులైనట్లు మనమెఱుఁగుదుము. ఆఖ్యానశైలి లేక కథనాత్మకశైలి సంభాషణాత్మక శైలి లేక నాటకీయశైలి; వర్ణనాత్మకశైలి లేక ప్రబంధశైలి యనునవి యవి. ఒక్కొక్క శైలి కొక్కొక్కరాద్యులనుటలో, మిగిలినరీతులు వారియందు లేవని కాదు. ఆ యా వానియందు ప్రత్యేకత కల్గి, వానికాదర్శమూర్తులుగ నిలిచిరన్నమాట.

1. రూపచిత్రణము :–

తన సౌందర్యము చూఁచి కామశరసంతాపంబునుం బొందకుం
డిన కాంతామణిఁ దాల్మిదూలని వధూటిం, గౌఁగిలింపం దలం
పని శంపాలలితాంగి, బోటులకుఁ జెప్పంబోని పంకేరుహా
ననఁ, గీర్తింపనిలేమ, మందునకునైనం గాన మూహింపగన్.[1]

ఈపద్యమాలించినంతనే శ్రీనాథుని నలునిరూపచిత్రణము మనహృదయ గోచరమగునుగదా!

వానిఁగలలోనఁగానని వనజముఖియు, వానిమూర్తిన్ బేర్కొని మాన
వతియు
వాసగా నాత్మభావించి వరునిఁగవయు, నప్పళించని సతియు లేదయ్యె
నచట.[2]

1. శృం.నై. 1ఆ - 32
2. శృం.నై. 1ఆ - 62

ఛాయగా గ్రహించిన శ్రీనాథుని పద్యమునకు, ధూర్జటి పద్యరచనము [illegible] నేర్చిన సంగీతవిద్యకు శిష్యుఁడు స్వోపజ్ఞతో మెఱుఁగులు దిద్దుకొన్నట్లు [illegible] ఇట్టిదే ధూర్జటి దాసి రూపచిత్రణమునఁ జూపిన శైలీ విన్యాసము.

ఆవేగం బురపల్లవప్రకరనేత్రానందబాష్పాంబుధా
రావర్షాగమచంచలాలతిక, దుర్వారప్రసూనాస్త్రశ్రే
ణీవైశ్వానరసామిధేని, రశనాసూత్రస్థిత స్వర్ణ పే
టీవిన్యస్తకపర్ది యొక్క కలకంఠీరత్న మేతెంచుచున్.[1]

సంస్కృతపదఘటిత దీర్ఘసమాసములున్నను, అన్వయక్లేశము లేక [illegible] జనలయ నీ పదవిన్యాసము, ధూర్జటి శైలీవిన్యాసమున సందర్భో[illegible] కవీంద్రుఁడు పల్కిన చంచలాలతిక యూతనిసవ్యమే యని [illegible] కాదు. సుందరాంగి, శివాచార్యైకసుశీలయగు దాసి [illegible] సాధిత జంగమార్చన కళాసామర్థ్య, కందర్ప శుద్ధాంతశ్రీ పరిహాస [illegible] తీత సౌందర్య' వాకట్టుకొనగల్గిన జంగముని రూపసౌందర్యమును పైనఁ జూచియుంటిమి. ఈ రెండు మూర్తి చిత్రణములును శృంగారరసానుగుణములు. [illegible] సంయోజనముచే లలితమైన శైలి జంగమరూపచిత్రణమునను, దీర్ఘ సమాస[illegible] మయ్యు నక్లిష్టాన్వయమైన శైలి దాసి రూపచిత్రణమునఁ జూడగలము.

2. అవస్థాచిత్రణము :— దాసి రాజు నెదుటికేఁగుట, జంగముని పాదములపైఁబడి రోదించుటలు చిత్రించిన యాయవస్థలయందు, ధూర్జటి రచనా విన్యాసవిలాసము గమనింపఁగలము.

'వడగొల్పి రొకకేల ముడిచినక్రొమ్ముడి, గొబ్బునఁగటిఁజుట్టుకొన్న చేల
ముందొంటఁ బెనఁగొని యున్న హారంబులు, నిద్రదేఱెడి నేత్ర
నీరజములు'...[2]

1. శ్రీ.కా.మా. 1ఆ — 33ప.

2. శ్రీ.కా.మా. 1ఆ — 47ప

ఎంతయందముగా ఎంత చందముగా, ఎంతవేగముతో, ఎంత సౌభాగ్యముతో నా నెత్తిన శిరోజములు మొలిచినవో యుత్ప్రేక్షింపజాలిన దీ పద్యరచనము.

3. స్థలమహిమానుసంధానము :— జముదెస వెంకికొండ సొప్పుడు చిత్రితమైనది.

జడలు ధరింప, రంగజునిజంపరు, పూయరు బూదిపూఁతమై
నడుగరు భిక్ష, కట్టరజినాంబరము, ల్చరియింపబోరు పే
రడవుల, నగ్గిరీంద్రమహిమాతిశయంబిఁక నేమి సెప్పెదున్
బడయుదు రూరకుండియును ప్రాణులు చిత్రముగా శివత్వమున్.[1]

ఆ కొండ మహిమాతిశయము విభావనచే భావనసేయఁబడినది. చిత్రమై మహా అద్భుతావహమైనది.

4. సన్నివేశచిత్రణము :— పాము నేనుఁగులు పోరాటము సలిపి ష్మశానము ఘట్టము బీభత్సముగా నెలవు. అప్పటి యాసంఘటనము, సన్నివేశమును మనో నేత్రములఁ గట్టురున్నది యూఁటవెల్లది.

'కొండకొండతోడ గుంపులు గూలంగ, దాకినట్లుదోఁచె, దళితకుంభ
సీమనున్న పాము చిదిసె నేనుంగును, బడియె, నెత్తు రచట బడియ
కట్టె'[2]

"చిదిసనపాము, కొండవలెనేనుఁగు "పడుట" నెత్తురు "పడియకట్టుట" లయెంచి క్రియా పదము లెంటటి బీభత్స రసస్ఫోరకములుగా సన్నివేశ సాక్షాత్కార సమర్థములుగానున్నవో పరికించితిమి. అర్థస్ఫూర్తి గలిగించు శబ్దసంయోజనములిగో యను నట్లున్నదీపద్యము

5. శబ్దాలంకార ప్రాచుర్యము :— ప్రబంధమున సర్వసాధారణముగా యాత్రా వర్ణనము తీర్థ, క్షేత్ర, స్వాముల వర్ణనమున నిట్టి శబాలంకారములు, అంత్య

1. శ్రీ.కా.మా. 1ఆ — 103ప     2. శ్రీ కా.మా. 2ఆ— 151ప.

ప్రాసాలంకార శోభితమగు రచనావిన్యాసమును గాంచుచుందుము. ఇటువంటి అంత్య ప్రాసాలంకార విశిష్టపద్యరచనా శక్తికిని నవీనగుణసనాథుఁడగు నాచన సోమనాథుఁడు పూర్వరంగము నిర్వహింపఁగా, ప్రౌఢులైన శ్రీనాథయుగపు కవులు ప్రస్తావన సదృశ అంత్యప్రాసములు పాదమాత్రమును మాత్రమే ప్రదర్శించిరి. కాని పోతనార్యుని కది యభీష్టమైనది

ధూర్జటి ప్రవృత్తి ప్రబంధకవులకు మార్గదర్శకమైనది. దక్షిణ కైలాసవర్ణనము, ఫణారాజన్మహాలింగము, నదులను వర్ణించునపుడు నీయంత్యప్రాసాలంకారముతోడి పద్య విన్యాసముఁ గాంచగలము.

దక్షిణకైలాసము :-

ప్రణతు శ్రేయముచుఁ గాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతో గూడి ద
క్షిణకైలాసము, నంబికాహరకృత శ్రీపాదు కాన్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్ భవమహామాయా విపర్యాసమున్
గణనాతీతనటీవిలాసము, సమగ్ర శ్రీసముల్లాసమున్.[1]

కాళహస్తి ఫణారాజన్మహాలింగము :-

గాంచెన్ వంచిత పాంచభౌతిక సుఖాకారాంగమున్, జిహ్వటీ
సంచారాంచిత రంగమున్, మునిమనస్సుద్వ్యక్తరిష్వంగమున్
బంచాస్త్రాసు మహత్స్ఫులింగము, కృపాపాణింధమాపాంగమున్
బ్రాంచన్ముక్తికళత్రసంగము, ఫణారాజన్మహాలింగమున్.[2]

కావేరీనది :-

చవిచని దాఁటె నంతఁ గవిచంద్రుఁడు ధన్య, గవేరకన్య, జీ
వనశితఖడ్గ ఖండిత భవప్రథవాఘు విరోధిసైన్య, భా
వనవిజనామ సంస్మరణ వారితమానవదైన్య, నిత్యము
జ్జనరతకోటి ముక్తిపదసౌఖ్య వదాన్యఁ గృతావగాహుఁడై.[3]

---

1. శ్రీ.కా.మా. 1ఆ - 109ప  2. శ్రీ.కా.మా. 1ఆ - 182ప

3 శ్రీ.కా.మా. 3ఆ - 22ప

అరుణగిరి :–

అరుణగిరీంద్రకూటముఁ గృతాఘుకపోల చపేటమున్, నిరం
తర భవదావపావక విదాహకృపీటము, పుణ్యకోశమం
దిర విలసత్కవాటము, బ్రదీపితముక్తివధూకిరీటమున్,
బరిహృత సంతతభ్రమణ భారపథశ్రమ భానుఘోటమున్.[1]

గంగానది :–

కాంచెన్ గాంచన పంకజాత విలసద్గంధాంధసారంగ, ఫే
నాంచతుంగతరంగ, వారినిధి శీతాగాంతరాభంగ, రో
మాంచ స్వేదజలాశ్రుపూరజన కాత్మానంద సంపన్మనో
మంచాగ్రస్థిత విశ్వనాథపద సమ్యక్సంగ, గంగానదిన్.[2]

రాజధరుఁడు ॥ కాళహస్తీశ్వరుఁడు। :–

రాజును సేనయున్, శబరరాజు, బుళిందభటాళియున్, వణి
గ్రాజును వైశ్యులుం, దపసిరాజును శిష్యతతిం, గపాలభృ
ద్రాజును జోగిపిండుఁ బశురక్షకరాజును గొల్లవాండ్రునై
రాజధరుండు దోఁచు నుడురాజముఖీమణి రక్షణార్థమై.[3]

శబ్దాలంకారప్రాచుర్యములగు పద్యములన్నియు ధూర్జటి శివపరాఙ్ముఖత్వము ముక్తి కాంక్షలను వెలువుచున్నవి. సమాసవిరహితము, సంస్కృతపదగుంఫన విరహితము నైన తెనుఁగు రచనలో 'అలఁతి అలఁతితునియల కాహాళసంధించిన విధము' న అని

---

1. శ్రీ.కా.మా. 3అ 184ప.   2. శ్రీ.కా.మా. 3ఆ – 189ప
3. శ్రీ.కా.మా. 4ఆ – 67ప.

తిక్కన చెప్పినట్లు, చెప్పినదంతయు చేసిచూపినట్లు, ధూర్జటికూడ అర్థసౌందర్య సాధనమున అలవోకచేసిన శైలీవిన్యాసము లనేకము గలవు.

తిన్నని మూఢభక్తి వర్ణనమున నాతని యమాయిక మనస్తత్త్వము నావిష్కరించుటకు ధూర్జటి మధురమైన శైలీవిన్యాసము గావించినాఁడు.

ఓ స్వామీ! యిటువంటి కోండదరిలో, నొంటిం బులుల్ సింగముల్
గాసింబెట్టెడు కుట్టనట్టడవిలో గల్లువ్వ్రక్కసీడ, నే
యాసం గట్టితి వేటిగడ్డనిలు? నీ వాఁకొన్నచో గూడు నీ
ళ్లేసుట్టంబులు దెచ్చిపెట్టెదరు ? నీ కిం దేటికే లింగమా ?[1]

వచనరచనయందు ధూర్జటి కవితారీతియంతయు సాక్షాత్కరించుచున్నది. వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాస, అంత్యప్రాస, ముక్తపదగ్రస్తాదిశబ్దాలంకారములును, శ్లేషానుప్రాణితోపమాద్యర్థాలంకారములును, యోగశాస్త్రాది శాస్త్రజ్ఞతయు, సంస్కృత సమాస సంఘటనము, తెలుఁగుఁబలుకుబడులు కలయికచే నొప్పు ధూర్జటి కవీంద్రుని శైలీవిన్యాసవిలాసమిది.

శతకము :-

శ్రీకాళహస్తీశ్వర శతకమున ప్రతిపద్యమును ధూర్జటికవీంద్రుని శైలీ లాలిత్యమున కుదాహరింపఁదగినదియే. శతకపద్యరచనారీతియంతయు తిక్కనార్యుని పద్యరచనా విన్యాసమునకుఁ బ్రతిరూపమనిపించు ననుట అతిశయోక్తి కాదు. అయినను మచ్చునకు కొన్నిమాత్రము చూడనగును.

ఏవేదంబు పఠించె లూత, భుజగం బే శాస్త్రములు చూచె, దా
నే విద్యాభ్యసనంబొనర్చెఁ గరి, చెంచే మంత్రమూహించె బో
ధావిర్భావ నిధానముల్ చదువులయ్యా ? కావు మీ పాద సం
సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా ! 13ప.

1. శ్రీ కా.మా 3ఆ - 65ప

కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయన్, రాపడె ఱొమ్ము మన్మథవిహార క్లేశ విభ్రాంతిచేఁ
బ్రాయంబాయెను, బట్టగట్టెఁదల, చెప్పన్ రోఁతసంసార మేఁ
జేయంజాల విరక్తుఁజేయగదవే శ్రీకాళహస్తీశ్వరా ! 14ప

నీరూపంబు దలంపఁగా దుద మొద ల్నేఁగాన నీవైనచో,
రారా రమ్మనియంచుఁజెప్పవు వృథారంభంబు లింకేటికిన్,
నీర న్ముంపుము పాల ముంపు మీఁక నిన్నే నమ్మినాఁడం జుమీ,
శ్రీరామార్చిత పాదపద్మయుగళా శ్రీకాళహస్తీశ్వరా ! 19ప

సంతోషించితిఁజాలుజాలుఁ రతిరాజద్వారసౌఖ్యంబులన్
శాంతింబొందితి-జాలుఁజాలుఁ బహురాజద్వారసౌఖ్యంబులన్
శాంతింబొందెదఁ జూపు బ్రహ్మపద రాజద్వార సౌఖ్యంబు ని
శ్చింత న్శాంతుఁడనౌదు నీకరుణచే శ్రీకాళహస్తీశ్వరా ! 62ప

పరిశీలించితి మంత్రతంత్రములు, చెప్పన్వింటి సాంఖ్యాది యో
గరహస్యంబులు, వేదశాస్త్రములు వక్కాణించితిన్ శంక పో
దరయం గుమ్మడికాయలోన నరగింజంతైన, నమ్మించి సు
స్థిరవిజ్ఞానము త్రోవఁజెప్పఁగదవే శ్రీకాళహస్తీశ్వరా ! 77ప

— ౦ —

# ఛందస్సు - అలంకారములు

ఛందస్సు : వేదములకు ఛందస్సులని పేరు. సంతసము గూర్చునవి ఛందములు. ఋక్కులన్నియు ఛందోమయములు. కావ్యభారతి భావావేగముతో ఛందోభారతి నావిష్కరించినది. ఆదికవి వాల్మీకి పాదబద్ధముగా, తంత్రీలయసమన్వితముగా, అక్షర రూపమున పలికినది అనుష్టుప్ ఛందస్సయినది. లౌకికముగా గూడ క్రోధ భయోద్వేగ సందర్భములలో వెల్వడు భాష లయబద్ధముగానుండుట మనకనుభవపూర్వకమే. సర్వ భాషావాఙ్మయముల ప్రాథమికస్థితి ఛందోరీతి యనునంశము, సర్వభాషావేత్తలు సంగీ కరించిన విషయమే. అయిన ఛందోబద్ధమే కవిత్వమా, ఛందోరహితమైనది కాదా యను చర్చ యాలంకారికులలో సాగినది. కొందఱు పాశ్చాత్యాలంకారికులు 'పొయట్రీ' శబ్దము ను పద్యమనుభావమునే యిచ్చునని భావించిరి. గద్యరచనలో కవితాంశయున్నప్పుడు దానిని వారు 'పొయటిక్ ప్రోజ్' అందురు. అనగా నా వచనరచనయందు నొక యూగు గతి కలదన్నమాట. అట్టి వచనరచనలు మన తెలుగులో తాళ్ళపాకవారి వచనములు. వానియందు గేయధర్మ కలదు. అనగా నందును ఛందస్సుపాలు కొంతయున్నదన్నమాట యేకదా! కొందఱు ప్రాచీనాలంకారికులు ఛందోమయమైనదే కావ్యమనినచో సంస్కృతమున చక్కని గద్యరచనమైన భట్టబాణుని కాదంబరి కంతటి ప్రశస్తి యెట్లు కలుగును ? "గద్యం కవీనాం నికషం వదంతి" కాదంబరియందుగల వాక్యవిన్యాసమును కొక యందము, చందములుండి, కావ్యానందమునకు సమానమగు నానందమునే కలి గించుచున్నదిగదా!

అనగా కావ్యమునకు ఛందస్సు ప్రధానము కాదు, రసాత్మకతయే ప్రధానమనుట యందు రసానందము ముఖ్యమనియు, రసానందమునకు విలక్షణమై, రసానుభూతికి సదృశమైన యనుభూతినిచ్చునది ఛందస్సని యభిప్రాయము. ఛందస్సులేనిదే కవిత్వము కాదన్నంతమాత్రమున ఛందస్సే కవిత్వము కాజాలదు. ధనుర్విద్యాలక్షణము, సస్యా నందము లిత్యాదిగాగల శాస్త్రగ్రంథములు ఛందోబద్ధములయినను, నందు కవిత్వమున్న దని మనమంగీకరింపలేముగదా!

లేహంట్, కార్లయిల్, మాథ్యూ ఆర్నాల్డ్ ప్రభృతి పాశ్చాత్యాలంకారికులు ఛందస్సు లయ, హొయలిచ్చునుగాన కవిత్వమున కపరిహార్యమనియు, కవితా సౌందర్య మునకు సమగ్రత కలిగించుననియు నభిప్రాయపడినారు, కవులకు పర్యాయముగా వాంగ్ల

మున 'బార్డ్స్' అనియు వ్యవహారముగలదు. సంగీతముతో కవిత వినిపించువారు, పాడువారు. ఇచ్చట సంగీతమిచ్చునది యా కవిత నడిచిన నడక. దానినే వారు 'రిథిమ్' అందురు. అందువలననే "మీటర్ ఈజ్ ఇన్‌ది పొయట్రీ" అనియు, "హ్యూమన్స్ ఆర్ రిథిమక్ బీయింగ్స్" అనియుననిరి.

పై యభిప్రాయములన్నియుఁ బరిశీలింపఁగా, కవితావేశమునకు, ఛందస్సు సౌందర్యము కల్పించుననియు, పాఠకుని మనోవిహంగమును భావవైహాయసమున విహరింప జేయుశక్తి ఛందస్సునకుఁగలదనియు, రసానందసదృశమైన యానందము నది కలిగించుననియు, కవిత్వమునకు ఛందమునకు గల యనుబంధము ప్రాచీనము, సహజము, సమీచీనమునై నదియనియుఁ దెలియుదుము. నీరసమునుండి రసలోకమునకు గొనిపోవునది ఛందస్సని హెగెల్ పండితుఁడనినాఁడు. కాన అనుభూతిని, ఘటిత స్ఫూర్తినిచ్చు ఛందస్సునకు కవిత్వమున నత్యంత ప్రాముఖ్యముగలదని గుర్తింతుము

రూపచిత్రణము, అవస్థాచిత్రణము, వస్తురూప వర్ణనములు సర్వసాధారణముగా సీసములందిమిడినట్లు తదితర ఛందములందతుకవు. మన శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రబంధమున జ్ఞానప్రసూనకలిక, దుర్గాదేవి, కాళహస్తి, మధురాపురముల వర్ణనములను, వ్యక్తుల రూపచిత్రణములందును స్వభావచిత్రణములందును, తపశ్చర్యల వర్ణనములందును, గుర్విణ్యవస్థాచిత్రణములయందును, పోరాటములయందును, ఈ సీసము సమగ్రస్ఫూర్తిని ఆవిష్కరించుటకు, ప్రత్యక్షీకరించుటకును సమర్థములైనవి. ఈ సీసములపై నన్నియెడల తేటగీతులే యెత్తుగీతులుగా గ్రహింపబడుటయు విశేషముగా గ్రహింతుము. అట్టులే ఋతువర్ణనములయందు, పరిమిత భావపరిమితములైన రూపగుణశీలముల వర్ణనములందు, తీర్థయాత్రాస్థలములు, నదులవర్ణనములందు, వృత్తములుపయుక్తములైనవి. ప్రబంధము శతకములందలి వృత్తములన్నియు నిందుల కుదహరింపదగినవే యయినను సౌందర్యసౌభాగ్యముచే నలరుఁగొన్నిఘట్టములను గుర్తుచేసికొనఁదగును. రసావిష్కరణమునకు వృత్తములు యోగ్యములయినపాత్రలు. పురవర్ణనముచేయును ధూర్జటి పలికిన పద్యములు కవీంద్రుని కవితామాధురిని భాషాప్రౌఢిని, శివపారమ్యమును చాటునవి పెక్కులు.

**అతులైశ్వర్య పరంపరావిలసితంబై పట్టె తత్పట్టణ**
**ప్రతిబింబంబనఁ జంద్రకాంత రచిత ప్రాకారమొప్పారు న**
**ద్భుత మాయా బహువిభ్రమ భ్రమిత వస్తువ్రాతలోకోదయ**
**స్థితి లోఁగొన్నశివుండనంగ హృదయాచింత్యప్రభావంబునన్. ఆ1-19ప**

అద్భుత రసావహమ్మైన యీ పద్యము లీ విధముగా రసోచిత వృత్తరచన మా యాతావుల నెట్లు పరిఢవిల్లెనో గమనించియేయుంటిమి.

ఆశ్వాసాంతములందు శార్దూలము, కందము, పంచచామరముల నుపయోగించుట యందలి యౌచిత్యము, సొగసులను గూర్చి, "వస్తునిర్వహణము"న ప్రథమాశ్వాసాంత పద్యములకడ ముచ్చటించియుంటిమి. గజాజిన, వ్యాఘ్రచర్మాంబరధారియగు నీశ్వరుని మత్తేభ, శార్దూలములతో సర్వేశ్వరశతకమున యథావాక్కుల అన్నమయ్యయు స్తుతించి యున్నాడు. అట్లే శ్రీకాళహస్తీశ్వర చరణకమల సేవా పరాయణుండగు ధూర్జటియు శతకమున శార్దూలమత్తేభములతోడనే యీశ్వరునికి ప్రీతిగా స్తుతిగావించియున్నాడు.

పూర్వకవులు పెక్కు శతకములను మత్తేభశార్దూలములతో జెప్పియున్నారు. శివపర ములగు శతకములను శార్దూలమత్తేభములతో జెప్పుట మరింత యౌచితి శోభితమగును గదా! కూచిమంచి తిమ్మకవి భర్గశతకము, శిష్టుసర్వశాస్త్రి జ్ఞానప్రసూనాంబికా శతకము లు, నిట్టివే.

సాము నేనుగుల కథయందు, తొండమునజేరి చీకాకుపఱచుచున్న సాముతో నారాటముపడలేక శత్రువుమడంపి చచ్చుట జనాహ్లాదము కాదాయని శివుడు వంచన సాచరించుచు ప్రాణములీయమన్న యేనుగు స్థితిని

అని మత్తేభము, చిత్తజాహితుని దిక్కై మ్రొక్కి 'యిక్కాళమే
కనుమఁ బోవునో?' యంచుఁ దుండమిఱియంగాఁ జుట్టి వక్త్రస్థలం
బునఁ గీలించి, పిఱిందికిం జని, శిరంబున్వంచి యుఁ గొండ భ
గ్నునఁ దాఁకె, న్వడిఁ గుంభముల్వగులఁ దత్కూటంబులూటాడఁగన్,*

అను మత్తేభ విక్రీడితముగ పలుకుట పదమసుందరమై సముచితమై యలరుచున్నది. అగస్త్యుడు పంచాశద్వర్ణమై శ్రీదేవీరూపమైన జ్ఞానపుష్పాంబను స్తుతించుచున్న సంద ర్భమున, స్రగ్ధరావృత్తమునఁ బూజింపఁజేయుట, నామెకు పూమాలలను సమర్పింపఁజేయు టయేకదా! అట్లే నక్కీరుఁడు కందసామిని కందపద్యమున స్తుతించుటయు మిక్కిలి యుచితముగా నున్నది. ధూర్జటి కవీంద్రుఁడు కందమునకు అధిక ప్రాముఖ్యమునిచ్చినాఁడు కథాకథనమునకు, సంభాషణలకు, వేగసూచనమునకు నీ కందములు ఉపయోగించినాడు.

---

* 2ఆ - 150ప

అని కాంతా నీయింటికిఁ, జనుదెంచెద నీదుగుబ్బచనుగొండల సం
దునఁదెరువెఱుంగక తిరిగెడి, మనసను తెరువరికి దప్పిదూన్పంగలవే[1]
అనవుఁడు నొడయనికిట్లను, వనజానన, నీదుమనసువచ్చినరీతిని
బనివినియెద, మాటలకేఁకఁ, బనిలేదీతలఁపు నాదుభాగ్యముకాదే[2]

ఈ రెండు పద్యములును జంగముఁడు, దాసియును మాటాలాడుకొనుటను, కథా గమన మునుఁదెలుపుచున్నవి.

"నెఱిమిగులఁగలిగి నలుపై, తఱచై మదనప్రతాప దావాగ్ని శిఖల్
మెఱయు నవధూమమునగాఁ, దెఱఁకుఁగచభరమునచ్చె దేవునికరుణన్[3]

ఇది శిక్షితదాసి, తలపైచేనిడిన జంగముని మహిమచే ఇంద్రజాలగురుఁడెత్తిన బర్హనగ మొలకెత్తిన శిరోజసౌభాగ్యము. ఆమెతలపై నెంత వేగముగా, దట్టముగా, నీలముగా, అందముగా శిరోజములు మొలకెత్తినవో తెలుపుటకీ కందముపయోగించినది

గణయతిప్రాసలకు ప్రాకులాడు పనిలేక, అప్రయత్నిక సాధ్యముగా, నలవోకగా పలికిన ధూర్జటి ఛందములు సహృదయుల డెందముల కానందమొనగూర్చును. సందర్భ శుద్ధిగలిగి, రసపరిపోషణముగావించుట కీతని ఛందము పరువులెత్తినది. నాచనసోను నాధునితో నారంభమై, శ్రీనాథునియందు సమగ్రస్ఫూర్తి, సమతా పాలనమునకునోచి కొన్న సీసము, ధూర్జటిచేతియందును వన్నెలఁదిద్దుకొన్నది, చిన్నెలు చేకూర్చుకొనినది. వివృతభావవ్యక్తీకరణమునకు, రూప, స్థితివర్ణనలకును, సమగ్రత ననుకూర్చునవి సీసములు.

నడిగొల్పి రొయికకేల ముడిచిన క్రొమ్ముడిగొబ్బునఁగటిజుట్టుకొన చేల
మొండొంటిఁబెనఁగొనియున్నహారములు, నిద్రదేరెడి నీరజములు... [4]
మాటలాడఁదలంచి మఱచిపోయెడివారు, నడవబోవుచుఁదొట్రుపడెడి
వారు...[5]

1. శ్రీ.పు 1ఆ _ 37ప 2. శ్రీ.కా.మా. 1ఆ _ 38ప
3. శ్రీ.కా.మా. 1ఆ _ 53ప 4. ,, 1ఆ _ 47ప
5. శ్రీ.కా.మా. 3ఆ _ 41ప

వామాంగభామినీ శ్యామధామాళియు
గంఠహాలాహల కాళిమంబు
నాకాశకేశపాశాసితచ్ఛాయయు
జూటికాసింధు శైవాలరుచియు
కరకృష్ణసారాంక ఘనధూమనీలిమ
శేషభూషణ ఫణాసీమనలుపు
కటితటకీలిత కరటిచర్మద్యుతి
మేచక శూలశోభాచయంబు....—1

ఈపద్యమున పెద్దపాదములన్నియు రెండురెండు సమమైన భాగములుగ,ఏచిన్నభాగమున కా చిన్నభాగము ప్రత్యేకతకలిగి సమతాపాలనముతో నొప్పుచున్నది.

శివభక్తిరహితమై చెడియె జగంబని, సన్న్యాసమ్లోయ్యెన నవ్వసాగె
ధృతిమోహబంధంబు దెగదన్నగతి ముద్దు, టడుగులెత్తి విదుల్చి
కాడఁజొచ్చె
భవపరాఙ్ముఖుఁడైనఁగిదిసత్త్వముగుండి, పొత్తులపాన్పుపైఁబొరలబడియె
శ్రీయో మహారాజ్య సింహాసనంబున, నుంతుచందమునఁగూర్చుండ
దొడగె. [2]

ప్రాగ్వధూమణిచిమ్మఁబశ్చిమ దిక్కాంత, పట్టిన చెంగల్వబంతియనఁగ
గాలవిష్ణుండంధకార దైత్యుని వేయ, జరమాద్రిబడిపోవుచక్రమనగ.. [3]
ఇవి పెద్దపాదములయందలి సమతాపాలనమును చెప్పుచున్నవి.

వృత్తములందు మత్తేభశార్దూలములు సమాసములతో రాణించుచుండును. ఉద్ధతభావములనందించుచు తదనురూపములగు రసములకుఁ బోషకములుగా నీవృత్తము లలరారుచుండును ఉత్పలచంపకములు లలిత శిథిలబంధము కలిగి శృంగార కరుణాద్భుతాదులకు పరిపోషకములుగ నలరుచుండును.

---

1. శ్రీ.కా.మా. 4ఆ— 90ప. 2. శ్రీ.కా.మా. 3ఆ - 30ప
3. శ్రీ.కా.మా. 2ఆ — 128

రసపరిపాకమునకు ఛందస్సు సహకరించునని భావించితిమికాన, మన ప్రబంధముల నాయారసముల కీఛందస్సు లెట్లు రసపోషకములుగా నున్నవియో మచ్చునకు గొలదిగ చూతము.

శృంగారము :

ఎక్కడ బట్టినం గళల యిక్కన, లెక్కడ నోరుసోకినన్
జక్కెరలప్పు, లేపునిజ పానసుధారస, మెట్టులుండినన్
జక్కదనంబు పెన్నిధులు, సంభ్రమమెప్పు నేమిసేసిన
నక్కువచెయ్వులై మెఱయు మన్మథకేళియొనర్చుటంతటన్[1]

హాస్యము :

ఉత్తమనాథుండీతం డెదురుత్తరమీం డొకనాండదేమొకో
యుత్తటి రేగి రేగి, తనయిచ్చకువచ్చిన వెల్ల నాడెడిన్
గొత్తలుగానె యీ సుధువు కుండల మాటలు నూఱిపోసిరో
యత్త' యటంచు నొక్క శబరాంగన నల్లభుదూఱె సారెకున్[2]

వీరము :

కోపుననార్చినం దెసలకుంజరముల్ సెదరెం, ధనుర్గుణా
రావముసంగలంగె జలరాశివడంకె రథాంగ తీవ్ర సం
రావమునం గులక్షితిధరంబులు, రథ్యమృగేంద్రసాంద్రహే
షావలి వ్రక్కలయ్యె హరిదంతములేమనిచెప్ప నత్తఱిన్[3]

రౌద్రము :

గరళంబుద్ధతి నారగింపంజను నుగ్రవ్యగ్రవిస్ఫూర్తి సా
గర మాపోశనమెత్తు కుంభజునిరేఖన్ ధ్వాంత సంతాన సు
స్థిరతందీర్చు దినేంద్రు చందమున, నాసేనంగనుంగొంచు భీ
కరవేగంబునందాంకె నుగ్రుండుగ్రంబైన రూపంబునన్[4]

1. శ్రీ.కా.మా 1ఆ - 43ప 2. శ్రీ.కా.మా 3ఆ - 44ప
3. ,, 2ఆ - 95ప 4. ,, 2ఆ - 19ప

కరుణము :

పడిబిగువైన పీనకుచభారమువంక ధరిత్రిమోవ కుం
గెడు తనువల్లితోఁ గటికిఁ డెందము భూపతిదూఱుచున్, నడిన్
వెడలు దృగంబుపూరములు వెల్లిగొనన్ బలపించె, దైవమున్
దడవుచుఁ బంచమధ్వనుల దానము లీను పికాంగనాగతిన్[1]

భయానకము :

పురుషుండన్న వధించి, తాఁ దేయనిన నోర్భగించి, యర్థంబులన్
సరగం జేకొని, మత్తచిత్తులగుచున్ సర్వంబు నేకంబు సే
సిరి వర్ణాశ్రమధర్మముల్, ల్బ్యనుల గాసించెట్టి చార్వాకమా
గ్గరతుల్వోలె శరీరసౌఖ్యపరతం బ్రత్యక్షసిద్ధాంతులై...

బీభత్సము :

దిక్కుల్గ్రక్కదలంగఁ, జక్రగుణసందీప్తధ్వను ల్మీఱఁగా,
రెక్కల్వచ్చిన కాలసర్పముల పేర్మిం గంకపత్త్రింబులన్
జొక్కంబైన నిశాతబాణముల నాజోఁ దేసె, బేతాళముల్
గ్రుక్కిళ్ళిగ్రింగఁగఁ గ్రొత్తనెత్తురుల వాగు ల్పాఱఁ గ్రవ్యాదులున్[2]

అద్భుతము :

ఎత్తిన, నింక దజాలగుఱుఁ డెత్తిన బర్హామనంగ, మన్మథుం
డెత్తిన పుష్పవింట మదమెత్తిన తుమ్మెదపిండునారినాఁ
జిత్తజరాజ్యలక్ష్మి కభిషేకము సేయ శివుండు కాంతకై
యెత్తిన నీలకుంభరుచిహిండనమోయన నద్భుతంబుగన్[3]

---

1. శ్రీ.కా.మా. 1ఆ - 50ప  2. శ్రీ.కా.మా. 2ఆ - 28ప
3. ,, 2ఆ - 52ప

శాంతము :

ఉదయించెం బరమార్థరూపము, మహాయోగీశ్వరోత్తంస, మీ
శదమావర్తితదివ్యతేజము, సదా శాంతస్వరూపంబు, దుః
ఖదసంసారనిదూరమానసము, లోకం బుత్సవక్రీడలన్
బొదలంగా సుతరత్న మంత జననీపుణ్యప్రభావంబునన్[1]

ప్రాసల విశేషములు :

గీతపద్యమున నొకచో చక్కని ప్రాసనిలిచినది. లోపాముద్రతోఁగూడి అగస్త్యుఁడు

ఎక్కెదుర్గాంబకొండ మునీశ్వరుండు
మొక్కెఁదత్పాదనీరేజములకు భక్తిఁ
జొక్కెఁదద్దివ్యరూపంబుఁ జూచినపుడ
డక్కె నతనికి ముక్తి తాటంకవతియు[2]

భీమఖండకాశీఖండముల నిట్టివి క్వాచిత్కముగ గనుపట్టుచున్నవి.[3] అట్లే మన ప్రబంధమున సీసమునను ప్రాసనిలిచిన తావులు కొన్నికలవు. మునులు లోపాముద్రాగస్త్యుల పత్నీతాదర్శదాంపత్యము నగ్గించుచు

నీవీశుమహిమంబునిశ్చయింపఁగ నిశ్చయించు నీమహిమ యిహేమవర్ణ
నీవుశంకర పాద నీరేజములంగొల్వఁగొలుచు నీ పదములీ కులవధూటి[4]

తిన్నని వేఁటవర్ణనమున

ఒకనాఁడు తెరవేఁట నుగ్రసత్త్వంబులఁ, బుడమిన్నైఁదడకాలుపఱవధించి
ఒకసారి సారమేయాద్ధతి నుద్ధుర, స్తబ్ధరోమంబుల సంహరించి
ఒకమరి దీమంబులొడ్డి పాదులుదీర్చి, బహువిహంగంబులఁబట్టి తెచ్చి
ఒకవేళ డేఁగవేటకుఁజని యెగఁబోపి, నానాండజముల ప్రాణములుగొడసి[5]

1. శ్రీ.కా.మా. 2ఆ - 86ప
2. శ్రీ.కా.మా. 1ఆ - 116ప
3. భీ.ఖ 2ఆ - 59, 5ఆ - 135ప
   కా.ఖం 1ఆ - 137ప
4. ,, 1ఆ - 151ప
5. ,, 3ఆ - 17ప

మణివృక్షవర్ణనము, వేశ్యాతనయల వర్ణనము, వాలి రాక్షస్వరునిగూర్చి పలికినపుడున్నూ ద్వ్యక్షర ప్రాసనీసములు కలవు. మన ప్రబంధమున త్ర్యక్షరకందమొకటికలదు.[1]

ధూర్జటి కథలకు,[2] రేఫద్వయమునకు[3], డడలకు[4], ళళలకున్[5], ప్రాసనిలిపినతావులును గలవు. ఖండాఖండబిందుప్రాస రెండుతావుల గన్పట్టుచున్నది [6]

వచనములుకాక 13 విధములగు ఛందములనుపయోగించి 893 పద్యగద్యములలో ధూర్జటికవి రెండు కృతులను రచించినాడు.

అలంకారములు :-

"సౌందర్య మలంకార" అని వామనుడును, 'కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే యని దండియుఁబలికిరి కావ్యశోభాకరములయి,సౌందర్యము గలిగించునవి యలంకారములు. అలంకారములు భాషతోఁబుట్టినవి అలంకారయుక్తమైన భాష జీవద్భాష.

కావ్యశోభాయాః కర్తారో గుణాః
తదతిశయహేతవస్త్వలంకారాః పూర్వేనిత్యాః

అన్న వామనునివాక్యములనుబట్టి కావ్యమునకు శోభగూర్చునవి గుణములుకాగా, ఆశోభ నినుమడింపఁజేయునవి యలంకారములని యర్థము. కవిత్వమందలి భావమునకుజెందినవి గుణములగుచుండగా, భావవ్యక్తీకరణమునకు చెందినవి యలంకారములగును. కనుక గుణములు ప్రధానములనియు నలంకారములప్రధానములనియు వామనుని వాక్యార్థము.

భావమును సహృదయహృదయావర్జకముగాఁజేయుటకు కవులలంకారము నాశ్రయింతురు అల్పాక్షరములం దనల్పార్థము నిమ్పుటయు అలంకారప్రయోజనములలో నొకటి.

---

1. శ్రీ.కా.మా. 3ఆ - 225ప 2. శ్రీ.కా.మా. 1ఆ - 83, 4-136, 4-189ప.
4. ,, 3ఆ - 155ప 5. ,, 4ఆ - 68ప
6. ,, 2ఆ - 61ప 7. ,, 1ఆ - 81ప, 3ఆ - 166ప

వస్తుసమూహములలో పర్యవస్థితస్వరూప స్వభావములను వివరింపగని, పాఠకులకు హృదయగోచరము చేయగలిగినవి యలంకారములు. కావ్యమున రసగ్రంథులు లోపించి నపుడును పాఠకునిలో నౌత్సుక్యము తగ్గకుండ నిలుపగలుగునవి యలంకారములు.

శబ్ద, అర్థ భేదములచే నలంకారములు రెండు రీతులు.

కవి పాండిత్యమును ప్రదర్శించునవి శబ్దాలంకారములు, కవి యూహాశాలితను బ్రకటించునవి యర్థాలంకారములు. శబ్దార్థాలంకారములలో నర్థాలంకారములకే లాక్షణికులు వినుర్మకులు పెక్కురు ప్రాధాన్యమిచ్చినారు. అగ్నిపురాణమున 'అలంకరణ మర్థానామర్థాలంకార ఇష్యతే, తంవినా శబ్దసౌందర్యమపినాస్తి మనోహరం, అర్థాలంకార రహిత విధవేన సరస్వతీ'*

అర్థాలంకారములేని శబ్దసౌందర్యము మనోజ్ఞముకాజాలదు. అర్థాలంకారములు లేని కావ్యము విధవవంటిదని యీ వాక్యార్థము.

అర్థాలంకారములందు ఉపమ సర్వాలంకారబీజమని వామనుడు పలుకగా, అతిశయోక్తియె సర్వాలంకారబీజమని మమ్మటుడనినాడు. అలంకారములన్నియు వక్రోక్తులేయని భామహుని యభిప్రాయము. సర్వాలంకారములును శ్లేషస్పర్శచే సౌందర్యాతిశయమును బొందునని కొందరందురు.

అప్రత్యక్షముగనున్న వస్తువును మనోనయనములకు ప్రత్యక్షముచేసి యనుభవమునకు దెచ్చుట కీయలంకారము లుపయుక్తములగును ఉపమ, రూపకాతిశయోక్తి, ఉత్ప్రేక్షాదులిట్టివి.

కవిప్రతిభను ప్రతీయమానముచేయునపుడు, ప్రతిభను పరీక్షాస్థానము కల్పనము. అట్టికల్పనమున నుత్ప్రేక్ష ప్రాణముబోయును. కవివాక్కునకున్న వ్యంగ్యవైభవమును చాటునవి సమాసోక్తి, ప్రతివస్తూపమ, ఆక్షేపములుకాగా, ఉపమ, రూపకము అర్థాంతరన్యాసములు కవికిగల లోకజ్ఞతను వ్యక్తముసేయగలవి. కవివాగ్విన్యాసములోని నైపుణ్యమును ప్రదర్శింపగలవి ఉక్తివైచిత్రిగల క్రొంభోక్త్యాదులు.

వీనులవిందు, కన్నులపసందు, గొల్పు శబ్దవిన్యాసముకలిగి, కవికిగల పాండిత్యమును ప్రకటించునవి యమకము, ముక్తపదగ్రస్తము, అనుప్రాసములిట్టివి.

---

* శా.నం - పుట 709

ప లీలన్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వని వ్యంగ్యశ
బ్దాలంకారవిశేష భాషలకలభ్యంబైన నీరూపముం
జాలంజాలు గవిత్వము న్నిలుచునే సత్యంబువర్ణించుచున్...[1]

అని ధూర్జటికవీంద్రుఁడే పలికియున్నట్లు, ఉపమోత్ప్రేక్షా ధ్వనిశ్లేష, శబ్దాలంకారములు పరమేశ్వరుని వర్ణింపఁజాలవు. ఆ వాక్యమునందుపయోగించిన విశేషణములు తన కవిత్వమున నున్నవనియు, నైనను నవి పరమేశ్వరవిలా వర్ణనసమర్థములు గావనియుఁ గవీంద్రునిభావము.

ధూర్జటికవి యుపయోగించిన యర్థాలంకారములందు రూపకోత్ప్రేక్షోపమలధికము. తన కృతులనుఁగవీంద్రుఁడు అర్థశతమువైగల అలంకారభేదములతో నలంకృతమొనర్చినాఁడని గమనింపుము. మచ్చున కొండు రెండుదాహరణములను జూతము.

కావ్యాదియందు జ్ఞానప్రసూనాంబను, దుర్గాదేవిని స్తుతించునప్పుడు వాని స్వరూప స్వభావములను రూపకములచే రూపొందించినాఁడు కవి.

హిమధరాధర మండలేశ్వర కులపాలికామణి తనువల్లిగా ప్రసూన
యసిత కంధర సింధురాజినాంబర ఘోర ఘనగంధ బంధుర కర గంధలహరి
సంతత శివశక్తి సామరస్యజ్ఞాన సారమరందనిష్యంద ధార
పరమ హంసోత్తంస భావభృంగవ్రాత, తన్మయావస్థాప్రదాన కేళి
నిఖిలవిద్యారహస్యవాణీపరాగ పాలికాపూరితాఖండజాండ
పేటయై యొప్పు చంద్రార్ధజూటకోటి జోటిఁగొల్చెదజ్ఞానప్రసూనకలిక[2]

మేనాదేవియను తీవకుఁగలిగిన సూనకలిక. ఆదిజ్ఞానప్రసూనకలిక. పుష్పమునకు కలలక్షణములు తీవ, పుట్టుట, వాసనలీనుట, తేనెలొలుకుట, భృంగములకు విందులువెట్టుట అనునవి యిచ్చట శ్రీగాళహస్తీశ్వరు నిల్లాలగు జ్ఞానప్రసూనాంబయందారోపించి, నిరూపించి యాదేవికి నామసార్థక్యమును గూర్చినాఁడు కవి.

అన్యత్ర అన్యధర్మారోపము రూపకమను లక్షణమిట చక్కఁగా సమన్వయము బొందుచున్నది. ప్రసూన ధర్మములన్నియు నిట దేవియందారోపింపఁబడినవి. ఇవి సావయవ రూపకము, ధూర్జటి కవీంద్రుని రూపకములు పెక్కులిట్టి సావయవములే

1. శ్రీ కా. శ 61ప 2. శ్రీ.కా.మా 1అ - 2ప

ఎలదోటల్వనము ల్వధూకుచములద్రీంద్రంబులాఁకంటికిన్
ఫలముల్వాతెర లంగజాగమ కళా బంధంబు లిచ్ఛాసనం
బులు కోపమున బాయుటల్ తపమునంభోగంబు కైవల్య మం
దుల లీలారతినుండు మానవుల కెందుం గాన నీరాచిఁ మున్

పురజనుల వర్ణనమిది. వీరు తాపసులతో నభేదముగఁబోల్పబడుటచే తాపసుల పరిసర ములు, పరిస్థితులు పురజనులయం దభేదవ్యవసాయమున నారోపింపబడినవి ఉద్యాన వనములే అరణ్యములు, వనూకుచములు గిరీంద్రములు, వాతెరలే యాఁకటికి ఫలములు, అంగజాగమకళాబంధములు ఇచ్ఛాసనములు, కోపమున విడిపోవుటలే తపము, సంభో గమే కైవల్యము అనుక్రమమును చూచినపుడు మొదటిపరుసలోనివన్నియు పురజనుల ధర్మములు, రెండవవరుసలోనివి తాపసుల ధర్మములు. ఆ తాపసధర్మములే యీపుర జనుల ధర్మములం దారోపింపబడుటచే నిదియు సావయవమగు రూపకాలంకారము.

ఉత్ప్రేక్ష : ప్రాగ్వధూమణి చిమ్మఁ బశ్చిమ దిక్కాంత
పట్టిన చెంగల్వబంతి యనఁగ
గాలవిష్ణుండంధకార దైత్యుని వ్రేయఁ
జరమాద్రిఁబడిపోవు చక్రమనగ.[2]

సూర్యుఁడస్తమించెనట. సంధ్యాసమయమున నస్తమించుచున్న సూర్యబింబము నెన్నిరీతుల సామ్యసేయఁదగునో యన్నిరీతుల నుత్ప్రేక్షించినాఁడు కవి. చక్కగాసామ్యసేయుట యుత్ప్రేక్ష. కవీంద్రుని యనల్ప కలనా శేముషికి యుత్ప్రేక్ష తార్కాణ. అది సూర్య బింబము. చెంగల్వబంతి, చక్రాయుధము, పెద్దపండు, రథచక్రములా యన్నట్లున్నదన్న యీ యూహ కవికిఁగల యూహాశాలితను ప్రకటించుచున్నది. ఇట్టిదే కవీంద్రుని మఱి యొక పక్వమైన చక్కని యూహ సముద్రవర్ణనము.

---

1. శ్రీ.కా.మా. 1అ - 21వ. 2. శ్రీ.కా.మా. 2అ- 128వ.

జంబునాథమునన్న పరమేశ్వరుఁడీతఁడు

చెంగటనుండఁగాఁ జెఁగిసింహముపోయి, హిమాచలాత్మజో
త్తుంగ కుచోపకుంభ న విధూతమనోభవ భూతిలేప స
ర్వాంగము, లోచనీకృత సుధాంశు కృశాను పతంగము న్వాని
ర్లింగము, జంబునాథ శివలింగము, భక్తమనోజ్ఞభృంగమున్ [1]

కావేరీపతివర్ణన మియ్యది

చనిచని దాఁటె నంత గవిచంద్రుఁడు ధన్యఁగవేరకన్య, శీ
వన శితఖడ్గ ఖండిత భవప్రభవాఘ విరోధిసైన్యఁ బా
వననిజనామ సంస్మరణ వారితమానవదైన్య, నిత్య ము
జజనరతకోటి ముక్తిసద సౌఖ్య వదాన్యఁ గృతావగాహుఁడై [2]

ఇది పర్వతవర్ణనము

అరుణగిరీంద్ర కూటము, గృతాఘ కపోల చపేటమున్ నిరం
తర భవదావ పావక విదాహ కృపీటము, పుణ్యకోశమం
దిర విలసత్కవాటము, ప్రదీపితముక్తివధూకిరీటమున్
బరిహృత సంతత భ్రమణ భారపదశ్రమ భాను ఘోటమున్ [3]

ఇది గంగానది వర్ణనము

కాంచెన్గాంచన పంకజాత విలసద్గంధాంధ సారంగ ఫే
నాంచత్తుంగతరంగ, వారిధి శిలాగాంత రాభంగ రో
మాంచస్వేద జలాశ్రుపూర జనతాత్మానంద సంపన్మనో
మంచాగ్రస్థిత విశ్వనాథ పదసమ్యక్సంగ గంగా నదిన్ [4]

1. శ్రీ.కా.మా. 3ఆ – 181ప. 2. శ్రీ.కా.మా. 3ఆ – 182ప
3. ,, 3ఆ – 184ప. 4. [illegible]

నదులవర్ణనమున వానియందలి నీటిస్వచ్ఛత నడకయందలి హొయలును, కొండను వర్ణించునప్పుడు దాని కొమ్ములయు, తాలయు ఔన్నత్యము కాఠిన్యములును, ఈశ్వర లింగవర్ణనమున స్వరూపావిష్కారములు చక్కగా వర్ణింపఁబడినవి.

ముక్తపదగ్రస్తము : 1. లోపాముద్రాగస్త్యుల యాదర్శము పవిత్రమునైన దాంపత్యము నగ్గించుచు మునులు స్తుతిచేయు సందర్భమున నీముక్తపదగ్రస్తాలంకారము గలదు. విడిచిన పదమును, అందున క్రియను – తిరిగి స్వీకరించి చేయు రచనమున, నా క్రియ లేక పదమునందలి యర్థప్రాధాన్యమును గుర్తింపఁజేయుటయు, రచనయందలి చమత్కారమును గమనింతుము.

నీవీశుమహిమంబు నిశ్చయింపఁగ నిశ్చయించు నీమహిమ నీహేమవర్ణ
నీవు శంకరపాద నీరేజములఁ గొల్వఁ, గొల్చు నీపదము లీశులవధూటి.*

ఈ పద్యమందలి నిశ్చయింపగ నిశ్చయించు, కొల్వగ గొల్చు, భావింప భావించు నిర్వహింపగ నిర్వహించు–అను క్రియాపదములచే నిట రెండు రమణీయార్థములను తులనాత్మకముగ పలికినట్లయినది ఈశ్వరుని మహిమ లోకమునకు అగస్త్యునివలన ప్రకటితమగుచుండగ, నగస్త్యుని గొప్పదనమూతని యిల్లాలు లోపాముద్రవలన వ్యక్తమగుచున్నది ఈ రెండింటికున్న యవినాభావ సంబంధమును ముక్తపదగ్రస్తమనుసంధించుచున్నది. ఈ యలంకారమున కిచ్చట సార్థక్యత కలిగినది.

2. ఇట్లే కాళము పూర్వజన్మకథనము నారంభించుచు చేసిన సీసమునందును ముక్తపదగ్రస్తాలంకార మాకథనమునలంకరించుచున్నది.

గంధర్వకామినీ గానంబువిని తలలెత్తి యాడెడి భుజగేంద్రములును
భుజగ ఫణారత్నముల దీధితులఁ బ్రకాశించు తమస్సమాశ్లిష్టగుహలు

---

* శ్రీ.కా.మా. 1అ – 161ప

గుహాలఁ బ్రతిధ్వనుల్ ఘుమఘుమయనఁ బొఱునిర్మలోదకముల
నిర్ఝరములు

నిర్ఝరతటముల నిరుపాధిక సమాధి యోగనిద్రారతినుండు మునులు
మునుల తపములు నిర్విఘ్నముగ ఫలింప, భక్తిరక్షించుకొనివచ్చు
ప్రమథగణము...[1]

కైలాసనగ స్వరూపసాక్షాత్కారము సేయఁజాలిన వర్ణనమిది. భావనైరంతర్యమును కొన
సాగించుట కిచ్చటను ముక్తపదగ్రస్తము సన్నివేశమును కైసేసినది.

3. ఆశ్వాసాంతపద్యములలో నొక తావున నిట్టిముక్తపదగ్రస్తాలంకారము గలదు.

మునీంద్ర మానస ముద్రికా సముక్తముక్త వాసనా।
సనాతనాత్మ! సేవకార్తి సారపావళీ ఘనా।
ఘనా ఘనా ఘనప్రకాశ! కాయజాగ్ని జీవనా।
వనానినాథనందనేశ! వాగధీశపావనా।[2]

ఇందంత్యప్రాసయు నందగించుచున్నది. ఇచ్చటి ముక్తపదగ్రస్తము పద్యమును కదను
ద్రొక్కించు చున్నది.

శబ్దార్థాలంకారముల నలంకృత మొనర్చిన ధూర్జటి కవీంద్రుని ప్రబంధమున నిట్టి రామ
ణీయకము, సహృదయ హృదయావర్జకముగా నలరుచున్నది.



1. శ్రీ.కా.మా 4ఆ- 152ప. 2. శ్రీ.కా.మా. 3ఆ - 226ప

# కవితాపారమ్యము

ఏ కవి కవితయందుఁగాని ప్రతీయమానమగు పారమ్యమునకు ప్రాణస్థానీయము ఔదాత్త్యము (ఇట నీశబ్దము లాంగినస్ మహాశయుని 'సబ్‌లైమ్' అనుమాటకు సమానార్థముగ ప్రయుక్తము.)

ధూర్జటి భవపరాఙ్ముఖుఁడై నపిమ్మట రచించినవని యూహింపనగునాతని కృతులురెండింటను ఒంటఁబట్టిన యనుభవమున పండఁబండిన పరిణత వ్యక్తిత్వము గోచరించును. ఆ మహాకవీంద్రుని కృతులం దడుగడుగున నాతని నాఁటి భావితాంతఃకరణముయొక్క బంధురస్పందనములను గుర్తింపఁగలము. లాంగినస్‌మాటకు తగిన లక్ష్యభూమి ధూర్జటి వాఙ్మయము. 'ఏ కావ్యమున కవివాక్కు భావగంభీరమైయుండునో, యడుగడుగున నౌత్సుక్య జనకమై పాఠకుని స్మృతి పథమును వెన్నంటునో, ఆ కావ్య మౌదాత్త్యకేదారమనియు, ఏ కవి వాక్కులు సర్వసహృదయహృదయంగమములో అనఁగా ఆ సహృదయపాఠకులు తనుతమ వ్యాసంగములందు జీవితాధ్వములందు, ఆశయములందు, వయస్సులందు, బహుధా విభిన్నులైనను వారందఱికీ నొక్క చందమున ఏకాకారమగు ననుభూతిని కల్గించునో, ఆ కవివాక్కులందు 'భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధన' ముగ పరిగణింపఁదగిన ఔదాత్త్యమున్నదని అధికారికముగనుద్ఘాటింపవచ్చు' ననియు లాంగినస్ అభిప్రాయము. ఆ సాహిత్యద్రష్టయొక్క అభిప్రాయము లందలి సామంజస్యము నవశ్యము స్థాపింపఁగల్గిన శక్తి, పరమభావుకుఁడగు ధూర్జటి మహాకవి వాక్కునకున్నది.

కావ్యమున నీయౌదాత్త్యమున కనికిపట్టయిన యుపాధులను లాంగినస్ మహాశయుఁడు పంచధా పరిగణించినాఁడు.

1. భావమునందలి మహత్తు :
2. వివిధమనోవికృతుల సముజ్జ్వల సమున్మీలనము.
3. అలంకార సంయోజనమున చమత్కారము.
4. సముచిత పదబంధ బంధుర ప్రయోగముతోడి సముదాత్త భావవ్యక్తీకరణము.
5. ఉపరిలక్షణములన్నింటిని నుపగూహనమొనర్చుకొను కావ్యనిర్మాణశిల్పమైభవము.

ధూర్జటి కవితయం దీ లక్షణముల కెట్టి పోషణమేర్పడినదో పరిశీలించితిమేని యా కవీంద్రుని కవితాసారస్యము మనకంతుపట్టును.

అతఁడు తనకావ్యావతరికలోఁగృతిపతిని వరించుచు నిట్లు వక్కాణించెను.

'వాగర్థంబులు శ్రోతృవక్తలు జగద్వ్యాప్యుండు సద్వైత వి
ద్యా గోష్ఠిన్ వినగింప నీశ్వరుఁడ కాఁడా ? మత్ప్రబంధాధిప
త్యాగణ్యుఁడు వేఱొకండు గలఁడే? యామాటలే లెంచుఁ జే
తోగమ్యుండగు కాళహస్తిపతి నాథుంగా సమర్థించితిన్[1]

తాను రచించుచున్నది శివపారమ్య ప్రతిపాదకమైన కావ్యము. ఆ శివుఁడు నాతనికి చేతోగమ్యుఁడు. వాఁడు భక్తమాత్రుఁడుకాఁడు, శివాద్వైత భవ్య భావనుఁడు. ఆ యద్వైత భావనామార్గమున శబ్దము, అర్థము, శ్రోత, వక్త, సర్వము పరమేశ్వరుఁడే. వక్తయుఁ బరమేశ్వరు దేయని కంఠోక్తిగా నేర్కొన్న కవి యభిప్రాయమున కావ్యకర్తృత్వమునే తనపై పెట్టుకొనక, భగవత్పరము చేసెను. అట్టిచో కృతిపతినిగా వరించుటలో నాశ్చర్యమేమియుండును ? కృతిపతివిషయమున నిటువంటియుదాత్త భావనచేసినవారు తెనుఁగుకవులలో తిక్కన, పోతన ప్రభృతులు కొలదిమంది కలరు తిక్కన తన పితామహుల ప్రోత్సాహమున తిక్కన తా కృతి రచింప పూనుకొనగా, 'పలికించువిభుండు రామభద్రుండని' పోతవ పలికియున్నాఁడు. ధూర్జటి కావ్యమును పలికినవాఁడు సాక్షాత్పరమేశ్వరుఁడే ఇట్టి భావన చేసినవారు లేరనుట సత్యమును సమర్థించుటయే.

ఆ తరువాత పద్యమున ధూర్జటి కృతిపతి తన్నాదేశించినట్లు కవిచెప్పిన పలుకులను పరిశీలించినచో నాతని కావ్య సంకల్పమునందలి యౌదాత్త్యము మఱింత ప్రస్ఫుటమగును.

ఈ శుభకావ్య రత్నమున కీశు నధీశుఁజేసినన్ మహా
దేశిక సార్వభౌముఁడు మదింబ్రముదంబు వహించి 'ధూర్జటీ !
నీ శివభక్తి కావ్యసరణిం గడు ధన్యతఁబొంద నవ్య భా
షా శతథా నిగుంభన రసస్థితి నొప్పుదలిర్పఁజెప్పుమీ !'[2]

1. శ్రీ.కా.మా 1ఆ - 7ప 2. శ్రీ.కా.మా. 1ఆ 8ప

ఈ పద్యపంక్తులను బట్టి కవియొక్క పూనిక, తనశివభక్తి కావ్యాభివ్యక్తమున రసప్రసన్న మరముగా చారితార్థ్యమును పొందవలెనని. అది పూనికమాత్రమే కాదు, అతనికి చేతోగమ్యుఁడు, అనుభవగోచరుఁడు, మహాదేశిక సార్వభౌముఁడు నగు శివుని యుపదేశ మనుటలోనే యున్నది యీ కావ్యమునందలి యౌదాత్త్యము యొక్క పరమార్థము. విధ, భావ సౌరభ్యము నాస్వాదింప గలము.

ఁబోటు మాటవినుమా . నీ చేత జీతంబు నేఁ
తతంబు మది వేడ్కఁగొల్తు నంతేస్సప
ం న్నంబున కొప్పగింపకుము నన్నాపాటియే చాలుఁ దే
జీనొల్లం గరినొల్ల నొల్ల సిరులన్ శ్రీకాళహస్తీశ్వరా ! 1

పూర్వకాలమున సర్వసాధారణముగా కవులు రాజులనాశ్రయించి వారియాదేశము పాటించి, వారికంకితమిచ్చి, కావ్యమును రచించి, వారినుండి యేవేవో రాజసమ్మానము లను పొందుచుండుట పరిపాటి. భవపరాఙ్ముఖుఁడు, భవభక్తశేఖరుఁడు నైన ధూర్జటి ఆ పరిపాటి పాటింపక, ఆ సమ్మానము నపేక్షింపక తనకృతిపతి, జగత్పతి కావున నాతఁడు తనను అరిషడ్వర్గము వారికి గురిసేయకుండుటయె చాలునని యొక యొడంబడిక చేసికొనిన యీ చనవు గమనింపఁగలము.

జలకంబుల్ రసముల్, ప్రసూనములు వాచాబంధముల్, వాద్యము
ల్కలశబ్దధ్వను లంచితాంబర మలంకారంబు, దీప్తుల్మెఱుం
గులు, నైవేద్యము మాధురీమహిమగాఁగొల్తు నిన్నున్ భక్తిరం
జిల దివ్యార్చన గూర్చి నేర్చిన క్రియన్ శ్రీకాళహస్తీశ్వరా 2

ఈ పద్యమున తన వివిధ కవితాంశములను శివపూజోపచారములుగ సమర్పించుట చూడ నిది యాతనికి భగవత్సేవనకే కాదు, భవ్యకవితాశయమునకును పన్నెవెట్టుచున్నది.

భగవన్మహిమ కవితాఖ్యానమున కతీతమైనదని యుద్ఘాటించుచు తన కవ్యహంకారము సుడిగించుకొనుట నీ క్రిందిపద్యమునఁగాంచగలము.

---

1. శ్రీ కా.శ 4ప 2. శ్రీ.కా.శ 50ప

ఏ లీలన్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వని వ్యంగ్య శ
బ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన నీ రూపమున్
జూపంజాలుఁగ తమ్మునిల చునే సత్యంబు వర్ణించుచో
చీ! లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా ![1]

కవి తనకోరికల గొలఁదిని గుర్తించి శివదర్శనమే తనకు పరమప్రాప్యమని యెంచిన యాత్మజ్ఞుఁడైనవాఁడని గ్రహింపఁగలము. అంతియెకాదు. అవశ్యమున కవిత్వము తన జిహ్వకు నైసర్గికకృత్యమని యుగ్గడించుకొనినాఁడు.

ఒకయర్థంబును నిన్ను నేనడుగఁగా నూహింప నెట్లైయిన బొ
మ్మ్మ కవిత్వంబులు నాకుఁజెందవని యేమో యంటివా నాదు జి
హ్వాకు నైసర్గిక కృత్యమింతయు సుమీ ప్రార్థించు టే కాదు కో
రికల న్నిన్నును గాన నాకు వశమా శ్రీకాళహస్తీశ్వరా ![2]

అనఁగా నీతడు 'అయామ్ మే పొయట్ ఇన్ స్పైట్ ఆఫ్ మైసెల్ఫ్' అని వ్రాక్రుచ్చిన పాశ్చాత్య సాహిత్య స్రష్టలచే 'పొయట్ బై టెంపరమెంట్' గా పరిగణింపబడిన బైరన్ మహాకవివంటి వాఁడనవచ్చును. శతకమునందంతను పలుపద్యములందు ప్రతి పాదించిన శివపారమ్యమె తన కవితా పారమ్యమును నిరూపించుననని కంకణము గట్టుకొన్న వానివలె నెలుగెత్తి చాటినాఁడు ధూర్జటి

కావ్యమున కౌదాత్త్యమున కునికిపట్టులుగా బేర్కొనిన యయిదు ఉపాధులు కవి ధూర్జటి విషయమున నెటు లన్వయించునో చూతము

1, భావమునందలిమహత్త ; లోపాముద్రాగస్త్యుల పవిత్రదాంపత్యము నాది దంపతులతోఁ బోల్చుచు మునులగ్గించు సందర్భమున దీనిఁగాంచగలము.

'నీవీశుమహిమంబు నిశ్చయింపఁగ నిశ్చ, యంచు నీమహిమ మెం
... ... లోపాముద్ర వర్ణ
నీవు శంకర పాద నీరేజములఁగొల్వ, గొలుచునీపదము నీ కులవధూటి..[3]

1. శ్రీ.కా.శ. 51ప 2. శ్రీ.కా.శ 65ప 3. శ్రీ.కా.శ 151ప

సీతపము కల్పధరణి, జాతము, తత్ఫలము నీదుసాధ్వీ విలస
త్పాతివ్రత్యము...[1]

వారి దాంపత్యము నావిధముగా గొనియాడి యిన్నిమాటలెందులకన్నటు

శిలికంఠుడద్రికన్యా, పతియై సుఖియయ్యె భువనభవనంబు లవ
త్ప్రీతిగా లోపాముద్రా, పతియై సుఖియైతి వీవు పరమ మునీంద్రా ! 2

ఈశ్వరునకీశ్వరివలనగలిగిన పతిష్ఠ, అగస్త్యునకు లోపాముద్రవలన గలిగిన దనుచు, ఆ లోపాముద్రాగస్త్యులు పాత్ర నిర్మాణమునగు యౌచిత్యమును నిక్షేపించెను.

శివకేశవాభేదముప్రతిపాదించు ధూర్జటి హృదయము మహోదాత్తమైనది గదా! ఈ చీకటి నక్షత్రముల వర్ణనకొక యుదాత్తత సమకూరినది.

సకలాపూర్ణుడు నీలవర్ణుడనుటల్ సత్యంబుగా దెల్పు పో
లెక బెంజీకటి నిండదారకలు వోల్చె నిర్జరాధీశ్వరా
దికు లర్పించిన పువ్వులట్లభవుం డద్దేవుండు భేదంబు గా
మికి దెల్లంబుగ నల్పుదెల్పగ ధరన్ మించె శశాంకాగతిన్ 3

చీకటి, తారకలను శివకేశవాభేదము కల్పించుట కవీంద్రుని హరిహరాద్వైతమును వ్యక్తము చేసినట్లే. ఆ తారకలను ఇంద్రాదులు శివునర్చించు పూజాసుమములుగా నుత్ప్రేక్షించుటయు కవి భావౌన్నత్యమును వెల్లడించుచున్నది.

పరమేశ్వర సాక్షాత్కారము పొందిన తిన్నడు, బాలచంద్రుని స్థితి, ధూర్జటి కవీంద్రుని భావమహత్తను వెలార్చునవి. అవి కవిపొందిన యనుభూతులే యనియు మనము భావించియుంటిమి.

మీ పూర్ణంబగు దివ్యతేజము జగన్మిథ్యాత్మక ప్రతి
స్థావారీణతఁజూపి మమ్ము బోదివిరం జాంచల్యదూరంబులై
మాపుంజిత్తము మిన్నకున్నయది, యచ్చో బాసె దేహంబుపై
దీపుంజీకటి...[4]

---

1. శ్రీ.కా.మా. 1ఆ – 152ప. 2. శ్రీ.కా.మా 1ఆ – 153ప
3. శ్రీ.కా.మా. 2ఆ 132ప 4 శ్రీ.కా.మా. 3ఆ – 133ప

ఈశ్వరుని ధ్యానము ముంచివేయగా నా దీధితులకు తబ్బిబ్బై మనసు, భూషలు పడచేయని స్థితి యని. దేహముకూడ ధ్యాసయే పోయినది.

శృంగారపరమైన వర్ణనలందును ధూర్జటి యుదాత్తభావము ప్రక్కకొదుగదు. వేశ్యాంగనల వయోనుగుణమగు లావణ్యవర్ణనమున

ముట్టని చిత్తజాతుశరముల్ దొలిగన్నులు రాజకీరముల్
ముట్టని పక్వబింబములు మోవులు, చన్నులు మిండతుమ్మెదల్
ముట్టని పుష్పమంజరులు, మోములు రాహుదంష్ట్రికాగ్రముల్
ముట్టని చంద్రు లింతు లలిముట్టని లింగములౌట చిత్రమే?*

వారియవ్వనపు సౌందర్యమనేకపథములం బొగడి, వారి పవిత్రజీవనములను, పరమేశ్వరుని భక్తులయిన వారి జీవితములను ఉలితాకని లింగములనుట కవియొక్క భావౌదాత్త్యమును వెల్లడించుచున్నది. ఉలి దెబ్బతగిలిన శివలింగమున కెట్లు పవిత్రత భంగమగునో వారి వారి జీవితములు నట్లే పురుషస్పర్శచే భంగమునొందియుండెడివే. ఉలిచే నపవిత్రము చేయబడని శివరూపమువలె నా వేశ్యాతనయలును పవిత్రులుగా వెలసినారని భావము. వారి లావణ్యమును వర్ణించుచు నుపమించిన వస్తువులన్నియు సుందరములు, నాస్వాదయోగ్యములే. అయిన నవి అనాస్వాదములుగ, అనాఘ్రాణితములుగ, అనవఘాతములుగా నున్న వాని సహజ సౌందర్య, సౌకుమార్య, సౌగంధ్యము లెంత నిర్మలములుగ నిసర్గములుగా నుండునో వీరు నట్లే నిసర్గమనోహరలుగా, నిర్మలజీవనలుగా వెలసిరని వారి పాత్రౌదాత్త్యము నుగ్గడించుచున్నాడు కవి.

## 2. వివిధ మనోవికృతుల సముజ్జ్వల సమున్మీలనము ;

ఆయాస్థితులయందు వివిధ మనోవికృతులు సమున్మీలనము చేయుటయందు సన్నివేశమునకు చక్కందనము, రసపోషణమునకు చిక్కందనము కలుగును.

మధుపానమత్తులగు శబరులచేష్టలను, వృద్ధమాత కూతులకు వారధర్మమును దేశించుట, వారి వారధర్మ నిరాసము, శివభక్తిపారమ్యములను చిత్రించునప్పుడు వారివారి చిత్తవృత్తులు చక్కగా నావిష్కృతము లయినవి.

---

* శ్రీ.కా.మా. 4ఆ - 47ప.

మాటలాడఁదలంచి మఱచిపోయెడువారు, నడవఁబోవుచుఁదొట్రు
పడెడువారు
నూరకుండెదమని యుండనోపనివారు, లేచెదమని లేవలేనివారు...[1]

కబరుల యీ మదమత్త చేష్టలు హాస్యరస నిలయములైనవి.

తనబిడ్డలు పుట్టినప్పుడే వెలయాండ్రందఱును, మాణిక్యవల్లిని కాణాచికిన్దిక్కని కొనియాడిరఁట. ఆమె తన కూఁతులు

ఎన్నఁడు నేర్తురో నడువ? నెన్నఁడు నేర్తురో మాటలాడఁగా?
ఎన్నఁడు నేర్తురో చదువ? నెన్నఁడు నేర్తురో యాడఁ బాడఁగా?
ఎన్నఁడు నేర్తురో కళల నింపు దలిర్ప విటాళిఁ గూడఁగా...నని[2]

యెదురుతెన్నులు గాఁచినది, వేఁచినది. వారు తన కాణాచియయిన కులధర్మమును బాటించి తన నాదుకొందురని తలఁచిన యాతల్లి, తన మాటవినకున్న బిడ్డలకు వారధర్మోపదేశము గావించినది.

కలహము చూపుచూపు దొలుకారు మెఱుంగులు, తర్జనోక్తి గ
ర్జలు, కపటాశ్రువృష్టి బలుచాయల మేఘముగా విలాసినీ
తిలకము పల్లవావళి మదిం జనియించిన మోహశాలి కం
దళములఁ బ్రోదిసేయక వృథావసియించిన నర్థమబ్బునే?[3]

ఎరిమొలకలు వృద్ధిపొంది పంటపండుటకు ఉఱుములు, మెఱుపులు గలిగిన తొలుకారు మేఘము చినుకవలెను మగవారి హృదయము లందంకురించిన మోహమను వానిని ప్రణయపుటలుక యను మెఱుపులు, బెదరింపులను నుఱుములు కల్లబొల్లి యేడ్పులను వర్షముచే, వృద్ధిపొందిన డబ్బు అను పంట చేతికందును కాని యన్యథా కాదనునది యా వృద్ధవేశ్య హృదయము. ఈ యుపదేశము మాణిక్యవల్లి చిత్తవృత్తికిఁ బ్రతిబింబమే.

---

1. శ్రీ.కా.మా. 3ఆ - 41ప  2. శ్రీ.కా.మా. 4 ఆ - 26ప
3 శ్రీ.కా.మా. 4ఆ - 33ప

తల్లి యుపదేశమును పెడచెవిని బెట్టిన వారకన్యలు తమ చిత్తవృత్తుల కను గుణముగఁబల్కినారు. శివునికి మించిన కోరదగినది లేదనుచు పెక్కు రీతులఁ బల్కినారు.

అమృతముగ్రోలు జిహ్వ చవిఁదుంచుఁదలంచునె లేని నింటిలో
నమరమహీరుహం బుదయమైన నశం డవనీశు వేఁడునే ?
యమిజన భాగ్యరూపమగు నాదిమ తత్త్వము గాళహస్తిదై
వము భజియించు మానసము వారవధూ మదసౌఖ్య మెంచునే?[1]

ఈవిధముగాఁబలుకుట వేశ్యాతనయల విశిష్ట జననమే, శివభక్తి తనువు లెత్తిన వారుగదా వారు ! 'శివునసేకించిన చిత్తంబు, చిత్త, జాయత్తమై విటులపై నాస పడునె ?' పడదు.

పాత్ర నిర్మాణమను ప్రకరణమున, ధూర్జటికవి పాత్రచిత్రణము, పాత్ర పోషణములు గావించిన తీరు, పాత్రోన్మీలనము చేసిన తీరుల గమనించితిమి.

అలంకార సంయోజనచమత్కారము:- పాత్రచిత్రణముచేయుచు వాని స్వరూప స్వభావములను అలంకార సంయోజనముచే చక్కగా నావిష్కరించినాఁడు కవీంద్రుఁడు. దాసి రూపరేఖలను వర్ణించుపట్టున రూపకాలంకారముచే కవి, శైలీవిన్యాసముచే నుద్దిష్ట పాత్ర స్వరూపస్వభావములను సంపాదింపగలిగెను.

ఆవేళం బురపల్లవ ప్రకర నేత్రానంద బాష్పధా
రావర్షాగమ చంచలాలతిక, దుర్వార ప్రసూనాస్త్ర తే
జోవైశ్వానర సామిధేని, రశనాసూత్రస్థిత స్వర్ణపే
టీవిన్యస్తకపర్ది, యొక్కకలకంఠీరత్న మేతెంచుచున్.[2]

మొదట రెండు రూపకములచే నా దాసి రూపసౌందర్యమును, మూఁడవ రూప కముచే హృదయ సౌభాగ్యమును పాఠకులకు నేత్రపర్వము గావించినాఁడు కవి

వేశ్యమాత కూఁతులకు వారధర్మముపదేశించినప్పుడు, మగల నెట్లు దెప్పగొట్ట వలెనో, వారినెట్లు చల్లబఱుపవలెనో తెలిపినది.

---

1. శ్రీ.కా.మా. 4అ - 43ప 2. శ్రీ.కా.మా. 1అ - 33ప.

మగల మనో నివాసముల మానిని దృక్ప్రసరాస్త్ర పావకున్
దగులొకొనన్ రగిల్చి, చిఱునవ్వను గంధవహుం గొండగాడ్పుచే
బొగలెగయించి, పల్కునెయి వోయుచు మండగ, మాయకట్టెచే
నెగసన్ద్రోచి యూర్వ్రేదగు నించుకయించుక కూర్మితుంపరన్[1]

స్త్రీలచూపులను నిప్పురవ్వలను మగవారల హృదయములందు తగిలించి చిర్నగవులను చల్లని గాలిచే రగిలించి, ఇంకను చల్లని పలుకులచే దరికొల్పి, మోసము లేక వంచనయను కట్టెపుల్లచే దానినెగద్రోచి, క్రమముగా నటించు ప్రేమ యను జల్లుచే మగల వారి హృదయములను చల్లబఱుపదగును. స్త్రీలచూపులను నిప్పుముతో రూపించుచునే వానికి నిప్పు కలిగించు శక్తి కలదని పలుకుట, చిర్నగవును చల్లనిగాడ్పుతో రూపించి దానికి, నిప్పును దరికొనఁజేయగల శక్తి కలదని పలుకుట యిటువంటి అలంకార సంయోజనమందలి యౌదాత్త్యముగా గమనింతుము.

4. సముచిత పదబంధ బంధుర ప్రయోగముతోడి సముదాత్త భావవ్యక్తి కరణము.

సంసార పారదోచ్చాటనానలకీల, కలుషసంచయ తామ్రగంధకంబు
కాముల తామూల కంద కుద్దాలంబు, సంకల్పపాషాణ టంకముఖము...[2]

శుండాలార్భక షండగండతల ఖర్జూ భర్జనోపార్జనా
ఖండ ప్రాభవము చండకుండ విశంకవ్యాప్తి కింపైన శ్రీ
ఖండస్థాణువు, శారికాశుకవిహంగ వ్రాతపుంద్రేఖు కో
దండ క్రీడకు నీడమై...[3]

మొదటి దానియందు శ్రీకాళహస్తీశ్వరము శివసాయుజ్య కల్పన సమర్థమను మహోదాత్త భావమును, రెండవదానియందు వశిష్ఠుని తపోమాహాత్మ్యమందలి యౌదాత్త్యమును, దీర్ఘ సమాసఘటితమై, సముదాత్త భావవ్యక్తీకరణ సమర్థముగా విన్యసించినాఁడు కవిధూర్జటి.

1. శ్రీ.కా.మా. 4ఆ – 31ప 2. శ్రీ.కా.మా. 1ఆ – 17ప
3. శ్రీ.కా.మా. – 1ఆ 72ప

5. కావ్యనిర్మాణ శిల్పవైభవము :

పూర్వభావములకు పరిణామముగా, భావిభావములకు ప్రాతిపదికగా నుండుట కావ్యనిర్మాణ శిల్పమనదగును.

పోనీ నేటికి నాయెఁబోయెఁగమునుగ్భద్ధిఁ బ్రచారింప నే
లా నిత్యంబును నీశ్వరునింగొలుచు వేళంగాక త్రేపాడి రాఁ
గా నర్చావ్రతహంతఁగన్న నది భాగ్యంబే వివేకింప వాఁ
డా నేనా నొక జాడఁబోయెదము లేదా జీవమింకేటికన్ ?*

ఏనుఁగు తనయర్చావిధిని భగ్నపఱచి శివునిపై బొలురప్పలుంచిన శత్రుకృత్యమును దలఁచుట పూర్వచరితము. ఇట్టి తన వ్రతభంగము మఱునాఁడును జరిగినచో శత్రువిదళనమునకుఁబూనుదుననియు నా కలహమున నెవరోయొకరు మరణింపకతప్పదనియు పలుకుటయందు భవిష్యత్కాలపరము, దానికి తన పూనికలను తెలుపుట యైనది.

ఈ పద్యము పూర్వభావములకు పరిణామముగా, భావిభావములకు ప్రాతిపదికగా నున్నదిగదా ! ఇదియే ధూర్జటికవీంద్రుని కావ్యనిర్మాణ శిల్పము.

పైనుక్తములైన పంచవిధౌచిత్యములను స్థాలీపులాక న్యాయమునఁబరామర్శించుట జరిగినది. ఇట్టి ఘట్టములు ధూర్జటి కవిత్వమందంతట వ్యాపించియున్నవి. ధూర్జటికవీంద్రుని కవితా పారమ్య మిట్లు పరమ మైనది.

— ౦ —

* శ్రీ.కా.మా. 2ఆ - 123ప

# వ్యక్తిత్వము

ఒక కవి తన కావ్యముఖమునఁ దనయాత్మీయత నందించును కథాకథనమున నడుమ నిలిచి తనవ్యక్తిత్వమును బ్రదర్శింపఁబూనును. ఆ యా పాత్రచిత్రణములందు, సన్నివేశచిత్రణములందు తత్తద్వస్తువర్ణనములందు సందర్భశుద్ధి కనుగుణముగఁబలుకు పలుకులందే తన జీవితాభిరుచులు, ఆశయములు, అనుభవములు కన్నవి, విన్నవి, తన యందు జీర్ణించుకొన్నవి, యయిన యంశములను వ్యంజింపఁజేయును. కావ్యరచనమునఁ గని యాత్మీయత లేక వ్యక్తిత్వము అంత స్పష్టముగఁ గనుపట్టదు. ఒకచోట నొకవిష యమునుఁబలుకవలసినదానికి మించి పలికినపు డచట వ్యక్తిత్వము తొంగిచూచుచున్నట్లు. వస్తువు ఆత్మాశ్రయము, పరాశ్రయమని రెండు రీతులు. వస్తువు పరాశ్రయమైనప్పుడు కవి పరోక్షముగా వ్యక్తమగుచుండునేకాని,ఆత్మాశ్రయమైనపుడు ప్రత్యక్షమగుచుండును అది సామాన్యకవి లక్షణము. వస్తువు పరాశ్రయమైనప్పుడును ఆత్మసాక్షికముగా భావించి తదనుభవప్రశుతిని మేళవించిన ట్లావిష్కరించు వాఁడు మహాకవి. పాఠకుని హృద యముతో సూటిగా 'భేటి' వేయువాఁడు మహాకవి. అట్టి మహాకవి ధూర్జటి. వస్తువు పరాశ్రయమగుటచే కావ్యములందింతమాత్రమే యుండును, కాని శతకములట్లుకావు. కేవలము కవి యాత్మీయమగు ననుభూతులను, ఆశయములను వెల్లడించుకొనుటకే శతకరచనసేయును. భక్తి, నీతి, శృంగార,వైరాగ్యములను స్పష్టముగా ననుభవప్రశుతిని మేళగించి మరి పల్కును. కావ్యములందు ఊహాశాలిత, పరిశీలనము, అనుభూతి, స్వవిచారజ్ఞతలు మూలబలముకాగా, శతకములందు మొదటిది తప్ప తక్కిన మూఁడును మూలస్తంభములు. అనుభవము మానవునికి మనఃపరిపాకమును కలిగించును. లోకము నుఁబరిశీలించి, శాస్త్రములు పరిశోధించి, అనుభవమునకు వచ్చినదానికి, వానిని జోడించి శతకమునఁబ్రతిపాదించుట మనము తెలియుదుము.

ధూర్జటి కవీంద్రుని ప్రబంధము, శతకములందు గన్పట్టు వ్యక్తిత్వముఁ బరిశీ లింతము. 'అనుభవము, శృంగారపారమ్యము, శివభక్తి, ఆధ్యాత్మిక భావన, లోకజ్ఞత శాస్త్రజ్ఞత'లను విభాగములమూలమున నామహాకవి వ్యక్తిత్వముఁదెలియఁబ్రయత్నింతము.

## అ ను భ వ ము :

పరమేశ్వరసాక్షాత్కారముఁబొంది వశిష్ఠుఁడు, తిన్నఁడు, నత్కీరుఁడు, వేశ్యాతనయులును పొందిన సాత్త్వికానుభూతులు ధూర్జటికవీంద్రుఁడు నిజజీవితమునఁబొందిన వనిపించును పరమేశ్వరునుద్దేశించి కవీంద్రుఁడు పలికిన పలుకులన్నియు అనుభవగోచరునిగాఁ బలికినట్టివే.

ఈశ్వరుని యఖండాద్వైతాజ్ఞానమయాకృతిని 'స్వానుభవంబునఁదథ్యముగా గంటదుగాని' 'బహుభాషానైపుణిఁదెలియ నది యశక్యమని' నాఁడు ధూర్జటి. ఆయా భక్తులు పొందిన భయాకులితవీక్షణత, శరీరము గగుర్పొడుచుట, ప్రమోదసంభ్రమస్విన్న లలాటభాగమున జేతులు సేర్చి ప్రార్థించుట'[1] ఆనందబాష్పము లతిశయిల్ల నమ్మహాలింగమునకు సాష్టాంగ నతులొనరించుట.[2] ప్రమదగద్గదగళమున నస్ఫుటవర్ణములచే నుతించుట, రోమోద్గమములపై పై జరుగుటలు మైపులకంబు లేర్పడుట, ప్రస్వేదవారి కణములు పొడముట, దృఙ్నీలాంబుద మంబువృష్టి గురియుటలు[4] ధూర్జటి పొందిన యనుభూతులు. ఈయన్ని యనుభూతులను పొందినతరువాతనే, ధూర్జటి ప్రబంధము నిర్మించినాఁడు వలె గోచరించును. సంసార క్లేశములననుభవించి, రాజసభలను దర్శించి, వారిచే పూజావమానములనుఁబొంది నిరక్తుఁడై, యీశ్వరసేవయందు జీవితము నర్పించుకొనిన ధూర్జటికవి తన యీజీవితానుభవములను శతకమున స్పష్టముగా నివేదించుకొనినాఁడు.

సాంసారిక దుఃఖ మాతనిని మిగుల బాధించినది. ప్రబంధమునఁబలికిన సంసారనిరాసము కేవలకౌటుంబిక జీవనముపై గల యీనడింపునుఁ దెలుపునది మాత్రమేకాక ఆధ్యాత్మిక దృష్టి, వైరాగ్యభావన, మోక్షాపేక్షలను వ్యక్తము సేయునది.

**రాజగర్హణము :–** శ్రీ 'కృష్ణరాయకిరీటకీలిత మణిగణార్చిత పదాబ్జద్వయశ్రీ వహించి'న భాగ్యశాలియగు ధూర్జటి కవీంద్రుఁడు రాజగర్హణము సేయుటయేమి యని సందేహము కలుగవచ్చును. రాయల యనంతరము ధూర్జటి నాదరించి, ఆరాధించిన

1. శ్రీ.కా.మా 1ఆ – 77, 80ప 2. శ్రీ.కా.మా 3ఆ – 64ప
3. ,, 3ఆ – 219ప 4. [illegible]

రాజులు లేరు. మహాకవి నాదరింపఁగల హృదయపరిపాకము లేని రాజనామమాత్రు లనేకులవలన నాధూర్జటిమనః క్లేశము పొందినట్లున్నాఁడు. అట్లే రాజాశ్రయము పోయిన తరువాత ధూర్జటి ఆర్థిక క్లేశములకు గురియై దారిద్ర్యముతో బాధపడుటయు, ఆస్థితి యందు, దారపుత్రాదులవలన, జ్ఞాతులవలన దుఃఖము కలుగుటయు నా కవీంద్రుని శతకమున గోచరించును. రాయల యాదరాభిమానములచేఁబొందిన భోగభాగ్యములెట్టివో ధూర్జటి లింగరాజు పేర్కొనిన పైవాక్యము తెలియజేయుచున్నది. కలిమికల దినములలో చూపిన గౌరవాభిమానములు, భార్య, పిల్లలు, బంధుగులు లేమిలో చూపరుగదా! ఆ దారిద్ర్యబాధా నివారణమునకు ధూర్జటి యనేకప్రభువుల దర్శనము చేయఁబ్రయత్నించియు వారిచే నిరాదరింపఁబడియు నిర్వేదమందినట్లు కవీంద్రుని పద్యములు తెలుపుచున్నవి. ధూర్జటికి 'రాజు' శబ్దమే పరహాసహ్యమైనది. ప్రభువుల నుద్దేశించి యాతఁడు 'రాజలోకాధముఁడు, రాజకీటములు, నృపాలాధము, భూభృచ్చండాలుర'నియు పలుకుటయు, రాజుల్మత్తులు, మూర్ఖులు లోకకంటకులు అధములనియు, రాజన్నంతనే కృపయు, ధర్మంబాభిజాత్యము, క్షమ, సత్యభాషణము, సౌజన్యములన్న మంచి లక్షణములన్నియు నశించుననియు. రాజశబ్దంబు చీ చీ జన్మాంతరమందైన నా నొల్లనని స్పష్టముగాఁ బ్రకటించినాఁడు.

రాజగర్హణమును ధూర్జటి పదునెన్మిది పద్యములందు గావించియున్నాఁడు. రాజు పెల్లపను దృష్టియందుంచుకొని సామాన్యవాచకముగాఁ బలికిన యీ పద్యములందొక్కటి మాత్రము మంచిలక్షణములుగల రాజకడ దనకాశ్రయము చూపుమని ప్రార్థించుటయు గలదు.

'...సత్యమునకున్ మధ్యస్థుఁడై సత్యదా, నదయాదు ల్గల రాజు
నాకొసగు...'*

మత్తులయిన రాజులసేవవలనఁబొందిన యవమానముతో ధూర్జటి కవీంద్రుని మనము విసిగిపోయినది.

* శ్రీ.కా.శ 94ప

ఆ రాజులిచ్చిన అంభోజాక్షీచతురంతయాన తురగీభూషాదులను తనివి తీఱ నను భవించియున్న యీ కవీశునకు తృప్తి కలిగినది. కోరిన లభింపఁగలస్థితి యున్నది. కాని మత్తులైన యీ రాజులను సేవించుట పాపము. అనుభవించినవానివలన తృప్తి కలిగినది కాని, వానియందలి యపేక్షమాత్రమింకను తిరుగలేదు,కరుగలేదన్నమాట. ఆ యపేక్షను తొలఁగింపుమని కవి ధూర్జటి వేడుకొనుచున్నాఁడు. ఆ యపేక్ష యున్నంతకాలము తన కా రాజులసేవ తప్పనిసరిగును. కాని నా యపేక్షను పెళ్ళగించివేసిన నరకప్రాయమైన రాజసేవ తప్పిపోవును. అట్టి వివేకము గలుగుటయే యథార్థమునకు జ్ఞానము కలుగుట కదా! ఇఁక తన కావ్యాత్మిక దృష్టిఁ బెంపొందించి, జ్ఞానసంపద యను భిక్షపెట్టుమను చున్నాఁడు కవి. రాజులవలనఁగలుగు సంపద నీఁకచాలని యతవి తృప్తి.

**మదమాతంగము లందలంబులు హారుల్మాణిక్యము ల్పల్లకుల్**
**ముదితల్ చిత్రదుకూలము ల్పరిమళంబు ల్మోక్షమీఁజాలునే**
**మదిలో 'వానినపేక్షసేసి నృపధామ ద్వారదేశంబు గాఁ**
**చి దినంబుల్ వృథపుత్తు రజ్ఞులకటా శ్రీ కాళహస్తీశ్వరా,**

రాజులిచ్చిన యీ సౌఖ్యములన్నియుఁదనివితీఱ ననుభవించిన ధూర్జటి, యాలోచించి చూడఁగా, వానివలన మోక్షము పొందలేమని, నృపుల సేవజేయుట కాలము వృథ పుచ్చుటయే కాన భోగభాగ్యములందలి యపేక్షకూడదని పలుకుచున్నాఁడు.

'రాజర్థాతురుఁడైనచో నెచట ధర్మంబుండు నే రీతి నానాజాతి క్రియలేర్పడు'[1] ను? మానవశ్రేణికి సుఖము కలదు. భక్తులు భగవంతుని సేవించుటకు నాటంకములు కలుగును. నిధి, నిక్షేపములిచ్చినను రాజకీటములను సేవించుట కిష్టపడక, భగవంతుని యింటిపంచను బడియుండి భిక్షాన్నమునే కోరుకొనినాఁడు. సంసారార్థమైన యాశాపాశ ములకుఁ గట్టువడి రాజకీటముల నాశ్రయింపఁజేయవలదని ప్రార్థించెను.[2] భూమి ననేక యుగములనేలిన పృథ్వీపతులు మృతిచెందిరి. తమపదవు లధికారము లశాశ్వతములని తెలియలేని మత్తునఁబడి కొందరు రాజుల మమకొనుచు మిడిసిపడుచుందురు.[3]

మరియొక పద్యమున రాజులమత్తత, యనివేకములను గర్హించియున్నాఁడు కవి. రాజు పదవి లభింపగనే, మానవునియందావఱకున్న సర్వసద్గుణములు నశించును. కాన రాజులు దుర్జనశ్రేష్ఠులగుచున్నారు.[4]

---

1. శ్రీ.కా.శ. 22ప 2. శ్రీ.కా.శ 26ప 3. శ్రీ.కా.శ 38ప 4. శ్రీ.కా.శ 39ప

'నీ సద్భాలశిఖాక్లేశదుష్టవిధు'లు భవదుఃఖములు భగవదంఘ్రిస్తుతిచే మాత్రమే పాయునుగాని రాజకీటములను బ్రార్థించినందువలనఁ దొలఁగిపోవజాలవు.[1] తల్లి శిశువునకు స్తన్యమీయఁగలదుగాని, మేకమెడయందు వ్రేలాడు స్తనములు క్షీరము నీయజాలనియిట్లు, భగవంతుఁడు తొలగింపఁగలిగిన భవదుఃఖములు రాజకీటములు తొలంగింపలేరు.

దీనత్వముట్టిపడుచుండఁగా భూపాలురను సేవించుటకంటె కొండలయందు కానలయందుండి, యేఱుల నీరుద్రావి, కందమూలఫలములను భుజించి చిగురుటాకుల సెజ్జపై నిదురించి యాత్మలో శివుని ధ్యానించుట శ్రేయమగును.[2] ఇట్టి యభిప్రాయమునే మఱియొక్కమాఱు ధూర్జటి వెలిబుచ్చియున్నాఁడు. ద్వార ద్వారములందు కంచుకి జనవ్రాతమును బ్రార్థించి వారిచేఁదిట్లుపడుచు రాజసేవకేగుటకంటె, నూరూరఁదిరిగిన భిక్షలభించును, గుహలందు నివాసమేర్పరచుకొనవచ్చును, చల్లని నీటిచే కడుపునింపుకొనవచ్చును. అట్టివారినిఁద్రోఁచుట కా శివుఁడుండనేయున్నాఁడు.[3]

దొంగవేసములు వేసికొని వ్రతస్థులమనుచు రాజులసేవ జేయబోవువారి నింకొక పద్యమున గర్హించినాఁడు కవి అదియంతయు 'పుత్త్రీపుత్త్రకళత్ర రక్షణ కళాబుద్ధితో'.[4] జేయుపనియే. కవులను పుట్టించి వారికాఁకలి కల్పించిన బ్రహ్మ, దుర్మార్గులైన రాజులను సృష్టించుట పొరబాటనుచు,[5] రాజులుగ జన్మించుటయే మహాపాపముగాఁబలుకుట యిది.

రాజసేవ, భగవత్సేవలయందేది మేలుత్తరమో, శ్రేయస్కరమో తెలియఁజాలనివారు రాజసేవ సేయుదురు, సిరులనపేక్షించి రాజశ్రేణికి దాసులగుటకంటె, నీజన్మంబు తరింప జేయఁగల యీశ్వరుని సేవించుటయే మేలు.[6] ఇదియే అభిప్రాయమును కవీంద్రుఁడింకొక్క తావుననుఁ బలికియున్నాఁడు. అది యముద్రిత పద్యముగాన నిటనిచ్చుచున్నాను.

---

1. శ్రీ.కా.శ. 44ప. 2. శ్రీ.కా.శ. 46ప
3. ,, 91, 92ప. 4. ,, 63ప
5. ,, 83ప 6. ,, 88ప

వనితల్ భూషణముల్ మదేభములు అశ్వంబుల్ ఘనుల్గల్గుటల్
ఘనమో యిన్నియు గల్గుటంట ఘనమో, కామాంధులై రెంటిలో
ఘనమేదో తెలియంగ నోపరథముల్ కైవల్యమొందింప నే
ర్చిన వైరాగ్యముకంటె లక్ష్మి ఘనమా శ్రీకాళహస్తీశ్వరా.[1]

నిష్పక్షపాతబుద్ధిగల్గి, సత్య దాన దయాగుణములుగల రాజున్నయెడల వాని నీశ్వరునితో సమముగా భావింతుననినాఁడు. అంతియేకాని లోకకంటకులైన రాజులచే ప్రాపించు సౌఖ్యముల్ పదివేలనైన నమ ధూర్జటిమదికి ప్రియము గూర్పలేదు[2]. మఱియొక పద్యమున కవి భూభృచ్ఛండాలురను గొల్చుట కార్జవము గోల్పోవుటకంటె నీశ్వరుని భజించి మహానిర్వాణపీఠముపై రచ్చసేయుట లెస్సయనినాఁడు.[3]

రాజగర్హణమున ధూర్జటి జీవితమునఁదొందిన యనుభవఫలమగు తీవ్రతచే, వారిని రాజాలోకాధములు, రాజకీటములు, భూభృచ్చండాలురు, నృపాలాధములు, అని సంబోధించుటయు, వారికి మత్తులు, మూర్ఖులు, లోకకంటకులని విశేషణములు ప్రయోగించుటయు సంభవించినది.

రాజసన్మానములు, వానికొఱకు పాటుబడు కవులను గూర్చియు నొక పద్యమున నిట్లనినాఁడు కవి.

క్షితినాథోత్తమ సత్కవీశ్వరుఁడు వచ్చెన్ మిమ్ములంజూడఁగా,
నతఁడే మేటికవిత్వవైఖరిని, సద్యఃకావ్యనిర్మాత, త,
త్ప్రతిభల్మించిని, తిట్టుపద్యములు చెప్పండాతఁడైనను మము
గ్రితమే చూచెను, బొమ్మటందు రథముల్ శ్రీకాళహస్తీశ్వరా.

ఆశుప్రబంధములు నిర్మింపగల, ప్రతిభావంతులయిన సత్కవీశ్వరులును, కేవలము తిట్టు పద్యములు చెప్పువారును గలరనియు, వచ్చినకవి యెట్టివాఁడైన నాదరింపకదర్శన మీయక, క్రితమే వచ్చెను పొమ్మను రాజాధములును నున్నారని ధూర్జటి సమకాలీన కవులను గూర్చి పై విధముగా పలికియున్నాఁడు. తిట్టుపద్యములు చెప్పనివాఁడు, ఆశు కవిత్వము, మేటికవిత్వము చెప్పగల్గిన మహాప్రతిభావంతుఁడైన సత్కవీశ్వరుఁడు వచ్చినను గ్రహించి యాదరింపలేని నీరసహృదయుఁడగు రాజధముఁడే, యనియు నీ పద్యమునఁ జెప్పుచున్నాఁడు కవి. సారాసారమెఱుంగలేనిరాజులు, ప్రభువులు తమను

1. శ్రీ కా. శ 1523 ప్రతి 110ప. 2. శ్రీ.కా.శ 98ప 3. శ్రీ.కా.శ 115ప

పొగడుచు, గీతాలుపాడు టవనీనికాండ్ల కాశ్రయమిచ్చి యాదరించుటచే సత్కవీశ్వరుల కాశ్రయము లేకపోయినదనియు ధూర్జటి తన నానారాజసందర్శనమునఁ బొందిన యనుభవముల నిట్లే పద్యములనందించినాఁడు.

సంసారయాతన :- ధూర్జటికవి జీవితమున సాంసారికముగా చాల యాతనఁబడినట్లు స్పష్టముగా చెప్పుకొనియున్నాఁడు. శ్రీకృష్ణరాయానుగ్రహమునఁ బొందిన సంపదైశ్వర్యమునసుభవించిన భోగభాగ్యములు, రాయలయనంతరము కఱవైనవి. కుటుంబపోషణకై కవీంద్రుఁడు నానారాజదర్శనముచేసి యుండును. రాయలవంటి సహృదయ ప్రభువు లభింపక, కవీంద్రునాదరించిన వారలే లేకుండుటచే దారిద్ర్యబాధచే నొగులఁ కుందినాఁడు

శ్రీ విద్యుత్కలితాజవంజవ మహాజీమూతపాపాంబుధా
రావేగంబున మన్మనోబ్జసముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్
దేవా! మీకరుణాశరత్సమయ మింతేఁ జాలుఁ జిద్భావనా
సేవం దామరతంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా.

మెఱుపు తీవవంటి చంచలమైన (కాంతి, శోభ) సంపదలు కల్గిన సంసారమను పాపరూపమగు మేఘపాతమున, సుకుమారము జ్ఞానవికసితమునగు హృదయమను పద్మము ముకుళించికొని పోయినది వాడి వత్తయ్యెను. తిరిగి జీవించవలెనని యీశ్వరుని కరుణయను వర్షము కురియవలెను. దీనివలన ధూర్జటి సంసారజీవితమున నెంతగా వంతఁజెందెనో, చింతఁగుందెనో మనకుఁదెలియఁగలదు.

ఆలుంబిడ్డలుఁ దల్లిదండ్రులు ధనంబంచున్మహాబంధనం
బేలా నామెడఁగట్టినాఁడ వింక నిన్నే వేళఁ జింతింతు ని
ర్మూలంబైన మనంబులోనఁ గడు దుర్మోహాబ్ధిలోఁ గ్రుంకి యీ
సీలామాలపుఁ జింత నెట్లుడిపెదో శ్రీకాళహస్తీశ్వరా.

ఆలుబిడ్డలు, తల్లిదండ్రులు, ధనము అను బంధనములందుఁ జిక్కుకొన్నకాలమున, దుర్మోహాబ్ధిలోఁ గ్రుంకి భగవంతుని చింతించుటకు సమయమే చిక్కలేదు. వానివలన విముక్తి గోరుటయింది.

కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్, వారిచే నేగతుల్
వడసెం బుత్రులు లేని యా శుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్
చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా.

కొడుకులకొఱకు వివేకములేనివా రేడ్చుదురు. ధృతరాష్ట్రునకు కొడుకులు గల్గి వంశమున కపకీర్తి కలిగించినారేకాని యానందము కలిగింపలేకపోయినారు, అయినాగాని కొడుకు పుట్టనియెడల పున్నామమను నరకము కలుగునని నమ్మకమున్నను, పుత్రులులేని శుక మహర్షికి సుగతులు కలుగకపోలేదు కొడుకులు లేరని చింతింపఁబనిలేదు. కొడుకుల వలన మనఃక్లేశము కలిగినవానివలె కన్పించుచున్నాఁడు ధూర్జటి.

**జ్ఞాతులవలనబాధ :** —జీవితములో దాయాదులవలనఁగూడ ధూర్జటికవి మిక్కిలి మనఃక్లేశము నందినాఁడు.

జ్ఞాతుల్ ద్రోహులు వాండ్రు సేయు కపటేర్ష్యాదిక్రియా దోషముల్
మా తండ్రాన సహింపరాదు ప్రతికర్మంబంచు నేఁజేయఁగా
బోతె దోషముగాన మాని యతినై పోఁగోరినన్ సర్వథా
చేతఃక్రోధము మానదెట్లు నడుతున్ శ్రీకాళహస్తీశ్వరా.

ఈర్ష్యతో జ్ఞాతులు ధూర్జటికెంతగానో ద్రోహముచేసియుందురు. ప్రతీకారము చేయవలెననిపించినప్పటికి, యతికాఁగోరిన తన కట్టి ప్రతీకారము చేయునవకాశము కలుగక పోయినదని చింతించినాఁడు ధూర్జటి.

**దారిద్ర్యము :**— రాజాశ్రయము తొలఁగిపోయిన తరువాత ధూర్జటి లేమివలన మిక్కిలి కష్టములనుభవించినట్లు, ఆ లేమినుండి తనను రక్షింపుమని వేడికొనినాఁడు.

దివిజక్ష్మారుహ ధేనురత్న ఘనభూతి ప్రస్ఫురద్రత్న సా
నువు నీ విల్లు నిధీశ్వరుండు సఖుఁ డర్ణోరాశికన్యావిభుం
డు విశేషార్చకుఁ డింక నీ కెన ఘనుండుం గలనే నీవు చూ
చి విచారింపవు లేమి నెవ్వఁడుడుపున్ శ్రీకాళహస్తీశ్వరా.

అప్రతిష్ఠ : ధూర్జటి జీవితమున, నీర్ష్యాపరులైన కొందఱియపనిందలకు గుఱియయి నట్లు సూచించు పద్యమిది.

కరిదైత్యున్ బొరిగొన్న శూలము కరగ్రస్తంబుగాదో రతీ
శ్వరునిన్ గాల్చిన ఫాలలోచన శిఖావర్గంబు చల్లాఱెనో
పరనిందాపరుల న్వధింప విదియున్ భావ్యంబె వారేమి చే
సిరి నీకున్నరమోపకార మరయున్ శ్రీకాళహస్తీశ్వరా.

తనపై నిర్నిమిత్తముగా నిందమోపిన దుండగులను శిక్షింపుమని భగవంతుని ప్రార్థింపటయిది. రాజాశ్రయమున్నప్పుడైన, సంపదలున్నప్పుడైనదో నధికారముచే బలముచే వారిని తానే శిక్షించి యుండెడివాఁడేమొ. కాని యన్నివిధములయిన యండదండలు వోయిన నిస్సహాయస్థితిలో పరనిందాపరుల నిందలకు గుఱియై యుండ నోపును. కనుకనే తనపక్షమున నీశ్వరునికి గల యాయుధములలో, శస్త్రలలో నొక్కదానిని ప్రయోగింపుమని వేడుచున్నాఁడు. ఉగ్రుని కోపమునకు గుఱియైన వారెంత దుర్మతులో, తనకపకారము చేసినవారు నంతటివారేయని ధూర్జటి యభిప్రాయము.

అంతశ్శత్రు ప్రాబల్యము :- జీవితమును మిక్కిలిగా ప్రభావితము చేయువారు అంతశ్శత్రువులు. వెలుపలి శత్రువుల నేదోవిధముగ నెదుర్కొని లొంగదీసికొనవచ్చును కాని, విజృంభించిన యరిషడ్వర్గమునకు లొంగక తప్పదు. అరిషడ్వర్గమును జయించుటయే, జితేంద్రియత్వము., జీవన్ముక్తి. కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యములు తనకుఁగలిగించిన బాధనుండి విముక్తినిఁ గలిగించుమని ధూర్జటి పరమేశ్వరుని ప్రార్థించెను.

అమరస్త్రీలరమించినన్ జెడదు మోహంబింతయున్, బ్రహ్మప
ట్టము సిద్ధించిన నాసదీఱదు, నిరూఢక్రోధమున్ సర్వ లో
కముల న్మ్రింగిన మాన దిందుగల సౌఖ్యంబొల్ల నీ సేవచే
సి మహాపాతకవారిరాశిఁ గడతున్ శ్రీకాళహస్తీశ్వరా.

గతస్మరణమాత్రహృపయోద్వేగము :-

వెనుకంజేసిన ఘోరదుర్దశలు భావింపగా రోఁతయ్యెడున్
వెనుకన్ముందటవచ్చు దుర్మరణము ల్వీక్షింప భీతయ్యెడున్
నను నేఁజూచియు నా విధుల్దలఁచియు న్నాకే భయంబయ్యెడుం
జెనకుంజీఁకటినాయె, గాలమునకున్ శ్రీకాళహస్తీశ్వరా

జీవిత పూర్వభాగమున తాఁజేసియున్న దోషముల నిప్పుడు జ్ఞప్తికిదెచ్చు కొనగనే, వానివలనఁగలుగనున్న దుష్ఫలితములవలన భయము కలుగును. తన మనస్సులో తానే పరిశీలించి చూచినప్పుడు తన చేష్టలకు తానే తల్లడిల్లి పోయినాఁడు. చిన్ననాఁటిపనులంతటి రోఁతకల్గించునట్టివి, భయంకరములైన వనిపించగనే యొడలు భయముతోఁ గంపించినది

చెడుగులతో గూఁడి చేసిన దుష్టచేష్టలకు దరిజేర్పరాదని నివారించినను, ధూర్జటి భగవంతుని వీడనని మొఱ్ఱలిడినాఁడు.*

కామ క్రోధ లోభ మోహములవలనఁ దాను మహాపాతకరాశి యందు మునిఁగి పోయితినని కవి యాక్రోశించుచున్నాఁడు. ఈ యంతశ్శత్రుప్రాబల్యము నింకొక లావునను స్మరించి కంపించినాఁడు కవీశుఁడు.

చవిగోఁజూడ వినంగ మూర్కొన దనూసంఘర్షణాస్వాద మొం
ద వినిర్మించెదవేల జంతువుల నేతత్క్రియలే పాతక,
వ్యవహారంబులు సేయునేమిటికి మాయా విద్యచేఁబ్రొద్దుపు
చ్చి వినోదింపఁగ దీననేమి ఫలమో? శ్రీకాళహస్తీశ్వరా !

పంచభూతానుభూతిచే గట్టుకొన్న పాతకములు చేసి, మాయావిద్యచే కాలము వ్యర్థ పుచ్చితినని పశ్చాత్తాపపడుచున్న కవి హృదయమిది.

కవి ఆక్రోశము :-

స్వామిద్రోహముఁజేసి యే నొకనిఁగొల్వంబోతినో కాక నే
నీమాటన్వి నొల్లకుండితినో నిన్నే దిక్కుగాఁజూడనో
యేమీ యిట్టి వృథాపరాధినగు నన్నీదుఃఖవారాశిపీ
చీమధ్యంబున ముంచియుంపఁదగునా శ్రీకాళహస్తీశ్వరా.

తానుఁజేసిన దోషమేదైన నుండియుండవలె. బంటుగా నంగీకరించిన యజమానికి ద్రోహము చేసి మఱియొకరి సేవచేయుట, లేక స్వామి యాజ్ఞ మీఱుటకాని, లేక సర్వమునకు స్వామినే దిక్కుగా భావింపకుండుటయో, వీనిలో నేదీ నొకదోషము తనకు తెలిసికొని తెలియకకాని చేసియుండవచ్చును. అట్టియపరాధమునకు శిక్షగా దుఃఖ

---

* శ్రీ కా.శ 101ప

సముద్రమునఁబడవేయుటయా ? కాన తనయపరాధమును మన్నించి దుఃఖసముద్రము నుండి యుద్ధరింపుమని యాక్రోశించుచున్నాఁడు కవి.

కవిజీవితాశయము :-

తనువే నిత్యముగా నొనర్పు మది లేదా చచ్చి జన్మింపకుం
డ నుపాయంబు ఘటింపు మా గతుల రెంటన్నేర్పు లేకున్న నే
దని నాకిప్పుడె చెప్పు చేయంగల కార్యంబున్న నంసేవ జే
సి సుంగాంచెదఁగాక కాలమున నో శ్రీకాళహస్తీశ్వరా.*

సిమిషార్ధదినసములందు ప్రీతిఁబుట్టించి యూసిలుగులేల కల్పింపవలయునని యడుగుట సిచ్చినదనికి శాశ్వతత్వము కూర్పవలెనేగాని తన కిట్టి యశాశ్వతమైన జన్మ నేల యిచ్చితి వనియు ప్రశ్నించుచున్నాఁడు. సిలుగులు లేని నిత్యమైన జీవితమైన నీయవలె లేకున్న పునర్జన్మలేని మోక్షమైన నీయుమనియు గోరుచున్నాఁడు కవి. ఈ రెండువనుల జేసు పరమేశ్వరునకు సామర్థ్యము లేకున్నయెడల నా విషయము చే కల్పించుట మంచిదనియు. నప్పుడు తానే పరముగా నీశ్వరుని సేవించిన సాయుజ్యము కలుగునో యా సేవచేసి ముక్తి పొందుదుమని ధూర్జటి కోరిక, జీవితాశయమును.

శృంగారరసరమ్యము :- కవిధూర్జటికిఁగల శృంగారరసజ్ఞతను గూర్చి ప్రబంధమున రసపోషణము-శృంగారమను ప్రకరణభాగమునఁ బరిశీలించియుంటిమి. జీవితానుభవమున గల శృంగార ప్రియత్వమును కవీంద్రుఁడు భక్తి రసాత్మకమగు కావ్యమున బాలములు పంచి వర్ణించిన తావులందు ప్రదర్శించియున్నాఁడు కథాభాగముగా, సందర్భోచితముగా కావించు శృంగారవర్ణనల వలన మాత్రమే కవియొక్క శృంగారదృష్టిని గ్రహింపలేము. వీరశాంతములకంగముగా, భక్తికి సహకారిగ, శృంగార సందర్భము గల యెడలనే అతివేలముగా శృంగారమును కూర్చుటవలన, కవికి ప్రకృతియందలి ప్రత్యంశమునందుఁ జూడగల శృంగారదృష్టినిఁ గాంచఁగలము.

దుర్గామహాదేవిని వీరశృంగారమూర్తిగాఁ జిత్రించుటయందు, కవికిఁగల శృంగార రాసికత్యముఁ గనుగొందుము, దుష్టరాక్షస సంహారిణిగా, రౌద్రిణిగా మాపొందించుచున్న దేవిమూర్తి యందు గల రౌద్రాంగములను కవి శృంగారముచే సింగారించినాఁడు.

* శ్రీ కా.శ. 53ప

'శాసరాసుర రాజకంఠ నిర్గతరక్త, శ్రీపాద పద్మ లాక్ష
చండముండాహవ సంభ్రమ స్తనజాత, ఘర్మవాఃకణరాజి కంఠమాల
రక్తబీజాది మర్దనసమయాట్టహా, సము మోముకమునకు లోధ్రసుమ రజంబు
శుంభనిశుంభ రక్షోవీర సంహార, వేళఁ గప్పిన ధూళి మేలుముసుఁగు
గాఁగ నే దేవి వీరశృంగార మూర్తి, యగుచు శోభిల్లు నట్టి దుర్గాంబ....' యఁ

గొల్చినాఁడు కవీంద్రుఁడు. ఇచ్చట శృంగార ప్రసక్తి కల్గినను, ఔచిత్యమునకు తొలఁగక దేవియందు గౌరవ ప్రపత్తులనే నిల్పుకొనినాఁడు ధూర్జటి యన్న విషయమును పూర్వోక్త ప్రకరణమునఁ బరికించియుంటిమి

శ్రీకాళహస్తీశ్వరమున, పురజనుల శృంగారానుభూతులను దెల్పుచు, శాంతాంగములుగ శృంగారమును కూర్చినాఁడు.

ఎలదోఁటల్వనముల్వధూకుచము లద్రీంద్రంబు లాఁకంటికిన్
ఫలముల్వాతెర లంగజాగమ కళాబంధంబు లిచ్ఛాసనం
బులు, శోకంబున బాయుటల్ తపము, సంభోగము కైవల్యమం
దుల లీలారతినుండు మానవుల కెందుం గాన మీచిత్రముల్

శివభక్తి ప్రతిపాదకమైన ఇతివృత్తమున శివాచారైక సంశీలయయిన దాసితో జంగమ ఋషియగు శివుని కనుబంధముగూర్చుటయందే కవిధూర్జటి తనశృంగార రసదృష్టిని నందించినవాఁడయినాఁడు. అందులో కవి కుమార జంగమనియు, దాసియు సౌందర్యాతిశయమును చక్కని రూపకములచే రూపొందించినాఁడు. వారి ప్రణయకేళి కథాగతమె యయినదప్పుడు. 1ఆ-32, 33, 36, 37, 42, 43, 47ప.

పార్వతీరూపసౌందర్యమును వర్ణించుపట్టున నామె వివిధావయవ సౌభాగ్య సౌష్ఠవముల నాయా యుపమానములచే నుపమించి ధ్వనింపఁజేయుట కవికిఁగల శృంగార రాసిక్యము వ్యక్తము చేయుచున్నది. పార్వతితోఁగూడి పరమేశ్వరుఁడు శమనాశాద్రిని విహరింపనున్నాఁడుగాన నామె రూపసౌందర్యవర్ణన మావశ్యకమే యనిపించినను, సర్వావయవ సౌందర్యవర్ణనము నంతవిపులముగాఁ జేయఁబనిలేదు. కాని కలిగిన యవకాశమును తన యభిరుచి కనుగుణముగా రూపొందించుటయే కవి [illegible]

అలరుగందీగెలు, పువ్వుగుత్తులు, తురంగాలోకము, ల్పల్లవం
బులు, పంచాననమధ్యము ల్మధుకరంబు, ల్బింబము ల్దాడిమీ
ఫలబీజాదులు, నద్రిజాపయుప సౌభాగ్యాగంబుతో నీడు రా
గలవో? లేవో, యటంచుఁజూచుగతి నాగ్రావంబునం ద్రిమ్మరున్.

అగస్త్యుని తపోవర్ణనవేళ గ్రీష్మర్తు వర్ణనము చేయుచు కవి శృంగార రసోద్దీపనము
చేయుట గమనింతుము.

దూరీకృత స్తనభార కంచుక వధూ, జనము, మానవకరాంచద్వ్య
జనము...
ప్రాణేశ్వరీ పరీరంభణ ప్రత్యూహాకారి ...[1]

తరువాత పలికిన

ఎండౌ గ్రోలంగ నెల్లను, మహాధరముల్దవనహ్నికీలలో
మండె, భూతలం బినుప మంగలముంబలెనుండె...[2]

ఈ పద్యమొక్కటి గ్రీష్మాతపతీవ్రతను వ్యక్తము చేయఁజాలియుండగా, పైన చెప్పిన
పద్యము కేవలము కవి శృంగార దృష్టిని వెల్లడించుటకే యన్నట్లున్నది గదా.
శీతర్తు వర్ణనమునను

... ... వణంకు వేది యో
షాతతి ప్రాణవల్లభుల సంతతముం బరిరంభణంబులన్[3]

ప్రీతులఁజేయు .... అను పద్యమున శృంగారస్పర్శ చూపినాఁడు కవి. కాని నిదానముగా
పరికించినయెడల ఆరెండు ఋతువులందును నాయాప్రకృతి, ప్రాణి అప్రాణులన్నియు
పొందిన అనుభూతులను వర్ణించుట ప్రకరణోచితమే యగును గాన కవి కావించిన
శృంగార ప్రసక్తి అస్థానపతితము కాదనవచ్చును.

వాణీవిలాస వర్ణన సందర్భమున నామె సుధాబ్ధినిఁబోలి యున్నదనుచు కావించిన
రూపచిత్రణముగూడ శృంగారముతో సింగారింపఁబడినది

---

1. శ్రీ.కా.మా 1ఆ — 122ప  2. శ్రీ.కా.మా 1ఆ — 123ప
3. శ్రీ.కా.మా 1ఆ — 130ప

నవలావణ్యకలాపలయంబు, గుణరత్నస్థాన మాస్యక్షపా
ధవ బింబోదయ, మున్నతస్తన గిరీంద్రవ్యక్తి, వాచాసుధా
భవదేశంబు, వళీతరంగము తనూభద్రప్రభాఫేన దీ
ప్తి విలాసంబగు తత్కళత్రము సుధాబ్ధింబోలి సద్భక్తితోన్.[1]

ఇందలి యున్నత స్తనగిరీంద్రములు, వళీతరంగములు కవిచూపు దాటిపోలేకపోయినవి. వాణీహిరణ్యగర్భుల ప్రణయోదంతమున వర్తిలిన శృంగార రసనిర్వహణమందలి యౌచిత్యానౌచిత్యములను గూర్చి లోగడ పరిశీలించియుంటిమి. క్రూరులు ధూర్తులు దోషకారులగు ముప్పదివేలరక్కసులకు తలిదండ్రులు కానున్నారు కాన, దేశకాలము లెఱుగక కామాంధులై ప్రవర్తించినారుకాని, వారిరువురి యుదంత మీప్రకరణమునకు వ్యంజకముగా లేదని తెలిసితిమి. పలుకు చెలువ చెలువముఁజూచినలువ తలఁకినాఁడుగదా! ఈప్రణయోదంతమంతయు పదమూఁడు పద్యములందు సాగినది (2ఆ_10ప, 22ప)

మఱియు 16వ పద్యమునుండి 21వ పద్యమువఱకును సాగిన చిత్రణమున శృంగారము రసమై పోలినది. అందున 19, 20, 21 పద్యములు శృంగారమును ఘన మొనరించిన వని గమనింపుము.

తరుణీశతకము బింబాధర మాధుర్యంబు బాలాను తఱిఁ దమలోనన్
బరమేష్ఠి నాల్గుమోములు, వరుసలు పెట్టుకొనుఁజెప్ప వశమే కూర్మిన్[2]

'అధరపల్లవపాన సంగంబు మఱపి, దంతక్షతంబునఁ గొంత తలంపు గలుగు
బరిరంభణంబునఁ బరవశుఁడగు సఖం, బులు నాటఁజెనకినఁ దెలివి నొంచు
బహుబంధరతికి లోఁబడి చొక్కు గరప, శ్రవణంబుగేత నెచ్చరిన నొంచు
సురతాంత సుఖమున సోలు,దాంబూలంబు, సేయింప నించుక సేపదేలు

జలకమాడును, దివ్యవస్త్రముల గట్టు ...
బాలికాసంగసౌఖ్యాబ్ధి నోలలాడు [3]

---

1. శ్రీ.కా.మా. 2ఆ _ 5ప    2. శ్రీ.కా.మా. 2ఆ _ 19ప.
3. శ్రీ.కా.మా. 2ఆ – 20ప

తోరపుఁగోరిక ల్నగవుతోడి మొగంబును, జిక్కువడ్డ శృం
గారపుఁగొప్పు క్రొంజెమటగాఱెడు గండము, సందడించు ని
ట్టూరపుగాడ్పు, వేసరికలనుబ్బెడు దేహము, సోలుఁజూపు, నో
ప్పారుటగాని నల్వ కొకయప్పుడు నూరటలేదు కూటమిన్.[1]

నాల్గుమోములచే నూఱుమోములానుటకు తమితీఱకుండుట, క్షణక్షణము సోలుట తేఱుటలు, కూటమియందూరట లేకుండుటలు, శృంగారము మితిమించి గతితప్పెనా యని పించునటుకేఁగినది.

17వ పద్యము తరువాత 22వ పద్యమున్నను కథనమునకొ గాని, బ్రహ్మయొక్క కామాంధ్యవర్ణనమునకుగాని కొదువకలిగెడిది కాదు. వాణీబ్రహ్మల ప్రణయకేళి నంత విపులముగా వర్ణించుట, కవి యభిరుచిని తెలియజేయుటయే యన్న కవియెడల మనకున్న యభిమాన గౌరవములు తగ్గనక్కఱలేదు.

శివరాత్రిగా గడపినరాత్రియందలి పామునేనుఁగులు జాగరము చేసిన రీతిని వర్ణించునప్పుడు తిర్యగ్గతి ప్రస్తావము జరిగినది.

'ప్రాణనాయికలతోడ, బర్యంకసీమల, మనకానఁబెనగు సంభ్రమము విడిచి'[2] ...

'పిడియేనుఁగుల వెంటబడిపోక యుడుగని, వెడవిల్తు వేడిమి విడుపు చూప'[3]...

కటక జీవితచిత్రణమున సాగిన శృంగారవర్ణనము నాట్యచితమై, ప్రకరణోచితమై యలరుచున్నది. కటకకాంతుల యవయవ సౌందర్యవర్ణన మతి సహజ సుందరముగా నున్నది. కాని యొక్కచో మాత్రము ధూర్జటి చూపు మఱింత దిగజారినదనుట కాదనలేము.

'మంచెలమీఁద నెక్కి, కటిమండలిఁజుట్టిన పాఱుటాకు లిం
చించుక చంచలించి మరునిల్లుబయల్ప'[4] డినది పాపము.

1. శ్రీ.కా.మా. 2అ - 21ప    2. శ్రీ.కా.మా. 2 అ - 119ప
3. ,, 2అ - 126ప    4. ,, 3అ - 10 ప

తిన్ననితల్లి తండ్రియు తండ్రినాథనాథుఁడును గిరికందర సానువనీ నిర్ఝరములందు సురతేచ్ఛానందము నలిపినారు. ప్రాణేశ్వరోపగూహన జనితానందయగు నా తండ్రికు నెలనుసలి ది[1]

శబరుల క్రాంచనిజాతర సందర్భమునను కవి ధూర్జటి శృంగార స్పర్శచే నుపనాథుల గూడిన శబరకాంతల గుట్టురట్టు చేసినాఁడు.[2]

తిన్నఁడు లింగరూపియగు పరమేశ్వరునకు సేవకై యిచ్చునన్న 'యిఱుకువలిగుబ్బ పాలిండ్ల యిగురుఁబోండ్లు'[3] ఈశ్వరుని కంటిమంటకు బుగ్గియైన మన్మథుని తిరిగి బుట్టింపఁ గలిగిన సుందరాంగులఁట.

పాండ్యుని గుణశీలముల నుగ్గడించుచుఁబలికిన యితరవిశేషణముల నడుమ శృంగార ప్రసక్తి కిఁదావులేదు.

> అడిగినదిచ్చు నర్థులకు, నాప్తులకిచ్చు మనంబు, కూటమిం
> బడఁతులకిచ్చు సౌఖ్యములు, బంధుజనంబులకిచ్చు సంపదల్
> పుడమి సమస్త జాతులకు బొంకమి నుత్సవమిచ్చు, శత్రులన్
> పొడవడగించి సాధు జనపుంగవకోటికి నిచ్చు వేడుకల్.[4]

కాని యాప్రభువు తనకడనుండి యీయగలిగిన సమస్త శక్తియుక్తులను వారివారలకిచ్చునే గాని, యొక్కటిని తనకున్నదానిని లేదనఁడను భావమున 'కూటమిం బడఁతులకిచ్చు సౌఖ్యము' లనుటయందు రాజులకుఁగల బహునార్యాత్వము, శృంగార రాసిక్యములను బలుకుటయే యగుచున్నది.

చెవ్వందీశ్వరుని మహామహిమలలో 'తీవ్రతరాంగభవ శరశ్రేణీ విదాహవ్యథ,[5] లను విచ్చఁజేయుటయు నొకటియేనఁట.

మధురానగరమునఁగల వేశ్యావీధిని ధూర్జటి 'మదనదాహరసప్రదవైశ్యవీథి'[6] గా బలుకుట సముచితమే. ఆమాణిక్యవల్లి, తనతనయల నుయ్యాలలో బెట్టి 'కొక్కోక కళావిలాసములకుగల యర్థము'[7] జోలపాటగా పాడినది. కారణమును తెల్పి కవియే

---

1. శ్రీ.కా.మా 3ఆ– 20,21ప. 2. శ్రీ.కా.మా. 3ఆ – 42,43ప
3 శ్రీ.కా.మా. 3ఆ – 71ప 4. శ్రీ.కా.మా. 3ఆ – 147ప
5. శ్రీ.కా.మా. 3ఆ – 180ప 6. శ్రీ.కా.మా. 1ఆ – 5ప
7. శ్రీ.కా.మా. 4ఆ – 13ప

యామె యాచర్యను సమర్థించినాఁడు. ఆ కమనీయ శైశవము నప్పటినుండియు వార ధర్మవిద్యాకుశలత్వ మాత్మజల కచ్చుపడవలెనంచు। నామె యట్టిపాటలు పాడి, పాట్లు బడినది, ఇంటి గోడలపై వ్రాయించిన వెల్లమ వావివరుసలు లేని ప్రణయోదంతముల చిత్రములే.[1] కామశాస్త్రములను సంతరించి యుంచినది.

కుమార్తెలకా తల్లి గావించిన వారధర్మబోధ 26వ పద్యము మొదలు 34వ పద్యము వరకును గలదు. అంతావేశ్యమాత తన యనుభవమునంతను పంచినది. తల్లిమాటను పెడచెవిపెట్టిన వేశ్యాతనయలు వారధర్మము సేవగించి యానదించినారు.[2]

సామువేసు గుఁల పూర్వకథమునందు ధూర్జటి యొశృంగార ప్రసక్తి లేక తప్పలేదు. మొదట కాళిఁదసు నాగము కందర్పవైరి యాగ్రహమునకు గురియై నప్పుడై విచారించు సందర్భమున గలదు ఆ యావేదనము యథార్థముగా కవి ధూర్జటి వ్యక్తిత్వమునకు ప్రతిరూపమా యనదగియున్నది. కామినుల వీడనోపని కాముకులకు, వారి కామితములమీఁది దృష్టి వారివలన గల్గు సౌఖ్యములాదిగ గలవి, పరమేశ్వరుని సేవ కెట్లాఁటంకములో, భంజకములో నిరూపించినాఁడు

తారాచలారోహణారంభమునకు బ్రత్యాహారూపములు పయోధర
ములు

శంకరపదపద్మ సందర్శనాంతరా, యనిధానములు కటాక్షాంచలములు
అభవసామీప్యనిత్యానంద విఘ్నహేతువు లవియోగ సంతోషలీల
లంగజవిమతాంగ సంగభంగాదికా, రణములు దృఢపరిరంభణములు[3]

[illegible] గౌరీమహేశుల యత్యంతవయుంచినములొచ్చి, హాస్తము ప్రమథుల [illegible] నప్పుడైనాఁడు. గౌరీమహేశుల ఏకాంతస్వనమును వలుకనప్పుడు, [illegible] శృంగారము [illegible] గ్రుమ్మరింపక తప్పదు.

[illegible]విధాలింగనాభంగుర క్రీడల, బింబోష్ఠచుంబనాడంబరముల
బంధసంధాన విభ్రమ విశేషంబులఁ గేళీపరిశ్రమ లాలనములఁ
సరభసరతిపుర్మిజలహారాంబుదములఁ దాంబూలచర్వణాదానములను.[4]

---

1. శ్రీ.కా.మా. 4ఆ - 14వ
2. శ్రీ.కా.మా. 4ఆ - 40వ
3. ,, 3ఆ - 168వ
4. ,, 4ఆ - 167వ

ఈవిధముగా ప్రబంధమున కవి ధూర్జటి శృంగారరాసిక్యము పాత్రలపాటున, సన్ని వేశములచాటున వ్యక్తమగుచున్నది, ఇక శతకమున స్పష్టముగ, స్వానుభవమును చూడవచ్చును.

> కాయల్గాచె వధూనఖాగ్రములచేఁగాయంబు, వక్షోజముల్
> రాయన్ రాపడె రొమ్ము, మన్మథవిహారక్లేశ విభ్రాంతిచే
> ప్రాయంబాయెను బట్టగట్టెఁదల చెప్పన్ రోఁత సంసార మేఁ
> జేయంజాల విరక్తుఁజేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా.

ఈపద్యమే ధూర్జటి శృంగారరాసిక్యమునకుఁదలమానికమనఁదగినది. జీవితాను భవసారమునంతటి నీ పద్యములో కొలపోసినాఁడు కవి. శృంగారానుభూతి ముదురు పాకముగఁబడిన వెనుక, తలబట్టగట్టిన తరువాత బలికిన దీపద్యము. శృంగా రానుభూతులకు సాహిరములగు చిన్నెలు, హాయనినుచ్చలుగా మిగిలిపోయినవి. మన్మథ విహారము వలన గలిగిన క్లేశములు తలఁపునకు వచ్చునరికి వయస్సు మళ్లినది. సంసారమునెడల రోఁతము గల్గినది, ఇష్టముగదాయని తీపిపదార్థమెంతని తినగలము. కొంతమేర పోపునప్పటికి వెగటు కలుగక మానదు. అట్టిదే యిచ్చటి ధూర్జటి జీవితమందలి శృంగారానుభూతి కొలఁదులు. వయస్సు మళ్ళిన మనస్సు మళ్లలేదు కాబోలు.

> రోసీరోయదు కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్
> బాసీపాయదు పుత్రమిత్రజనసంపద్భ్రాంతి, వాంఛాలతల్
> కోసీకోయదు నా మనంబకట నీకుంబ్రీతిగా సత్క్రియల్
> చేసీచేయదు దీనిత్రుళ్లఁడపవే శ్రీకాళహస్తీశ్వరా.

రోఁత కలిగినను, కామినీజనులు సౌఖ్యములనుండి మనస్సు పూర్తిగా త్రెంచుకొని బయటపడజాలకున్నది. అట్లే దారపుత్రాదులయందును, సంపదయందును కోరికలు పూర్తిగా నశింపలేదు. భగవంతునకుఁ బ్రీతి గొల్పునట్లు సత్కార్యములను మనః పూర్వకముగా పూర్తి చేయుటలేదు. అనగా ధూర్జటి మనఃస్థితి డోలాందోళితముగా నున్నది. ప్రపంచమునుండి బయలుపడుటకు తలఁపు మాత్రము కలిగినది కాని, త్రెంచు కొని యీవలఁబడు బలము మాత్రమింకను చేకూరలేదని యిందువలనఁ దెలియగలము.

ఇంకొక తావున రాజద్వారసౌఖ్యము వలన, రతిరాజద్వార సౌఖ్యములవలన తృప్తి బొంది, చాలినంతగా సంతోషించితిననియు, బ్రహ్మపదరాజద్వార సౌఖ్యము నీయవలసిన దనియు పరమేశ్వరుని ప్రార్థించినాడు.[1]

రాజయోగదృష్టి యేర్పడినతరువాత దృష్టి నురలలేదు.

**మలభూయిష్ఠ మనోజధామము సుషుమ్నాద్వారమో? యారు కుం**
**డలియో? పాదకరాక్షియుగమ్ములు షట్కంజంబులో? మోము డా**
**జలజంబో? నిటలంబు చంద్రకళయో? సంగంబు యోగంబొ? గా**
**సిలి సేవింతురు కాంతలన్ భువి జనుల్ శ్రీకాళహస్తీశ్వరా.**

యని స్త్రీయవయవము లెప్పటికిని, సుషుమ్నద్వారము, కుండలి, షట్కంజములు, జలజము చంద్రకళ, లు కాఁజాలవు. సంయోగము యోగము కానేరదు ఇచ్చటి పదములందు శాస్త్రరహస్యములు కలవు. వామాచారములందు స్త్రీయవయవముల నారాధించుట కలదు. అన్నగా నిటకవి ధూర్జటి వామాచార సంప్రదాయమును నిరసించుటయు తెలియగలము.

అరిషడ్వర్గమును జయించుట కష్టమనుచు

'అమర స్త్రీల రమించినం జెడదు మోహంబింతయు'[2] నని కామాంధ్యమును తేర్కొనియున్నాడు.

— o —

1. శ్రీ.కా.శ. 62ప    2. శ్రీ.కా.శ. 42ప

శివభక్తి

తన 'శివభక్తి కావ్యసరణిం గడు ధన్యతఁబొందనవ్యభాషా కతథా నిగుంభన రసస్థితి నొప్పఁదలిర్చ జెప్పెదఁ' ధూర్జటి ప్రబంధము మఱి శివభక్తినుయమై, శివభక్తి పారమ్యము గలిగినది కాక యెల్లుండును 'శ్రీకాళహస్తీశ్వర చరణకమల సేవాపరాయణుఁ' డయిన ధూర్జటి గ్రహించిన కథా ప్రణాళికయే స్వామి మహిమానువర్ణనము, శివభక్తుల చరిత్రకథనము. ఇతివృత్త నిర్వహణముఁ గూర్చిన 'కథాసంవిధానము' ప్రకరణమున నీ కవీంద్రుని శివభక్తి కావ్యమున పొందిన పారమ్యము నుగ్గడించి యుంటిమి. కావ్యారంభమునందలి ఎత్తుగడ పద్యమునుండి కావ్యాంతపద్యమువఱకు నాతని శివభక్తి విశ్వరూపవర్ణనము చేసియుంటిమి.

శ్రీవిద్యానిధియై, మహామహిమచేఁ జెన్నై, వశిష్ఠాజ లూ
తావాతాశన సామజాటవిక గోత్రాదేవ సత్కార రా
జీవాక్షీయుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యా
ర్యావామాంగము, దివ్యలింగము మదీయాభీష్టము ల్సల్పెడున్.[1-1]

శివుని శ్రీవిద్యాధిష్ఠానదైవముగాఁ బల్కి శ్రీవిద్యోపాసకుఁడైన ధూర్జటి అద్వైత విద్యాగోష్ఠిని విచారించి, వాగర్థంబులు, శ్రోతృవక్తలు, జగద్వంద్యుండునయిన శ్రీయీశ్వరుని[1] తన ప్రబంధాధిపతిగా నిశ్చయించి శివాద్వైతిగా సాక్షాత్కరించినాఁడు. కథారంభమునకు భిత్తికయైన పురవర్ణనమును శివభావనానుయముగా నొనర్చి ధూర్జటి తన శివభక్తికి కావ్యత్వమొసగినాఁడు. కాళహస్తిపురమును శివసాయుజ్యభూమిగా వర్ణించియున్నాఁడు.[2]

దాసి రోదనమును శివోపచారములుగా రూపించుట 'ఓ యను రోదనం బోంకార మనువుగా గనుగవనీరు మజ్జనముగాగ[3]....' యను పద్యమున చూడగలము.

చంద్రోదయవర్ణనము శివపరముగాఁజేయుచు 'ఉదయగ్రావము పానవట్ట మభిషేకోదప్రవాహంబు....తమోదూరసౌఖ్యదమై శీతగభస్తి బింబ శివలింగంబొప్పె బ్రాచీ దిశన్'[4] అనుట కవీశుని శివపారమ్యతనువ్యక్తీకరించును.

---

1. శ్రీ.కా.మా. 1ఆ - 7ప. 2. శ్రీ కా.మా. 1ఆ - 17
3. శ్రీ.కా.మా 1ఆ - 51ప 4. శ్రీ.కా.మా 2ఆ - 133ప

తిన్నని కడుపున నుందుకొనిన తండె దౌహృదమును శివోపహానముగ దీర్చి శివభక్తి మును పైన శిశువునామె కనినదనినాఁడు.

'భసితాంగరాగశోభావిలాసంబులోఁ, బ్రబలివచ్చు నానన పాండుగరిమ'[1]
గర్భముసంమున్న తనయుఁడీశుఁడై ప్రకాశింపగలఁ' డని తెలుపురీతి యది.

...శైలోపకంఠనిర్ఝర సైకతస్థలి శివుని దర్శింపఁ గాంక్షించెనబల.[2]
నీలగళుని యర్చనము సేయఁజింతించినదామె

పుట్టిన తిన్నఁడు 'జ్ఞానప్రసూనకలికా, జాని పదధ్యాన పరమసౌఖ్య సుఖసుప్తుండైన గతిఁ గనుదెఱవం, గా నేరకయుండెనట', గొన్ని నాళ్ళు.
కొండదరిలోనున్న లింగముకడకు బొమ్మని, తిన్ననికి కలలోఁగన్పించిన శివమూర్తి పర్ణనమునఁ[3] జక్కని జంగమరూపసాక్షాత్కారము గలదు. శివునివదలి రా ననిన శివదీక్ష యూరిని ముగ్ధభక్తిని చెల్పుచున్నది.

నాకుం జుట్టము దల్లిదండ్రులుఁ జెలుల్ నాథుండు నీ దైవమే
మీకిచ్చోఁ బనిలేదు కస్తిపడఁగా మీపల్లెకుం బొండు కా
రాకు ర్రంబులు సేసినం గదలి నే రా నిచ్చటం బ్రాణముల్
బోకార్తుం గుడి నాదు వేలుపునకై, బొంకన్నిజం బింతయున్. 3_82

ఎక్కువసకొఱకుఁ బ్రాణములైన నిత్తుననినాఁడు గాని వీడిరాననినంత శివభక్తి[4] తిన్ననిది. అట్లే హరద్విజుఁడును శివసదనమెంగిలి నుంగలమొనర్చిన దుష్టుని చెల్పుచున్న 'హాయగ్గపట్టి ప్రాణము' విడుతుననినాఁడు.[5]
ప్రత్యక్షమైన పరమేశ్వరుని, తిన్నఁడు, హరద్విజులు చేసిన, స్తుతి[6] ధూర్జటి శివదర్శనముఁ జేయు నతియే.

మీ పూర్ణంబగు దివ్యతేజము జగన్మిథ్యాత్మకత్వ ప్రతి
ష్ఠా పారీణతఁ జూపి, మమ్ముఁ బొదువం, జాంచల్యదూరంబులై
చూపుం జిత్తము మిన్నకున్నయవి, యచ్చోఁ బాసె దేహంబుపైఁ
దీపుం జీఁకటి యింతకంటె వరమేదీ యిట్లు మన్నింపవే. 3_123

---

1. శ్రీ.కా.మా. 3ఆ _ 22ప, 2. శ్రీ.కా.మా 3ఆ_24ప
3. ,, 3ఆ _ 55ప, 4. ,, 3ఆ_80,81,82ప
5. ,, 3ఆ _ 101ప, 6. ,, 3ఆ123,124,125,126,127ప

జగము 'ల నంతరాత్మయును, సాక్షియు నీవనుచు న్నిజంబుగా
నిగమము లాడఁగా వినియు నేఁడితరంబుగ మా కభీప్సితం
బగువర మెట్లు వేడఁగలమయ్య? భవన్మయమైన పూర్ణ చి
ద్గగనములో మముంగలిపి, క్రమ్మఱ బుట్టెడు బాధ మాన్పవే.[3-124]

సానికూతులు శివభక్తి తనువులెత్తిన వారె. వారి శైశవమంతయు శైవనుయమె. వారి బాల్యక్రీడలన్నియు శివాంకితములె. శైశవనుంతరించి వయస్సు పెరుగుకొలఁదియు వారి హృదయము శాంభవంబైన తేజముతో నిండిపోయినది. సానికూఁతుల రూప లావణ్యవర్ణనమును కూడ ధూర్జటి శివపరముగాఁగావించినాఁడు.

**ముట్టని చిత్తజాతుశరముల్ వెలిగన్నులు......**

ఉలిముట్టని లింగము లౌట చిత్రమే.[1]
చీఁకటి రెండు పర్యాయములు శంకరునితోఁబోల్పఁబడినది.

శంకాతమఃపరంపర, శంకరచిద్రహితమానసంబును బోలెన్.[2]
'వామాంగ భామినీ శ్యామధామాళియు...[3]

అను పద్యమున చీఁకటికిఁబోడుగాగ వెనుకనేతెంచు ఘాతేశువిధము దనరఁ జంద్రుఁడు దయాద్రిపై నొప్పినట్లు చంద్రుని శివుని శారీరక రూపముతో నుపమించినాఁడు కవి. వేశ్యాతనయలు శివదర్శనమునఁబొందిన అనుభూతియు,[4] పూర్వోక్తముగా ధూర్జటి యనుభూతికి వచ్చినట్టిదియే యని మనమెంచనగును

యాదవభూపతి శ్రీకాళహస్తి తిన్నని పూర్వజన్మములనుగూర్చి ప్రశ్నచేయుచు శివభక్తి ప్రాశస్త్యమును నుగ్గడించినాఁడు.

'సకలవేదామృత జలధి గండూసించి, డప్పి నంగేత్తువుల్ చప్పి చప్పి
నిగమార్థధనమాత్మ జగతి నిక్షేపించి,న్యాయఫలంబులు నమలి నమలి

1. శ్రీ.కా.మా 4అ – 47ప 2. శ్రీ.కా.మా. 4అ – 88,
3. ,, 4అ – 90ప 4. ,, 4అ – 122,124ప
5. శ్రీ.కా.మా. – 4అ 137ప

తపములాచరించి, పుణ్యతీర్థములు తిరిగి వ్రతములన్నియు జేసినవారు శివప్రియుఁగరు. కాటని పూర్వజన్మకథనమునఁ గైలాసవర్ణనము విపులముగాఁ గావింపబడినది.

గంధర్వ కామినీ గానంబు విని తల, లెత్తి యూడెను భుజగేంద్రములును
భుజగఫణారత్నముల దీధితులఁ బ్రకాశించు మహస్సమాశ్లిష్ట గుహాలు
గుహాల ప్రతిధ్వనుల్ ఘుమఘుమయనఁ బాఱు, నిర్మలోదకములనిర్ఝరము లు
నిర్ఝరతటముల నిరుపాధికసమాధి, యోగనిద్రాకలితులందు మునులు...[1]

ముక్తపదగ్రస్తాలంకారముచే నొప్పు భావస్ఫూర్తి గల పద్యమిది. కాటని పూర్వజన్మ కథనమును భుజగేంద్రములతోఁ బ్రారంభించుటయందలి యౌచితీపాలనము సగ్రహించుచుంటిమి. ఆ చల్లని తెల్లకొండయందు తిరుగాడు తెల్లని వృషభేంద్రుని గుర్తించుట కష్టమని పల్కుట చమత్కారము. ఆ కొండకంతటికి తెల్లఁదనమునకుఁ బలికిన కారణము లత్యంత సుందరములు, సహజములుగానున్నవి. తెల్లనిత్రాచుహారములు, మన్మథుని బుగ్గిచేసినబూది, అలంకారముగా వెలుఁగుచంద్రుఁడు, మూఁడవకంటినుండి వెలుగొందు అగ్నితేజము[2] లా కొండను తెల్లఁదనముతో ముంచెత్తినవి.

పారదరాశి చంచలత బాసి వసించెనొ, శైలమై సుధా
నీరధి నిల్చెనో, కుముదినీపతికాంతి ఘనీభవించెనో
నా రజతాద్రి, ముక్తిలలనామణికేళిసుధాంశుకాంతి రా
జీరచితోరు సౌధగతిఁ జెల్వెసఁగు న్మునిసిద్ధసేవ్యమై. 4-156

ఆ కొండతెలుపును పోల్చుటకు గ్రహించిన యుత్ప్రేక్షలు సమృద్ధిఁగలిగించుచున్నవి.

ప్రబంధమున గ్రహించిన శివభక్తుల గాధలన్నియు వీరశైవులవి. సాలె, పాము, ఏనుఁగు, తిన్నఁడు, శివగోపరుఁడను హరద్విజులను వారరెల్లరు శివునికొఱకు, శివపూజయందు తామాత్మార్పణ గావించుకొన సిద్ధపడినవారె. కాని ధూర్జటి వీరశైవుఁడు కాఁ

1. శ్రీ.కా.మా 4ఆ – 152ప
2. శ్రీ.కా.మా. 4ఆ – 153ప

నియు, శివాద్వైతియనియు, మతసును ప్రకరణమున స్పష్టముగ నిర్ధారించియుంటిమి. విష్ణుద్వేష రాహిత్యము, విష్ణుప్రశంసచేయుట,[1] శివకేశవాభేదము పల్కుట,[2] లక్ష్మీనారాయణులతో పలిదంద్రులను దోల్చుకొనుట,[3] లాతని వీరశైవుడు కాడనియు, శ్రీవిద్యోపాసకుడు, బ్రహ్మవిద్యాసాధకుడు, రాజయోగఫలమూనించినవాడనియు ప్రబంధము సాక్ష్యమిచ్చుచున్నది.

శ్రీకాళహస్తీశ్వరుని నామ మాహాత్మ్యమును గొనియాడుట, స్వామిసేవ వలన గలుగుఫలము, స్వామియనుగ్రహముచే గోరదగు వరము లననంశములను ప్రబంధమున వశిష్ఠుడు, లూత, పాము, నేనుగులు, తిన్నడు హరద్విజులు, నత్కీరుడు, వేశ్యాతనయలు, అర్జునులు స్వామిదర్శనమునపొందిన యనుభూతులు, కోరినకోరికలు, కావించిన స్తుతులు ధూర్జటి వ్యక్తిగతానుభూతులకే కావ్యతమిచ్చె ననిపించురీతిన్ని నడచినవి. తొలుతనే కావ్యారంభము నాదేశించుచు ధూర్జటి గురూత్తముడు, దేశికోత్తముడగు సీశ్వరుడు "నీ శివభక్తి కావ్యసరణిం గడుధన్యతఁబొందు" నట్లు రచింపుమని నాడు గదా! కాన కథానందర్భమందలి ప్రత్యంశమున తన శివభక్తికి కావ్యత్వమిచ్చి ధన్యుడైనాడు ధూర్జటి కవీంద్రుడు.

శతకమునందు కవీశుడు శివుని నామనుహత్త్వను, సేవాఫలములను గొనియాడి ముక్తిరమణీహృదయేశత్వము నపేక్షించినాడు. సందర్భానుగుణముగ ధూర్జటి పూర్వ శివభక్తస్మరణమును తన రెండుకృతులందును గానించియుండెను.

**శి వ నా మ మా హా త్మ్య ము ;**

**పవిపుష్పంబగు, నగ్నిమంచగు, నకూపారంబు భూమీస్థలం**
**బవు, శత్రుం డతిమిత్రుఁడౌ, విషము దివ్యాహారమౌ నెన్నఁగా**
**నవనీమండలి లోపలన్ శివశివేత్యాభాషణోల్లాసికిన్**
**శివ! నీనామము సర్వవశ్యకరమౌ శ్రీకాళహస్తీశ్వరా,**

సర్వవశకరమగు శివనామము ఓంకారము. అది అకార, ఉకార, మకారయుక్తమైనది. ఆ యోంకారనామ మహిమచే నాదబిందుల్లుఖశ్రీ రంజిల్లును.[4] పాతకమూల శైలమున నానామము నిప్పై దహించివేయును ఆ పవిత్రనామ శ్రవణమాత్రమున మానవులు

---

1. శ్రీ.కా.మా 1ఆ - 14ప, 2ఆ128ప 2. శ్రీ.కా.మా 2ఆ - 132ప
3. అశ్వాసాంతములు 4. శ్రీకా.శ 94ప

అంతకభుజాదర్పోద్ధత క్లేశములనుండి విముక్తి బొందుదురు[1] ఈశ్వరుని కల్యాణ నామోచ్చారణముచేయు సత్తమోత్తములను గ్రహదోషములు, దుర్నిమిత్తములు బాధింపజాలవు.[2]

శివనామమహత్త్వమెంత బలీయమైనదో వర్ణించుపద్యమున మహోగ్రమృత్యుముఖ దంష్ట్రల బారినుండి రక్షసేయఁగల కాలద్వారకవాటబంధమని పలికినాఁడు కవి

కాలద్వారకవాట బంధనము, దుష్కాలప్రమాణక్రియా
లీలాజాలక చిత్రగుప్తముఖ వల్మీకోగ్ర జిహ్వాద్భుత
వ్యాళవ్యాళవిరోధి మృత్యుముఖ దంష్ట్రాహార్య వజ్రంబు ది
క్చేలాలంకృత! నీదు నామ మరయన్ శ్రీ కాళహస్తీశ్వరా

శివసేవాఫలము : పరమేశ్వరు నారాధించి సేవించినకలుగు ఫలములను ధూర్జటి పలుతీరులఁబలికియున్నాఁడు.

నీ కారుణ్యముఁగల్గినట్టి నరుఁడే నీచాలయంబుం జొరం
డే కార్పణ్యపుమాటలాడ నటుగాఁ డెవ్వారితో వేషముల్
గైకోఁడే మతముల్భజింపఁ డిల నే కష్టప్రకారంబులన్
జీకాకై చెడిపోఁడు జీవనదశన్ శ్రీ కాళహస్తీశ్వరా.

ఈశ్వరానుగ్రహము గలవాఁడు పరిగతులంటఁడు. ఇతర మత, దైవముల వంక కైనను జూడఁడు. వానికి దైన్యముండదు. కష్టములతో జీకాకు చెందఁడు.

ఇతరదైవములకు భోగములెన్ని నివేదించినను పొందలేని పుణ్యాతిశయము పరమశివుని కొక్కబిల్వపత్రమును భక్తితో నర్పించిన లభింపఁగలదు.[3] తలమీద నీటిను ప్రసాదము, అలికస్థానముపై బూది, గళప్రదేశమున దండ, నాసికకుప గంధ ప్రసారము, లోపల నైవేద్యములను చేర్చు భక్తుఁడు భర్గున కత్యంత ప్రీతిపాత్రుండై వెలికాడై రజతగిరిపై విహరింపఁగలఁడు[4] పరమేశ్వర పాదారవిందముల సర్పించు హస్తులకు తురగ గజాదులు, విలాసినీ వస్త్రవ్రాత భూషాకలాపములు, సంతానము లాదిగాగల సంపదలు కష్టసాధ్యములు కావు.[5] భక్తి ప్రపత్తిచే, పుడిపెడునీరు, పుష్ప

1. శ్రీకా.శ 10ప 2. శ్రీకా.శ 29ప 3. శ్రీకా.శ. 84ప
4. ,, 54ప 5. ,, 105ప

యొక్కదానిని అర్చించిన నరుఁడు ధన్యుఁడై, యిహలోకమునను గంగానదిని, చంద్రఖండమును దర్శింపఁగలఁడు.[1] ఈశ్వరుని సేవించిన వానికిఁగలుగు పుణ్యలోకములు, సప్తసంతానములు పొందినవానికిఁగలుగనేరవు[2]. భక్తితోఁగూడినపూజ ముఖ్యముగాని భగవంతునకు పూజావిధానమున నుచ్చనీచములులేవు.

దొప్పం దెంగిలి దెచ్చి యిచ్చినను గండూషాంబుధారావళిన్
దొప్పం దోఁగిన, చెప్పుగాలఁదలపై ద్రొక్కంగ నర్హైనఁ గ
న్నప్పం బ్రాఁతుఁ జేసితింతటికి సన్మానంబు దీ దీపింపఁగా
చెప్పన్నేరము నీ విహారమహిమల్ శ్రీ కాళహస్తీశ్వరా,

ఈ పద్యమున కన్నప్పయను శివభక్తుని స్మరియించినాఁడు ధూర్జటి.[3]

పూర్వశివభక్త స్మరణము ; శతకమున, ఇతర శివభక్తులతోబాటు తనగ్రంథమందలి శివభక్తులనుకూడ పలుమారులు స్మరియించినాఁడు కవీంద్రుఁడు. ప్రబంధమునను, పూర్వశివభక్తుల స్మరణముగలదు. తిన్ననిపూజ సంగీకరించిన యీశ్వరు నవహేళన చేయుచు శివగోచరుఁడను హరద్విజుఁడు శివునికి పూర్వశివభక్తులుచేసిన వ్యవహారేతరమార్గ పూజల నంగీకరించిన విషయమును గుర్తునకుఁదెచ్చును.

ప్రాఁతలు మీఁదఁగప్పికఁగృప మతినోర్చితి, నీచు పొత్తునన్
బ్రాఁతిమెయిన్ మెసింగితివి భక్తుఁడు కుంటెనబంపఁ బోతి వై
పూఁత యొనర్చుకొంటి శివభూతి, గపాలమునం భుజించి తీ
రోఁతలు పెక్కులుండ నివి రోయదువే? యిఁక భక్తవత్సలా,[4]

ఈశ్వరు నే రూపముగా దలఁపవలయునో తెలియకున్నదనుచు, ధూర్జటి పూర్వభక్తులు పరమేశ్వరు నే యే రూపముల దలఁచి దర్శింపఁగలిగెనో స్మరించుకొనినాఁడు. మోకాలు, స్త్రీచన్ను, కుంచము, మేకపెంటికలుగా భావించి, యా యీశ్వరుని సేవించినవారున్నారు. కొందఱీరూపములందే యీశ్వరునిచే సేవలుచేయించుకొనినవారుఁగలరు. తనయింటిని కావలికాయించుకొనినాఁడు భక్తుఁడొకఁడు. మఱియొకాతఁడు స్త్రీ కొఱకు కుంటెన పంపించినాఁడు. ఎంగిలిచ్చి తినకున్న నొప్పనన్నవాఁడింకొకభక్తుఁడు, ఈశ్వరుని సేవించుట

---

1. శ్రీ.కా.శ 106 2. శ్రీ.కా.మా 3ఆ - 112
3. ,, 118(అకాడమి) 4. ,, 3ఆ - 100

పరమేశ్వరునర్థించినది ధూర్జటి నిర్గుణధ్యాన సంధాన నిరుపమానసౌఖ్యసంపత్తి, మనో విషయాహారానందమై, సంపూర్ణాద్యంతంబైన రహస్యముండెలిపి పాశానీకముగోయు మని దక్షిణామూర్తి నర్థించిన వశిష్ఠుని ప్రార్థన ధూర్జటి హృదయమునుండి వెలువడి నదియే కాని యన్యముకాదు.

పురవర్ణనమున చాతుర్వర్ణ్యముల వారిని రాజయోగరతులుగా, కామినీ జనులను యోగిజనులుగా, గంధగజములను అవధూతలుగా, చిత్రించుటయందు కవి యాధ్యాత్మిక దృష్టిని గమనింతుము.

తిన్నని బాల్యమును వర్ణించుచు కవి తన భవపరాఙ్ముఖతను మఱియొకమారు స్పష్టపరచెను.

శివభక్తిరహితమ్మై చెడిరె జగంబని, సర్వేశట్లో యన్న నవ్వుహాగె
ధృతిమోహబంధంబు తెగదన్నఁగతి ముద్దుటడుగు లెత్తి విడుల్చు
గాడఁ జొచ్చె

తిన్నని యొలయించుకపోయిన మాయావరాహము నుపమించుటయందు కవీంద్రుని వైరాగ్యభావము, అధ్యాత్మిక ధార మెఱయుచున్నవి.

అందినట్లుండి చేరవచ్చినంతనే పరుగులిడుచున్న యా వరాహము తన్నాశాలం ద్రెప్పి పాశవిముక్తుఁడగు యోగిభావన యదృచ్ఛావృత్తి వర్తించు చుండెనట యని.

నత్కీరుఁడు గాంచిన సరోవరమును బ్రహ్మతో నుపమించుట, సంసారముతో నుపమించుటయును ధూర్జటి కవీంద్రుని రాజయోగవిద్యాసక్తి ఆధ్యాత్మికభావసంపత్తిని వ్యక్తము చేయును.

హంస సంసదభీష్టవిహారహేతువై బహుళాదిక హృద్యమై యప్రమేయ
మగుచు నిర్ద్వంద్వమై పంకజాకరంబు పోలిచె బ్రహ్మంబు తెఱగున

తమ్ముల రజోవికారము, గ్రమ్ముదువాసనలు దళముగా నెసఁగెడు కో
కమ్ములు, నూర్పులు, జలగంగ, దమ్మికొలను భవముఁబోలెఁ దద్దయు
నొప్పెన్

వేశ్యాతనయలు శిశువులుగా నుయ్యేలతొట్లవంక జూచుటను కవి తారకయోగమార్గ దర్శన రతులవలె చూచుచున్నారని పల్కుటయు నిట్టిదే.

ప్రబంధమునఁబరిశీలించిన పై సందర్భములన్నియుఁ బాత్రలకుఁ జెందినవనియు నాయా కోరికలు, క్రీడలు నాయా పాత్రోచితములయినవని తలంచినను పుర వర్ణనను భాగమునందలి యూహమును, నత్కీరుఁడు గాంచిన సరోవరమందలి ధోరణియు స్పష్టముగా ధూర్జటి కవీంద్రునివే యని చెప్పఁదగును. ఇఁక శతకమున జగత్తునుగూర్చి, జీవితమునుగూర్చి, జీవిస్వభావమునుగూర్చి, మృత్యువునుగూర్చి, చిత్సుఖానుభవమును గూర్చి కవి వెలిబుచ్చిన యభిప్రాయము లాతని వేదనాదూయ మానమగు మానస సరోవరమున విహరించు రాజహంసలేయగును.

తరఁగల్ పిప్పల పత్రముల్ మెఱుఁగు టద్దంబుల్ మహాదీపముల్
కరికర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోత కీటప్రభల్ . . .

చనువారింగని యేడ్చువారు జముఁడా సత్యంబుగా నెత్తు నే
మనుమానంబిఁక లేదు నమ్ముమని తారావేళ రేపవన్ . . .

లోకుల యవివేకము నిట్లీసడించి, జీవితమును వేపచెట్టుతోఁబోల్చినాఁడు ధూర్జటి.

విత్తజ్ఞానము, పాదుచిత్తము, భవావేశంబురత్నాంబువుల్
మత్తత్వంబు తిదంకురం బన్నృతముల్ మాతాకు లత్యాంత . . .

బంధక్లేశదోషములను ఖండింపక యీశ్వరుని గానలేరనుచు, తాంతంద్రులుపెద్దలు చావగాఁజూచియు బావకతప్పదని, సంపదల్ పుత్రమిత్రకళత్రాదులనిత్యమనియు ఎఱుఁగలేకున్నా రీ మూఢజనులనియు, లోకులను చూచిజాలిచెందినాఁడు కవి. శతకమందలి యాతని యాక్రోశము, ఆవేదన, నివేదనలు బరిశీలించిన కవీంద్రుని భవపరాఙ్ముఖత, వైరాగ్యము, మోక్షాపేక్షలు వేవిధముల గోచరింపఁగలదు.

ఆశాకంబులఁజుట్టిత్రిప్పక, సంసారపుఁజిమ్మంజీఁకటిని ముంపక సంసృతి విషాదాంభోధిదాటించి, తనువున్నంతకాలము గుహారోగ దీపన దుఃఖాదుల బొందకుండ తన శరీరపుఁద్రుళిణఁచి, యీశ్వరుని నమ్మినందులకు తన నవిచ్ఛిన్నానంద సుఖాబ్ధిఁదేల్చు మని ధూర్జటికవి ధూర్జటికి విన్నవించుకొనినాఁడు. బ్రహ్మవిద్యాభిషనెడి క్రమ్మఱ

టుప్పెడు బాధ మాన్పి భగవన్మయమైన పూర్ణచిద్గగనములోఁగలిపి, నిత్యసుఖము నిమ్మనునది ధూర్జటి నివేదనము దుఃఖావాసానందమైన సంసారమును వర్ణింపగా నే సుఖముగలుగునో తనకాసుఖమునిమ్మని వేడుకొనినాఁడు కవీంద్రుడు. ధూర్జటి కోరినది తాదాత్మ్యము. అతడు వర్ణించినది సాయుజ్యమందిన శివభక్తులనే, తామకోరినదియు నా సాయుజ్యమే.

## లోకజ్ఞత : శాస్త్రజ్ఞత :

"శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్

కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే"—కావ్యప్రకాశము పలికిన యీ కావ్యహేతువులు ప్రామాణికముగాఁబరిగ్రహింపఁదగినవి. శక్తి, నిపుణత, అభ్యాసమను మూఁడును కావ్యనిర్మాణమునకు వలసిన సామగ్రి. నవనోన్మేషమైన ప్రజ్ఞయే ప్రతిభ యనఁబడును. అదియే శక్తి. తాము వసించు లోకములోని వస్తువులను చరాచరములను, మానవులను చక్కఁగా పరిశీలించుట, వానివాని ప్రకృతులను ప్రవృత్తులను బరికించుటవలనను, కవికి నిపుణత కలుగును. ఇదియే వ్యుత్పత్తి. దీనినే పాండిత్యమనియు నందురు. విద్వత్కవియే కవి యనుట కలదుగదా! ప్రతిభకు వ్యుత్పత్తి బలిమి కలిమిఁగూర్చును. కావ్యనిర్మాణమునలన తన పైదుష్యమును బదర్శించును. కావ్యాంగములైన వ్యాకరణ చ్ఛందోలంకారములందేకాక, కవి తనకుఁగల యితర వేద వేదాంగ పురాణేతిహాసములందును, జ్యోతిష, వైద్య, ఖగోళశాస్త్రాదులందును గల పరిచయ ప్రవేశములు, పాండిత్య శౌండీర్యములను కథాసందర్భములం దిమిడిపోవు నట్లు ప్రదర్శించుటయు కవి ప్రతిభకుఁదారకాణ.

**లోకజ్ఞత :** వివిధజాతులయు, మతములయు, ఆచారవ్యవహారములు, వేషభాషలు కవికి రెండువిధములుగాఁబరిచయమగుట కవకాశముగలదు. వానితో ప్రత్యక్ష పరిచయము గలిగి యుండవచ్చును. పూర్వగ్రంథములవలనగాని తెలిసియుండవచ్చును. సర్వ సాధారణముగా మునిపల్లెలు, బోయవీళ్ళు, పురవీట్లు, వేశ్యాతనయలు, వేఁట లిత్యాదిగా గలవాని వర్ణనములం దిట్టి పరిచయము రెండవరీతికి జెందినదై యుండును. ఆయా వానితోఁ బరిచయముఁ గవికునకు సందర్భము, అవకాశములనుబట్టి ప్రత్యక్షపరిచయము గూడ నుండఁవచ్చును.

గుంటల్, కనుమూసి గంతలు, సంసారాలలోనైన ఖేలనము' లాడినట్లుపల్కియున్నాఁడు. గుజ్జనగూండ్లు అప్పనగండ్లు, గిరిగింజలు, బొమ్మపెండ్లిండ్లు సూరన్న ధూర్జటి కృతులందు సహజసిద్ధముగా నున్నటివే. అనగా నాకాలమునందలి యాటలవియన్నమాట. వేశ్యాతనయల బాల్యమున బొమ్మలపెండ్లిండ్లు, గుజ్జనగూళ్ళు ధూర్జటి వర్ణించినాఁడు. అట్లే తిన్నఁడు తప్పటడుగులను పెట్టుటను వర్ణించుచు ధూర్జటి 'వసుంధరాస్థలమునందు విశ్వపతి తత్త్వమును మణిపెదకురీతి' యని యుపమించుట గూఢమణిసికతా న్యాయమును దలపించుచున్నది. ఇసుకకుప్పలో మణినిదాచి, కనుగొనుట, ఈయాటను గిరికాదేవియు నాడినది. 'వెలఁదుల్ గూనును గూఢరత్న సికతాన్వేషణంబుఁ' గావించినదఁట.

తిన్ననికిఁదల్లిగావించిన యలంకారము లిట్టివే. కోయజాతికుఱ్ఱ దెట్లుండునో, మన కీ పద్యము తెలుపుచున్నది. పసిపిల్లలకు తల్లి యెంతశ్రద్ధతోపోషణచేయునో, పిల్లల యందము లెట్లు తీర్చునో, తమపిల్లలకు దృష్టిదోషము బాలారిష్టములు కలుగకుండుటకు తాయెత్తులెట్లు కట్టుదురో ధూర్జటివర్ణించినాఁడు.

జలకంబార్చి, విభూతి పెట్టి, కటి గుంజాబీజసంకర్ణ సూ
ఖలబొందించి, మయూర పక్ష లతికా కాండంబులం జేసి ...

విభూతిపెట్టుట వారిశైవమతమును తెల్పుచుండగా, గుంజాబీజములను అడవిలో లభించు పూసలతోగూర్చిన మొలత్రాడు, నెమలిపింఛమునందలికాడతో గూడిన మెత్తని చక్కని కన్నులు, వారికీ లభ్యమగు వన్యవస్తువులను తెలియఁజేయుచున్నవి ఇది జాత్యుచితమైన యలంకారము.

'బంగారుమొలత్రాడు పట్టుదట్టి, సందిట తాయెత్తు సరిమువ్వగజ్జెలు' అన్న చిన్నికృష్ణుని యుటిదేకదా. కన్నులకు కాంతికలిగించునవి, అందము చేకూర్చునవి, ఆరోగ్యకరమైనవి కాటుక, విభూతి, తాయెత్తులు దృష్టి దోషము, గ్రహ పీడలు కలుగకుండఁ గట్టునవి ఈ వర్ణనములవలన ధూర్జటికిగల లోకపరిశీలనము తెలియగలదు. ఆయన తిన్నని బాల్యమున నాడుకొనిన యాటలు తిన్ననికి తల్లిచేసిన యలంకారము లనునవి కేవల యూహాజనితములుకాక, ప్రత్యక్ష పరిచయము వలనమాత్రమే చేయఁగలిగినవి.
బోయవేశ్యగుండవోవుచున్న ధూర్జటికి శబరకాంతలు కంటఁబడుట యసహ్యమేమియు కాదు. అతనికి రసికహృదయముఁగాన వారియాకవేషముల కా శృంగారస్ఫూర్తిగలిగినవి, కాని యాతనిచూపు

'మంచెలమీఁదనెక్కి, కటిమండలిఁజుట్టిన పాలుటాకు లిం
చించుక చంచలించి మరునిల్లు బయల్పడఁజేయఁబెటలక ...

తుండేటివల, పందివల, ఉరులు, ఉరిగోలలు, బోనులు, చిక్కములు, జిగురు గండెలు, తీపుదాళ్లు, సోద్రితాళ్లు, తలముళ్లు, తెరవేట, విడివేట, సివ్వంగులు, కృష్ణతురంగములు, ముంగిసలు, ఎద్దులు, ఓరణములు, సెలకట్టెలు, సాళువములు, గిద్దలు, వేసడంబులు, బూరేడు, కారుకోడి, కేంజంబు, కౌజు, కక్కెర, చింద మున్నగునవి,

ఈశ్వరున కిష్టమనుచు దిన్నడు పేర్కొనిన ఫలములు, వన్యపదార్థములు కాళహస్తి ప్రాంతమునందలివే. 'నివ్వరిప్రాలును, నోడిపిట్ట, కునుకుడ్రాలును, వెదురుబ్రాలును, నవర మేకములపాలును పుట్టతేనియ, పెరతేనె, పుట్టజున్ను, కోల్తేనె, నింజెట్లు సమర్పింతుననినాడు. 24 విధములైన పండ్లనుకూడ తెచ్చియిత్తుననినాడు. నేరేడుపండ్లు నెలయూటిపండ్లు, కొండమామిడిపండ్లు, దొండపండ్లు, పాలపండులు నెమ్మిపండులు, బరివంతపండులు, చిటిముటిపండ్లు కలివెపండులు, దొడివెండపండ్లు, తుమ్మికిపండ్లు, జానపండులు, గంగరేనుపండ్లు, వెలగపండ్లు, పుల్లవెలగపండులు, మామిపండ్లు, అంకెనపండ్లు, బలుసుపండ్లు, సీరపండ్లును, పిచ్చుకబీరపండ్లు, కొమ్మిపండ్లు, ఈతపండ్లు గొంజిపండ్లు, మేడిపండ్లును మొదలుగా.... ఈ పండ్లరాశియందు నేరేడిపండ్లు, దొండపండ్లు, పాలపండులు, జానపండులు, గంగరేగుపండ్లు, వెలగపండులు, ఈతపండ్లు, మేడిపండ్లు, నేఁటికిని పరిచయములోనున్నవే. మిగిలినవి యాప్రాంతమున నిప్పటికిని వ్యవహారములో నుండియుండవచ్చును, లేక నామాంతరములను పొందియుండవచ్చును, లేక యా జాతులే లేతపోయియుండవచ్చును.

కునుకులాపర్లు, బరపటల్, గోళ్ళగొండు, లల్లి బియ్యంబు, వెదురుబియ్యంబు, గొట్టెపెట్లు, పింజెట్లు, లుంగముస్తియలు, నీతగుంజు, ఆబవడులు, గంజెలు, తమిడియలు, మధురాపురవాసులు కఱవుకాలమున తిన్నతిండ్లు, వేసిన పంటలు. మధురానగరమున నేర్పడిన దుర్భిక్షవర్ణనమునఁగూడ, నెండిపోయిన పంటలు వర్ణించుటయు గలదు. వృద్ధవేశ్యారూపచిత్రణము, శిశుపాలనము, పేర్కొనుటయు, గవీంద్రునకుఁగల పరిచయజ్ఞానమును వెల్లడించును. వేశ్యాగృహాభ్యంతరమునందు చిత్రించిన చిత్రములు ధూర్జటి నిజజీవితమునఁ జూచియున్నవేయనుట, నాతనిజీవితముఁదెలిసిన మనకుఁగొత్త కాదు.

కిరాతార్జునుల మల్లయుద్ధవర్ణనమును కవి లోకజ్ఞతను,పరిచయమును వెల్లడించును.

చెయ్యెచ్చి కొంతసేపు నేర్పునబల్మి, యినుమడింపగ జోరనీక మలసి
యొకతెఱఁగున జొచ్చి, యొండొండఁ గాసెలు, దొడిక పట్టుక కొంత
సడఁపు పోరి
యదిమాని, కొంత ప్రొద్దవనిమాఁదిన గాళ్లు, పెకలించిపడ నైనఁ బెనఁగి పెనగి
మఱికొంతవడి, మెడ లాఁటియభుజమ్ములఁ జిక్కించి, యక్కున నొక్కి నొక్కి
నడుములనొడిసి, కబళించి, పుడమిమీఁద సమముగా వ్రాలి...

వారిరువురు పోరాడుట మన కన్నులయెదుట ప్రత్యక్షీకరింపఁగలిగినాఁడనిన, ధూర్జటి యిట్టిమల్లయుద్ధమును కన్నులారఁగాంచియేయుండును.

శతకము : దేశసంచారముచేసి, నానారాజదర్శనముగావించి, పొందిన యనుభవముల సారమే శతకము. రాజసేవకులైన జనుల బుద్ధులు, కాంతాకాంచనము లాశపడి యారాటపడు జనులు, జీవితస్వభావము తెలియలేక వ్యధనొందు అవివేకుల యజ్ఞతలు, జ్ఞాతులు చేయు ద్రోహములు, ఆలుబిడ్డలవలన గలుగు మనఃక్లేశములన్నియుఁ గవి లోకజ్ఞతకు చిహ్నెలు. పండితుల మనుకొనువారి యాడంబరములు, శివుని తెలుపలేని చదువులు ధూర్జటికి లోకమున గనుపట్టినవి, జీవితమునఁదెలిసివచ్చినవియును.

'మదమాతంగములుఁ దలంబులు హయగ్రామంబులు పల్లకీల్
ముదితల్ చిత్రదుకూలముల్పరిమళంబు' మదిలో వీనిన హేతు చేసి
'నృపధామద్వారదేశంబు గాఁచి దినంబుల్ వృధపుత్తు రజ్ఞులకటా'
యనియు, వారికాఁకలిదప్పులు తీర్చుటకు 'లేవో కానలఁ గంధమూల
ఫలముల్ లేవో గుహల్ తోయముల్ లేవో యేఱుల
బల్లవాస్తరణముల్ లేవో...

యని రాజసేవాసక్తులు, భోగసక్తులైనవారి యారాటము నీసడించినాఁడు కవి.

"స్తోత్రంబన్యులఁ జేయనొల్లని వ్రతస్థుల్వోలె వేషంబుతో
బుత్రీపుత్రకళత్రరక్షణకళాబుద్ధిన్ నృపాలాధమున్
బాత్రంబచు భజింపఁ" బోయినవారి మోసమును బయలుపఱచుచు

'రాజశ్రేణికి దాసులై సిరులంగోరంజేరఁగా సౌఖ్యము'

కాదనియు. నీ జన్మమునే తరింపఁజేయగల ఈశ్వరుని సేవించుటే సౌఖ్యమని తన యను భవమును, 'సంపదగర్వాతిమదాంధబుద్ధులైనవారికి బోధింపఁబూనినాఁడు. ఈ విధముగా రాజసేవకై దాసులకై ప్రాకులాడినవారిని గూర్చియు, పలుకుచో, ధూర్జటికి యజ్ఞులైన లోకులందును, మదాంధులైన రాజాధములందును గలదృష్టి, అనుభవములు,అతని లోక జ్ఞతను వెల్లడింపఁజాలుచున్నవి. 'జ్ఞాతుల్ద్రోహులు, వాండ్రుచేసెయు కపటోర్వ్యాదిక్రియా దోషము, లను సహింపరేమనియు, ఆలుబిడ్డలు భోగభాగ్యము లశాశ్వతమని తెలియ నేరక, 'అంతాసంశయమే శరీరఘటనం బంతావిచారంబె లోనంతా దుఃఖపరంపరాన్వి తమే' యనెరిగిసి పరిత్యజించి, యీశ్వరానుగ్రహముకొఱకుఁ బ్రయత్నింపని మూర్ఖుల మెడనీనడింపు కనబఱచినను, వారిస్థితికి, యజ్ఞానములకు కవి ధూర్జటి జాలిబడినాఁడు.

కవిత్వమునఁగవి లోకజ్ఞతనుఁజాటునవి యాతఁడు సందర్భోచితముగా నుపయో గించిన లోకోక్తులు, సామెతలు, జాతీయములు.

మందునకై నగానము, పిండెంతో యంతేకాన్, కడుపే కైలాసము, అడుగామడై యుండ, ఆడబోయినతీర్థ మెదురైనరీతి, అలిగిపట్టుపైఁ బడినగతి, ఏనుఁగునెక్కి దిడ్డి దూరినయట్లు, గుమ్మడికాయలోను నవగింజంతైన, కుమ్మరికొకయేడు గుదెకొక్క పెట్టన్నమాట, ఇల్వెలుంగ్రోచినఁ జూరుపట్టికొని వ్రేలాడు, పగవానిఁగూడదైవము, వెల్లిగలిసినచింతపండు, ఒకటప్పును గావరుగా నృపాలకుల్, చామరతంవరై, అయు దిస్సంప్రయుక్తి యుంచు, చత్రాంతిలో నీరున్నదా, వెలివాడన్ మఱిబాపనిల్లు గలదా ? మున్నగు జాతీయములు, లోకోక్తులును.

పసిపేరైనను, కాలాడినప్పుడు, పసిపాటచేయు, ఒన్నున పోసూమఁ కదికండల్గాగ, చేతడియారిపు, చిటుకన్నన్, కానంతైన, వీసంబైన, చిన్నంబింతయు, తృణంబున్ పొంచెంపన్, కానింబట్టన్, పొట్టకుగా, చేదోడై వాదోడై, పంపంబచేయుందు మున్నగు పలుకుబడులును కవికిగల లోకజ్ఞతను వెల్లడించును.

శాస్త్రజ్ఞత : ధూర్జటి కవీంద్రుఁడు శ్రీవిద్యోపాసకుఁడనియు, రాజయోగవిద్యాపా రంగతుఁడనియు, స్వీకరించి నిర్వహించిన యితివృత్తమంతయు నిరూపించుచున్నది.

శివభక్తియుక్తునగు శ్రీదేవి, దుర్గ, భైరవ, దక్షిణామూర్తుల నుపాసనా దైవము నారాధించిన ధూర్జటికి ఉపనిషద్విజ్ఞానము కరతలామలకమేకదా। కవీంద్రుడు ఖ వైద్య, కామశాస్త్రాదులందుఁ బండితుఁడను నంశమునకు నాతనికృతులు రెంట సాక్ష్యమిచ్చుచున్నవి.

పరిశీలించితి మంత్రతంత్రములు, చెప్పన్వింటి సాంఖ్యాది యో
గరహస్యంబులు, వేదశాస్త్రములు వర్ణించితిన్ శంక షో
దరయం గుమ్మడికాయలోను నవగింజంతైన నమ్మించి సు
స్థిర విజ్ఞానముఁ ద్రోవఁ జెప్పగదవే శ్రీ కాళహస్తీశ్వరా!
'వినాఁడన్ నిగమాగమాదికవచోవిన్యాసముల్ మేదినిం
గన్నాఁడన్ బహుదేవతా ప్రతిమలం గంగాది తీర్థాలి నేఁగన్నాఁ
అను పద్యములందు కవి స్పష్టముగఁ దనవిద్యావైదుష్యములను బ్రకటించియున్నా

ఉపాసన : 'శ్రీ విద్యానిధియై మహామహిమచేఁ జెన్నై....' అను ప్రబంధాది ప్రారంభపద్యమాలనికిఁగల శ్రీవిద్యనెట్లు ద్యోతకమొనర్చుచున్నదో, 'కథాసఁ మను ప్రకరణమున విపులముగాఁ జూచియుంటిమి, కథాప్రణాళిక యందుఁ జేర తొమ్మిది కథలను శ్రీచక్రమందలి నవావరణలను స్ఫురణకు దెచ్చునవిగా నున్న భైరవస్తుతియందలి నకులీవారాహీ దైవతములయు, ఐకారాక్షరమంత్ర మర్మ వైన రీతిని, దుర్గాస్తుతియందలి జ్ఞానపుష్పాంబ వర్ణనము పంచాశద్వర్ణ యగు శ్రీ రాధనము గావించినరీతిని బరికించియుంటిమి.

దక్షిణామూర్తి స్వరూపావిష్కరణమున నాతని దక్షిణామూర్త్యుపాసకత నిషద్విజ్ఞానములు గోచరించును.

యోగశాస్త్రజ్ఞత : కాళహస్తీశ్వరజనులను రాజయోగైకసామ్రాజ్య రః వర్ణించుటయందు, కామినీజనులను యోగినీజనులుగానూహించుటయందును, గజములను అవధూతలుగా భావించుటయందును, వశిష్ఠుని తపోవర్ణనమున ప్రత్యక్షమైన పరమశివలింగరూప పంచ కంచుకకారవర్ణనమునందును,

ప్రాంతముల జరియించు ప్రాణుల పారవశ్యవర్ణనమునందును, జ్ఞానపుష్పాంబ నగస్త్యుడు లోపాముద్రా సహితుడై కొలిచిన సందర్భమునను, భువికేతెంచిన స్వర్ణ ముఖరీనదివర్ణనమునందును, ఈశ్వరుని స్తుతించిన దండకమునందును, పాముసేనుం గులు కావించిన యీశ్వరస్తుతియందును తొల్లయందలి వేశ్యాతనయల మీఁదిచూపుం బడుటయందును, ప్రబంధమందలి యాశ్వాసాంతపద్యములందును, ధూర్జటి కవీంద్రునకుగల రాజయోగ మందలి యాసక్తి, యోగశాస్త్రజ్ఞతలును స్పష్టములగు చున్నవి. ఆనందతారక దుర్గాటవిలో నున్మనోన్మగము గర్వస్ఫూర్తి వారించువారికే భవో గ్రబంధలతల్ పీడుసనునప్పటి నాదబిందు, కళల, ప్రసక్తి చేయుట, ఓంకారస్వరూప మావిష్కరించుట, లందు శరకమునను నాకవీంద్రుని యోగశాస్త్రజ్ఞత వెల్లడియగును.

**వైద్యము:-** తిన్నని కథయందు, తిన్నఁడు పరమేశ్వరునకు గావించిన నేత్రచికిత్స నుల్లేఖించునప్పుడు తన వైద్యశాస్త్ర వైదుష్యమును స్వానుభవముతోఁగూర్చి ప్రకటిం చెను. కోకపోట్లంబావి గొనియూఁది యొత్తుట, కషణోష్ణకరథ భాగమున కాచుటలు, కవి లోకజ్ఞతను వెల్లడించును. నెత్తిన తంగేడాకు నెత్తుట మొదలుగాగల చికిత్సలన్నియు నాతఁడు విన్ననుందులు, కన్నమందులును, పెన్నెలనువర్ణించుచు కని యౌషధప్రక్రి య్యక్రమమును, స్ఫురింపజేయుట యాతనికిఁగల వైద్యశాస్త్రపరిచయమును, వర్ణనావణ త్వమున కెట్లలంకారముగ గూర్చెనో తెలియుచును. ధరాస్థలికా పంపుపెన్నెలలను, దర్పకశాస్త్రమున పలికిన యౌషధక్రమమాయని యుత్ప్రేక్షించినాఁడు.

**ఖగోళ శాస్త్ర పరిజ్ఞానము :** దుర్భిక్షవర్ణనమున శని మీనమునఁజేరుటచే దుర్భిక్ష మేర్పడెనని రెండుమాటలు తెలిపెను.

**కామశాస్త్రపరిచయము :** వేశ్యాతనయలకథయందు, వారిగృహనృత్యములందు, భద్ర, దత్త, కూచిమార, పాంచాలుర చిత్రములను వ్రాయించుటయు, కూచిమార, మనోజ, ఘోణికాపుత్రాదికౌనీత కామసిద్ధాంతములను కూఁతులకు నేర్పించుటయు, తల్లికూఁతులకు వాదధర్మము లుపదేశించుటయు కవీంద్రునకు గల కామశాస్త్రపరిచయ మును వ్యక్తము సేయుచున్నవి.

శ్రీ విద్యోపాసకుఁడై, వివిధ శాస్త్రపారంగతుఁడై, లోకజ్ఞుఁడై ధూర్జటి కవీం

# ఆంధ్రవాఙ్మయమున ధూర్జటి స్థానము

ఎందఱెందఱో ప్రాచీనాంధ్రకవులందఱును ఆస్తికశిఖామణులే, పండితప్రకాండులే, సరస్వతీ పురోహితులే, పదను భావుక పట్టభద్రులే, సాగర మహాయోగ మార్గమున సుసాంగాములే, వశ్యవాక్కులై వాగ్దేవి వరివస్య చేసిన ధన్యులే. కాని యందఱును ధూర్జటివలె మహాకవులు కారు, అందఱును ధూర్జటివలె వేదశాస్త్ర వేతృత్వము, మంత్ర తంత్ర మర్మానుశీలనము, సాంఖ్యయోగరహస్యజ్ఞతయు, రసభూతమైన పాండిత్య పరిణాహము కలవారుకారు, హృదయపరిపాకము కలవారు కారు. అందఱును ధూర్జటివలెనె మాటలోన మనస్సుపెట్టి సాహిత్య సరస్వతికి గుండెలో గుడికట్టిన వారుకారు. స్వభావతః రసనాగ్ర లాస్యాభ్యాసీరసనర్తకీయ విలాసులుకారు. ఆ యందఱికవితలును ధూర్జటికవితవలె కవిస్వానుభవ మహాభాష్యములు కావు, సహృదయ హృదయస్పందన బంధురములుకావు. మహాకవి ధూర్జటి జీవితమున తన ప్రియవల్లభకైన హృదయమును నివేదించెనో లేదోకాని, కవిత్వమున నిరువురికి, ఇరువురికి మాత్రము తనహృదయము సాపముట్టుగ నివేదించినాఁడు—చిత్తనిత్యస్థితశివునకు, సహృదయ శారదాధవునకు.

'కదిలేది కదిలించేది' నవకవనమునకేగాదు ఏ కవనమునకైన నవశ్యము కావలసినది. ఆంధ్రవాఙ్మయ సర్వస్వమును నా చూపుతోఁ జూచినచో శాబ్దిక ఛందతాండవములతో, శ్లేషాశ్లేషములతో, చిత్రకవిత్వపుఁగసరత్తులతో, పాండిత్య ఖండన పరాక్రమములతో చదువరుల నాశ్చర్యచకితులను చేయు సామగ్రియే యెక్కువ. సహృదయాంతరంగ పరిష్వంగము సేయు రసభావ పేశలమైన పదార్థము తక్కువయనిపించును. ఏవంవిధ పదార్థము పెనుఁగొను భక్తిశతకములందును, క్షేత్రమాహాత్మ్యములందును సమృద్ధిగాఁ గన్పట్టును. అవి సర్వసాధారణముగా కవుల యనుభూతిని, అభిరుచిని, అంతఃప్రేరణమును పురస్కరించుకొని వాహిరిల్లినవగుట యందులకుఁ గారణము. అందునను రాజసమ్మానములతో రసించి, రసభోగములతోఁ బరవశించి బ్రదుకు వాటారువేళకు దారిద్ర్యభారముతో నీరసించి, సంసారయాతనతో సతమతమై భవపరాఙ్ముఖుఁడై చిత్తజునకు జోలలుపాడి, శివునకు మేల్కొలుపులు పలికి, అఖండభక్తిభావ దీధితులతో జీవితాష్వమును వెలిగించుకొన్న ధూర్జటియొక్క బహుజన్మల వృద్ధజీవుని భావపరిపాకము ఫలములుగా వెలసిన

యాతని కృతులు శ్రీకాళహస్తిమాహాత్మ్యము, శ్రీకాళహస్తీశ్వరశతకములు రెండింటను అపూర్వపరిమళ మనితరకృతి సాధారణముగ బ్రగల్భించినది. కవి వ్యవహారయమునకు, కావ్యస్థితికిని, సహృదయవ్యాసంగమునకు నదియే పరమార్థము, అదియే పరమార్థము. అదియే చారితార్థ్యము. ఆ దృష్టితో జూచిన ధూర్జటి సాహిత్యసరస్వతి సమారాధకుల కోవలో కోటికి పడగెత్తినవాడు.

## క్షేత్రమాహాత్మ్యములు : ధూర్జటి

పురాణేతిహాసములలోని మహిమాన్వితములగు కథల నాధారముగా గ్రహించి స్వతంత్ర ప్రక్రియగా వెలసినట్టిది క్షేత్రమాహాత్మ్య కావ్యజాలము. ఇవి, స్థల, దైవ, తీర్థము లను భేదములచే విడివిడిగాగాని, రెండుమూడు కలిసికొని యుండుట కలదు. మాహాత్మ్యములనునవి యింకనుగొన్నివిధముల మున్నట్లు గమనింతము. మంత్ర, మాస, వార పర్వదిన, భగవద్భక్తజన,మాహాత్మ్యములు మున్నగు రీతుల నీ మాహాత్మ్యములున్నవి.

నాస్తికులను ఆస్తికులుగా జేయుట, ఆస్తికులను భక్తులుగా జేయుట, మోక్షమునకు భక్తి సులభమార్గమని ప్రచారముచేయుట, సర్వులయందును భక్తిని ప్రచోదనచేసి, వినుల ప్రవర్తకులుగా దిద్ది, విశిష్టభక్తిభావన గలుగజేయుట, ఈ మాహాత్మ్యముల పరమ ప్రయోజనము. మాహాత్మ్యములు భక్తిభావోన్ముఖముగ,పాఠకుని హృదయమును సన్నద్ధముచేయును.

తెలుగు సాహిత్యములో క్షేత్రమాహాత్మ్యకావ్యముగా వెలుగొందినది ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణము. క్షేత్రమాహాత్మ్యమును సార్థకముజేసినవాడు కవి సార్వభౌముడు శ్రీనాథుడు. ఆ మహాకవి శివరాత్రి మాహాత్మ్యమది. అతని కాశీఖండ, భీమఖండములును మాహాత్మ్యములే. ధూర్జటి కవీంద్రుని సమకాలికుడైన తెనాలి రామకృష్ణ కవిచంద్రుడు స్థల, దైవ, తీర్థములను మూడురూపములైన క్షేత్రాత్మను తన పాండురంగ మాహాత్మ్యకావ్యమున జక్కగా నెలకొల్పినాడు. ధూర్జటికి తరువాతకూడ కొన్ని క్షేత్రమాహాత్మ్య గ్రంథములు లేకపోలేదు.

ప్రాచీనార్వాచీనుల నడుమ ధూర్జటి కొకవిశిష్టస్థానమేల్పడెనో పరిశీలింతము. క్షేత్రమాహాత్మ్యములందు సర్వసాధారణముగా గానవచ్చు సంకేతములలో ప్రథమముగా

గుర్తింపఁదగినది కవి తనయిష్టమగు ప్రతీకయందు మమకారము పెంచుకొని, దానిని సుందరమరమణీయ భావమునఁబ్రదర్శించుచు నన్యప్రతీకలను దూషణము సేయకుండుట, అన్యమత, దైవములను దూషించుట హృదయపరిపాకముగల భక్తుని లక్షణముగాదు. మన క్షేత్రమాహాత్మ్యములను రచించిన వారిలో నాద్యుఁడగు ఎఱ్ఱాప్రగడ నన్నయ, తిక్కన మార్గమున పయనించిన మనీషియేకాని యన్యదైవదూషణ చేసినవాఁడు కాఁడు. 'గిరిశపదభక్తి రస తత్త్వదిభావముకలిమి' శంభుదాసుండనఁగా బరఁగియు, గోవింద గుణావలి సంస్కృత నామసన్యఘన్యు'ఁడైనవాఁడే యతఁడు. శివభక్తుఁడై శంభుదాసుఁడను బిరుదమందియు, హరివంశము, నృసింహపురాణము, రామాయణము లను రచించుట, ఎఱ్ఱన హరిహరాద్వైత భావనకు నిదర్శనము. అట్లే 'క్షేత్రమహిమా చార్యు'ఁడని బిరుదందిన శ్రీనాథుఁడు ఈశ్వరార్చన కళాశీలుఁడయ్యు, తనకృతులందు విష్ణుప్రశంస మిక్కిలిగా చేసినాడు. ధూర్జటికవీంద్రుఁడు నీ దారిఁద్రొక్కినవాడే. స్వీక రించినది శివభక్తి ప్రతిపాదకమగు కథాప్రణాళిక. తన కవిత్వమునకు శివపారమ్యమునుఁ గలిగించి తన శివభక్తికి కవితాపారమ్యమును గూర్చిన ధూర్జటి తనకలిదండ్రులను లక్ష్మీ నారాయణులతో నుపమించుటచే నాతనికిఁగల వైష్ణవ సహిష్ణుతను చాటుచున్నది. అంతియే కాదు గణపతి దైవస్తుతియందు

> 'సర్గస్థిత్యపహార కర్మనవధీతో వేళ బ్రహ్మాస్వభూ
> భర్గుల్విఘ్నము లేక సాగుటకునై ప్రార్థింపగా...

అను పద్యమున విష్ణువును 'స్వభూ' యని పేర్కొనుట గొప్ప విషయము. స్వభూ శబ్దము హరు నుద్దేశించి పల్కినది. అనగా ధూర్జటి హరిహరుల కభేదము ప్రతిపాదిం చెనన్నమాట. స్పష్టముగా 'సకలాపూర్ణుఁడు నీలవర్ణుఁడనుటల్ సత్యం' బనియు, అభ వుఁడద్దేవుండు భేదంబుగాదనియు పెంజీఁకటినిండ తారకలు పొల్చుటను వర్ణించుచు పలికెను. ప్రబంధమున విష్ణు ప్రశంసఁగావించియేయున్నాఁడు ధూర్జటికవి.

క్షేత్రమాహాత్మ్యములందు సాధారణముగా ధూర్తనాయకుని సృజించి, మొదట నుండియు వానిపాపకృత్యములను పేర్కొనుచు, తట్టతుదకు పుణ్యలేశముచే నాతఁడ దైవానుగ్రహముపొంది సాయుజ్యమునో, సారూప్యమునో పొందెనని చిత్రించుటకుఁగూ అంతటి మహాపాపాత్మునకు దైవము మోక్షమొసఁగెనని పల్కుట, క్షేత్రస్వామి కుత్క ర్షాపాదకమని యట్లుచేయుదురు. కానిదానివలన మానవుని విలువలు తగ్గి అలసభావుల

మాధుర్యము, ప్రసన్నకలును, అనుభవశ్రుతియును. దీర్ఘ సమాస ఘటనములేక, శబ్దాలంకార ప్రాచుర్యములేక, ప్రసాదగుణభూయిష్ఠముగా సర్వతః ప్రసన్నముగా నుండు ధూర్జటిరచన సర్వోపగమ్యమై భాసించుచున్నది. ఈ గుణమున సంస్కృతమున కాళిదాసునికుఁగల స్థానము తెలుఁగులో ధూర్జటి కవికే దక్కును.

సర్వసాధారణముగా క్షేత్రమాహాత్మ్యకావ్యములందు పాండిత్యశౌండీరము, శబ్దాలంకార ప్రాచుర్యములు ధూర్జటికిష్టమైనవి కావు. అవి క్షేత్రస్వామిని అతిశయించి పోవును. ఆ కవితారీతి భగవద్భక్తిని మ్రింగివేయును. ధూర్జటికవిత్వనుట్టిది కాదు. పాండితీ శౌండీరమునను, శయ్యానైగనిగ్యములను ప్రాకులాడక తన జిహ్వకు నిసర్గమైన కవితామాధురివే, తనకవితాసామగ్రినంతను స్వామి కైంకర్యమునందే సమర్పించినందున, ధూర్జటి కవిత్వమప్రయత్నైక సాధ్యమై, భక్తిభావ సురభిళమై, సహృదయ హృదయసద్యః స్పందన బంధురమై యొసఁగుచుండును.

స్థానిక ప్రకృతివర్ణనము క్షేత్రమాహాత్మ్యములలో సామాన్యముగనుండును. ధూర్జటి ప్రబంధమున గావించిన కాళహస్తి పుర ప్రాంతవర్ణనము, కవిస్వయముగా వానిని గాంచి కావించిన వర్ణనము. అది పాఠకునకు సాక్షాత్కారమీయగలదు, అట్టియనుభూతి యితరక్షేత్ర మాహాత్మ్యములందుఁగలుగదు.

ఎఱ్ఱన ప్రబంధమున స్థలమాహాత్మ్యము, శ్రీనాథుని ప్రబంధములందు తీర్థ, పర్వదిన మాహాత్మ్యములు మాత్రమే యుండగా, ధూర్జటి సమకాలికుఁడగు రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము స్థల తీర్థ, దైవములను మూఁడింటియొక్క కూడికయై క్షేత్రాత్మ సంపూర్ణతను పొందినది. ధూర్జటి ప్రబంధముకూడ ఏవంవిధ త్రయాత్మకమైన క్షేత్రమాహాత్మ్యమైనది. ఈశ్వరుఁడు ఫణారాజన్మమహా లింగముగా నవతరించుటయందు దైవము స్వర్ణముఖీనామ్నివిర్భావమున బ్రహ్మ తపమువలన తీర్థము, ఇతరభక్తులు — శ్రీ, కాళ, హస్తి, అటవిక, గోత్రాదేవ రాజీనాక్షీయుగము — ఈశ్వరానుగ్రహముచే స్థలములును మహిమాన్వితమైన క్షేత్రాత్మ సుస్థాపితమైనది.

ప్రాచీనాంధ్రకవులయందు శిష్య సంపదయున్నట్లు మనకుఁదెలియవచ్చిన కవులు కొద్ది. తిక్కన, శ్రీనాథులకుఁగల్గిన యా భాగ్యము మనధూర్జటికినిఁగలిగినది. తనకు 'దక్షిణామూర్తి' వలె నుపదేష్టయైన గురువునకు నమస్కరించిన కోట శివరామ కవి యను శిష్యుఁడున్నాఁడు ధూర్జటి కవీంద్రునకు. 'వ్యక్తిత్వ'మను ప్రకరణము తుది భాగమున నీప్రస్తావనకలదు.

ధూర్జటి శైలీమాధుర్యమర్వాచీనకవులపై దాగుగా ప్రభావము చూపినది. దక్షిణాంధ్రయుగపుకవులు పెక్కురు ధూర్జటి శైలీమాధుర్యమునకు లోఁగి, తమ రచనలం దాతనిని, స్ఫురణకుఁదెచ్చువారున్నారు. తనుతమకావ్యములందు, శతకములందు ధూర్జటిని ధూర్జటిగా, అభినవధూర్జటిగా స్తుతించి కైమోడ్చినవారిలో ప్రథముఁడాతని శిష్యుఁడు కోటశివరామయ్య. ఓఘవతీ పరిణయకర్త అక్కినేపల్లి నృసింహకవి, శృంగారమల్హణ చరిత్రకర్త ఎడపాటి ఎఱ్ఱనను, బాణాలవ వీరశరభేంద్ర కవి తన కాళహస్తి శతకమునను, సాహెబ్‌రాణా రానుస్నకవి సీతాపతి శతకమునను: శివశతక కర్తయు, కవిసమ్రాట్ కళాప్రపూర్ణ డాక్టర్ విశ్వనాథసత్యనారాయణగారు తమ కాళహస్తి శతకమునను; తెలుగురాజుకృతులయందును ధూర్జటిని ప్రశంసించి కొనియాడినారు.

శ్రీకాళహస్తీశ్వర శతకము : భక్తి సంప్రదాయము తెలుగుదేశములో బాగుగ వ్యాపించిన కాలమున శతకములవతరించినవి. శతకములందు భక్తిరసశతకము లధికముగా గల్గుటకు భక్తిసంప్రదాయమే ప్రబలమగు కారణము. భారత, భాగవత రామాయణాది పురాణగాధలు ప్రజావళికి స్మరణకుఁదెచ్చుట, వారికి ప్రబోధమునర్చుటయు శతకప్రయోజనములలో నొకటి.

భక్తి శతకములందు భగవంతుని గుణకీర్తనముచేయుట, భగవంతునకు భక్తుఁడు హృదయనివేదనము గావించుటలు సర్వసాధారణముగా గనుపట్టు లక్షణములు. మన ప్రకృత శ్రీకాళహస్తీశ్వర శతకముఁబరిశీలించినపుడు భగవంతుని గుణకీర్తన కంటె, కవి హృదయనివేదనమే యెక్కువ. భగవన్నామ మహిమ, భగవత్సేవ వలన గలుగు ఫలముల ప్రస్తావనము గొంతగలదు. మొత్తముపై తన జీవితమున బొందిన యనుభూతులను — భోగ, శృంగార, వైరాగ్య పరములయిన—యనుభూతులను సత్యనిష్ఠతో నివేదించుకొనినాఁడు ధూర్జటి. జీవిత పూర్వభాగమున తనకు లాఘవత్వ ప్రతిపాదకము లయిన వానినిగూడ, వెనుకాడక బహిర్గతము చేసినాఁడు కవి. తనహృదయవేదనను పాఠకుని హృదయ స్పందనమును కలిగించునట్లు నివేదించుకొనుటచే శ్రీకాళహస్తీశ్వర శతకమునకు శస్తమగు ప్రశస్తి కలిగినది.

ధూర్జటికిఁబూర్వులయిన శతకకర్తలందు పాల్కురికి సోమన, యథావాక్కుల అన్నమయ్యల శతకములు శివలీలావిలాసములను, గుణకీర్తనలను గావించినట్టివి. స్వీయ హృదయ నివేదనముఁగావించు ఘక్కికకు మన ధూర్జటి మహాకవియే యాద్యుఁడనఁదగును.

అర్వాచీనులందుఁజెక్కురు శతకకర్తలు ధూర్జటిని మార్గదర్శిగ స్వీకరించినవారుగలరు. భావధోరణి, వ్యక్తీకరణ పద్ధతులందు ననుకరింపఁబ్రయత్నించిన శతకములనేకములు గలవు.

బాణాలవ పీంశరభేంద్ర కవి 'కాళహస్తి' శతకము, తిరుపతివెంకట కవుల కామేశ్వరీ, వసురాయని భక్తచింతామణీ, వెంకటరమణకవుల సర్వలోకేశ్వరా, విశ్వనాథ వారి మాస్వామి, శ్రీగిరి, సత్యవోలు సోమసుందరకవి రాజశేఖరా, అల్లమరాజు రంగశాయి మాధవ, కంచెర్ల గోపన్న దాశరథీ శతకము లిత్యాదు లిట్లు ధూర్జటి శతకమునకు మానసపుత్రికలుగా వెలసినవి కొన్నిగలవు.

సాహిత్యములోఁగావ్యములవలనఁగొందఱుకవులు, కవులమూలమునఁ గొన్ని కావ్యములు ప్రఖ్యాతివహించుట గలదు. హంసవింశతి, చంద్రరేఖావిలాపము కవిచౌడప్ప శతకము, సుమతీశతకము, భాస్కర శతకము లిత్యాదుల వలన నాయా గ్రంథకర్తలకు స్థితి, పరపతి యేర్పడినది. ఆ గ్రంథకర్తల నామములకు ప్రజలలో ప్రసిద్ధి చాలతక్కువ. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథ, పోతనాదులవలన వారి కావ్యములకు స్థితిఁగలిగినది. ముఖ్యముగా గావ్యప్రయోజనములందు తలమానికమగు 'సద్యః పర నిర్వృతి' వి గలిగించిన పోతరాజు, త్యాగరాజులవలె హృదయవాదియయిన ధూర్జటికవికి పైనఁదెల్పిన రెండు విధములయిన స్థితి కలుగుచున్నది. వ్యక్తివలన ప్రబంధమునకు, శతకమువలన వ్యక్తికి స్థితిగలిగిన భాగ్యశాలి మన మహాకవి ధూర్జటి.

ప్రహ్లాదునియందు, గజేంద్రునియందు పోతన ప్రత్యక్షమగుచుండగా, మన ధూర్జటికవీంద్రుఁడు తనప్రబంధమునందలి శివభక్తులందఱియందును నిలిచి యున్నాఁడనదగును.

సాహిత్య స్ఫురన్మాధురీ చారుప్రౌఢిమ మై కవిత సెప్పి, తనదు జిహ్వాకు నైసర్గికమగు కవితఁబల్కి 'నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీఁదు' కట్టి తన కవితా మధురిమను బరమేశ్వరునకే నైవేద్యముగా సమర్పించి, తన శివభక్తికిఁ గావ్యత్వమొసంగి, ధన్యుఁడైన 'సాహిత్య శ్రీవరుఁడు' ఆంధ్రావళికి మోదము గలిగించి తెలుఁగు సాహిత్య మున నొక ధ్రువతారయై వెలుఁగొందినవాఁడు మన మహాకవి ధూర్జటి

o — o

'కథా సంవిధానము' శీర్షికలో 211 పుటలో 3వ పేరాకు పరిచయముగ చేర్చదగిన విషయము.

'శ్రీకాళహస్తి, తిన్నడు'— వీరల పూర్వజన్మ కథనము

శ్రీకాళహస్తి పురవాసులు, పఖ్యాత పండితులు, సహృదయులునైన శ్రీ కొట్ర వెంకట నరసింహశాస్త్రి గారు స్థలపురాణమును అనువదించి యున్నారు. వెంకటగిరి సంస్థాన ప్రభువులు ముద్రింపించి ప్రకటించిన శ్రీకాళహస్తీశ్వర క్షేత్రమాహాత్మ్యమను సంస్కృత గ్రంథమునకు శ్రీశాస్త్రి గారనువాదము చేసిరి. అవి ముద్రితము. సంస్కృతమున దాని పరిచయమిది. *

వెంకటగిరి సంస్థానము వారు ప్రకటించిన సంస్కృత గ్రంథము 25-1-1893న ప్రకటింపబడినది. దానిని పరిష్కరించిన పండితులు శ్రీ చేట్లూరి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి. ఇది సంస్కృతభాష, తెలుగు లిపి. 903 పుటలు గలది.

అందు ముఖ పత్రమున నిట్లున్నది : (కథా మూలమును గూర్చి "శివ పురాణాంతరిత శివరహస్యాంతర్గత శ్రీకాళహస్తి మాహాత్మ్యము" — ఇది రోమశ భరద్వాజుల సంభాషణమున వెల్లడియయినది. భరద్వాజునకు రోమశుడు చెప్పినవి. ఇది తొంబది (90) అధ్యాయములు గలది. శివమాహాత్మ్య ప్రతిపాదకములగు ననేక చరిత్రలు, గాథలు పలుకబడిన యీ గ్రంథమున వేదాంతము, ఉపనిషత్సారము, యోగాది శాస్త్రముల చర్చ, మిక్కుటముగ గలదు.

ధూర్జటి కావ్యమందలి కథలకు మూలములు అగునో కాదో స్పష్టముగా చెప్పలేము కాని, అందలి కొన్ని కథ లసలిందులేవు. ఒకటి రెండు మార్పులున్నవి. భక్తుల పూర్వ జన్మల విషయమున సుహావ్యాఖ్యానముగన్పట్టును. నక్కీరుని కథ, వశిష్ఠుని కథలులేవు. వేశ్యాతనయల కథకు మాఱుగా సంస్కృతమున రాజపుత్రికల కథ కలదు.

* (ఈ యంశము శ్రీ శాస్త్రిగారి కడ నేను సమక్షములో వ్రాసికొన్నది. 1970)

# షష్ఠ్యంతములు

క॥ ఏతత్కల్యాణ గుణో
పేతున కఖిల ప్రపంచ భిన్నాభిన్న
జ్యోతికిని నాదబిందు క
ళాతీతేశునకుఁ గాళహస్తీశునకున్ 1

క॥ బహుముఖ సువర్ణముఖరీ
లహరీ శీతల శిలాతలస్థిత ముని హృ
ద్గృహి రబహిః పరిపూర్ణున
కహరహ ముదితునకుఁ గాళహస్తీశునకున్ 2

క॥ పంచేంద్రియ మత్తద్విప
పంచాస్య కిశోరమునకు, భవఫణి ఖగరా
ట్పంచాకోటికి సదయ దృ
గంచల నటనునకుఁ గాళహస్తీశునకున్ 3

క॥ జ్ఞాన ప్రసూన కలికా
పీన కుచ గుళుచ్ఛ మత్త భృంగమునకు సం
ధ్యానటన పటువిహార మ
హానటహంసునకుఁ గాళహస్తీశునకున్ 4

క॥ సతత త్రైగుణ్య వశా
చ్యుత కేళి జగన్ముహుర్ముహు ర్నిర్మాణ
స్థితి భంజన కరణునకును
హృత భవపాశునకుఁ గాళహస్తీశునకున్ 5

## ఆశ్వాసాంతములు :

ప్రథమ : శా॥ పాశక్లేశ గుణేషణేంద్రియ తనుపరిత్యక్తి తాపోర్మికా
కోశాదివ్యతిరిక్త మూర్తి ! త్రిజగత్కూలంకషాకార ! మా
యా శృంగారవతీ విలాస విభవవ్యావిద్ధ మగ్దాంత వే
శాశర్మావవహ ! తారకాక్షర మహాలాబోపదేశ ప్రదా !

క॥ శాంతాకార ! యిదంతా
హంతా చింతావిదూర! యపవర్గరమా
కాంతాకాంత! దిగంతా
భ్రాంతా భ్రాంతాంత తాండవాభినయ కరా !

పంచ॥ అపారతా గభీరతామృతాది హేతు భూతతా
తపస్వి సంగృహీతతా విధాతృముఖ్యదేవతా
ధిప పరిమధ్యమానతా నదీమహాను జీవన
ప్రపాత జాతమగ్న తాభిరామ చిత్పయోనిధీ!

ద్వితీయ : శా॥ కామక్రోధ మదాంధకార పటలాఖండ పరిచండార్క! వే
ధోముష్కక్షయ తాండవభ్రమణ నిర్ధూత ప్రపంచా! పుర
శ్రీమాహాత్మ్య హరప్రభావ! దళదిక్చేల పరిభేద స్ఫుర
ద్ధామా! కాలజయేందిరా మదవతీ దాంపత్య నిత్యోదయా !

క॥ లుంటీకృతాఘ ముక్తి చి
రంటీ గాఢోపగూహరత ! చిద్విద్యా
ఘంటాపథచర! తారక
ఘంటారవ హృతమనోమృగ వ్యాధేశా!

పంచ॥ దివానిశోదయావసాన దిగ్విహీన। ఖండితా
జపంజపాంధకార। సత్యసంవిదత్రిమండితా।
దివాకరాధిక గ్రహోగ్ర దీధితి ప్రసాద। వా
గ్దవాంచ భావకాది తత్త్వ తారకక్షపాధవా।

తృతీయ : శా॥ యోగిస్వాంత శకుంత వాగురిక। సర్వోపాధిశూన్యా। జగ
ద్యోగాయోగ విహీన। భూ గగన వాయు క్షీర వహ్న్యంతరా
త్మాగణ్యా। గణనీయమూర్తి। పరమార్థాకార। స్వాభావ తే
జోగండూషిత పద్మజాండ। భవచక్షుశ్శ్రోత్ర పక్షీశ్వరా।

క॥ అష్టాపద గిరివాసా।
అష్టాపద గర్వ గిళవార్చిత చరణా।
అష్టాపద ముఖరీ జని
తాష్టాపద కమలవాసనాధీన మనా।

పంచ॥ మునీంద్ర మానసుద్రికా సముత్తముత్త వాసనా
సనాతనాత్మ। సేవకార్తి సారసావళీ ఘనా।
ఘనాఘనా ఘన ప్రకాశ। కాయజాగ్ని జీవనా।
వనాదినాగనందనేశ। నాగధీశ సావనా।

చతుర్థ : శా॥ నీవారాగ్ర శిఖాంత చిద్రవమయా। నీవారసుష్టింపవా
త్మాజ్ఞానస్థిత దేవ। పత్యభుయనాథాయాధ భేదప్రతి
ష్ఠావష్టంభ విజృంభితానన నికాయ ద్వాఃకవాటా। మహా
దేవా। జన్మ జరావిపల్లఘు ద్రశాదిక్లేశ సంహారకా।

క॥ బంధ త్రియసాశక। భవ
బంధాధికబంధరాశి బంధనవిద్యా
బంధుర। సమస్త భూత
స్కంధావారేశ। భక్తకల్ప మహీజా

పంచ॥ పటక్షమాజవాస। భేదవాది వాగఖండితా।
జటాకుటీ విటంక లగ్న చంద్ర ఖండ మండికా
కటీపటీ భవద్దిగంత। కాలకూట ఘస్మరా।
నటత్కృపీట భూశిఖా పినద్ధ దృగ్జిత స్మరా।

## అనుబంధము-2

# పారిభాషికపద వివరణము

అంతర్యాగము : అంతరంగపూజ. దీనినే అంతరారాధనమందురు.

'అంతర్యాగ ఇతి ప్రోక్తా జీవతోషు క్తిదాయకః

మునీనాంచ ముముక్షూణాం అధికారోత్ర కేవలమ్'-గౌతమీయతంత్రమ్

'అంతరారాధన పరా వైదికాబ్రహ్మవాదినః

జీవన్ముక్తాశ్చరంత్యేతే త్రిషు లోకేషు సర్వత ఇతి'-సనత్కుమార సంహిత

చతుర్విధైక్యాను సంధానము అంతరంగపూజ, అంతర్యాగమున షట్చక్రసేవ, ధారణలున్నవి – శ్రీచక్రవిలసనము.

అణిమాదులు : అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, వశిత్వములు – అష్టసిద్ధులు

అవధూత : కేవల బ్రహ్మజ్ఞాన పరుడై, వర్ణాశ్రమాదులను పరిహరించిన సన్న్యాసి.

ఆధారము : బంధత్రయములో నొకటి, మోక్షసాధనకై వేయుబంధములు

ఈషణత్రయము : దారేషణ, పుత్రేషణ,ధనేషణ – భార్య, పుత్రులు, ధనము లందలి యాశ.

ఊర్ములు : ఇవి ఆరు, బుభుక్ష, తృష్ణ, శోకము, మోహము, జర, మరణములు,

ఓంకారము : అకార, ఉకార, మకార, అర్ధమాత్రములను నాల్గుపాదములు గలిగి, అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవులను నామాంతరములు గలిగి విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయములను నాలుగు పాదములుగల బ్రహ్మము. చేతనాచేతనాత్మకమైన యీప్రపంచమెల్ల ఓంకారాత్మకంబై యున్నది. ఉపనిషత్తు లనేకము లీ ఓంకారమును నిర్వచించియున్నవి. 'తద్యథా శంకునా సర్వాణి పర్ణాని సంతృణ్ణాన్యేవ మోంకారే సర్వా వాక్ సంతృణ్ణా ఓంకార ఏవేదగ్ం సర్వమ్' అనునది శ్రుతి వాక్యము—సీతారామాంజనేయ సంవాదము,

ఓడ్యాణము : బంధత్రయములో నొకటి

కంచుకములు : కల, విద్య, రాగ, కాల, నియతి అను ఐదునుకూడిన తత్త్వమునకు

కంచుకమని పేరు—వివరములు, విజ్ఞాన సరస్వము 7సం- 356 పుట

కర్మేంద్రియములు : వాక్కు, పాణి, పాద, పాయు, గుహ్యములు

కుండలిని : కుండలినీ శక్తియగు పరాభట్టారకాదేవి సుషుమ్నా నాడీ మార్గమున ఊర్ధ్వాభిముఖియై మూలాధారమునుండి బయలుదేరి స్వాధిష్ఠానాది క్రమల్లను లారింటిని, గ్రంథిత్రయమును—బ్రహ్మ, విష్ణు, రుద్రగ్రంథులు- అతిక్రమించి స్వస్థానమైన సహస్రాంతర్గత చంద్రమండలమును చేరును. సహస్రారమున కుండలిని పరబిందువు నంశైక్యమును చెందును—శ్రీచ.వి.

కూర్మాసనము : యోగాసనములలో నొకటి—వీర, స్వస్తిక, పద్మ, భద్ర, సిద్ధ, సింహ, కుక్కుట, గోముఖ, ధనువు, మయూర, కపాల, శీర్షమిత్యాది. పింగళిసూరన కళాపూర్ణోదయమున వీనినన్నింటిని వివరించెను5ఆ-158-168ప.

కోశములు : అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయమనునవి ఐదు కోశములు.

క్లేశములు : అయిదు. అవిద్య, అభినివేశ, అస్మిత, రాగ, ద్వేషములు.

చతుర్వింశతితత్త్వములు : పంచభూతములు, తన్మాత్రలు, జ్ఞానకర్మేంద్రియ దశకము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

చతుర్విధ ముక్తులు : సామీప్య, సాలోక్య, సారూప్య, సాయుజ్యములు.

చతుర్విధయోగాభ్యాసములు : మంత్ర, లయ, హఠ, రాజయోగములు.

జాలంధర : బంధత్రయములో నొకటి

జీవన్ముక్తి : కుండలిని గ్రంథిత్రయ భేదముచేసి స్వస్థానమైన సహస్రార ప్రాప్తినందుట. అనగా స్వస్వరూపమైన చిత్కళ తానే నని తెలిసికొనుట. సర్వ చేతనత్వము చిత్కళలేకాన విస్మయముగా భావించుట జరుగును. అది స్థిరమైన భావము. అది జీవన్ముక్తి—శ్రీచక్రవిలసనము —పుట 134,

జ్ఞానేంద్రియములు : త్వక్కు, చక్షువు, రసన, శ్రోత్రి, ఘ్రాణేంద్రియములు.

ఘంటానాదము : ప్రణవనాదములలో నాలుగవది.

త్రిగుణములు : సత్త్వము, రజస్సు, తమములు

త్రివిధ జ్ఞానములు : సంజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానములు

త్రివిధ రాజయోగములు : సాంఖ్య, తారక, అమనస్కములు.

త్రివిధమనోయోగములు : హఠ, లంబికా, రాజయోగములు

త్రివిధానందములు : బ్రహ్మానంద, వాసనానంద, విషయానందములు.

దీపనాదులు : దీపనము, బోధనము, తాడనము, జననము, జీవనము, అభిషేకము, విమలీకరణము, అప్యాయనము, తర్పణము, గుప్తి—అమనవి 10 మంత్రి సంస్కారములు—మంత్రిశాస్త్రము—ఉపాసనావిధానము—పుట-70-71.

నకులీవారాహులు : భైరవచక్రమున—అనగా శ్రీచక్రమున కథిష్ఠాన దేవతయగు రాజరాజేశ్వరీదేవికి శ్యామల యనునామె మంత్రిణి. ఆమెకు నకులి ప్రత్యంగదేవత, దండనాయిక వారాహి—శ్రీ.చి.సా.వేం.సు.

నాడి : ఇడా, పింగళా అను రెండునాడులు, సావిత్రి, సరస్వతి అను నామాంతరము గల బ్రహ్మనాడికి ఎడమ కుడిప్రక్కలందుండును. ఇడానాడి చంద్రి మండలమున, పింగళానాడి సూర్యమండలమున చరిందును—శ్రీ.ద.వి.—పుట 145.

నాడి దశవిధములు ఇడ, పింగళ, సుషుమ్న, గాంధారి, అస్తిని, పుష, పయస్విని, అలంబస, లకుహ, శంఖినీ నాడులు.

నాదబిందుకళలు : ప్రణవాంతర్భూతములగు అకార, ఉకార, మకారములు నాదబిందు కళలు.

గర్భగోళమున ప్రాణాది వాయు సంచారము వలనగల్గు నాంతరశబ్దమే ప్రణవనాదము. అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశముల కతీతమైన విజ్ఞానమయ కోశమే చిద్బిందువు. ఆ చిద్బిందువులో ప్రతిఫలించి దానికి ప్రకాశ కంబై యానందమయ కోశాత్మకంబగు భగవదంతర్యామి రూపమే చైతన్యకళ.

ధూర్జటికవీంద్రుడు ఈవిషయమును శతకమున రెండుతావులఁబల్కెను 84,94.

నీరేజాసనము : ఇదియే పద్మాసనము. అవనములలో నొకటి.

పంచతత్త్వములు : కల, విద్య, రాగ, కాల, నియతి, తత్త్వములు.

పంచభూతములు : నేల, నీరు, నిప్పు, గాలి, నింగి

పంచ ముఖములు : ఈశాన, తత్పురుష, వామదేవ, సద్యోజాత, అఘోరములు.

పంచశక్తులు : చిచ్ఛక్తి, ఆనందశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి.

పంచాశద్వర్ణ : అకారము మొదలు హకారమువఱకుగల 50 వర్ణముల స్వరూప మాతృకాశక్తి. అకారాది పదియాఱుస్వరములు చంద్రఖండము. కాది భాంతము-20 సౌరఖండము. మాది జాంతముపదియు వహ్నిఖండము. మండలత్రియ, ఖండత్రియ, కూటత్రియాత్మకమైన పంచాశద్వర్ణ రూప మాతృక శ్రీ చక్ర స్వరూపాకృతిని స్వీకరించినది—శ్రీ.చ.వి.—23 పుట.

ఈ శ్రీదేవి ఉపాసకులు 12 గురిలో లోపాముద్రాగస్త్యులుండుటచే ధూర్జటి వారిరువురిచేతనే పంచాశద్వర్ణయగు జ్ఞానపుష్పంబ రూపముననున్న శ్రీదేవిని స్రగ్ధరచేఁ బూజింపఁజేసినాఁడు.

పరమేశ్వరుని పంచవిధిశక్తులు : సర్వకర్తృతా, సర్వజ్ఞాతా, నిత్యపరిపూర్ణతా నిత్యతా, స్వాతంత్ర్య శక్తులు.

పాశములు : మల, మాయా, కర్మ, బిందు, తిరోధానములు(అణవ, కార్మిక, మాయా, బైందవ, నిరోధకశక్తి.)

ప్రణవ నాదము : గర్భగోళమున ప్రాణాది వాయు సంచారమువలన గల్గు నాంతర శబ్దమే ప్రణవము. ఇది పదివిధములు. స్వాంతర్గత ప్రాణఘోష, చిణి, చిణిచిణి, ఘంట, శంఖ, తంత్రీ, వేణు, భేరి, మృదంగ, మేఘనాదములు.

బంధత్రియము : మూల, ఓడ్యాణ, జాలంధరములు.

మేఘసప్తకము : సంవర్త, ఆవర్త, పుష్కలావర్త, ద్రోణ, కాళ, నీల, మహాకాలములు.

రాజయోగము : 'అహంబ్రహ్మాస్మి' త్యాద్యనేక శ్రుతులచేఁ బ్రతిపాదింపఁబడు జీవేశ్వరైక్య రూపంబగు పరబ్రహ్మ తత్త్వమును నిరంతరముగ సహోరాత్రముల యందనుసంధానము చేయుటవలన నతిచంచలమగు మనస్సు విషయములందుఁబడక నిశ్చలమైయుండును. చిణిమొదలగు పదితెఱంగులఁబరగు ప్రణవ నాదముల నాలించుచుండుటవలనం దుదను ఘంటానాదముద్భవించి మ్రోగును. పెక్కు

చిహ్నములతో నొప్పెడు లక్ష్యములనెల్లఁబరిశీలించి చూచుటవలన నానంద ఘనం బగుటచే మనోహరమగు స్వయంప్రకాశమాన బ్రహ్మతత్త్వము సాక్షాత్కరించును. పదియాఱుగడియ లాబ్రహ్మతత్త్వమును రాజయోగ నిష్ఠుఁడైన యోగి 'అదియే నేను' 'నేనేయది' యని యఖండాకారముగ ధ్యానమొనరించినచో తాదాత్మ్యము సిద్ధించును. తాదాత్మ్యరూపంబగు నాయున్మన్యవస్థయందు మనస్సును, ప్రాణ వాయువులును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతోగూడ విలీనములగును. ఇట్లు జీవేశ్వరైక్య రూపంబగు ఉన్మన్యవస్థయందు మనోవాయువులు దశేంద్రియ వ్యాపారములతోగూడ విలీనమగుటయే సర్వోపనిషత్తులందును ప్రతిపాదింపఁబడిన రాజయోగము—సీతారామాంజనేయ సంవాదము—పు 398,399

వాసనాత్రయము ; లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన.

షట్చక్రములు : మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, అజ్ఞాచక్రములు.

ఈ షట్చక్రసంపుటినే బిందువందురు. సృష్టిస్థితిలయ కర్తయగు శివుని శక్తివిశేషమే బిందువు.

షడంతర్విరోధులు : కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు.

సమయమతము : 'సమయ' అను చంద్రికళయొక్కయు, సమయుని

సమయాచారము : (శ్రీ శంభుని) యొక్కయు పూజను సహస్రారకమలము నందు చేయుట సమయమతము. వేదమున శ్రీదేవి 'సమయా' శబ్దముచే చెప్ప బడినది. శ్రీదేవిని వేదార్థరూపముగా భావించుట సమయమతము.

శ్రీ.చ.వి.శ్రీ.చ.స.ప.

సమాధి : కుండలిని పరబిందువునందైక్యముచేసి, పరబిందువును చిదాత్మ యందైక్యము చేయుట సమాధి.

అవితర్క విచారానందాస్మితా రూపానుగమత్
సంప్రజ్ఞాతః విరాను ప్రత్యయాభ్యాస పూర్వః
సంస్కార విశేషోన్యతి—పతంజలియోగశాస్త్రము—సీ.రా.సం.

హంస : మనోబుద్ధిచిత్త అహంకారములతో, ప్రాణము మొదలగు దశవిధ వాయువులతో కూడిన జీవుఁడు. హకారసకార స్వరూపములైన పురుష ప్రకృతుల యొక్క చేరికయే మధ్యనున్న బిందువు. అందుచే జీవుఁడని చెప్పుట—శ్రీచక్రవిలసనము.

## అనుబంధము-3

### కతిపయ పాఠ పరిశీలనము

శ్రీకాళహస్తి మాహాత్మ్య ప్రబంధమున కిప్పటికి 7 ప్రచురణములు వచ్చినవి.

1. జ్ఞాన ప్రసూన మాలికవారి ప్రచురణము -
   కొత్తపల్లి వెంకట పద్మనాభశాస్త్రి—1885
   వావిలికొలను సుబ్బారావు—1914

2. సారస్వత కుబేరగ్రంథమాల ప్రచురణము —
   తిమ్మావఝ్ఝల కోదండరామయ్య—1963

3. వావిళ్ళవారి ప్రచురణము -
   బులుసు వెంకట రమణయ్య—1966

4. వేంకట్రామ అండ్ కో వారి ప్రచురణ -
   చిలుకూరి పాపయ్యశాస్త్రి —1961
   వెంపరాల సూర్యనారాయణశాస్త్రి—1967

5. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి ప్రచురణ -
   డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు—1968

6. ఎమెస్కో-వారి సంప్రదాయసాహితీ ప్రచురణ -
   కళాప్రపూర్ణ డా॥ విశ్వనాథ సత్యనారాయణ—1970

7. భువనవిజయం పబ్లికేషన్స్
   డా॥ కొత్తపల్లి కాశీవిశ్వేశ్వర శాస్త్రి—1985

ఈప్రచురణములలో, వచ్చినవానిలో కడపటిది,యాధునికమైనది. అటువానిలో సంపాదకులు కొన్ని పాఠ భేదములనునూర్చి చర్చచేసియున్నారు. సాహితీ, భారతి సంచికలలో శ్రీ దీపాల పిచ్చయ శాస్త్రిగారు,'గాండీవి' గారలు పాఠముల విషయమున విపులముగ చర్చించియున్నారు. వారి వాదప్రతివాదములలో శ్రీయుతులుసదాశివరావు, చంద్రశేఖరయ్య, యస్.టి.వి. రామానుజాచార్యులు, రావూరి మృత్యుంజయరావు గారలు పాల్గొనినారు.

వారి ప్రస్తావనములం దుఁగనుపట్టని కొన్ని ముఖ్యములయిన పాఠములను గూర్చి పరిశీలించుదము. ఇప్పుడు ప్రసక్తమగు వానిలోఁగొన్ని ప్రచురణములం దాయా పాఠభేదములుగా నున్నవియే. అందే పాఠమునకేది సముచితమో, సమంజసమో చర్చింప బ్రయత్నింతము.

1. శక్తి : భక్తి - ప్రబంధమందలి 1ఆ - 2ప.

శివభక్తి సామరస్యము, శివశక్తి సామరస్యము: ఇది శివభక్తికిఁ బ్రాధాన్యత్వ మిచ్చిన ప్రబంధముగాన 'శివభక్తి' యని భావించియుందురు. కాని జ్ఞానప్రసూనాంబ దేవీ స్వరూపము. శ్రీవిద్యా సంపన్నుఁడగు ధూర్జటి, శ్రీవిద్యకు స్వరూపమగు 'సామరస్య' పదప్రయోగముచేయుట గమనార్హము. శివశక్తుల సామరస్యమును గూర్చి తెలియునపుడు తెలియగలము. కనుక నిచ్చట సామరస్యముకలది 'శివశక్తి'యే కాని శివభక్తి కాదు. కాన 'శివశక్తి' యను పాఠమే పరిగ్రాహ్యముగ భావింపనగును.

2. ఐకారాక్షరము : ఔకారాక్షరము : 1ఆ - 3ప.

వర్ణింపఁబడినది భైరవుఁడు. నకులీవారాహులు శ్రీదేవికి రూపాంతరమైన రాజరాజేశ్వరీదేవి శ్రీచక్రాధిష్ఠాన దేవతయైనపు డామెకు ప్రత్యంగదేవత, దండనాయికలు. అట్టి భయంకరులైన వారును భైరవుని వాహనమగు శ్వానము అఱుపునకు భయపడుదురట. ఆ కుక్క అఱుపు, మంత్ర మర్మమున కాద్యమైన వర్ణనముతో సమముగ నున్నదట. కుక్కలు 'భౌ భౌ' అని అఱచుటను నుద్దేశమున 'ఔకారక్షర' మను పాఠము గ్రహించి యుందురు, కాని భీకరమైన రవము కలది యను నర్థమున భైరవ శబ్ద మేర్పడుటచే 'ఐకారక్షర' మను పాఠమే సముచితమని ఎంచదగును.

3. ప్రతిబింబంబన : ప్రతిబింబంబున: 1ఆ - 19 ప.

పుర ప్రాకార వైభవమును శివునితోఁబోల్చుట. ఆ ప్రాకార మా పట్టణమందలి యతులైశ్వర్య పరంపరకుఁ బ్రతిబింబమా యనునట్లున్నది. ఆ ప్రాకారము రెండువిధముల నుత్ప్రేక్షింపబడినది. అద్భుతమాయా బహువిభ్రమ భ్రమిత వస్తువ్రాత లోకోదయస్థితి లోఁగొన్న శివుడనునట్లుండుట యొకటి, అవి అతులైశ్వర్య పరంపరావిలసితమైన పట్టణమునకు బ్రతిబింబమా యనునట్లుండుట యింకొకటి. ఈ యన్వయమే సొగసు లీనుచున్నది. కాన 'ప్రతిబింబంబనన్' అను పాఠమే సముచితమనిపించును.

4. దుర్వాసనల్ బాసి - దుర్వాసనన్ బాసి 1ఆ - 20ప

ప్రబంధమున వర్ణింపఁబడనున్న శివభక్తులను కావ్యాగ్ర పద్యములందు కొరకుచే సూచ్యము సేయుచు పల్కినదిది. 'మోక్షనిధి గొల్లగొనంగవచ్చు' అను ఆత్మనేపద క్రియార్థముతో దుర్వాసనల్ బాసి యనునది యన్వయింపదు. ఇక 'దుర్వాసనన్ - దుర్వాసనల్' యను వానిలో ప్రాణులు జన్మలందు కలిగియుండు వాసనలగూర్చి పలుకుటగాన ఏకవచన ప్రయోగము సముచితముగాదు. వాసనాత్రయ ముద్దేశింపఁ బడుటచే 'దుర్వాసనల్' యను పాఠమే సమంజసమని తోఁచెడిని.

5. బిందు : బంధ: 1ఆ - 24 ప.

శ్లేషను పోషించుచ ప్రయోగింపఁబడుచున్న యీ సందర్భము కామినీ జనులను యోగి జనులతో పోల్చుట. 'బంధ' శబ్దమునకు యోగిజనపరముగా బంధ త్రియమును వలుకదగునుకాని, ధూర్జటి 'నాదబిందుకళ' ల స్వరూపమెఱిగి వానిని ప్రయోగించుట యందాసక్తిగలవాఁడని, అవిద్యయందు ప్రవేశముగలవాఁడని మనము గుర్తించుకొనినపుడు 'బిందు' పాఠమే గ్రాహ్యముగను కాదా ! ఆపద్యమున 'పరిచిత బిందునై పుణి నపార కళానుభవప్రసక్తి నాదరస వివేకసంపద—1-24 ధూర్జటి ఈ 'నాదబిందు'కళ యనుశబ్దములను ప్రబంధమునగాని శతకమునగాని మూడింటిలో ఒకదానినికూడ విడువకుండ ప్రయోగించుట చూడగలము.

ప్రబంధము : 1 – సృష్ట్యంతసమయము – 1ఆ 11ప, నాదబిందు కళాతీతాంతము'

2 – స్వర్ణముఖరీ వర్ణనలో 'యోగీశ్వరభావ స్వరూపము'

నుండోలి నమందబిందు ప్రముదమందము, నిరంతర నాద ప్రసార మేదుర హృదయంబును సంసారపారాకర తరణకారణ కళా ప్రకాశంబును—'1-142 వచన.

శతకము : 3—అకలంకస్థితి నాదసును ఘంటారావమున్ బిందు దీపకళా శ్రేణి—64

'బిందు' వనఁగా యోగిజనుల యర్థమున నీ నాద బిందు కళలలోని బిందు వనియు, కామినీజనుల యర్థమున నఖక్షతమనియు గ్రహింపదగును, కాన 'బిందు' పాఠమే సముచితమని ఎంచఁదగును.

6. ప్రాణంబు ప్రాణ నగుచుఁ తాల్గింబు ప్రాణమగుచు—1ఆ—28 ప

ఇచ్చట తెలుఁగు జాతీయమగు 'ప్రాణంబు ప్రాణమగుచు' నన్నదే సొగసైన పాఠమనదగును.

7. కరఁక : కరుణ : 2 ఆ—96ప.

చెలఁదిపురుగు దీక్షతో దైవతముల నిలయములు గట్టు సందర్భమునందలి దిది. దైవతనిలయములను' కరుణతో గట్టుట స్వారస్యమైనదికాదు. నీకాగ్రి బుద్ధితో తంతుపద్మములను నిర్మించెనను భావమున 'కరఁక' యనుపాఠమే సమంజస మనిపించును.

8. సయికమే : సతతమే: 4ఆ—117 ప.

జ్ఞాన పుష్పంబు శ్రీకాళహస్తీశ్వరులసేవ యల్పముకా దనల్పమను రీతిని నదీ, తీర్థ, క్షేత్ర, ప్రావముల మహిమను గొనియాడుచు వర్ణించున దీ పద్యము. అల్పమే, సన్నమే, సులభమే, సుకరమే—అనువానికి సహోదరు కాఁదగినది 'సయికమే' యగునుకాని 'సతతమే' కాదనిపించును.

'సయికమే మొగలేట జలకంబులాడిన బహుజన్మపాప జంబాల మెడలు—

సువర్ణముఖరీనదియందు జలకములాడిన ననేక జన్మల పాపమను పంకము తొలఁగుట అల్పమగునా ? కాదను భావమే సరసమైనది, స్వరసమైనది.

0. దొడికి పట్టు : దొడఁగిపట్టు : 4 ఆ—126 పద్య

'ఉన్నత స్తనకలశంబు దొడికిపట్ట నానపడు'—అనుచోవున 'ఆనపడు' అను క్రియకు పూర్వము 'తొడఁగి'యని క్త్వార్థరూపమున్న అర్థపునరుక్తి యగును గదా ! 'తొడగి—పూని, లేక యత్నించి పట్టుటకానపడు అనుటకంటె తొడికిపట్టు...., ఒడిసిపట్టు అనునర్థమే ప్రకరణోచితమైన రమణీయార్థము. ఇందు శృంగార పరమగు స్వారస్యముగలదు. చేతితో స్తనమును పూర్తిగ బట్టుట నొడిసిపట్టుట. కాన 'దొడికి పట్టన్' అనుపాఠమే సరసమైనదని భావింపనగును.

10. కోలాంగూలము : వనౌకోలాంఛనము : 4ఆ—179 ప

ఎసఁగఁగ నాకోలాంగూల కేతు నాశ్రమభూమిన్ :

ఎసఁగ వనౌకోలాంఛన తపోవనాంతర భూమిన్ :

'కోలాంగూల' శబ్దము కోఁతి యనునర్థమున లేదు. అది 'గోలాంగూల' మైన ప్రాసభంగమగును కాన వనౌకోలాంఛన' అను బౌరిన్ పాఠాంతరమును గ్రహించిరి. 'కోలాంగూల' శబ్దము 'గోలాంగూల' మునకు ప్రాకృత సమమా యని శ్రీ 'గాండీవి'గారు సాహితి (మార్చి 1962) మండప, శంఖ శబ్దములకు మంటప, సంగ శబ్దములవు, ప్రాకృత సమములనుచు గోలాంగూలమునకు కోలాంగూలమును ప్రాకృతసమమేమొ యని యూహించినారు. అది ప్రాకృత సమముగానియపుడు వనౌకోలాంఛన అనుపాఠమే సమంజసమనిపించును. లేకున్న ధూర్జటి క-గలకు ప్రాస యంగీకరించెనని భావింపవలసియున్నది. అట్టిదియొక్కఁ-తావుననే యుండదు. దధలకు, ళశలకు ప్రాసనీతఁడనేక సందర్భముల నుపయోగించినాఁడుకదా !

క–గలకు ప్రాస ధూర్జటికిష్టము కానిదేకనుక బౌరిన్ పాఠమైన 'వనౌకోలాంఛనతపోవనాంతరభూమిన్' అనునదే సమంజసమైనదని భావింపవలసియున్నది.

## అనుబంధము – 4
## నత్కీరుని కథ

1. సంస్కృత స్కాంద పురాణాంతర్గత హాలాస్యమాహాత్మ్యమందలి మధురా ఖండమున గల భావము.

| | |
|---|---|
| జానాసి పుష్పగంధాన్ భ్రమర ! త్వం బ్రూహి<br>తత్త్వతోఽద్య దేవ్యాః కేశ శకలాపి<br>తుల్యోగంధేన కిం గంధః ? | పూలవాసనలు తెలిసిన ఓతుమ్మెదా !<br>దేవి కేశకలమునకు గల పరిమళ<br>ముతో తుల్యమైన పరిమళమెందైన<br>కలదేమొ చెప్పుము. |

2. తమిళమున 'తిరువిడయాల్' (శివలీలా విలాసము) నగు భావము :

కొంగుతేర్ వాళ్కై అంశిరైత్ తుంబి

కామం కెప్పాచు కండమ మ్మొలిమో
పయిరియదు కైశి యనర్పిన్
నయిలిల్ కెరియె యిట్టుం అరికై కూందలిన్
నటియుపుం ఉళవో నీ అటియుం పూవే ?

పూలతేనె చక్కగా తెలిసి ఆస్వాదించే జీవితము, లోనికడగియున్న రెక్కలు గల తుమ్మెదా ! నా యుద్యానవనమున నుండుట కారణముగా నావలని మొగమోటమి వహింపక నీవు స్వయముగా తెలిసికొన్న దానినే చెప్పుము. నీకు తెలిసినపుష్పములలో జన్మాంతర సౌహృదముమ మయూర సౌకుమార్యముమ, మల్లెమొగ్గల వాలువలె తీర్చిదిద్దినట్లున్న పలువరుసయుగల యీ కాంతయొక్క ధమ్మిల్లము వలెబరిమళము గల పూవెందైన కలదేమొ ?

3. తెలుగు :

సింధురరాజ గమనా ధమ్మిల్ల బంధంబు సహజగంధంబు'
(శ్రీ.కా.మా.—3ఆ — 157 వచనము)

## అనుబంధము - 5

## శ్రీకాళహస్తీశ్వర శతకమున

## అధికముగా గన్పట్టు పద్యములు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థయందలి తాళపత్ర ప్రతుల నుండి స్వీకృతములు :

తాళపత్ర ప్రతి సంఖ్య : 1523 — తాళపత్రప్రతిలోని పద్య సంఖ్య.

క్రమసంఖ్య :

1 మ ఒకచోనుండఁగ నీక నెమ్మనమునం దోహో జగంబెల్ల త్రి
ప్పుక వర్తింపఁగ గాసి నొందితి తృణంబున్ నిన్ను వాంఛింప దొ
ట్టుకుఁగాఁదోడ్కొని పొమ్ము నీదు వెనువెంటం దాన నట్లైన ని
ల్చి కడంగాన సుఖింతు నీకరుణచే శ్రీకాళహస్తీశ్వరా ! 8

2 మ మది నిన్నెన్నరకుండు వారలకు గామక్రోధముల్ ముక్తి సం
పదలనోవుట డెల్లమయ్యె నది నాథావైక విజ్ఞాన స
మ్మదునై సం బ్రియకోటిడు నతఁడు సన్మార్గంబు సద్భక్తి రా
ణి దివారాత్రులు జెప్పగా విని దుదిన్ శ్రీకాళహస్తీశ్వరా ! 28

3 మ క్షయమై చిత్తమువోక మోక్షమొకటం పాధింపగా గూడ దిం
ద్రియ సౌఖ్య ప్రదవస్తువుల్ దొరక వాటిం జేయుగా గల్గు స
త్క్రియలం గానివి రెండు ఈ తెలుగులై తేరం నినున్ సేవ చే
శియు కోరంగల వస్తు వెయ్యది మదిం శ్రీకాళహస్తీశ్వరా ! 44

4 శా కోరన్ మోక్షము కాళరాత్రి గెలువంగోరం జనుం దోలంగా
గోరం బద్మజు కల్పముల్ బ్రతుకగా గోరం మహాకల్పంబు నీ
కారుణ్యంబునకున్ నుదీయమగు సంకల్పంబు దీర్పంగదే
చేరన్వచ్చి పరోపకారమగు నో శ్రీకాళహస్తీశ్వరా ! 65

5 మ తగవా నిన్నుభజించువారలు రమాదర్పాంధు లన్వేడ నే
నుఁగుపై నెక్కియు దిడ్డిదూరుదురె ధర్మాల్ దేహరక్షార్థమై
బొగలం జాలక బొగ్గులం బొడుల్ నేర్పుగావె పెద్దన్, నా
చ్చి గులామై పరసేవల్ చేసునె మదిన్ శ్రీకాళహస్తీశ్వరా ! 82

6 శా వేదంబుల్గనలేని నిన్ను లుతిగావింపంగ నేనెవ్వడం
నీదివ్యాకృతి గద్యపద్యముల పర్ణింపంగ నే బూనితిన్
నాదోడ్డై భవదీయ దివ్యచరితల్ వ్రాయన్నియోగించి నా
చేదోడ్డై భవరక్ష సేయగదవే శ్రీకాళహస్తీశ్వరా ! 86

7 శా నాకీయర్థము నేల యిచ్చెదవు మానన్ లేపుగా యీవృథా
లోకంబంతయు నీరునంతట నతిపాత్ర క్షమానాథ బా
ధా కోటింబడనోప వారికతసం ధాన్యంబులుం గ్రామముల్
ఏ కష్టంబులు సాధుయూధమునకుం శ్రీకాళహస్తీశ్వరా ! 95

8 శా ఆధివ్యాధులు దీపకాపులు కళత్రాపత్యముల్ చాయిన్
బాధంబెట్టగ నన్నుదమ్ములును పాపస్వాంతులు దోడుగా
నీధర్మంబని కలుగ జేసితిని నన్నీరీతి పీడితి వా
రేధీరుల్ నినుగొల్వ నింప దడయన్ శ్రీకాళహస్తీశ్వరా ? 96

9 మ హరినేత్రాబ్జము మీపదాబ్జముల కేలర్పించె చక్రానకో
సురలంగావంగ నీలరత్నముగతిన్ శోభిల్లు కంఠంబునం
గరళం బానగ కర్తవంచు దెలుసో కందర్పు భావించి మా
సిరి లోకం బడుపంగదే యనుచునో శ్రీకాళహస్తీశ్వరా ! 104

10 మ వనితల్ భూషణముల్ మదేభములు అశ్వంబుల్ మణుల్ గట్టబల్
ఘనయో యిన్నియు గల్గకుంట ఘనమో కామాంధులై రెంటిలో
ఘనమేదో తెలియంగ నోప రథముల్ కైవల్యమొందింప నే
ర్చిన వైరాగ్యము కంటె లక్ష్మి ఘనమో శ్రీకాళహస్తీశ్వరా ! 110

11 మ అడుగన్ పద్మజు కల్పముల్ బ్రతుక పద్మాధీశ్వరత్వంబుని
న్నడుగన్ వాసవపై భవంబడుగ లోకైకాధిపత్యంబు నే
నడుగన్ నీచరణాంబుజాత యుగళ ధ్యానంబు వాకిమ్ము కో
రెక్క దిగద్రావి సుఖింతు చాలునిదియే శ్రీకాళహస్తీశ్వరా ! 111

12 మ పలకాంతారతి లేదు లేమ భుజియింపంగా బరాన్నముల్
పరవిత్తంబు హరింపలేను జనులన్ బాధింపగా లేదు భూ
ధరికాంతార నివాసులేము విరతిన్ తత్త్వంబు భావించుచున్
చిరకాలంబు ధరింతురయ్య మనుజుల్ శ్రీకాళహస్తీశ్వరా ! 112

13 శా విన్నాడన్ నిగమాగమాదిక వచోవిన్యాసముల్ మేదినిం
గన్నాడన్ బహు దేవతా ప్రతిమలం గంగాది తీర్థాలి గ్గై

పొన్నాడన్ కపటాజవంజవ మహాకూపార మేపారగన్
చిన్నంబంతయు దాటగాన నకటా శ్రీకాళహస్తీశ్వరా ? 118

14 మ కడుపుబట్టగలేక లోకముల గాకంబట్ల యూహూరి వెం
బడినిట్టిట్టి కడుంగడున్ కృపణతం బైక్షంబపేక్షించి వే
డెడి నిష్కారుణ దుఃఖవృత్తి బడుచుం డెందంబున నిన్ను దూ
రెడు నన్నున్ గరుణింప నీకు దయరాదా శ్రీకాళహస్తీశ్వరా ! 127

15 రాళపత్ర ప్రతి నెం : 1527లో మాత్రమె యున్నట్టి దీపద్యము :
శా నానేలందును నాధనంబనుచును న్నాయూరు నాపేరునున్
కానాచిక్కడ జన్మ భూమి యని వక్కాణింపుచున్ మానవుల్
నానేలమృతిబొంది జీవుడు వృథాగా యీ శరీరానకున్
కాదాచా ? కలకాలమున్ గలదటో ? శ్రీకాళహస్తీశ్వరా ! 36

## అనుబంధము - 6

పూర్వశివభక్తులు (శతక, ప్రబంధములలో స్మరింపబడినవారు)

1. ఈశ్వరునితో యుద్ధము చేసినవాఁడు — అర్జునుఁడు.
2. కవితా నిర్మాణ శక్తిచే ఈశ్వరుని ప్రీతుని జేసినవాఁడు — నత్కీరుఁడు.
3. ఈశ్వరుని కొఱకు తండ్రిని జంపినవాఁడు — కాటకోటయ.
4. ఈశ్వరుని కొఱకు కొడుకును జంపినవాఁడు — చిఱుతొండనంబి.
5. ఈశ్వరుని రోకటిచే మొత్తినవాఁడు — బాలలింగన్న
6. ఈశ్వరుని ఱాలచే గొట్టినవాఁడు — సాంఖ్య తొండఁడు
7. ఈశ్వరుని కన్నిచ్చినవాఁడు, ఎంగిలిచ్చితినుమన్నవాఁడు—కన్నప్ప (తిన్నఁడు)
8. తన వాకలి గాపుమన్నవాఁడు — బాణుఁడు.
9. ఈశ్వరుని మోకాలుగాఁజూచినవాఁడు — దసరయ్య.
10. ఈశ్వరుని ప్రకుచముగాఁజూచినవాఁడు — సుందరమూర్తి నయనారు.
11. ,, కుంచముగాఁజూచినవాఁడు — బల్లేశమల్లయ్య
12. ,, మేకపెంటికగా జూచినవాడు — కాటకోటయ
13. ,, స్త్రీకొఱకు కుంటెనగా బంపినవాఁడు .... సుందరమూర్తినయనారు
14. ధార్మను పరమేశ్వరునకర్పించినవాఁడు-భల్లాణుఁడు-ప్రబంధము 3-100,4-41

## అనుబంధము - 7

## కాళహస్తి స్థల మాహాత్మ్యము

## ధూర్జటి లింగరాజు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ యందలి తాళపత్ర ప్రతి నెం : 7330 – ఆశ్వాసములు : 9. తాటియాకులు : 244.

ప్రథమాశ్వాస ప్రారంభ పద్యము :

శ్రీమద్దక్షిణ రౌప్య శైల విలసచ్ఛృంగాగ్ర భాగంబునన్
ప్రేమన్ గౌరి భజింప జెన్నగు బుధశ్రేయః కళాకృత్కృపా
ధామాంచన్మతి కాళహస్తిపతి చిద్రాజ్యామితానందుఁ డీ
దామర్లాన్వయ వెంకటేంద్రుసకలలార్థ శ్రీయుతున్ చేయుతన్

తరువాత జ్ఞానపుష్పాంబ, విష్ణు, లక్ష్మీ, గణపతి, దుర్గ, భైరవ దైవతములను స్తుతించి వాల్మీకి, వ్యాస, కాళిదాసాది సంస్కృత కవులను, కవిత్రయమును, పెద తూర్కానా ర్యుని, జక్కనకవిని కొనియాడి మన ధూర్జటి కవీంద్రుని తలచినాఁడు. శ్రీ కాళహస్తి గౌరీనాథ...కృష్ణరాయ కిరీట కీలిత మణిగణార్చిత పదాబ్జద్వయ శ్రీవహించి...17. తనను గురించి 25, 26, 27, 28, 29, 30, 31 పద్యములలో తెల్పుకొనినాడు లింగరాజు. కృతిభర్తృ వంశవర్ణనము 73 గద్య, పద్యములలో కావించెను.

**ఆశ్వాసాంత గద్య :**

ఇది శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా కాళహస్తీశ్వర కరుణాకటాక్ష వీక్షణా సాధిత సారసాహితీ ధౌరేయ సుకవిజనవిధేయ, శ్రీమద్దామెర్లవంశ పయఃపారావార సుధా కర కుమారాక్క భూపర కుమార వేంకటమహీమండలాఖండల దత్తానేక మణిమ యాభరణానంత చతురంతయానాగ్రహారాద్యశేష పారితోషిక విశేష భావనాధురంధర, నయగుణ బంధుర కుమార ధూర్జటి ప్రఖ్యాత బిరుదనామాంక వేంకటామాత్య తనయ, నయవిరాజ ధూర్జటి లింగరాజ కవిప్రణీతం బైనకాళహస్తిస్థలమాహాత్మ్యంబను మహాప్రబంధంబు నందు ప్రథమాశ్వాసము.

## అనుబంధము - 8

## రత్నావళీ పరిణయము

## ధూర్జటి వేంకటరాయ కవి

ప్రతి నెం : **1494** ఎ. నరసమ్మ వ్రాసిన వ్రాత ప్రతి/**1953**/

ఆశ్వాస ప్రారంభ పద్యము :

శ్రీవర్ధిష్ణు కటాక్ష వీక్షణ సుధాసింధు ప్రవాహైక లీ
లా విభ్రాజిత భక్త హంసముల వాలాయంబు పాలించు కా
ళీవిశ్వేశుఁడు బ్రోచుగావుతను శ్రీ చేకూరి వంశేంద్రు రా
× విఖ్యాత నవీన సూనశరు రామస్వామి మంత్రీశ్వరున్ ! 1

తరువాత శివుఁడు, శ్రీరాముఁడు, గోపాలదేవుఁడు, బ్రహ్మ, గౌరి, లక్ష్మి, శారద, గణపతులు స్తుతింపబడిరి. వాల్మీకి, వ్యాస, కాళిదాసులను నన్నయ, తిక్కన, సోముఁడు, భీముఁడును స్తుతింపబడరి. అపై ధూర్జటి కవీంద్రుఁడు కొల్వఁబడెను.

పటుగంగాలహరీ తరంగనిభ శుంభత్ ప్రౌఢతాంచత్కళా
ఘటనున్ పాదవినమ్ర కృష్ణ నరరాడ్గుంఫిత కోటీర వి
స్ఫుట రత్నద్యుతి పింజరీకృత పదాంభోజాతు, సర్వజ్ఞ ధూ
ర్జటి నే గొల్చెద నస్మదీయ కులకర్తన్ భక్తిరంజిల్లగన్ !

పిమ్మట తండ్రి యైన లింగరాజును పొగిడెను. కుకవినింద, కృతిపతిప్రశంసలు చేసి తనను గురించి తన కావ్యములను గురించి 22, 23, 24, 25 పద్యములలో పలికెను.

ఆశ్వాసాంత గద్య :

ఇది శ్రీమత్కాళహస్తి పురాధ్యక్ష నిక్షేపితాక్షయ కటాక్ష వీక్షా సమాలబ్ధ సంస్కృతాంధ్రోభయ భాషాచతుర్విధ కవితావిధానవేంకటపతిప్రధానపౌత్రు, శ్రీమదాపస్తంబ సూత్ర భారద్వాజగోత్ర శుభచరిత్ర ధూర్జటివంశ పయఃపారావార సంపూర్ణ పూర్ణిమాచంద్ర లింగరాజకవీంద్ర తనయ విద్వజ్జన విధేయ వేంకటరాయ నామధేయ ప్రణీతంబైన రత్నావళీపరిణయంబను శృంగార ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

ఇది నాలుగు ఆశ్వాసముల శృంగార ప్రబంధము.

అనుబంధము—9

# ప్రసక్తములు - వినియుక్తములు నైన వ్యాసములు గ్రంథములు


వ్యాసములు :

1. కాళహస్తిమాహాత్మ్య ప్రయోగ పరిశీలనము – శ్రీ వంతరాం రామకృష్ణారావు
సాహితి—మార్చి 1962

2. కాళహస్తిమాహాత్మ్యము _ ఇతివృత్తపరిశీలనము _ శ్రీపి.జి. కృష్ణమాచార్యులు
ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక — సంచిక 47-2,3,భాగ.

3. ధూర్జటికవితాప్రాభవం శ్రీయామిజాల పద్మనాభస్వామి _ ఆంధ్రప్రభదినపత్రిక
19-10-1958.

4. ధూర్జటి : నత్కీరుడు శ్రీశొంగూరి సూర్యనారాయణ శర్మ - ఆంధ్రపత్రిక
దినపత్రిక 30-11-1958

5. ధూర్జటి – నిటలాక్షుడు _ శ్రీ కుంటిమద్ది శేషశర్మ డిటో—7-12-58

6. నక్కీరనార్ _ ప్రొఫెసర్ మినాక్షిసుందరం _ విజ్ఞానసర్వస్వం – 6సం710పుట

7. నత్కీరునికథ - ఔచిత్యము _ శ్రీ నోరి నరశింహశాస్త్రి _ భారతి - మే 1964

8. ,, ,, శ్రీ నచ. రామానుజాచార్యులు - భారతిజూన్64

9. నత్కీరుని కథ—కొన్ని విశేషములు _ శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్య
భారతి _ నవంబర్ 1960

10. నన్నెచోడకవి – శైవసంప్రదాయము – శ్రీ నిడుదవోలు వేంకటరావు
భారతి – ఏప్రిల్ 69

11. మహాకవి ధూర్జటి—శ్రీవిన్నకోట మాధవరావు – సాహితి – ఫిబ్రవరి 64

12. వీరమాహేశ్వరాచార సంగ్రహము – శ్రీ ఆర్.మల్లేశ్వర్ - భారతి – ఏప్రిల్69.

13. శ్రీకాళహస్తిమాహాత్మ్యము - పాఠములపరిస్థితి : శ్రీదీసాల పిచ్చయశాస్త్రి భారతి-జూలై 1962
14. „ „ „ డిశంబర్ 62
15. „ „ „ సాహితి-జూలై 64
16. శ్రీకాళహస్తిమాహాత్మ్యము-యోగవిషయములు శ్రీ విడుదవోలు పెదసూర్యనారాయణ రామకృష్ణప్రభ

గ్రంథములు :

1. ఆంధ్రప్రతాపరుద్రీయశో భూషణము—శ్రీ చలంచర్ల రంగాచార్యులు
2. ఋతుసూక్తము—శ్రీ నందుల గోపాలకృష్ణమూర్తి
3. కావ్యపరిమళము-కవిసమూర్తి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
4. కాళహస్తి శతకము-బాలాలవ వీరశరభేంద్రకవి
5. జ్ఞానప్రసూనాంబికా శతకము-శిష్టు సర్వశాస్త్రి
6. త్రిపురాంతకేశ్వరశతకము—పాలపట్ల పాలంకయ్య
7. దాశరథిశతకము-కంచర్ల గోపన్న (రామదాసు)
8. ధనాభిరామము-నూతనకవి సూరన
9. పండితారాధ్య చరిత్రము-పాల్కురికి సోమన
10. పార్వతి శతకము-వంకాయలపాటి రామకోటిదాసు
11. పూర్వగాథాలహరి-వేమూరి శ్రీనివాసరావు
12. భక్తచింతామణి శతకము-వసురాయకవీంద్రుడు
13. భర్గశతకము-కూచిమంచి తిమ్మకవి
14. భారతిసంచికలు-
15. మాధవశతకము-అల్లమరాజు రంగశాయి
16. రామకృష్ణపత్రిక సంచికలు-
17. రుక్మాంగద చరిత్రము-ప్రౌఢకవి మల్లన

18. వర్ణన రత్నాకరము-2 సంపుటములు-దాసరి లక్ష్మణ స్వామి

19. విజ్ఞాన సర్వస్వము సంపుటములు

20. విద్యార్థికల్పతరువు రెండు సంపుటములు

21. వృషాధిశతకము-పాల్కురికి సోమన

22. వేంకటేశ,వేంకటేశ్వర శతకములు-తాళ్ళపాక అన్నమాచార్యులు

23. శబ్ద రత్నాకరము-బహుజనపల్లి సీతారామాచార్యులు

24. శబ్దార్థచంద్రిక-మహంకాళి సుబ్బారాయుడు

25. శారద పత్రిక సంచికలు-

26. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము-తాళపత్రప్రతులు-ధూర్జటి

27. శ్రీకాళహస్తీశ్వర శతకము-తాళపత్ర ప్రతులు-ధూర్జటి

28. శ్రీచక్రనగర వర్ణనము-కనుపర్తి వెంకటరామ శ్రీవిద్యానంద నాధుడు

29. శ్రీ చక్ర విలసనము-తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

30. శృంగారమల్లణచరిత్ర-యడపాటి ఎఱ్ఱన

31. సమగ్రాంధ్ర సాహిత్య సంపుటములు-ఆరుద్ర

32 సర్వ లోకేశ్వర శతకము—వేంకటరమణ కవులు

33. సర్వేశ్వర శతకము-యథావాక్కుల అన్నమయ్య

34. సార్వత్రవ్యాసములు-నాలుగు సంపుటములు-ఆం.ప్ర సా.అ.ప్రచురణ

35. సాహితి సంచికలు-

36. సీతాపతి శతకము—సాహెబ్ రాణా రామన్నకవి

37. Histroy of Dharma Sastra-P.V. Kane-Vol 4 FootNote1240p

38. Indian Antiquaries-Vol. XLIII Page 65 to 72, Vol XLIV. Pages 206 to 212,, 229 to 239

39. On Sublime-Longinus

40. Skt-English Dictionery-M.M. Williams

41. Vachaspatyam-Dictionery


